దినములకుముందు కప్పడిసంగమేశ్వరమున బసవేశ్వరుఁడు లింగైక్యమందెనన్న వార్త వినవచ్చినట్లును, బసవేశ్వరనిర్యాణమునకుఁ బండితారాధ్యుఁడు మిక్కిలి విలపించినట్లును, వనిపురము శంకరయ్య యను భక్తునితో నక్కడ నుండియే శ్రీశైలమున కరిగినట్లును బండితారాధ్యచరిత్రమునఁ గలదు. శ్రీశైలమున కరుగునాఁటికిఁ బండితారాధ్యుఁడు కడువృద్ధుఁడు. శ్రీశైలము చేరిన తరువాతఁ గొలఁదిదినములకే శివరాత్రి పుణ్యదినోత్సవము జరపి పండితారాధ్యుఁడు లింగైక్యమందెను. బసవేశ్వరుఁడు లింగైక్యమందినట్లు పండితారాధ్యచరిత్రమును బట్టి గట్టిగా నిర్ణయింప నగుచున్నది. 1168లో బసవేశ్వరుఁడు లింగైక్యమందెను. 1170 కే పండితారాధ్యుఁడును లింగైక్యమంది యుండును.

ఇట్టి పండితారాధ్యులవారి శిష్యునితో సంభాషించి బసవపురాణ కథార్థముల నెఱిఁగిన పాల్కురికి సోమనాథుఁడు 1190 ప్రాంతములకంటెఁ దర్వాతివాఁడయి యుండఁడు. అది రుద్రదేవుని పరిపాలన కాలమేకదా!

మఱియుఁ బండితారాధ్యులవారు లింగైక్యక మందినపిదప వారి శిష్యుఁడైన దోనమయ్య, వారి ప్రథమపుత్త్రుఁడైన కేదారయ్యకు లోకారాధ్యపట్టమును గట్టి తా ననర్గళముగా భక్తి రాజ్యమేలుచున్నట్టును, గేదారయ్యయు నలుగురు పుత్త్రులఁగాంచి వంశాభివృద్ధితో నున్నట్లును బండితారాధ్యచరిత్రమునఁ గలదు. పాల్కురికి సోమనాథుని పండితారాధ్యచరిత్ర రచనాకాలమునకుఁ బండితారాధ్యులవారి శిష్యుఁడును బుత్త్రుఁడును, సజీవులై యున్నారని, మనుమలు పేర్వెలయుచున్నారని దీనివలన నేర్పడుచున్నది. సోమనాథుని గ్రంథములలోఁ బండితారాధ్యచరిత్రము కడపటిది. ఈ సాధనమునుబట్టి చూచినను బండితారాధ్యుల లింగైక్యమునకుఁదర్వాత నిర్వది ముప్పదియేండ్లకే రుద్రదేవుని పాలనకాలముననే (ఇంచుమించుగా 1190) సోమనాథుఁడు ప్రసిద్ధ గ్రంథకర్త యయి యున్నట్టు స్పష్టమగుచున్నది.

సోమనాథుని కాలనిర్ణయమున కింకను గొన్ని సాధనములు గలవు. అవి డొంకతిరుగుడుగా నీ కాలమునకే చేరునవిగా నుండుటచే విడనాడినాడను.



ఆఱు పురుషాంతరములకుఁ దర్వాతివాఁడగు పిడుపర్తి బసవన్న గ్రంథము సోమనాథుని గ్రంథములకంటెను దత్సమకాలమువారి గ్రంథముల కంటెను బ్రబల ప్రమాణము కాఁజాలదు. బహుకాలమునకుఁబిదప బసవన్న వినికిళ్లను బట్టి వ్రాసిన వ్రాఁతలలోఁగొన్ని తప్పులు దొరలవచ్చును. సోమనాథుఁడు క్రీ. 1190 ప్రాంతములవాఁడనుటయే సిద్ధాంతముగా నిశ్చయింపవలెను.

## బసవపురాణ రచనాకాలము

బసవపురాణమున బిజ్జలుఁడు మృతుఁడైన తర్వాత నాతని కుమారులు రాజ్యముకొఱకు యుద్ధముచేసి వారును జనిపోయిరని కలదు.

"అంత రాజ్యార్థమై యనిసేసి యతని, సంతానమెల్ల నిస్సంతానమయ్యె
వీఁకఁ గొట్టములలో వెలిఁగె గుఱ్ఱములు, తోఁకల నిప్పులు దొరుగనక్షణమ
కరులును గరులును గన్నంతనెదిరి, పొరిఁబొరిఁదాఁకి జర్జరితమై పడియె
బ్రమసి యమాత్యాదిభటవర్గమెల్లఁ, దమలోనఁజచ్చిరి సమరంబు సేసి
బసవని సత్య శాపమునఁగాఁజేసి, పసచెడి కటకంబు పాడయ్యెనంత."

– బసవపురాణము

బిజ్జలునికి సోవిదేవుఁడు, సంకమ, వీరనారాయణుఁడు, సింగ్హణుఁడుఁ, వజ్రదేవుఁడు అనువారు కుమాళ్లుండిరి. బిజ్జలుని (క్రీ. 1167) తర్వాత పదునాఱేండ్లకే (క్రీ. 1183) వీరెల్లరు రాజ్యభ్రష్టులై చనిపోయిరి. వీరిలో సోవిదేవుఁడు పదియేండ్లును, సంకమ నాల్గేండ్లును, వీరనారాయణుఁడు, సింగ్హణుఁడు, మూఁడేండ్లును, రాజ్యము చిన్నభిన్నములగుచుఁ జిన్నదగుచునుండఁగాఁ బరిపాలనము చేసిరి. క్రీ. 1183 నాఁటికి రాజ్యము పూర్తిగా నన్యాక్రాంతమయినది. సోమనాథుఁడీ విషయమును బేర్కొన్నాఁడు గాన, బసవపురాణ రచనము క్రీ. 1183 కుఁదర్వాతిదగుట స్పష్టము.

పిడుపర్తి బసవన ఓరుఁగంటిలో భక్తులు బసవపురాణముఁ జదువు చుండఁగాఁ బ్రతాపరుద్రుఁడు వచ్చి వినెనని వ్రాసినవ్రాఁత ప్రతాపరుద్రునిఁగూర్చి కాక రుద్రదేవునిఁగూర్చి కావచ్చును. రుద్రదేవుఁడు క్రీ. 1198 దాఁక రాజ్యమేలినాఁడు గావున నా కథ యప్పుడు జరిగియుండవచ్చును. సోమనాథుఁడు రుద్రదేవునే ప్రతాపరుద్రుఁడని భేదము తెలియక చెప్పియుండవచ్చును.

ఆ కథ జరగినదే యగునేని బసవపురాణము క్రీ. 1183 కుఁ దర్వాత 1198కిఁబూర్వము రచితమగును. ఇంచుమించుగా క్రీ.1190 బసవపురాణ రచనాకాలమని నిర్ణయింపవచ్చును.

## సోమనాథుని నెలవు

సోమనాథుని యింటిపేరు పాలుకురికి, పాల్కురికి, పాలకురికి అని మూఁడు రూపములును గానవచ్చుచున్నవి. ఈతఁడు నివసించిన గ్రామము పాల్కురికి యగును. అన్యవాదకోలాహలమని సోమనాథునిపేరనే "సోమనాథలింగ" యను సంబోధనముతో సీసశతకమును రచియించిన శైవుఁడొకఁ డీతఁడు పాల్కురికి గ్రామవాస్తవ్యుఁడని చెప్పెను. పాల్కురికి గ్రామము నేఁటి నైజాము రాష్ట్రమున నోరుఁగల్లు మండలమునఁగలదట! సోమనాథుఁడు సిద్ధిపొందిన పిదప నాతని సమాధిపై 'సోమనాథలింగ' మని శివలింగము ప్రతిష్ఠితమయ్యెనని కొందఱందురు. పాల్కురికిలో సోమనాథలింగము గలదేమోకాని యది యీ సోమనాథుని యనంతరమాతని సమాధిపైఁ బ్రతిష్ఠితమయ్యెనని కొందఱందురు. పాల్కురికిలో సోమనాథలింగము గలదేమోకాని యది యీ సోమనాథుని యనంతర మాతని సమాధిపైఁ బ్రతిష్ఠిత మయ్యెననుట విశ్వాస్యము గాదు. సోమనాథుఁడు సమాధిలో బయలయినది పాల్కురికి గ్రామమునఁగాదు. కర్ణాటదేశమున శివగంగాక్షేత్రము చేరువనుగల కలికెమను గ్రామమున నాతఁడు సమాధిస్థితుఁ డయ్యెను. పిడుపర్తి బసవన బసవపురాణము, పాల్కురికి సోమనాథపురాణము, కర్ణాటకవిచరిత్రము, మొదలగు గ్రంథము లీ విషయమును రాద్ధాంతపఱుచుచున్నవి.[1]

పాల్కురికి గ్రామమున జనించుటచే సోమనాథున కాయూరి లింగమూర్తి పేరే తల్లిదండ్రులు పెట్టియుండవచ్చును. అక్కడ సోమనాథదేవాలయము, సోమనాథుని పుట్టుకకుఁ బూర్వముననే వెలసియుండవచ్చును.

---

1 పిడుపర్తి బసవన బసవపురాణమున నీ విషయము గానరాదని కొందఱనవచ్చును. అందు ''కలిమలభంగచంగ శివగంగకుఁ జెంగటఁ గల్కె మన్పురిన్'' అని యుండవలసినచోట నచ్చుతప్పు– "శివగంగకుఁ జెంగటఁ గల్గు మత్పురిన్" అని పడినది.



## సోమనాథుని కులగోత్రములు

సోమనాథుఁడారాధ్యబ్రాహ్మణుఁడని పలువురు తలంచిరి. కాని శ్రీ బండారు తమ్మయ్యగా రితఁడు జంగముఁ (జంగమకులమువాఁ) డని వ్రాసిరి.[1]

వారి యభిప్రాయముతో నే నేకీభవింపఁజాలకున్నాఁడను. సోమనాథుఁడు బ్రాహ్మణుఁడే యని నేను దలంచుచున్నాఁడను. పండితారాధ్యచరిత్రము, చతుర్వేదసారము, బసవరాజీయము మొదలగు సోమనాథుని గ్రంథములను బరిశీలించినచో సోమనాథుని బ్రాహ్మణత్వము సందేహింపరానిదిగా గోచరించును. మంచి శిష్టాచార సంపత్తిగల బ్రాహ్మణునకే యెఱుకపడఁదగిన విషయములెన్నో పయి గ్రంథములందుఁగలవు. వానిలో వేదమంత్రము లుదాహృతములయినవి. వేదభాష్యములుద్ధృతములయినవి. వైశ్వదేవాది శ్రౌతకర్మల రహస్యములెన్నో విమర్శింపఁబడినవి. ఆనాఁడిట్టి విషయములు బ్రాహ్మణులకందరానివిగా నుండెడివి. పండితారాధ్యచరిత్రమున" నలిఁ బాల్కురికిసోమనాథుండనంగ, వెలయువాఁడను జతుర్వేదపారగుఁడ" అనుట యాతని బ్రాహ్మణత్వము నుద్ఘోషించుచున్నది. బ్రాహ్మణేతరుఁడు వేదమును జదువరాదనుటకుఁ బ్రమాణములను సోమనాథభాష్యమున సోమనాథుఁడే యుదాహరించియున్నాఁడు.[2]

పండితారాధ్యచరిత్ర కృతి శ్రోతయగు పాల్కురికి సూరనామాత్యుని సోమనాథుఁడిట్లు సంబోధించుచున్నాఁడు :

"పరమపవిత్ర ! యాపస్తంబసూత్ర !
హరితసగోత్ర! విద్యాపుణ్యగాత్ర !...
మచ్చికనాముద్దుమఱఁది వీవనియు
నెచ్చెలికాఁడవు నీవె కాకనియు"

---

1 ఆంధ్రపత్రిక యుగాది సంచిక, దుందుభి సంవత్సరము; పుట 144 చూచునది.
2 ప్రసాదస్థలమాహాత్మ్యప్రకరణమున:– అశుద్ధాత్మా శుచిర్లోభా న్మద్భుక్తం పావనం పరమ్, భక్షయ న్నాశ మాప్నోతి శూద్రో హ్యధ్యయనాదివ; శూద్రస్య వేదాధ్యయన మగ్రజాగ్రహణం తథా." ఇత్యాదులు.

"అఱలేని సఖుఁడ! సూరార్య! నా ముద్దు
మఱఁది! విన్మిది మహిమప్రకరణము"

సోమనాథునివలె వీరశైవదీక్షితుఁడు గాకుండుటచేఁగాఁబోలును దన మఱఁదియగు సూరార్యుని యాపస్తంబసూత్ర భారద్వాజ గోత్రము లిట్లు పేర్కొనఁబడియెను. భారద్వాజగోత్రుఁడగు సూరార్యునకు బావమఱఁదియగు సోమనాథుఁడును సూరార్యునివలె బ్రాహ్మణుఁడే యగును. గట్టిగాఁ జుట్టఱికము కానవచ్చుచున్నను నది వట్టివరుస కన్నమాటయే యని కొట్టివేయుట సరికాదు. అట్లు కొట్టివేయుటకుఁజుట్టఱికమునఁబ్రబల బాధకములు గానరావలెను గదా! ఏవీ? ఇంటి పేరొక్కటి యగుటచే నిచ్చి పుచ్చుకొను సంబంధ మసంబద్ధమగు ననుట యసంబద్ధము. ఏకగ్రామవాస్తవ్యులగుటచే భిన్నగోత్రులకుఁ గూడ నొకయింటి పేరేర్పడవచ్చును. భిన్నగోత్రులొకే యింటి పేరు, ఒకే కులముగలవారసంఖ్యాకులుగా నగపడుచున్నారు సోమనాథునియు, సూరనార్యునియు నింటిపేరొక్కటగుటచే వారిర్వురు నొక్కవంశమువారే యని నిరూపింపరాదు. ఒక్కవంశమువారగుదురేని బావమఱఁది వరుసయు దూషితమే యగును.

పలువురు కర్ణాటాంధ్రకవులు సోమనాథుని నారాధ్యనామముతోఁ బేర్కొనిరి. పాల్కురికి సోమనాథపురాణమాతఁడు బ్రాహ్మణుఁడని, వేమనారాధ్యుని వంశమువాఁడని వాకొన్నది. శైవులయిన బ్రాహ్మణులకే యారాధ్యనామమానాఁడు చెల్లినది. బసవపురాణ, పండితారాధ్యచరిత్రాదులు పరిశోధింపఁదగును. బెలిదేవి వేమనారాధ్యుఁడు జంగముఁడని (జంగమ కులమువాఁడను నర్థమున) వ్రాయుట యవిచారమూలకము. పండితారాధ్యచరిత్రమున బెలిదేవి వేమనారాధ్యచరిత్రము గలదు. వేమనారాధ్యునకొక భూవరుఁడు నమస్కరించెను. ఆతఁడాశీర్వదింపఁడయ్యెను. ఆ భూవరుఁడన్న వాక్యము లిట్లున్నవి :

దండియై నృపకుమారుండంతఁబోక...
కొంతభక్తియుఁదోఁప సంతతాభ్యుదయ
కరులు మహాభక్తవరులు భూసురులు,



హరవేషధరులఘహరులు చిత్పరులు
మీరనిమ్రొక్కుడు మేలొందుమనక,
యూరకయుండుట యుచితమే పెంపె."

మీఁది ద్విపదలు బెలిదేవి వేమనారాధ్యుఁడు బ్రాహ్మణుఁడని చెప్పుచున్నవి గావా? 'సోమనాథుని గురువునకుఁ దాతయైన బెలిదేవి వేమ నారాధ్యుఁడు జంగముఁడు' అనియు, 'కావున జంగములకు శిష్యుఁడు...' జంగముఁడు గాక మఱొక్కఁడెట్లగును?' అనియుఁగావించు నాక్షేపము నిలువఁగలదా? వేమనారాధ్యుఁడు జంగముఁడగుట నిజము కాదుగదా. ఆ కారణముచేఁ దత్పౌత్ర శిష్యుఁడు సోమనాథుఁడును జంగముఁడగు ననుటయు దబ్బఱయేకాదా! ఇది 'గజముమిథ్య; పలాయనమును మిథ్య' యన్నట్టున్నదిగాదా!

జంగముఁడయిన పిడుపర్తి సోమన పాల్కురికి సోమనకుఁ గృతిగా బసవపురాణమును జెప్పుటయు, ఆతఁడు సోమనాథునిఁ దనకుఁగులగురుఁ డనుటయుఁ బాల్కురికి సోమనాథుఁడు జంగముఁడగుననుట కెట్లు సాధకములో నేనెఱుఁగఁజాలకున్నాఁడను!

సోమనాథుఁడు బ్రాహ్మణుఁడయినను శివదీక్షితుఁడగుటచేఁదన కులగోత్రాదికమును జెప్పుకొనఁడయ్యెను. తన్ను గన్న తల్లిదండ్రుల పేళ్లు ప్రథమ కృతియగు బసవపురాణమున మాత్రము :

"భ్రాజిష్ణుఁడగు విష్ణురామిదేవుండు
తేజిష్ణువగు శ్రియాదేవి యమ్మయును
గారవింపఁగ నొప్పు గాదిలిసుతుఁడ"

నని చెప్పుకొన్నాడు. అప్పటికి వారు బ్రదికియుండవచ్చును. వారి ప్రాపును సోమనాథుఁడు పడయుచుండవచ్చును. తర్వాతి కృతులలో వారిపేళ్లెత్తనే లేదు.

"ధర నుమా మాతా పితా రుద్ర" యనెడు
వరపురాణోక్తినీశ్వరకులజుండఁ

బేరెన్నఁబడిన శ్రీబెలిదేవి వేమ
నారాధ్యులను బరమారాధ్య దేవు
మనుమని శిష్యుండ మద్గురులింగ
ఘన కరుణాహస్త గర్భసంభవుఁడ
మును బసవపురాణమున నెన్నఁబడిన,
పెనుపారు జనులకుఁబెంపుడుకొడుక
.......................................
బసవని పుత్త్రుండ బసవ గోత్రుండ."

– పండితారాధ్యచరిత్ర

బసవపురాణమునఁబేర్కొన్న తల్లిదండ్రుల నిందుఁబేర్కొనలేదు. వారి యెడనంతగా గౌరవము గూడఁజూపలేదు. "పెనుపారు జను" లన్నాఁడు. వారికిఁ "బెంపుడు కొడుక" నన్నాఁడు. ఇట్లు తల్లిదండ్రులను, గులగోత్రములను బేర్కొనకుండుటకుఁగారణ మాతనికిఁదల్లిదండ్రులు, కులగోత్రములు లేకపోవుట కాదుగదా!

ఆ కారణము ననుభవసారమున నిట్లు చెప్పినాఁడు :–

క. "భువిలో శివదీక్షితులగు
శివభక్తుల పూర్వజాతిఁజింతించుట రౌ
రవనరకభాజనంబా
శివుఁబాషాణంబుఁగాఁగఁజింతించుక్రియన్.

సీ. ధర నుమా మాతా పితా రుద్ర యీశ్వరః
కులమేవ చ" యనియుఁగలదుగాన
సద్గురుకారుణ్యసంజాతులెల్ల స
గోత్రులనక యన్యగోత్రు లనఁగఁ

ఆ.వె. దగునె యొక్క తల్లిదండ్రులకుద్భవం
బైన ప్రజలలోన హీనవంశ్యు



లెందుఁ గలుగబోదురే శివగోత్ర స
త్పాత్ర భక్తిసూత్రపథచరిత్ర."

ఈ పద్యములు శివదీక్షితుఁడగుటచే సోమనాథుఁడు దన జన్మజాత్యాదులఁ బేర్కొననొల్లఁడయ్యెనని తెలుపుచుండుట లేదా? 'ఈశ్వరుకులజుండ, నీశ్వర పుత్రుండ' నని చెప్పికొన్నను నాతని తలిదండ్రులు వేఱుగాఁ గలరని మనము గ్రహించుచుంటిమి గదా!

ఈ సంప్రదాయమొక్క శైవులందేకాక శాక్తులందును గలదు. శాక్తదీక్ష గొన్నవారు పుట్టినప్పుడు తమకుఁబెట్టినపేరుగాక దీక్షానామమని వేఱొక పేరు ధరింతురు. శైవులకుఁగల గురుకరోదరజనితత్వము వారికిని గలదు. దీక్షాగ్రహణమునాఁటనుండియు జన్మము వేఱయినట్లే వారి నిశ్చయమును. వారికిని జాతాశౌచమృతాశౌచాదులు నిషిద్ధములే. ఈ విషయమున శాక్తతంత్రములకు శైవతంత్రములకు సాదృశ్యమే. కాలాముఖపాశుపతాదిశైవు లిట్టినియమములు గలవారే. కాని, బసవేశ్వరోపజ్ఞముగా నుద్భూద్ధమయిన వీరశైవము మాత్రము వీరవ్రతముగలదై కొంతవిలక్షణ విధానము గాంచినది. తద్విషయము బసవేశ్వరమతమనుచోటఁ బ్రపంచించి వ్రాయుదును.

సోమనాథుఁడు బ్రాహ్మణుఁడయినను దీక్షితుల సంప్రదాయము చొప్పున జన్మగోత్రసూత్రాదికములను జెప్పుకొనకపోయెను. ఇతర విధముల నాతని బ్రాహ్మణత్వము ప్రవ్యక్తమగుచున్నను నీయసమర్థసాధనమును గొని యాతఁడు బ్రాహ్మణుఁడు కాఁడనుట యుక్తమా?

ఇఁక బసవపురాణమున బ్రాహ్మణులను 'ద్రాటిమాల'లని, 'పచ్చిమాల' లని గర్హించుటచే సోమనాథుఁడు బ్రాహ్మణుఁడు గానేరఁడనుటయు నసంగతమే యగును. పయితిట్లు సోమనాథునివి గావు. వీరశైవవివాదములందు బసవేశ్వరాదుల వాక్కులను సోమనాథుఁడనుకరించి చెప్పెను. కాని, యవి సోమనాథుఁడు స్వయము నోరారఁదిట్టినవిగావు. గ్రంథమునఁ బ్రసక్తులగు కథాపురుషుల పనులను, బలుకులను ననువదించినంత మాత్రమున వానిని

గ్రంథకర్తకతకరింపరాదు గదా! బసవపురాణమున బ్రాహ్మణగర్హ యుండఁగాఁ బండితారాధ్య చరిత్రమున బ్రాహ్మణప్రశంస గలదు. మల్లికార్జున పండితారాధ్యుఁడు బ్రాహ్మణ ధర్మముల నాదరించినవాఁడు గావున, నందు సోమనాథునకట్లు వ్రాయవలసెను. బసవేశ్వరుఁడు బ్రాహ్మణధర్మములు గర్హించినవాఁడు గావున బసవపురాణమున నిట్లు వ్రాయవలసెను.

సోమనాథుఁడు బ్రాహ్మణుఁడగుట నిస్సంశయమే. అయినను మనకాలము వారయిన వీరేశలింగముపంతులుగారు, రామమోహనరా యోపజ్ఞముగాఁ బేర్వెలసిన బ్రహ్మసమాజ సిద్ధాంతములమీఁది యభిమానాతి శయముచేతను, తన్మతతత్త్వ జ్ఞానాతిరేకముచేతను వయస్సు చాలఁగాఁగడచిన పిదప యజ్ఞోపవీతాదికమును దృజించినట్టుగా సోమనాథుఁడును బసవేశ్వరోపజ్ఞముగా వెలసిన వీరశైవసిద్ధాంతముమీఁది యభిమానముచే శివభక్తిపారవశ్యముచే గాయత్రీయజ్ఞోపవీతాదికములను, గులమును జాలవయస్సు కడచినపిదప విడనాడినాఁడేమో యని యాతఁడాంధ్రదేశమును విడిచి కర్ణాటదేశమునకుఁ జేరుటనుబట్టి నే నించుక సంశయించితిని. కాని, సోమనాథభాష్యమును జూడఁగా నాసంశయమునకు స్థానములేదని యేర్పడెను. గాయత్రీమంత్రము శివపరమనియు ననుష్ఠేయమనియు సోమనాథుఁడందు వ్రాసెను. బసవేశ్వరుని కాలమున వీరశైవమత మాంధ్రదేశమున వేరూనలేదు. బసవేశ్వరునికిఁ దర్వాతఁ జాలఁగాలము గడిచిన తర్వాతనే యల్పాల్పముగా నది యాంధ్రదేశము నంటుకొన్నది.

నేఁటి జంగమజాతివారు పాల్కురికి సోమనాథుని కాలమునఁగూడ నాంధ్రదేశమునఁగలరన్న నమ్మకము కల్మినిగాఁబోలును, దమ్మయ్యగారు పయివాదముఁదెచ్చి పెట్టిరి. ఆ కాలమున జంగమపదము చరలింగమను నర్థమునఁగలదే కాని నేఁటి జంగమజాతికి వాచకముగాలేదు. ఈ జాతి యప్పటికింకనేర్పడలేదు.

నన్నిచోడని కుమారసంభవకృతి నందుకొన్న మల్లికార్జునుఁడు పెక్కుచోట్ల జంగమ మల్లికార్జునుఁడని పేర్కొనఁబడెను. కాని, యందే యాతఁడు 'భూసుర వంశాద్యుఁడు' ఇత్యాది విధముల బ్రాహ్మణుఁడనియే ప్రస్తుతుఁడయ్యెను.



మీఁది చర్చవలన సోమనాథుని బ్రాహ్మణత్వము నిర్వికల్పముగా నిలువఁ గలదని నేను నమ్ముచున్నాఁడను.

## సోమనాథుని గురువులు

శ్రియాదేవియు, విష్ణురామిదేవుఁడును నీతనికిఁ దల్లిదండ్రులని యిది వఱకే వ్రాసితిని. ఈతనికిఁగవితావిద్య నేర్పిన విద్యాగురుఁడు కర్షలి విశ్వనాథుఁడు.

"సకృపాత్ముఁడగు కరస్థలి విశ్వనాథు
ప్రకట వరప్రసాదకవిత్వయుతుఁడ. —బసవపురాణము

గీ. "విమల చిత్రపూర్తి విశ్వేశవరమూర్తి
వినయవర్తి భువన వినుతకీర్తి
విభుకరస్థలంబు విశ్వేశుకారుణ్య
జనిత విమలకావ్య శక్తియుతుఁడ."

—అనుభవసారము

ఈతనికి శివదీక్ష నొసఁగిన గురుఁడు గురులింగార్యుఁడు –

'గురులింగవరకరోదర జనితుండ', 'గురులింగ తనూజుండ', 'పేరెన్నఁ బడిన శ్రీబెలిదేవివేమ–నారాధ్యుఁడను పరమారాధ్యదేవ, మనుమని శిష్యుండ మద్గురులింగ– ఘనకరుణాహస్త గర్భసంభవుఁడ.'

పయివాక్యములవలన బెలిదేవి వేమనారాధ్యుల మనుమఁడయిన గురులింగార్యుఁడీతని దీక్షాగురుఁడని తెలియనగును. సంస్కృతపండితారాధ్య చరిత్రమునఁగూడ నిట్లేకలదు.

"బెల్దేవి వేమనారాధ్య ప్రశిష్యస్య కృపానిధేః
గురులింగార్యస్య దయాహస్త గర్భ సముద్భవః.

'మనుమ'డనఁగా నాచార్యవంశమున మనుమఁడని సంస్కృత గ్రంథకర్త గ్రహించెను. కావుననే 'ప్రశిష్యస్య' అనెను.

ఇంకొక గురుఁడు పోతిదేవర –
'కట్టకూరి–పోతిదేవర పదాంబుజ షట్పదుండ'

ఈ కట్టకూరి పోతిదేవర యెట్టివాఁడో యెక్కడివాఁడో యెఱుఁగరాదు.

## సోమనాథుఁడు పేర్కొన్న సమకాల భక్తులు

చెన్న రాముఁడు– ఈతఁడు వడగాము రామేశుని శిష్యుఁడు; సోమనాథునికిఁ బ్రాణసఖుఁడు. కరస్థలి సోమనాథయ్య– ఈతఁడు పండితా రాధ్యుల శిష్యుఁడు; శ్రీశైల త్రిపురాంతకవాస్తవ్యుఁడు; మల్లినాథుఁడు– రెంటాల మల్లినాథుఁడు– ఈతఁడు సీమాలంఘన (పొలమేరదాఁటరాదను నియమము) వ్రతము గలిగి శ్రీశైలము, కుమారాచలమునకుఁదూర్పుదెసను మెట్లు కట్టించి యక్కడనే యున్నవాఁడు. దోచమాంబ–ఈమె శివునకనుదినము నైదు కరవీరపుష్పములర్పించునట్లు వ్రతముపూని యందొక్కనాఁడొక్కపుష్పము తక్కువకాఁగాఁదన కన్నిచ్చి శివునిచే మరలఁబడసి కీర్తి గన్నదట! గోడగి త్రిపురారి– ఈయన మున్నయదేవయోగికి శిష్యుఁడు; నారయకుఁగుమారుఁడు; నీలకంఠునికి నన్నగారు; సోమనాథుని యనుభవసారకృతికిఁబతి. గొబ్బూరి సంగనామాత్యుఁడు – ఈతఁడు మండెఁగ మాదిరాజు (బసవన తండ్రిగాఁడు) శిష్యుఁడు; గొబ్బూరికధిపతి; బసవపురాణకృతిశ్రోత. పాల్కురికి సూరనామాత్యుఁడు– ఈతఁడు వీరపోలేశ్వరునికి శిష్యుఁడు; పాల్కురికి సోమనాథునకు ముద్దుమఱఁది; పండితారాధ్యచరిత్ర కృతిశ్రోత.

## సోమనాథుని కృతులు

పిడుపర్తి బసవన తన బసవపురాణమున సోమనాథుని కృతులనిట్లు పేర్కొన్నాఁడు:

సీ. బసవపురాణంబు, పండితారాధ్యుల
చరితంబు, ననుభవసారమును, జ
తుర్వేదసార సూక్తులు, సోమనాథ భా
ష్యమ్ము, శ్రీరుద్రభాష్యమ్ము, బసవ



రగడ, గంగోత్పత్తిరగడ, శ్రీబసవాఢ్య
రగడయు, సద్గురురగడ, చెన్న
మల్లు సీసములు, నమస్కారగద్య, వృ
షాధిపశతకంబు, నక్షరాంక

గీ. గద్యపద్యముల్, పంచప్రకారగద్య
యష్టకము, పంచకము, నుదాహరణయుగము
నాది యగు కృతుల్ భక్తహితార్థబుద్ధి
జెప్పె నవి భక్తసభలలోఁజెల్లుచుండు."

ఇందు బసవపురాణము, పండితారాధ్య చరితము,అనుభవసారము, చతుర్వేదసారము, చెన్నుమల్లు సీసములు, వృషాధిపశతకము, (ఒక) బసవోదాహరణము అనునవి తెల్గుకృతులు. సోమనాథభాష్యము (దీనికే బసవరాజీయ మని మాఱుపేరు), రుద్రభాష్యము, అష్టకము, పంచకము, నమస్కారగద్య, అక్షరాంకగద్య, పంచప్రకారగద్య, (ఒక) బసవోదాహరణము, సంస్కృతభాషలో నున్నవి. కడమవి కన్నడమున నున్నవి. వీనిలో రుద్రభాష్య మిప్పుడు గానరాకున్నది. "సోమనాథస్తవమని మఱియొక ద్విపదస్తవము తెలుఁగు భాషలోనే యీ కవివరుని దొకటి గలదు" అని శ్రీ బండారు తమ్మయ్యగారు వ్రాసిరి. అది యోరుఁగంటిలో ముదిగొండ శంకరారాధ్యులవారిచేఁ బరిష్కృతమై ముద్రితమైన 'మోక్షోపాయ' మను పుస్తకమునఁగల సోమనాథస్తవమే యగునేని దానికిఁగర్త పాల్కురికి సోమనాథుఁడనుట నిరాధారము. దాని ముగింపిట్లున్నది :–

"భక్తుల సంగంబు భక్తసద్గోష్ఠి
భక్తుల పదసేవ పదపడి చేయ
కరుణ నొసంగవే కైలాసవాస
గురునాథ శ్రీపాలకురికి సోమేశ !"

తద్రచనము సోమనాథుని రచనమువలె లేదు. తమ్మయ్యగారు పేర్కొన్న సోమనాథస్తవమింకొకటి కలదేమో! సోమనాథుని గ్రంథములనెల్లఁ బఠనపాఠ

నాది ప్రచారమునకుఁదెచ్చినవాఁడు, తచ్ఛిష్యపరంపరలోనివాఁడునగు పిడుపర్తి బసవన్న యాగ్రంథమును బేర్కొనలేదు.

కర్ణాటకమున సోమేశ్వరశతక మొకటి యీతనికృతిగాఁ జెప్పఁబడునది గలదు. దోషభూయిష్ఠమగు నా శతకము పాల్కురికి సోమనాథుని కృతిగా విశ్వసింపఁజాలమని కర్ణాటవిద్వాంసులనుచున్నారు. కర్ణాటకవి చరిత్ర కారులును నా శతకము సోమనాథుని రచనమగుటనుగూర్చి సంశయించిరి. అష్టకములను పంచకములనుగూడఁ బరిగణించిన పిడుపర్తి బసవన యీ శతకము సోమనాథుని రచనమే యగునేని పేర్కొనక విడువఁడు. "సోమేశ్వరా" యని సంబోధనము మకుటముగాఁగల యా శతకము సోమనాథుని శిష్యపరంపరలోని వాఁడితరుఁడు రచియించినదయి యుండవచ్చును. సోమనాథునిఁబ్రస్తుతించునది అన్యవాదకోలాహలమని నామాంతరముగల సోమనాథలింగ శతకము గలదు. అదికూడఁ గర్తృనామ రహితమే. కొందఱు దానిని గూడ సోమనాథునికృతినిగాఁ దలంచిరి.[1] అదిపొరఁబాటు. మఱియుఁ గర్ణాటకవి చరిత్రమున నీతఁడు 'సహస్రగణనామములు'. 'శీలసంపాదనము' అను కర్ణాటగ్రంథములనుగూడ రచియించినట్లు వ్రాయఁబడెను. పండితారాధ్య చరిత్రలో సోమనాథుఁడు గణసహస్రనామస్తవముఁ జేర్చెను. కర్ణాటకవులు దానిని బేర్కొనుటనుబట్టి కర్ణాటకవిచరిత్రకారు లా గ్రంథము వేఱుగాఁ గర్ణాటమున రచితమైనట్లూహించిరి. మఱియుఁగన్నడ కవిచరిత్ర మిట్లు చెప్పుచున్నది: "భైరవేశ్వరకావ్యపుఁ గథాసూత్ర రత్నాకరమున నిట్లు గలదు. సోమనాథుఁడు జ్యోతిర్మయ శాంభవీజ్ఞాన దీక్షాబోధలోని పరమరహస్యార్థమును సంగయ్య యను శరణునికి నూటయఱువది వచనములలో సంగ్రహించి యుపదేశించెను" దీని యాథార్థ్యము మన కెఱుఁగరాదు.

## కృతుల వివరణము

బసవపురాణము– ఇఁకముందు దీనిఁ గూర్చి విపులముగా వివరణ ముండును.

1 కర్ణాటకవిచరిత్ర, దానిని బట్టి కం. వీరేశలింగము పంతులుగారును



**పండితారాధ్యచరిత్రము–** ఇందు మల్లికార్జున పండితారాధ్యుని చరిత్రము వర్ణితమయినది. ఇది బసవపురాణమువంటి ద్విపదకృతి. గ్రంథస్వరూపమునందును, కవితాగౌరవమునందును బసవపురాణముకంటె గొప్పది. బసవపురాణమునఁజెప్పఁబడని శివభక్తుల కథలిందు గలవు. అందుఁ జెప్పఁబడనిది బసవేశ్వరచరిత్రమిందుఁ గొంత గలదు. గురురాజకవి దీనిని సంస్కృత భాషలోనికిఁబరివర్తించినాఁడు. అది కొంత ముద్రిత మయినది. శ్రీనాథకవిసార్వభౌముఁడు దీనిని బద్యప్రబంధముగా రచియించినాఁడు. అది నేఁడు గానరాకున్నది.

**చతుర్వేదసారము–** ఇందు శివపారమ్యము ప్రతిపాదితమయినది. పండితారాధ్య చరిత్రమునను, సోమనాథభాష్యమునను జెప్పఁబడిన యుక్తులే, ఉదాహృతములయిన శ్రుతిస్మృతిపురాణాదులే యిందును సీసపద్యములలోఁ జక్కఁగాఁ బొందికగాఁ జెప్పఁబడినవి. నాలుగువందల సీసపద్యములిందు గలవు. ప్రతిపద్యమును బసవసంబోధనముతో ముగియుచున్నది. పండితారాధ్య చరిత్రమున నీ కృతి పేర్కొనఁబడినది.

**అనుభవసారము–** ఇది చిన్న పద్యకృతి: గురుభక్తి మహిమ, శివపూజా విధానము, భక్తలక్షణము, జంగమసేవ, ఇష్టలింగార్పణము, షట్‌స్థలవివరణము మొదలగు శైవధర్మములిందుఁదెలుపఁబడినవి.

**చెన్నమల్లు సీసములు–** ముప్పదిరెండు సీసపద్యములు. షట్‌స్థల వైభవమిందుఁ బ్రశంసింపఁబడినది. 'చెన్నమల్లు' అను మకుటముతో నీ సీసపద్యములు ముగియుచున్నవి.

**వృషాధిపశతకము–** "బసవా బసవా బసవా వృషాధిపా" అను మకుటముతో నిందుఁ బ్రతిపద్యమును ముగియుచున్నది. ఈ వృత్తశతకమున బసవపురాణకథాసారమెల్లఁగలదు. బసవేశ్వరప్రస్తుతి గలదు. పెక్కు పద్యములు శబ్దచిత్రము గలవి. సంస్కృత ద్రవిడ మణిప్రవాళ కర్ణాట మహారాష్ట్ర భాషల పద్యములు గూడ నిందుఁ గలవు.

ఇవి ముద్రితములైన యాంధ్రగ్రంథములు.

**బసవోదాహరణము**– ఇది యముద్రితము.[1]

ఆది :

ఉ. శ్రీగురులింగతత్పరుఁడశేషజగన్నిధి శుద్ధతత్త్వ సం
యోగసుఖప్రపూర్తి వృషభోత్తమమూర్తి యుదాత్తకీర్తి ది
వ్యాగమమార్గవర్తి బసవయ్య కృపాంబుధి మాకు భక్తి సం
భోగములం బ్రసాదసుఖభోగములంగరుణించుఁగావుతన్.

కళిక : వెండియుఁ ద్రిభువన వినుతిసమేతుఁడు
మండిత సద్గుణ మహిమోపేతుఁడు
సురుచిరశివసమ సుఖసంధానుఁడు
పరమపరాపర భరితజ్ఞానుఁడు
విదితానందా న్వీత మనస్కుఁడు
సదమలవిపులవిశాలయశస్కుఁడు.

అంతము:

ఉ. నీవు దయాపయోనిధివి నిన్ను నుతించినఁ గల్గు భక్తి నీ
చే వరవీరశైవరతి చేకుఱు నీకయి యిత్తుఁ గబ్బముల్
నీవలనంగృతార్థత జనించును నీకు నమస్కరింతు నా
భావమునందునుండి ననుఁబాయకుమీ బసవయ్య, వేఁడెదన్.

## *ఇఁక సంస్కృత గ్రంథములు :*

**సోమనాథభాష్యము** –దీనికే 'బసవ రాజీయ' మని నామాంతరము. ఇది యిర్వదియైదు ప్రకరణములు గలది. శైవసంప్రదాయములిందు వివరింపఁబడినవి. ఇందు గాయత్రీమంత్రము శివపరమని నిరూపింపబడినది. లింగార్చనా

1.సూచన: ఇది తరువాతికాలంలో వే.ప్ర.శా.గారిచే పరిష్కరింపబడి ముద్రించబడినది. ప్రథమముద్రణ చూ॥ భారతి, ప్రభవ సంవత్సర మాఘమాసం. మరియు చూ॥ ప్రస్తుత బసవపురాణము అనుబంధం-2 (2013)



ప్రాధాన్యము చెప్పఁబడినది. వైదికాచారగర్హణము గానరాదు సరిగదా దాని ప్రాధాన్యముగూడ నిందుఁబ్రతిపాదితమయినది. శ్రుతిస్మృతి పురాణాగమాదుల నుండి పెక్కుశ్లోకములిందుదుధ్ధృతములయినవి. హరదత్తాచార్యుల చతుర్వేద తాత్పర్యసంగ్రహముననుండి యిందుఁ బెక్కుశ్లోకములుదాహృతములయినవి.

ఇది ముద్రితము.

**రుద్రభాష్యము** :– యజుర్వేదమందలి రుద్రాధ్యాయమునకిది భాష్యమయి యుండును. నేఁడిది గానరాకున్నది. ఇవి ముద్రితములు.

ఈ క్రింది గ్రంథము లముద్రితములు.

**బసవోదాహరణము**[1] – ఇది బసవేశ్వరస్తుతి రూపమయినది. సరళమయిన రచనతో హృద్యముగ నున్నది.

ఆది:

అపిచ పురాతననూతనశివగణపాదోదకపరిలసదభిషేకః;
క్షపితవిపల్లవపల్లవజంగమ లింగసమర్చననిచితవివేకః.

అంతము :

య స్సంగీతనిధి, ర్యమాహు రభవం, యే నార్చితం సూనృతం,
యస్మై స్వస్తి, యత స్తదీయ ముదభూ, ద్యద్వీరశైవవ్రతమ్;
యస్యాపాంగసహోదరీ చ కరుణా, యస్మిన్ మహత్త్వాదికం
స త్వం త్రీణి జగంతి పాహి బసవామాత్యేశ చూడామణే !

**నమస్కారగద్యము** – ఆది :

శ్లో. శ్రీకంఠోద్భవవేదచోదితలసద్వీరవ్రత ప్రక్రియా
చారాదేశకదేశికాయ భువనస్తుత్యాయ సత్యాయ చ;
.............................................
సాక్షాచ్ఛ్రీ వృషభాధిపాంశ బసవాధీశాయ తస్మై నమః
అపిచ శ్రీ ప్రమథేంద్రాయ నమో
వ్యపగత..................................

1.19వ పుటలోని 1వ పాద సూచికను చూడగలరు.

అంతము :

మఘవత్ప్రణుతపదాబ్జాతాయ దాతాయ
విఘసత్రితయసుఖోద్ధరణాయ శరణాయ;
కుసుమశరరిపుభక్తవృషభాయ వృషభాయ
బసవాయ తే నమస్తే నమస్తే నమః.

శ్లో. సరస నమస్కృతి గద్యం వరపదమణిఖచితవాక్సువర్ణాభమ్;
అష్టోత్తరశతకుసుమం రచితం పాల్కురికి సోమనాథేన.

**పంచప్రకార గద్యము** –ఆది:–

శ్లో. స్వస్తిశ్రీ ప్రమథాన్వయోత్తమ శిలాదశ్రీమునీంద్రాత్మజ
శ్రీకంఠప్రతిబింబమూర్త యనఘ శ్రీనందినాథప్రభో;
తస్యాంశోద్భవ దండనాథ బసవ శ్రీనామధేయప్రభో
త్వత్కారుణ్యతరంగితం మయి సదా సంక్షిప్యతా మీక్షణమ్.

జయజయ బసవ శ్రీమన్మహావృషభేంద్రాపరావతార నిసహచిత వీర మాహేశ్వరాచారసార ప్రమథగణాలంకార జగత్త్రయాధార దేవా ! బసవా!

అంతము :

జయశివరంజన, జయభవభంజన, జయకరుణాకర, జయసురభీకర, జయగత దూషణ, జయ ఋతభాషణ, జయగుణరాజిత, జయగణపూజిత, జయజయశ్రీ బసవదండనాథ నమస్తే.

**అక్షరాంకగద్యము** –ఆది :

అపి చ శివశృంగార, ఆదిపథవిస్తార, ఇహపరసుఖాధార, ఈషణత్రయ దూర, ఉద్ధతగుణోపేత, ఊర్ధ్వరేతోజాత............



అంతము :

శమితవిషయోద్రిక్త, షడ్వర్గనిర్ముక్త, సహజజంగమభక్త, హరగణ హితచ్ఛత్ర, లలితకీర్తికళత్ర, క్షరవిముఖనిజగాత్ర, అక్షరస్తుతిపాత్ర, శివకరజ బసవ దండనాథ నమస్తే.

అకారాదిక్షకారాంత మకరో దక్షమాలికామ్;
ప్రసాదీ సోమనాథార్యో బసవస్య కృపానిధేః.

అక్షరాంకశ్లోకములును గలవు

**అష్టోత్తరశతనామగద్యము** – ఆది :

శ్రీమద్గురు బసవేశ నమస్తే, సామయభవ నిర్నామ నమస్తే,

అంతము :

ఆద్య నమస్తే, వేద్య నమస్తే, తత్త్వ నమస్తే, చిత్త్వ నమస్తే,
భావ నమస్తే, భావి నమస్తే, సద్గురుబసవస్వామిన్ నమస్తే.

**వృషభాష్టకము**– ఆది :

పక్షీంద్రవాహనతపోబలసాధనీయ
సర్వేశ్వరోల్లసిత వాహనలాల్యమాన !
కాపాలిరూప సముపేత పునీతదృష్టే
శ్రీ వజ్రశృంగ వృషభాధిపతే నమస్తే !

అంతము :

పాల్కుర్కి సోమరచితం వృషభాష్టకం యః
స్తోత్రం శ్రుణోతి పఠతీహ వినిశ్చితార్థమ్;
సోఽథాశు యాతి వృషభాధిపతేః ప్రసాదా
ల్లబ్ధాద్ విశుద్ధపదభక్తిఫలాదభీష్టమ్.

**పంచరత్నములు** –ఆది :

ప్రియతమశివభక్తా బిందునాదానురక్తా
మయి భవ శివయుక్తా హారహీరప్రభాక్తా
నియమిత సకలాంగా నీలకంఠ ప్రసంగా
నయతు బసవలింగాధీనభక్తిక్రియాంగా.

అంతము :

శ్రీమతే వృషభేంద్రాయ సోమనాథేన ధీమతా.
పంచరత్నం కృతం స్తోత్రం జ్ఞానవైరాగ్యభక్తిదమ్.

**బసవాష్టకము** – ఆది :

జయజయ బసవాంశా సత్యసద్భక్తివాసా
జయజయ శివగోత్రా సత్ప్రసాదైకపాత్రా;
జయజయ భవదూరా శాశ్వతైకాంగవీరా
జయజయ బసవాఖ్యా సంవిదాశ్చర్యసౌఖ్యా.

అంతము :

బస్వాష్టక మిదం పుణ్యం సర్వపాపప్రణాశనమ్;
యః పఠేచ్ఛృణుయా ద్వాపి శివలోకే మహీయతే.

కడమ కన్నడ రగడల కాద్యంతములు చూపకుండెదను.

## సోమనాథుని పేరఁగల కృతులు

పిడుపర్తి బసవన పద్యబసవపురాణమును సోమనాథుని పేర నంకితముచేసినాఁడు. దానిఁగూర్చి యింతకుముందుఁగొంతప్రస్తావము జరగెను. అన్యవాదకోలాహలమని పేరుగల సోమనాథలింగశతక మీతని పేరనే కలదు. అందు సోమనాథస్తుతియును, శివపారమ్య ప్రతిపాదనమును, మతాంతర గర్హణమును గలవు. అది కర్ణాటకమునను గలదట. వీరశైవకవులెల్లరు



సోమనాథుని స్తుతించిరి. కర్ణాటకభాషలో వీరశైవకృతులు పెక్కులు గలవు. కావునఁ నందుఁబలువురు కవులీతనిఁబ్రస్తుతించిరి. వీరశైవు లీతని మతప్రవర్తకులలోఁ బ్రస్తుతింతురు. ఈతఁడు భృంగీశుని యవతారమని వారినమ్మకము. ఈతఁడు బసవేశ్వరునియుఁ బండితారాధ్యునియుఁ జరిత్రముల రచించినట్లే యీతని చరిత్రమును బాల్కురికి సోమనాథపురాణ మనుపేరఁ గర్ణాట భాషలో విరక్త తొంటెదార్యుఁడనుకవి రచియించినాఁడు. ఆతఁడు క్రీ.1560 ప్రాంతములవాఁడు.

**పాల్కురికి సోమేశ్వరపురాణము**– ఇందు సోమనాథుని చరిత్రమును బ్రధానముగాఁ జేసికొని సోమనాథుని సమకాలమువారగు రెంటాల మల్లినాథుఁడు, పాల్కురికి సూరామాత్యుఁడు మొదలగువారియు, నింకను బ్రాచీనులగు మఱిపెక్కురయుఁ జరిత్రములను, శివలీలలను గ్రంథకర్త వర్ణించినాఁడు. సోమనాథచరిత్ర మిందల్పముగానే కానవచ్చును. ఉన్నదాని సారమిది.

“సోమనాథుఁడు వేమనారాధ్యవంశమువాఁడు; పాల్కురికి గ్రామవాస్తవ్యుఁడు; గురులింగార్యునకు మంగళాంబకుఁబుత్త్రుఁడు. (ఈతఁడు దీక్షావంశమునఁ దలిదండ్రులపేళ్లు చెప్పినాఁడు.) ఓరుఁగంటి ప్రతాప రుద్రునిచే నారాధితుఁ డయినాఁడు. (పిడుపర్తి బసవన చెప్పిన కథనెల్ల నీతఁడును జెప్పినాఁడు). అప్పుడు చక్రపాణి రంగనాథుఁడను వైష్ణవునితో సోమనాథునకు మతవిషయమునఁ దగవు వాటిల్లెను. అశైవుని దర్శింపఁడు గాన సోమనాథుఁడు తెరచాటుననుండి వాదముచేయనంగీకరించెను. కాని, యా వైష్ణవుని జయించుటకు సోమనాథుని పుత్త్రుఁడగు చతుర్ముఖ బసవేశ్వరుఁడే తలపడెను. వారిర్వురకును గొప్పవాదము జరిగెను. రంగనాథుఁడోడిపోయెను. పరాజయదుఃఖముతో నా రంగనాథుఁడు శ్రీశైలమార్గముననే తిరిగిపోయెను. శ్రీశైలమల్లికార్జునునిఁ జూడక ద్వేషబుద్ధి తోడనే యరిగెను. ఆ శివద్వేషముచే నాతనికిఁగన్నులు గ్రుడ్డివయ్యెను. అహోబలమున కరిగి యాతఁడు నరసింహ స్వామిని బ్రార్థించెను. ఆ స్వామివలన స్వప్నమున శివాధిక్యబోధమును బడసి లజ్జితుఁడై తిరిగి శ్రీశైలమునకు వచ్చి శ్రీశైలమల్లికార్జునుని బహువిధములఁ బ్రస్తుతించెను. పదపడి పాలకురికికి వచ్చి

సోమనాథుని దర్శించి యపచారము క్షమింపఁ బ్రార్థించెను. సోమనాథుఁ డనుగ్రహించెను. రెండవకన్నును వచ్చెను. రంగనాథుఁడు శైవదీక్షనొసఁగుమని సోమనాథునిఁబ్రార్థించెను. పుత్త్రుఁడగు చతుర్ముఖ బసవేశ్వరునిచేత సోమనాథుఁ డాతని శివదీక్షితుని జేయించెను. రంగనాథుఁడప్పుడు వీరభద్ర విజయ శరభచరిత్రాదులను రచియించి గురుపాదముల కర్పించెను. తరువాత సోమ నాథుఁడు కర్ణాటదేశమునఁగలికెమను నగ్రహారమునకుఁబోయి సమాధిస్థుఁడై లింగైక్యమందెను.

ఇందుఁ బ్రధానముగా, నపూర్వముగాఁ గానవచ్చుచున్నది చక్రపాణి రంగనాథుని విషయము.

ఈ పాల్కురికి సోమనాథపురాణమే కాక కర్ణాటకృతి యగు గురురాజ చరిత్రముగూడ నీ చక్రపాణి రంగనాథునిచరిత్రమును జెప్పుచున్నది. ఈ తొంటిదార్యకవి చెప్పినట్టే యాగురురాజచరిత్రకర్త సిద్ధనంజేశకవియు రంగనాథుని యోటమిని జెప్పినాఁడు. 'వీరభద్రవిజయము' 'శరభలీల' యను గ్రంథములనే కాక యాతఁడు శ్రీగిరినాథవిక్రమమని యేనూఱు సీసపద్యముల తెలుఁగు గ్రంథమును గూడ రచించెనట! దానినే సంస్కృతమునఁగూడ రచించెనట ! ఆ కవి యిట్లు చెప్పుచున్నాఁడు :

శ్రీశైలభర్తకును సీసంబులేనూఱు
లేసప్పపద్యంగ ళెంటుసావిరగళుం
భాసురద దండకం సాహస్ర తారావళియు నాల్కు లయగ్రాహియు
ఆ శతకవృత్తగళు దోధకం సావిరవు
భాసురదతోటకం నూఱు రగళెగ ళేడు
భాషిసిద మత్తకోకిల మూఱు సాసిరం గీతియం తాఱునూఱు.
సరసమంజెర వెంటు కందంగ ళైనూఱు
విరచిసిదకృతియు మూవత్తాఱు గద్యగళు
నిరువ మూవత్తాఱు వుభయశతకం వొప్పు మిగిలు సర్వేశ నిమగె.



ఈతని తెలుఁగు కృతియగు శ్రీగిరినాథ విక్రమముగాని, తక్కిన కర్ణాటకృతులు గాని నేఁడు గానరాకున్నవి. కాని యీతని కృతియే యనఁదగినదిగా 'నయన రగడ' యని నామాంతరముగలది 'శివభక్తిదీపిక' యనుకృతి కలదు. పరిశీలింపఁగా నా కృతి సోమనాథపురాణ గురురాజచరిత్రములు చెప్పినకథనే నిరూపించునదిగాఁ గానవచ్చినది. ఆ కృతిలోని పట్టులను గొన్నింటిని జూపుచున్నాఁడను. అది కొన్ని వందల చరణములు గల రగడ.

క. శ్రీపార్వతీశుఁ జూడక
పాపాత్ముఁడ నగుచుఁబోవఁ బథమునఁజక్షుల్
దీపించు దృష్టి దొలఁగిన
శ్రీపతి నడుగంగఁజెప్పె శివుఁగర్తనుగాన్.

రగడ : శ్రీశైలవల్లభుని శిఖరంబుఁబొడగంటి
కాశీపురాధీశు గౌరీశుఁబొడగంటి,
మహినొప్పు శ్రీశైలమహిమ నేఁబొడగంటి,
బహువేదశాస్త్రముల్ ప్రణుతి సేయుటఁగంటి
భూలోకకైలాస పురమనఁగఁగనుఁగొంటి
ఫాలాక్షుఁడిచ్చోటఁబాయకుండుటఁగంటి
ధృతిఁదూర్పుమొగసాలఁద్రిపురాంతకముఁగంటి
..............................................
పర్వతలింగంబుఁ బ్రాణేశుఁడని కంటి
పర్వతేశ్వరుహృదయ పద్మనిలయునిఁగంటి
............................................
భక్తులప్రతిహత ప్రతిభమతులని కంటి
భక్తులకుఁబ్రత్యర్థిపరులు లేరనికంటి
భక్తులాపదలచేఁబట్టుపడరని కంటి
....................................
శివభక్తిదూషకులు చిరపాపులని కంటి,

శివభక్తిదూషకులు చెడిపోదురని కంటి
.......................................
త్రిభువనము భక్తులకుఁదృణకణంబని కంటి
సభలందు భక్తులకుఁజయవాదమని కంటి
..........................................
.......................................
గౌరీశుఁడే సర్వకర్తగాఁ బొడగంటి
కారుణ్యమున శివుఁడు గనిపించెనని కంటి
..................................
బహుపాపములు నన్నుఁబట్టువిడుచుట గంటి
నయముగా నయనములు నాకీయఁబొడగంటి
..................................
భయభక్తులను భర్గుపాదములు పొడగంటి
నిది పుణ్యమని కంటి నిది గణ్యమని కంటి
నిది యోగమని కంటి నిది భోగమని కంటి
నిది ధర్మమని కంటి నిది మర్మమని కంటి
నిది నిత్యమని కంటి నిది సత్యమని కంటి
నింక శ్రీగిరిఁజేర నేఁగందునని కంటి
శంకరుని కృపవడయు సమయమిదియని కంటి
నింక నాయెత్తు కృతులిత్తునని పొడగంటి
నింకఁగృతిసెప్ప నాకేమి భరమని కంటి
వడిఁగృతుల్ నాయెత్తు వచ్చునని పొడగంటి
తనర శ్రీరంగకవి దాతయని పొడగంటి
భువిలోపలఁబ్రసిద్ధ పుణ్యుఁడని పొడగంటి.”

* * *

సోమనాథపురాణ, గురురాజచరిత్రములందు రంగనాథుఁడని పేరుండఁగా నీ రగడలో ‘శ్రీరంగకవి’ యని పేరున్నది. రెండు నొక్కనిపేళ్లే కావచ్చును; ఇది



వైష్ణవము వీడినతర్వాతిపేరు గావచ్చును. మల్లికార్జునస్వామిని దర్శింపక పోవుటచేఁ గనులుపోవుట, అట్లు పోవుటకుఁగారణమదుగఁగా శ్రీపతి (అహోబలనృసింహుఁడు) శివుఁడే కర్తయని తెలుపుట కృత్యాది పద్యమునఁ గలదు. సభలందు భక్తులు జయించుట, శివానుగ్రహమునఁ బోయినకన్నులు మరల వచ్చుట రగడలోఁ గలదు.

## మఱికొన్ని గాథలు

మఱియు ప్రాచ్యలిఖిత పుస్తకశాలలోని స్థానిక చరిత్రములందును గర్ణాటకవిచరిత్రమునను గూడ నీ క్రింది విషయములు గలవు :

సోమనాథుఁడోరుఁగంటిలో నుండఁగాఁ బెరుగుకురికిశాస్త్రి, నేతికురికి శాస్త్రియని యిర్వురాతనితో వివదించిరట; పాలకురికిలో నుండి వచ్చినవారే గదా పెరుగురికి నేతికురికి శాస్త్రులని యవహేళనముచేసి సోమనాథుఁడు వారిని జయించెనట!

గణపుర ప్రభువయిన జగదేకమల్లునిచే సోమనాథుఁడు లింగముద్రతో గొంత భూమిని బడసెనట.

## సోమనాథుని నిష్ఠలు, నియమములు

ఈతఁడు చతుష్షష్టిశీలసంపన్నుఁడని పలువురు చెప్పిరి. చతుష్షష్టిశీల ముల వివరణమున కిది చోటుగాదు. ‘భవిజన దర్శన స్పర్శ నాలాప వివిధ దానాదాన విషయదూరగుఁడ’నని యీతఁడు చెప్పుకొన్నాఁడు. శైవేతరుల (భవుల) మొగములఁ జూడమని శైవులును, వైష్ణవేతరుల మొగములఁ జూడమని వైష్ణవులును వ్రతములు పూనుట గలదు! అట్టివారు నేఁడునున్నారు!

## సోమనాథుని వైదుష్యము

సోమనాథుని పాండిత్యవిశేషము చతుర్వేదసారమునను, పండితారాధ్య చరిత్రమునను, బసవరాజీయము (సోమనాథభాష్యము) నను గాననగును. వేదములనుండి, పురాణములనుండి శివపారమ్యప్రతిపాదకములయిన

వాక్యముల నీతఁడు హెచ్చుగాఁజూపినాఁడు. వేదములు, వేదభాష్యములు (కొన్నిచోట్ల వేదభాష్యముల ప్రతీకముల నిచ్చినాఁడు. ఆ భాష్యము లెవ్వరివో? విద్యారణ్యభాష్యమప్పటికి పుట్టలేదు గదా!), పూర్వోత్తరమీమాంసలు పురాణములు మొదలుగా మతాచారవిధులకు సంబంధించిన సంస్కృత గ్రంథములనెల్ల నీతఁడు శోధించినాఁడు. శైవమత వ్యాపకులలో నాంధ్రులలో మల్లికార్జున పండితారాధ్యుఁడు, నీతఁడు గొప్ప విద్వాంసుడు. ఇతర మతఖండనాదుల పట్టులందు మల్లికార్జున పండితారాధ్యులు శివతత్త్వసారమునఁ జెప్పినయుక్తులనే యాతఁడు వివరించి తన పండితారాధ్య చరిత్రమునఁ జేర్చినాఁడు. బసవేశ్వరుఁడు పరమశైవుఁడై శివభక్తిరసామృత సింధువుననోలలాడిన భక్తాగ్రణియు, గేయకవితా విశారదుఁ డును నగును గాని యీ యిర్వురంత గొప్పవిద్వాంసుఁడు గాఁడేమో!

పాండిత్యమిట్లుండఁగా నీతఁడు సంస్కృతాంధ్ర కర్ణాట ద్రవిడ మహారాష్ట్ర భాషలలోఁ గవితఁజెప్పనేర్చినవాఁడు. సంస్కృతాంధ్ర కర్ణాట భాషలలో నీతఁడు రచించిన గ్రంథములే కలవు. కాని, యీతని సంస్కృతకవిత యంత రసవంతమయినది గాదు. సంస్కృతవచన రచనయు నంత మేలయినదిగాదు. ఆంధ్రదేశమునను, ఆంధ్రవాఙ్మయమునను గడించిన గౌరవమున కంటె సోమనాథుఁడు కర్ణాటదేశమునను, గర్ణాటవాఙ్మయమునను హెచ్చు గౌరవము గడించెను. కాని, యాతని కర్ణాటరచనములు నంతగొప్పవి గావు. బసవపురాణ, పండితారాధ్య చరిత్రలలోఁ బ్రస్తుతులయిన పలువురు భక్తుల చరిత్రములు ద్రవిడ మహారాష్ట్ర దేశములందుఁ బ్రఖ్యాతములయినవి. ఆ భాషలలో నాతనికిఁబరిచితి లేకున్నచో నాయాచరిత్రముల నాతఁడు సంధానింపఁజాలక పోవును. బసవపురాణమున నొకచోట ప్రౌఢమయిన ద్రావిడకృతినే ప్రపంచించినాఁడు. ఈతని యాంధ్రకవితా నైపుణ్యము, ఆంధ్రభాషావైశారద్యము, గ్రంథవిమర్శన ప్రకరణమునఁబ్రస్తుతింతును. ఈతనికిఁ 'దత్త్వవిద్యాకలాపకవితాసార' 'అన్యవాదకోలాహల' 'ప్రత్యక్షభృంగీశావతార' బిరుదములు గలవని కర్ణాటకకవి చరిత్రకారులు వ్రాసిరి. ఆంధ్రగ్రంథములందు బిరుదములు గానరావు. కాని, పద్యబసవపురాణమందీతఁడు 'జైనమస్తకవిన్యస్త శాతశూలకలిత బిజ్జలతలగుండు గండబిరుదశోభితుఁ'డని ప్రశంసింపఁబడినాఁడు.



## బసవపురాణము

ఈ గ్రంథము ప్రధానముగా బసవేశ్వరుని జీవితచరిత్రమును జెప్పుచున్నది. బసవేశ్వరుఁడు లింగైక్యమందినపిదప నల్పకాలమునకే (ముప్పది యేండ్లకే) రచితమగుటచే నిది తచ్చరిత్రమును దెలుపు సాధనములలో ముఖ్యమయిన దనవచ్చును. బసవేశ్వరుని చరిత్రమును దెలుపునవి, తజ్జీవిత కాలముననే వెలసినవి, శాసనములు మొదలగు సాధనములింతకంటె బలవంతములింతవఱకుఁ గానరాలేదు.

ప్రధానముగానిందు బసవేశ్వరచరిత్రమే వర్ణితమయినను, అనుప్రసక్త ములుగా నుపాఖ్యానములుగా నింకను బలువురు భక్తుల చరిత్రములు వర్ణితములయినవి. సోమనాథుఁడేతద్గ్రంథరచనమునకుఁ గథావస్తుసామగ్రిని గథాకోవిదులగు వృద్ధులవలన నుండియుఁ, బ్రాచీనులగు భక్తులును, బసవేశ్వరుఁ డును, జెప్పిన పాటలు పదములు మొదలగు గేయరచనములవలన నుండియు గ్రహించినట్లు చెప్పుకొన్నాఁడు.

ఆతతబసవపురాతనభక్త
గీతార్థసమితియే మాతృక గాఁగఁ
బూరితంబై యొప్పు పూసలలోన
దారంబుక్రియఁబురాతన భక్తవితతి
చరితలలోపల సంధిల్ల బసవ
చరిత మేవర్ణింతు సత్కృతి యనఁగ.....

ప్రస్తుతింపంగ సద్భక్తి విస్ఫురణఁ
బ్రస్తుతికెక్కినబసవని చరితఁ
జెప్పితి భక్తులచే విన్నమాడ్కిఁ
దప్పకుండఁగను యథాశక్తిఁ జేసి."

బసవపురాణము సోమనాథోపజ్ఞమేయగుటను బయిద్విపదలు స్పష్టపఱుచుచున్నవి. కాని, యీ సోమనాథుఁడే పండితారాధ్య చరిత్రమున రెండుచోట్ల నిట్లు చెప్పినాఁడు :-

బసవన్నగీతముల్ వచరించువారు
బసవపురాణమొప్పఁ జదువువారు.....
అరుదగు దాసయ్య యఱువత్తుమువుర
చరితంబులను శ్రీబసవపురాణంబు
నేలలువెట్టంగ నింపుసొంపారు
శైలిమైఁగ్రాలుచుఁ జదివెడువారు
చాతుర్య మెసఁగ బసవదండనాథు
గీతంబులాదిగా గీతాఢ్యులయిన
సకలపురాతన చారుగీతములు
ప్రకటించి ప్రకటించి పాడెడువారు.

– పండితారాధ్య చరిత్రము.

ఈ ద్విపదలు పండితారాధ్యులవారు శివరాత్రి మహోత్సవమును శ్రీశైలమున జరపనేఁగినపుడు శ్రీశైలమధిరోహించు భక్తులచేష్టల వర్ణించు పట్టుననున్నవి. వీనినిబట్టి చూడఁగా బసవపురాణమాకాలమునకే యున్నట్టుగా నేర్పడును. సోమనాథుఁడు, శైవగ్రంథసంచయమునఁ దనబసవపురాణము పేరుగూడఁ జేర్చుకొనుట నభిలషించియుఁ దన బసవపురాణ రచనానంతర మది శ్రీశైలమధిరోహించు భక్తులచేఁబఠింపఁబడుచుండుట నభిమానించియుఁ గాలదోషము గలుగుటను బాటింపక యట్లు చెప్పియుండవచ్చును. అంతేకాని, వాస్తవముగా నాకాలమునకు బసవపురాణము పుట్టలేదు.

బసవపురాణమున బసవేశ్వరచరిత్రముగాక మఱి మహారాష్ట్రులు, ఆంధ్రులు, కర్ణాటకులు, ద్రవిడులు నగు భక్తుల చరిత్రములుగూడఁ బెక్కులు వర్ణితములయినవి. అందాంధ్రకర్ణాట మహారాష్ట్ర దేశభక్తులలోఁ బ్రాయికముగాఁ బలువురు బసవేశ్వరుని సమకాలము వారగుదురు. కావున వారి కథలు బసవేశ్వరుని కథవలెనే వృద్ధశైవులు చెప్పుటచేతను, కొన్నిగొన్ని గేయములలో (బసవేశ్వర ప్రభృతులు రచించినవి) ప్రస్తుతములగుటచేతను దెలిసికొని పెంపొందించి వర్ణించియుండును. కాని, ద్రమిళభక్తుల కథలు కొన్ని మిక్కిలి ప్రాచీనములగుటచేతను, ద్రవిడభాషలో నా కథలు గ్రంథరూపమున



రచితములయి యుండుటచేతను, హెచ్చుగా నాకథలే బసవపురాణమున వర్ణితములయి యుండుటచేతను, అందును నట్టిద్రవిడ భక్తుల చరిత్రములను దెలుపునదియు, మిక్కిలి ప్రాచీనమైనదియునగు 'తిరుత్తొండర్‌తొఘై' అను గ్రంథము బసవపురాణమునఁగొంత ప్రపంచితమై యుండుటచేతను సోమనాథుఁడా కథల నేదేని ద్రవిడగ్రంథమున నుండి గ్రహించి తెలిఁగించెనేమోయని సందేహింపఁ దగును. బసవపురాణమున వర్ణితములగు ద్రవిడభక్తుల చరిత్రములనే వర్ణించు ద్రవిడగ్రంథములలో 'పెరియపురాణ' మను గ్రంథము మిక్కిలి ప్రఖ్యాతమయినది. శివభక్తుల కథలకది నిధానము. ఆ గ్రంథమునకు ద్రవిడ భాషలో గొప్ప గౌరవము గలదు. అది 'శేక్కిజ్హార్' అను శివకవిచే రచితమయినది. ఆతఁడు సోమనాథుని కంటె నించుకపూర్వుఁడు. అనపాయుఁడను కులోత్తుంగచోడుని యానతిచే నది రచితమయ్యెనని యందుఁగలదట! రెండవ కులోత్తుంగచోడునకే యనపాయుఁ డని పేరుగలదు గావునను, ఆతఁడు క్రీ. 1145 నాఁటివాఁడు గావునను దత్కృతమయిన పెరియపురాణమున నుండి సోమనాథుఁడు కథల గ్రహించియుండఁగూడును. కాని, చదివిచూడఁగాఁ నాపురాణమునఁ జెప్పఁబడిన కథారీతులకును, బసవపురాణమునఁజెప్పఁబడిన కథారీతులకును సంబంధమంతగా గానరాకున్నది. స్థూలదృష్టినే సోమనాథుఁడు వానిని గ్రహించియుండవచ్చును.

మల్లికార్జున పండితారాధ్యుని శివతత్త్వసారమున సూత్రప్రాయముగాఁ గొందఱు శివభక్తుల కథలు చెప్పఁబడినవి. సోమనాథుఁడాకథలనెల్ల నిందు వివరించినాఁడు. ఇందుఁదిన్నగా వివరింపకున్న వానిఁగొన్నింటిని బండితారాధ్య చరిత్రమునఁజెప్పినాఁడు. బసవ పండితారాధ్య చరిత్రములను రచించు ఫలమునఁ బ్రాక్తనభక్తుల చరిత్రముల వర్ణించి తన వాక్కును బవిత్రపఱుచు కొందునని యాతఁడే చెప్పుకొన్నాఁడు. బసవపురాణ రచనమున కించుక ముందుగాఁ (క్రీ. 1165) హరీశ్వరుఁడను కవిచేఁ గర్ణాటకమున 'శివగణదరగళె' యను గ్రంథము రచితమయినది. అందును శివభక్తుల చరిత్రములే వర్ణితము లయినవి. అదికూడ నీతని గ్రంథరచనముకుఁ దోడ్పడి యుండవచ్చును. మఱియు

సంస్కృతమున శివభక్తుల (అఱువదిమూవుర) చరిత్రములఁ జెప్పుగ్రంథములు గలవు. అవి సోమనాథునికిఁదర్వాతివి కానిచో వానిని గూడ నీతఁడు చూచి యుండవచ్చును.

## బసవపురాణగౌరవము – దాని పరివర్తనములు

సోమనాథోపజ్ఞముగా వెలసినదైనను బసవపురాణము శైవులలో మత గ్రంథముగా బహుప్రఖ్యాతిని బడసెను. ఆంధ్రదేశముకంటెఁ గర్ణాటదేశమున దీనికి గౌరవము మిక్కిలి యెక్కువ. బసవేశ్వరుఁడు పెంపొందించిన వీరశైవము (దీనిస్వరూపము ముందు తెలియును.) హెచ్చుగాఁ గర్ణాటదేశమునఁ బెంపొందెను గాన, తచ్చరిత్రమునకుఁగూడనక్కడ గౌరవమెక్కువ. తన ఘనకృతులు తెనుఁ గుననే వెలయించినవాఁడయినను, సోమనాథుఁడు గూడఁగర్ణాటదేశముననే హెచ్చుగా గౌరవముఁబడసెను. ఆంధ్రదేశమునఁగూడఁనారాధ్యబ్రాహ్మణులకంటె వీరశైవులగు జంగములు లింగబలిజెలు మొదలగువారు దీనిని మిక్కిలి గౌరవముతో నారాధింతురు. శుభాశుభ సమయములందీ గ్రంథమును వారు పారాయణము చేయుచుందురు. ఇందలి యుపాఖ్యానములనేక ప్రబంధములుగా నితర కవులచే రచితములగుటేకాక యీ గ్రంథమే యనేక కవులచే ననేక విధరచనలతో ననేక భాషలలోనికిఁబరివర్తితమయినది. కర్ణాటకమున భీమకవి దీనిని షట్పదివృత్తములలో ముక్కకుముక్కగాఁ బరివర్తించెను. రాఘవాంకకవి 'వృషభేంద్రవిజయ' మనుపేర వృత్తములలో రచియించెను. ఇంకను గన్నడమునఁ బెక్కు గ్రంథములు గలవు. సోమనాథుని తెలుఁగుకృతిని, భీమన కర్ణాటకృతిని ననుసరించి యరవమున నొకకవి బసవపురాణమును బద్యకృతిగా రచియించెను.

తెలుఁగునఁబిడుపర్తి బసవన పద్యకృతిగాక యింకను బెక్కులు బసవపురాణములు గలవు. బెజవాడ వాస్తవ్యుఁడు, శ్రీపతి పండితారాధ్య సింహాసనారూఢుఁడు నగు మహాదేవారాధ్యుఁడొక బసవపురాణమును, బద్యకృతిని రచియించెను. మఱియు నాపస్తంబసూత్రుఁడు, హరితసగోత్రుఁడునగు తుమ్మలపల్లి నాగభూషణకవి వేఱొక బసవపురాణమును బద్యకృతినే రచియించెను.



ద్విపదలుగా, యక్షగానములుగా బసవపురాణమును రచియించిన వారింకను బెక్కురు గలరు. బసవపురాణము సంస్కృతమునకుఁ గూడఁ బరివర్తితమైనది. కాని, యాసంస్కృత గ్రంథమునుజూచి పలువురది మిక్కిలి ప్రాచీనమైనదనియు, దానిఁబట్టియే భాషాగ్రంథములు పుట్టెననియు, నది వ్యాసప్రణీతమనియు భ్రమింతురు. ఆ గ్రంథమందట్లే కలదు. గద్య మిట్లున్నది:

"ఇతి శ్రీ బాదరాయణమహర్షి ప్రణీతే శ్రీబసవేశ్వర పురాణే స్వరూప గ్రంథే పరమరహస్యే స్కందాగస్త్యసంవాదే త్రిచత్వారింశోఽ ధ్యాయః."

ఇది ప్రాచీనమంయినదిగాని వ్యానప్రణీతముగాని కాదనియుఁ గృష్ణామండలమందలి యేలూరిలోఁ గాపురమున్నవారు కందుకూరివారు దీనిని దెనుఁగు బసవపురాణమునుబట్టి సంస్కృతమునకుఁబరివర్తింపఁజేసిరనియు దానిలోని ద్విచత్వారింశాధ్యాయమందలి కథనుబట్టి మనము గ్రహింపవచ్చును. అందిట్లున్నది :–

"కృష్ణాగోదావరీనదుల నడిమిదేశమున హేలాపుర (ఇది యేలూరి కిటీవలి వారు పెట్టినపేరు) మని నగరముగలదు. ఆ నగరమున 'పేరలింగ' మని నీతిశాస్త్ర విశారదుఁడొకఁడు పుట్టఁగలఁడు. అతఁడు లింగధారి; శివార్చనపరుఁడు. ఆయన భార్య వీరమ్మ. వారికి అమృతలింగమని కుమారుఁడు పుట్టును. ఆతఁడు శ్రీశైలమందు మల్లికార్జున దేవునిఁగూర్చి తపమాచరించును. మల్లికార్జునస్వామి ప్రత్యక్షమై నీకుఁ బుత్రుఁడనుగాఁబుట్టుదునని వరమిచ్చును. అట్లే పుట్టును. అతనిపేరు మల్లికార్జునుఁడే. ఆతఁడు మహాప్రాజ్ఞుఁడు; లింగార్చన వ్రతుఁడు. ఆయన జ్యేష్ఠపత్ని గురవమ్మ. వారికి వీరలింగమని కొడుకు పుట్టును. తర్వాత అమృతలింగము, వీరేశ్వరుఁడు, సాళ్వేశుఁడు, మూర్తిరాజు, కూడలిసంగయ్య అను వారు జనింతురు. పిదప నొకనాఁడు స్వప్నమున పాలంకి సదాశివుఁడను తమ గురువురూపముతో శివుఁడు ప్రత్యక్షమై మల్లికార్జుననకిట్లు చెప్పును. "నీగర్భమున నిఁక బసవేశ్వరుఁడు జన్మించును. ఆతనికి బసవేశ్వరుఁడని పేరిడుము. మీకు గురువయినపాలంకి సదాశివాఖ్యుఁడగు నాచే నీ పుత్రులందఱకు లింగధారణముఁ

జేయింపుము” అని. ఆ స్వప్నముచొప్పుననే కొన్నాళ్లకాతనికిఁ గుమారుఁడు కలుగును. ఆతనికి బసవేశ్వరుఁడని పేరిడుదురు. వారియింటిపేరు కందుకూరివారు. ఆతఁడు మహావిద్వాంసుఁడు, మహాదాత, అనేక రాజసమ్మానితుఁడు నగును. ఆతనికి గంగమ్మయని వీరమ్మయని యిర్వురు భార్యలగుదురు. అందు వీరాంబాబసవేశ్వరులయోగము గౌరీశంకరుల యోగమువలె శాశ్వతమైవెలయును” అని యాయధ్యాయము కథాసారము.

ఏలూరిలో కందుకూరివారని ప్రఖ్యాతులగు నారాధ్యబ్రాహ్మణులు నేఁడు నున్నారు. అత్తలూరిపాపకవి చెన్నబసవపురాణమును గృతినందినవారాయింటివారే. సోమనాథుని ద్విపద బసవపురాణము నింతకుముందుఁ జక్కఁగా నచ్చునఁ గూర్పించినవారావంశమువారే. ఆ గ్రంథముచివర వారు తమవంశావళినిగూడఁ జేర్చిరి. ఈ సంస్కృతబసవపురాణమున వర్ణితుఁడగు బసవేశ్వరుని నావంశావళిని బట్టి గుర్తింపనగును.

శంకరకవికృతిగా సంస్కృతబసవపురాణమును గర్ణాటక కవిచరిత్ర పేర్కొనుచున్నది. అది యిదిగాక వేఱొకటి కావచ్చును. ఏలనగా నిదివ్యాస ప్రణీతమని కలదు.

## బసవేశ్వర చరిత్రము

### (బసవపురాణమునుబట్టి)

శ్రీశైలమునకుఁబశ్చిమభాగమునఁగర్ణాటదేశమున హింగుళేశ్వర భాగవాటియను నగ్రహారముగలదు. (ఇది యిప్పటి బిజపూరు జిల్లాలో నున్నది.) అందు మండెఁగ మాదిరాజనుబ్రాహ్మణుఁడు గలఁడు. ఆయన భార్య మాదాంబ. నందీశ్వరుఁడామె గర్భమునఁ బుత్త్రుఁడై జనించెను. ఆ బాలుని జననవేళకుఁ గూడలి సంగమేశ్వరదేవుఁడు తాపసవేషమున వచ్చి లింగార్పితమాతనికిఁ గుడుపవలదని మాదాంబకు బోధించిచనెను. తల్లిదండ్రులు బసవఁడని యా శిశువునకుఁ బేరిడిరి. గర్భాష్టమవర్షమున నాతనికిఁ దండ్రి యుపనయనముచేయ



యత్నించెను. భక్తివేఱు, బ్రాహ్మ్యమువేఱు గావున భక్తుఁడగు తనకు బ్రాహ్మ్యమక్కఱలేదని చెప్పి తండ్రితో వాదించి బసవన యుపనయనము చేసికొనఁడయ్యెను. తల్లిదండ్రులతో వేర్పడి తనసహోదరి నాగమాంబతో నాతఁడిల్లువీడి వెలికిఁజేరెను. మాదాంబసోదరుఁడును, కళ్యాణకటకము నేలుచున్న బిజ్జలుని దండనాయకుఁడును నగు బలదేవుఁడు వారి నాదరించెను. భవికిఁ బుత్త్రిక నీయనని పూనిక గల్గియున్నవాఁడు గావున నాబలదేవదండనాయకుఁడు తనకూఁతురగు గంగాంబను బసవనికిచ్చి పెండ్లిచేసెను. ఆ వింతపెండ్లికి లోకులాశ్చర్యమందిరి. పిదప బసవన్న, గంగాంబ, నాగాంబ ముప్వురును గూడలిసంగమేశ్వరుని దర్శింప నేఁగిరి. సంగయ దేవుఁడు మునుపటి విధమునఁ దాపసవేషముతో గుడిముందు ప్రత్యక్షమయ్యెను. బసవన యారాధించెను. శివభక్తులదుశ్చరిత్రములు మేలుగానే గ్రహింపుమనియు, శత్రులయినను లింగవంతులను మిత్రులనుగానే చూడుమనియు ప్రాణాపాయము వచ్చినను బూనినవ్రతము విడువకుమనియు, భక్తులజాతుల విచారింపకుమనియు, శివద్వేషులను జంపుమనియు, వేదశాస్త్రార్థ సంపాదితమైన భక్తిని లోకమున నెలకొల్పుమనియు, – ఇత్యాది విధముల సంగయదేవుఁడు బసవనికి హితోపదేశము చేసి గుడిసొచ్చి యంతర్ధానమయ్యెను. భక్తులెల్లరు నబ్రమంది బసవనను బ్రస్తుతించిరి.

బలదేవదండనాయకుఁడు శివలోకమున కేఁగెను. ఆతని దండనాయక పదమును బిజ్జలుఁడు బసవని కొసఁగెను. బసవన కళ్యాణ కటకమునకుఁ జేరెను. ఆతని యాదరువున నసంఖ్యాకులుగా శివభక్తులు కళ్యాణమునకుఁ జేరుచుండిరి. అప్పుడు కళ్యాణముననున్న శివభక్తుల సంఖ్య లక్షయు నెనుబదివేలని పండితారాధ్యచరితమందుగలదు. మిండ జంగములే పండ్రెండువేలుండెడు వారట! ఇందఱకును బసవన యీప్సి తార్థములు సంఘటించుచుండెడివాఁడు. బసవనసోదరియగు నాగాంబకుఁ జెన్న బసవన్న యని కొడుకు గల్గెను. ఆతఁడు బసవన తర్వాత బసవన యంతవాఁడు. మేనమామ నాతఁడెంతయుఁ నారాధించుచు శిష్యుఁడై యాతని యాజ్ఞలో మెలఁగుచుండెను.

అల్లమప్రభువను శైవాచార్యుఁ డొకనాఁడు బసవనియింటికి వచ్చెను బసవన యామహనీయునకు విందువెట్టెను. ఆతఁడు బసవనికి బెక్కువరము లొసఁగెను. అప్పటనుండి బసవన యనేకాద్భుతకృత్యములఁ జేయఁజొచ్చెను.

ఒకనాఁడు దొంగతిఁకము చేయుటకయి కొందఱు దొంగలు భక్తులువోలె వంగకాయలు లింగములుగాఁ గట్టుకొని బసవనయింటి కరుదెంచిరి. బసవనచూచి వారిని గుర్తించి దయచేయుఁడని యాహ్వానించి "లింగభక్తులు గానివారు నా యిల్లు సొరరాదుగాన మీరు మాహేశ్వరులే. లింగార్చనలు సేయుఁ"డని వేఁడెను. దొంగలు జడిసి కూర్చుండిరి. బసవన వారికి వాంఛితార్థ మొసఁగెను. వారి మెడలోని వంగకాయలు నిజముగా లింగములయ్యెను.

ఒక భక్తుఁడు బసవనికడకువచ్చి నిత్యలింగార్చనమున ముగ్గువెట్టుటకు గాను పదిపుట్లముత్తెములు కావలెననఁగా బసవన చూచిన మాత్రనే జొన్నలరాశి ముత్యములుగా మాఱెను. దాని నాభక్తున కొసఁగెను. ఈ విధముగా నెడలేక శివభక్తుల కాతఁడు దానము సేయుచుండుట నెఱిఁగి సంగయదేవుఁ డొకనాఁడు జంగమరూపమునవచ్చి 'నాకు మూఁడవకన్నొసఁగు' మనికోరెను. లింగపసాయితమను ఖడ్గమునుబూని 'నీమాయ నేనెఱుఁగనా? యిదె చూచుకొమ్మ' ని యుద్ధమున నాయనకు ముక్కన్నుఁజూపెను. లజ్జించి సంగయదేవుఁడు మాయమయ్యెను. 'ఇసీ! పాఱిపోయితివా? వారు వీరు వలె నిన్ను, నేను వరమడుగువాఁడ ననుకొంటివా? నీ భక్తులారగింపఁగా మిగిలిన ప్రసాదమే కలకాలము నాకుఁ గలదు. నీకేమైనవలయునేని కోరుము; నేనొసఁగెదను. మాట తప్పువాఁడనుగాను; నీయాన! నీ ప్రమథులయాన!' యని గద్దించి యాదేవు నోడించి బసవన గెలిచెను.

ఒకనాఁడు బిజ్జలునికొల్వునఁ గూర్చుండి వ్యవహారము నడపుచు బసవన నడుమ నసందర్భముగా "వెఱవకు వెఱవకు " మనుచుఁగడువఁబై కెత్తువిధమునఁ జేతులు పైకెత్తెను. బిజ్జలుఁడు నవ్వి! 'ఏమయా నీకు భక్తిరసము తలకెక్కెనా? శైవపుఁబిచ్చియెత్తెనా? అదియేమి అట్లసందర్భముగా మాటాడితివి? చేతులెత్తితివి?' అని యడిగెను. 'త్రిపురాంతకుని గుడికిఁ దూర్పున (ఇది కళ్యాణ కటకమునఁ గలదే.) గపిలేశ్వరమున నొకతపస్వి యనుదినము నాఱుపుట్లపాలతో శివునభిషేకించు చున్నాఁడు. ఆ పాలు వీథివీథులను గాలువలుగట్టి పాఱుచున్నవి. చల్లమ్ము గొల్లది యొకర్తె నెత్తిపైఁ గడువఁబెట్టుకొని యటపోవుచుఁగాలుజారి పడఁబోవుచు "బసవయ్యా" అని పిలిచెను. ఆమెకుఁదోడ్పడితిని. ఆ గొల్లదాని రూపిట్టిది; దాని యిల్లిట్టిది; విచారించి కనుఁగొనుము' అనెను. రాజు విచారింపగా నదియట్లే జరిగినట్టు తెలిసెను. అబ్బురమంది రాజుబసవననారాధించెను.



సొన్నలికపురమున శ్రీశైల మల్లికార్జునిని వెలయించి లక్షతొంబదివేల శివలింగములఁబ్రతిష్ఠించి మర్త్యములోని యన్నపానముల ముట్టక, సహజమకుటము, నొసలికన్నుగలిగి, మేనినీడ, అడుగుజాడ, గానరాకుండఁ గైలాసముదాఁకఁ జరించువానిని సిద్ధరామయ్య యను మహనీయుని నడిగి యొకప్పుడు శివభక్తులు కొందఱు బసవన యిహముననేకాక శివలోకమునను గూడఁగానవచ్చుట నెఱిఁగిరి.

మిండజంగముల మిండతిఁకపు ముచ్చట్లకుఁగాను బొక్కసముసఁగల ధనమెల్ల బసవన వెచ్చపెట్టుచుండఁగా నుద్యోగులు బిజ్జలున కెఱిఁగించిరి. బిజ్జలుఁడు బసవనిఁ బిలిచి 'యట్లుచేయుట పాడియా' యని యడిగెను. 'ఒడయల సొమ్మే యొడయల కిచ్చితిఁ గాని మీధనముగా'దని బసవన యనెను. లెక్కలు చూపెను. బొక్కసపుఁదాళములు దెఱచి చూచుకొమ్మనెను. చూడఁగా లెక్కకు మిక్కిలియై బొక్కసమున ధనముండెను. బిజ్జలుఁడు నివ్వెఱ చెందెను.

బసవనభార్య గంగాంబ కట్టుకొనిన చీరఁ దెచ్చియిచ్చినఁ గాని చేరనియ్య నని వేశ్య యొకమిండజంగమున కానవెట్టఁగా నాతఁడు వచ్చి యడిగినంతనే బసవన తన భార్యచేత నా చీర నిప్పించెను. ఇట్లు పలువురు మిండజంగములకు వాంఛితార్థము లొడఁగూర్చెను.

జాతిభేదముఁ బాటింపక బసవన భక్తులయినచో మాలమాదిఁగలనుగూడ నారాధించుచుండెను. వారు కుడిచి డించిన యుచ్ఛిష్టమును భుజించుచుండెను. వారితోఁ జెయిచెయిఁగలపి తిరుగుచుండెను. ఇది నయిపఁజాలక

రాజపురోహితులు రాజుతో విన్నవించిరి. 'కళ్యాణకటకమెల్ల బసవని మూలమునఁ జెడుచున్నది. వర్ణాశ్రమధర్మములిఁక నిలుచునట్లులేవు. ఆతఁడు మాలమాదిఁగలతో భుజించుచున్నాఁడు; మరల నీ నగరిలోనికి మర్యాదగా వచ్చుచున్నాఁడు. శివనాగుమయ్య యనుమాలనితో నిప్పుడు దిరుగుచున్నాఁడు చూడు'మని యాతనికిఁజూపిరి. రాజు కోపించెను. బసవన వాదించెను. వీరమాహేశ్వరులకు జాతిభేదము పరికింపరాదనెను. బ్రాహ్మణులకంటె, భక్తులే యధికులనెను. శివనాగుమయ్య హస్తమునుబట్టి యొత్తిదాననుండి పాలు చిమ్మిరేఁగుటను బిజ్జలాదులకుఁజూపెను. బ్రాహ్మణులోడిపోయిరి. బసవనివాదమునకు లోఁగి బిజ్జలుఁడు శివనాగుమయ్యకు మ్రొక్కెను. ఏనుఁగు నెక్కించి యూరేఁగించి బసవయ్య శివనాగుమయ్యను దనయింటికిఁ గొంపోయెను.

## కళ్యాణపురమున నప్పు డీపేళ్ళవారు భక్తులుండిరి

(బసవ. పు. 226 చూడు.)

(రుద్రునిమాఱట రూపంబు లనఁగ – భద్రేభసంహరు ప్రతినిధులనఁగ
కళ్యాణమున నిత్యకల్యాణభక్తి – లౌల్యనిరర్గళ లాలిత్యముగను
మడివాలుమాచయ్య మాదిరాజయ్య – బడవరబ్రహ్మయ్య బాచిరాజయ్య
కిన్నర బ్రహ్మయ్య గేశిరాజయ్య – కన్నడ బ్రహ్మయ్య గల్లిదేవయ్య
మోళిగమారయ్య ముసిఁడిచౌడయ్య – శూలదబ్రహ్మయ్య సుతియచౌడయ్య
కలికేతబ్రహ్మయ్య గక్కయ్యగారు – తెలుఁగేసు మసనయ్య దెలుఁగు జొమ్మయ్య
శాంతదేవుండును జమ్మయ్య బాస – వంతు కేసయ్య యేకాంతరామయ్య
యుత్తమాంగద కేశిహొన్నయ్య గండ – గత్తెరనాచయ్య గాలాగ్ని రుద్రి
శృంగిబొప్పయగారు [1]సిగురుచందయ్య– డింగరిమల్లయ్య సంగమేశ్వరుఁడు
కదిరెరెమ్మయ మహాకాళయ్యగారు – పదుమరసును బురాణదమాయిభట్టు
నుదరదరామయ్య యోగిదేవయ్య – యుదయమరసుగారు హొన్నయ్యగారు
ధవళయ్యగారు బొంతాదేవిగారు – సవరద[2]చిక్కయ్య సారెనాయండు

1. శివకుమారుండు, 2. చక్కయ్యగారు



శివముద్దుదేవుండు సిక్కదేవుండు –శివరాత్రి సంగయ్య యవిముగతయ్య
చండేశుచామయ్య ముండబ్రహ్మయ్య – బండె [1]యరేవణ్ణ [2]యిండెసోమన్న
హాటకేశ్వరుని బ్రహ్మయ మహాబలుఁడు – కోటేశుచామయ్య గొగ్గయ్యగారు
దుమ్మదబ్రహ్మయ్య ధూర్జటికేశి – యెమ్మెసంగయ గపిలేశు విస్సయ్య
నొణిమేశుచిక్కయ నులుకచందయ్య – గణదాసిమాదన్న [3]గంటిమల్లయ్య
మురహాటకేతయ్య హరవిహొల్లయ్య – గిరిగిఁటు సింగయ్య గురజకాళవ్వ
బానసభీమయ్య భాస్కరయ్యయును – గోనియమల్లయ్య గొగ్గయ్యగారు
అల్లయ్యమధుపయ్య యనిమిషకేశి – హొల్లయ్య గోడలమల్లయ్యగారు
ఓలెబ్రహ్మయ కరహాళమల్లయ్య – బాలబ్రహ్మయగారు పణిహారిబాచి
కవిలెబ్రహ్మయ బందికారమల్లయ్య – యవకరకేతయ్య శివనాగుమయ్య
నిజలింగచిక్కయ్య నిర్లజ్జశాంతి – నిజభావుఁడును నిత్యనేమదమైలి
యంకబ్రహ్మయ గరహాళ బ్రహ్మయ్య – సుంకేశుబంకయ్య లెంకమంచయ్య
యేలేశుబ్రహ్మయ్య యీడెబ్రహ్మయ్య – మైలనబ్రహ్మయ్య మాయిదేవయ్య
చక్కెరబ్రహ్మయ్య శరణయ్యగారు – చిక్కబ్రహ్మయ్యయు సిరిగిరయ్యయును
వీరమారయ్యయు వీరలింగయ్య – వీరబ్రహ్మయ్యయు వీరభావయ్య
వీరనాగయ్యయు వీరకల్లయ్య – వీరభోగయ్యయు విమలదేవయ్య
[4]కక్కయ్యగల్లయ్య గాటకోటయ్య – చిక్కయ్య వీరయ్య శ్రీసూరసాని
కొండగుద్కేతయ్య గుండయ్యగారు – చండేశుబ్రహ్మయ్య శంకరయ్యయును
అమృతదేవయ్యయు ననిమిషయ్యయును – విమలదేవుండును వీరాదిగాఁగ
శివభక్తిసంపదల్ సిలివిలివోవ – సవిశేషభక్తి దృష్టప్రత్యయములఁ
జూపుచుసద్భక్తి సురుచిరమహిమ – నేపారు వీరమాహేశ్వరావలికి.

కల్యాణపురమున బసవని బలఁగమును జూచి శివార్చకులు, పాశుపతులు మొదలగువారనేకులంతకు ముందు లింగము లేనివారయినను నప్పుడు

1. యుదే, 2. మిండ. 3. కరియ, 4. చిక్కబ్రహ్మయ్యయు శ్రీగిరయ్యయును – కక్కయ్య నల్లయ్య కాటకోటయ్య

లింగవంతులయి వీరమాహేశ్వరులు కాఁజొచ్చిరి. అంతకుముందు శివాలయములందు దేవలకులు బోయలకు శివప్రసాద మొసఁగు చుండెడివారు. బసవన్న మతము వచ్చిన తర్వాత వారు శివప్రసాదమును దామే భుజింపఁ జొచ్చిరి. బోయలకియ్యరయిరి. పెద్దతగవేర్పడెను. బోయలు బిజ్జలుని దర్శించి మొఱపెట్టుకొనిరి. బిజ్జలుఁడిదియేమి యన్యాయ్యమని బసవనిఁ బిలిచి యడిగెను. బసవన వాదించెను. "శైవులవలనఁ బ్రసాదము బోయలకుఁ బోవచ్చునుగాని వీరమాహేశ్వరులవలన బోయలకుఁ జెల్లఁగూడ" దనెను. "కాదందురేని, నేను సంగమేశ్వరదేవునకు నేఁడు విషమర్పింతును. బోయ లారగింతురుగా" కనెను. "వివిధ పక్వాన్నములారగింప మీరును, విషమారగింప మేమునా" యని బోయలు మొఱవెట్టిరి. "శివున కర్పించి విసము బసవన యారగించునది. ఆతఁడు చావకున్న నిఁక మీఁదఁ బ్రసాదము మాకక్కఱలేదు. చచ్చిన మాకీయవలయు" నని బోయలనిరి. బిజ్జలుఁడంగీకరించెను. బసవన్న యట్లే సంగయదేవునకు విషనైవేద్యము వెట్టి తానును దక్కిన భక్తులు నారగించిరి. బోయలు తగవు విడిచి శరణాగతులయిరి. బసవఁడనుగ్రహించెను.

జగదేవుఁడను దండనాయకుఁడు (ఈతఁడును బసవనగోష్ఠిలోనివాఁడే కాని యప్పటి కింకను, వర్ణాశ్రమధర్మముల విడనాడలేదు) తన యింట శుభకార్యముఁ జేసికొనుచు, బసవన్నను భోజనమునకు రమ్మని ప్రార్థించెను. ఆతఁడు శరణులరాకకోర్వఁగలవేని వత్తుననెను. జగదేవుఁడు వంటకము కాఁగానే బసవన రాకకుఁబూర్వమే బ్రాహ్మణ సమారాధనము గావింపఁజొచ్చెను. పరిచారకుఁడొకఁ డీ వార్త బసవనకుఁజెప్పెను. ఆతఁడు గోపించి తాను భోజనమునకుఁబోవకుండెను. తర్వాత నా జగదేవుఁడు బసవనను బిలుచుకొనిపో వచ్చెను. బసవన తెర యడ్డము గట్టించెను. భక్తజనాళినుండి తొలఁగిపొమ్మని జగదేవునిఁదెగడెను. "ఈశ్వరభక్తుఁడవై యుండి కర్మచండాలురతోఁగలసి కుడిచితివి; పాపివి; పోపో"మ్మనెను. పెక్కుదెఱఁగుల గర్హించెను. జగదేవుడు "కర్మబద్ధుఁడనైతిని; పాపిని. నాకిఁకఁ బ్రాయశ్చిత్తము లేదు. ప్రాణము విడుతును" అని మొఱవెట్టెను. భక్తుల యనుమతిని బసవన్న యిట్లు చెప్పెను. "ఇఁకఁగొలఁ



ది దినములలో నీ కళ్యాణకటకమున శివద్రోహము పెంపొందఁగలదు. అప్పుడు శివద్రోహిని జంపుదునని నీ విప్పుడు మాటయిత్తువేని నీ యీ తప్పిదమును శివుఁడు మన్నించును." జగదేవుఁడందులకంగీకరించి వీరతాంబూలము గొనెను. బసవన భక్తులతో జగదేవునింటికిఁబోయి భోజనము చేసెను.

బసవని మాహాత్మ్యమెతిఁగియుఁగాలము సమీపించుటచేఁ గొన్నాళ్లు సన్న పిదప, బిజ్జలుఁడు బసవమతమునఁజేరినయల్లయ్య, మధువయ్యలను వారినిద్దఱను బిలిపించి కారణమేదో తెలుపకుండనే కన్నులు పెఱికించెను. బసవన మొదలగువారిఁక నీయూర నిలువరాదని నిశ్చయించుకొని జగదేవునిఁ బిలిచి 'యిదిగో, నీబాస చెల్లించుకోవలసిన సమయము వచ్చిన'దని చెప్పి కళ్యాణకటకము పాడగునట్లు శపించిరి. అప్పుడు మడివాలుమాచయ్య, చౌడరాయఁడు, ఏకాంతరామయ్య, కిన్నరబ్రహ్మయ్య, కేశిరాజయ్య, కన్నడ బ్రహ్మయ్య, కక్కయ్య మొదలగువారితో బసవన కప్పడి సంగమేశ్వరమున కేఁ గెను. కటకము పాడుపడెను. అపశకునము లనేకములు దోఁచెను. జగదేవుఁడు మల్లయ బ్రహ్మయలను వారిర్వురు దోడురాఁగా నొకనాఁటిరాత్రి బిజ్జలునిఁబొడిచి చంపెను. తర్వాత నాతఁడు దన్నుఁదాఁబొడుచుకొని మరణించెను. పిదప బిజ్జలుని బిడ్డలు రాజ్యార్థమై యుద్ధముచేసి మృతిఁజెందిరి. బసవన కూడలి సంగమేశ్వరమున సంగయదేవునిలోఁజేరెను.

## బసవన చరిత్రము

(చెన్నబసవపురాణమునుబట్టి)

చెన్నబసవపురాణము ప్రధానముగా బసవన మేనల్లుఁడు చెన్నబసవని చరిత్రమును దెలుపుచున్నది. కాని, బసవనిచరిత్రముగూడ నిందుఁగలదు. బసవని చరిత్రము విషయమున నిది బసవపురాణముతోఁగొంత వేర్పడుచున్నది. అందుఁ జెప్పఁబడని క్రొత్త విషయములను ముఖ్యభేదములను మాత్రమిక్కడఁజూపుచున్నాఁడను.

బసవని తోఁబుట్టువగు నాగమ్మకుఁబెండ్లికాలేదు. భర్తలేకయే యామెకుఁ జెన్నబసవన్న పుట్టినాఁడు. బహుకాల ప్రయత్నమున బసవన కక్కయ్యయను

భక్తవరుని ప్రసాదమును బడసి దానిని దన యుత్తరీయము కొంగునఁగట్టికొని యింటికి వచ్చెను. ఆతని పరోక్షమున నాగమ్మ దానిఁజూచి కక్కయ్యగారి ప్రసాదమును దనకొఱకై సహోదరుఁడు దాఁచితెచ్చెనని తలఁచి యారగించెను . తర్వాత బసవన దానారగించుటకై వెదకి నాగమ్మ యారగించుటను దెలిసికొని తన కాభాగ్యము లేకపోయినందుకుఁ జింతిలి తన సహోదరి భాగ్యవిశేషమున కబ్బురపడెను. తత్ప్రసాదాస్వాద మాహాత్మ్యముచే నాగమ్మ గర్భమునఁగుమారస్వామి యంశమునఁజెన్న బసవన్న పుట్టెను బసవన్నకంటె మిక్కిలి యందగాఁడగుటచే నీతనికిఁజెన్నబసవన్న యన్న పేరేర్పడెను. [1]బిజ్జలుఁడు నీలలోచనయని పేరుగలదానిఁ దన చెల్లెలిని బసవనకిచ్చి పెండ్లిచేసినట్లు చెన్నబసవపురాణమునఁ గలదని కొందఱు వ్రాసిరి. తెలుఁగు చెన్నబసవ పురాణమున నాకది గానరాలేదు.

బిజ్జలుని జగదేవాదులు చంపిన పిదప బిజ్జలుని పుత్రులు మొదలగువారు కొన్నాళ్లకు బసవనను, చెన్నబసవనను, దదాప్తులను జంపుటకై దండువెడలిరి. అప్పటికి బసవన కూడలి సంగమేశ్వరమున సంగయదేవునిలోఁ జొచ్చెను. చెన్న బసవాదులను వారరణ్యమధ్యమున నడ్డగించిరి. చెన్నబసవేశ్వరుని మాహాత్మ్యమున నందు నంధతమసము క్రమ్ముకొనఁగా యాదవులు పరస్పరము పొడుచుకొని చచ్చినట్టుగా నాసేనయెల్ల గొట్టికొనిచచ్చెను. పిదప భక్తులతోఁజెన్నబసవన్న హుళికపట్టణముఁ జేరి యక్కడి రాజుచే సమ్మానితుఁడై కొన్నాళ్లకక్కడనే లింగైక్యమందెను.

1. బిజ్జలుని సోదరి నీలలోచనయనుదానిని బసవన పెండ్లాడెనని, శివావతారమయిన యల్లమప్రభువు కల్యాణము విడిచి శ్రీశైలమున నరఁటిచెట్టులో లింగైక్యమందె నన్నవార్త విని కూడలి సంగమేశ్వరమున బసవన లింగైక్యమందెనని, అది శక 707లో నని, చెన్నబసవపురాణము చెప్పుచున్నట్లు, ఫ్లీటు మొదలగువారు వ్రాసిరి. తెలుఁగున బసవపురాణమునఁగాని, చెన్నబసవపురాణమునఁగాని యీ విషయములు గానరావు. కన్నడ చెన్నబసవపురాణమున నుండియుండును. తెలుఁగు చెన్నబసవపురాణకారుఁడు (అత్తలూరి పాపకవి) పాల్కురికి సోమనాథుని బసవపురాణమునకు విరుద్ధములుగానుండు విషయములను గొన్నింటిని గుర్తించి తన కృతిలో వానిని విడిచినట్టున్నాఁడు.



## బసవనచరిత్రము

(బిజ్జలరాయనిచరిత్రమును బట్టి)

బిజ్జలుఁడు జైనుఁడు. బసవనకుఁబద్మావతియని పేరు గల తోఁబుట్టువు గలదు. ఆమెను బిజ్జలుఁడు పరిగ్రహించెను. పద్మావతి మీఁది వ్యామోహమున బిజ్జలుఁడు జాగ్రత్తగొనక రాజ్యభారమును మంత్రియగు బసవనకప్పగించెను. మాలలు మాదిఁగలు మొదలగు తక్కువ జాతులవాండ్రకు లింగములుగట్టి మాహేశ్వరులని పేరుపెట్టి కులమర్యాదలను సదాచా రములను వీటిఁబుచ్చి బసవన గొప్ప సాంఘికవిప్లవము గలిగించెను. రాజుప్రాభవమును గుంచించెను; అకృత్యములనేకములు గావించెను; జైనులను జంపించెను. బిజ్జలునకీతని దుష్పరిపాలనము దుస్సహముగా నుండెను. పరస్పరము వారిలో వైమనస్య మేర్పడెను. కొల్లాపురపు శిలాహారరాజయిన మహామండలేశ్వరుని జయించి కల్యాణమునకుఁ దిరిగివచ్చుచుండగాఁబసవన పంపిన జంగమొకఁడు జైనవేషముతో వచ్చి దర్శించి బిజ్జలునకు విషఫలమొసఁగెను. దానిని వాసనచూచి యాతఁడు మృతిఁజెందెను. చనిపోవుచుఁదన కుమారుఁడయిన యిమ్మడి బిజ్జలునితో “బసవన చేయించిన పని యిది! కావున వానిని జంపుము” అని చెప్పెను.

బిజ్జలుని తర్వాతఁదత్పుత్రుఁడయిన యిమ్మడిబిజ్జలుఁడు రాజయి బసవన్నను బట్టుకొనుటకయి తన దండనాయకులను నియోగించెను. జంగములనేకులను బాధించెను. కేరళ దేశమునకుఁబారిపోయి బసవన్న యక్కడ నిమ్మడిబిజ్జలుని సైనికుల రాకకు జడిసి బావిలోఁబడి మృతిఁజెందెను. ఆతని భార్య నీలమ్మ విషము తిని చచ్చెను. “మరణాంతాని వైరాణి” గనుక నిమ్మడిబిజ్జలుఁడంతతో శాంతుఁడయ్యెను. చెన్నబసవన్న తన మేనమామయగు బసవన్నకున్న ధనకనకవస్తు వాహనాదులను రాజున కిచ్చివేసెను. రాజను గ్రహింపఁగాఁజెన్న బసవన్న రాజమంత్రి యయ్యెను.

## ఏది విశ్వాస్యము?

ఇట్లు బసవని చరిత్రము మూఁడు గ్రంథములందును భిన్నవిధములతో నున్నది. వీనిలో విశ్వాస్యమేదియని యించుక విచారింపఁదగును. బసవపురాణము

బసవని లింగైక్యమునకుఁదర్వాత ముప్పదినలువదియేండ్లకు రచితమయినది. చెన్నబసవపురాణము మఱి నన్నూఱేండ్లకుదర్వాత (క్రీ. 1560)ను, బిజ్జలరాయచరిత్రమంతకింకను దర్వాత (క్రీ. 1600) ను రచితమయినవి. కావున వీనిలో బసవపురాణమే మన కెక్కువప్రమాణముగా గ్రహింపఁదగినది. ఫ్లీటు మొదలగువారు, తెలుఁగు బసవపురాణమును దాని ప్రాచీనతను గుర్తింపమిచే మూఁడు గ్రంథములను సమానదృష్టితోఁజూచిరి. దేనికిని వారంతగాఁ బ్రామాణ్యమునంగీకరింపరయిరి.

బసవపురాణమునఁ జెప్పఁబడిన విషయములకును, బిజ్జలుని శాసనములఁ బట్టి యెఱుఁగనగుచున్న విషయములకును విరోధ మేమియుఁ గానరాదు గాని, బిజ్జలుని శాసనములెన్నేని వెలసియుండఁగా నందొక్క దానియందేని బసవనిఁ గూర్చి కాని, వీరశైవమును గూర్చి కాని యే విధమయిన ప్రశంసయుఁ గానరాకుండుట కొంత వింతగాఁదోఁచును. బసవ పురాణమునుబట్టి చూడఁ గా బిజ్జలుని యొద్ద బసవనిమంత్రిత్వ మానాఁడు పశ్చిమచాళుక్యరాజ్యమున గొప్పయలజడిని మత సంక్షోభమును గలిగించినట్టు కన్పట్టును. ఇంత యలజడి కలిగినప్పుడది బిజ్జలుని శాసనములలోని కేవిధముగానేని యెక్కి యుండఁ దగును.

బసవపురాణమున వర్ణితములయిన కథలెల్లనవి యట్లే జరిగినవని చెప్పనలవిగాదు. మడివాలుమాచయ్య, తాను పూర్వదినమునఁజంపిన మనుష్యుని మర్నాడాకాశముననుండి యవతరింపఁజేయుట, బసవన జొన్నల ప్రోవును ముత్యాల ప్రోవునుగాఁజేయుట మొదలగువాని నీ కాలము వారెవ్వరు నమ్ముదురు? అవి యసంభావ్యములు కావనుటకుఁదగ్గ కాలమింకను రాలేదు. చరిత్రపరిశోధనమున మనమిట్టివానినర్థవాదములనుగాఁ గొట్టివేయు చుందుము. ఇట్టి యద్భుతకథలు; మతముతో భక్తితో సంబంధించిన సర్వ స్థలములందును గలవు. కాని, బసవనను గూర్చి పాల్కురికి సోమనాథుఁడు చెప్పిన యద్భుత కథలలో నొక్కదానిని మాత్రము బసవన సమకాలమువాఁడే యగు మల్లికార్జున పండితారాధ్యుఁడు గూడ శివతత్త్వసారమున మూఁడు పద్యములలోఁ గొండాడినాఁడు.



క. అసమేక్షణ! శివభక్తుం
డసమశ్రేష్ఠుఁడని పలికి యన్యులతోడన్
బొసపోరై బండారువు
బసవన విసమెత్తి త్రావి బ్రదుకఁడె రుద్రా!

క. వసుధ నుమేశుఁడె దైవము
ప్రసాదమె పవిత్ర మీశుభక్తులె కులజుల్
పొసపోరని బండారువు
బసవన విసమెత్తిత్రావి బ్రదుకఁడె రుద్రా!

క. కుసుమశరారీ! శివలిం
గసమేతులు దక్కఁ బొందఁగా నిది నిర్మా
ల్యసుఖంబని బండారువు
బసవన విషమెత్తిత్రావి బ్రదుకఁడె రుద్రా!

ఇది జరిగినను జరగియుండవచ్చును. పరతత్త్వము శివుఁడే యని త్రికరణశుద్ధిగా నమ్మిన మహాభక్తుఁడు, బసవేశ్వరుఁడు నిర్భయముగా నిస్సంశయముగా నిబ్బరించి లింగమూర్తిపై భారమువైచి నిజముగా విషము ద్రావి యుండవచ్చును. సంకల్ప బలమున నీశ్వరానుగ్రహమునఁజెక్కు చెదరక నిలిచి యుండవచ్చును. అది యసంభావ్యమని నేఁడు మనమనుకొనఁ బనిలేదు. ఉత్తమయోగ్యతలేవియు నుండకయే సీతారామనామకుఁడొక యొడ్డీఁడు నేఁడు విషమును, గరఁగించిన సీసమును, నింక నెన్నింటినోకూడఁ దినుచు సర్వభక్షకుఁడని పేరంది నిరపాయముగా నుండుటను మనము వినుచుంటిమి; కనుచుంటిమి.

బసవన తోఁబుట్టువును బిజ్జలుఁడు పరిగ్రహించుటను గాని, బిజ్జలుని తోఁబుట్టువును బసవన పరిగ్రహించుటను గాని సోమనాథుఁడు వాకొనలేదు. అవి నమ్మఁదగినవిగా నాకు దోఁపవు. బసవన తోఁబుట్టువగు నాగాంబ భర్త లేకయే కొడుకును గనెనని చెన్నబసవపురాణము చెప్పుచున్నది గాని, యదియు నేఁటికింకను మనకసంభావ్యముగానే తోఁచుచున్నది. బసవపురాణమున నామెకుఁ

జెన్న బసవన్న యని కొడుకు గల్గినట్టు కలదే కాని, యామెకుఁబెండ్లి జరగినదో లేదో, యామె యాకొడుకు నెట్లుగనెనో తెలియవచ్చుట లేదు. బసవన్న తండ్రితోఁ దగవులాడి యిలువీడి వచ్చునప్పుడే యామెయు సోదరునితో నిలువీడినది. బసవన యుపనయనము చేసికొననట్లే యీమె వివాహమును జేసికొనలేదా? ఈ సంశయమే కక్కయ్యగారి ప్రసాదపుఁగథకుఁగారణమై యుండును. జైనులు శైవులు పరస్పరము ద్వేషము గలవారగుటచేఁజెన్న బసవపురాణమున వీరొక కథను గల్పింపఁగా బిజ్జలరాయ చరిత్రమున దీనికిఁబ్రతికూలముగా వారొక కథను గల్పించిరి. చెన్నబసవ పురాణమున నీలలోచన యను బిజ్జలుని సోదరిని బసవన పరిగ్రహించినట్లుండఁగా, బిజ్జలరాయ చరిత్రమున బసవనసోదరి యగు పద్మావతిని బిజ్జలుఁడు పరిగ్రహించినట్లున్నది. మఱియుఁజెన్న బసవపురాణమునఁ జిత్రకన్యకథ యని యసభ్యపుఁగథ యొకటి గలదు. అది యిది :– బిజ్జలునికి సౌందర్యవతియగు సోదరిగలదు. ఆమె గుఙ్టాల కాపరిని గూడెను. బిజ్జలునకది తెలిసెను. "బసవని సోదరియగు నాగమ్మ పెండ్లి లేకుండనే చెన్న బసవన్నను గన్నందుకు నేను బరిహరించితిని. దానికిఁబ్రతిగా నాకే యిట్టి యవమానము దాపరించెను." అని దుఃఖించి యాతఁడా గుఙ్టపుఁగాపరిని జంపించెను. చిత్రకన్యను జిత్రవధచేయఁదలారుల కాజ్ఞాపించెను. వారట్లు చేయుటలో నామె హస్తములు దెగి చెన్నబసవన్న యింటివాకిటఁబడెను. అతి సౌందర్యవంతములుగానున్న యా హస్తములను జూచి మిండజంగము లచ్చెరువందిరి. ద్వారపాలకులు జరిగిన వృత్తాంతమును జెప్పిరి. మిండజంగములంత సౌందర్యవంతురాలగు నాచిత్రకన్యను జూడమైతిమి గదాయని వగచిరి. ఆమెను బ్రదికించి మాకుఁజూపు మని బసవనను బ్రార్థించిరి. ఆమె శరీరశకలములెల్ల నేతి తెప్పించి బసవన యామెను బ్రదికించెను. మిండజంగముల బులుపులు మెండయ్యెను. బసవన యామెను మిండజంగము లెల్లరకును భోగార్థమై నియోగించెను. అందఱు మిండజంగముల యాసలను దీర్పఁగాఁదగ్గసత్త్వమునామె కొసఁగెను. ఆ మిండగీంద్రామెను దోడ్కొనిపోయిరి."

ఈ రోఁతకథను జెప్పుటకుఁ జెన్న బసవపురాణకర్త వెనుకాడఁడయ్యెను. బసవనసోదరి యగు నాగమ్మ చరిత్రమును గూర్చి జైనులాక్షేపింపఁగా వారికిఁ దలవంపుగా నుండుటకై శైవు లీ కథను గల్పించియుందురనియే నేను దలంచుచున్నాఁడను. తెలుఁగు చెన్నబసవపురాణమున నంతగాఁజరిత్ర విషయమే లేదు.



చరిత్ర విషయమునఁ జెన్నబసవ పురాణము, బిజ్జలరాయ చరిత్రము నంతగా విశ్వసింపఁదగినవి కావని నా తలంపు. బిజ్జలరాయచరిత్రము బిజ్జలుఁడు జైనుఁడని చెప్పుచున్నది. కాని, బసవపురాణమున నెక్కడను బిజ్జలుఁడు జైనుఁ డనుటకాధారము కానరాదు. ఆతఁడు జైనుఁడనుటగూడ యవిశ్వాస్యమేయని నా తలంపు. బిజ్జలునియొుఁదత్పుత్త్రులయు శిలాతామ్రశాసనములు పెక్కులు నేఁడు దొరకియున్నవి. అందుఁగూడ వారు జైనులనుటకాధారములు గానరాక పోవుటేకాక శివభక్తులనుటకే యాధారములు గానవచ్చుచున్నవి. వారు శాసనములందు సువర్ణవృషభ ధ్వజులుగాఁ దెలియవచ్చుచున్నారు. ఇది వారి శివభక్తతను సూచించుచున్నది. బసవన నెలకొల్పిన వీరశైవమున బిజ్జలుఁ డభినివిష్టుఁడు గాకపోవచ్చును. కాని, యాతఁడు శివద్వేషము గలవాఁడు మాత్రము గాఁడు. బసవపురాణమున నట్లెక్కడను లేదు. మఱియు,

క్రీ. 1195 నాఁటి యబ్లూరుశాసనము (ఏకాంతరామయ్య విషయము దీనఁ గలదు. అది ముందు దెలియఁగలదు. ఇదేకథ బసవపురాణముననను గలదు.) ను బట్టి చూచిననుగూడ బిజ్జలుఁడు జైనుఁడుగాడనియే యేర్పడును.

"ఏకాంత రామయ్యయును, జైనులును శివుఁడు పరదైవమని జినుఁడు పరదైవమని తగవులాడిరి; ప్రతిజ్ఞాపత్రములు వ్రాసికొనిరి. ఏకాంతరామయ్య ప్రతిన నెగ్గించుకొని జినదేవుని శిరసు విఱుగఁగొట్టించెను. జైనులు బిజ్జలుని కడకుఁబోయి మొఱవెట్టిరి. ఆతఁడేకాంతరామయ్యను బిలిపించి యడిగెను. రామయ్య తన ప్రతిజ్ఞా నిర్వహణమును నిరూపించెను. పునఃప్రతిజ్ఞ సలిపి నెగ్గుదుననెను. జైనులందుకుఁదూఁగరయిరి. బిజ్జలుఁడు వారిని గర్హించి పంపెను. ఏకాంతరామయ్య నారాధించెను. ఆతఁడారాధించు వీరసోమనాథ దేవునకగ్రహార మొసఁగెను" అని యాశాసనమునఁ గలదు.

బిజ్జలుఁడు జైనులను గర్హించెననియు శివునిక(గహారమొసఁగెననియు నుండుటచే శాసనకారుని యెఱుకలో నాతఁడు జైనుఁడుగాఁడనియే యున్నట్లేర్పడుచున్నది. ఈ శాసనము సరిగా బసవపురాణ రచనము నాఁటిది.

బసవనికాలమున గళ్యాణమునఁగల మిండజంగముల మిండఱికపుఁగథలు గొన్ని బసవపురాణమునఁగలవు. సత్యముగా నట్టివి కొన్ని జరగినను జరగియుండవచ్చును. భక్తులు పరమేశ్వరులే యని, భక్తులచేయు తప్పులు తప్పులే కావని, భావించు పరమభక్తులున్నప్పుడట్టి చర్యలు జరగుట కభ్యంతరమేమి. శైవభక్తుల కథలను బోలినవి వైష్ణవభక్తుల కథలునిట్టివి యున్నవిగదా!

ఇట్లు చూడఁగా, మాహాత్మ్యములను బొగడు కథలు కొన్నిపోను, బసవపురాణమునఁగానవచ్చు బసవనిచరి(తమునఁదక్కినదెల్ల దథ్యమనియే తలఁ పఁగూడును. శాసనములందు బసవేశ్వరుని విషయము లేకున్నను దత్సమకాలమువాఁడగు నేకాంతరామయ్య విషయము గలదు గదా! ఆ శాసనమానాఁటి జైనశైవమతముల స్పర్థలను స్పష్టపఱచుచున్నది గదా! శాసనాదులెందుకు? పం(డెండవశతాబ్ది యుత్తరార్ధముననుండి నూఱేండ్లలోఁ గల్యాణ (ప్రాంతములందుఁగర్ణాటదేశమున బసవమతానుయాయులసంఖ్యా కులుగా నతిశయించుట యొక్కటే బసవేశ్వరమత(ప్రాబల్య (ప్రాభవములకు బలిష్ఠమగు సాక్షి గాఁజాలును!

బిజ్జలుఁడు కలచురి వంశమువాఁడగుట శాసనాదుల మూలమున స్పష్టముగా మనకుఁదెలియవచ్చుచున్నది. కాని, సోమనాథుఁడాతఁడు చాళుక్యవంశమువాఁడని చెప్పినాఁడు.

అల్లయ్య మధుపయ్య యను భక్తవరులఁ
(బల్లదుఁడై రాజు వఱపుడు నతని
యాయతైశ్వర్యంబు నతుల (ప్రతాప
మాయుష్యమును భవిష్య(ద్రాజ్యరమయు



నవనిలోఁ జాళుక్యులనుపేరు హరుని
కవిలెను దుడిపించి కల్యాణకటక
మీడితభక్తి మహిష్ఠతపేర్మిఁ
బాడుగా శపియించె బసవనమం(త్రి

– పండితారాధ్యచరి(త్ర

ఈ (వ్రాఁత (ప్రామాదికము. బిజ్జలుఁడు చాళుక్యుఁడు గాఁడు. కలచుర్యులు వేఱు. చాళుక్యులు వేఱు. చాళుక్యులనుగొట్టి వచ్చినవాఁ డీ బిజ్జలుఁడు కలచుర్యుఁడు.

బసవేశ్వరుఁడు కప్పడి సంగమేశ్వరునకు భక్తుఁడనియుఁ, దుది కాతఁ డాకప్పడి (కూడలి) సంగమేశ్వరమునకే యేఁగి యాదేవునితో నైక్యమందె ననియు, బసవపురాణమునఁ గలదుగదా! కర్ణాటకదేశమున సంగమేశ్వర క్షే(త్రములు రెండు గలవట! సర్ వాల్టరు ఇలియట్ దొరగారు, బిజాపూరు జిల్లా హన్గొండ తాలూకాలో కృష్ణామలాపహానదులు సంగమించు స్థలమునఁ గల సంగమేశ్వరమే బసవేశ్వరుఁడు లింగైక్యమందిన స్థలమనియుఁ ద(త్రత్యులక్కడి సంగమేశ్వర లింగమునకు నడుమ నొక గుంటను జూపుచు నది బసవేశ్వరుఁడు లింగములోనికి దూరినచోటి చిహ్నమని చెప్పుదురనియు, (వ్రాసిరి. ఫ్లీటుదొరగారీవిషయమును గూర్చి సందేహించిరి.బసవ పురాణమునఁ గూడలి (కప్పడి) సంగమేశ్వరమే పేర్కొనఁబడినది గావున, కృష్ణా తుంగభ(ద్రానదుల సంగమస్థలమునఁగల సంగమేశ్వరమునకే పయిపేరు గలదు గావున, బసవేశ్వరుఁడు లింగైక్యమందిన స్థలముగాఁ దలఁపఁబడినది యిదియే యగునేమో యని వారు (వ్రాసిరి. కూడలి సంగమేశ్వరమనికాని, కప్పడి సంగమేశ్వరమనికాని కృష్ణామల(ప్రభానదుల సంగమస్థలమునకుఁ బేరులేకుండుట నిశ్చితమే యగునేని, కృష్ణా తుంగభ(ద్రానదుల సంగమస్థలమే బసవేశ్వరుఁడు లింగైక్యమందినస్థలమని నిశ్చయింపవలయును.

## బిజ్జలుని చరి(త్రము

బసవపురాణాదులను విడిచి శాసనాదులను గొని యాతని చరి(త్రమును దెలిసికొందము.

చేదిదేశము (జబల్పూర్) నేలిన కలచుర్య (కలంజర) రాజులశాఖలలో నొకశాఖవారు కళ్యాణము నేలుచున్న చాళుక్యులయొద్దనుద్యోగులుగా నుండిరి. అందు బిజ్జలుఁడు మూఁడవ తైలపదేవునియొద్ద నుద్యోగిగా నుండి క్రమముగా స్వతంత్రుఁడై పశ్చిమ చాళుక్యరాజ్యమున కేకచ్ఛత్రాధిపతి యయ్యెను. ఆతని కిర్వురు భార్యలు, పెద్దభార్యకు నలుగురు పుత్త్రులు, పిన్నభార్యకొక పుత్త్రుఁడు నొక పుత్త్రికయు జనించిరి. బిజ్జలుడార్జించిన పశ్చిమచాళుక్యరాజ్యము తత్పుత్త్రులకాలమున యథాయథలయినది. సరియయిన వంశానుక్రమణి తెలియరాదు గాని, పల్నాటిలో రాజ్యమేలిన వారును, పల్నాటివీర చరిత్ర కథానాయకులునగు ననుగురాజ ప్రభృతులును, విద్యానగరరాజబంధువులై 15 శతాబ్ధి నుండి యాంధ్రదేశమునఁ బ్రఖ్యాతిగడించిన వారగు నార్వీటి బుక్కరాయాదులును నీ బిజ్జలుని వంగడమువారగుదురు. బిజ్జలుని వంశవృక్ష మిట్టిది :

జోగమ
|
పెరుమాడి (క్రీ. 1128)
|
(త్రిభువనమల్లబిజ్జలుఁడు (క్రీ. 1145,మఱి 1156నుండి 1167 వరకు)

- నిశ్శంకమల్లసంకమ క్రీ. 1177 నుండి ౧౧౭౭ వఱకు
- సింహుఁడు క్రీ. 1183
- వజ్రుఁడు
- భుజబలమల్ల రాయమురారి సోమేశ్వరదేవిదేవుఁడు క్రీ. 1167 నుండి 1177 వఱకు
- వీరనారాయణ ఆహవమల్లుడు క్రీ. 1161 నుండి 1183 వఱకు



పశ్చిమ చాళుక్యరాజులకు మన బిజ్జన తొలుత సామంతుఁడుగా నుండెను. క్రీ. 1146 ప్రాంతముల నుండి యీతని శాసనములు గలవు. తొలుతటి శాసనములనుబట్టి యీతఁడు మూఁడవతైలపదేవుని సామంతుఁడని యెఱుఁగ నగుచున్నాఁడు. బిజాపురమునఁగల క్రీ. 1151 నాఁటి శాసనమున నీతఁడు మూఁడవ తైలపుని సామంతుఁడనియు, మహాప్రధానదండనాయక సేనాధిపతి బిరుదాంకుఁడైన మైలారయ్య తర్దవాడి 1000 ని నీతనికి సామంతుఁడై పాలించుచున్నాఁ డనియుఁగలదు. బలగామి (బెల్గాం) లోఁగల (క్రీ. 1155 నాఁటిది. అది తైలపుని యాఱవపాలన వత్సరము) శాసనమున బిజ్జలుఁడు సర్వదేశములను బాలించుచున్నట్టు గలదు. బిజ్జలుని మూఁడవతైలపదేవునకు సామంతునిఁగాఁ జెప్పు శాసనములలో క్రీ. 1155 నాఁటి దగు నీ బెల్గాంశాసనమే కడపటిది. అప్పటనుండి బిజ్జలుఁడు శాసనములలోఁదన స్వతంత్ర పరిపాలనము వ్యక్తమగునట్లు తనయేల్బడి వత్సరములను జెప్పుకొన నారంభించినాఁడు. కాని 1162 వఱకు బిజ్జలుడు పశ్చిమచాళుక్య రాజ్యముపై సంపూర్ణాధిపత్యమును బడయలేదు. అయినను 1056 నుండి సామంత స్థితిని మీఱి స్వతంత్ర స్థితికి వచ్చినాఁడు.

క్రీ. 1162 బిజ్జలుని యేడవ పరిపాలనవత్సరము. అప్పటి శాసనములలో నాతఁడు "కలచుర్య చక్రవర్తి" "సమస్త భువనాశ్రయ శ్రీపృథివీ వల్లభ మహారాజాధిరాజ పరమేశ్వర పరమభట్టారక" బిరుదములఁ జేర్చుకొన్నాఁడు. ఆతని కప్పుడు శ్రీ ధరదండ నాయకుఁడు, పద్మరసు, అమ్మణ, సోమదేవయ్య, విజయాదిత్యుఁడు (మహామండలేశ్వరుఁడు) కార్తవీర్యుఁడు, ఈశ్వరయ్య, సిద్ధలయ్య, కలియమ్మరుసు, పెర్మాడి యనువారు సామంతరాజులుగాఁ బేర్కొనఁబడిరి. క్రీ. 1168 శాసనములో బిజ్జలుఁ డేకచ్ఛత్రాధిపత్యముగా రాజ్యమేలుచు రాజ్యభారమును దనకొడుకయిన సోవిదేవునిమీఁదఁ బెట్టినట్టున్నది. ఆ శాసనము సోవిదేవునిదే. నాఁటిదే బిజ్జలుని కడపట శాసనము. అది యాతని పండ్రెండవ పాలనవత్సరము. సోవిదేవుని తర్వాత నాతని తమ్ములు సంకమ, ఆహవమల్లుఁడు, సింఘణుఁడు కూడఁగొలఁది దినములు రాజ్యమేలిరి. ఏచలదేవి యను భార్యవలన బిజ్జలునికి వజ్రదేవుఁడు, శ్రియాదేవి యను కుమారుఁడును గుమార్తెయుఁగలిగిరి.

క్రీ. 1182 లో బిజ్జలుని కొడుకులను వీడి పశ్చిమ చాళుక్యరాజ్యలక్ష్మి మరలఁ జాళుక్యరాజేయగు నాల్గవ సోమేశ్వరునిఁ జెందినది. కలచుర్య వంశ్యుల పరిపాలనమంతతో నంతరించినది– శాసనములవలన బిజ్జలవృత్తాంత మింత మాత్రమే తెలియవచ్చుచున్నది.

## బసవనకృతులు

కర్ణాటకభాషలో బసవన్న "లాలితంబుగ నాల్గులక్షల మీఁద, నోలినర్వది నాల్గువేలగీతము" ల రచియించినట్లు బసవపురాణము చెప్పుచున్నది. పయి సంఖ్య యా గీతముల గ్రంథసంఖ్య కావచ్చును. పండితా రాధ్యచరిత్రమున బసవనిగీతమొకటి మొదలెత్తి యుదాహృతమయినది.

అక్కజంబక్కజంబని బాసగీత
మొక్కటానతియిచ్చె ........"

బసవన్న గీతములు గొన్ని నేఁడును గర్ణాటభాషలోఁ గానవచ్చు చున్నవి. షట్ స్థలవచనములు, కాలజ్ఞానవచనములు, మంత్రగోప్యము, శిఖారత్న వచనములు అను పేరుగలవి యిప్పుడు దొరకుచున్నవి. [1]వీనిలో కూడలి సంగమదేవుని సంబోధనముండును. బసవనకాయన యిష్టదైవము గదా! బసవేశ్వరుని కర్ణాట గేయములను మచ్చునకుఁజూపుచున్నాఁడను.

"నరెకెన్నెగె తెరెగల్లకె శరీరగూడవగదమున్న
హల్లుహోగి బెన్నుబాగి అన్యరిగె హంగాగదమున్న
కాలమేలె కయ్యనూరి కోల హిడియదమున్న
ముప్పిందొప్పవళియదమున్న మృత్యుముట్టదమున్న
పూజిసు నమ్మ కుడలసంగమదేవరా!

అరగిన పుత్తళియ నురియ నాలగె హొయ్దుమాతాడువ సరసబేడ.

1. ప్రాచ్యలిఖిత పుస్తకశాలలోఁజూడనగును. అవి యింకను ముద్రితములు కాలేదు. ఇందు దాహృతములయిన గేయములు కర్ణాటక కవిచరిత్రలో వుదాహృతములైనవి.



బెణ్ణెయ బెనకంగె కెండదుండలిగెయ మాడి
చిల్లవాడిదరె హల్లు హోహుదు
కుడలసంగయ్యన శరణరొడనె
సరసవాడిదరె అదు విరస కాణిరయ్య
ఉళ్లవరు శివాలయ మాడిసీయరు
నానే మాడువె బడవనయ్య
ఎన్న కాలేకంభ దేహవే దేగుల శిర హొన్నకళస నోడయ్య
కుడల సంగమదేవయ్య కేళయ్య స్థావరక్కటివుంటు జంగమక్కటివుంటె.

ఆడి కాలు దణియదు నోడి కణ్ణు దణియదు మాడి కైదణియదు హాడినాలగె దణియదు సుడి తలె దణియదు బేడి మనం దణియదు ఇన్నువే నా నిమ్మకైయార పూజిసి భజిసదె మనదణియలొల్లదు కుడల సంగమదేవా నిమ్ముదరవ బగిదాను హోగువ బరవెనగె.

మడకెయె దైవవు మరదల్లియె దైవవు బీదియకల్లె దైవవు బిల్లనారియె దైవవు కాణిరైయ కొళగవె దైవవు గిళియెదైవవు కాణిరైయ దైవ దైవవెందు కాలిడలింబిల్లవు దేవనొబ్బనె కుడలసంగమ దేవ.

జాతివిడిదు సూతకవ నరసువరె, జ్యోతివిడిదు కత్తలెయ నరసువరె, ఇదే తకొ మరుళు మానవా జాతియల్లి అధికవెంబె విప్రశతకోటియొ శిర్దల్లి ఫలవేను భక్తశిఖామణియెందుదు వచన నమ్మ కుడలసంగన శరణర పరుషవ నంబుకెడ బేడ మనుజా."

సంగీతకళలో బసవన గొప్పనేర్పుగలవాఁడని పెక్కుచోట్ల సోమనాథుఁడు ప్రశంసించినాఁడు.

చ. విరచితశుద్ధ సాళవ నవీన మృదుస్వరమంద్ర మధ్య తా
ర రుచిర దేశిమార్గ మధురస్వరగీత సుధాతరంగిణీ
తరలతరంగజాల సముదంచితకేళి విలోల సంగమే
శ్వర శరణయ్య నీకు బసవా బసవా బసవా వృషాధిపా!

సంగీతమున నింత నేర్పు గలవాడు గావుననే యన్ని గేయకృతుల నాతఁడు రచియింపఁగల్గెను. భక్తిరసప్లుతముగా నాతఁడు గేయముల రచించి మధురతరముగా స్వయము గానముచేయుటచే నాకాలమున ననేకులను స్వమతమునకుఁద్రిప్పుకొనఁగల్గినాఁడు.

బసవనకు బాలసంగయ్యయని కొడుకొకఁడు జనియించెననియు బసవన కంటెముందే యాతఁడు లింగైక్య మందె ననియు, నప్పుడు బసవన:-

పుష్ప విద్దంతె మొగ్గెయ నర్పిసికొండ శివను
పక్వవాద ఫల విద్దంతె కసుగాయ కోయ్దు శివను"

అని ప్రలాపించెననియు, భైరవేశ్వరకావ్యము కథాసూత్ర రత్నాకరమునఁ గలదని కర్ణాటకవిచరిత చెప్పుచున్నది.

బసవనకృతులలో షట్స్థలవచనములను నేను జదివి చూచితిని. తెలుఁగున శంకరవచనములు, వేంకటేశ్వరవచనములు నున్న విధమున నవి భక్తిరస భరితములై తేటగాఁజదువఁదగినవిగా నున్నవి.

కర్ణాటాంధ్రభాషలలో బసవనమీఁద రచితములయిన స్తుతి గ్రంథములకు మితిలేదు. ఆతఁడు నందీశ్వరునియవతారమని వీరశైవుల విశ్వాసము. పాల్కురికి సోమన తన బసవపురాణకథాసారము నెల్లఁదెలుఁగున వృషాధిపశతకముననను సంస్కృతమున బసవోదాహరణాదులందును వెలయించినాఁడు. అతఁడు రచియించిన గ్రంథములెల్ల బసవస్తుతిరూపములే. బసవేశ్వరునుపాస్య దైవతముగాఁగొల్చిన వారిలోఁదొల్తటివాఁడాతఁడే. బసవేశ్వరునియెడ నాతనికిఁ గలభక్తి యింతంతనరానిది. వృషాధిపశతక, బసవోదాహరణాదులఁజదివిన నది తెలియనగును.

## బసవన సమకాలమువారు

బసవపురాణమున బసవనకు సమకాలమువారుగాఁ బేర్కొనఁబడిన వారిని గూర్చి తెలియఁదగినవిశేషములు గొన్ని గలవు. కావున, సంక్షిప్తముగా వారి చరిత్రముల నిక్కడ వివరించుచున్నాఁడను.



## మడివాలు మాచయ్య (పు. 100)

ఈతడు చాఁకలి. మహిమగల భక్తుఁడు. ఈతఁడు శివభక్తుల మడుఁగుల నుదికి తెచ్చునప్పుడు భవులడ్డు రాఁగూడదు. వచ్చెనేని చంపును. ఒకనాఁడొక బాటసారి యడ్డురాఁగా వానిని జంపెను. బిజ్జలుఁ డందుకుఁ గోపించి యీతనిఁజంపుటకై యేనుఁగును బంపెను. దానినిగూడ నీతఁడు చంపెను. బసవన తెలుపఁగ బిజ్జలుఁడీతని మాహాత్మ్యమును విని యచ్చెరువంది యీతనికి శరణాగతుఁడయ్యెను. ఈతఁడు చచ్చిన మనుజుని, నేనుఁగును మరల బ్రదికించెను.

ఈతఁడు కాలజ్ఞానవచనములను, ఇతరవచనములను రచియించి నట్లు కన్నడకవిచరిత చెప్పుచున్నది. సాధారణముగా నాకాలపు వీరశైవులందఱపేర "కాలజ్ఞాన" మని యేదేదో భవిష్యద్విషయముఁ జెప్పునవిగా గొన్ని గ్రంథములు కన్నడమునఁగలవు. అవియెల్లను వారువారు రచియించినవే యనుటను గూర్చి నేను సంశయించుచున్నాఁడను.

## అల్లమప్రభువు (పు. 36)

బసవపురాణ మీతని నతిలోకచరిత్రునిఁగాఁజెప్పుచున్నది. కర్ణాటకవి చరిత్రమున నీ మహనీయుని చరిత్రమిట్లు వ్రాయఁబడినది.

"ఈతఁడు శూన్యసంపాదనము, మంత్రమాహాత్మ్యము, షట్స్థలవచన ములు, మంత్రగోప్యపదములు, సృష్టివచనములు, బెడగినవచనములు, (ప్రభు దేవర) కందములు, కాలజ్ఞానవచనములు నను గ్రంథముల రచియించెను.

ఈతఁడు వీరశైవగురువులందు బహుప్రఖ్యాతుఁడు. "శ్రీమద్దేశికషట్స్థలచక్రవర్తి, బ్రహ్మానంద, పరమశివమూర్తి, విరక్తశిఖామణి, మాయాకోలాహల ప్రభుదేవుఁ"డని శైవగ్రంథకర్తలీతనిఁబేర్కొనిరి. ఈయన విషయమునఁ బ్రభులింగలీలలు, అల్లమప్రభుసంగీత పదములు మొదలగు గ్రంథములు పుట్టినవి.

ఈతఁడు శ్రీశైలమున నరఁటిచెట్టులో శివైక్యమందె నన్నవార్త వినియే బసవేశ్వరుఁడు కూడలి సంగమేశ్వరునిలోఁ జేరెనని (కన్నడ) చెన్నబసవపురాణ మునఁ గలదట.

## సిద్ధరామయ్య (పు. 48)

బసవపురాణ మీతఁడు సొన్నలిక పురవాస్తవ్యుఁడనియు, నభినవ శ్రీగిరి యని యాగ్రామమును బెంపొందించి శ్రీశైలమల్లికార్జుననక్కడికిఁ గొని వచ్చి ప్రతిష్ఠించి యింకను బెక్కుశివలింగముల నెలకొల్పి మేనినీడయు, నడుగు జాడయుఁ గానరాకుండఁ జరించువాఁడనియు, సమాధియోగమున శివలోకమునకుఁబోయివచ్చుచుండువాఁడనియుఁజెప్పుచున్నది. ఆ గ్రామమున నాతఁడొక తటాకము ద్రవ్వించి విద్యాసముద్రుఁడని బిరుదుగల కర్పరుఁడనుయోగి నోడించి తాను గట్టుకొన్న యా తటాకము నడుమను సమాధిని గల్పించుకొనియందే బయలయ్యె నట. నిజజననమును సుగ్గళవ్వకు రేవణసిద్ధుఁడు సూచించినట్టును, చెన్న బసవన్నకడ లింగదీక్షను, దత్త్వోపదేశమును బొందినట్లును గొన్ని వీరశైవగ్రంథములు చెప్పుచున్నవి.

యోగినాథవచనములు, మిశ్రస్తోత్రత్రివిధి, సిద్ధరామేశ్వరత్రివిధి, అష్టావరణస్తోత్ర త్రివిధి, మంత్రగోప్యము, కాలజ్ఞానము, అను గ్రంథముల నీతఁడు కన్నడమున రచియించెను. రాఘవాంకకవి (క్రీ. 1165) ఈతని చరిత్రమును సిద్ధరామపురాణ మనుపేర రచించెను.

## సకలేశ్వరు మాదిరాజయ్య (పు. 89)

ఈయన శ్రీపర్వతమున వసించు శివయోగీంద్రుఁడు. ఏడువందల యేం డ్లీతఁడు శివానుగ్రహమున జీవించెనట. బసవనను జూచునాఁటి కీతఁడార్నూఁట యేఁబది యేండ్లవాఁడట! మల్లికార్జున పండితారాధ్యుఁడీతని నిట్లు ప్రస్తుతించినాడు.

క. భూతలమున నిది యెంతయు
నూతనమని పొగడ నేడునూఱేండ్లు మనం
దే తనరుభక్తిఁద్రిపురా
రాతీ, సకలేశు మాదిరాజయ్య శివా!

ఈ మాదిరాజయ్య కళ్యాణకటకమును శపించి బసవేశ్వరుఁడు వీడివచ్చునప్పు డాతనితోడ నుండినట్లు బసవపురాణమునఁ గలదు. మల్లికార్జున



పండితారాధ్యుఁడు (శివతత్త్వసారమును) బసవేశ్వరాదులు లింగైక్యమందిన పిదప శ్రీశైలమునకుఁజేరి తానును లింగైక్యమందఁబోవుచుఁగడకాలమున రచియించెను. తద్రచనాకాలమునకు మాదిరాజయ్యయు లింగైక్యమందెనని యెఱుఁగనగును. మాదిరాజయ్య కృతిగాఁగన్నడమునఁగొన్ని రచనములు గలవట! కెరెయ పద్మరసునకీతఁడు పితామహుఁడట.

మఱియుఁగిన్నరబ్రహ్మయ్య (పు. 142) కన్నడ బ్రహ్మయ్య, ముసిఁడి చౌడయ్య, సురియచౌఁడయ్య, తెలుఁగు జొమ్మయ్య, శివనాగుమయ్య యనువారు బసవనసమకాలమువారు. వీరినిగూడ మల్లికార్జున పండితారాధ్యుఁడు శివతత్త్వసారమున స్మరించినాఁడు. కలకేతబ్రహ్మయ్య, మోళిగమారయ్య, ఏకాంతరామయ్య, కక్కయ్య, భోగయ్య, గుడ్డవ్వ, జగదేవదండనాయకుఁడు, పదుమరసు, పురాణదమాయిభట్టు, అల్లయ్య, మధుపయ్య, మొదలగువారింకను బసవన్న సమకాలమువారు గలరు. వారిని గూర్చి పుట. 229లో చూడఁదగును. మల్లికార్జున పండితారాధ్యుఁడు శివతత్త్వసారమున వీరినిఁబేర్కొనలేదు. ఇందీక్రిందివానిని గూర్చి యించుక చరిత్రమెఱుకకందుచున్నది.

## మోళిగ మారయ్య

నేఁటి బందరుదేశమందలి మాండవ్యపురమును [1]పాలించుచు శివభక్తులనారాధించుచు నుండెను. బసవన్న యతనియొద్ద నున్న శివభక్తులను దనతోఁబిలుచుకొనిపోఁగా అతనిని జంపుటకిద్దఱు సేవకులను బంపెను. వారు జంగమవేషమును వేసికొని బసవనియింటియందు శివభక్తులనడుమఁ గూర్చుండిరి. బసవని మహిమచే వారిమెడలందున్న వంగకాయలు లింగకాయ లయినవి. ఇది విని మారయ్య వైరాగ్యమున నిట్లు పాడెను.

---

1. గోదావరి మండలమందు గల యీ మాండవ్యపుర మేదో?

శా॥ శ్రీమద్రాజమహేంద్రనామనగరీ శ్రీదుర్గవర్యస్థితా
సామాన్యస్ఫురమాణ దక్షపురపశ్చాద్భాగతుల్యా నదీ
గ్రామణ్యంతిక పూర్వదిక్ప్రథితతీర ప్రాంత దివ్యోదిత
శ్రీమాండవ్య పురీవరంబలరె ధాత్రీనూతన స్వర్గమై.

–శ్రీ గుణరత్నకోశము.

హిరియరదర్శన నయనక్కె చెలువు ;
సత్పాత్రక్కిడువుదు హస్తక్కెచెంద;
సత్యవనుడివుదు వాక్యక్కెభూషణ;
శివస్తుతికేళువుదు కర్ణక్కె అలంకార ;
శరణరకూడె సంభాషణెప్రాణకై శృంగార
ఇంతిల్ల దనరన బాళుహోలెయజోగ్గికైయ పాత్రదిందకడె

156 పుట. కన్నడ కవిచరిత్ర

అని పాడి రాజ్యమును బరిత్యజించి కళ్యాణమునకేగి కట్టెలుకొట్టి అమ్ముకొనుచు జంగమార్చన చేయుచుండెను.

మోళిగమారయ్య వచనము లని కర్ణాటగ్రంథము గలదు.

**ఏకాంతరామయ్య** (పు. 170)

బసవపురాణమునఁజెప్పఁబడిన విషయమే యీషద్భేదముతో నొక శాసనమునఁగలదు. దాని సారార్థమును జెప్పుచున్నాఁడను.

హనగల్లు కదంబులలోనివాఁడగు కామదేవ మహామండలేశ్వరునిదా శాసనము. అందు శాసనసంవత్సరము పేర్కొనఁబడలేదు. కాని, యీ కామదేవుఁడు క్రీ.1181నుండి1203 దాఁక రాజ్యమేలినాఁడు గాన శాసనమును దన్మధ్య కాలపుదయియుండును. బసవపురాణ రచనాకాలము శాసన రచనాకాలము నించుమించుగా నొక్కటే యగును.

"కుంతలదేశమున సోమనాథశివాలయము గల యలందిపట్టణమున వేదవేదాంగవేత్త శ్రీవత్సగోత్రుఁడు పురుషోత్తమభట్టను బ్రాహ్మణుఁడు గలఁడు, ఆతని భార్యపేరు పద్మాంబిక. వారికిఁ జిరకాలము సంతానము లేదయ్యెను. పుత్రార్థమై వారు శివునారాధించిరి. సపరివారుఁడై కైలాసమున శంకరుఁడు సభదీర్చి యుండగా నారదుఁడరుదెంచి' సిరియాలాదులు బొందితోఁ గైలాసమునకు వచ్చుటచేతను, కేశిరాజాదులు శివసాన్నిధ్యము నపేక్షించి భూలోకమును



వీడుటచేతను భూలోకమున జైన బౌద్ధమతములు పేట్రేగుచున్నవి' అని నివేదించెను. 'తన్మత నాశనార్థమై భూమిలో నవతరింపుము అని శివుఁడు వీరభద్రు నాజ్ఞాపించెను. శివాజ్ఞ చొప్పుననే వీరభద్రుఁడు పురుషోత్తమభట్టు గర్భమునఁ బ్రవేశించెను. పురుషోత్తమభట్టు కలలోఁ గనుపడి "మీకుఁ గొడుకు గల్గును. రాముఁ డని పేరిడుఁడు. ఆతఁడు దక్షిణాపథమున జైనమతస్థుల నోడించి తన్మతనాశనము చేయును" అని తెల్పెను. అట్లే కొడుకు గల్గెను. రాముఁడని పేరిడిరి. శివభక్తిని బోధించిరి. ఏకాంత భక్తినిబట్టి యాతని కేకాంతరామయ్యని పేరయ్యెను. త్రికరణశుద్ధిగా నాతఁడు శివతన్మయుఁడై దక్షిణదేశమునఁగల సోమనాథ దేవాలయములకెల్ల నేఁగి యా యా సోమనాథదేవులనెల్ల నారాధించెను. ధార్వార్ మండలమున లక్ష్మేశ్వర్ అనే హలల్గేరియొద్ద సోమనాథదేవాలయమున స్వామిలింగమూర్తిని గొలుచుచుండఁగా నా స్వామి ప్రత్యక్షమై "అబ్లూరి కేఁగి నీవక్కడనేయుండి తలయయిన నొసఁగి జైనుల నోడఁగొట్టుము" అని యాజ్ఞాపించెను. అట్లే అబ్లూరి కేఁగి సన్న్యాసివలె బ్రహ్మేశ్వర దేవాలయము కడనాతఁడు శివునారాధించుచు నుండెను. సంకగౌండుఁడని పేరుగల గ్రామాధికారితోఁగలసి యా యూరిజైనులు జినదేవుఁడే భగవంతుఁడని యా శివాలయముఁజేరి జినుని మ్రొక్కసాగిరి. 'శివుఁడే పరదైవ' మని యేకాంత రామయ్య వాదించెను. సృష్టిస్థితిలయ కారణము శివుఁడే యని రాద్ధాంతపఱిచి వారి యారాధనమును నిరాకరించి గర్హించెను. "వట్టిమాట లెందుకు? శివుఁడే పరదైవమగునేని నీ తల నాయనకప్పగించి మరలఁ బడయుము. అట్లుచేసెదవేని నీవాదము నెగ్గెనని మే మొప్పుకొందుము. జినవిగ్రహమును బాఱవైచి శివలింగమునే యారాధింతుము" అని వారనిరి. ఏకాంతరామయ్య యంగీకరించెను. తాటాకులమీఁదఁబంతములు వ్రాసికొనిరి. శివగీతములు పాడుచు నేకాంతరామయ్య తన తలఁదఱుఁగుకొనెను. ఏడవనాఁటి కాతనితల మరల వచ్చెను. జైనులు చలచల్లఁగా జాఱిరి. తమమాట చెల్లించుకొనరయిరి. జైనులెంతో జాగ్రత్తతో రక్షించుచున్నను గూడ నేకాంతరామయ్య వారారాధించు జినదేవుని తల విఱుఁగఁగొట్టి దానిని దానారాధించు శివదేవునకుఁ గానికగాఁ గొని తెచ్చెను.

(ఆ శాసనమున సంకగౌండఁడు సేనతో ఒంటరియగు నేకాంతరామయ్య పయికి యుద్ధమున కేఁగి నట్లు ఓడినట్లు శివానుగ్రహమున నేకాంతరామయ్య గెల్చినట్లు చిత్రముగూడఁ జెక్కఁబడియున్నది) జైనులు తమ మతనాశనమునకుఁ గోపించి కళ్యాణమునకు వచ్చి దేశాధీశ్వరుఁడగు బిజ్జలుని యొద్ద మొరపెట్టుకొనిరి. బిజ్జలుఁడు వారి మాట విని యేకాంత రామయ్యపైఁగోపించి యాతనిఁ బిలిపించి యడిగెను. ఆతఁడు జైనులు వ్రాసి యిచ్చిన ప్రతిజ్ఞా పత్రమును జూపెను. జైనులింకను బందెముకు వత్తురేని వారి జినాలయము లేడ్నూఱును దనతలఁ దగులఁబెట్టి యయిన వ్రచ్చివైపింతు ననియెను. బిజ్జలుఁడప్పుడు నానా దివ్యస్థలములనుండి ప్రఖ్యాతులయిన జైనాచార్యులను బిలిపించెను. ఏకాంతరామయ్యతోఁ బందెమునకు నిలుఁడనెను. వారు నిలువరయిరి. బిజ్జలుఁడు వారి నపహసించి యిఁక మీఁద శైవులతో వివాదములు పెట్టుకొనకుఁడని మందలించెను. ఏకాంతరామయ్యకు సభలో జయపత్రము వ్రాసియిచ్చెను. ఆయన కాళ్లు గడిగి యారాధించెను. అప్పటినుండి యాసోమనాథునికి వీరసోమనాథుఁడని పేరయ్యెను. ఆ స్వామికి బనవాసి పంద్రెండువేలలో సత్లేజి డెబ్బది గ్రామములలోని దగు గోగేలి గ్రామమును బిజ్జలుఁడప్పుడు దానము చేసెను. పిదప నాల్గవ చాళుక్య సోమేశ్వరుఁడు తన సేనాపతియగు బ్రహ్మనితో శెలయావచియ కొప్పయందు సభ చేసినప్పుడు శివభక్తుల కథలలో రామయ్య కథకూడ వినెను. ఉత్తరము వ్రాసి యేకాంత రామయ్యను బిలిపించి యాతఁడు తన యంతఃపురమున నాతని కాళ్లు గడిగి యారాధించెను. ఆ వీరసోమనాథ దేవునకే బనవాసి పంద్రెండు వేలలోనే నాగరఖండము డెబ్బది గ్రామములలో నొక గ్రామము సమర్పించెను.

పిదప మహామండలేశ్వర కామదేవుఁడక్కడికరిగి యా కథలెల్ల విని యేకాంతరామయ్యను హానుగల్లు అను గ్రామమునకుఁ బిలిపించి కాళ్లు గడిగి యారాధించి (యావీరసోమనాథ దేవాలయమునకే హానుగల్లు ౫౦౦ లలో హోసనాథ్ డెబ్బదింటిలో) ముండాగోడు దగ్గఱ మల్లిహళ్లి యను గ్రామము సమర్పించెను.



ఈ శాసనమప్పటిది. బిజ్జలుఁడు దేవాలయమునకు దానము చేసినప్పుడు మహామండలేశ్వరుఁడని పయిశాసనమునఁగలదు. కావున నప్పటి కాతఁడు మూఁడవ తైలపదేవుని నోడించి స్వతంత్రుడు గాలేదు. అనఁగా నాకాలము క్రీ. 1162కుఁ బూర్వమగును.

## పద్మరసు

ఈతని తాత శివయోగి మల్లికార్జునుఁడు. మల్లరసని యాతని నామాంతరము. కర్ణాటకదేశమందలి కల్లకురికియందాతఁడు ప్రభువై యుండి విరక్తుఁడై శ్రీశైలమున కరిగెను. తత్పుత్రుఁడు సకలేశమాదరసు కొంతకాలము కల్లకురికిని బాలించి విరక్తుఁడై శ్రీశైలమున కరుగుచుఁ ద్రోవలో శిష్యప్రార్థనమున 'అంబ' యనుగ్రామమునఁ గొంతకాలము వసించి పిదప శ్రీశైలమున కరిగి తండ్రియయిన మల్లరసును జూడఁగా నాతఁడు, "నీ వింకను నేనూఱేండ్లు భూలోకమున వసించి కల్యాణకటకమున ధర్మస్థాపనార్థమై పుట్టిన బసవనితోఁ గలసి వర్తింపుము" అని నిబోధించెను. ఈతని పుత్రుఁడు మాయిదేవుడు అంబగ్రామమందుండెను. ఆతనికి నరసింహబల్లాళుని దండనాయకుఁడును కమ్మకులవల్లభుఁడును నగు గౌరప్ప యక్కయగు మంగళనిచ్చి పెండ్లిచేసిరి. వీరి పుత్రుఁడే కెరెయపద్మరసు. ఈతని భార్య దండనాథగౌరప్ప పుత్రియగు మాదేవి. నరసింహ బళ్లాళుఁడు గౌరప్ప కనంతర మా దండనాయకపదమును పద్మరసు కొసఁగెను.

పద్మరసు గురుపరంపరకుఁ జేరినవాఁడు; చతుశ్శాస్త్రపండితుఁడు. ఈతఁడు బేలూరిలో నొక చెరువును ద్రవ్వించుటకై రాజధనాగారమువనుండి పంద్రెండువేల పొన్నులను దీసికొని యొక మిండజంగమున కొసఁగెను. అది రాజు విని పద్మరసును బిలిపించి యడిగెను. చెరువు సర్వంసిద్ధమయ్యెను వచ్చి చూడవచ్చునని పద్మరసనెను. రాజును బిలుచుకొనిపోయి చూపెను. ఆ చెర్వునకుఁ బిట్టసముద్రమని పేరు. ఈ చెరువును గల్పించుట చేతనే యాతనికిఁ గెరెయ పద్మరసని పేరయ్యెను. **కెరె** యనఁగాఁ గన్నడమునఁ **జెఱువు.**

ఈ పద్మరసు మంత్రిపదమును విడిచి బేలూరులోనే వసించు చుండెను. త్రిభువన తాతాచార్యుఁడని యొక యాంధ్రదేశ బ్రాహ్మణుఁడు విష్ణువే పరదైవమని స్థాపించుటకై యనేకస్థలముల కేఁగి వాదార్థములు నెఱపి జయమందుచుండెను. దోరసముద్రము (బల్లాళరాజు రాజధాని) నకు వచ్చి బల్లాళ రాజును దర్శించి శాస్త్రార్థము చేయింపఁగోరెను. రాజు పద్మరసును బిలిపించెను. త్రిభువన తాతాచార్యునకును, బద్మరసునకును శాస్త్రార్థము జరిగెను. వాదమునఁ బద్మరసు గెలిచెను. వాదనిర్ణయ ప్రకారము త్రిభువన తాతాచార్యుఁడు వైష్ణవమతము వీడి పద్మరసునకు శిష్యుఁడై వీరశైవదీక్షఁ గొనెను.

పిదపఁ పద్మరసు తన కుమారుఁడయిన కుమారపద్మరసుకు జ్ఞానోప దేశమును జేసి కాశీయాత్రవెడలి మార్గమునఁ బంప (హంపి)కు వచ్చి హరిదేవకవిని జూచి " ఉమాపతి నిన్ను నేఁటి కెనిమిదవనాఁడు తనలోఁ జేర్చుకొనును, అంతలో నీవు రచించు కావ్యమును ముగింపుము" అని చెప్పి కాశికేఁగి యక్కడ విశ్వేశ్వరునితో నైక్యమందెను.

కెరెయ పద్మరసు త్రిభువనతాతాచార్యులతో శాస్త్రార్థము నెఱపునప్పుడు నరసింహబల్లాళుని యాస్థానమున నీ క్రింది కవీశ్వరులుండిరి. దోరసముద్రపు రామన్న, ఉభయకవిశరభభేరుండుఁడనఁబడు కవీంద్రరాఘవుఁడు, హుళిగరమాయిదేవ పురాణభట్టు, గురుభక్త కామన్న, విశ్వన్న, ఉద్ధతశాస్త్రి, నికరభంజన నాగనాథార్యుఁడు, అతిరసికకర్ణాభరణ బుధవరుఁడు పదవాక్యప్రమాణజ్ఞ దేవరస పండితుఁడు, అనేకకలావేత్త హంపి రావితందె, జగదారాధ్య నాగిదేవుఁడు, అష్టభాషాకవీశ్వర శివదాఁడు, శైవవిరుద్ధమతదావ దాదర సుశరణకవి– ఇత్యాదులు.

పద్మరసు నరసింహబల్లాళుని సభలో శ్రీశివాద్వైతసాకార సిద్ధాంత సానందచరిత్రమను సంస్కృతగ్రంథమును రచియించి, త్రిభువన తాతాచార్యులను జయింపఁగా సభలోని విద్వాంసులెల్లరును నీ క్రిందివిధముగా నాతనిఁ బ్రశంసించిరి.



దోరసముద్ర వెంబ హెసరిం కరమొప్పున రాజధానియోళ్
ధీరనృసింహభూవర నహోమహియం పరిపాలిసుత్తిర
ల్కారసియాణ్మ నోలగకె బందనగుర్విసు తాంధ్రదేశ దిం
శౌరియ భృత్యనోపు భువనత్రయతాతన నిప్పునోర్వవం.
శివనిల్లా శివభక్తి యిల్ల శివసిద్ధాంతందలిల్లా మతం
సువిచారస్థితిగిల్ల నాడెవనజాక్షం దైవవా వైష్ణవం
సువిశాలం నిజభక్తిగెం దెనుతె పత్రాలంబనం గెయ్యెత
ద్భువియం పద్మరసార్యరోడిసిదరీసానందచారిత్రదిం.
పిందె సమస్తనీలపటసాంఖ్యర బౌద్ధర జైనభేదదోళ్
సందరభాట్టతార్కికర కూడతివాదిసి, సోర్కిసూక్తియ
ల్లొందదబద్ధవాదియెనిపుద్ధత వైష్ణవనంవిభాడిసు
త్తిందుధర ప్రతిష్ఠయగపద్మరసర్ నెగళ్దర్ ధరిత్రియొళ్.

ఇవిగాక యొక్కొక్క కవీశ్వరుడును వేర్వేఱుగా సంస్కృత కర్ణాట భాషలలోఁ బద్మరసుమీఁద రచించిన పద్యములును గలవు. పద్మరసుకు సకల శాబ్దికసార్వభౌమ, ఉద్ధతవాది నికరవేశ్యాభుజంగ, తార్కికచక్రవర్తి, శ్రీశివాద్వైత సాకార సిద్ధాంత ప్రతిష్ఠాపనాచార్య, శరణకవి, భవిదూరాది బిరుదులు గలవు.

ఈతఁడు సానందచరిత్రమునుగాక దీక్షాబోధమని వేఱొక గ్రంథమును గూడ రచియించెను.

పద్యబసవపురాణ కర్తయగు పిడుపర్తి బసవన తండ్రి సోమనాథుఁడీ దీక్షాబోధను దెనిఁగించెను. వీరశైవమత వ్యాపనమున కీ గ్రంథమెంతేని యా కాలమున నుపకరించి యుండును. గురుశిష్యసంవాదరూపమున సులువుగా వీరశైవ సంప్రదాయమునెల్ల నీ గ్రంథము నిరూపించుచున్నది. తత్కాలపు వీరశైవమత స్వరూపము దెలుపు గ్రంథములలో నిది ప్రధానమయినది. మతవిమర్శము పట్టుననేనెక్కువగా నీ గ్రంథమును గ్రహింతును.

**మాయిదేవుఁడు** :– ఈతఁడు పద్మరసుపయిఁ బ్రశంసా రూపముగాఁ జెప్పిన పద్య మొకటి గలదు.

**జగదేవ దండనాయకుఁడు :–** ఈతఁడే బసవేశ్వరుని నిదేశము చొప్పున బిజ్జలుని సంహరించినవాఁడు. మల్లయ్య, బ్రహ్మయ్య యను వారిర్వురీతనికిఁ దోడయిరి.

అనుమకొండ రాజధానిని జయింప సైన్యసమేతుఁడై వచ్చి యరికట్టి కాకతి ప్రోలరాజు ప్రతాపప్రదీప్తి ముందు నిలువనేరక క్షణములో జగద్దేవుఁడొకఁ డోడి పాఱెనని యనుమకొండ శాసనము చెప్పుచున్నది. ఆ జగద్దేవుఁడు పట్టిపొంబుచ్చపురాధీశుఁడని, సంతాన రాజులలో నొక్కఁడని, మహా మండలేశ్వరుఁ డని, క్రీ. 1149 లో నాతఁడు కుందూరుగ్రామము దానము చేసినట్లు శాసనము గలదని, యాంధ్రుల చరిత్రము చెప్పుచున్నది. బిజ్జలునిఁ జంపిన జగదేవుఁ డీతఁడు కావచ్చును.

## ప్రాచీనభక్తులు

బసవపురాణమునఁ బ్రస్తుతులయిన ప్రాచీనభక్తులలోఁ బెక్కు 'ఱఱు వత్తుమూర్' అను పేర నఱవమునఁ బ్రఖ్యాతులయిన యఱువది మూగురు భక్తుల లోనివారు. ద్రవిడమున వారికి 'నయనార్ల'ని పేరు. నైనార్లు, నాయనార్లు అని కూడఁదెలుఁగునఁగలదు. అఱువదిమూవురలో బసవ పురాణమునఁ గొందఱును, పండితారాధ్యచరితమున మఱికొందఱును బ్రస్తుతులయిరి. కాని, యానుపూర్వితో వారినెల్లరును సోమనాథుఁడు స్తుతింపలేదు.

అఱువదిమూవుర పేళ్లను మన సోమనాథుఁడు పండితారాధ్య చరిత్రము చతుర్థ ప్రకరణమున సహస్రగణనామ సంఖ్యానమున నిట్లు పేర్కొన్నాఁడు :

తిరునీలకంఠుండు తిరునీలనక్క
తిరుమూల దేవుండు తిరునాళ్లపోవ
మానకంజారుండు మంగయక్కరసు
ఆనయనార్ మొన్నయధరుండు పిట్ట
నంగ రోహిణి పిళ్లనయనారు నంగ
సంగచండుండు పూసలనయనారు



పరమనాచియరు దీపదకళియారు
కరిగణనాథుండు గరికామదేవుఁ
డమరనీతి యిరువదాండారి మురుఘు
నమినంది యేణాధినాథుండు సాంఖ్య
తొండభూపతి చిరుతొణు తిరుకురిపి
తొండండు నంబి సిర్తొండండనంగ
సీరాలదేవుండు సేదిరాజయ్య
గారికాళవ్వ యేకాశి సోమాసి
మారుండు వీరపెర్మాణిదేవుండు
వీరచోడఁడు జడయా రిరిత్తాండి
యెల్వచలంది వాగీశనైనారు
కొళ్ళుళి యెళయదంగుళియ నైనారు
చిఱుపులియా రులచ్చిరియారు నారు
మిఱుమిండయారు నమిత్తండయారు
కరియంబ యరిపాలు కడమలనంబి
కళియంబ గుగ్గుళ కళియనైనారు
కన్నప్పతాపసి కరయూరచోడు
చెన్నయ్య చోడండు చేరమరాయఁ
డిడుగుడిమారయ్య నిడుమారదేవుఁ
డడిభర్తయణుమూర్తి యఱువత్తుమూరు.

సంఖ్యకఱువదిమూగురే యయినను సంస్కృత కర్ణాటద్రవిడ గ్రంథములలో వారిపేళ్లు గొన్ని భేదించుచు నెక్కువగుచున్నవి[1] ఒక గ్రంథమున బేర్కొనఁబడినవారిని

1. కన్నడమున – 'అఱువత్తుమూవుర పురాతనచరితె' 'త్రిషష్టి పురాతనచరితె' 'అఱువత్తుమూరు పురాతనశరణరచరిత్రె'; సంస్కృతమున– స్కాందోపపురాణ, శివరహస్య, శివభక్త మాహాత్మ్యములు; తమిళమున–పెరియపురాణము.

గౌందఱను వేఱొక గ్రంథము పేర్కొనకున్నది. ఒకనికే యొక గ్రంథమున నొకపేరు, వేఱొక గ్రంథమున వేఱొక పేరును గలదు. వానిని సరిచూచి బసవ పురాణమునఁ బ్రస్తుతులయిన వారిని గూర్చి యించుక వివరణము చేయుచున్నాడను.[1]

**సుందరనాయనారు :–**పు. 128 [2] నంబినాయనారని ఒడయనంబి యని యాతని నామాంతరములు. సుజ్ఞానిని, జటీశ్వరుఁడు ఈతని తల్లిదండ్రులు. నదిపురపు నరసింహవర్మ (నరసింహమునయర్) ఈతనిఁ బెంచుకొన్నాఁడు. ద్రవిడభాషలో నీతఁడు గొప్పకవి. తిరుత్తొండర్‌తొఘై యని యాతఁడు రచియించిన శైవస్తోత్రమును బ్రపంచించి సోమనాథుఁడు (పు. 134) కొంత తెలిఁగించినాఁడు. ఒడయనంబివిలాసమని యాతని చరిత్రమే తెలుగునఁ బ్రబంధముగా రచితమయినది.

**మిఱుమిండఁడు :–** పు. 128 మెఱెమిండర్, విఱన్‌మిండర్, వీరమిండ, శంగునాయనార్ అని యాతని పేళ్ళితర గ్రంథములఁగలవు.

**చేరమచక్రవర్తి** – మహాగోదుఁడని యాతని నామాంతరము. పయి ముచ్వురును సమకాలమువారు.

**కుమ్మర గుండయ్య** – పు. 139 తిరునీలకంఠర్ అని నామాంతరము

**దంగుళి మారయ్య** – పు. 138 ఇళయాంగుడిమారన్ అని యఱవమున, 'భక్తోదంగుళిమారాఖ్యః' అని సంస్కృత బసవపురాణమున, 'ఎళయ దంగుళిమారన్' అని కన్నడమునఁ గలదు.

---

1. మైసూరు ప్రాచీనవస్తు పరిశోధక సంఘమువారు ఈ సంవత్సరపు కార్యనివేదన ప్రకటనమున 'అఱువత్తుమూవుర' చరిత్రమునుగూర్చి కొంతపరిశోధనము నెఱపినారు. ఇక్కడ నాకది కొంత యుపకరించినది. వీరినిగూర్చి ద్రవిడవిద్వాంసులే యింకను సరియైన పరిశోధనము జరపఁజాలకున్నారు. నేనిక్కడ మైసూరు రిపోర్టులోనున్న క్రమము ననుసరించు చున్నాఁడను.

(2. ఇందలి ఈ పుటసంఖ్యలు బసవపురాణము ఆంధ్ర గ్రంథమాల –౨ 1926 ముద్రణము ననుసరించినవి.) –ప్రకాశకులు.



**చేదివల్లభుడు** – పు. 137 సిద్ధిరాజని నామాంతరము.

**ఇఱువదాండారి** – పు. 104 ఇరువత్తుఁడు ఇఱిపత్తనాయనార్. ఎఱి పత్తనాయనార్ అని ద్రవిడకర్ణాటములందుఁ బేరు. సంస్కృత బసవపురాణమున ఇరువత్తుఁడని కలదు.

**కరయూరిచోడఁడు** – పు. 137 కరపూరిచోడఁడని కన్నడము. పొగ్గళ్ చోళఁడని యఱవము.

**ఏణాధినాథుఁడు** – పు. 136 ఏణాదినాథుఁడని యఱవము సంస్కృత బసవపురాణమున ఏణాధినాథుఁడనియే కలదు.

**ఉడుమూరి కన్నప్ప** – పు. 78 కణ్ణప్పన్. శ్రీకాళహస్తివాఁడు.

**గుగ్గులుకళియారు** – పు. 135 కంకుళినాయనార్ అని యఱవము.

**మానకంజారుఁడు** – పు. 57 చోళరాజు.

**అరివాళునాయనారు** – పు. 135 సంకులాదాయుఁ డని నామాంతరము. శూద్రుఁడు.

**రుద్రపశుపతి** – పు. 63 తెలుఁగు బసవపురాణమున నున్న కథ వేఱు; అఱవముననను, గన్నడముననను నున్నకథ వేఱు. తెలుఁగుకథలో 'ఆదిపురాణ' మని ద్రవిడ శివపురాణము పేరున్నది. అఱవమున నట్టి గ్రంథము తెలియరాదు.

**చండేశుఁడు** – పు. 228

**తిరునావుకరశు** – పు. 172 అప్పర్ అని నామాంతరము. ఈతఁడు తిరుజ్ఞానసంబంధి కుజ్జపాండ్యుల సమకాలమువాఁడు. ద్రవిడమున గొప్పకవి.

**కరికాళవ్వ** – పు. 69 పూతవతి నామాంతరము.

**నక్కనైనారు** – పు. 65 తిరునీలనక్కనైనార్, నీలనగ్న, మురుగర్ నామాంతరములు.

**నమినంది** – నేమినంది నామాంతరము

**పిళ్లనైనారు** – పు. 174 తిరుజ్ఞానసంబంధి నామాంతరము. సౌందర్యలహరిలో శంకరాచార్యులవారు 'ద్రవిడశిశు'వని యీతనినే ప్రశంసించిరి. వాగీశ, నక్కనైనార, హరదత్తాచార్యాదుల కీతఁడు సమకాలము వాఁడు. వైష్ణవుల పన్నిద్దఱాళ్వారులలో నొకఁడగు తిరుమంగైయాళ్వారుతో నీతఁడు భాషించెనట.

**కలికామదేవుఁడు** – పు. 132

**తిరుమూలదేవుఁడు** – పు. 140

**నాట్యనమిత్తండి** – పు. 79 దండియడిఘళ్. బసవపురాణమున నున్న కథవేఱు. పెరియపురాణకథ వేఱు.

**సాంఖ్యతొండఁడు** – పు. 179 తెలుగున సర్వత్ర 'సాంఖ్య' అనియే యున్నదిగాని యాతఁడు శాక్యుఁడగుటచే శాక్యతొండఁడని యుండఁదగును. అఱవమున నట్లే కలదు.

**చిఱుపులి** – పు. 140 శిఱపులి, నిరోధిశార్దూలుఁడు అని నామాంతరములు.

**చిఱుతొండఁడు** – పు. 140 సిరియాలుఁడు, దభ్రభక్తుఁడు నామాంతరములు. ఈతఁడు రెండవపులకేశిని జయించి, వాతాపికోటను బట్టుకొని తన రాజున (మొదటి నరసింహవర్మ ?) కొసఁగెను. ఈతఁడు సేనాధిపతి. కాంచీపుర వాస్తవ్యుఁడు. క్రీ. శ. 630 నాఁటివాఁ డగును. ఈతని కొడుకు సీరాలుఁడు; భార్య తిరువెంగాణి; దాసి చంద (న) నంగ.

**అడిభర్త** – పు. 136 అదిపత్తర్ అతిభక్తర్ నామాంతరములు.

**కళియంబనైనారు** – పు. 137 కలికంపఁడు, కలికంబఁడు నామాంతరములు.

**సుందరపాండ్యుఁడు** – పు. 176 కుబ్జపాండ్యుఁడు కూనపాండ్యుఁడు, గూనిపాండ్యుఁడు నామాంతరములు. జినసేన భట్టాకలంకాదు లీతని జైనునిఁ జేసిరి. పిదపఁదిరుజ్ఞానసంబంధి శైవునిఁ జేసెను.



**నరసింగ మునయర్** – పు. 121శిరత్తుణైనాయనార్, రణమిత్రుఁడు అని కర్ణాట సంస్కృత గ్రంథములందు నామాంతరములున్నవి. అందు నరసింగ మునయర్ కథ వేఱుగా నున్నది.

**కొట్టరువుచోడఁడు** – పు. 121 కుట్టులినాయనార్.

**పూసలనాయనారు** – పు. 140 పోసల నాయనార్.

**మంగయక్కరశి** –పు. 176,177 సుందర పాండ్యుని భార్య. (పొగ్గళ్ కరయూరి) చోడనికూఁతుఁరు.

అఱువదిమూగురలో ద్రవిడకర్ణాట గ్రంథములందు వర్ణితులలో బసవపురాణమునఁగానవచ్చినవారిని బయిఁబేర్కొంటిని. ద్రవిడ కర్ణాట గ్రంథములందుఁగానవచ్చువారు కొందఱు మన బసవపురాణమునఁ గానరాకున్నారు. బసవపురాణమునఁ గానవచ్చువారు గొందఱు ద్రవిడకర్ణాట గ్రంథములందుఁ గానరాకున్నారు. కథలలోఁగూడఁ గొన్ని భేదములుగలవు. ఆయా విషయములు సమగ్రముగాఁ జర్చించుట కిది చోటుగాదు.

## మఱికొందఱు

**శంకరదాసయ్య, తేడరదాసయ్య, దుగ్గళవ్వ** – వీరు ముప్వురును సమకాలమువారు. పు. 111,114,181,199 పశ్చిమ చాళుక్య రాజయిన జగదేకమల్లుఁడు (ఈతఁడే రెండవ జయసింహవల్లభుఁడు. దేసింగుఁడు, సింగబల్లహుఁడు అని పేర్కొనఁబడినవాఁడు నీతఁడే), కళ్యాణకటకమునఁ బంచలోహములతోఁబోతఁపోయించి నెలకొల్పిన విష్ణుప్రతిమను దృష్టించి జడయశంకరస్థానవాస్తవ్యుఁడైన శంకరదాసయ్య తుత్తునియలు చేసెను. ఈ సింగబల్లహుని భార్యయే సుగ్గళదేవి. ఈమె శైవమతస్థురాలు. తేడరదాసయ్య యీమె గురుఁడు. తన మాహాత్మ్యమును ప్రకటించి తేడరదాసయ్య సింగబల్లహుని శైవునిఁగాఁ జేసెను. పొట్లచెరువు, కొలిపాక యనుపురములాతని రాజ్యస్థానములుగా శాసనములందుఁగలదు. పొట్లచెరువులోనే తేడరదాసయ్య

మాహాత్మ్యమును బ్రకటించి యక్కడి జైనమఠముల నేణ్ణూఱింటిని జెడఁగొట్టించెను. అప్పుడు రాజుతో నక్కడి జైనులెల్లరుగూడ శైవమత మవలంబించిరి. పొట్లచెఱువు బళ్లారి మండలమందుఁ గలదు. కొలిపాక యెక్కడిదో యెఱుఁగరాదని ఫ్లీటుదొరగారు వ్రాసిరి. కాని యది నిజాం రాష్ట్రాంధ్రదేశమున నున్నది.

**హలాయుధుఁడు** – ఈతఁడు చిఱుతొండనికి సమకాలమువాఁడని కలదు. చిఱుతొండఁడు క్రీ.శ.630 వాఁడని గుర్తించితిమి గాన, యీతఁడు నాకాలమువాఁడగును. హలాయుధస్తవమని యీతఁడు రచియించిన శివస్తవము (పంచస్తవిలో నొకటి) కలదు. హలాయుధ నిఘంటు వీతనిదగునో కాదో?

ఉద్భటుఁడు– పు. 219 శైవులెల్లరు నీతని స్తుతింతురు.

క. హరలీలాస్తవరచనా
స్థిరనిరుపమభక్తిఁ దనదుదేహముతోడన్
సురుచిర విమానమున నీ
పురమున కుద్భటుఁడు ప్రీతిఁ బోవఁడె రుద్రా!

శివతత్త్వసారము.

క క్రమమున నుద్భటుఁడు గవి
త్వము మెఱయఁ గుమారసంభవము సా (నా?) లంకా
రము గూఢవస్తుమయకా
వ్యముగా హరలీలఁజెప్పి హరుమెప్పించెన్.

నన్నిచోడ కుమారసంభవము.

ఉద్భటారాధ్యచరిత్ర[1] మని తెనాలి రామలింగకవి యీతని చరిత్రమునే తెలుఁగునఁ బద్యకావ్యముగా రచియించెను. తెలుఁగుదేశమున నుద్భటారాధ్య

1. ఇది సరస్వతీ పత్రికలో (ముక్త్యాల) ముద్రితమయినది. విశేష విషయములు విపులముగా దానికి నేను వ్రాసిన పీఠికలోఁ జూడదగును.
( చూ. పుటలు 79– 97. ప్రకాశకులు)



పరంపరవారారాధ్యులు పలువురున్నారు. ముదిగొండవా రుద్భటారాధ్య పరంపరవారని యుద్భటారాధ్య చరిత్రమునఁ గలదు. ఆతఁడు ఘూర్జరదేశమునఁ గల బల్లకిపుర వాస్తవ్యుఁడని బసవపురాణాదులందుఁ గలదు. కాశ్మీరరాజగు జయాపీడునిసభలో విద్యాపతిగా నుండెనని (క్రీ. శ. 779 నుండి 813 వఱకు)

## వంశవృక్షము




1. శ్రీపతిపండితుని యనంతరము బహుపురుషాంతరములదాఁక నీ వంశమువారు బెజవాడవాస్తవ్యులు గానే యుండిరి. ధర్మగుప్తాభ్యుదయాదిప్రబంధకర్తకాలమునఁ గాఁబోలును ఎలకుత్తినగ్రహారముగాఁ బడిసి వారు బెజవాడ వీడి తమ యగ్రహారమున వసింపఁజొచ్చిరి. శ్రీ నాగేశ్వరరావు గారు నేఁడు బెజవాడలో దివ్య సౌధమును గట్టించి తత్స్థానవాస్తవ్యులై యెనుబదివందల యేండ్లకంటె నెక్కువకాలము నుండి తమవంశము వారికిఁ జెల్లుచున్న ప్రాచీనపుఁగాణాచిని మరల నిలుపుకొన్నారు.

అనంతన

కాశీనాథుఁడు

పెదసోమేశ  పినసోమేశ  లింగయ్య  బసవన్న  కోటిపల్లీశ్వరుఁడు

కాశీనాథ  తిమ్మన  పండితుఁడు

అనంతుఁడు  గౌతముఁడు

మల్లికార్జునుఁడు

లింగన

కాశీనాథుఁడు

అనంతుఁడు  గౌతముఁడు

గౌతముఁడు  శరభ  అయ్యన

గౌతముఁడు  నాగ

అనంతుఁడు  చంద్రశేఖరుఁడు  వీరభద్రుఁడు  గౌతముఁడు  శరభ



అఘోరమూర్తి  [1]వీరేశ  గౌతమ  చంద్రశేఖరుఁడు  కాళహస్తీశ్వరుడు  కాశీనాథ  అయ్యన్న

శరభ

నాగయ్య  సాళ్వపతి  వీరభద్ర

వీరమల్ల

నాగేశ  అయ్య  సదాశివ  చంద్రశేఖర  బుచ్చన

బ్రహ్మయ్య  బాపయ్య  మల్లయ్య

బుచ్చయ్య  వియ్యన్న

నాగలింగం  నాగేశ్వరరావు  సాంబశివరావు

బుచ్చయ్య

రాజతరంగిణిలోఁగలదు. కర్ణాటకవులు కుమారపాల ఘూర్జరుచరిత్రమునే యుద్భటచరిత్రమునుగాఁ జెప్పిరి. అది ప్రామాదికమేమో! ఇర్వురకథలకుఁ గొంత సామ్యముగలదు. దానిఁబట్టి వారు పొరఁబడియుందురు. ఆ కర్ణాట కవులకంటెఁ బూర్వుఁడయిన పాల్కురికి సోమనాథుఁడు వారిర్వుర కథలను వేర్వేఱుగా వర్ణించినాఁడు.

---

1. ఈతఁడు భద్రాయుశ్చరిత్ర, ధర్మగుప్తాభ్యుదయ ప్రబంధకర్త. ఈ తరముదగ్గఱనుండి సమగ్రమయిన వంశవృక్షము గలదు. కాని, యిందు శ్రీ నాగేశ్వరరావుగారి శాఖయే కైకొనఁబడినది.

## పండితత్రయము

శ్రీపతిపండితుఁడు, శివలెంక మంచెన పండితుఁడు, మల్లికార్జున పండితుఁడు పండితత్రయమని పాల్కురికి సోమనాథుఁడు చెప్పినాఁడు.

హరభక్తియుత్పత్తి కధిపతి నాఁగఁ
బరగెను దొల్లి శ్రీపతి పండితయ్య
చెనసి భక్తి క్రియాస్థితికర్తయనఁగఁ
జనియెను లెంకమంచెనపండితయ్య
దూరాన్య సమయసంహారుఁడై చనియె
శూరుండు మల్లికార్జున పండితయ్య
ఖ్యాపితభక్తికిఁ గారణపురుషు
లై పండితత్రయంబన భువిఁజనిరి.

– పండితారాధ్యచరిత్ర.

శ్రీపతిపండితుఁడు – (పుట. 210) ఈయన యాంధ్రుఁడు; బెజవాడ వాస్తవ్యుఁడు.

పశ్చిమచాళుక్యరాజగు నాఱవ విక్రమాదిత్యుని యొద్ద దండనాయకుఁడై పెక్కు రాజ్యములను జయించిన యనంతపాలుఁడు కొండపల్లినాడు పాలించుచు బెజవాడలోనుండఁగా నీ శ్రీపతిపండితుఁడాతనికి గురుఁడైయుండెను. అనంతపాలుని శాసనము బెజవాడకుఁ జేరువగానున్న చేఁబ్రోలఁగూడఁ గలదు. ఆతఁడు క్రీ.శ. 1095–1118 లో నుండెను. శ్రీపతిపండితుని మల్లికార్జున పండితారాధ్యుఁడిట్లు ప్రశంసించినాఁడు.

క. ఒక్కఁడె దైవము శివుఁడని
నిక్కము సేయుటకు ముడిచె నిప్పులు సీరన్
స్రుక్కక శ్రీపతి పండితుఁ
డక్కజముగ విజయవాడ నలజమ్మి శివా!



మన సోమనాథుఁడుగూడ నీ కథనే పేర్కొన్నాఁడు. [1] శ్రీపతి పండితుని వంశమువాడగు కాశీనాథుని వీరారాధ్యుడు తన ధర్మగుప్తాభ్యుదయమున నీ కథ నిట్లు వివరించి చెప్పినాఁడు.

గీ అరయఁ దత్పండితేంద్ర నిజాంశభూతి
భవులు శ్రీపతి మంచెనపండితులును
మల్లికార్జునపండితుఁడెల్ల జనులు
వినుతులొనరింప వెలసిరుర్వీతలమున.

గీ. వారు భువి వీరశైవ ప్రవర్తనంబు
బ్రాహ్మణాచారమగునంచుఁ బత్యమాన
వేదవేదాంత సిద్ధాంత విశ్రుతముగఁ
దెలియఁ జేయుచు విలసిల్లరలఘుమహిమ.

క. ధీరుడు శ్రీపతిపండితుఁ
డారయఁ బ్రాచీనదేశికాహ్వాయుఁడు మహో
దార దివాద్వయమార్గ
స్వారధురంధరుఁడు లోకపావనుఁడెన్నన్.

క. ఆ గురుడు విజయవాటిని
భోగోజ్జ్వలమందిరమున బుధయుతుఁడై శై
వాగమ నైగమబోధా
యోగమునఁ జరింపుచుండి యొకనాఁ డనియెన్.

1 శ్రీపతి పండితవంశమవారే తర్వాత 'కాశీనాథుని' వారయిరి. కాశీనాథుని వీరారాధ్యులు రచియించిన ధర్మగుప్తాభ్యుదయ భద్రాయుశ్చరిత్ర కృతులనుబట్టియు, తచ్ఛిష్యుఁడగు సిద్ధరామయ్య రచించిన సంస్కృతోదాహరణ స్తవాదులనుబట్టియు నీ విషయము గుర్తింపనగును. కాశీనాథుని నాగేశ్వరరావుగారి కీ వీరారాధ్యుఁడు 5వ తరమువాఁడు. శ్రీపతి పండితోపక్రమముగా వీరారాధ్యులవఱకు వంశక్రమము, పయిగ్రంథములందుఁ గలదు. అది యిట్టిది.–

క. శివుఁడే దైవము ధరలో
శివభక్తులె సత్కులీన సిద్ధాంతపరుల్
శివమంత్రమె మనురాజము
శివుని ప్రసాదంబె భోగశేఖర మరయన్

వ. అని శపథంబుగా బలుకుచు ననంతపాలదండనాయక మహీధవాది శిష్యతతి సేవాయత్తచిత్తంబులం బ్రవర్తింపుచుండఁబరవాది కోలాహలుండై జయవాటీపురంబున విజయధ్వజంబెత్తి మహోత్తర శైవాచార్యం డనఁజెలంగు చుండి యొక్కనాఁడు.

సీ. సరవిఁగృష్ణానదీస్నానంబు గావించి
నిత్యకృత్యంబులు నెఱయఁదీర్చి
వచ్చుచోఁబురవీథి వసుధేశు మదగజం
బరుదేరఁదొలఁగుచు నచట నొక్క
గొడగరి వాకిలిఁగడఁజొచ్చి నిలిచిన
నంతఁదద్గృహమేధి యరుగుదెంచి
శరణార్థి, గురురాయ, సతతంబు నా వ్రతం
బార్వు రయ్యలకు శివార్చనంబు

దగసలుపుచుంట నొకయయ్య తక్కువయ్యె
నేఁడు లింగైక్య మిఁకనాకు నిక్క మనిన
మంచిదని వాని వ్రతమొనరించి వేడ్క
వచ్చు దేశికుఁగని పరవాదులుదరి

క ఓహో, బ్రాహ్మణుఁడట యితఁ
డాహా యగ్గొడగరింట నారోగిణ మి
ట్లీహీ యొనరిచివచ్చెను
ద్రోహంబని చుట్టుకొనిరి దుర్మతు లగుచున్

గీ. పరగ నీ రీతిఁబరవాదులురవడించు
గతికిఁదా మున్ను జేసిన కడుఁబ్రతిజ్ఞ



నిగమసమ్మతి రూఢిగా నెఱపఁదలఁచి
వారు గొనిపోవ నృపసభఁ జేరె గురుఁడు

వ. ఇట్లు పరవాదులప్పండితేంద్రునననంతపాల దండనాయక భూవరా స్థానంబునకు గొనిపోయి యిట్లనిరి.

క. గొడగరి మల్లయ యింటను
గడుపారఁగఁగుడిచిరాఁగఁగాంచితిమితఁడే
ర్పడ మీ గురువెట్లగునని
కడుఁదోఁచక యుంటిమిపుడు కలఁగుచు నధిపా!

సీ. అని యిట్లు విప్రులాడిన నలంకుచు సభ్యు
లా పండితునిఁ జూచి యనఘచరిత !
యిది యెట్టిదగునని ముదలింపఁ జిఱునవ్వు
సెలవులదైవాఱి చెలువుదనర
నింతయు నిజము మేమెనయ మున్నొనరించు
ప్రతినయిట్టిది యసత్ప్రాజ్ఞులార,
మొనసి యాత్మాద్వైతమున శివాద్వైతంబు
ననుఁజెందువారలఁగినిసిజాతి

గీ. భేదమెంచఁగరాదని పృథులశాస్త్ర
రీతులును మౌనివర్గంబు నీతి దెలియుఁ
దరసి జాబాలశతరుద్రియాదులందుఁ
బలుకు పలుకులు వినుఁడు విభ్రమముమాని.

(పౌరులంగీకరింపక పండితుని బహిష్కరించిరి– పచనాదులకగ్ని నొసఁగరయిరి – అంత)

సీ. వేదవేదాంతార్థ విధులచే సాధింపఁ
గాలేక మూర్ఖులై కదిసి మీర
లగ్ని మీ కిడమని యార్చుటలది మీకుఁ
గలిగియుండినఁగదా కడమమాట

లని కోపశిఖివీక్షణాగ్ర ప్రచారియై
గరిగొని విస్ఫులింగములఁ దనుప
బొమలు గంటిడ ధరాభ్రమణంబుచే దిశల్
కుమ్మరిసారె చందమ్ము నెఱప

గీ. గగనభాగంబునందిరుల్ గ్రమ్ముకొనఁగ
సర్వజీవౌఘమును సభాసదులు మూర్ఛ
నొంద నప్పండితేంద్రుఁ డత్యుగ్రవేగ
సరణి లంఘించెఁ దన్మహాస్థాన వీథి.

వ. అప్పండితేంద్రుండు జయవాటికాపురమల్లికార్జునాగ్నేయభాగంబున నున్న శమీశాఖి సమీపంబునకు నరిగి యద్దేవున కభివందనంబును ప్రమథగణ స్తోత్రంబును గావించి వీతిహోత్రు నాకర్షింపుచుఁ దనమీఁది పట్టుపచ్చడం బునంగట్టి యిట్లనియె.

మ. వినుమీ పావక, శైవగేహములలో విశ్రాంతి దక్కన్ బురం
బున నెందున్ వసియింపకీ కుజనవిస్ఫూర్జన్మదంబున్ హరిం
పు నగేంద్రాలయునాజ్ఞ దప్పి యనయంబున్ మీఱినన్ వీరభ
ద్రునిచే నీకగు బన్నమున్ దెలియఁగా దొడ్డాడ నింకేటికిన్.

(అట్లు శ్రీపతిపండితుని యానచొప్పున గ్రామమున నగ్నికరవయ్యెను. అనంతపాలదండనాథాదులతో నెల్లరును వచ్చి శరణార్థులయిరి. వారము దినములయిన పిదప శ్రీపతిపండితుఁడు శమీవృక్షపుఁ గొమ్మను వ్రేలఁగట్టిన పచ్చడపుమూటను విచ్చి యగ్నిదేవుని విడిచిపుచ్చెను. పండితుని మాహాత్మ్యమున కచ్చెరువంది యనేకులు తచ్ఛిష్యులయిరి. తదాది శ్రీపతిపండిత సంప్రదాయము వారికి బెజవాడ యాస్థానమయ్యెను.)

## శివలెంక మంచెనపండితుఁడు (పుట. 197)

శివలెంక యింటిపేరివారారాధ్యబ్రాహ్మణులు నేఁడును బ్రఖ్యాతులుగా నాంధ్రదేశమందుఁగలరు. శ్రీపతిపండితారాధ్యుని వంశవృక్ష మున్నట్టే మంచెన పండితుని వంశవృక్షమును నేఁటి శివలెంకవారియొద్ద నెందేని కలదేమో! మంచెనపండితుఁడు శ్రీపతిపండితునకించుక తర్వాతికాలమున నుండెను.



## మల్లికార్జునపండితుఁడు

ఈయన చరిత్రము ప్రసిద్ధమే. ఈ పీఠికలో నింతకుముందక్కడక్కడఁ గొంత ప్రస్తుతమునయ్యెను. గోదావరీతీరమందలి దాక్షారామమీయన జన్మదేశము. ఈయన పెక్కుగ్రంథముల రచియించెను. అందు శివతత్త్వసార మను తెల్గుకృతి నొకదాని నేను ప్రాచ్యలిఖితపుస్తకశాలకై సేకరించితిని. ఇప్పుడు మఱియొక 'శ్రీముఖదర్శనగద్య' మనుదానిఁగనుఁగొనఁగల్గితిని. దాని యాద్యంతము లిట్టివి:–

ఆది :–

శ్లో. త్రైలోక్యస్య భవానేవ నిగ్రహానుగ్రహక్షమః;
శ్రీవిశ్వేశ్వర మాం పాహి మహేశ్వర! నిరీశ్వర!

జయజయ రుద్ర, వీరభద్ర, విరించిపంచమశిరఃఖండన, యజ్ఞపురుష శిరః ఖండన!–

అంతము :–

మల్హణప్రియ, బల్లాణప్రియ, కుమ్మరగుండయ్యప్రియ, అఖిలభువన భక్తజనప్రియ, దేవా! సురపతిప్రముఖ నిఖిల ప్రార్థితప్రథన పరమేశ్వర, దేవా నమస్తే నమస్తే నమః.

శ్రీమాన్ మాహేశ్వరశ్శిష్టో మల్లికార్జునపండితః;
శ్రీముఖదర్శనగద్యం హృద్యం గ్రథితవాన్ (?)

## శైవమతము

క్రీస్తు పుట్టుకకుఁ బూర్వమున నుండియు, అనగా రెండువేల యేండ్లకుఁ బూర్వమున నుండియు దక్షిణాపథమున శైవవైష్ణవ మతములు పేర్వెలయు చున్నవి. ప్రధానముగా వైష్ణవమతమునకు ద్రవిడ దేశమందును, శైవమతమునకుఁ

గర్ణాటాంధ్రదేశములందును బ్రచారము గలదు. శ్రీరంగక్షేత్రము వైష్ణవులకును, శ్రీశైలము శైవులకును, దీర్థములుగా నుండెడివి. ద్రవిడదేశమునఁ గూడ మధురాదిక్షేత్రములు, శైవులకుఁదీర్థములుగా నున్నవి గలవు. శ్రీశైలము కర్ణాటాంధ్రదేశముల కూడలిలోఁగలదు గావునను, బ్రాయికముగాఁ గర్ణాటాంధ్రదేశములకుఁ బాలకు లొక్కరే యయిరి గావునను, లిపిలో మాత్రమే కాక భాషలోఁగూడ నంతగా భేదములేదు గావునను గర్ణాటాంధ్రులా కాలమునఁ బరస్పరము మిక్కిలి సన్నిహితులుగా నుండెడివారు. శ్రీశైలము చతుర్ద్వారములు[1] (త్రిపురాంతకము, సిద్ధవటము, అలంపురము, మాహేశ్వరము) గలదై యా కాలమునఁగర్ణాటాంధ్రశైవాచార్యులకు నిత్యనివాసముగా నుండెడిది. ఎడతెగక శైవులు శ్రీశైలమునకు రాకపోకలు జరపుచుండెడివారు. నిత్యముగా నక్కడ ననేకులు నివసించుచుండెడి వారు. సామాన్యముగా నిక్కడ శైవులని నేను పేర్కొన్నను నాకాలపు శైవులలోఁ గొన్ని భేదములు గలవు. ఆ భేదములు పాశుపతము, కాలాముఖము, కాపాలికము మొదలగు పేళ్లుగలవి. శివుఁడే పరతత్త్వమని విశ్వసించువారయినను వీరిలోఁబరస్పరము మతస్పర్ధలు, విరోధములు గూడ నుండెడివి. [2]వీరికెల్లరకు నైకకంఠ్యము లేకుండెడిది. వీరెవ్వరుగాని వర్ణాశ్రమ భేదములను విడనాడినవారుగారు. పయిశైవమతముల సూక్ష్మభేదములను స్పష్టముగాఁగనుఁగొనుటకు బలవత్తరములయిన యాధారములు నేఁడు దొరకకున్నవి. శైవగ్రంథములందుద్ధృతములయిన యాగమతంత్ర

1 శ్రీశైల సంకల్పము: "పూర్వద్వార త్రిపురాంతక దక్షిణద్వార జ్యోతిస్సిద్ధవట, ప్రతీచీద్వారా ఆలంపురీ బాలబ్రహ్మేశ్వర ఉత్తరద్వార మాహేశ్వరాఖ్య చతుర్ద్వారోపశోభితే"

2. శ్లో॥ వామాః పాశుపతా శ్చైవ కాలాముఖ మహావ్రతాః
కాపాలా భైరవా శ్శాక్తా స్స్రావకా యోగధారణాః
శైవా బహువిధా శ్చైవ వైష్ణవాః పాంచరాత్రికాః;
వైఘానసాః కులాః కౌలా స్తత్సంభేదాస్తథా ఉమే;
సాంఖ్యాశ్చలాకులా శ్చైవ తథా హంసపరాయణాః;
ఏతే సమయిన స్సర్వే అన్యోన్యకలహప్రియాః;
ఏతాన్ సర్వాన్ పరిత్యజ్య వీరశైవం వదస్వ మే – వీరాగమము.



శ్లోకములనుబట్టి యాయా మతముల స్థూలస్వరూపములను మాత్రము గనుఁ గొన సాధ్యమగును. ఆ కాలపుఁదంత్ర గ్రంథములును, నాగమగ్రంథములును, నాయా మతములవారి యనుష్ఠాన నిబంధములును నేఁడు పర్యాప్తముగా మనకు దొరకుటలేదు. విద్యారణ్యులవారి సర్వదర్శన సంగ్రహమునఁబాశుపత శైవమతములు నిర్వచింపఁబడినవి. బ్రహ్మసూత్రములకు శ్రీకంఠశివాచార్యులు రచియించిన భాష్యము విశిష్టాద్వైత సిద్ధాంతమును వాసుదేవుఁడని, శివుఁడని యనుటలోఁదక్కఁదక్కిన విషయములం దంతగా భేదములేదు. అప్పయదీక్షితులవారి కాలమున నుండియే యీ గ్రంథ మెక్కువ వ్యాప్తిఁజెందినట్టు గానవచ్చుచున్నది. కావున నిది యంతగాఁబ్రాచీనమయినది గాకపోవచ్చుననియు నప్పయదీక్షితులవారి కాలముననో యంతకించుక పూర్వకాలముననో, రచితమై యుండవచ్చు ననియుఁగొందఱనుచున్నారు. రామానుజులవారీ శ్రీకంఠభాష్యమునే వరవడిగా నుంచుకొని తమ శ్రీభాష్యమును రచించిరనియు, నీ శ్రీకంఠ శివాచార్యులు శంకరులనాఁటి వారనియుఁగొందఱనుచున్నారు. ఈ విషయ మిట్లుండఁగా నీ నడుమ బ్రహ్మసూత్రముల పయి శ్రీపతి పండితారాధ్య రచితముగా శ్రీకరభాష్యమని యొక గ్రంథము బయల్పడినది. ఇది శ్రీపతిపండిత రచితము గాదనియే నా నమ్మకము. శంకరాద్వైతము ప్రబలిన పిదప నాగమతంత్ర మతములవారు గూడ, దమ మతములు బ్రహ్మసూత్రాభిప్రేతములే యని నిరూపించుటకు యత్నించిరి. స్వసిద్ధాంతానుసారముగా బ్రహ్మసూత్రములకు భాష్యముల రచించిరి. ఈ పూన్కి శంకరులకుఁ బూర్వకాలమున నున్నట్టు గానరాదు.

శ్రీకంఠభాష్యమునఁగాని, శ్రీకరభాష్యమునఁగాని పాశుపత కాలాముఖాది శైవమతభేదముల స్వరూపములు గానరావు. వీరాగమ వాతూలాగమాదులు కొన్ని శైవమతములను నిరూపించునవి గలవు.

శ్రీశైలము శైవమతస్థులకునికిపట్టుగా నుండి తత్తన్మతముల కభ్యుచ్ఛ్రయము గల్గించుచుండుట యాకాలమున దక్షిణాపథమునఁ జైనబౌద్ధమతముల వ్యాప్తికిఁ గొంత యడ్డంకిగా నుండెను. ఈ యడ్డంకిని దొలఁగఁద్రోసికొనుటకై బౌద్ధులయిన

సిద్ధనాగార్జునాదులు శ్రీశైలము మీఁదనే నెలవుకొని యక్కడనే స్తూపములఁ గట్టుకొని స్వమతములను వ్యాపింపఁజేయ మొదలిడిరి. జైన బౌద్ధ మతములు అహింసాతత్త్వమును బోధించుచు జాతిభేదమును బాటింపక యనుష్ఠాన సౌకర్యము గలిగి సర్వసమ్మతములుగా నుండుటచే ననేకు లా మతములందుఁ జేరఁజొచ్చిరి. బహుభేదములతోఁ బరస్పర స్పర్ధలతో నున్న శైవమతములానాఁడు సన్నగిలఁ జొచ్చెను. శంకరులవారి యద్వైతసిద్ధాంతము మహోదయముగలదై జైనబౌద్ధమతములనే కాక శైవమతములను గూడఁజిదుకఁగొట్టసాగెను. ఇట్లు కాలము గడవను గడవను, శైవమతములు చాల సన్నగిల్లుటయు, జైనబౌద్ధ మతములు సమధిక వ్యాప్తిగలవగుటయు, తర్వాత నద్వైత మతము సర్వాధికవ్యాప్తి గలదగుటయు, దటస్థించెను. 10,11,12, శతాబ్దుల నాఁటి కాంధ్రకర్ణాటదేశములందు మతముల స్థితి యిట్లున్నది. అప్పుడు జైనబౌద్ధాద్వైత మతముల తళ్లుననుండి స్వమతమును రక్షించుకొనుట శైవమతముల వారి కావశ్యకమయ్యెను. అందుకై యాంధ్రకర్ణాట దేశములందుఁ గొందఱు మహనీయులు వెలసిరి. ఆంధ్రదేశమున వెలసిన మహనీయులు పండితత్రయము, వీరి విషయమింతకుముందే వ్రాసియున్నాఁడను. శివలెంకమంచెన పండితుఁడును, శ్రీపతి పండితారాధ్యుఁడును రచించిన గ్రంథములేవో మనకు దొరకకున్నవిగాని మల్లికార్జున పండితారాధ్యుఁడు రచించిన గ్రంథము, శివతత్త్వసారము, నేఁడు దొరకియున్నది.[1] అందు ముందుగా నద్వైతమతమునే యాయన ఖండించెను. చందవోలు మొదలగు స్థలములం దీ పండితారాధ్యులవారు జైనబౌద్ధమతముల నెట్లు విధ్వంస పఱిచిరో పండితారాధ్య చరితముఁజదివినఁ దెలియఁగలదు. ఈయన పాశుపతశైవమత ప్రవర్తకుఁడు. ప్రాచీన

1 ఈ గ్రంథమును దొలుదొలుత నరసాపురమున నొక జంగముదేవరయింట నుండి నేనే దొరతనము వారి ప్రాచ్యలిఖిత పుస్తకశాలకై సేకరించితిని. పుస్తకమునఁ గానరాకున్ననునది శివతత్త్వసారమని మల్లికార్జున పండితారాధ్య రచితమని తొలుత గుర్తించి, కీర్తిశేషులయిన కె.వి. లక్ష్మణరావుగారికి దాని యుత్కృష్టతను దెలిపి ముద్రింపఁ గోరఁగా వా రాంధ్రసాహిత్య పరిషన్ముఖమునఁ బ్రశస్తమయిన పీఠికతోఁ బ్రకటించిరి.



సంప్రదాయానుసారముగా శైవమతమును వైదికముగా నీయన నిలువరింపఁ బూనెను. ఇట్టు ప్రాచీన సంప్రదాయములను బరిపోషించుట వలన లాభమంతగాఁ గానరాదని యెఱిఁగి యింతకంటెఁదీవ్రముగాఁ గర్ణాటదేశమున బసవేశ్వరుఁడు, ఏకాంత రామయ్య, పద్మరసు మొదలగువారు వర్ణాశ్రమాచార కలితములై యున్న ప్రాచీన శైవమత భేదములనెల్ల నడచిపుచ్చి వానిలోనుండి వీరశైవమని క్రొత్త శైవమును సర్వశైవమత సారముగా నుద్ధరించి నెలకొల్పిరి. దీనినే ప్రాచీన శైవమతములలోఁదగవులు చల్లారి యైక్యమేర్పడెను. నూతనోత్తేజముఁ గాంచి శైవమతము బలముగలదై నెలకొనెను. వర్ణభేదమును విడుచుటచే నీ శైవము జైనబౌద్ధమతములవలె సర్వసాధారణమై సులువుగా నందఱచే నాదృతమయ్యెను. ఒక ప్రక్కనిట్లు వీరు స్వమతమందు సౌలభ్య సౌకర్యములను గల్పించి పలువురనందుఁజేర్చుకొనుటతోపాటు, తమకు మతమునఁ బ్రబలప్రాతికూల్యము గలిగియున్న జైనబౌద్ధమతములను దండనీతి నుపయోగించి చెండాడి కూడ స్వమతమును బ్రబలపఱుచుకొనిరి. ఇంతగొప్ప కార్యమును సాగించుట సాధారణులకు శక్యముగాదు గదా! పశ్చిమ చాళుక్య రాజ్యమును గైవసపఱుచుకొని యేకచ్ఛత్రాధిపతిగాఁ గళ్యాణమున రాజ్య మేలుచున్న బిజ్జలుని మంత్రియు, దండనాథుఁడును మహనీయుఁడునగు బసవేశ్వరుఁడీ సంఘమందు ముందు నిల్చెను. ఈతఁడు స్వయము మహాభక్తుఁడు. శివుని వాహనమగు నందీశ్వరుని యవతారమే యీతఁడని శైవులెల్లరు విశ్వసించిరి. ఆజానజమయి శివభక్తి యీ మహనీయునందుఁ గుదురుకొనెను. శివుఁడే పరతత్త్వమనియుఁ దదన్యదేవతారాధనము దగదనియు నీతఁడు పసిప్రాయమందే నిశ్చయించుకొనెను. వర్ణాశ్రమాచారధర్మములను దదభిమానులయిన తలిదండ్రులను వర్జించెను. తానును దనదోడి శివభక్తులును సుదృఢముగా నేర్పఱుచుకొన్న మతధర్మముల నిర్వహించుటలో నిర్భయతతో మెలగెను. ఆ కాలమునఁ బశ్చిమచాళుక్య దేశమున నీతఁడు మతరాజ్యమేలె ననవచ్చును. తన మతము ననువర్తింపని వారిని జంపించెను. అట్లు చంపవలసినదిగా సంగమేశ్వరదేవుఁ డీతని బాల్యముననే శాసించెనట. ఈ శాసనముననుసరించి యీతఁడు తన యేలికయగు బిజ్జలునిఁ గూడఁ జపించెను!

బసవేశ్వరుని మత మొక్కనూఱేండ్లలోఁ గర్ణాటదేశమెల్ల వెల్లివిరిసినది. ఈ వీరశైవమతమున వేలకొలఁది జనులు ప్రవేశించిరి. బ్రాహ్మణుల దగ్గఱ నుండి చండాలురదాఁక నాకాలమున నీ కులమాకులమని భేదములేక యెల్లరు కూడిన సంఘమువారే నేఁడు లింగాయతులనుపేరఁ గర్ణాటదేశమున నున్నారు. బసవేశ్వరుని యనంతరము గొంతకాలమున కాంధ్రదేశమునఁ గూడఁ దన్మతము వారు, జంగములు, వ్యాప్తి చెందిరి.

బసవేశ్వరునకుఁ బూర్వమున్న శైవమతములను గూర్చియు, బసవేశ్వర ప్రవర్తితమైన వీరశైవమును గూర్చియుఁ గొంత వివరింతును.

## పాశుపతము

ఈ వ్రత మథర్వశిర ఉపనిషత్తునందుఁ జెప్పఁబడినది. శ్రీకంఠభాష్యము గూడ దానినే పేర్కొనుచున్నది. బ్రహ్మ ప్రణవపంచాక్షరీ ప్రాసాదాది మంత్రములు, పశు, పతి, పాశాది వస్తువ్యవహారము, భస్మోద్ధూళన త్రిపుండ్ర ధారణ లింగార్చన రుద్రాక్షధారణాది ధర్మములు పాశుపతులకుఁ గలవని శ్రీకంఠభాష్యమువలనఁ దెలియనగును. ఈ విషయములనే మల్లికార్జున పండితారాధ్యులవారి శివతత్త్వసారము గూడఁ బ్రపంచించి చెప్పుచున్నది. పాశుపతు లద్వైతమతమును మిక్కిలి గర్హించిరి. వారు జీవేశ్వరులకు భేదము చెప్పుదురు. పశువులగు జీవులు పతియగు రుద్రుని యనుగ్రహముచే పాశమయిన సంసారముననుండి ముక్తులై మోక్షసుఖము ననుభవింతురు. జీవులకుఁబాశబంధము తొలఁగును గాని పశుత్వము తొలఁగదని మల్లికార్జున పండితుఁడు చెప్పెను.

క. గోపతి కృతమున భవపా
శాపేతములయిన పశువులట్టులు భవపా
శాపేతులైన పశువులు
ప్రాపింతురు మోక్షసుఖము పశుపతి నీచేన్.

మఱియు, వారు సన్న్యాసమును గర్హింతురు.



క. ప్రాజ్ఞులు వేదజ్ఞులు లో
కజ్ఞులు చేకొంద్రె గతశిఖా గాయత్రీ
యజ్ఞోపవీతనాస్తికు
లజ్ఞులు చేకొంద్రుగాక యద్వైతమజా!

శ్రీకంఠభాష్యము గూడ సన్న్యాస మావశ్యకమనుటలేదు. పాశుపతులు విశిష్టాద్వైత సిద్ధాంతమువారు. మల్లికార్జున పండితారాధ్యులవారి శివతత్త్వసారమీవిషయమును స్పష్టముగాఁ దెలుపుచున్నది :

క. వేదోక్త సదాచారా
పాదనమున నెగడునట్టి పశువులకుఁ బురా
పాదిత దురితక్షయమై
యాదరమున ధర్మమధికమగు నీశానా!

క. ధర్మాధిక్యంబున నతి
నిర్మలబోధయు విరక్తినిష్ఠయుఁగల య
కర్ములకు నీ ప్రసాదము
పేర్మిని శివభక్తి పుట్టుఁ బృథుభావమునన్.

క. మానితశివభక్తి శివ
జ్ఞానధ్యానముల నీ ప్రసాదాతిశయా
నూనతఁ గర్మక్షయమై
యానందప్రాప్తి ముక్తుఁడగు నీశానా!

విశిష్టాద్వైత సిద్ధాంతమునకు జీవగఱ్ఱ యనఁదగిన శ్రుతి (నాయ మాత్మా ప్రవచనేన లభ్యో న మేధయా న బహునా శ్రుతేన, యమైవైష వృణుతే తేన లభ్యస్తస్యైష ఆత్మా వివృణుతే తనూం స్వామ్) ప్రతిపాదితమయిన యర్థమునే పయిపద్యములును జెప్పుచున్నవి.

విశిష్టాద్వైతులవలె వీరును శ్రౌతస్మార్తకర్మలతో సమానముగా నా (శైవా) గమోక్తము లయిన కర్మములను గూడ నాచరింతురు.[1]

## కాలాముఖులు

వీరి సిద్ధాంతమేదో స్పష్టముగాఁ దెలియరాదు. కాని, వీరు శక్తిపూజను గూడఁజేయువారుగాఁదెలియవచ్చుచున్నారు. మండలార్చనాదులు శాక్తసంప్రదాయములు గొన్ని వీరికిఁ గలవు. లింగార్చనము శక్తిశివసంయోగ రూపమయినదే. శక్తిచిహ్నము పానవట్టము, శివచిహ్నము లింగము నగును. శక్తిరహితుఁడగు శివుఁడు చేష్టింపఁజాలడనియు, శక్తిసహితుఁడగు శివుఁడే సర్వశక్తుఁడనియుఁ బ్రాచీన శైవసిద్ధాంతము. ఈ విషయమునే శంకరాచార్యుల వారు సౌందర్యలహరిలో 'శివశ్శక్త్యాయుక్తో యది భవతి శక్తః ప్రభవితుం – నచే దేవం దేవో న ఖలు కుశలస్స్పందితు మపి' అని చెప్పిరి. మఱియు జీవాత్మ శక్తిపీఠమనియుఁ, బరమాత్మ లింగమనియు, లింగపీఠములు జీవాత్మైక్యబోధకములనియు నాగమములందుఁ గలదు : జీవాత్మా శక్తిపీఠం స్యాత్ పరమాత్మాతు లింగకమ్'.

కాలాముఖులు శక్త్యర్చనముగూడఁగావింతురు. వారు నిత్యబ్రహ్మ చారులు. గార్హస్థ్యము వారికిఁదగదు. నన్నిచోడని కుమారసంభవమునఁ గాలాముఖ శైవసంప్రదాయములు కొన్ని గాననగును.

## పాశుపతాదులు లింగధారులు గారు

దేవలకులు మంత్రదీక్షాన్వితులును
శైవపాశుపతాది శాసనధరులు

1 వేదోఽపి శివాగమ ఇతి వ్యవహారో యుక్తః, తస్య తత్కర్తృత్వాత్; అతశ్శివాగమో ద్వివిధః, త్రైవర్ణికవిషయస్సర్వవిషయ శ్చేతి; వేద స్త్రై వర్ణిక విషయః, సర్వవిషయ శ్చాన్యః, ఉభయో రేక ఏ ఈశాన స్సర్వవిద్యానామ్... అతః. కర్తృ సామాన్యా దుభావప్యేకార్థపరం ప్రభామాణమేవ.– శ్రీకంఠభాష్యమ్.



వారివారిక లింగవంతులై చూచి
వారివారిక లింగవంతులై కూడి

–బసవపురాణము.

ఈ ద్విపదలు బసవేశ్వరుని యుద్బోధమువలన లింగధారణములేని పాశుపతాదులుకూడ లింగధారులయి వీరశైవమునఁ జేరఁజొచ్చిరని చెప్పుచున్నది.

వ్రతం పాశుపతం చైవ కాలాముఖకపాలికే,
లింగాంగ సంగహీనత్వా త్తచ్ఛిష్యో నరకం వ్రజేత్.

– వీరశైవాచారసంగ్రహము.

శ్లో. శైవాన్ పాశుపతాన్ వామాన్ కాలాముఖమహావ్రతాన్,
అతిరిచ్యతి దేవేశి! ప్రాణలింగార్చనో బుధః.

– వీరాగమము.

పై శ్లోకములు పాశుపతులు, కాలాముఖులు, కాపాలికులు లింగధారులు గారనియు, అట్టివారికి శిష్యుఁడగువాఁడు నరకము నందుననియుఁ జెప్పుచున్నవి. ఇట్టి శ్లోకములు పెక్కులు గలవు.

## తెలుఁగునాటి యారాధ్యులు వీరశైవులు గారు; పూర్వకాలమున వీరు లింగధారులు గారు

ఈ విషయము తగవులకుఁ దానకమగునని నే నెఱుఁగుదును. అయినను నాకు వాస్తవముగాఁదోఁచినదానిఁ దెలుపుచున్నాఁడను. ప్రాజ్ఞులు పరిశోధింపఁ దగుదురు. తెలుఁగుదేశపువారగు పండితత్రయము (శివలెంకమంచెన పండిత, శ్రీపతిపండిత, మల్లికార్జున పండితులు) లింగధారు లనుటకు బలవదాధారములు నాకుఁగానరాలేదు. మల్లికార్జున పండితారాధ్యుల గ్రంథమున నెక్కడను లింగధారణ ప్రశంసయే లేదుగదా! ఆంధ్రదేశమున నాకాలమునఁ గాలాముఖులు గూడఁ బలువురుండిరి. నన్నిచోడని గురువయిన మల్లికార్జునుఁడు కాలాముఖ మతమువాఁడు. ఆతఁడుగూడ లింగధారిగాఁడు. కుమారసంభవ మందెక్కడను లింగధారణ ప్రశంస గానరాదు. వీరశైవులు గర్హించు వర్ణాశ్రమాచార విధులు, వైదికకర్మలు

వీరికి సమ్మతములు. మల్లికార్జున పండితారాధ్యులకు బ్రాహ్మణ్యముమీఁద నాస్థ గలదు. వర్ణాశ్రమధర్మ నిబంధనముమీఁదఁ దాత్పర్యము గలదు. శివభక్తి యందుఁ దన్మయత్వమును గలదు. బసవేశ్వరుఁడు మహాశివ భక్తుఁడని యాయన యెడల నద్భుత గౌరవమును, వైదికకర్మలను గర్హించి వర్ణాశ్రమాచారములను రూపు మాపుచున్నాఁడని యతృప్తియుఁగాంచినవాఁడై బసవేశ్వరుని దర్శించి వాదించుటకై పోవుచుండఁద్రోవలోఁ దన్మృతివార్త వినవలసెననియు, "భక్తిమీఁది వలపు బ్రాహ్మ్యంబుతోఁబొత్తుఁబాయలేను నేను బసవలింగ" యని యాతఁడు చెప్పెననియుఁ బ్రతీతి గలదు. దీనిఁబట్టికూడ నాతఁడు బసవేశ్వరుని మతమువాఁడు కాఁడని స్పష్టముగా నెఱుఁగనగును. లింగమును ధరించిన వీరమాహేశ్వరుఁడు (వీరశైవుడు) వర్ణాశ్రమధర్మములను, వైదికకర్మములను నాచరింపరాదని కలదు. ఇట్లు విడుచుటే వీరవ్రతము. వీరశైవులు జంగములయిన (చరించునట్టి) శివలింగములేయని వీరశైవగ్రంథములు పలుకుచున్నవి. శివత్వమును బొందినవారు మరల వైదిక కర్మాచరణమునకుఁ బాల్పడరాదు. కర్ణాటదేశమునఁ గల లింగాయతులు సరిగా నట్టి వీరశైవ సంప్రదాయమువారు. వారికి లింగధారణము గలదే కాని, యజ్ఞోపవీతాదులు లేవు. వారు బ్రాహ్మణులవలె విశుద్ధమయిన సదాచారము గలవారే కాని, బ్రాహ్మణులతోఁ గాని, తదితరులతోఁ గాని సహభోజనమునొల్లరు. వారు బ్రాహ్మణాదివర్ణధర్మములనభిమానింపరు. ఆంధ్రదేశపుటారాధ్యులు సంపూర్ణముగా బ్రాహ్మణ ధర్మములు గలవారు. తక్కిన బ్రాహ్మణులతో వీరు సహభోజనము గావింతురు. బ్రాహ్మణ్యము నభిమానింతురు.

దశమశతాబ్ది కింకను బూర్వకాలముననుండి గౌడదేశమున గోళకీమఠ మను పేర గొప్ప శైవాచార్యమఠము ప్రఖ్యాతిగాంచెను. భావశంభు, సోమశంభు ప్రభృతులు తన్మఠాధిష్ఠాతలు. సోమశంభువు తనపేర నొకపద్ధతిని రచియించెను. శివలెంకమంచెన పండితుఁ డీ సోమశంభువు మనుమఁడట! ఈ పరంపర వారు 'కలచురిక్ష్మాపాలదీక్షాగురువు' లని పలుచోట్లఁ బ్రస్తుతింపఁబడిరి. కలచురిక్ష్మాపాలుఁడగు బిజ్జలునకుఁ గూడ వీరు గురువులయి యుందురని నేను దలంచుచున్నాఁడను. బిజ్జలుని కాలమునఁ బశ్చిమ చాళుక్యరాజ్యమున నీ



పరంపరవారు పలువురు శివాచార్యులుండిరి. బసవపురాణములో వారి పేళ్లుచూడఁదగును. ఏతన్మఠపరంపరవారు వేలకొలఁది మహనీయులు దక్షిణాపథమెల్ల వ్యాపించిరి; కేరళమునకుఁగూడ నరిగిరి; మఠముల నెలకొల్పిరి. కృష్ణలీలాశుకుని గురువగు నీశానశివాచార్యుఁడు కేరళమందుండినవాఁడు. ఆయన చోళరాజగు రాజరాజచోళునకును గురువై యుండెను. ఈశానశివగురుదేవపద్ధతి శివ, ధర్మశివ, విశ్వేశ్వరశివాదులు తెలుఁగు దేశమునకుఁజేరిరి. విశ్వేశ్వర శివాచార్యుఁడు కాకతీయగణపతి చక్రవర్తికి శివదీక్షాగురుఁడై, తండ్రియై (దీక్షనొసఁగుట చేతనా?) యాంధ్రదేశమునఁగృష్ణాతీరమునఁ మందర గ్రామమున గొప్పమఠము నెలకొల్పెను. తా నందు నెలకొనెను.

శ్లో. శ్రీ చోళేశ్వర మాలవక్షితిపతీ రాజన్యచూడామణీ
యచ్ఛిష్యౌ కిమతః పరం గణపతి క్షోణీపతి ర్యత్సుతః,
న స్యాత్కస్య ముదే స దేశికవరశ్శైవాగమాంభోనిధి
శ్రీవిశ్వేశ్వరదేశికః కలచురిక్ష్మాపాలదీక్షాగురుః.
త్వంగత్పింగ జటాకిరీట ముదయస్మేరారవిందాననం
ముక్తాకుండలమండితాం సశిఖరం హారై ర్మనోహారిణమ్,
విద్యామంటపవర్తినం గణపతిక్ష్మాపాల దీక్షాగురుం
శ్రీవిశ్వేశ్వరశంభు మీక్షితవతాం తే చక్షుషీ చక్షుషీ.

– మల్కాపుర శాసనము.

కాళేశ్వరము, పొన్నగ్రామము, మంద్రకూటము, మానేపల్లి, ఊటుపల్లి, చంద్ర వల్లి, కంభంపల్లి, ఆనందపురము, కొమ్మూరు, శ్రీశైలము, వెల్లాల, ఉత్తర సోమశిల మొదలగు గ్రామములందు శివాలయములను, మఠములను నీతఁడు నెలకొల్పెను. వీరి పరంపరవారు తెల్గుదేశమున కృష్ణదేవరాయల తర్వాతి కాలముదాఁక గూడఁ బలువురు ప్రఖ్యాతులై యుండిరి. శ్రీనాథునిచే నోడింపఁ బడిన డిండిముఁ డీ పరంపరవారికి సంబంధించినవాఁడే. నేఁడద్వైత మతాచార్యపీఠములుగా నున్న విరూపాక్ష, పుష్పగిరిపీఠములానాఁడు వీరు నెలకొల్పిన శైవమఠములే. పెదకళ్లేపల్లిలో శివాలయము నీ సంప్రదాయమువాఁ

డును, బుప్పగిరి మఠాధిపతియు నగు సోమశివాచార్యుఁడే కాకతీయ ప్రతాపరుద్రుని పాలనమున క్రీ.శ. 1282 నాఁడు కట్టించెను. ఆయన విగ్రహము గూడ నక్కడఁగలదు. పెక్కు గ్రామములందు వారి ధర్మప్రతిష్ఠలు గలవు. కృష్ణరాయల కాలమున నున్నవారును, ముక్కుతిమ్మనాదులకు గురువులు నగు నఘోరశివాచార్య దక్షిణామూర్తి శివాచార్యులు, వీరి సంప్రదాయమువారే. సూత్రభాష్యకారుఁడు, శ్రీకంఠ శివాచార్యుఁడు గూడ నీ పరంపరలోనివాఁడే యగుననుకొందును. వీరి యుద్బోధముచేతనే కాఁబోలును బ్రతాపరుద్రుని కాలమున నాంధ్రదేశ శివాలయములలోఁ బెక్కింటఁ దమ్మళ్లు తొలఁగింపఁ బడి, వెలనాటివారు పూజారులుగా నిలుపఁబడిరి. ఈశానశివాఘోరశివాదులు రచించిన దీక్షాప్రతిష్ఠాది నిబంధనములననుసరించియే నేఁడాంధ్ర దేశ శివాలయములలో నుత్సవాదులు నడిపింపబడుచున్నవని నేఁదలఁచున్నాఁడను. శైవాగమ సమ్మతమయిన వైదిక ప్రక్రియ చేతనే యారాధ్య లాయుత్సవాదుల నేఁడును నడుపుచున్నారు. ఆంధ్రారాధ్య సంప్రదాయము పూర్వకాలమున నీ శివాచార్య పరంపరవారి సంప్రదాయముగానే యుండెనని నేను దలఁచుచున్నాఁడను. పెక్కువిధములఁ జూడఁగా నాంధ్రారాధ్య సంప్రదాయ మిట్టిదిగాఁ గానవచ్చుచున్నను, లింగధారణము, కరపీఠార్చనము. షట్స్థల వివేకము మొదలగునవి వీరశైవ సంప్రదాయోద్భూతములు గొన్నిగూడఁ గలసియుండుటచే వీరును వీరశైవులేమో యనియు సంశయము గల్గును. వీరశైవులకు ముఖ్యమయిన వైదిక కర్మత్యాగము, కులాశ్రమాచార త్యాగము, అన్యదేవతారాధన త్యాగము మొదలగు వీరవ్రతములు వీరికి లేకుండుట యట్టి సంశయమునకుఁ బ్రబల బాధకముగాను నున్నది. ప్రాచ్యలిఖిత పుస్తకశాలలో 11-5-16 అని సంఖ్యగల ప్రాచీన తాళపత్రగ్రంథమున గోదావరీ తీరమున నొక స్వాములవారు ప్రాచీన గ్రంథములను శైవసంప్రదాయములను జక్కఁగాఁ బరిశోధించి, యక్కడి బ్రాహ్మణులకు వ్రాసిన పత్రిక యొకటి గలదు. అది యిప్పటి కిన్నూఱేండ్ల క్రిందట వ్రాయఁబడినదై యుండును. ఆనాఁటికి రెండువందల యేండ్లకుఁ బూర్వము ఆంధ్రదేశము వారు 66 కుటుంబములవారు బ్రాహ్మణులు శ్రీశైలమున కేఁగి యక్కడ లింగ ధారణదీక్ష గొనిరనియు, కొందఱక్కడనే వీరశైవులై



యుండిరనియుఁ, గొందఱు వైదికధర్మముతో లింగధారణమును గూడఁ నాంధ్రదేశమందుఁ బాటించుచుండి రనియు నందుఁగలదు. ఇది వాస్తవమేమో పరిశోధింపవలసియున్నది. ప్రాచీనాంధ్రారాధ్య సంప్రదాయ గ్రంథములలో లింగధారణాది విషయములు గానరాకుండుట చేతను, నాంధ్రారాధ్యులలో నిప్పటికిఁ గొన్ని కుటుంబములవారు లింగధారణము లేకయే యుండుటచేతను మీఁదివిషయము విశ్వాస్యమే యగునని నేఁ దలంచుచున్నాఁడను.

క్రీ.శ. 1350 నుండి 1450 దాఁక సుప్రఖ్యాతులుగానున్న కొండవీటిరెడ్లు, తన్మంత్రులు శైవమతాభినివిష్టులుగా నుండిరి. వారికిని వారి మంత్రి యగు మామిడి ప్రెగ్గడయ్యకును శంకరారాధ్యులను వారు గురువులుగా నుండిరి. ఆ శంకరారాధ్యులకే పెదకోమటి వేమారెడ్డి పినపాడను గ్రామము నగ్రహారముగా నొసఁగెను. దానికి శాసనము గలదు. తెనాలి దగ్గఱఁబినపాటిలో నేఁడా శంకరారాధ్యులవారి వంశమువారు మృత్యుంజయారాధ్యులు గలరు. వీరిది యుద్భటారాధ్య వంశమట! కాని, వీరికి లింగధారణము లేదు. బహుకాలమున నుండి సుప్రఖ్యాతమయియున్న యీ వంశమువారు లింగధారులు గాకుండుట వింతగాదా! మఱియు నాంధ్రదేశపుటారాధ్యుల కుటుంబములలో మిక్కిలి గౌరవము గడించినవారు లింగధారణము లేని వారింకను గొందఱు గలరు. గోదావరీ మండలమున నయ్యగారివారని యారాధ్యులు గలరు. [1]వారికిని లింగధారణములేదు. ఉద్భటుఁడు భోజునకు దీక్షాగురువని పండితారాధ్య చరిత్రమునను, నుద్భట చరిత్రమునను గలదు. భోజుఁడు రచించిన శైవతంత్రము తత్త్వప్రకాశము నేఁడు సుముద్రితమై యున్నది. అందు నేఁటి యారాధ్య సంప్రదాయ విషయములేవియుఁగానరావు. గోళకీమఠ సంప్రదాయమువారు తమ గ్రంథములందు భోజుని గ్రంథములను బ్రమాణముగాఁ గొనియున్నారు.

1 వీరార్వేలనియోగులు గాని యారాధ్యులు గారని కొందఱనుచున్నారు. "కూచిమంచి తిమ్మకవ్యాదుల గురువైన దెందులూరి లింగనారాధ్యుని శిష్యులందఱు 'అయ్యగారు అనుటచే నాయన తర్వాతి వారయ్యగారివారైనారు'' అని బ్రహ్మశ్రీ నడకుదుటి వీరరాజుపంతులుగారు వ్రాసిరి. రక్తాక్షిచైత్ర భారతి చూడుఁడు.

ఉద్భటుండీభోజునకు గురువేయగునేని యాతఁడు నేఁటి యారాధ్య సంప్రదాయమువాఁడు గానేరఁడు. ఆ యుద్భటుని వంశమువారగు నాంధ్రారాధ్యులుగూడ భోజగ్రంథ, గోళకీమఠాచార్యకృత గ్రంథోపదిష్టమగు వైదిక శైవసంప్రదాయమువారే యగుదురు. బసవేశ్వరుని కాలమునుండి యాంధ్రదేశారాధ్యులు వీరశైవులై లింగధారులై యుందురేని కర్ణాటదేశమునఁ బోలె వీరికిని మఠములు, గురుపరంపరలును నుండెడివి. ఆంధ్రదేశమున గోళకీమఠ సంప్రదాయము వారి మఠములే యుండెడివిగాని, నేఁటి యాంధ్రారాధ్య సంప్రదాయము వారి మఠములెన్నఁడు నున్నట్టు దెలియరావు. పండితత్రయోద్భటారాధ్య వేమనారాధ్యాది వంశపరంపరలవారాభి జాత్యముగలవారారాధ్యవంశములవారు పలువురు వెలయుచున్నను, లింగధారణాది దీక్షలు గొనుటలో గురువంశములు, శిష్యవంశములు నను భేదము లేక వీరిలో నెల్లరును సమానసమ్మానమునే పడయుచున్నారు. బహుకాలమున నుండియు నిట్టి సంప్రదాయమే సాగుచున్నచో నిప్పుడు లేకున్నను బూర్వకాలమున నేని యట్టి మఠములుండకపోవునా యని సంశయము.

దహనసంస్కారము నేఁడాంధ్రారాధ్య సంప్రదాయమున లేదు. కాని తావన్మాత్రమున వీరు వీరశైవులనఁగాదు. ఇటీవల వీరు లింగధారణముతో పాటు ఖననసంస్కారమునుగూడ పరిగ్రహించియుండవచ్చును. గోళకీమఠ సంప్రదాయమువారు కూడ నుత్తములైన శివదీక్షితులకు నాశౌచముగాని, శ్రాద్ధాదికము గాని యక్కఱలేదనిరి. 'నిర్వాణదీక్షితానాంతు సూతకం నైవవిద్యతే' – 'దీక్షితానాం చ శైవానాం శ్రాద్ధం స్యాచ్ఛైవమేవ హి, న వైదికం కృతం శైవం శివలోకం స గచ్ఛతి' – ఆశౌచదీపిక, అఘోరశివాచార్యుఁడు.

ఆంధ్రారాధ్య సంప్రదాయము వారి దీక్షపేరు చిన్మయదీక్ష. వీరశైవులదీక్ష పేరుత్తరదీక్ష. రెండు సంప్రదాయములు వేఱనుటకిదియు నొక తార్కాణ. కృష్ణదేవరాయలకుఁ బూర్వకాలమున నాంధ్రదేశమున నారాధ్యబ్రాహ్మణులు లింగధారులయి యుండిరనుటకుఁ బ్రబలాధారములు గలవేమో యింకను బరిశోధింపవలసి యున్నది.



## వీరశైవము బసవేశ్వరాద్యుపజ్ఞమే

లింగధారణమును జెప్పుశ్లోకములు గొన్ని యాగమములలోనివిగాను, బురాణములలోనివిగాను నిటీవలి వీరశైవ గ్రంథములందుఁగలవు. ఆ శ్లోకములే కాక, కొన్ని యాయాగమములుగూడ వీరశైవమతము వెలసిన కాలమునను, నటు తర్వాతికాలమునను నేర్పడినవని నేను దలఁచు చున్నాఁడను. వీరశైవసిద్ధాంతమును దెలుపు నాగమము వీరాగమమని యొకటి గలదు. అది యిట్టిదే. ఏలనఁగా నందుఁ బెక్కుచోట్ల నాల్గుశైవ మతములు పేర్కొనఁబడినవి. నల్గురు శైవాచార్యులు పేర్కొనఁబడిరి.

శ్లో. రేవణో మరుసిద్ధేశో రామదేవో మునీశ్వరః,
పండితారాధ్య ఇత్యేతే చతుర్మఠమునీశ్వరాః.

ఇందు నాల్గవవాఁడగు పండితారాధ్యుఁడు శివలెంక మంచెన పండితుఁడయినను, శ్రీపతిపండితుఁడయినను, మల్లికార్జున పండితుఁడయినను బసవేశ్వరునికించు మించుగా సమకాలమువాఁడే యగును. తక్కినవారు గూడ బసవేశ్వరుని నాఁటివారే. ఈ యాగమమున వీరశైవ సంప్రదాయములెల్ల వివరింపఁబడినవి. ఇది పురాతన గ్రంథమనుట నే నంగీకరింపఁజాల నయ్యెదను. మఱియు రేణుక (రేవణ) సిద్ధరచితము సిద్ధాంతశిఖామణియు, మాయిదేవరచితము శివానుభవసూత్ర (విశేషార్థప్రకాశన) మును, పద్మరసు దీక్షాబోధయుఁ, నీలకంఠాచార్యుని క్రియాసారమును గలవు. వీరశైవ సిద్ధాంతమును నిరూపించు గ్రంథములలో మూలభూతములివి. ఈ గ్రంథముల రచించినవారు బసవేశ్వరుని కాలమువారును దర్వాతికాలము వారును నగుట విస్పష్టవిషయము. బసవపురాణమును బట్టి, అబ్లూరు శాసనమునుబట్టి యీ మతము క్రీ.శ. 1150 ప్రాంతమున నేర్పడినది గానే తెలియనగుచున్నది. ప్రాచీనాగమగ్రంథములందక్కడక్కడ వీరశైవ సిద్ధాంతానుకూలములగు శ్లోకములు గొన్నియున్నను, వానినెల్ల నుద్ధరించి కులాచార నియమములను ద్రెంచి వీరశైవమని క్రొత్తసిద్ధాంతము నెలకొల్పిన వారు మాత్రము బసవేశ్వరాదులే యనుటకు

సంశయింపఁబనిలేదు. ఈ యర్థమునకు సాధకములయిన విషయములు పెక్కులు బసవపురాణమునఁగూడఁగలవు.

## వీరశైవము

వీరశైవులు "శివలింగం కరాద్యంగే వీరశైవస్తు ధారయేత్" అను విధి చొప్పున లింగధారణము చేయుదురు. ధరించిన యాలింగమునకుఁ బ్రాణలింగమనియు, నిష్టలింగమనియుఁ బేరు. అది లోపించెనేని గండగత్తెఱ వేసికొని చనిపోవలసినదే కాని వారు జీవించియుండరాదు.

ప్రాణలింగవ్రతే లుప్తే ప్రాయశ్చిత్తం న విద్యతే,
ప్రాణత్యాగాత్పరం తస్మా త్సావధానేన ధారయేత్.
ప్రాణలింగే చ విచ్ఛిన్నే లింగే ప్రాణాన్ పరిత్యజేత్,
ప్రతిదీక్షాం ప్రాప్య తిష్ఠేద్రౌరవం నరకం వ్రజేత్.

సిద్ధాంతశిఖామణిలోఁబ్రాణలింగమనఁగా నంతర్లింగమనియు, నిష్టలింగమనఁగా బాహ్యలింగమనియు, కరపీఠార్చనముత్తమమనియుఁ గలదు. 'ఇష్టలింగ మిదం స్థూలం యద్బాహ్యేధార్యతేసదా, ప్రాణలింగంతు తత్ సూక్ష్మం యదంతర్భావనామయమ్. బాహ్యపీఠార్చనా దేత త్కరపీఠార్చనం వరమ్'.

వీరశైవమద్వైత సిద్ధాంతము ననుసరించును.
శివేన సహ సంబంధా చ్ఛైవమిత్యాదృతం బుధైః,
ఉభయోస్సంపుటీభావా ద్వీరశైవ మితి స్మృతమ్.
**వీ** శబ్దే నోచ్యతే విద్యా శివజీవైక్య బోధికా,
తస్యాం **ర**మంతే యే శైవా వీరశైవాస్తు తే స్మృతాః
స్వయం లింగాంగసంబంధీ శివ ఏవ న చాపరః.

ఇట్లు చెప్పియు సిద్ధాంతశిఖామణికారుఁ డద్వైతమతమును గర్హించెను. అద్వైతమునఁజేరినచో బాహ్యలింగార్చనము మానివేయుటగును గాన యా మతము పనికిరాదనెను. సర్వాద్వైతమని, యీశ్వరాద్వైతమని భేదముఁజెప్పి



యీశ్వరాద్వైతమే తగును కాని, సర్వాద్వైతము తగదనెను. మల్లికార్జున పండితారాధ్యుఁడుగూడ నీ యద్వైతభేదముఁ జెప్పెను.

వీరశైవులు జాతిభేదము పాటింపరాదు.

శ్లో. ఏకపీఠం జగత్సర్వ మేక మాకాశమాలయమ్,
ఏకతోయం సదా పీత్వా జాతిభేదం న కారయేత్.
అమరంగ నటుగాక యఖిలమర్త్యులకు
సమముధాతువులును సమముపిండములు
సమము సూతకములు సమము జన్మములు
సమము నిద్రాహార సంగకృత్యములు
సమము మోహభయాభిషంగలోభములు
సమమింద్రియ విషయసముదాయములును
సమములీభూతపంచకములు నవయ
వములును సుఖదుఃఖవాసనల్ సమము
లదిగాక ధరయేక మఖిలజీవులకు
తుద నాకసంబు పొత్తు సమస్తమునకు
తోయమొక్కటి జగత్తునకుఁ బ్రాపింప
నైయుండుఁ గులభేదమైన లాగెట్లు.

* * *

సద్రతి బ్రాహ్మణక్షత్రియ వైశ్య
శూద్ర కులీనులంచును బల్కెదీవు
ఎక్కడ వారికి నేతెంచెఁగులము
టక్కరులాడు మాటలుగాక యనిన.

– దీక్షాబోధము.

ఇట్లు వీరు జాతిభేదమును గర్హించి యా కాలముననేకుల లింగ ధారులఁగాఁజేసి వారినెల్లర నొక్క పొత్తునకుఁదెచ్చి తమ మతమున కభ్యుచ్ఛ్రేయమును

గూర్చుకొనఁగల్గిరి. కాలక్రమముననఁగూడ నాపూన్కి యట్లేసాగుచుండఁ గల్గెనేని యాంధ్రకర్ణాటదేశములందు జాతిభేదము సమసిపోయికూడ నుండ వచ్చును. కాని, దానిఁబ్రబలముగాఁ బ్రతిఘటించిన యద్వైతాది మతముల యధికవ్యాప్తిచే, నానాజాతులనుండి క్రొత్తక్రొత్తవారు నాఁటనాఁట వీరశైవులగు చుండుటగాని, తన్మూలమున జాతిభేదములు సమయుటగాని సందర్భింప దయ్యెను. తర్వాతి కాలముననక్కడక్కడఁగొందఱు కొందఱు కొలఁది కొలఁదిగా మాత్రమే వీరశైవ దీక్షగొని యాసంఘముసఁజేరిరి. దానిచే బసవేశ్వరాదుల కాలమున వేర్పడి యేర్పడిన శైవదీక్షితుల వంశపరంపరలును దర్వాతివారు కొలఁది మందియు మాత్రమే కూడి నేఁడు లింగాయతులనుపేరఁ బ్రత్యేక సంఘమై వెలయుచున్నారు.

ఇటీవలి కాలమున నా మతమునఁగ్రొత్తగాఁజేరిన వారంతగా లేకపోవుటచే జాతిభేదమును బాటింపరాదను సిద్ధాంతమును స్థాపింపఁబూనిన యా సంఘమే సంకుచితమై తాను నొకజాతియై తనకు ముందున్న జాతులకంటె నింకనొక్కజాతిని హెచ్చింపఁగల్గెనే కాని, జాతిభేదమును సమయింపఁజాలదయ్యెను.

వీరశైవమత స్వరూపము, వీరాగమము, వీరశైవాచార సంగ్రహము మొదలగు గ్రంథములందుఁగానవచ్చును. బసవేశ్వరుని సమకాలము వాఁ డగు కెరెయ పద్మరసు రచియించిన వీరశైవదీక్షాబోధలోఁబ్రధాన విషయము లెల్ల జక్కఁగా స్పష్టపఱుపఁబడి యున్నవి. పిడుపర్తి సోమనాథుని తెలుఁగు దీక్షాబోధను జదివి వీరశైవమత స్వరూపమును జక్కఁగాఁ దెలిసికొన వచ్చును.

## శివకవులు

వీరశైవులలోఁగవీశ్వరులగువారు శివునిమీఁదను దద్భక్తుల మీఁదను దక్కనితరులగు భవులమీఁద నెప్పుడును గృతులఁ జెప్పెడివారుగాదు. కావున, వారికి శివకవులని పేరు గల్గెను. కర్ణాటాంధ్రగ్రంథములలో శివకవుల ప్రశంస పెక్కుచోట్లఁ గలదు. శివకవులు భవికవుల గర్హించిరి. కవితలోఁగూడ వారు వేఱుమతము వారయిరి.

ఐనను లోకహితార్థంబు గాఁగ
నానేర్చు కొలఁది వర్ణనసేయువాఁడ



నవరసరసికత భువిని బేర్కొన్న
శివకవి ప్రవరుల చిత్తంబులలర
నిప్పాట నితరులఁ జెప్పెడిదేమి
తప్పులు దారులుఁ దడఁబడఁబలికి
వెలసిన చదువులు వీటిఁబో రిత్త
పొలిసిపోయిరి దమపురులు దూలఁగను
మృదుమహత్త్వము గానమిని బొంకులనఁగఁ
బడుఁ 'గవయః కిం న పశ్యన్తి' యనుట
యనుచుఁ గుకవులఁగీటునఁబుచ్చిపేర్చి,

–బసవపురాణము.

సోమనాథుఁడు బసవపండితారాధ్యచరిత్రములందును, అనుభవ సారమందును, శివకవులను స్తుతించెనే కాని, యాంధ్రకవితాగురుఁడనఁబడిన నన్నయ మొదలగు నితరకవులను వేరిని స్తుతింపలేదు.

## శివకవుల గ్రంథములు

మల్లికార్జున పండితారాధ్యుని శివతత్త్వసారమును, నన్నిచోడని కుమార సంభవమును, మన సోమనాథుని కృతులును, నిప్పుడు మన కుపలబ్ధము లయిన శివకవుల గ్రంథములలోఁ బ్రాచీనములు. మల్లికార్జున పండితుని కృతులు మఱికొన్ని దొరకవలసియున్నవి. మల్లికార్జునపండితుని కంటెఁ బూర్వుఁడు శ్రీపతిపండితుఁడు గూడఁ గవియట! ఆయన బెజవాడలో నుండినవాఁడు. ఆయన తెలుఁగుకృతులేమేని రచియించెనేమో యెఱుఁగ రాదు. పండితారాధ్య చరిత్రలో నీ క్రింది గ్రంథములు పేర్కొనఁబడినవి.

అంచితబాణగద్యాక్షరగద్య
పంచగద్యాదులు వటుగణాడంబ
రంబు వర్ణాడంబరంబు వ్యాసాష్ట
కంబును శ్రీనీలకంఠ స్తవంబు

శ్రీరుద్రకవచంబు శారభంబును మ
యూరస్తవము హలాయుధమనామయము
మలహణమును మహిమంబనుస్తవము
మలయరాజీయంబు మౌనిదండకము
స్తుతిమూలమగు మహాస్తోత్ర సూత్రములు
శతకంబు శివతత్త్వసారంబు దీప
కళిక మహానాటకము నుదాహరణ
ములు రుద్రమహిమయు ముక్తకావళులు
గీతసూక్తములు భృంగి స్తవంబులు పు
రాతనముని ముఖ్యరచితాష్టకములు
హరలీల–

* * *

ఆనందగీతంబులర్థిఁబాడుచు శి
వానందలీలలనలరి యాడుచును
శంకరగీతముల్ సరవిఁబాడుచును
శంకరలీలల జతులకాడుచును
బరమశివానందభరితమై మఱియు
హరగణాగ్రణులున్న యవసరంబునను

* * *

మదినుబ్బి సంసారమాయాస్తవంబు
పదములు దుమ్మెదపదముల్ ప్రభాత
పదములు పర్వతపదములానంద
పదములు శంకరపదముల్ నివాళి
పదములు వాలేశుపదములు గొబ్బి
పదములు వెన్నెలపదములు సెజ్జ



వర్ణన మఱి గణవర్ణనపదము
లర్ణవఘోషణ ఘూర్ణిల్లుచుండఁ
బాడుచు నాడుచుఁ బరమహర్షమున
.....................................

–పండితారాధ్యచరిత్రము.

పయివానిలోఁ బెక్కులు సంస్కృతగ్రంథములు. శివతత్త్వ సారము తెల్గుకృతి. శతకము, దీపకళిక మొదలగునవికూడఁదెల్గుకృతులు గావచ్చును. ఆనందగీతములు, శంకరగీతములు, తుమ్మెదపదములు, ప్రభాతపదములు మొదలగు గేయరచనలుగూడ తెల్గువే. కాని యవి మన కిప్పుడు దుర్లభములుగా నున్నవి. దీనినిబట్టి చూడఁగా నీ శివకవుల తెలుఁగు కృతులు పద్యరచనము గలవి. మల్లికార్జునపండితారాధ్యుని కాలమునకంటెఁ బూర్వము లేవేమో యని సంశయము కలుగుచున్నది. ఉన్నచో సోమనాథుఁడు పేర్కొనియుండును గదా! శివకవుల రచనారీతులను బరిశోధింపఁగా వీరి గ్రంథములకును, నన్నియాదు లగు (భవి)కవుల గ్రంథములకును బెక్కుభేదములు గానవచ్చుచున్నవి. అవి ముందు వివరింతును :

## జానుఁదెనుఁగు

శివకవులు పలువురు జానుఁదెనుఁగును బ్రశంసించిరి :

చ. సరళముగాఁగ భావములు జానుఁదెనుంగున నింపు పెంపుతోఁ
బిరిగొన వర్ణనల్ ఫణితి వేర్కొన నర్థము లొత్తగిల్ల బం
ధురముగఁ బ్రాణముల్ మధుమృదుత్వరసంబునఁ గందళింప న
క్షరములు సూక్తులార్యులకుఁ గర్ణరసాయనలీలఁ గ్రాలఁగాన్.

– నన్నిచోడుఁడు.

ఉరుతరగద్య పద్యోక్తులకంటె
సరసమై పరగిన జానుఁదెనుంగు

చర్చింపఁగా సర్వసామాన్యమగుటఁ
గూర్చెద ద్విపదలు గోర్కిదైవాఱ

– బసవపురాణము.

..................................

ఒప్పదు ద్విపద కావ్యోక్తి నావలదు
ఆరూఢ గద్యపద్యాది ప్రబంధ
పూరిత సంస్కృత భూయిష్ఠరచన
మానుగా సర్వసామాన్యంబు గామి
జానుఁదెనుఁగు విశేషము ప్రసన్నతకు

– పండితారాధ్యచరిత్రము.

సోమనాథుఁడే జానుఁదెనుఁగనఁగా నిట్టిదని వృషాధిపశతకమున జెప్పినాఁడు:

చ. బలుపొడతోలుసీరయును బాఁపసరుల్ గిలుపారుకన్ను వె
న్నెల తల సేఁదుఁగుత్తుకయు నిండిన వేలుపుటేఱు వల్గు పూ
సలు గలతేని లెంక వని జానుఁదెనుంగున, విన్నవించెదన్
వలపు మదిన్ దలిర్ప బసవా బసవా బసవా వృషాధిపా!

ఆ కాలమున నీ జానుఁదెనుఁగు మిక్కిలి ప్రసన్నమై సర్వసామాన్యమై యుండెను. తర్వాతి మన కవీశ్వరులు సంస్కృతప్రాయమైన రచనను దెలుగునఁ జొప్పించి జానుఁదెనుగును సన్నగిలఁ జేసిరి. ఇటీవలి తెలుఁగురచనలలో నెక్కువ రుచ్యములయిన నానుళ్లను బలుకుబళ్లను మిక్కిలి తక్కువ కాఁజొచ్చెను. సోమనాథుని గ్రంథములోను, నన్నిచోడని గ్రంథము లోను మనకిపుడర్థము గాని జానుఁదెనుగుఁబలుకు లనేకములున్నవి. సంస్కృత ప్రాయముగ రచనలకు మనమలవడుటయు, దేశితెలుఁగురచనలఁ ద్రోసిపుచ్చుటయు నిట్టగుటకుఁ గారణములు. ఈ విషయము నించుక వివరింతును.



## దేశిరచన

తెలుఁగునకుఁ దోడిభాషయగు ద్రవిడభాషలో దేశిరచనలెక్కువగా నెక్కొన్నవి. ద్రవిడదేశీయులగు జైనులయు, శైవులయు, వైష్ణవులయు దేశిచరి త్రములు ద్రవిడభాషాసహజములగు దేశివృత్తములలో సంస్కృత సంపర్క మంతగా లేని ద్రవిడదేశిభాషలో రచితములై వెలసియున్నవి. కర్ణాటకమున నంతగా నట్టిరచనములు లేవుగాని తెలుఁగున కంటెఁ గొంత హెచ్చుగా నున్న వనవచ్చును. ఆదికాలమునఁదెలుఁగు గ్రంథములు ప్రాయికముగా సంస్కృత భాషలోనున్న పురాణాద్యార్యగ్రంథములకనువాదములుగానే వెలయుటచే నాంధ్రసహజములయిన దేశిరచనములకాదరువు సన్నగిల్లెను. మన పూర్వులు పౌరాణికములయిన యార్యకథల మీఁదను, సంస్కృతచ్ఛందస్సు మీఁదను సంస్కృత ప్రాయమయిన తత్సమభాషమీఁదను నభిమానము గలవారయి దేశీయేతివృత్తములను, దేశీయచ్ఛందస్సులను, దేశిభాషను జిదుకఁద్రొక్కిరి. నేఁడు మనము స్త్రీపామరాదుల గేయరచనములని యనాదరమునఁ జూచు పదరచనము వరుసలే ద్రవిడభాషలోని ప్రౌఢకావ్యములందలి వృత్తములుగా నెలకొన్నవి. తరువోజ, ద్విపద, రగడ, అక్కర, గీతి, సీసము మొదలగు పరిమిత జాతులే దేశిచ్ఛందో జనితములు మన గ్రంథములం దాదృతములయ్యెను. ఈ దోషముచే మన తెలుఁగు ప్రబంధములందాంధ్రతా ముద్ర యంతగాఁగానరాకున్నది. కొంతవఱకాంధ్రతాముద్ర నచ్చొత్తి ప్రబంధముల రచించినవారిలో నగ్రగణ్యుఁ డీ సోమనాథ కవియే. ఈతఁడు దేశీయ కథలను దేశిచ్ఛందో జనితమగు ద్విపదమున దేసితెనుఁగు బాసలో రచించినవాఁడగుటచే నీతని కవితలో నాంధ్రతాముద్ర సక్కఁగా నత్తికొనెను. ఈతఁడు తన కవితారచనము నిట్లు ప్రశంసించుకొన్నాఁడు.

......................
సత్కృతియన నూత్నసంగతిదనరఁ
దొమ్మిదిరసములు దొలఁకాడ వాని
యిమ్మడి వర్ణనలెసఁగఁ దద్ద్విగుణ

మగు నలంకారంబు లసలార వాని
ద్విగుణార్థభావనల్ దీటుకొనంగఁ
దేటతెనుంగున ద్విపదరచింతుఁ
బాటిగాఁ దత్కథాప్రౌఢి యెట్లనిన
జాతులు మాత్రాను సంధానగణ వి
నీతులు గాన'**యనియతగణై** 'ర
నియును '**ప్రాసో వా**' యనియు '**యతిర్వా**' య
నియుఁజెప్పు **ఛందోవినిహితోక్తిగాన**
**ప్రాసమైనను యతిపై వడియైన**
**దేసిగా నిలిపి యాదిప్రాసనియతి**
**దప్పకుండఁగ ద్విపదలు రచియింతు**
నొప్పదు ద్విపదకావ్యోక్తి నావలదు.
ఆరూఢ గద్యపద్యాది ప్రబంధ
పూరిత సంస్కృత భూయిష్ఠరచన
మానుగా సర్వసామాన్యంబు గామిఁ
జానుఁదెనుఁగు విశేషము ప్రసన్నతకు
అట్టునుగాక కావ్యము ప్రౌఢిపేర్మి
నెట్టన రచియింప నేర్చినఁజాలు
నుపమింప గద్యపద్యోదాత్త కృతులు
ద్విపదలు సమమ భావింప నెట్లనిన.
సరళతసరణి ప్రసన్నత చెన్ను
పరిణతగణపదపద్ధతి శబ్ద
శుద్ధి ప్రయోగప్రసిద్ధి గళాస
మృద్ధి నానుడి వడిమితి యతి యర్థ
పుష్టినైజము రసపుష్టి వినూత్న



సృష్టి విశేష్య విశేషణశ్లేష
సొంపు గుమారత పెంపు మాధుర్య
మింపు మృదుత్వంబు గుంపోజు సదువు
యమకంబు గమకంబు యతిగతి గార
కము పూరకము గ్రియ గాంతి విశ్రాంతి
రంగుబెడంగు మెఱుంగు సమాన
సంగతి యక్షరశయ్య సంఘటన
నిపుణత రసికత నెఱి సమాసార్థ
ముపమానమవధానముత్ప్రేక్ష లక్ష్య
లక్షణవ్యక్తి యలంకార యుక్తి
దక్షత సుమతి విచక్షత యనిన
జాతుల రచనాప్రణీతులఁగావ్య
నీతుల రీతుల నేతు లుట్టంగ
వరకవుల్ గొనియాడ వర్ణన కెక్క
ధరఁజెప్పు కృతియ యుద్యత్కృతిగాక
జల్లి పూరక మపశబ్ద మక్రమము
వొల్లు వ్యత్క్రియ జడ్డు వొందసంఘటన
కాకు వ్యర్థంబసంగతి విరసంబు
వైకల్యమత్యుక్తి వైరిపదంబు
తలవిరుపసమగ్రత శిథిలబంధ
ములుదబధంబు గ్రామ్యోక్తి గంటకము
ద్రాభ ఛందోవిరుద్ధంబాదియగు న
లాభప్రలాపోక్తి లాఘవంబనక
వసిగూర్చు కృతులు నా వడ్లును బెరుగు
బిసుకుచందము బిలిబిలికృతుల్ గృతులె
అటుగాన యభివినుతానందితోక్తి

పటుగద్యపద్య ప్రబంధసామ్యముగ
కావ్యకళాప్రౌఢిఁగల్పింతు ద్విపద
కావ్యంబు భావ్యంబుగాఁగ నట్లయ్యు
నవికలవేదవేదాంతేతిహాస
వివిధాగమపురాణవిహిత సూక్తముల
నిదమిత్థమనుచోట నివియె ప్రామాణ్య
పదములు గాఁగ ద్విపదలు సంధింతు
సొట్టైనరత్నంబు చుట్టును బసిఁడి
గట్టిన భావన నెట్టణఁదెనుఁగు
సంధిపూర్వాపరసంఘటనముల
బంధురచ్ఛందోనిబద్ధముల్ గాఁగ
వేదసూక్తములకు వెరవైనమాట
లాదటఁగన్పింతునది జల్లి యనక
వలనెఱింగియు వేదవాక్యంబు ద్విపద
కొలఁదినే పలుకుటకును మది మెచ్చి
కేలిముద్రిక రత్నకీలనసేయు
చో లేశమైనవచ్చునె రత్నమొత్త
సొట్టైనరత్నంబు చుట్టునుబసిఁడి
గట్టుట యతివివేకంబిట్లయయ్యు
దేసిగా వచియింతు ద్విపదకు వళ్లుఁ
బ్రాసంబులునుఁ బొందుపడఁగఁదావలయు
ననుచుఁదదీయసూక్తాక్షరపంక్తి
జెనకక యింతొప్పఁ జెప్పునేయనుచు
సన్నుతిఁ జేయుచు సత్కవులలరఁ
దిన్ననిసూక్తుల ద్విపద రచింతు
నదియునుగా **కైహికాముష్మికద్వి**



**పద హేతువవుట ద్విపదనాఁబరగు**
**ద్విపదాంబురుహముల ధృతి బసవేశు**
**ద్విపదాంబురుహములతిప్రీతిఁ బూన్తు**

– పండితారాధ్య చరిత్రము.

తన గ్రంథములు సుగ్రహములుగా నుండవలెనని యాతఁడు తలంచెను. సంస్కృతభాషలో ననుష్టుప్పు సులువుగా రచింపఁదగినదై, యక్షరబాహుళ్యము లేమిచే సులువుగాఁ జదువఁదగినదై, యన్వయక్లేశము లేమిచే సులువుగానర్థము చేసికోఁదగినదై పురాణాదులందు లక్షలకొలఁది గ్రంథసంఖ్యతో వెలసియుండుట యెఱిఁగి దానివలెఁ దెలుఁగున వెలయఁదగినది ద్విపదయని గుర్తించి సోమనాథుఁడు తన ప్రధాన గ్రంథములగు బసవపురాణ, పండితారాధ్య చరిత్రములను ద్విపదరచనములందే నెలకొల్పెను. ఆరూఢ గద్యపద్యాది ప్రబంధపూరిత సంస్కృత భూయిష్ఠ రచన సర్వ సామాన్యము గాదనియు, జానుఁదెనుఁగు మిక్కిలి ప్రసన్నముగానుండుననియు, నది ద్విపదరచనమున మిక్కిలి పొసఁగి యుండు ననియుఁ బయి ద్విపదలందు సోమనాథుఁడు సూచించినాఁడు. మఱియు సులువయిన రచనముగలదని ద్విపదను దక్కువగాఁ జూడవలదనియు, సర్వసామాన్యమగుట ద్విపద కొకగుణవిశేషమనియు, గద్యపద్యోదాత్తకృతులకది తీసిపోదనియు, గావ్యగౌరవమును బోషించునది, దోషరాహిత్యమును గుణసాహిత్యమునుగాని, ఛందః ప్రయాసాతిశయము గాదనియుఁజెప్పినాఁడు.

## ద్విపదరచన సర్వసామాన్యమే

వర్తమాన నాగరకలోకము గొంత వర్జించుచున్నను నాఁడు నేఁడు నాంధ్రలోకము నాలుకలపై నాట్యమాడుచున్న పాటలు, పదాలు మొదలగు దేశిరచనలలో నూటికిఁ దొంబదివంతు రచనములు ద్విపదలును, దద్వికారములునై యున్నవి. ఒక్క ద్విపదవే విషయభేదమునుబట్టి, స్థలభేదమునుబట్టి, పాఠకభేదమునుబట్టి పఠించు తీరులలో బహుభేదములను బొందుచున్నది. తోలుబొమ్మలవాంధ్ర యాటలలోను, స్త్రీల పాటలలోను,

పంబవాంఁడ్రయు , బవనీంఁద్రయు, సుద్దులలోను, మఱియుఁ బెక్కువిధములగు పామర రచనములలోను బహుళముగా ద్విపదయు, మంజరియుఁ గానవచ్చును. కాని, వారివారి పాటతీరులు వేరు గానే యుండును. ప్రాచీన లేఖకులిట్టి రచనములను దాటియాకులపై వ్రాయునప్పుడు వారు చదువు ఫణితిలో నేర్పడు దీర్ఘస్వరాదులతోనే వానిని వ్రాయుచుండెడివారు. మన బసవపురాణముగూడఁ గొన్ని ప్రతులలో నట్టితీరున వ్రాయబడియున్నది.

కైలాసమునఁ దొల్లి గఱకంఠుగొలూవ
శైలేంద్రకన్యక సనుదెంచు నెడాను.

ద్విపద రచనమున వెలయించుటచేఁ దన గ్రంథములు పండితులకే కాక పామరులకుఁగూడ నుపాదేయములు కాఁగలవని, యట్లు కావలయునని సోమనాథుఁడభిమానించెను. అవి యట్లే వెలయఁగల్గెను.

## ఛందస్స్వాతంత్ర్యము

ఈ యభిమానముచే సోమనాథుఁడితరాంధ్రకవులు పాటించిన ద్విపద చ్ఛందోనిబంధమునఁ గొంత స్వాతంత్ర్యము వహించి మాఱుపాటు గావించెను. తాళ్లపాక చిన్నన్న ప్రాచీన సంప్రదాయానురోధమున ద్విపదలక్షణమునిట్లు నిర్వచించినాఁడు.

వాసవుల్ మువ్వురు వనజాప్తుఁ డొకఁడు
భాసిల్ల నది యొక్క పదము శ్రీకాంత
క్రమమున నవి నాల్గు గణముల నడచుఁ
గ్రమదూరముగఁ బ్రయోగము సేయరాదు
ఆ పాదమునకు మూఁడవగణం బాది
దీపించు యతి యంబుధిప్రియతనయ
యుపమింపనవి ప్రాసయుతములై రెండు
ద్విపదనా విలసిల్లె వికచాబ్జపాణి



ద్విపదకు ద్విపదకుఁదెగఁజెప్పవలయు
నెపుడు సంస్కృతమున నితర భాషలను
యతుల లోపలఁ బ్రాసయతి దక్క సకల
యతులుఁజెల్లును బ్రయోగానుసారమున
ద్విపదతో ద్విపద సంధిల నేకశబ్ద
మపుడు ప్రయోగింప నది యయుక్తంబు
మఱియు సంస్కృతపు సమాసరూపమున
నెఱయ నెన్నిటినైన నిర్మింపఁదగును
...................................
అనులక్షణమ్ముల ననువొంది సుకవి
జన సుప్రయోగైక శరణమై......

– అష్టమహిషీకళ్యాణము.

రంగనాథరామాయణాదులీలక్షణము ననువర్తించుచున్నవి. కాని, సోమనాథుని రచన మిట్లు లేదు. ద్విపదమున నితరకవులెవ్వరును బాటింపని ప్రాసయతి నీతఁడు చేర్చెను. రంగనాథ రామాయణమునఁగాని, గౌరన హరిశ్చంద్ర చరిత్రమునఁగాని, ప్రాసయతి యెక్కడను గానరాదు. ఈతఁడును నీతని కనుయాయులగు శివకవులు మఱికొందఱును మాత్రమే యీ ద్విపద ప్రాసయతిని జేర్చిరి. '**అనియతగణైః**' '**ప్రాసో వా**' '**యతిర్వా**' యని మూఁడు సంస్కృతసూత్రముల నుదాహరించి సోమనాథుఁడు మాత్రాగణ ఘటితములగు జాతులందుఁ బ్రాసయతి చెల్లునని నిర్ణయము చేసినాఁడు. ఈ నిర్ణయము సంగతమే యనఁ దగియున్నది. అయినను రంగనాథాదులు దీని నంగీకరింపమికి హేతువేమో: మఱియు ద్విపదయు ద్విపదయుఁ గలయునప్పుడొక్కపదమే యిటు గొంతయు నటు గొంతయునై యుండునట్లు రంగనాథాదులెక్కడను గూర్పరయిరి. 'ద్విపదతో ద్విపద సంధిల నేకశబ్ద-మపుడు ప్రయోగింప నది యయుక్తంబు' అని చిన్నన్న స్పష్టముగా నీ విషయమును నిరూపించినాఁడు. అయినను మన సోమనాథుఁ డీ నిర్ణయమును బాటింపలేదు.

జాతులు మాత్రానుసంధానగణవి
నీతులుగాన యనియతగణైర
నియును బ్రాసో వా యనియు యతిర్వా య

...................................

అతిశయప్రీతి బ్రహ్మాండపురాణ
మతమహోమోహస్యమాహాత్య్మ మన మొ
దలఁద్రిపుండ్రం మోక్షదం త్యక్త మనవి
రళ మేతదన్యత్ర రమతే యనఁగ ను
చితసూక్తి యట్ల వాసిష్ఠలైంగంబు.

(పండితారాధ్యచరిత్రము)

ఇట్లు గూర్చుట పండితారాధ్యచరితమందే హెచ్చుగాఁగానవచ్చును. బసవపురాణమున నేద్విపద కాద్విపద విడఁబడియేయున్నది.

ఇది యిట్లున్నను నీతఁడు, దర్వాతి కవులంతగాఁబాటింపనిదియు, నన్నయరచనమందుఁ దిన్నఁగా నెన్నఁదగియున్నదియు నగు సీసరచనా వైలక్ష ణ్యమును అనుభవసారమునను, జతుర్వేదసారమునను జక్కఁగాఁ బాటించినాఁడు. మఱియు క్రౌంచపదవృత్తమున, నన్నిచోడనికంటె నెక్కువ నియమమును బాటించినాఁడు.

చంచుల నాస్వాదించుచు లేఁదూం డ్లకరువుప్రియలకు నలఁదుచు మైరో..
– నన్నిచోడఁడు.

భక్తివినీతుల్ యుక్తిసమేతుల్ భవభయనిపతిత పశుగణపూతుల్...
– సోమనాథుఁడు

ఇందు నన్నిచోడని రచనమున చరణము రెండుదళములై మొదటిదళ మునఁ బ్రాసయతియు, రెండవదళమున వేఱుగా యతియుఁ గల్గియున్నది. సోమనాథుని రచనమున నింత కెక్కువగా ద్వితీయదళమున యతి ప్రథమ దళ



ప్రథమాక్షరమునకనుగుణమైనదిగా నున్నది. అర్వాచీనకవులెల్లరు నీ విధానమునే యనుకరించిరి.

## ప్రాసవిశేషములు

సోమనాథుని గ్రంథములలో నితర (భవి) కవికృతులందంతగాఁ గానరానివి ప్రాసవిశేషములు గొన్ని గానవచ్చుచున్నవి. నన్నయాదుల కృతులలోఁ బ్రాసములందు హల్‌సామ్యము తప్పక కాననగును. అనఁగాఁ బ్రథమచరణ ద్వితీయాక్షరమున నెన్ని హల్లులు సంయుక్తములుగా నున్నవో యన్ని సంయుక్త హల్లులును దక్కిన మూఁడుచరణములందును గూడ ద్వితీయాక్షరమునఁ గూడి యుండును. మల్లికార్జునపండితుఁడు మొదలగు శివకవు లీ నియమము నంతగాఁ బాటింపరయిరి. కతిపయ హల్ సామ్యమున్నఁజాలునని వీరు దలంచిరి.

క. నమ్మినభక్తుఁడు గన్నద
బమ్మయ సద్భక్తి మహిమ పరికింపఁగ లో
కమ్ములఁ జోద్యముగాదె య
ధర్మంబును ధర్మమయ్యెఁ దత్త్వాతీతా!

ప్రాఁతవ్రాఁతలలో “ధమ్మ౯” యని యుండును.

క. ఇవ్వసుమతిఁ గడుఁగమ్మని
పువ్వులలోఁ బుట్టి నట్టి పువ్వులు గొఱయే
సర్వజ్ఞభక్తి విరహితుఁ
డెవ్వఁడు నుత్కృష్టజాతుఁ డేటికిఁగొఱయే.

–శివతత్త్వసారము.

“మర్త్యలోకమునకు మఱి వేఱె యొకఁడ
కర్తయున్నాఁడె లోకత్రయవరద!”

“మధ్యాహ్నమగుటయు మారయ్య లింగ
తద్ధ్యానసుఖ నిరంతర వర్తియగుచు.”

"అక్షణంబునఁ బంచభక్ష్యముల్ గుడిపి."

"కర్ణంబునావుడు బిజ్జలుఁడంత
లజ్జయు సిగ్గును బుజ్జగింపగ."

"బుజ్జగించుచు వెడ్లుబుడ్లునుబెట్టు
నిర్జీవిక్రియఁ బడు నివ్వెఱఁగందు."

"తత్త్రిపురాంతకస్థానవాస్తవ్యుఁ
డై త్రిపురాంతకుండభినుతిఁబేర్చు."

–బసవపురాణము.

ప్రయోగరత్నాకరమున వేములవాడ భీమకవి నృసింహపురాణ మందలిదని యీ క్రిందిపద్యముదాహృతము.

క. ఈ క్షితికి వచ్చి వేగమ
దాక్షారామమున వారతరుణుల నృత్తం
బీక్షించి యంతకంటెను
దక్ క్షణమున నేర్చి రంభ తగవేర్పడఁగన్.

రేఫాధిక్యమునుమాత్ర మితరాంధ్రకవులు గొందఱుగూడ నంగీ కరించిరి. ఈ సంప్రదాయము మల్లికార్జునపండిత సోమనాథాదులచేఁ గ్రొత్తగా నెలకొల్పఁ బడినదిగాదు. కర్ణాటభాషలో నిట్టిప్రాసము గలదు. ఆ భాషలో దీనికి శాంతప్రాస మని పేరు.

క. బెరసిరె ముంసంయోగా
క్షరంగళేక స్వరంగళిం సుప్రాసం
నెరెదు విపర్యాసక్రమ
దిరె సతతం శాంతపూర్వమక్కుం ప్రాసం

క. పత్తిప్రమాదఫలకమ
నత్యుగ్రగ్రాహనివహ సంక్షోభితదోళ్



మత్తీరత్నాకరదోళ్
పుత్త్రికెయెనెబిళ్లళింతు బాళ్దుదెచోద్యం

క. శాంతప్రాసదభేదమ
దిం తక్కుం.........

– కవిరాజమార్గము.

వర్గాక్షరములు పరస్పరము ప్రాసములుగా నుండవచ్చుననియు వర్గప్రాసమని దానిపేరనియు, శషసలు, పరస్పరము ప్రాసముగా నుండవచ్చుననియు దానిపేరు సమీపప్రాసమనియుఁ గవిరాజమార్గమునఁ గలదు. శివకవులీ ప్రాసములఁ గూడఁబ్రయోగించిరి. అర్వాచీనాంధ్ర లాక్షణికులు ప్రాచీనకవుల ప్రయోగములఁ బెక్కింటిని సాధనాంతరములచే సమర్థించి పయిప్రాసముల క్రిందఁబరిగణింపఁ బనిలేకుండఁజేసికొనిరిగాని, కొన్ని పట్టుల నెట్టును సమర్థింపఁజాలక పోయిరి. శసప్రాసము, థ ధ ప్రాసము, దథ ప్రాసము పెక్కు తెనుఁగు కృతులలోఁ గానవచ్చును. మన సోమనాథుఁడును బ్రయోగించెను. తెలుఁగునఁగూడ శాంతప్రాసములు, వర్గప్రాసములు సమీపప్రాసములు గలవు. ప్రాచీన లాక్షణికులు వానిని బరిగణించిరి. శివకవులు ప్రాచీన సంప్రదాయమును జక్కఁగాఁ బాటించిరి గాని, యితర కవులు నిర్బంధముల హెచ్చించుకొనిరి.

మఱియు, నన్నిచోడఁడు, సోమనాథుఁడును, బూర్ణబిందువునకు నర్ధబిందువునకుఁ బ్రాసముఁ గూర్చిరి.

క. పోఁడిగ నగజతపశ్శిఖి
మూఁడుజగమ్ములను దీవ్రముగఁ బర్విన బ్ర
హ్మాండముఁగాఁచిన కాంచన
భాండముక్రియఁదాల్చెఁ దత్ప్రభాభాసితమై.

– కుమారసంభవము.

పాండురాంగంబైన పడఁతిగర్భమునఁ
బోఁడిగా వెలుఁగుచుఁ బుత్త్రుఁడీ క్రియను.

– బసవపురాణము.

వర్గప్రాసమును, సమీపప్రాసమును నంగీకరించునప్పుడు పూర్ణార్థ బిందుప్రాసమునుగూడ నంగీకరించుట సంగతమే యగును. అయినను నన్నయాదులగు కవులీ ప్రాసము నంగీకరింపరయిరి. వారి గ్రంథములలో గానరాదు. ఇప్పుడర్ధబిందువులుగా నెఱుఁగఁబడుచున్న పదములు పోఁడి, మూఁడు మొదలగునవి యానాఁడు పూర్ణబిందువులుగనే యెన్నఁబడుచుండ వచ్చుననియు, నిది పూర్ణబిందుప్రాసమే కావచ్చుననియుఁ గొందఱందురు. అది యట్లుగాదు. పోఁడి, మూఁడు పదములను మరల నీ కవులే యర్ధబిందు ప్రాసమునఁగూడఁ గూర్చిరి గావునను, నాకాలపుఁ గవులెల్లరు నా పదముల నర్ధబిందు విశిష్టములఁగనే ప్రయోగించిరిగావునను, నది పూర్ణార్థ బిందుప్రాస మనియే తలఁపవలెను.

నాఁడు నావిందిగెనాఁ బురవీథిఁ
బోఁడిగా గుడ్డవ్వ వోవభూసురులు

– పుట. 223

ఇత్యాదులు పెక్కులు ప్రయోగములర్ధబిందు విశిష్టతానిర్ణాయ కములు గలవు. మఱియు నన్నయ భారతకృతిపతియగు రాజరాజనరేంద్రుని కూఁతురు సోమలదేవి (ఇంచుమించుగా నన్నయకాలమున) చెక్కించిన దాక్షారామ శిలాశాసనమునఁగూడ నొక పద్యమందీ ప్రాసము గానవచ్చు చున్నది.

సకలవసుమతీశ మకుటలసద్రత్న
కిరణరుచివిరాజి చరణుఁడయిన
నిజభుజప్రధాని బెజయితదేవని
కూఁతుసరియె వోల్పఁ గాంతలెందు.



ఈ పద్యము నాల్గవ చరణమున 'కూఁతు' పదము 'కాంత' పదము ప్రాస యతిలోఁ జేర్పఁబడినవి. ఇందుఁ 'గూఁతు' పద మర్ధబిందు విశిష్టముగా నెన్నఁ బడవలసినదే. అది పూర్ణబిందూచ్చారణముతో నుండవలసినదే యగునేని శాసనమున "కూంత్తు" అని చెక్కింపఁబడియుండును.

వేములవాడ భీమకవి నృసింహపురాణములోనిదిగా నీక్రింది పద్యము లక్షణగ్రంథములందుఁ గలదు.

ఉ. వాఁడిమి నల్లసిద్ధి జనవల్లభుఁడోర్చిన రాజుభీతితో
నాంద్రను గావకుండ వృషభాంకము వెట్టికొనంగఁజూచితో
నేఁడిది యేమి నీవనుచు నెచ్చెలులెల్ల హసింప నంతలో
మూఁడవకంటితోడి దొరమూర్తి వహించిన మ్రొక్కిరంగనల్

ఇందు రెండవ చరణమున 'ఆఁదుర' అని కాని, 'ఆందుర' అని కాని, యుండునేమోయని నా సంశయము. ఆంద్రురు, నీళ్లులు ఇత్యాది విధముల బహువచన ప్రత్యయములపై మరలఁ బహువచన ప్రత్యయములు గల రూపములు భారతాదులలో నేఁడు గానవచ్చుచున్నవి. అవి యట్టివి కాకపోవచ్చునని 'ఆఁదురు, నీళులు' ఇత్యాది విధములనే యుండియుండవచ్చు నని నా తలఁపు.'వెలయాంద్రురకలుపు' అనుచో 'వెలయాఁదురకలుపు' అని కాని, లేక 'వెలయాందురకలుపు' అనికాని, యుండవచ్చును.

కవిజనాశ్రయమునఁగూడ 'ప్రగీతి' లక్షణములో 'మూఁడుసేసి నగణములు, రెండు నలములు, మూఁడిన గణములును మొగినహంబు, పోఁడిగాఁ గనర్ధమునకగు మీఁద ని,ట్లుండఁ జెప్పవలయు నొగిఁబ్రగీతి' అని కలదు. అదియు పూర్ణార్థబిందు ప్రాసమే.

మఱియు నీతఁడు పూర్ణార్థబిందుప్రాసమును రేఫద్వయ ప్రాసమును గూడఁ గూర్చినాఁడు.

జగతిఁ బద్మపురాణసంహితలందె
సఁగె శంభురాఘవసంవాదమునను – పండితా

బ్రాఁతిగా నాదివరాహదంష్ట్రంబు
ఖ్యాతమీశ్వరుచేతఁగాదె యున్నదియు – బసవ పు. 203

బూది దా రాఁజదు వొగయదు దాను
నూఁదండు ముట్టించె నొక్కదీపంబు –బసవ పు. 15

షోడశపండువు సూడఁబోదండు
పోఁడిగా నీపాలు పురహర! కొనుము ! –బసవ పు. 71

ఊఁదు సార్ధానుస్వారముగా శబ్దరత్నాకరమునఁగలదు. అది సార్ధానుస్వారమే యని నిర్ణయించుటకుఁ బ్రబలప్రమాణము కావలెను.

చీరసించుచు విప్రులాఱడి వైచి
కారించుతఱి నుదకము లేదు గంట. –బసవ పు. 83

అఱిముఱిఁ జన్నఁబాలర్థించివేఁడఁ
జిఱుతచే నొకపిండికరు డిచ్చితల్లి పుట. 120

తారొండె శివుఁబంపఁదగదన్న వారు
గారొండె నంబికి వేఱొక్కభృత్యు. –బసవ పు. 133

'ఆరడి' యని సాధురేఫముగాఁగూడఁగొందఱు ప్రయోగించిరి.

## యతివిశేషములు

మూఁకకు నెగయుచు ముస్సుముస్సనుచు – బసవ పు. 160

అనుచోట నేఁటి వ్యవహారము చొప్పున "బుస్సుబుస్సనుచు" యని యుండఁ దగుననియు నదియప్పకవ్యాదులు పేర్కొన్న 'ముకారయతి' యగుటచే సాధువే యగుననియుఁ దలఁపఁదగియున్నది కాని, వ్రాఁతప్రతులలో "ముస్సు ముస్సనుచు" అని యుండుటచే నట్లే యుంచితిని. అప్పకవి చెప్పిన చొప్పున ముకార యతి ప్రాచీనకృతులందు నాకెక్కడను గానరాలేదు. అప్పకవి ముకార



యతికి లక్ష్యముగా నాచన సోముని వసంతవిలాసములోనిదిగా నీ క్రింది పద్యము నుదాహరించినాఁడు.

క. అత్తఱి విటనాగరకులు
చిత్తమున వసంతకేళి సిగురొత్తంగా
మొత్తములు గట్టితెచ్చిరి
ముత్తెపుఝల్లరులతోడి బుఱ్ఱట కొమ్ముల్.

ఈ పద్యమందలి 'బుఱ్ఱటకొమ్ముల్' అను పదమును ప్రాచీన కవులు 'ముఱ్ఱటకొమ్ముల్' అనియే వాకొనిరి. కుమారసంభవమునఁబెక్కుచోట్ల నన్నిచోడకవి యట్లే ప్రయోగించెను. రామాయణమందయ్యలార్యుఁడట్లే ప్రయోగించెను. 'ముఱ్ఱటకొమ్ములు' బుఱ్ఱటకొమ్ములుగా మాఱిన పిదప లాక్షణికు లీ ముకారయతిని గల్పించిరి. దానిఁబట్టి యర్వాచీనకవులా యతిని ప్రయోగించుచు వచ్చిరి. 'ముస్సు' ధ్వన్యనుకరణమైనట్టే ముఱ్ఱటకొమ్ములో 'ముఱ్ఱు' కూడ ధ్వన్యనుకరణమగునని నా తలఁపు. ప్రాచీనకాలమున 'ముస్సు' 'ముఱ్ఱు' అని యున్న ధ్వన్యనుకరణములర్వాచీనకాలమున 'బుస్సు' 'బుఱ్ఱు' లుగా మాఱి యుండవచ్చును.

నన్నయాదులు విభక్తిముకారముతో 'పుఫుబుభు' లకును యతిని గూర్చిరి. కాని, యితర ముకారముతోఁ గూర్పరయిరి. లాక్షణికులు దానికి ము విభక్తిక యతి యని పేరిడిరి. "పుణ్యుఁడు రాఘవుండు వనముం గనియెన్" అను విధమునఁ బ్రయోగించిరిగాని 'పుణ్యుఁడు రాఘవుండు మునిముఖ్యులతో' నను విధమునఁ బ్రయోగింపరయిరి. సమానోచ్చా రణముగల 'ము' కారముల కిట్లు యతిలో భేదము గల్పించుట నేఁడు వింతగా గాన్పించును గాని యాంధ్రమున నట్టి యతివ్యవస్థ యేర్పడిన కాలమున నీ విభక్తి ముకారము వేఱువిధముగా నుండెడిది. నేఁడును విభక్తిముకారమునకు 'మ్ము, ంబు' అని రూపాంతరము లున్నవి. వనము, వనమ్ము, వనంబు అనియు రూపములు గలవు. నన్నయకుఁ

బూర్వకాలమున 'ఁబు' అను రూపముకూడ నుండెడిది. ఆ కాలమున వనమ్బు, వనఁబు, రూపములే ప్రధానముగా నుండెడివి. వనమ్ము, వనము రూపములు పయి రూపములకంటె నర్వాచీనములు. ప్రాచీనశాసనము లీ విషయమును నిరూపించుచున్నవి. ద్రవిడభాషా శబ్ద స్వరూప మిందుకుఁ దోడువలుకుచున్నది. 'క. ఎట్టి విశిష్టకులంబునఁ బుట్టిన ! సదసద్వివేకములు గల్గిన ' ఇత్యాది విధముల నన్నయాదు లీ యతిని బ్రయోగించిరి. వనఁబు రూపమున్న కాలమున నేర్పడినదగుటచే నీ మువిభక్తికయతి ముకారయతి వంటిది గాదయ్యెను. ప్రాచీనులు ముకారయతిని బ్రయోగించిరనుటకప్పకవి యుదాహరించిన వసంతవిలాస పద్యమప్రయోజకము. తక్కిన పద్యము లర్వాచీనకృతుల లోనివి.

శివకవులఖండయతిని బ్రయోగించిరి. పండితారాధ్యుఁడు 'వేదోక్తముగ నెఱుంగవలయుఁదుదిని మహేశా' అనెను.

సోమనాథుఁడు నామాఖండయతిని గూడఁ బ్రయోగించెను.

మఱియు నేకాంతరామయ్యనా నొక్క -బసవ. పు. 170

మఱియును శివనాగుమయ్యనా నొక్క

– ఖండమై తనరు నాగయ్యహస్తమున– పండితా. ప్రథమప్రకరణము.

అనియు గలదు.

చేయుడు లెంకమంచెన పండితులకు
శ్రీరమణుండు మంచెన పండితయ్య -బసవ. పు. 198

ఇందు 'మంచెన' పదము నేఁడు 'మంచన' యని ప్రయుక్తమగును. ఆనాఁడిట్టి నామపదములలోఁ గొన్నింట అన, అయ, అను విధమునఁ బద చ్ఛేదము కానరాదు. నన్నియ, మల్లియ, మంచెన, కూచెన, ఉదాహరణములు. నేఁడివి నన్నయ, మల్లయ, మంచన, కూచెనలుగా మాఱినవి. నన్నయకూడ నొకవిధమున నామాఖండయతిని బ్రయోగించెను.



ఉ. పాయక పాకశాసనికి భారతఘోరరణంబునందు నా
రాయణునట్లు [1]వాణసధరామరవంశవిభూషణుండు నా
రాయణభట్టు వాఙ్మయధురంధరుఁడున్ తన కిష్టుఁడున్ సహా
ధ్యాయుఁడు నైనవాఁడభిమతంబుగఁదోడయి నిర్వహింపఁగాన్.

ఇందు మూఁడవ చరణములోనిది నామాఖండయతి యనఁదగినదియే కాని, యది సంస్కృతసమాసమధ్యగతము. సోమనాథుని ప్రయోగములకును దీనికిని మిక్కిలి భేదము గలదు. అఖండయతిని నిర్వచిం చినవాఁడు పాల్కురికి సోమనాథుఁడని 'మానుగ విశ్రమాక్షర' పద్య మాతని దని కొందఱు లాక్షణికులు పేర్కొనిరి. మఱియు,

ప్రేమంబెలర్పంగ "భృత్యా (త్యే?) పరాధ
స్స్వామి నోదండ" యన్నదువు నిష్ఠించి. బసవ. పు. 106

పాయకశ్రుతి "రసాన్నకృత్తస్య జిహ్వా
గ్రే" యని యేప్రొద్దు మ్రోయుఁగావునను. బసవ. పు. 164

పయి ద్విపదలలో 'రాధ' 'జిహ్వా' యనునవి 'గగ'ములుగా నున్నవి. ద్విపదలక్షణము చొప్పున నక్కడ "గల" ములుండవలసి యున్నవి. "వాసవుల్ ముప్వురు వనజాప్తుఁడొకఁడు భాసిల్ల నది యొకపదము" అని తల్లక్షణము. సంస్కృతమునఁ జరణాంతమందలి లఘువు గురువు గావచ్చునని 'పాదాంతస్థం వికల్పేన' అని విధియుఁబ్రయోగములును గలవు. కాని, పాదాంతమందలి గురువు లఘువగుట కానరాదు. ఈ రెండు గణభంగములును సంస్కృత భాషానుకరణమునఁబడినవి. వీనిని సమర్థించుట యెట్లో! 'శ్లో॥ లఘు ర్భవే ద్గురుః కుత్రచిద్గురుశ్చ లఘు స్తథా, ఉచ్చారణస్య కల్ప్యత్వా న్నిదానం తత్ర సద్వచః' అను నథర్వణకారిక గతి కావలెనేమో! మఱియు,

శునకగార్దభమ్లేచ్ఛ శుకదర్దు రాది
అంధకకరి దైత్యవ్యాఘ్రులాలాజ -బసవ. పు. 204-205

---

1 తానును - పాఠాంతరము.

పయి రెండు చరణములందును 'సల' ముగా నుండవలసిన ద్వితీయ గణములలో 'త్య' 'భ' లు గురువులుగా నగుటచే గణభంగ మేర్పడుచున్నది. అన్ని ప్రతులందును నీ పాఠములే కలవు. వీనిని సమర్థించుట యెట్లో!

ద్విపదమునఁబ్రాసయతిని జేర్చుట, రేఫద్వయసాంకర్యము నంగీకరించుట మొదలుగా సోమనాథుఁడు చూపిన ఛందస్స్వాతంత్ర్యమును శివకవులంగీకరించిరిగాని, యితరులు గర్హించిరి. కాకతి ప్రతాపరుద్రుని కాలముననే యిట్టి గర్హమేర్పడినట్లు పద్యబసవపురాణము తెలుపుచున్నది. అర్వాచీనుఁడగు నొక శివకవి యిట్లు చెప్పినాఁడు :

..............................
ఇలఁబాలకురికి సోమేశుండు మున్ను
తొలఁగక ప్రాసయతుల్ ద్విపదలను
లలి రచించుట యది లక్ష్యంబుగాను
నెలమి రేఫఱకారములు శివకావ్య
ముల యందుఁ జెల్లుఁ దప్పులు గావు గాన
ఆ పాల్కురికి సోముననుమతి నేను
దీపిత ప్రాసయతిచ్ఛందసరణి
నా మహాగురు దేవు ననుమతియట్ల
శ్రీ మెఱయంగ రచించితినిట్లు.

–మఱి బసవపురాణము.

ఛందోవిషయముననేకాక వ్యాకరణ విషయమునఁగూడ నన్నిచోడ సోమనాథాదులగు శివకవులకును నితరులకును బహుభేదములు గలవు. నన్నిచోడనియు, సోమనాథునియు శబ్దప్రయోగములు గొన్ని యసాధారణములై యితర కవికృతులందుఁగానరానివై యున్నవి. అట్టివానిని గొన్నింటిని బేర్కొనుచున్నాఁడను.



## అసాధారణ ప్రయోగములు

కర్ణాటాంధ్రలాక్షణికులు కావ్యదోషములలో గణించిన 'వైరిపద' మనుశబ్ద దోషము వీరి కృతులలోఁ బెక్కుచోట్లఁ గానవచ్చుచున్నది. వైరిపదము దోషమని గర్హించిన ప్రాచీన కవులే కొందఱు వానిని దఱచుగాఁ బ్రయోగించుట వింతగా నున్నది. సోమనాథుఁడు పండితారాధ్య చరిత్రమున 'వైరిపదము' ను గర్హించెను. కవిజనాశ్రయము, ఆంధ్రభాషాభూషణము, కావ్యాలంకారచూడామణి, ఛందోదర్పణము మొదలగు గ్రంథములీ దోషమును బేర్కొన్నవి. అయినను, నన్నయాదుల కృతులలోఁగూడ నిట్టి వైరిపదములు కొన్ని గానవచ్చుచున్నవి. అర్వాచీనలాక్షణికులనింద్య గ్రామ్యములని యట్టివానిని గొన్నింటిని గణించిరి. ప్రాచీనులట్టి వానిని వైరిపదములనియే పేర్కొనియు ప్రయోగించిరి.వైరిపదమనఁగా సంస్కృతాంధ్ర పదముల విరుద్ధసమాసము. సోమనాథుఁడు బసవపురాణమున మాత్రము ప్రయోగించిన వైరిపదములఁ జూపుచున్నాఁడను.

పు. 6–'దీపగంభంబులు',పు. 15–'చౌదళాబ్జంబు', పు. 26 'ముల్లోక వంద్య', పు. 30–'ముల్లోకనుతుఁడు', పు. 240– 'ముల్లోకనాథుని', పు. 44–'నిత్యనేమంబు', పు. 55–'నిత్యపడి, పు. 134–'నిత్య', (ఇట్టివి పెక్కుమార్లు), పు. 55–'పుడమీశ', పు. 60,62– 'సర్వాంగ కచ్చడము', పు. 124– 'భక్తకూటువలు', పు. 178– 'మజ్జనబావి', పు. 201–'ఇతరవేల్పులు', పు. 44,205–'తవనిధి', పు. 249– 'తవరాజు', పు. 185–'తవరాజవల్లభుఁడు', పు. 201– 'సిరిమహాదేవాది సురలు', 140 ధర్మకవిలె, ఇత్యాదులు. పరిశోధింపఁగా నీ పదములు, సోమనాథుని కాలమున బాహాటముగా నాంధ్రశైవ కావ్యములందుఁ బ్రయోగింపఁ బడుచుండినట్లు గానవచ్చుచున్నది. ద్రవిడ కర్ణాటభాషలలోను, దత్కాలపుఁ గృతులలో నిట్టివి కొన్ని గానవచ్చుచున్నవి. కొన్నింటిని బేర్కొనుచున్నాఁడను–

**దీపగంభములు :** కంభమని సంస్కృత శబ్దము లేదు గావునను, ఉన్నదనుకొన్నను, దెనుఁగుసంధి చొప్పున క,గ యగుట యసంగతము గావునను, నిది వైరిసమాసమే. తెనుఁగు పలుకులలోఁ గొన్నింట, వర్గద్వితీయ చతుర్థాక్షరములు

గలవు. ఆంధ్రవ్యాకరణకర్తలవి లేవనుట యసంగతమని నా తలంపు. ప్రాచీనలేఖనములందు వర్గద్వితీయ చతుర్థాక్షరములుగా నున్నవానిని నేఁటి పరిశోధకులాంధ్రమున నవి లేవనునమ్మకముచే వర్గప్రథమ తృతీయాక్షరములుగా సంస్కరించుచున్నారు. ద్రాభ, జఱభి, వజ్జలు మొదలగు వానిఁజూడఁదగును. సోమనాథుఁడే :

కంభకట్లను మేలుకట్లను బొలుచు– గంభీరపుష్పకాగారంబునందు – అని 'కంభ' పదమును బ్రయోగించెను. మఱియుఁ బెక్కు శాసనములలోను గలదు.[1]

ద్రాభఛందోవిరుద్ధంబాదియగున– లాభప్రలాపోక్తిలాఘవంబనక. – పండితా.

**చౌదళాబ్జము :–** ఇది చౌసీతిబంధములు, చౌషష్టికళలు, చౌపదము, చౌపుటము అను పదములవంటిది. ముల్లోకవంద్యుఁడు ఇత్యాదులు– అనంతుఁడు :–

గీ. "మొదలి తెలుఁగుపై సంస్కృతపద మొకండుఁ
జరగ లోకరూఢిని సమాసంబు చొరదు
పూని ముజ్జగంబులు ననఁబోలుఁగాని
యతఁడు ముజ్జగద్వందితుఁ డనఁగఁ జనదు"

అనెను. కాని, సోమనాథుఁడిట్టిపదములను బలుచోట్లఁ బ్రయోగించెను. తత్కాలపు శాసనకావ్యములందును నిట్టివి గానవచ్చుచున్నవి. "ముల్లోకవిభుండు సక్రి" ఓపిలి సిద్ధిశాసనము. [2]నిత్యనేమము, నిత్యపడి మొ. ఈ పదములను మఱికొందఱు కవులును బ్రయోగించిరి.'నిత్య'వేఱుగాఁ గూడఁ గలదు. నాఁటి శాసనములందును 'నిత్యపడి, దివసపడి' ఇత్యాదులు గలవు.[3] పుడమీశ– దీనిఁగూడఁ బలువురు

1. దక్షిణ హిందూదేశ శాసన సంచయము. IV నెం. 1378 చూ.
2 చూ. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.
3. దక్షిణ హిందూదేశ శాసన సంచయము. IV నెం. 1020 చూ.



కవులు ప్రయోగించిరి. 'పుడమిపుఁడున్ ధనాఢ్యుఁడును' – నన్నిచోడుఁడు; 'పుడమీశ్వరగొంకనృపతి భోగసురేంద్రా' –మను మంచిభట్టు నశ్వశాస్త్రము; 'పొడగాంచి యిదియుఁ గఱచెన్ ! బుడమీశ్వర దేహమనుచు' – నారాయణకవి పంచతంత్రము; ఇత్యాదులు పెక్కులున్నవి. కర్ణాటభాషలోఁగూడ నిది కలదు. 'తవనిధి, తవరాజు' ('తపోనిధి, తపోరాజు అనుటకు) మొ. తెలుఁగు కృతులలోఁ గాని శాసనములలోఁగాని నాకిది గానరాలేదు. ద్రవిడకర్ణాట ప్రబంధములలో నిట్టివి తఱచుఁగా గలవు. తక్కిన ప్రయోగములు నాకన్యత్ర కానరాలేదు. జీవగఱ్ఱ– ఈ పదమును చతుర్వేదసారమున సోమనాథుఁడు ప్రయోగించెను. ఇది 'యనింద్యగ్రామ్య (వైరిసమాస) మని పలువురందురు గాని నాకట్లు దోఁపదు. శ–ర–లో దీనికి జీవనౌషధము జీవాతువు' అని యర్థము వ్రాయఁబడినది. ఈ యర్థమును సరిగాఁ దోపదు. జీవ=వీణ మొదలగువాని తంతి చక్కఁగా మ్రోఁగుటకుఁ గాను దానిక్రింద నుంచెడు కంబళిపీఁచు లోనగునది. దాని నుంచుటకుఁ గాను బెట్టినకఱ్ఱకు 'జీవగఱ్ఱ' యని పేరు. 'విపులతరంబగు వీణ దానది యెంత కారణంబగు జీవగఱ్ఱ యెంత' చతుర్వేదసారము. "శ్రుతికి నుత్కర్షంబు సూపఁగవలయుచోఁ జెవిత్రాడు బిగియించు జీవగఱ్ఱ" క్రీడాభిరామము.

పు. 144– **అభిమానకత్తె** ఈ పదము క్రొత్తగాఁ గానవచ్చినది. శ్రీనాథుఁడు గూడ నిట్టిపదములఁ బ్రయోగించినాఁడు. 'అన్న మీయన్న కోపగాఁ డౌనొ కాఁడొ', – కాశీఖండము; 'కొడుకుఁ గాంచినట్టియ కోపకత్తె' – క్రీడాభిరామము

పు. 119– **'సద్భక్తసమూహి'** ఇత్యాదులు. నన్నిచోడఁడు నిట్లు ప్రయోగించెను. 'శారదనీరదసమూహిచాడ్పునఁబోలెన్', 'సితచ్ఛదసమూహి' :– కుమార సంభవము; దశమాశ్వాసము.

**కర్మధారయమున మహచ్ఛబ్దము** – పు. 12– 'ఇదిసుమహత్తత్త్వము', పు. 225– 'ప్రోద్గత సూత్రమహద్గురుపుత్ర, మండలి లోభవన్మహదాజ్ఞ' – 'పండితా. – ఇట్టి వింకను గలవు. కర్మధారయసమాసమున 'మహత్' 'మహా' అని మాఱవలసి యుండఁగా నీతఁడు 'మహత్' అనియే షష్ఠీసమాస మందుంబోలె

నుంచినాఁడు. ఈ దోషము నన్నిచోడని కుమారసంభవమునఁ గూడఁ బెక్కుచోట్లఁ గలదు. 'దళితాంభోరుహ సప్తపత్ర సుమహత్కా శాసనౌఘంబు' (–షష్ఠాశ్వాసము) ఇత్యాదులు.

పు. 37– 'వచ్చు వహిత్రంబు వడువునుబోలె' 'వఱలఁగఁదాల్చిన తెఱఁగును బోలె'. నన్నిచోడఁ డిట్టివానిని దఱచుగాఁ బ్రయోగించినాఁడు. 'బలసికొలువున్న సురగిరిభంగివోలె', 'వనముగాపు వచ్చు వడువువోలె.'

పు. 84–'ఊరకో నాయన్న యూరకో తండ్రి' 'ఊరకుండు' అని ప్రయుక్తమగు శబ్దపల్లవధాతువునకు "ఊరకొను' అని యేకధాతురూపము క్రొత్తగా నున్నది. ఇట్టి ధాతువు నేఁడు వ్యవహారమునఁ గూడ వినవచ్చుచున్నది.

**ఇల్ల :–** పు. 23– 'ఇల్లకప్పడిసంగమేశ్వరంబందు.' పిడుపర్తి బసవన పద్యకృతిలో దీనిని 'ఇల్లీ కప్పడి సంగమేశ్వరమునం' దని మార్చినాఁడు. ఆ స్థలమునకుఁ గప్పడిసంగమేశ్వరమని పేరు. తెలుఁగులో 'ఇల్ల' పద మిక్కడనే కాని, యితరత్ర ఇల్ల, ఇల్లది, ఇల్లిక్కడ మొదలగు ప్రయోగములు గలవు గాని, వానిని వ్యాకర్తలామ్రేడితమున వచ్చిన యాదేశరూపములఁగా ననుగ్రహించిరి. అల్లి, ఇల్లి, ఉల్లి, ఎల్లి పదములు స్థల విశేషవాచక సర్వనామపదములని కర్ణాటవ్యాకర్తలు పేర్కొనిరి. తెలుఁగునఁగూడ నీ పదములు గలవు. అల్లది, అల్లవాఁడు మొదలగు విధముల నామ్రేడితమున వచ్చిన యాదేశరూపము లని సరిపుచ్చుకొనఁదగిన స్థలములోఁ గాక 'అల్ల'కు స్వతంత్ర ప్రయోగములు గూడఁ దెలుగునఁగలవు. పు. 175– 'దివి నల్లవోయెడు దేవదేవేశు' ఇత్యాదులు. 'అల్ల' తత్రార్థకము ;'ఇల్ల', అత్రార్థకము; 'ఉల్ల' సమీపప్రదేశార్థకము; 'ఎల్ల' కుత్రార్థకము. ఇక్కడ ప్రయుక్తమయిన 'ఇల్ల' 'ఇక్కడున్న' 'చేరువగానున్న', యనునర్థము గలది. ఇది యామ్రేడితమున వచ్చిన యాదేశరూపముగాదు. 'ఉల్ల'కుఁ గూడఁ బ్రాచీనప్రయోగములు గలవు.'ఉల్ల తెల్లని తురగోత్తము వాలంబు'– నన్నయ, ఆదిపర్వము. 'ఉల్ల కాంచన రథముపై నున్న వాఁడు', 'దానికుల్ల తెరువు' – అరణ్యపర్వము. 'ఎల్ల' సర్వార్థకము కలదుగాని, కుత్రార్థకము తెలుఁగున మృగ్యము.



**పెండ్లిండ్లు :** పు. 23– నేఁడు 'పెండ్లిండ్లు' అని యెల్లరు వ్యవహరించు చున్నారు. పెండిలికి బహువచనము 'పెండిండ్లు' అగుటయే సరి. ఈ రూపము నీ కవి 'పెండిండ్ల నోములఁ బేరంటములనుఁ – బందువుదినముల' అని ప్రాసలోఁ బ్రయోగించినాఁడు.

పు. 80– **'ఒల్వువడు'** – 'ఒలుచు' ధాతువునకుఁ గృద్రూపము నేఁడు 'ఒల్పు' గాఁ గానఁబడును. చువర్ణాంతములయిన ధాతువులకుఁ బెక్కింటికి నేఁడు కృద్రూపమున 'పు' వర్ణము గానవచ్చుచున్నది. ఊడుచు–ఊడుపు, గెలుచు–గెలుపు, తాలుచు– తాలుపు, ఇత్యాదులు. సోమనాథుని కాలమున నివి 'వు' వర్ణాంతములుగా నుండెడివి. 'తారకుం బోరగెల్వుౘ', చిరముగ నొల్వువడ్డ', – కుమారసంభవము 1,5 ఆశ్వాసములు. మన సోమనాథుఁడే 'బిల్వపత్రిని నెలదాల్వుఁ బూజించి' అని పండితారాధ్యచరిత్రమునఁ బ్రయోగించినాఁడు. ఇది లేఖకప్రమాదమని దిద్దరానిది. 'అరియవట్టనమున ఊడ్చిన ఊడ్వునేల, – క్రీ. శ. 1121 నాఁటి శాసనము[1] ఇట్టివి పెక్కులు.

**క్త్వార్థక సంధులు :** పు. 31–'ఏ వేళ వెఱచుండుము.' (నిర్వచనోత్తర రామాయణమున 'వెఱచిట్లంబుధినాథనందనులు' అని తిక్కన ప్రయోగించెను. పు. 76–' ఊచవోయున్న భావమున' పు. 105– 'ఎలుఁగు వి నేతెంచి,' పు. 153– 'ఏ తెంచారగించె,' గలిగున్న దనుచు' పు. 160– 'కట్టెగసల్లంత,' 'పులుగఱచు మియుచు' 'ఏటువడీల్గఁడే'; పు. 202–'కలిగుండువాఁడు,' పు. 185– 'అంజలి ముంచెత్తు నమ్మాత్రలోన', పు. 215– ఇట్టివి క్త్వార్థకేకార సంధులు పెక్కు లీ కవి గ్రంథమునఁ గలవు.

**ఇకారసంధులు :** పు. 44–'పత్తిరీగొద్దునందు,' పు. 81–'పడఁతర్థ పణ్యముల్,' పు. 116– 'కంచేదువాడలు' ఇత్యాదులు గలవు.

**షష్ఠీసమాసము :** పు. 45–'సత్యమాహేశ్వరులిండ్ల,' పు. 116– 'గతిహీనులిండ్ల,' పు. 155– ఇతరులిండ్లైన', పు. 171– 'వేల్పులొడయందు, జినభక్తులిండ్ల,' పు. 240–

1 చూ. దక్షిణ హిందూదేశ శాసన సంచయము, IV వాల్యుం. 479 పుట.

'మా భక్తులొద్ద' బడుగులాదరువ', పు. 102–'పురోహితులను మతము;' ఇత్యాదులు. షష్ఠీసమాసమున విభక్తిలోపమును, అకారముపై సంధియు సర్వప్రాచీనకవి సమ్మతము. ఇట్టి ప్రయోగములననేకులు ప్రయోగించిరి.

**కుషష్ఠి :** పు. 203– 'ఈశుకు బసవండు,' 'కంతుసంహరుకెన', పు. 209,226–'కరికాల చోడుకు', 'పుడమీశుకొల్వుకు,' ఇత్యాదులు. ఇట్టివి క్వాచిత్కముగాఁ బ్రాచీన కృతులలో నున్నవి.

**సంబోధనమున సంధి :–** పు. 184, 215– 'ఎఱుఁగరెజైనులా రెన్నఁడు మీరు,' 'ఓడులారేటికి'. పండితారాధ్యచరిత్రముననను నిట్టి సంధులు గలవు. ఇవి యితర కవుల కృతులలో నాకుఁ గానరాలేదు.

**మహత్తులపై 'రో' :–** పు. 64 'వీరభద్రయ్యరో,'పు. 68– 'వీరెవ్వరయ్యరో యనుచు, దేవరో, బసవరో, ఇత్యాదులు. "రో" మహతీ వాచకముల మీఁదనే యుండు ననుట సరికాదు. ఇతర కవులు గూడ మహద్వాచకములపై 'రో' చేర్చిరి.

**నెట్టణ :–** 'ఇట్టి నెట్టణభక్తి యిట్టి ముగ్ధత్వము,' – 'నెట్టణ భక్తికి నిలుకడయగుచు,' 'నెట్టణశరణుండ నిర్మలాంగుండ,'– ఇట్టివి పెక్కులు. 'నెట్టన' పెక్కు గ్రంథములందుఁ గలదు. అది క్రియావిశేషణముగాఁగానవచ్చు చున్నది. ఇక్కడ విశేష్యముగా నున్నది. ప్రాచీనకృతులలో నిది విశేష్యముగాఁ గూడఁ బ్రయుక్తమయినట్టున్నది. శబ్దరత్నాకరమున 'నెట్టన' చూచునది. 'నెట్టనము' అని రూపాంతరమును గలదు.

**మహ మా :–** పు. 180– 'మహలింగమూర్తి,'పు. 213– 'ఈమా(మహా) జనము' ఇత్యాదులు పెక్కులున్నవి. మహచ్ఛబ్దము 'మా' అగునని కర్ణాట వ్యాకర్తలు చెప్పిరి "మహచ్ఛబ్దక్కుద్భవిక్కుం మా దేశం దోషవిల్ల సంస్కృతపదం పరక్కొదవలోడం" శబ్దమణిదర్పణము. దీని కుదాహరణములు మాదేవ, మాకాళి, మాదాని, మాశౌర్య పదములు. ఇదియు నట్టిదే.



**యుష్మదస్మత్సమాహార సంప్రార్థనాద్యర్థక క్రియ :** పు. 149 – 'చెప్పుదండు', పు. 174 – 'చెఱుపుదండు', పు. 179 – 'పోదండుగాక', పు. 215– 'చూతండు' పండితారాధ్యచరిత్ర 2వ ప్రకరణమున 'పదుదండు', 'ఉండుదఁడు', 'తీర్తండు' ఇత్యాదులు పెక్కులు. ఇవి యితరకవుల కృతులలో చెప్పుదుము, చెఱుపుదము, పోదము, పొదము, పదము, పదండు, చూతము, పదుదము, ఉందుదము తీర్తము అను రూపములతో వ్యవహృతము లగుచున్నవి. ఒక్క 'పోవు' ధాతువునకు మాత్రమీ కవి ప్రయోగించిన 'పోదండు, పొదండు,' 'పొదరు' రూపము లితర కవులును ప్రయోగించిరి. తక్కిన ధాతువులపై నాకిట్టి రూపములు శివకవుల కృతులలోనే తక్క నిఁక నెక్కడను గానరాలేదు ఈ రూపములు క్రొత్తగా నున్నవి.

**పదాంతాజ్లోపము :** పు. 12– 'వెల్విరియ', పు. 28– 'ఎదురుకొన్వేడ్క,' పు. 101– 'నేఁడ్వింతవాఁడొకఁడు,' పు. 269– 'భాషా ప్రణీతమన్నదు బల్లగోల,' 'త్రాడ్వేన,' – 'నేలఁబడి పొరల్ కూయిడు,' గుడిసొచ్చు గుడివెడల్' – పండితా. – ఇత్యాదులు. కొన్ని శబ్దముల తుదియచ్చు లోపించుట ప్రాచీన గ్రంథములలోఁ బెక్కింటఁగానవచ్చును. 'పసివాళ్వాడు', 'కడివోయినవాళ్ ముదువంగ,' 'గ్రుక్కిళ్మింగు' ఇత్యాదులు. ను, లు, రు, వర్ణాంత శబ్దములకు నువర్ణాంత ధాతువులు క్రియాజన్యవిశేషణములుగా నున్నప్పుడు వాని యుకారమునకును గూడ లోపముగలదు. కాని 'వెలివిరియు' 'వెల్ విరియు' గాను, 'అనఁబడు' 'అన్బడు' గాను, 'పొరలును కూయిడును' పొరల్కూయిడు' గాను, 'వెడలును' 'వెడల్' గాను మాఱుట క్రొత్త. ఇట్టిదే 'విప్రసతికి నూఱు వేఁడఁ జన్ వరములు' – నన్నయ, సభాపర్వము. నేఁడు, త్రాడు శబ్దములు తొలుత 'నేళ్' 'త్రాళ్' గా నుండినవి గావున నవి 'వాళ్వాడు' వలె మాఱుట సంగతమే. మఱియు 'తివ్వు' 'కుర్వు' 'నుస్లు' ఇత్యాదులఁగూడ నీతఁడు ప్రయోగించెను.

**'అంబుజనేత్రి'** పు. 8– ప్రాచీనకృతులలో నిట్టిరూపములు శాసనము లలోఁ దఱచుగా నున్నవి. 'అబ్జనేత్రి', 'కోమలి', 'కుసుమకోమలి', 'వల్లభి' 'నయనవల్లభి' 'పల్లవాధరి', 'బాలకి' ఇత్యాదులు యతిస్థలములందు దిద్దరానివై కూడఁ గలవు.

**అవధారణార్థకము :** పు. 9– 'పరమతత్త్వామృతంబయ చన్నుఁబాలు,' ఇక్కడ 'అమృతంబు' పై నవధారణమున 'అమృతంబ' యగును గాని దానిపై మరల 'అ' వచ్చుట క్రొత్తగా నున్నది. యతికూడ హల్లుతోనే కలదు. తిక్కనగూడ నిట్లు ప్రయోగించినాఁడు. 'దరికొని తెగఁగాల్చునట్టిదయ యగుఁజుమ్మీ'; (ఉద్యోగ 2 ఆశ్వా). పు 205 – 'నలిగొన బొందితో ననకొనిపోఁడె', ఇటకూడ మీఁదిదానివంటిదే. ఈ 'తోనన' పలువురు ప్రాచీనకవులు ప్రయోగించిరి.

**పసిబిడ్డ :–** పు. 19– ప్రాత వ్రాఁతప్రతులలోఁ గొన్నింట 'పసుబిడ్డ, కలదు. అఱవమున 'పసుఁబిళ్లై' కలదు. పసరు, కసరు, శబ్దములకు పసు, కసు, పసి, కసి, రూపము లేర్పడినవి. పసరుఁబిందె, కసరుఁగాయ, పసిపిందె, పసుఁబిందె, కసిగాయ, కసుఁగాయ, అని రూపములు గలవు. అట్టే యిదియును.

**శిథిలద్విత్వము :–** పు. 144– 'అట్టయు నీడ్పించి యగడ్తవైపించె' కర్ణాట వ్యాకరణమున 'శిథిలద్విత్వము'ను గూర్చి యొక ప్రకరణమే కలదు. తెలుఁగున శిథిలద్విత్వప్రశంస గానరాదు. శిథిలద్విత్వమనఁగా సంయుక్తాక్షరము తేలఁబలుకఁబడుట. దానిచేఁతత్పూర్వాక్షరము లఘువగును. తెలుఁగున 'అద్రుచు, విద్రుచు, చిద్రుపలు,' అనుపదములు మాత్రమే యిప్పుడు శిథిల ద్విత్వములనఁదగినవి గానవచ్చుచున్నవి. కర్ణాట శిథిలద్విత్వములలోఁ గొన్నియైనను, దెలుఁగునఁ గూడఁ బ్రాచీనకాలమున శిథిలద్విత్వములుగా నుండియుండవచ్చును. 'యగడ్తవైపించె' నను నీ ప్రయోగ మందుకు స్ఫోరకము. తెలుఁగున నిప్పుడు 'డ' గా మాఱిపోయిన ఱ (ఱ్ఱ) అక్షరముగల పదమది. 'ఈ అగఱ్త' కర్నాటకమున శిథిలద్విత్వముగలదే "అగడితవైచె" అనుపాఠము పరిగ్రాహ్యముగా నాకుఁదోఁపకున్నది. 'ఈడ్పించి' యండుటచే 'వైపించె' అనియే తర్వాత నుండఁదగును. నన్నిచోడఁడు కూడ నిట్టి ప్రయోగములఁ జేసినట్టున్నాఁడు. 'శ్రీరామేశకవీశ్వరాదులెడ్డనీ శ్రీపాదముల్'; 'ఎడ' 'ఎద' అను రూపములను గొన్నచో నిక్కడ సరిపోవును గాని వ్రాఁతప్రతిలో 'ఎడ్డ' అని యున్నది గావున, నట్లే గ్రహింపఁదగును. కన్నడమున నదియు 'ఎఱ్ఱ' అని శిథిలద్విత్వము గలపదము. 'మొగుచు' ధాతువు; 'మొగుడు' ప్రేరణరూమని శబ్దరత్నాకర కారులనిరి. అట్లే యగునేని యదియు



'మొగుడుచు,మొగుడ్చు' అని యేర్పడి దానిపై శిథిలద్విత్వమై 'మొగుడ్చు' కొన్నాళ్లుండి యిప్పుడు మొగుచు రూపముగా మాఱినదనవలెను. 'మొగుపు' అని కృద్రూపముగూడఁగలదు. బూది, బూడిదనుండి యేర్పడిన దనుటకంటె భూతినుండి యేర్పడినదనుట యుక్తము.

**షష్ఠీసమాసమున 'పు,ంపు' లు :–** పు. 32–'ధీరంబుకట్ట', 'గంభీరంబు తిట్ట,' ఇత్యాదులు. ప్రాచీనకృతులలో షష్ఠీసమాసమున ముకారమునకు 'పు', 'ంపు' లు గానరావని కొందఱందురు గాని యది సరికాదు. బసవపురాణపు వ్రాఁతప్రతులలో రెండురూపములును గానవచ్చుచున్నవి. 'ధీరంపుఁగట్ట గంభీరంపుఁ దిట్ట.' ఇత్యాదిగాఁ గూడఁ గలదు. తిక్కనాదులు దఱుచుగా నిట్టు ప్రయోగించిరి. ప్రాఁత వ్రాఁతప్రతులు చూడఁదగును. ప్రాసస్థలముల లోని ప్రయోగములనివార్యములు, వానిఁ జూపుచున్నాఁడను. 'చ. తపమును– గల్గ క్రీడిక, య్యపు వెరవెక్కుడై గెలుచునట్లుగ' – కర్ణ. 3 ఆశ్వా. 'లావుదేవక' య్యపువెరవేపుదాల్మి – శల్యపర్యము. 'కృపఁ దిలకింపఁ బెంపఁ బరికింపఁ గలాఁడుదయించు నంచు వే, దపుగని వేల్పు సెప్పిన' – సోమన హరివంశము, 2 ఆశ్వా. 'కపటమువన్ని జానకి నకల్మషఁదెచ్చినయట్టి పాపక । ర్మపుఁబొడువన్.' – భాస్కర రామాయణము, యుద్ధకాండము. ఇత్యాదులు. కవిలోకచింతామణిలో వెల్లంకితాతంభట్టు గూడ షష్ఠీసమాసమున నీ యాదేశము గలదని వచించెను.

**తదియ్యము :** పు. 129– 'అయ్యా యనఁగ నేమి యయ్యా యనెడు త–దియ్యవాక్యంబునజ్జియ్య యడంచి' ఇందు 'తదియ్య' పదము సంస్కృత వ్యాకరణ విరుద్ధము. 'తదీయ' ఉండవలెను. అట్లు దిద్దినచోఁ బ్రాసభంగ మగును. 'జియ్య'కు 'జీయ' రూపాంతరము గలదు. దీర్ఘములమీఁది య, వ, లు కొన్ని ద్విత్వమును జెందుట, పూర్వదీర్ఘము హ్రస్వమగుట ప్రాకృతమునను, దెనుఁగునను గలదు. 'హైయంగవీనము'ను 'హయ్యంగవీన' మని వ్రాయుట, యుచ్చరించుట గలదు. ఐయున్న అయ్యున్న యని యౌవనము జవ్వనమని యయినట్లు తదీయము తదియ్యము కావచ్చును. ప్రకృతులకే కాక ప్రత్యయములకుఁగూడ వికృతిరూపములు గలవు. కాని, యిది సంస్కృత సమాసమున నున్నది. నన్నిచోడఁ

దును, ననంతామాత్యుఁడును నిట్టి ప్రయోగములఁ జేసిరి. 'మహేశుఁడయ్యుమా, యవ్వనవారి పూర్ణసురతాభి వివర్ధితుఁడై' – కుమారసంభవము 9 ఆశ్వాసము. 'వ్వ' ప్రాసలోనున్నది. 'నవ్వుచు– నీ యవ్వనలక్ష్మికిన్ భటుడు.' భోజరాజీయము 7 ఆశ్వాసము.

**ప్రథమాదులమీఁద గసడదవాదేశము :–** ప్రాచీనకృతులలోఁ బ్రథమా విభక్తిమీఁదను, ద్రుతాంతముగాని క్రియారూపములమీఁదను, కొన్ని యవ్యయముల మీఁదను, సంఖ్యా పరిమాణవాచకములమీఁదను, కొన్ని సమాసములలోను నుండు కచటతపలకు గసడదవలాదేశములగుట కానవచ్చును. ప్రథమాంతముల మీఁద నీ యాదేశము నిత్యమని యాంధ్ర భాషాభూషణాదులు పేర్కొన్నవి. క్రియావ్యయముల విషయమనిశ్చితముగా నున్నది. ప్రాఁతప్రాఁతలలోఁదఱచుగా నీ యాదేశము కానవచ్చును గాని యదిలేని వ్రాఁతలును గొన్నిగలవు. ప్రాసస్థలముఁ జూచి వీనిని నిర్ణయింప నగును. అట్లుచూడఁగాఁ గొన్ని యవ్యయములపై నిత్యముగా రాకపోవుట కానవచ్చును. కొన్ని క్రియలపై నవ్యయములపైఁ గొందఱు కవులాదేశము చేసియుఁ, జేయకయును బ్రయోగించిరి. సంఖ్యాపరిమాణ వాచకములపై మాత్రమీ యాదేశము నిత్యముగాఁగానవచ్చును. ప్రథమాంతముల మీద గూడఁగొందఱు వికల్పముగాఁ నీ యాదేశమును బాటించిరి. ఆంధ్రశబ్ద చింతామణ్యాదుల విశ్వసించి వ్యాకరణకర్తలు గొందఱాచ్ఛికములమీఁది తత్సమములకుఁ గలదని, తత్సమములమీఁది యాచ్ఛికములకుఁ గలదని, ఇంకేమోయని వ్రాసిరి గాని యది యెల్లఁ ద్రోసిపుచ్చఁదగినది. పరిశీలింపఁగా కళలపై నుండు పదాది కచటతపలకు, గసడదవలు బహుళముగా వచ్చుననుటయే చిక్కులేని నిర్వచనముగాఁ గానవచ్చుచున్నది. ప్రాచీనకాల మునఁ బ్రథమమీఁదను, గ్రియలమీఁదను గసడదవాదేశము బహుళముగానే కలదనుటకుఁ గొన్ని ప్రయోగములఁ జూపుచున్నాఁడను. 'ప్రా। త్రత గలిగెనేని నా కొస। గు తదీయాలోకనంబగు తెఱంగుగృపన్ ।  – 'లే । దుదలంప నశ్వమేధము' శాంతిపర్వము; కన్యాత్వమే నాకులే। దుగదా! నిర్వ–రామా– పా। మ్ముకపివరేణ్యా! నీ వనిన మోదితులై, 'మదీయంబైన మర్మంబు వీ। దు కృతఘ్నుండయిచెప్పెఁ



గూలునని యాటోపంబు దీపింప', 'వికృతములైన... నీవు బీ। తు కుడిచివచ్చి నోరికొలఁదుల్' – భాస్కర.యుద్ధకాండము.

క. ఆపద్వినీతులగుదురు
కాపురుషులు పరమ పురుషకారుణిక గుణుల్
శ్రీ పాటింప వినీతులు
నాపద్దశకంటె దశదిశాంకాభరణా!

– బద్దెన నీతిసారముక్తావళి.

ఇవియెల్లఁ బ్రాచీన ప్రయోగములు. క్రియల పయిని బ్రథమాంతముల పయిని నాదేశము లేకున్నందుకర్వాచీన కవిప్రయోగములనెక్కువగాఁ జూపవచ్చును. 'వయ । శ్రీ చన రెంటికిం జెడిన రేవఁడనౌదునె నీరజేక్షణా' మనుచరిత్రము.– ఇఁక నవ్యయములపై నీయాదేశము నానావిధములఁగలదు. అవధారణార్థకము, క్త్వార్థకము మొదలగువానిపైఁ గానరాదు. అట్లు, ఏమి, మొదలగువానిపై నిత్యముగాఁగానవచ్చును. అన్ని యవ్యయముల మీఁదను బ్రాసస్థానప్రయోగములు దొరకకున్నవి. ఇతరస్థలముల విషయము వ్రాఁతలలో నిరుదెఱఁగులను నుండును. ప్రాచీన కాలముననే యీ యాదేశము సునిశ్చితముగా నుండలేదు. శాసనములు గూడఁ గొంతవఱకు వీనియనిశ్చి తతను నిరూపించుచున్నవి. ప్రాచీనతర శాసనములరీతి ననుసరించి తొలుత నీ యాదేశము నీ గ్రంథమునఁ బూన్కితోఁబాటింపఁదలఁచితినిగాని, భారతాది ప్రయోగముల ద్వైవిధ్యమును, దాళపత్ర గ్రంథములంతగా నీ నియమమును బహుకాలమున నుండియే పాటింపకుండుటను, వర్తమాన పాఠకలోకమున కీ విధమపరిచితమగుటను, గొన్ని యెడల నర్థక్లేశమును గలిగించుటను, అచ్చులోనపూర్వమయిన మార్పుగుటచే నెంత జాగ్రత్తగాఁ జూచినను గన్నువంచించి కొన్ని పట్టులు గానరాకుండుటను, బర్యాలోచించి, యాపూన్కిని వీడి నేనును బహుళముగానే యీ యాదేశము నిందుఁ బాటించితిని.

పు.131– **ఏనువోయెద** – తాను నేను శబ్దములు ద్రుతాంతములుగా వ్యాకరణములందుఁ బరిగణితములగును. 'ముందరదముడిగుమే। ను విదప

డిగియెద.' శల్య 2 ఆశ్వా – అని తిక్కన 'ఏను' కళగాఁ బ్రయోగించెను. 'ఏనవిదప' అను సంస్కారము తప్పు. 'ఏనువెనుక' అని పాఠము కలదందురు గాని యది నాకే ప్రతిలోను గానరాలేదు. ఆ శబ్దములను బ్రాచీనులు కళలనుగానే ప్రయోగించిరని నా నమ్మకము. కళలు గనుకనే 'ఏను' పై 'పిదప' 'విదప' అయినది. మఱియు, నేఁ ను గరంబుత్సుక వృత్తితో– నిర్వచనో, 4 ఆశ్వా. ఈ ప్రయోగము ద్రుతాంతత్వమునకును సాధకమే. కాని, ప్రాచీన ప్రతులలోఁ బెక్కింటఁ దాను, నేను శబ్దములమీఁది క చ ట త ప లు గ స డ ద వ లుగాఁ గాన వచ్చినవి. బసవపురాణపు వ్రాఁత ప్రతులలోనున్న పాఠమును నేను మార్పఁ జాలనయితిని.

**కాన కళయే :–** బసవపురాణపు వ్రాఁతప్రతులలోను భారతాదుల వ్రాఁత ప్రతులలోను, ఎక్కడఁజూచినను కాన కళగానే కానవచ్చును. ధృతరాష్ట్రుండును, – కా । న తగంబొందుట' యని తిక్కన ప్రయోగము గలదు. వందల కొలఁది స్థలములలో నది కళగానే వ్రాయఁబడి యున్నది. ప్రాచీనగ్రంథములలో నెక్కడను నది ద్రుతాంతముగాఁ గానరాదు. 17వ శతాబ్దినుండి రచితములయిన గ్రంథములలోనే యది ద్రుతప్రకృతికముగా మాఱినది. ప్రాచీనగ్రంథములలో 'కాన' అనియే 'న' లఘువగునట్లు వందలకొలఁది పట్టుల నున్నదిగాని 'కానన్' అని గురు వగునట్టుగా నెక్కడను ద్రుతముతోఁ గానరాదు. అది కళ యనుట కిదియొకటియే ప్రబలసాధనము కాఁదగును.

**స్త్రీ, పుం వాచకములు :–** పు. 108, 'సడిసన్నదాసి' (పుం.)'కొడుకులు లేమికిఁగడుదుఃఖి యగుచు' (స్త్రీ), వనిత యపూర్వలాంఛన ధారిగాఁగ' (స్త్రీ) ఇత్యాదిస్థలములఁబుంలింగరూప ముండవలసినచోట స్త్రీలింగరూపమును స్త్రీలింగరూపముండవలసినచోటఁ బుంలింగరూపమును నీ కవి ప్రయోగించి నాఁడు. (పుట6, ఫుట్‌నోటు చూచునది.)[1]

1 దాసుఁడు అనవలసినచోట నీతఁడు 'దాసి' యని ప్రయోగించుచు 'విష్ణుఁబాసి వ్యాసుఁడు శివదాసిగాఁడె,' 'నుతికి మెచ్చిచ్చెఁగన్నులు' 'గాళిదాసికి' 'నీ దాసి నీ వెంక నీ సింగరీఁడ' చతుర్వేదసార సూక్తులు. చెన్నారఁ గాళిదాసియు శివుచేతఁ। గొన్న (కాళిదాస కవిని గూర్చి) పండితారాధ్య 4 ప్రకరణము 31 పుట.



**శత్రర్థకములు :–** పు. 7 'వీక్షింపుచున్న,' ఇత్యాదులు. ప్రాఁతవ్రాఁత ప్రతులందన్నింట శత్రర్థమగు 'చున్' పరమగునపుడు ఇంచు, ఇంపుగా మాఱుట సర్వత్ర గానవచ్చుచున్నది. ఈ బసవపురాణము ప్రతులన్నింటను నిట్టిరూపములే కానవచ్చుచున్నవి. కొందఱు వ్యాకరణకర్త లీ రూపములఁగూడఁ బరిగణించిరి; కొందఱు సరి కాదనిరి. వ్రాతఁప్రతులందు వందలకొలఁది పట్టులందున్న 'యింపు' రూపములను, మార్ప సాహసింప నయితిని. కాని, యతి ప్రాసములలో నీ రూపములు ప్రాచీన గ్రంథములందు నాకుఁ గానరాలేదు. ఈ బసవపురాణమున పు 236 'శుభకార్య మాచరించుచు నొక్కనాఁడు,' పు. 52 అంచు వెండియుఁ బ్రస్తుతించుచు– ఇత్యాదులు 'ఇంపు' రాని ప్రయోగములున్నవి. ప్రాఁతవ్రాఁత లన్నింట నుండుటచే నుంచితినిగాని యీ 'యింపు' సోమనాథునికి సమ్మతమే యనఁజాలను.

**అర్థానుస్వారములు :–** తిక్కనాదుల కాలమునఁగూడ నర్ధానుస్వార పరిజ్ఞానమస్పష్టముగా నున్నట్టే కానవచ్చును. ఒకరు సానుస్వారముగాఁ దలఁచిన దానిని వేఱొకరు నిరనుస్వారముగాఁ దలఁచుటే దీనికిఁ దార్కాణము. 'ప్రోక'ను నన్నిచోడఁడు నిరనుస్వారముగాఁ బ్రయోగించెను.

క. కోకనదంబులు మొగుడం
గోకంబులు విరిసి దెసలకుం జన మెఱుఁగై
ప్రోకలుగొని మౌక్తికనిక
రాకరమనఁ దారలెసఁగె నంబరవీథిన్

– అష్టమాశ్వాసము

శబ్దరత్నాకరమున నిది నిరనుస్వారముగానే గ్రహింపఁబడినది గాని లక్ష్యము సానుస్వార మనఁదగినదిగా నున్నది. (చూ:శ.ర.) మఱియు భాస్కర రామాయణ యుద్ధకాండమున 'ప్రాఁకుదుమా' 'ఊఁకున– మ్రాకుఁలు,–ప్రోఁకలు' అని సానుస్వారముగా గ్రహింపఁబడినది. మన సోమనాథుఁడును,

పు. 144 – 'మ్రోఁకు వెంటన యెడతాఁకుచుఁజుట్టి। ప్రోఁకగాఁ బోయుచుఁ బ్రొద్దులు పుచ్చ'

పు. 32,- సారార్థములప్రోఁక జ్ఞానాగ్నికాఁక' అని, సానుస్వారముగానే గ్రహించెను. కుమారసంభవమును, శబ్దరత్నాకరమును, నమ్మి దీనిని నేను నిరనుస్వారముగానే తలఁచి, యీ ముద్రణమునఁదొలుతఁ గొన్నిపట్టుల నను స్వారమును (ఁ ?) అని కుండలీకరించి యుంచితిని. ఇట్లే మఱిపెక్కు శబ్దములఁ గూర్చి సంశయము గలదు. కొన్ని ప్రాచీనశాసనములలో 'పెరుగు' నిరనుస్వారముగా నున్నది. 'తనకు నసముచెరుగ' సోమలదేవి దాక్షారామ శాసనము.[1] మార్కండేయ పురాణముననుండి సానుస్వారమనుటకు లక్ష్యముగా శ. ర. లో నీ క్రింది పద్యముదాహృతము.

క. అనఘ మదాలసకడుపున
జనియించియు యోగిమాత చనుగుడిచి పెరిం
గిన తనయు లితరవనితల
తనయులు చనుత్రోవఁ జనఁగ దగియెదువారే
ఇది యిట్టుండవలెను.
జనియించియు యోగిమాత చనుగుడిచియుఁ బె
ర్గినతనయు.........................
మార్కండేయపురాణమున నుండియే

'ఉత్తముఁ దనఁగంబరంగు నుర్విన ని మునుల్'

అని పద్యము నుదాహరించి, శబ్దరత్నాకరకారులు 'పరగ' సానుస్వార మనిరి.

'ఉత్తముఁడను పేరఁబరగె నుర్విన ని మునుల్'

అని వ్రాఁతప్రతుల పాఠము. పరగ నిరనుస్వారమే, 'చాగు' లో నరసున్న లేదేమో! కొన్ని వ్రాఁతలలోఁ గలదు. ప్రాచీన కవులెల్లరును, సానుస్వారముగాఁ బ్రయోగించిన 'ఏఁగు' నిటీవలివారు నిరనుస్వారముగాఁ గ్రహించిరి. ప్రాచీనులు,

1 రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచిక, దక్షిణ హిందూదేశ శాసన సంచయము IV చూ.



వీపు, చీకటి, తీగ. తూగాడు నిరనుస్వారముగాఁ బ్రయోగించిరి. ఇటీవలివారు సానుస్వారముగాఁ బ్రయోగించుచున్నారు. 'నాడు' దేశార్థమునఁగూడ శాసనములందు సానుస్వారముగాఁ గానవచ్చును. నూఱు మీఁది యౌపవిభక్తిక మగు నూటిలో శ్రీనాథుని శాసనమునను, మఱిపెక్కింటను ననుస్వారము గానవచ్చును. 'ఏటికి' నిరనుస్వారముగాఁ గొందఱును సానుస్వారముగాఁ గొందఱును బ్రయోగించిరి. పు. 15 నాఁటు (ఫుట్ నోట్ చూ.) దీర్ఘముల మీఁది యౌపవిభక్తిక టకారములకుఁ బూర్వమర్ధానుస్వారము పెక్కు వ్రాఁతలందుఁ గానవచ్చును. 'గోచి' కి నిరుదెరఁగుల వ్రాఁతలుండును. తొరుగు సానుస్వారమని శ. ర. లోఁగలదు. అట్లనుటకుఁ బ్రమాణము నాకుఁగానరాలేదు. అది నిరనుస్వారమే యని నా తలఁపు. 'మావిడి' సానుస్వారముగా బహుశాసనము లందుఁ గానవచ్చును. ' మా విణ్డి' అని కూడ నున్నది. ఎనుబది, ఐదు, శబ్దములలో ననుస్వారముండు ననుకొనెదను. 'మాదిఁగ' లో ననుస్వారము గలదు. అది మాతంగశబ్దభవము. 'లింగులుగాక మాదింగలున్నారె' – పండితా. 'తూపు'లో ననుస్వారము గలదని కొందఱందురు. భారతమున నది నిరనుస్వారముగాఁ బ్రయుక్తము. 'కోపించి మూఁడుబల్ దూపుల–' కర్ణపర్వము. అఁట, అంట, రూపములు గలవని చిన్నయసూరి ప్రభృతులందురుగాని ప్రాచీన కృతులలో 'అంట' రూపమే కానరాదు.'అట' లో సున్నయుఁగానరాదు. అట, అటె, అట్టె, అనియే ప్రాచీన ప్రయోగములు. 'పోతు' హరివంశమున నెఱ్ఱప్రెగడ నిరనుస్వారముగాఁ బ్రయోగించెను. కొన్ని వ్రాఁతలలో సానుస్వారముగాఁ గానవచ్చును. కొన్ని యువర్ణాంతధాతువులకు భావార్థమున సానుస్వారమయిన 'త' వచ్చుటచే (చేఁత, రోఁత ఇత్యాదులు) తత్సదృశమయిన (చేతులు, గోతులు, పోతులు మొదలగు) శబ్దములకుఁ గూడఁ బరిజ్ఞానములేని లేఖకులనుస్వారముల నుంచుచు వచ్చిరి. అట్లే యనుడు, నావుడు, ఆరగించుడు మొదలగు శబ్దములందుఁ గొన్ని తాటాకు ప్రతులలో ననుస్వారములు గానవచ్చును. రాముఁడు, బాలుఁడు మొదలగు శబ్దములకుంచినట్లే యపరిజ్ఞానముచే లేఖకులట్లు వానికిని సున్నఁజేర్చి యుందురు. వానిని జూచి కొందఱవి సానుస్వారములే యనుచున్నారు. అది సమ్మతముగాదు.

అట్లగుచో నవి నిండుసున్నలుగాఁగూడ మాఱవలెను గదా! ఎక్కడను నట్టి రూపములు గానరావు. అవి నిరనుస్వారములనుటకనేక ప్రయోగములఁ జూపనగును.

పు. 47– కడుఔొంపిఁ గాలుజాఱుడు –

పు. 72– 'మృదుఁడు వాలారగించుడు రిత్తకుడుక –

ఇట్టి ప్రయోగములు భారతాదులలోను బెక్కులున్నవి. విస్తరభీతిచే విడుచుచున్నాఁడను.'కలఁగుఁడు' అను పదమే 'కలగుండు' గా రూపాంతరమును జెందినదనియు నావుడు మొదలగువానిలో ననుస్వారముగలదనుటకిది జ్ఞాపకమనియు నొక వాదము గలదు. ఇది సరికాదు. కలఁగుడు మొదలగు శబ్దముల తుది 'డు' ధాత్వర్థకము. ఇది ప్రాచీనకృతులలోనే హెచ్చుగాఁ గానవచ్చును. నావుడు, అనవుడు మొదలగు శబ్దముల తుది 'డు' ఆనంత ర్యార్థకము. ఒకటి కళ, వేఱొకటి ద్రుతాంతము. ఈ రెండింటనుగూడ నరసున్న లేదు. 'కలఁగుడు'నుండి కలగుండు వచ్చెనేని యది ధాత్వర్థకమగు 'డు' సానుస్వారమనుటకు జ్ఞాపకము గావలెనుగాని యానంతర్యార్థకమగు 'డున్'కుఁ గారాదు. అప్పుడు రెండు నొక్కటే యనవలెను. ఒకచోట ద్రుతమును ద్రోసిపుచ్చుటో రెండవచోటఁ జేర్చుటో చేయవలెను. అప్పుడు సంధులలోని చిక్కులను సమర్థింపవలెను! ఈ కల్పనము తగదు. ఇంత యంగీకరించినను సర్వధాతు సాధారణమైన 'డు' ఎక్కడను బూర్ణానుస్వారమును బొందఁజాలక యొక్క 'కలగుండు'లో మాత్రము చెందఁగల్గెననుట యుక్తముగాదు. అది యట్లే యగునేని కలఁగుఁడు 'కలఁగుండు' 'కలంగుండు' రూపములుండఁదగునే కాని 'కలగుండు' అని యుండఁదగదు. 'కలగుండు' శబ్దమునకు నే నిట్లు నిష్పత్తి చెప్పుదును. కల్హారము, కహ్లారము నున్నట్లు, 'హిసి' నుండి 'సింహ' మయినట్లు పారువము, పావురము నయినట్లు వర్ణవ్యత్యయముచే 'కలంగుడు' అని 'గు' కు బూర్వముండవలసిన యనుస్వారము 'గు' కుఁ దర్వాతఁబడి 'కలగుండు' అయినది. (కలఁగుడు శబ్దార్థ మాశబ్దమునకే పట్టి కలగుండు అయినది.) అనుస్వారవ్యత్యయ



మేర్పడుటచేతనే 'కలగుండు' లో 'ల' తర్వాత నర్ధానుస్వారము లేదయ్యెను. మంచెళ్ళ వాసుదేవపండితుని వైకృతచంద్రికను, పట్టాభిరామ పండితుని పట్టాభిరామ పండితీయమును బ్రమాణముగాఁ గొందుమేని ప్రాచీనభాషా స్వరూపము పఱిపఱి యగును. ప్రాచీనతాళపత్రపుఁ బ్రతులలోఁ గొన్నింట మాత్రమే అనవుడు, నావుడు మొదలగు శబ్దములం దనుస్వారము కానవచ్చును. కాని, పెక్కు ప్రతులనుస్వారము లేకుండఁగూడ నున్నవిగదా! ఆ శబ్దములలో సున్నయుంచి వ్రాసిన ప్రతులకంటె, ఉంచకుండ వ్రాసినప్రతులే యెక్కువని నేను రూపింపఁగలను. ఇఁక నీ విషయము విడిచెదను.

**శకటరేఫములు :–** తిక్కనాదుల కాలమునకే ఱ–ర–భేదజ్ఞానము తార్మాఱు కాఁజొచ్చినట్టున్నది. అప్పటి శాసనములలోను గ్రంథములలోను గూడఁగొన్ని శబ్దములటు నిటు గానవచ్చుచున్నవి. ఱ, ర భేదమును బాటించి వ్రాసిన తాళపత్రఁ పుబ్రతులరుదుగా నుండును. కాఁబట్టి తత్పరిజ్ఞానము మనకు యతి ప్రాసములను బట్టియు, శాసనములను బట్టియు, సాధ్యము. కూఁతుఱు అని శాసనములలో సర్వత్ర ఱ కాననగును. నేఁడందఱు 'కూఁతురు' అనియే తలంతురు. చేకుఱు, సమకుఱు, చేకూఱులు, బండిఱాతోను, సమకూరు, సాదురాతోను శ.ర. లోఁ గలవు. ఇది సరియా? శాసనములలో 'ఱేపు' బండిఱాగా నుండును. భారతమున నది రేయితో యతిలోనున్నది. ఱేపు బండిఱా యగుచో నేఁడు సాదు రా లుగాఁ దలఁపఁబడునవి పెక్కులు బండిరాలు గావలసి యుండును. తీగగదల్చినఁ బొదయెల్లఁ గదలును. 'సగము' అను నర్థమున గొందఱు ప్రాచీనులు 'అర' గాను మఱికొందరు 'అఱ' గాను బ్రయోగించిరి. 'అఱచందురుని క్రొత్తమెఱుఁ గులు' హరివంశము 7 ఆశ్వా. (చూ.శ.ర.) అరచందురుడెందము లోఁ । జొరఁబారి – నరకుండు – హరినిటల, ఉత్తర హరివంశము 1 ఆశ్వాసము. మన సోమనాథుఁడును –

పు. 146–'దరహసితాస్యుఁడై తలుపులదిక్కు। నరగంట నొక్కింత యఱలేక చూచి' అని సాధురేఫముగాఁ బ్రయోగించెను. నెఱియ, యని శ. ర. కారులు–

పు.135– నెరియల పాలైనఁ బురహర నీకు– సోమనాథుఁడు. శ.ర.కారులు, ఏర్పడు, ఏర్పఱుచు, ఏర్పరించు, వెల్వడు, వెల్వఱుచు, వెల్వరించు– ఇత్యాదివిధముల 'పఱుచు' రూపాంతరమగు 'వరించు' ను సాధురేఫముగా గ్రహించిరి. యుద్ధమల్లుని శాసనము మూఁడవ యక్కరలో 'వెల్వఱించిన నశ్వమేధంబు' అని బండిఱా కలదు. 'తివురు' శ. ర. 'తివుఱు' అని యుద్ధమల్లశాసనము. ముందర, ముందఱ–లు భారతముననే కలవు వేఱువేఱుకాదు. పేరు+పేరు, పేరువేరు; పేర్వేరు, వేర్వేరు, అని ప్రాచీనుల ప్రయోగములు. ఎరఁగు ఎఱఁగు కలదు. పడమర పడుమఱ, రెండు దెఱఁగులను గలదు. రేఫద్వయ పరిజ్ఞాన మీ తెఱఁగున నఱవఱలై (అరవరలనియుఁ గొందఱనిరి) యున్నది. పర్యాప్తమయిన పరిశీలనమునకిది పట్టుగాదు. ఈ గ్రంథము ముద్రణమున నిట్టి చీకాకుగలశబ్దములు గొన్నింటిని గొన్నిపట్టుల నటునిటుగాఁగూడ నుంచితిని. మఱియు బండిఱా సంయుక్తమైనపుడు నన్నయనాఁట బండిఱాగానే వ్రాఁత యుండెడిది. మన సోమనాథుఁడు మొదలగువారు సంయుక్తమయిన సాదురాతో దానిని బ్రాసములందుంచిరి. నేఁటిలిపిలో సంయుక్తమయిన బండిఱా సాదురా గానే యున్నదిగాన నేనట్లే యుంచితిని.

**అవగాగమము**– నన్నయభారతమున పూరణార్థమున 'అవ' కానరాదు. 'అగు' కలదు. 'మూఁడగు పర్వము, ఇత్యాదులు. ఆ కాలపు శాసనములలో హెచ్చుగా 'అవు' కాననగును. 'మూఁడవునడపున, రెండవుకొడుకు' ఇత్యాదులు. అగు, అవులకు భేదములేదుగదా! తర్వాత, 'అవ' 'ఔ' అను రూపములు గూడ నేర్పడినవి[1]. సోమనాథుని కాలమునకే 'అవ' రూప మేర్పడినది.

పు.123– ఇచ్చమైఁ బదుమూఁడవేటి యంత్యమున' అని కలదు. 'అగు అవు' లున్నచో 'అగునేటి, అవునేటి' అని యుండును. 'అవ' రూపముమీఁదనే 'మూఁడవది' అయినట్టు 'మూఁడవేఁడు' అయ్యెను. పెక్కుచోట్లఁ బూరణార్థమున సోమనాథుఁ 'డవ' ప్రయోగించెను. ఏ వ్రాఁతప్రతిలోను 'అగు''అవు' రూపములు గానరాలేదు. లిపికారులు కవిప్రయుక్త రూపములను మార్చి తమకాలపు

1 దక్షిణ హిందూదేశ శాసనములు 4 సంపుటము. చూ.



రూపములను లిఖించిరనఁగూడదు. కొన్నిచోట్ల నట్లు జరిగియుండవచ్చును గాని సర్వత్ర యట్లగుట యసంభవము. నన్నయ భారతమునఁ బెక్కుప్రతులందు 'అగు' పాఠమే కానవచ్చుచున్నదిగదా!

మఱికొన్ని

పు.145 'ఇగ మెడ దునిమెదవు' – ఇందలి 'ఇగ' అరసున్న లేనిది. చిన్నయసూరి ప్రభృతు లిది సానుస్వార మనిరి–

పు.159 'ప్రెబ్బొంత పెయ్యలపెద్ద'– పెరు– బొంత– పెద్దబొంత గలవాఁడు –పెర్బొంత– ప్రెబ్బొంతయయినది. పెర్గడ ప్రెగ్గడ అయినట్టు–

పు.147– 'కల్లోలంబునొందె'– ఇత్యాదులు పెక్కులు –

పు.179– 'అర్ఘ్యపణ్యములు' – ఇది పెక్కుచోట్ల; 'అర్ఘ్యపాద్యము' లనుటకు,

పు.242– అర్థరాత్రి, అర్ధరాత్రమనుటకు

పు.147– పసిఁడిమయము, తమమయము,

పు.156– పర్వవేదులు,

29, 31 కట్టనిచ్చు, కట్టఁగనిచ్చి–

ఇట్టి వ్యవహారమునేఁడు లేదు. నేఁడు 'కట్నమిచ్చుట' యనియే కలదు. సోమనాథుఁడు 'కట్నమిచ్చుట' గూడఁ బ్రయోగించెను. సత్కరించి యొసఁగెడు వస్త్రమునకుఁగట్నమని తొలుతఁ బేరై నేఁడది వస్త్రములేకపోయినను, సత్కరించి యొసఁగు భూమ్యాభరణాదులకుఁగూడ వాచకమయినది. సోమనాథుఁడు కట్నమును వస్త్రసామాన్యవాచకముగాఁగూడ వాడినాఁడు–

పు.101. 'ఎట్టి కట్నంబైన నిచ్చి మ్రొక్కుచును' – ఇక్కడ కట్నమనఁగా 'ఉదికిన గుడ్డ' యే; కట్టునది (వస్త్రము), కట్టము, కట్టనము, కట్నము, అనురూపములఁజెందినది. కొట్టము, కొట్టనము, కొట్నము= ధాన్యము; రాటము, రాట్టము, రాటనము, రాట్నము= నూలియంత్రము– ఈ శబ్దము లిట్టివే.

పు. 145 'ఈఁజుమ్మర' (తుమున్నంతముగాదు.)

పు. 65 'లేనెత్తి'

పు. 114 'ఏనుంగుగోల్పడె' కోల్పడె=పోయె,

పు. 194 అతఁడదృశ్యముగ= అదృశ్యముకాఁగా

పు. 195 **చోళవాళి వేళవాళి,** –

ఈ పదముల కర్థమెఱుఁగరాదు. 'చోళవాళిక కాక క్షోణీతలేశ– వేళవాళికిఁ గర్తవే' అని పండితారాధ్య చరిత్రముననుగలదు. దీనిఁగూర్చి శివతత్త్వసారపీఠికలో శ్రీ కె.వి. లక్ష్మణరావుగా రిట్లు వ్రాసిరి. "చోళవాళి=చోళపాళి, చోళరాజ్యము. వేళవాళి= వేళపాళి=కాలపాళి= కాలునిరాజ్యము. అని నే నర్థము చేసికొంటిని. కాని, అర్థము స్పష్టమనుటకు వీలులేదు." కన్నడ కవిచరిత 1 వాల్యుం 24 పుటలో 'చోళవాళి' ని గూర్చి చర్చకలదు. అది యిట్టిది :– ఈ (చోళవాళి) శబ్దమును రైస్ చోళ రాజ్యమని భ్రమించినట్లు తోఁచుచున్నది. ఈ శబ్దమునకు ఋణము లేక బాధ్యత అని యర్థమని యీ క్రింది ప్రయోగములఁబట్టి స్పష్టమగుచున్నది. "జోళదపాళియంపగెదు దిల్లా ద్రోణనుంద్రౌణియుం – రన్నకవి. జోళదపాళిగెన్న సువనిత్తాఖ్యాతియం తాళ్దవెం– కర్ణపార్యుఁడు. సలహిదొడయన చోళవాళిగె తలెయ మారువుదొందుపుణ్య– కుమారవ్యాసుఁడు"– ఈ ప్రయోగముల నన్నింటిని జూడఁగా నా కిట్లర్థము తోఁచుచున్నది. చోళవాళి= జొన్నల కయిన నిర్ణయము. వేళవాళి– జీవితకాలమున కయిన నిర్ణయము. అనఁగా, 'జీతము (తిండికి జొన్నలు) ఇచ్చినందులకుఁ జేయవలసిన సేవకే నీవధికారివి గాని, జీవితకాలపు విధానమున కెల్ల నధికారివి కా' వనియర్థము. చోళ మనఁగా జొన్నలు. వాళి=వతను, ఏర్పాటు, నిర్ణయము. కన్నడమున 'చోళదవాళి' యని యుండుటచేత నది షష్ఠీసమాసము. ఆ కాలమున రాజసేవకులకు జీతము జొన్నలిచ్చుచుండి రనుటకు నన్నిచోడని ప్రయోగము– మునుమిడి వైరివాహినులముట్టి......... జొన్నలు గొన్న ఋణంబు నీఁగుదున్. కుమారసం. 11 ఆశ్వా.



పు. 240 **వదరు** – 'ఒదవంగ వట్టేట నోడయుండంగ– వదరూఁదినట్లు' వదరు= సొఱకాయబుఱ్ఱ, నన్నయ ప్రయోగ మిది చూడఁదగును. 'అందు వైదర్భికి నొక్క యలాబూఫలంబును శైబ్యకు నసమంజసుండను కొడుకునుం బుట్టిన ఆ॥ 'వరదుఁడైన యీశువరమున నిది యొక్క। వదరు వుట్టె నెట్టి వరమొ యనుచు। దానిఁ బాఱవైవఁగానున్న' – అరణ్య. 3 ఆశ్వా.

పు. 219 **బ్రహ్మపురులు**= దేవాలయములలోని స్వస్తివాచక బ్రాహ్మణులు. "సోమేశ్వరదేవర బ్రహ్మపురుల సానుల వృత్తులు ఒక్కొకళ్ళకు ఖ 3" ఇది శక. 1075 నాఁటి నన్నిచోడ శాసనము[1] –మఱియు చేఁబ్రోలి శాసనమున 'దేవర బ్రహ్మపురి బ్రాహ్మలు 14 కు' ఇత్యాది.

పు. 40 కైకొనిపి (కైకొనఁజేసి) 'మేలుకొనిపి' – శ్రీనాథుఁడు.

207 పు. కూఁతురివరియింప' కూఁతురు శబ్దము ప్రథమేతర విభక్తులలో 'రు' లోపించునని కేతన యనెను. 'పరగఁగూఁతురు శబ్దంబుపై రుకార! మొక్క పలుకున పైనెన నుండుఁబాయు' నని విన్నకోట పెద్దన చెప్పెను.

పు. 121 **మఱియట్లనేమెచ్చి** – అట్లన్ అనికూడఁ బ్రాచీన ప్రయోగములు గలవు గాఁబోలును! 221 మల్లజియ్య, బొల్లజియ్య – దేవళములందర్చకులుగా నుందు తమ్మళ్లకు 'జియ్య' లని వ్యవహారము. పెక్కు శాసనములందుఁ దమ్మళ్లు 'జియ్య'లని పేర్కొనఁబడిరి.

30 పు. **దృష్టు్ల** – ఈ రూపమును నన్నయకూడఁ బ్రయోగించెను. దృష్టు్ల భ్రష్టు్ల, రూపములు ప్రాచీనతరకవి సమ్మతములు.

95 పు. కొల్చురగ సంఘములు ('కొల్చునురగ') అని యుండవలసినది.

69 పు. **అనియొండె వేసరనాసరఁగన్న జననిఁగదాయని** – వేసరను, ఆసరను అని ఛేదము. 'కుక్షింభరిత్వంబున క్షుత్క్షాములై వేసరియోసరి దాసరి

1 1915 సం. గవర్నమెంటువారి శాసన సంచయము. నెం 363

గుంపు (శర–చూ) అని యాముక్తమాల్యదలోఁ గలదు. బసవపురాణమున 'ఆసరు' అవి యతిలో 'ఆ' కలదు. ఆముక్తమాల్యదలోఁగూడ 'వేసరి యాసరి దాసరిగుంపు' అని యుండవలయునేమో! 121– నాసికము. దీని ముకారాంతముగాఁబలువురు ప్రాచీనకవులు ప్రయోగించిరి.

పు. 109 **అదిగొమ్మనుచు** = అదిగో+ అనుచు; అదిగో, ఇదిగో, వీఁడుగో, వాఁడుగో అను రూపములు గలవు. 'కొనుము' కు, కొమ్ము, కో, అను రూపములు గలవు. అదిగొనుము= దానిని గ్రహింపుము, చూడుము' అని యర్థము. 'కొనుము' రూపాంతరమగు 'కో' అగుటచే నాపదము కళగాని ద్రుతాంతముగాదు. 'అదిగో కానంబడియెఁ దెల్లగొల్లెనభంగిన్' అని వరాహపురాణమునఁ గలదు. పింగళిసూరన దాని ద్రుతాంతముగాఁ బ్రయోగించుట చింత్యము. 'మనసు మ్రుచ్చిలి చొచ్చిన మత్తికాఁడు । వీఁడు గొమ్మని– ఉత్తరహరివంశము. అదిగో ఇత్యాదులున్నట్టే అదివో, ఇదివో, వాఁడువో, వీఁడువో రూపములును గలవు. ఇక్కడ, 'పో' పొమ్ము రూపాంతరము. వాఁడుగో, వీఁడుగో రూపముల యునికిని గొందఱు సందేహించుచున్నారు. పిల్లలమఱ్ఱి వీరన శాకుంతలమునను, జైమిని భారతమునను దానిని బ్రయోగించెను. వాఁడుగో మాయన్న వంశవర్ధనుడు । నేఁ డేల మది దప్పెనెలంతరోనీకు, పల్నాటి వీరచరిత్ర – 'పేరు నేతిబీఱకాయ విలుచుకొందురు గాని। చేరిచూడఁబోతె నెయ్యి చిక్క దందులో । ఈ రీతి బ్రాహ్మణుల పద్దు నెన్నఁగా నేమియుగద్దు। వాఁడుగో మాదరచెన్నవరుఁడె బ్రాహ్మణుఁడు' – చిలుకపాటివారి వచనములు–

పు. 124, 178 **'పశువరించు'** ఈ పదము నన్నయ రచనలోఁగూడఁ గలదు. 'నీ యట్లు క్రూరులై నృపతులఁ జెఱఁబెట్టి పశువరించుచుఁ బశుపతినుమేశు। వరదుఁ బూజించినవారును గలరె' సభాపర్వ. 1 ఆశ్వా. 'తనయుఁబశువఱిచి తద్వప । గొనివేల్చినఁ జూచి' అరణ్య.3 ఆశ్వా. మొదటి ప్రయోగమున హింసించు బాధించు అనియు, రెండవదాన యజ్ఞపశువునుగాఁ జేసి చంపు అనియు నర్థము పొందుచున్నది. పశువఱుచు, 'పశువరించు' రూపాంతరములు గావచ్చును. [1]'పశువడు' కలదో లేదో! సోమనాథుని ప్రయోగములకు మొదటి యర్థమే పొందుచున్నది. 'పశువరింపఁగఁ జంప' – 'పశువరించుచుఁ గొర్లపాలు సేయుచును' అనుచో హింసించు బాధించు అనియే యర్థమగును.



పు. 85 **విగుర్వణము**. నన్నయ 'విగుర్వించు' అనియు నన్నిచోడఁడు 'గర్వవిగుర్వణంబులన్' అనియు నీ పదమును బ్రయోగించిరి. 'గుర్వీ ఉద్యమనే' అని ధాతుపాఠమునఁ బరిగణితమయిన ధాతువున నుండి పయిపదములు పుట్టినవి. గుర్వీధాతువుననుండి 'గూర్వణ' మని రూపమేర్పడునుగాని 'గుర్వణ' మని యేర్పడదు గావున నిది కర్ణాటదేశి పదమని కొందఱందురు. గుర్వు, గుర్వించు, అగుర్వు, అగుర్వించు అనునవి తద్భవరూపములగునని నేఁదలంతును. 'విగుర్వించు' 'విగుర్వణము' తత్సమములనియే నా తలఁపు. కావుననే నన్నిచోడఁడు 'గర్వవిగుర్వణంబులన్' అని సంస్కృత సమాసమునఁ జేర్చెను. గుర్వు, గుర్వించు మొదలగు తద్భవశబ్దముల సంబంధముచే 'విగూర్వించు, విగూర్వణము' అని యుండవలసిన తత్సమ శబ్దము లను లేఖకులు 'విగుర్వించు, విగుర్వణము' అని లిఖించియుందురు. 'గు' ఎట్లును గురువేకాన 'గుర్వణ' మన్నను 'గూర్వణ' మన్నను బద్యములందుఁ జిక్కులేదయ్యెను. ఈ తలఁపు తోడనే నేను 'గు (గూ?) ర్వణ' మని యుంచితిని.

పు. 67 **తొంగిళ్లు** – శ. ర. లో నీ పదమునకు నీటిబొట్లు, నూనెబొట్లు అని యర్థము కలదు. భల్లాణ చరిత్రలోనివిగా బసవపురాణములోని యీ ద్విపదలే యపపాఠములతో నందుద్ధృతములయ్యెను. (శబ్దరత్నాకరమునఁ బెక్కు పట్టుల బసవపురాణ పండితారాధ్యచరిత్రములలోని ద్విపదలోని ద్విపదలే భల్లాణచరిత్ర ద్విపద భాగవత పతివ్రతాచరిత్రములలోనివిగా నుద్ధరింపఁబడినవి. ఆయా ద్విపదలాయా గ్రంథములందు నాకుఁ గానరాలేదు. శ. ర. లో గ్రంథ సంకేత వివరణ పట్టికలో భల్లాణచరిత్రము వాలేశ్వరునిదిగాఁ జెప్పఁబడినది.

1. 'పశుపఱుచు' రూపాంతరమే యగునేని యుద్ధమల్ల శాసన లిపిరీతిని 'పశువఱించు' అని శకటరేఫముతో నుండవలెను.

వాలేశ్వరునిది పద్యకృతి) ఇక్కడ ముద్రితమయిన పాఠమును శ. ర. పాఠమును జూచినఁ దెలియఁగలదు. తలంటునప్పుడు పసిబిడ్డలఁబండుకొనఁబెట్టుటకయి చాఁచిన యూరుద్వయమునకు దొంగిళ్ళని పేరు. 'తొంగిళ్ళపై నిడి లింగమూర్తికిని। నంగన గావించు నభ్యంజనంబు' అను ద్విపదను గన్నడకృతిలో భీమకవి యిట్లు పరివర్తించినాఁడు. 'ఎరడుతొడగళమేలె పరమన । నిరిసిసలె యభ్యంగనవ నా। చరిసు' మఱియు 'అంగిటి ముత్తొత్తునందందద్రేలఁ – దొంగిళ్ళఁ గార్నీరు దో నెత్తిమిడుచు' అనుదానికి 'అంగుళియ ముళ్ళం సుదతితం నంగుళది నొత్తువళుతుంగో। త్సంగదిం సురిదంబువనితం నెత్తి యొళెరెవళు.'

శబ్దరత్నాకరకారులు మన సోమనాథుని గ్రంథములను స్వయముగాఁ దలస్పర్శముగాఁ బరిశోధించినట్టు గానరాదు. అట్లు శోధించియుందురేని బసవపురాణ, పండితారాధ్యచరిత్రములలోని ద్విపదలనే యన్యగ్రంథములలోని వానిఁగా నుద్ధరించుటగాని యనేకశబ్దములను విడుచుటగాని సంభవింపదు. సోమనాథుని గ్రంథములు మొదటితరగతిలోఁ జేరవలసినవయినను వారైదవతరగతిలోఁజేర్చిరి. ఇంతవఱకు నేఁజూపిన శబ్దములు గొన్ని శబ్దరత్నాకరమునఁ జేరనివే. నిఘంటువులలోఁ జేరనివి నూర్లకొలఁదిగా శబ్దములీ సోమనాథుని గ్రంథములలో నింకనుగలవు. ఈ బసవపురాణమున స్థూలదృష్టిని నాకు గోచరించిన వానిని గొన్నింటి నకారాద్యక్షరక్రమమునకుఁ దార్చి యిక్కడఁ జూపుచున్నాఁడను. శబ్దరత్నాకరమునకందనిశబ్దములు, అందినను దప్పు రూపముతో నున్నశబ్దములు తప్పుటీకతోనున్న శబ్దములు, సందిగ్ధరూప సందిగ్ధార్థములతో నున్నశబ్దములు నిందుఁగలవు.

## శబ్ద విశేషములు

పు. 46 అంకంబువాఁడు = ముద్రాధారి

పు. 234 అక్కిలించు = అక్కలించు,

పు. 71 అచ్చన = అర్చన,

పు. 120 అడఁకు= ఒదుఁగు,

పు. 134 అ(?) డచాళ్లు= రాజ్యాంగోద్యోగులు,



పు. 153 అడుకు = దాఁచు

పు. 75 అడువరి= ఆడువరి, వ్రప్రము,

అడ్డాయుధము = ఆయుధభేదము..

పు. 162, అరసు= రాజు, 'రాజన్' శబ్దము, అఱవమున 'అరశన్' కన్నడమునను తెనుఁగునను అరసు 'దేవ–రసు నిర్ధనయ్య నిరాళదేవయ్య' పండితా. పు. 3

పు. 73 అరివియగు= బయలగు, (అఱివి =శిథిలము చూ. కాశీఖండము)[1]

పు. 113 అరుచు= చెల్లించు,

పు. 146 అఱగొడ్డెతనము = (చూ. శ. ర.) అఱగొండెతనము,

పు. 68 అఱిమి= అజీర్ణవ్యాధి, అఱుకువ రూపాంతరము అఱు+ ఇమి శ.ర. అరిమి చూచునది.

పు. 220 అఱప =చేని మంచె

పు. 105, 134 అఱిముఱితనము = తొందర,

పు. 138, 139 అలుకు = చల్లు,

గీ. నెగడు పేర్చిందులనువిడినీరఁ[1] బ్రియుఁడు ।
గరజ హలముల మైపూఁతగలయఁ గలఁచి
కామబీజములలుక వేగమున మొలచు
మొలకలన మేని నిండ ముత్పులక లెసఁగె.

–కుమారసం. 8 ఆశ్వా.

పొం౹గారెడు నేతికిఁబయిపై నీరలికినయట్లపోలె నిష్ఫలమయ్యెన్. దశకుమారచరిత్ర, 3 ఆశ్వా. 'పరువంపుఁ బుప్పొడి బాగుగాఁదీర్చిన యలకలపైఁ బొలుపార నలికి,' ఎఱ్ఱన హరివంశము.

పు. 69 ఆదట = తృప్తి.

పు. 8 ఆదరికము = ఆదరము, (కిట్టెల్ కన్నడనిఘంటువు చూచునది)

1. నిడి నీరు = వాననీరు. తిరుపతి ప్రాంతముల వాడుక ఉన్నది. శాసనములు చూ. పీఠికలో ఈ పట్టున శాస్త్రిగారీ విషయమును గుర్తించిరి ( ప్రకాశకులు)

పు. 99, 191 ఇబ్బంది = అజ్ఞాని

పు. 109 ఇఱివిరి (ఈ పాఠమే యుక్తము) = ఇఱియుట విరియుట – సంకోచ వ్యాకోచములఁ జెందుట, మినుకుమినుకు మనుట,

పు. 132, 229 ఇలుపుట్టు = ఇలువరుసను వచ్చినది.

పు. 80 ఉడుపనేయి = ఉడుమునేయి,

పు. 72 ఉద్దెసించు = ఉద్దేశించు,

పు. 155 ఉనుపరి = స్వతంత్రుఁడు,

పు. 130, 198, 190, 200, 202. ఎగుదు= ఎగిసి వచ్చు, దూఁకివచ్చు,

పు. 133 ఎడయునుబుచ్చు,

పు. 45 ఎడవుచ్చు,

పు. 68,129 ఎడవోవు = కుంటెనతనమునకుఁ బంపు, కుంటెన తనమునకుఁ బోవు,

పు. 16 ఎరివు= బాధ,

పు. 43 ఏట =గొఱ్ఱె,

పు. 114 ఏటము = సమృద్ధము,

పు. 189 ఐదవెట్టు = ముట్టు.

పు. 80 ఒడిపిలిపాసెము = (శ.ర. లో నిది యప్రయుక్తమని కలదు.) పండఁబాఱినను బచ్చిగానున్న ధాన్యమును దంచిచేసిన బియ్యముతో వండిన పాయసము,

పు. 74 ఒడ్డణము = ఒడ్డాణము,

పు. 139 ఒమ్ము = ప్రియమగు,

పు. 165 ఒఱగోయు = ఒఱనుండిలాఁగు,

పు. 146 ఓజు = అధిపతి, గురువు, ఒజ్జ,

పు. 32 కంభకట్టు = స్తంభములకుఁగట్టి చేయు నలంకారము. మీఁదఁ గట్టి చేయు నలంకారము మేలుకట్టు;

పు. 125 కట్టిల్లు = అంటుకొను,



పు. 72 కట్టుగ్రము = కదు+ ఉగ్రము,

పు. 103 కట్టుగ్రుఁడు,

పు. 100 కట్నము = వస్త్రము,

పు. 116 కడయింటి పొడున = అతిసంసారుఁడయిన పోటుమానిసి,

పు. 102 కనుమరి = కమ్మరి,

పు. 7 కన్నెఱుఁగు = జాడయెఱుఁగు,

పు. 150 కలకేత విద్య,

పు. 149 కలకేత వేషము = ఇంద్రజాల విద్య,

పు. 112 కల్లచ్చులు = తప్పుటచ్చులు,

పు. 101 కల్లవెల్ల = గజిబిజి,

పు. 188 కవణము = పొర, అడ్డు,

పు. 183 కసిమసి = గజిబిజి (గసియుమసియు)

పు. 102 కాకఱపులు = వదరులు,

పు. 120 కింగాణము = నైచ్యము,

పు. 72,163,232 కుడుక = కోర, గిన్నె,

పు. 178 కుతగలు[1] = కుతజ్జ్ఞులు, దుర్విజ్ఞానులు,

పు. 107 కాయకము = వర్తకము, పనిపాటు, ఇది సంస్కృత సమాసమున 'కాయకలబ్ధి' ఇత్యాదివిధములఁ గలదు. 'ప్రాయపుఁ గాయకుల్ వలె' విజయవిలాసము

పు. 112 కొట్నము = ధాన్యము.

పు. 13 కొత్తడి = స్త్రీ సమూహము, "పుణ్యచరిత్ర గులాగ్రగణ్యా గొత్తడి సకలంబు" ఉద్యో. ప.

---

1 కించిజ్జ్ఞులు, అతజ్జ్ఞులు, కుతజ్జ్ఞులు అని నేనన్నాను, సూర్యరాయవారు సితగులు, అతగులు, కుతగులు– ఇన్నీ ఉన్నవి గాన అతగులు = హతకులు అన్నారు, చేయి దిగండిట్టి సితగుండుగలడె పుట, 69 కన్నడమున సితగుడు = వ్యభిచారి. తెలుగున – ధూర్తుఁడు.

పు. 210 కొత్తి= స్త్రీ, (కొత్తి, గోఁతికూడా ఉన్నది. హరివం)[1]

పు. 145 కొయ్యనగాండ్రు = మూర్ఖులు,

పు. 112 కొసనక = కొసనక్క (దేవతపేరు)

పు. 84 కోడిఱెప్ప = ఱెప్పలో దుర్మాంసము పెరుగు నేత్రవ్యాధి,

పు. 124, 230 కోలాస= రిత్తకోరిక, దురాశ,

పు. 105 క్రిగ్గాలి = క్రిక్కుగాలి, తప్పుగాలి.

పు. 245 క్రియగొను = పనిగొను.

పు. 191 క్రుమ్ముడి = కుఱుముడి (క్రొమ్ముడి శబ్దములేదు)

పు. 85 క్రేకన్ను= క్రేవకన్ను, కడచూపు, కటాక్షము ('క్రే' తర్వాత అరసున్న లేదు. క,గ, కాలేదు).

పు. 237 క్షణియించు = అర్పించు.

పు. 30 గజ్జెపరుపు =?

పు. 216 గడ్డిగ బావులు =ఏతపు నూతులు.

పు. 32,146 గనియ = గని? కండపట్టు? 'అన విని మేటి ధర్మమగు నట్టిది యెయ్యది, యెట్టిదెప్పుడున్। గనియగఁ బండియుండు' అరణ్యపర్వము ఆశ్వా. శ.ర. లో ' కనియ= మాఁగబండు ' అని యీ ప్రయోగమే యాధారముగాఁ గలదు. ఇక్కడను 'గనియ' కాఁ దగునని నాతలఁపు. 'ఆ చేను గనివలెఁబండినది' అనుట కలదు.

పు. 183 గటిగొను = ముత్తెపుఁ జిప్ప జలబిందువును దాల్చు

పు. 97 గామిడి= గడుసరి

పు. 71 గుడగుడలు = సంశయము.

పు. 32,224 గుడ్డ = గుట్ట.

1. ఈ పట్టున శాస్త్రిగారిట్లు గుర్తించుకొనిరి ( ప్రకాశకులు)



పు. 102 గెలిగొను = గేలిగొను.

పు. 65 గొంతి = కాంత

పు. 240 గొఱుపడము = కంబళి

పు. 74 గోరంతప్రొద్దు = ఓరంతప్రొద్దు

పు. 234 చక్కిలించు = చక్కిలిగింత చెందు

పు. 160 చిఱలువొడుచు = (పశువులు) నేలగోరాడుచు రేఁగిపరువెత్తు.

పు. 209 చెరలు = ఉప్పొంగు.

పు. 69 చేకళ్లు= చేతిముద్దలు.

పు. 222 జంగెత = జంగమురాలు

పు. 61 జక్కొల్పు= సమకూర్చు.

పు. 224 జరగడుగు= జలగడుగు, (నేఁడు జలగడుగుజాతి వారనఁబడు వారికిఁ బూర్వము ' జరగడుగువా' రనియే పేరయి యుండును)

పు. 107 జాడము= తుండము ?

పు. 134 జాణత = చాతురి

పు. 71 జాత్ర= జాతర, ఉత్సవము.

పు. 107 ఝూళిసేయు = జాడించు.

పు. 74 టెంకణము = గోపురము ?

పు. 215,226 తండు = నిస్సారము.

పు. 195 తండె = అయ్య.

పు. 76 తథ్య = సత్యము.

పు. 68,119 తఱుచంటి = దుడుకువాఁడు. శ – రలో తఱుసలియని యీ పదము గ్రహింపఁబడినది. తఱుసలి పై నౌపవిభక్తిక ప్రత్యయముచే తఱుసంటి మాటలు' అని నన్నయ ప్రయోగించెనని సీతారామాచార్యులవారు దలంచిరి. కుమారసంభవమున 'తఱుచంటి దన్ను నెదిరిని నెఱుఁగఁడు' అని 'తఱుచంటి' యే ప్రకృతిగాఁగానవచ్చుచున్నది. సోమనాథుని ప్రయోగములు నన్నిచోడ ప్రయోగరీతినే సమర్థించుచున్నవి.

పు. 23 బగుతులు= భక్తులు, బగితియుఁ గలదు.

పు. 26 బట్టకబయలు = బట్టబయలు

పు. 109 బడగు = వెడఁగు, పొగరుఁబోతు.

పు. 70 బడరుఁడు = ఈశ్వరుఁడు

పు. 160 బడిసివైచు = చేతులార్చు.

పు. 112 బడుగుపనులు = దాస్యము.

పు. 209 బరులు = చిఱుడొక్కలు

బనత = నొసలు ? దౌడ ?

పు. 20 బహురూపులు = వేషములు, వేషగాండ్రు.

పు. 115 బుగ్గరించు = విచ్చు.

పు. 111 బులుసరితనము = దంభము

పు. 70 బెడంగు = మూతి వెడల్పయినది ?

పు. 70 బొత్తిస = ముసుఁగుపైఁట.

పు. 68,143 బొప్పఁడు, బొప్ప= బాబు

పు. 178 మజ్జనబావి = జలకమాడుబావి

పు. 229,74 మట్టగించు = క్రుళ్లగించు.

మడిగూడు = ప్రసాదము.

పు. 130 మదుకు= వణఁకు.

పు. 184 మర్గడము = మలవిసర్జనము ?

పు. 133 మర్మమేలము = రహస్యపుఁజనవు.

పు. 172 మఱపడు= చాటుపడు, మఱుపడు –రూపాంతరము

పు. 112 మసనక = దేవత పేరు

పు. 216 మాదర = మాదిఁగ (మేదరకాదు) మాదర చెన్నయను గూర్చి–

క. చెన్నయ మాలఁడుగాఁడే
మున్ను మహాదేవుఁగొలిచి ముక్తుండయ్యెన్



జన్నమున శివుని దక్షుఁడు
మన్నింపమిఁజేసి పచ్చిమాలండయ్యెన్

– శివతత్త్వసారము

పు. 101 ముట్టుపాటు= స్పర్శము.

పు. 209 మున్నుదుక = ?

పు. 198 ముట్టము, తిరుముట్టము = ప్రతిష్ఠాపీఠము.

పు. 172 మేడెమువొడుచు = మేడము వొడుచు శ. ర. చూ.

పు. 113,215 మొగవాడ = దేవాలయాదులలో దేవుఁడు మొదలగువారికి ముందుగట్టెడు నడ్డుతెర, ముఖపటము,.

పు. 158 మోహణము = ఖడ్గపుఁబిడి.

పు. 134 మ్రింగనఁగొండి = మ్రింగివేయువాఁడు.

పు. 74 తాటనవుచ్చు = ?

పు. 117,118 తాపసి = తపస్వి.

తుల్కాడు = దైవాఱు, తుల్కాడు, తొల్కాడు, రెండు రూపములును వ్రాఁతలలో గలవు.

పు. 97 తొంగిళ్లు = బిడ్డఁబండుకొనఁ బెట్టుకొనుటకై చాఁచిన యిరుదొడలు.

తొరుగు = స్రవించు.

పు. 189 త్రట్లు = కళలు.

పు. 158 త్రస్తరులు= పరిహాసములు

పు. 151 దయపడు= కరుణించు.

పు. 112 దారలువట్టు = బాకాలూఁదు.

ధర్మకవిలె= అనుగ్రహపాత్రుఁడు.

నంగ= స్త్రీ.

పు. 144 నంజు= సందేహించు.

పు. 234 నడబాళ్లు= రాజ్యాంగోద్యోగులు.

పు. 200 నిట్టపాటు= నిలువునcబడుట.

పు. 160 ని(ట్రించు= నీల్గు

పు. 107,147 నెట్టోడు= భయపడు, గజిబిజిపడు.

పు. 124 నెఱవణి= ప్రశస్తి,

పు. 84 పక్కిళ్లు= ప్రక్కలు.

పు. 135 పటవలి=వస్త్రము.

పు. 164 పడికివల్చు= దుర్గంధముగొట్టు.

పు. 61,152 పడిగము= పళ్లెరము, పాత్రము ( తమ్మ యుమియునదే కాదు)

పడిహారి = పణిహారి, పడితెచ్చువాcడు, వేత్రహస్తుcడు.

పు. 21 పదకవాదము= కల్పితవాదము, కవితాకల్పనము.

పు. 212 పదరు = దబ్బనము?

పు. 238 పదువ= తృణభేదము.

పు. 64 పనువు= పనవు

పు. 140,108 పన్న= అధముcడు, సేవకుcడు.

పు. 228 పన్ను = పల్లము, చౌడోలు, (ఏనుంగు పన్నగునే గాడిదలకు)

పు. 66 పరిచ్ఛేది = శిరచ్ఛేదసన్నద్ధ (cడు) రాలు.

పు. 86 పరిసెనమువాcడు = స్పర్శచేయువాcడు.

పు. 124,178 పశువరించు = హింసించు.

పు. 38, 232 పసిగ= పసి ( పసిక అనియు)

ప్రామిcడి= గయ్యాళి, ధూర్తుcడు.

పు. 55 పాదిగ= పాతిక.

పు. 86 పాయగొమ్ములు = చెట్టు పంగటికొమ్మలు 'పాయగొమ్ముల నల్లc బట్టు దగిల్చి యక్కొన యాకుపై వెండికోరవెట్టి' – ఉత్తరహరివంశము.

పు. 179 పిట్టపిడ్గఱ = పిట్టపిడుగు,

పు. 242 పుప్పించె= పుచ్చుcజేసెను.



పు. 18,20 పురులు = సౌందర్యము, కీర్తి, ధనము.

పు. 82 పూన్చు= పూజించు

పు. 43 పెంట్రుక= పెట్రిక.

పు. 31 పెంట= పేcట.

పు. 43 పెఠికసెట్టి= శాసనములందు 'పెఱుక సెట్టి' కలదు.

పు. 22 పేయ= పెయ్య.

పు. 240 పొట్టపొర్వు= కడుcజేరువ.

పు. 128 పోలగు= ఒప్పు

పు. 103 పోడేర్చు= భూమిని గృష్యనుకూలముగాc జేయుటకై పుట్ట పొదరు మొదలగువానిcగొట్టి తగులcబెట్టు.

పు. 71 పోలెలు= పోళీలు.

పు. 60 మనికులు= స్థిరులు.

పు. 189 ప్రేలగింపులు= ప్రేలుటలు.

పు. 82 పాదొ (దు) ట్రు = సాలెపట్టు.

పు. 202 భ్రమరించు = చుట్టివచ్చు.

పు. 22, 226 లింగపసాయితము= లింగప్రసాదితము. వీరశైవులు చేత ధరించు ఖడ్గము.

పు. 74 వంపుడుగట్ట= కరకట్ట

పు. 19 వట్టిపాటు= వ్యర్థము

పు. 123 వదిగొను= వరుసపెట్టు

పు. 204 వయ్యు= వైచు.

పు. 136వ ఫుట్‌నోటు చూచునది. (వలయెత్తి నీటిలో వయ్యంగc దడవ; వలcగొని మఱునాcడు వయ్యంగcదొలుత.)

వరువుడు, వరుపుడము, వరువు, వర్వు= దాస్యము.

పు. 149 వలివేగము (వలవేగము, అనియుcగలదు) = కడువేగము.

పు. 245 వర్షాఫలము= వడగల్లు (వర్షోపలమనుటకు వర్షాఫలమనెను)

పు. 171,190 వసది= జైనమఠము (నేఁడు 'బస్తి' యనఁబడును).

పు. 33 వాతపూరణములు= గాలి గుమ్మటములు.

పు. 62 వాళగ్రోలు = పిల్లనగ్రోవి?

పు. 153 విడియలు= రొక్కపు జాలెలు.

పు. 191 విసమాల్చు= మాయించు.

పు. 138 లెంగిలిబంటు= అధమభృత్యుఁడు.

పు. 46,103 వెండీఁడు= బొమ్మలాడించువాఁడు.

పు. 81 వెడ్లుబుడ్లువెట్టు = నిశ్చేష్టమగు

పు. 224 వెరవిండి= వెరవెఱుంగనివాఁడు.

పు. 42 లెంగులు= అధములు.

పు. 180 వేఁడివెల్ల= వేఁడిబూడిద

పు. 69 వేసరు+ ఆసరు= ఆయాసముచెందు, ఉజ్జగించు.

పు. 22 శివమరులు= సివమెత్తుట.

పు. 112 శివశరణులు= శివుఁడు శరణముగాఁ గలవారు.

పు. 74 సువిధానులు= సువిధానమనుచు హెచ్చరిక చేయువారు.

పు. 214 సడగరంబు= సంభ్రమము, ఉత్సాహోద్రేకము.

పు. 122 సుళువు= తిరుగాటము.

పు. 125 సూనెగాఁడు = కటికవాఁడు.

పు. 130 సొకనాసి= దేవళములో గర్భాలయపు ముందటిపట్టు, 'సుకనాసి' యని శాసనములు.

పు. 240 సోడంబు = ఖడ్గము ?

పు. 46 హేళగీఁడు= కథలు చెప్పువాఁడు ?

మఱియు

పు. 62 పుటలో ధూకళి, ఝుంకళి మొదలగు నృత్యపరిభాషా పదములును,



పు. 90 పుటలో మొగచాళము, నవతాణము, సాళి, పెళ్లాపెళ్లి మొదలగు సంగీత పరిభాషాపదములు పెక్కులును దుర్జ్ఞేయములుగా నున్నవి. వాని నెల్ల నేనిక్కడఁబేర్కొన నయితిని.

మఱియు,

అనుగులము - అనుగలము, కొమ్ము - కొమ్మకసువు - కసపు, కదువ- కడవ, వరువుడు -వరవుడు, కుఱుఁగలి-కుఱఁగలి, చనువు- చనవు, పనువు- పనవు, గొడగు- గొడుగు, పెంట్రుక -పెంట్రిక, రూపములు గలవు. ఇందుఁ దొలిరూపములు ప్రాచీనములు. మోఁకాలు, మోఁచేయి, శబ్దములకు, శ.ర.లో మోఁద+కాలు, మోఁద+చెయి, యని నిష్పత్తులు గలవు. మ్రోఁకాలు, మ్రోఁ చెయి, యని ప్రాచీనరూపములు. మ్రొగ్గ+కాలు, మ్రొగ్గ+చెయి, అని వాని నిష్పత్తులు. మ్రాను-మాను, మ్రోడు - మోడు, మ్రబ్బు - మబ్బు, స్రద్ద-సద్ద, మొదలగు రూపములు నున్నవి. ఇందును దొలివి ప్రాచీనములు. అట, ఇట, ఎట, ఆడ, ఈడ, ఏడ, అచట, ఇచట, ఎచట, అక్కడ, ఇక్కడ, ఎక్కడ, శబ్దములు, కళలుగాను ద్రుతప్రకృతికములు గాను గలవు. పయి శబ్దములు వ్రాతలలో నిరుదెఱఁగులను గలవగుటచే నేను నిరుదెఱఁగులను నుంచితిని.

ఇప్పుడు పేర్కొన్నవిగాక యింకను బెక్కుశబ్దములు శబ్దరత్నాకర సంస్కారమున కుపకరించునవి యిందుఁగలవు. విస్తరభీతిచే నింక విడుచు చున్నాఁడను.

## ప్రాఁత పలుకుబళ్లు

అర్వాచీనకవుల కృతులలోనంతగాఁగానరాని వానిని బ్రాఁతపలుకు బళ్లను గొన్నింటి నిక్కడఁ జూపుచున్నాఁడను.

ప్రవేశింపఁదడవ (ప్రవేశింపఁగానే) 147 బాహుయుగ్మముఁ జాపఁదడవ (చాఁపఁగానే) ఇత్యాదులు పెక్కులు. ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశమునఁగూడ నిట్టి పలుకుబడి గలదు.

పు. 66 కాన నా తప్పునఁగాఁజేసి ( నా తప్పువలన) తలఁచు తలంపుఁ - బలుపునఁగాఁజేసి - (బలుపు వలన).

పు. 85 వెండియు నక్షిరోగంబొ (వేఱొక యక్షిరోగమో)

పు. 236 అరుగుము భక్తజనాళిలో వెడలి (లోననుండి వెడలి).

పు. 179 ఆమటఁ బదిట, (పదియామడల దూరమున)

పు. 171 అట వార్త గలిగి (అని వినికిడి యేర్పడి)

పు. 75 కొఱఁదుగొౖట్ర, ౖమానుమట్ర, బడియబట్ర, కట్టెగిట్టె, సదసట్ర, నలినట్ర, కస్వుగట్ర, ఈ జంటపలుకులలో ద్వితీయముల కర్థము లేదను కొందును. శ.ర.లో 'మట్ర' టీక చూచునది.

పు. 70 తల్లివి గలుగంగఁ దనకు రోగంబు (తనకు=నాకు)

పు. 11 నందీశ్వరుఁడు సేయు నవ్యతపంబు – ఇచ్చోఁౖబాత పలుకుబడి చొప్పున 'నందీశ్వరుఁడుచేయు' అని యుండుననియు నా పాఠమే ౖగాహ్యమనియుఁ దలఁచితినిగాని పెక్కుప్రతులలోఁ దొలిపాఠమే యుండుటను 'మీరు సెప్పినయట్లు మృడునకుఁబాలు, – నీవు దూపొడిచిన ఠావుదక్కఁగ, ఇత్యాదులగు బహుప్రయోగములుండుటను జూచి యిదియు ౖగాహ్యమే యనుకొంటిని. ఇట క్రిందిమాటలకేఁ దప్పువట్ట । నిటమీఁద సిరియాలు నీశ్వరు వార్త। మఱచి యాడితిరేని మా భక్తులెడకు । మఱి మీరు హరునికోమటి తోడివారు (సిరియాలుని యొక్కయు నీశ్వరుని యొక్కయు, వార్త, హరుని తోడివారు కోమటి తోడి వారును–

పు. 20 భక్తియు నీవును బద్దట్లు పడుము, – ఇత్యాదు లనేకములు గలవు. సోమనాథుఁడు తన గ్రంథములందుపయోగించిన భాష, ప్రాచీనత చేతను, గర్ణాటాంధ్రదేశముల కూడలిపట్టున వాడిక కలదగుటచేతను, మఱియు సోమనాథుని బహుదేశభాషా పరిజ్ఞానముచేతను, వైలక్షణ్యముగాంచి నేఁడు మధ్యాంధ్ర దేశవాస్తవ్యులయి, కర్ణాటద్రవిడ భాషాపరిచయ మించుకయుఁ బొందని వారికిఁగొంత వింత గొల్పుచుఁగొన్ని పట్టులఁ గొఱుకఁబడనిదై యుండును.



## అనుకరణములు

సోమనాథుఁడొందు రెండు పట్టులందు నన్నిచోడని ననుకరించెను. నన్నిచోడకవి సోమనాథకవికంటెఁ బ్రాచీనుఁ డగును.

సీ. నేలయు నింగియుఁ దాళముల్ వాయింప
నెండమావులఁబట్ట బండతలయు
మ్రోఁకాలు ముడివెట్ట రోఁకటఁ జిగుళులు
గోయఁ జౖట్రాతిపైఁ గ్రుంగ నిడుపు
లేక చిత్రము వ్రాయ నాకాశమునఁ దాఁప
రమునిడ మంచుఁ గుంచమునఁ గొలువ
నేనుంగు పురు డోమ ఆ నారగొన గాలి
గంటిడ నిసుమున గట్టుదాల్ప

గీ. నీరినడుమఁద్రెంప నేలఁదెన్నుండి చే
వెల్పుఁ గలియుఁద్రచ్చి వెన్నగొనఁగఁ
గడవనేర్పు గలిగి కందువుమానెఁడై
కత్తిగంటులయిన యత్తగంతు ? – కుమార.

ద్వి. నెట్టణ నేలకు నింగికి సూత్ర
పట్టమ్రోఁకాళ్లకు బట్టతలలకు
ముడివెట్టఁ దన నీడ గడవంగఁబాఱఁ
వడి నెండమావుల కడ గళ్లుగట్ట
పాయక రెండుగాఁ బాఱెడునీరు
వ్రేయఁ బుల్లున్ను గోరో యని యమ్మ
ఆ నారయొలువఁ జౖట్రాతిపైఁ గ్రుంగ
నేనుంగు పురుడోమ నిసుము త్రాడ్పేన
లలిగొనదెసలు తాళములు వాయింపఁ
జెలఁగుచు రోఁకటఁ జిగుళులు గోయఁ

గలివెన్న వుచ్చఁ గొండలుదొంతిఁబేర్చ
నిల మంచు గుంచానఁ గొలువ రేఁబవలు
సేయ నాకసమునఁ జిత్రరూపములు
వ్రాయ వాయువుఁ బట్ట వడగళ్ల గుళ్లు
గట్ట వెన్నెల గుంపుగాఁజేయ వచ్చి
పుట్టినప్పుడె నేర్చు బుద్ధులప్రోఁక

–పండితారాధ్యచరిత్రము.

ఇట్టి వింక నొండు రెండు పట్టులందుఁ గలవు. మల్లికార్జున పండితారాధ్యుల శివతత్త్వసారపుఁబద్యములు పెక్కులు పండితారాధ్య చరిత్రమున ద్విపద రూపమున దాల్చినవి. అది యసంగతముగాదు. మఱియు నాగమగ్రంథములలోని శ్లోకములు పెక్కులు బసవపురాణ పండితారాధ్య చరిత్రములందుఁదెలిఁగింపఁ బడినవి. ద్రవిడభాషలో 'తిరుతొండర్‌తొఘై' యను పేరఁగల లఘుస్తుతి కిందనువాదము గలదు.

"పరగు మహాభక్తచరితలు నాద
భరితమై చనఁ దిరుపాటలు సేసి
పాడుచు నొక్కొక్క భక్తుని చరిత
వేడుకఁ బొగడునవ్విధమెట్టులనిన. పు. 133

ఇది దాని యుపక్రమము. కర్ణాటభాషలో బసవేశ్వరుఁడు మొదలగు వారు రచించిన గేయ వచన రూపగ్రంథములనుండి కూడ నీతఁడు గొన్ని పట్టులను దెలిఁగించి యుండవచ్చును. ఆ గ్రంథములప్రఖ్యాతములగుటచే వానిని గుర్తింపఁ గాదు.

ఇఁక మన సోమనాథుని రచనములను బలువురనుకరించిరి. శివకవులెల్లరుననుకరించినవారే. బమ్మెరపోతరాజు, శ్రీనాథుఁడు మొదలగువారి గ్రంథములలోఁగూడ నప్రయత్నముగా సోమనాథుని రచనములు దొరలినవి.



క్షీరాబ్ధిలోపలఁ గ్రీడించు హంస
గోరునే పడియల నీరుద్రావంగఁ
జూతఫలంబులు సుంబించు చిలుక
భాతిఁ బూరుగుమ్రానిపండ్లు గన్గొనునె
రాకామల జ్యోత్స్నఁద్రావు చకోర
మాకాంక్ష సేయునే చీకటిద్రావ
విరిదమ్మివాసన విహరించు తేఁటి
పరిగొని సుడియునే బబ్బిలివిరుల
నెఱుఁగునే యల దిగ్గజేంద్రంబు కొదమ
యెఱపందిచనుసీక నెఱుఁగవు గాక ! పు. 55

సీ. మందార మకరందమాధుర్యమునఁదేలు
మధుపంబు వోవునే మదనములకు
నిర్మలమందాకినీ వీచికలఁదూగు
రాయంచ సనునె తరంగిణులకు
లలితరసాలపల్లవ ఖాదియై చొక్కు
కోయిల సేరునే కుటజములకు
పూర్ణేందుచంద్రికా స్ఫురితచకోరకం
బరుగునే సాంద్రనీహారములకు

–భాగవతము.

పండితారాధ్యచరిత్రమును బద్యకావ్యముగా రచించినవాఁడగుటచే శ్రీనాథుని యితర రచనలలోఁగూడఁగొన్ని పద్యభాగములు పలుకుబళ్లు నీతనివి చేరినవి. 'పాక మింతయు వృథాపాకంబుచేసె – ఆవగింజంతబూది మైనలఁది కొనిన। వెలఁది గుమ్మడికాయంత వెట్టిపుట్టు' ఇత్యాదులు –

## పరివర్తనముల తీరు

ఈ బసవపురాణమును బద్యకృతిగా రచించిన పిడుపర్తి బసవన కడునేర్పరి. ఆతఁడు ద్విపదలను నిపుణముగాఁ బద్యములందట్లే పొందించి నాఁడు. ఈ గ్రంథమున కది కొన్నిపట్టులఁడిప్పణిగాఁగూడ నుపయుక్త మగును. కాని, యా రచనము చాల సంగ్రహముగా నున్నది. కొన్నిపట్టు లాతఁ డర్థముకాక విడిచినాఁడు. భీమకవి కన్నడింపు మిగుల నెన్నఁదగినదిగా నున్నది. ఆతఁడు దీనిని తు–చ– తప్పకుండ ముక్కకు ముక్కగాఁ గన్నడించినాఁడు. కొన్ని పట్టులనించుక పెంచినట్లును గానవచ్చును. మిక్కిలి చిక్కుగా దుర్జ్ఞేయములు గానున్న పట్టులు గొన్ని యా కన్నడకృతిద్వారమునఁ దెలిసికొన నా కనువు పడెను. శబ్దరత్నాకరాదులలోఁ గానిరాని యనేకాపూర్వశబ్దములకుఁ గన్నడ కృతి తోడ్పాటున నేనర్థము గ్రహింపఁగల్గితిని. ఈ తెల్గుకృతికది ప్రశస్తమయిన టీక యనఁదగును.

### రచనా సౌందర్యము

మన సోమనాథుని రచన మసాధారణ సౌందర్యము గల్గియున్నదనుట యతిశయోక్తి గాదు. ఛందస్సు, భాష, విషయము మూఁడును దేశీయములే యగుటయు, కవి శివతత్త్వానుభవమున నోలలాడుచుఁదన్మయుఁడై కవితావేశము వొందియుండుటయు నట్టి యసాధారణ సౌందర్యమునకుఁ గారణములు.

వడిఁబాఱు జలమున కొడలెల్లఁగాళ్లు
పడిఁగాలు చిచ్చున కొడలెల్ల నోళ్లు
వడి వీచు గాడ్పున కొడలెల్లఁ దలలు
వడిఁజేయు బసవన కొడలెల్ల భక్తి.

అని బసవనిఁగూర్చి సోమనాథుఁడు భావప్లుతములుగాఁ బలికిన పలుకులు స్వవిషయమునఁగూడ సమన్వితములయ్యెను. ప్రతిపదమునను శివభక్తి పరవశుఁడై యుండి సోమనాథుఁడు గ్రంథముల రచియించెను. ముగ్ధభక్తుల కథలు



మొదలగు వానిలోఁగొన్ని పట్టులు చదువునప్పుడు మనసు ద్రవించితీఱును. బెజ్జమహాదేవి కథయు గొడగూచి కథయుఁ గన్నప్పని కథయు జదువునప్పుడు నేను బెక్కు తడవలు కరఁగితిని. మాయమర్మలు లేని విశుద్ధముగ్ధభక్తిని బ్రకటించుటలో సోమనాథుఁడక్కడ మధుర మధురములయిన జానుఁదెనుఁ గుఁబలుకుల జాలువార్చి ముద్దులు గురిపించెను. శబ్దాలంకార ములకయి, యర్థాలంకారములకయి, సోమనాథుఁడెక్కడను బాధపడలేదు. తనకుఁదెలియక యప్రయత్నముగాఁ బొందువడినవే కాని యాలంకారికులు పేర్కొన్న కావ్యగుణములననుధ్యానించి పనిపూని చొప్పించినట్టు కన్పట్టుపట్టు లీ గ్రంథమున నెక్కడను గానరావు. సులువుగా రచింపఁదగిన ద్విపద మగుటచే సోమనాథుని చూపు కథాకల్పనమందును, విషయవిన్యాసమందును, భావ ప్రపంచమందును బరుగులువాఱినదే కాని, యతిప్రాసచ్ఛందోభాషా బంధములందుఁ జిక్కుకొని యెక్కడను ద్రొక్కటపడలేదు. అట్లు పరుగువాఱుటలోఁ బెక్కుపట్టులందీతఁడు పాఠకుఁడు సరిగాఁ దన్నువెన్నాడఁగలఁడా యనికూడఁ జూడఁబోఁడయ్యెను. పదులకొలఁది ద్విపదలు గడచినను బయికిఁబయికి వాక్యము పొడుగువాఱుచు సాగుచుండుటే కాని ముగియకుండుట నీ గ్రంథమునఁ బెక్కుపట్టులఁ జూడఁగలము. అట్టు ముగియకుండుటలోఁ గర్తృపదము రెండుమూఁడు తడవలు గూడ మరల మరలఁ గానవచ్చుచుండును. ఇట్టి యిక్కట్టు పండితారాధ్యచరిత్రమున మఱింత గలదు.

శివభక్తిస్మరణము వచ్చినప్పు డీతఁడొడలు మఱచును.

"పొరి మజ్జనోదకంబులకట మున్న
పరముపై నానందబాష్పముల్ దొరుగఁ
బూజించు నవపుష్పరాజికి మున్న
రాజాంకుపై హృత్సరోజంబు విరియ
ధూపవాసనకు మున్ ధూర్జటి మ్రోల
వ్యాపితాంతర్గతవాసన దనర
వెలుగు నీరాజనంబుల కటమున్న
మలహరునంద యాత్మజ్యోతి ప్రబల

వినివేదితపదార్థవితతికి మున్న
తన ప్రాణపద మీశ్వరున కర్పితముగ
లింగార్చనము దాను బొంగి చేయుచును
నంగచేష్టలకు నంతంతఁ బాయుచును
సుభగలింగముఁ జూచి చూచి క్రాలుచును
నభవామృతం బాని యాని వ్రాలుచును
సురుచిరోక్తుల సోలిసోలి పాడుచును
స్థిరసుఖాంబుధిఁ దేలి తేలి యాడుచును
మంగళోన్నత బహిరంగంబు నంత
రంగంబుఁ దన ప్రాణలింగస్థ మగుచు."

మఱియు,

"పరగు చతుర్వర్గఫలము లాదిగను
వరసుతునడుగుము వాంఛితార్థమ్ము
లనవుడు మందస్మితాననుండగుచు
ననుషక్తి ముకుళితహస్తుఁడై మ్రొక్కి
యెఱుఁగ మోక్షముల పేరెఱుఁగ వాంఛితము
లెఱుఁగవేఁడెడు మార్గమెఱుఁగ నేమియును
నెఱుఁగుదు నెఱుఁగుదు నెఱుఁగుదు మఱియు
మఱియును మఱియు ముమ్మాటికి నిన్నె
కావునఁగోరిక కడమయుఁగలదె
దేవమూల స్తంభ దివ్య లింగాంగ
నీ యతులిత దయాన్విత దృష్టి యిట్లు
నాయందు నాఁటి కొనలు పసరింప
నాదగు సంస్పృహాపాదితదృష్టి
నీ దృష్టిలోనన నెక్కొని పొదలఁ



గరుణింపు దక్కినవరము లే నొల్లఁ
బరమాత్మ యని విన్నపంబాచరింప. పు. 80

మఱియును,

"బాపురే నిర్వాణి ! బాపురే తపసి!
బాపురే బాపురే కోప పుంజంబ !
పాపంబుఁ బొందెదు కోపించువాఁడు
పాపిగా కే నేల పాపినయ్యెదను
స్ఖలియించు కోపాగ్ని కణములఁజేసి
కలఁగదే మానసఘన సరోవరము
ఎసఁగెడు కోపాగ్ని నింకదే చెపుమ
మసలక హృదయాబ్జమకరందధార
వెలువడు కోపాగ్ని వేఁడిమిఁజేసి
నలఁగదే సచ్చిదానందపద్మంబు
జ్ఞానంబు సొంపా? విచారంబు పెంపా?
ధ్యానంబు ఫలమొ ? యీ తామస గుణము !
నాకేమి సెప్పెద వీ కాననమున
లేకున్నవే చెట్లు నీకుఁ గూర్చుండ
నిట్టి శాంతాత్మకు లెచ్చోటఁగలరు !
పుట్టుదురే నినుఁబోల సంయములు !
వఱదవోవు నెలుఁగు గొఱపడం బనుచు
నెఱుఁగక యీఁత కాఁ దేఁగిపట్టుదును
వడిఁ బాఱునెలుఁ గంత వానినిపట్టఁ
గడనున్నవాఁ 'డోరి ! విడువిడు' మనుడు
'విడిచితి నది దన్ను విడువ' దన్నట్టి
వడువున విడిచిన విడుచునే మాయ

పొంగి చిచ్చుఱకంగఁ బోవుచుఁ జీర
కొంగోసరించు పెన్వెంగలియట్ల
చెల్లుఁ బొమ్మని సన్న్యసింపఁ బోవుచును
నిల్లప్పగించు నయ్యిబ్బందియట్ల
పదపడి నూతిలోఁ బడఁబోయి తాప
వెదకుచు మెట్టెడి వీఱిఁడి యట్ల
జ్ఞానాత్ముఁడై సర్వసంగముల్ విడిచి
తానాశ్రయముఁగోరు తపసిచందమున
నిల మరు ల్వోయె రోఁకలిగొనిరండు
తలఁ జుట్టుకొనియెదఁ దా నన్నయట్లు
పానలేల చెఱకుపందెమం దొక్క
యీనె సిక్కిన నోడుటేకాదె తలఁప
రోసి సంసారంబుఁబాసి యొక్కింత
యాసించెనేనియు నది వెల్తి గాదె?"

ఇక్కడ 'కోపగర్వ' ను బలుదెఱఁగులఁ బ్రపంచించి కోపిని సిగ్గునఁ గూరునట్లు చేసినాఁడు. భావోద్రేకముగలపట్టులిట్టివీగ్రంథమునఁ బెక్కులు గలవు. కవిత్వ రచనాశౌండీర్య మిట్టిది పండితారాధ్యచరిత్రమందింక నెక్కుడుగా నిండారి పండఁ బాఱి యున్నది. అది యపూర్వము లగు ప్రయోగములకు, శబ్దములకు, విషయములకు, గనియ. ఆకాలపు టాంధ్రదేశ ప్రజాచరిత్రమున నది యనేక విషయములఁదెలుపుచున్నది. ద్విపదలు జడవాఱి పొడుగులై సాగియుండుటచే నది యన్వయక్లేశమునఁగూడ దీనిని మీఱియున్నది. ఆ గ్రంథముననుండి యెత్తిచూపవలసిన యపూర్వవిషయము లనేకములు గలవు. విస్తరభీతిచే నిక్కడ విడిచితిని.

## ముద్రణ విధానము

ఏలూరిలోఁ గందుకూరివారు బసవపురాణమును జాగ్రత్తతోఁ బ్రకటించిరి. దాని నాధారముగాఁ గొని ప్రాచ్యలిఖితపుస్తకశాలలో సి.పి. బ్రౌనుదొర



గారు సేకరించిన ప్రతులలోని పాఠములను దోడుచేసికొని యీ ముద్రణము సాగించితిమి. శ్రీ గిడుగు వెంకటరామమూర్తి పంతులుగా రొకతాళపత్ర ప్రతి నొసఁగిరి. ముద్రణ సమయమునఁ గ్వాచిత్కముగా దానిని గూడఁదోడు చేసికొంటిని. భీమకవి కన్నడకృతియుఁ, బిడుపర్తి [1]బసవన పద్య బసవపురాణమును నాకు మిక్కిలిగా నుపకరించినవి. కన్నడ బసవపురాణము తీరు తిన్నన లేని ప్రాఁతకాలపు రోఁతయచ్చులో నుండుటచేఁ బ్రతిపదము దానిని బరికించుట యసాధ్యమయ్యెను. ఆవశ్యకము గల్గినపట్టులమాత్రమే దానిఁ జూడఁగల్గితిని. అది సుముద్రణమున నుండెనేని నాకింక నెన్నో యపూర్వ విషయములు తెలియఁ దగియఁదగియుండెడి వని నమ్ముచున్నాఁడను. ముద్రితమైన సంస్కృత బసవపురాణము నిష్ప్రయోజనమే. అది మిక్కిలి సంక్షిప్త మైనది. కొందఱు భక్తుల పేళ్ళు మొదలగువానినొకవిధముగా దానినిబట్టి నిర్ణయించుకొంటిని. అఱువత్తుమూవుర పేళ్ళు, ద్రవిడ కర్ణాటాంధ్రసంస్కృత గ్రంథములలో భిన్నభిన్న రీతులతో నున్నవి. తాళపత్రప్రతులలోని పాఠములను సాహసించి సంస్కరింపరాదనుతలఁపుతో నుండుటచేతను, నవి యిదమిత్థమని నిర్ణయింపఁ గుదురనివై యుండుట చేతను నక్కడక్కడ మిక్కిలి త్రొక్కటపడితిని. తొలుత నీ గ్రంథమును భాషాతత్త్వపారంగతులగు శ్రీ గిడుగు వెంకటరామ మూర్తిపంతులుగారును నేనును గలసి పరిశోధింపఁ దలఁచుకొంటిమి. కాని, వారు సుదూరదేశమున నుండుటచే నట్లు ఘటింపదయ్యెను. ఈ ముద్రణమున దొరలిన దోషములతో నాకే కాని వారికి సంబంధము లేదు. వారి తోడ్పాటుండి నచో నింకను నిది గుణోత్తరముగా సాగియుండెడి దనుకొనెదను.

---

1 పద్య బసవపురాణకర్త పిడుపర్తి సోమనాథుఁడని కవుల చరిత్రము మొదలగు గ్రంథములు పేర్కొన్నవి. ఆ గ్రంథమున గద్యములందుఁగూడ నట్లే కాననగును. కాని, కృత్యవతరణికలోఁ జూడఁగాఁ దత్కర్త పిడుపర్తి బసవనయని యేర్పడును. పరిశోధించియే నే నీ మార్పును జేసితిని. గద్యములందు సోమనాథుఁడని యుండుటకుంగారణము మృగ్యము.

## కృతజ్ఞత

దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు తాళపత్ర ప్రతులపాఠములను సేకరించుటలో మిక్కిలి వ్యయమునకుఁ బాల్పడిరి. మఱియు నేను దఱచుగా మద్రాసులో నుండకపోవుట మొదలగు కారణములచే గ్రంథముద్రణమునకుఁ జాలఁగాలము పట్టినను సైఁచిరి. ఆంధ్రదేశోపకార కార్యములెన్నేని వారి హస్తముననుండి యవతరించుచున్నవి.'ఉదార చరితానాం తు వసుధైవ కుటుంబకమ్' అన్నసూక్తికిఁ దార్కాణమైనవారు శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు చెన్నపురి చిత్రవస్తు ప్రదర్శనశాలలో సేకరమైయున్న శైవాచార్య శిలాచిత్రమునకుఁ జక్కఁగాఁ బ్రతిబింబము నెత్తియిచ్చిరి. మైసూరు వాస్తవ్యులగు శ్రీ బి. బసవారాధ్య బి.యె;బి.యెల్. గారు బసవపురాణము మొదలగు కర్ణాట గ్రంథముల నేతద్ గ్రంథముద్రణము ముగియుదాఁక మాకెరవుగా నొసఁగి యెంతయు నుపకరించిరి. భారతీ కార్యనిర్వాహకులును, నందును, శ్రీ గన్నవరపు సుబ్బరామయ్యగారును, ఆంధ్ర పత్రికా ముద్రణాల యమున ముద్రణాధికృత ముఖ్యుఁడగు నావుల పార్థసారథినాయఁడు గారును, ముద్రణమున సౌకర్యముగూర్చిరి. వీరికెల్ల గడుఁగృతజ్ఞుఁడను. పీఠికా రచనాదులలోఁగర్ణాటకవి చరిత్రము రెండు సంపుటములును, ఫ్లీటు దొరగారి బొంబై గెజిటియరును, నాకుఁ బెక్కు విషయముల నెఱిఁగించినవి. అందులకుఁ దత్కర్తలయెడఁగృతజ్ఞుఁడను.

అనేక పాఠభేదములవలని యలజడియుఁ దెకతెంపులేక యేకధారగా నున్న ద్విపదల దీర్ఘగతియు నా యపరిజ్ఞానమును గారణములుకాఁగా నక్కడక్కడ తప్పులు దొరలినవి. వానిని పరిశోధన పత్రమునఁ జేర్చితిని. పునర్ముద్రణమున దిద్దుకొందును. ఇంకను నాకంటి కందనివి యుండవచ్చును. ఎఱిఁగినవారు దెలిపినచో దిద్దుకొందును. ప్రాజ్ఞులకు మ్రొక్కుచున్నాను.

ప్రభవ వ్యాసపూర్ణిమ. మదరాసు.

విద్వద్విధేయుఁడు,
**వేటూరి ప్రభాకరశాస్త్రి**

# విషయానుక్రమణిక

**(బసవపురాణము)**

## తృతీయాశ్వాసము 54–99







## చతుర్థాశ్వాసము 100–141

శ్రీరస్తు

# బసవపురాణము

## పాలుకురికి సోమనాథ ప్రణీతము

## ప్రథమాశ్వాసము

శ్రీ గురుదేవు నంచితగుణోత్తంసు – యోగీంద్రహృదయపయోజాతహంసుఁ
బరమకృపామూర్తి భక్తజనార్తి – హరుఁ ద్రిజగత్స్ఫూర్తి నానందవర్తి
భవరోగవిచ్ఛేది భక్తవినోది – శివతత్త్వసంపాదిఁజిరతరామోది
నిత్యస్వరూపు నున్మీలత్ప్రతాపుఁ – బ్రత్యయగతపాపు భక్తప్రదీపు
భావనాతీతు సద్భావనోపేతు – సావయవఖ్యాతు నమితు నజాతు
నాద్యంతరహితు వేదాంతార్థసుహితు – విద్యాత్మసహితు సంవిత్సౌఖ్యమహితు
భక్తపరాధీను భక్తనిధాను – భక్తసమాధాను భక్తావధాను
భక్తపరంజ్యోతి భక్తవిభూతి – భక్తదుఃఖారాతి భక్తానుభూతి
భక్త [1]వజ్రత్రాణు భక్తధురీణు – భక్తజనప్రాణుఁ బరమకళ్యాణు
మన్మనోరమ్యు నిర్మలభావగమ్యుఁ – జిన్మయు సౌమ్యు భజించి కీర్తించి;
యుల్లమున మదీయవల్లభుఁ జెన్న – మల్లికార్జు[2] నుఁ దేటతెల్లగా నిలిపి;
సముదితసారూప్యశాశ్వతతనులఁ – బ్రమథులఁ ద్రిభువనప్రమథులఁ దలఁచి
ప్రకటలింగైక్య పురాతనభక్త – నికరంబు శివునంద నిష్ఠించి కాంచి;
వ్యక్తలింగముల సద్భక్తిరసాభి – షిక్తుల నూతనభక్తులఁగొలిచి;

1. వజ్ర , 2. నదేవుఁ దెల్లఁ

[1]బసవచరిత్ర మివ్వసుమతి[2] మీఁదఁ – బసరింతుఁ దత్కథాప్రౌఢి యెట్లనిన:
[3]శ్రీమన్మహాదేవుసింహాసనంబు – హైమవతీశువిహారస్థలంబు
హరునిభక్తులకు నేకాంతవాసంబు – పరమయోగులకు హృత్ప్రమదావహంబు
నరులకుఁగర్మసంహరణైకహేతు – వరయంగ సురలకు [4]నాశ్రయభూమి
సకలతీర్థములకు జనయిత్రి యగుచుఁ – బ్రకటింప నొప్పు **శ్రీపర్వతేంద్రంబు**;
ఉర్వీఁదత్పర్వతసార్వభౌమునకుఁ – బూర్వవక్త్రాంకవిస్ఫురణ[5]దుల్కాడ
నొలసి **కుమారశైలోత్తం**సలీలఁ – దిలకించి పెంపారుఁ **ద్రిపురాంతకంబు**;
తత్త్రిపురాంతకస్థానవాస్తవ్యుఁ – డై త్రిపురాంతకుం డభినుతిఁ బేర్చు;
నాపురసంహారు నపరావతార – రూపితఖ్యాతినిరూఢిఁదలిర్చు
నాసదాశివమూర్తి య[6]వికలైశ్వర్య – భాసురచరలింగపటుదీప్తిఁబరగు
నాకాలకంధరు ననవద్యహృద్య – సాకారవిభ్రమవ్యాప్తిఁ బెంపారు
నా దేవువీర వ్రతాచారసార – మేదురస్ఫురణమై మించి వెలుంగు
జంగమరత్నంబు శరణసమ్మతుఁడు – లింగైక్యవర్తి గతాంగవికారి
**పండితారాధ్య** కృపాసముద్గతుఁడు – మండితసద్భక్తిమార్గప్రచారి
విలసితపరమ సంవిత్సుఖాంభోధి – నలిఁ **గరస్థలి సోమనాథయ్యగారు**;
బసవని కారుణ్యరససుధావార్ధి – నసదృశలీల నోలాడుచు నిత్య
నియమవ్రతాచారనిరుపమనిష్ఠ – క్రియగొనఁదత్త్వనిర్ణయము సంధిల్ల
నతులగోష్ఠీ సుఖస్థితిఁ బేర్చుభక్తి – మతినియమంబుల **మల్లినాథుఁడును**;

1. కొన్ని శాసనములందును, వ్రాఁతలందును 'బసువ'పదము కలదు. బసవపురాణము పండితారాధ్య చరిత్రము మొదలగు గ్రంథముల వ్రాఁతప్రతులలో రెండురూపములును గానవచ్చుచున్నవి. కాని, సోమనాథుఁడీ బసవపురాణమునను బండితారాధ్యచరిత్రమునను యతిస్థలమున బసవపదమునే ప్రయోగించెను "శరణోపకార బసవపురాణార్థ–వరభుక్తిముక్తిసంవర్ధన చరిత" (7వ యాశ్వాసము తుద. బసవపురాణము). "చరితంబులును శ్రీబసవపురాణంబు – చాతుర్య మొసఁగ బసవదండనాథు గీతంబు" (పండితా. అయిదవ ప్రకరణము. 61–62 పుటలు) ఈతఁడేసోమనాథభాష్యమున బసవ, బసువ, పదములు రెండును సాధువులే యనియుఁజెప్పినాఁడు. "–వృషభస్య బసవనామకత్వం కస్మా త్కారణా దాసీదితి. వృకారస్య బకారాదేశో భవతి. వబయో రభేద ఇతి. 'శషోస్స' ఇతి సూత్రాత్ ష కారస్య సకారాదేశో భవతి. వః పవర్గతేతివారరుచ్య సూత్రాత్ బ (భ–అనియుండ వలెను) కారస్య వకారాదేశో; భవతి, ఏతద్వృషభాక్షరతద్భవాత్ "బసవ" ఇతి నామ వక్ష్యతే. సాక్షాద్వృషభేశావతార ఇత్యర్థః. పశూన్ పాతీతి పశుపః, వృషభః, తత్పశుప (పే) త్యక్షరత్రయతద్భవాత్ బస(సు అని యుండవలెను) వ ఇత్యక్షరత్రయం సంభవతి"– సోమనాథభాష్యము రెండవపుట. 2.లోన. 3. శ్రీమహాదేవుని. 4. నాశ్రమ. 5.దొల్కాడ. 6. వితతైశ్వర్య.



నాదివేదాంతసిద్ధాంతపురాణ – వేదశాస్త్రాగమవిహితమార్గములఁ
దను మనోధన నివేదన సమగ్రత[1]ను – బనుగొని జంగమార్చనలు సేయుచును
[2]శీలంబు దనర సీమాలంఘనవ్ర – తాలంకృతిని బేర్చి యాచారలీల
యసలారఁగాఁ గుమారాద్రికిఁ దూర్పు – దెసను సోపానముల్ దీర్చి పొల్పార
మహితసద్భక్తి సమంచితవృత్తి – మహిఁజను **రెంటాల మల్లినాథుఁడును**;
నిరతిశయప్రీతి నిత్యంబు నైదు – కరవీరపుష్పముల్ హరునకర్పింప
నొక్కనాఁడొకఁడందుఁదక్కువయైనఁ – గ్రక్కునఁదననేత్రకమలమర్పించి
భవునిచే[3] నసదృశాంబక మప్డ పడసి – ధ్రువకీర్తిఁ బేర్కొన్న **దోచమాంబయును**;
ధీరుండు **మున్నయదేవయోగీశు** – కూరిమిశిష్యుఁడు **నారయాంకునకుఁ**
బుత్త్రుండుఁ బరమపవిత్రుండు విమల – గాత్రాంచితుఁడు నీలకంఠాగ్రజుండు
జగదభినుతుఁడు ప్రసాదావధాని –[4]నిగమార్థవేత్త [5]**గోడగి త్రిపురారి**;
లోనుగా సకలభక్తానీక మెలమి – మానితభక్తిసామ్రాజ్యసంపదలు
[6]సిలివిలివోవంగఁజిరతరమహిమ – నలరారుచుండంగ[7]నందొక్కనాఁడు
మండితాసంఖ్యాతమాహేశ్వరులకు – దండప్రమాణంబు దగనాచరించి
భక్తదయారసపరమామృతాభి – షిక్తుండ నగుచు గోష్ఠీప్రసంగతిని
"నసదృశంబై యొప్పు బసవపురాణ – మెసకంబుతోఁజెప్ప నిష్టమయ్యె[8]డిని
వరకథాసూత్రంబు[9]వెరవెఱిఁగించి – చరితార్థుఁ జేయరే కరుణతో" ననుచు
సన్నుతిసేయుచు సస్పృహత్వమున – విన్నవించు[10]డు భక్తవితతి హర్షించి
సముదితప్రీతిఁబ్రసాదావలోక – నము నివ్వటిల్లంగ నన్ను వీక్షించి
"బసవపురాణంబుఁ[11]బసరించుశక్తి – నసలార నొసఁగితి మట్లు గావునను
రచియింపు బసవపురాణంబు నీవు – నచలితభక్తహితార్థంబుగాఁగ"
నావుడు భక్తజనావలియాజ్ఞ – వావిరిఁదలమోచి వర్ణింతుఁగవిత.
పాటింపఁదగిన కర్ణాటభూమికిని – గోటీరమై యొప్పుగొబ్బూరనంగ
నా యగ్రహారమహాజనోత్తమ ని– కాయపూజిత పాదకమలద్వయుండు

1. యుఁ బనుగొన. 2. ఓలిమై గ్రామ 3.నసదృశంబవు కనున్నవడసి 4. నిగమాంత 5.ఈతఁడే యనుభవసారకృతిపతి. 6.జిలిబిలి. వినుకలి సుఖము సిల్విలివోవునంత– పండి–4ప్రక. 7. నట్లొక్క 8. డును 9. వెరవెఱుఁగించి, ఇట్లు కొన్ని చోట్లఁగలదు. 10. ఇట్టిచోట్లఁగూడఁ గొన్ని ప్రతులలో నర్ధానుస్వారము కానవచ్చును. కాని పెక్కు ప్రతులలో లేకపోవుటచేతను, బూర్ణానుస్వారరూప మెక్కడను గానరాకుండటచేతను, దాని నిక్కడఁ జేర్పలేదు 11. ఁబచరించు శక్తి.

శాంభవ [1]వేధదీక్షాసద్విశేష – సంభావితాశ్రితజనసముత్కరుఁడు
సురుచిరప్రణవవిస్ఫురితోపదేశ – చరితార్థ నిఖిలశిష్యప్రతానుండు
కింకర నిచయహృత్పంకేరుహాంత – రాంకిత వరసచ్చిదానందమూర్తి
పాత్రుండు భవలతాదాత్రుండు విషయ – జైత్రుండు విమల చరిత్రుండు సకల
భువనపావనమూర్తి బుధచక్రవర్తి – ప్రవిమలకీర్తి సద్భక్తిప్రపూర్తి
యని వినుతింపగ నాశ్చర్యమహిమ – మనుచుండు **మండెఁగమాదిరాజ**నఁగ;
నా మాహాత్ముని సముద్యత్కృపాపూరి – తామృతహస్తకృతావతారుండు
నా గురుదేవు పాదాబ్జ సౌరభ్య – భోగలీలా వరపుష్పంధయుండు
నా శివయోగి యుదాత్తమూర్తి ప్ర – కాశితహృత్పద్మకర్ణికాంతరుఁడు
నా దివ్యదేహు దయాకలిత ప్ర – సాదపాదోదకాస్వాదతత్పరుఁడు
గురు పరతంత్రుండు గొబ్బూరి విభుఁడుఁ – బరమ శివాచారపథవర్తనుండు
లింగైక్యనిష్ఠావిలీనమానసుఁడు – **సంగనామాత్యుండు** జగదుపకారి
యని యిట్లు భక్తసభాభ్యంతరాళ – మున నిన్నుఁజెప్పంగ విని లసత్ప్రీతి
వసరింప జంగమభక్తుండ వనియు – బసవపురాణైకపాత్రుండ వనియు
నచలితప్రీతి మా[2]కనుగులంబనియు – రచియింతు సవపురాణసత్కవిత
యవధానవంతుండవై నెమ్మి వినుము – సవిశేషభక్తిమై **సంగనామాత్య!**
ధర "నుమా మాతా పితా రుద్ర" [3]యనెడు– వరపురాణోక్త నీశ్వరకులజుండ
శరణ[4]గణాశ్రయ సకలస్వరూప – గురులింగ [5] వరకరోదరజనితుండ
భక్తకారుణ్యాభిషిక్తుండఁ[6]బాశ – ముక్తుండఁగేవల భక్తిగోత్రుండ
భ్రాజిష్ణుఁడగు **విష్ణురామిదేవుండుఁ** – దేజిష్ణు వగు **శ్రియాదేవి** యమ్మయును
గారవింపఁగ నొప్పు గాదిలిసుతుఁడ – వీరమాహేశ్వరాచారవ్రతుండ
ఖ్యాత సద్భక్తిమైఁగల **కట్టకూరి – పోతి** [7]**దేవర**పదాంబుజషట్పదుండ
సకృపాత్ముఁడగు **కర** [8]**స్థలి విశ్వనాథు** – ప్రకటవరప్రసాదకవిత్వయుతుఁడ
[9]**వడగాము రామేశు**వరశిష్యుఁ డనఁగఁ – బడు **చెన్నరాముని** ప్రాణసఖుండ
సంభావితుఁడ భవిజనసమాదరణ – సంభాషణాది సంసర్గ[10] దూరగుఁడ
నలిఁ**బాల్కురికి సోమనాథుఁడ**నంగ – వెలసినవాఁడ నిర్మలచరిత్రుండ

1.వేద 2. కనుగలం 3. యనఁగఁ బరగువేదోక్తి 4.జనా 5.'జంగమవర కుమారుండ' అని యొక ప్రతి 6. బాప 7. దేవుని 8. స్థలము విశ్వేశు 9. వడుగాము, వడుగామి 10. వర్జితుఁడ.



నురుతర గద్యపద్యోక్తులకంటె – సరసమై పరగిన జానుఁదెనుంగు
చర్చింపఁగా సర్వసామాన్య మగుటఁ – గూర్చెద ద్విపదలు గోర్కి దైవాఱఁ
దెలుఁగుమాటల[1]నంగవలదు; వేదముల – కొలఁదియ కాఁజూడుఁడిలనెట్టు లనినఁ
[2]బాటి తూమున [3]కును బాటి యౌనేనిఁ– బాటింప సోలయుఁ బాటియ కాదె
అల్పాక్షరముల ననల్పార్థరచన – కల్పించుటయ కాదె కవివివేకంబు
అలరుచు బసవనిఁ దలఁచుతలంపు – బలుపునఁగాఁ జేసి భావ[4]మ్ము మెఱసి
యకలంక లింగ రహస్యసిద్ధాంత – సకల వేద పురాణ సమ్మతంబైన
యాతత [5]బసవపురాతనభక్త – గీతార్థసమితియే మాతృక గాఁగఁ
బూరితంబై యొప్పు పూసల[6]లోన – దారంబు క్రియఁబురాతనభక్తవితతి
చరితలలోపల సంధిల్ల బసవ – చరిత మే వర్ణింతు సత్కృతి [7]యనఁగ
నసదశలింగదేహస్థుడైయున్న – బసవని వేఱొక్క భావంబు గాఁగఁ
దగిలి వర్ణించుట [8]దప్పనవలదు – తగు భక్తివర్ధనార్థంబు దానగుట
బసవని శరణన్నఁ బాపక్షయంబు – బసవని శరణన్నఁబరమపావనము
బసవని శరణన్నఁ బ్రత్యక్షసుఖము – బసవని శరణన్నఁ భవరోగహరము
బసవని శరణన్నఁ భక్తి సేకూరు – బసవని శరణన్నఁబంధముల్వాయు
బసవని శరణన్నఁ [9]భాగ్యముల్వొందు – బసవని శరణన్నఁబర శీలంబు
బసవని శరణన్నఁ బాయు నాపదలు – బసవని శరణన్నఁ బ్రబలు సంపదలు
బసవని శరణన్నఁ[10] నసలారుఁ గీర్తి – బసవని శరణన్నఁ ఫలియించుఁగోర్కి
బసవని శరణన్నఁ నెసఁగు వాక్సిద్ధి – బసవని శరణన్నఁ భ్రాజిల్లుబుద్ధి
[11]వేయేల తగ "బసవా" యనఁబరగు–నీ యక్షరత్రయం [12] బిటులొక్కమాటు
చదువునెవ్వండేని ముదముతోనతని – వదనంబు శివునకుఁగుదురు దా ననఁగఁ
బాయక బసవనిఁ బ్రస్తుతించినను – బాయుట సోద్యమే భవబంధనములు
బసవండు కేవలభక్తుఁడే తలఁప – నసమాక్షుఁడారూపమై నిల్చెఁగాక
బసవఁడు వసుధపైఁ బ్రభవించునంత – బసవని నరుఁడని పలుకంగఁదగునె?
హరుఁడు [13]నిరాకారుఁ డైనచో బసవఁ – డరయంగ సాకా[14]రుఁడై చరియించు
హరుఁడు సాకా[15]రుఁడై యలరుట సూచి – శరణుఁడై బసవండు సందు లేకుండు

1.నాఁగ 2. ఈ ద్విపద కర్థమస్పష్టముగా నున్నది. 'సోలకు' అని యుండవలెనేమో! 3. కంటెఁ 4. ముల్ మెఱసి 5. సకల. 6. లోని 7. ననఁగ 8. తప్పునా 9. భాగ్యంబులొందు 10. బసలారు 11. వేయేమి 12. బిలనొక్క 13. నిరాకారమైయున్న 14.రమై 15. రమై.

శరణుఁడై బసవండు సందు సేకొన్నఁ – బరమభక్తి స్థితి బసవన్న గొలుచు
భక్తుఁడై లింగంబు ప్రకృతి సేకొన్న – వ్యక్తిగా బసవన్న వరవుడు సేయుఁ
బరమాత్మరూప మా బసవఁడే యెఱుఁగుఁ–బరమేశుఁ డెఱుఁగు నా బసవనిరూపు
సాలోక్యసామీప్యసారూప్యపదవు – లోలిని బొంద సాయుజ్యంబుఁజెంద
వచ్చుఁగాకిల బసవస్వామి గాఁగ – వచ్చునే [1]పెఱపెఱవారలకెల్లఁ
బ్రమథాగ్రగణ్యుండు బసవఁడీశునకు – సమశీలభక్తుండు జంగమంబులకు
లింగదేవునకు ననుంగు బసవఁడు – జంగమకోటికి సడిసన్నదాసి; [2]
యెక్కంగ వాహనం బీ[3]శుకు బసవఁ;– డెక్క సింహాసనంబీశుభక్తులకుఁ
గాలకంధరు కరవాలు బసవఁడు; – శీలం[4]బు భక్తుల చేతియద్దంబు;
బసవని నేరి కొౌఁబ్రస్తుతి సేయ –[5] వసమె [6]యెవ్వరికైన బసవని నెఱుఁగ
సంపన్నుఁడై లింగజంగమంబందుఁ – బొంపిరిగొని పువ్వుఁగంపునై యుండుఁ
గావున బసవని గణుతింపరామి – దేవాసురులకైనఁదెల్లమై యుండు;
నెన్నంగ వేద్కకాఁడెఱుఁగునే దోస– మన్నట్లు గాక యాహవణి గీర్తింప
నిదియుఁ గోటికిఁబడగెత్తినవానిఁ – బదివేల కాఁపవై [7]బ్రదుకు మన్నట్టు
లాపరంజ్యోతి స్స్వరూపంబునకును – దీపకంభంబు లెత్తించినయట్లు
భవనిర్మితములైన పత్రపుష్పములు – భవునకుఁ దగ సమర్పణ సేయునట్లు
గాక కీర్తి[8]ంపఁగా నాకుఁ దరంబె – ప్రాకటంబుగ భక్తబండారి[9] చరిత?
మైనను [10]లోకహితార్థంబు గాఁగ – నా నేర్చుకొలఁది వర్ణన సేయువాఁడ
నవరస రసికత [11]భువినిఁబేరుగొన్న – శివకవిప్రవరులచిత్తంబులలర
నిప్పాట నితరులఁ జెప్పెడి దేమి – తప్పనఁదారులు దడఁబడఁబలికి
వెలసినచదువులు [12]వీటిఁబోరిత్త – పొలిసిపోయిరి తమపురులు [13]దూలఁగను
మృదుమహత్త్వముఁగానమిని బొంకులనఁగఁ – బడుఁ"గవయఃకింనపశ్యంతి"
(యనుట
యనుచుఁ గుకవుల గీటునఁ బుచ్చి పేర్చి – వినుతింతుఁ [14]దత్కథావిధ మెట్టులనిన:

1. పేర్వేఱు, పెదపెద్ద 2. దాసుఁడు–అనవలసినచోట నీతఁడు 'దాసి' యని ప్రయోగించుచు. "విష్ణుఁబాసి వ్యాసుఁడు శివుదాసి గాఁడె," నుతికి మెచ్చిచ్చెఁ గన్నులు గాళిదాసికి," నీదాసి నీలెంక నీడింగరీఁడ" చతుర్వేదసారసూక్తులు. "చెన్నారఁ గాళిదాసియు శివుచేతఁ। గొన్న–(కాళిదాస కవినిగూర్చి) పండితారాధ్య 4.ప్రకరణము 31పుట 3.జెప్పు డీశ్వరునకెక్క. 4. పు. 5.బసవని నెవరికి నెఱుంగ 6. రుమహిమ 7. ప్రబలు 8. తునా గానాఁ 9. భక్త. 10. ని బేర్కొన్న 11. దారలు (తప్పనదారులు?) 12. వీటఁబో 13. మాలఁగను 14. నిక్కథవిధ.



# ప్రథమాశ్వాసము

## కథారంభము

[1]శ్రీకీర్తిసంచితాంచితవరభక్తి – సాకార! వినమితామాత్య సంగాఖ్య!
శ్రీరజితాచలశృంగంబునందు – మారారి యుమయును [2]మానిత క్రీడఁ
దగిలినసుఖ [3]సత్కథావినోదమున – సొగయుచు నున్నెడ శుద్ధశివైక
మానసు[4]లగు నుపమన్యుఁడు భృంగి – యానందికేశ్వరుఁ డాదిగాఁ గల్గు
ప్రమథులు గొలువంగఁ బరిమితంబైన – సమయోచిత మెఱింగి చనుదెంచి ప్రీతి

### నారదుఁడు కైలాసమున కేఁగుట

నారదుండను మునినాయకోత్తముఁడు– భూరిసర్వాంగముల్ భువిఁబొందమ్రొక్కి
ముకుళితహస్తుఁడై మ్రొక్కుచు మఱియు– సకలలోకాలోక చరితంబు లెల్ల
విన్నవింపఁగ నున్న [5]కన్నెర్గి శివుఁడు– వెన్నెలగలకంట [6]వీక్షింపుచున్న
యవసరోచితమున నంబికాదేవి – శివుననుమతమునఁజేసన్నఁబిలిచి
"పోయివచ్చినకార్యములు విన్నపంబు– సేయు[7]మీ వున్నట్లు శివునకు" ననిన
నమ్మునీశ్వరుఁడు మహాలింగదేవు– సమ్ముఖుఁడై కరాబ్జమ్ములు [8]మొగిచి

### నారదుఁడు శివునకు భూలోకవృత్తాంత మెఱిఁగించుట

"సకలలోకాలోకచరితంబు లెల్లఁ – బ్రకటితభక్తి నెప్పటియట్ల పరగు
నరలోకమున నుమానాథ! మీ భక్తి – చరితమేమియును విస్పష్టంబు గాదు.
తవిలి శివాచార[9]తత్పరులగుట – భవులతోఁ గొందఱు పలుకకున్నారు
లోకప్రపంచంబులోఁ గొందఱుండి –లోక [10]బోధకు లోను గాకున్నవారు
మఱికొందఱానందమగ్నులై తమ్ము– మఱచి లోకములకు[11]మఱపడ్డవారు
ఉన్నతసద్భక్తియుక్తులై కొంద – ఱున్నారు తమతమయొడళులు డాఁచి
యిది కారణముగాఁగ నీశ! మీ భక్తి – తుద మొదలిది యనఁ దోఁప దెవ్వరికి
నందు దృష్టప్రత్యయంబులవలన – సందియంబులు దక్కి సద్భక్తియుక్తి
సుస్థిరలీల లింగస్థలజంగ – మస్థల తత్ప్రసాదస్థలంబులను
సంపన్నులై జగజ్జనులెల్ల భక్తి– సొంపునఁ జుబ్బనఁజూఱలఁ దేల
నీవ ప్రసన్నుండవై వచ్చిలోక – పావనంబుగ భక్తిఁబాలింపవలయు"

1. పెక్కుప్రతులలో నీ ద్విపదము కానరాదు. 2. మానవ 3. 'సంకథా' అని యుండఁదగును. 4.ఁడగు 5. కన్నెర్గి యతని; కన్నెఱింగతని, 6. తత్సమధాతువులకుఁగూడ శత్రర్థమున 'నింపు' గలదు. 7. నీవు 8. మోడ్చి 9. తత్పరత్వమున 10. బాధకు 11. మఱుపడ్డ.

## శివుఁడు పార్వతితో నందికేశ్వరుని వృత్తాంతము చెప్పుట

[1]నని విన్నవించిన నద్దేవదేవుఁ – డనురాగచిత్తుఁడై యతనికిట్లనియె
"నందికేశ్వరునకు నాకునొక్కింత– సందు లేకునికి నిస్సందేహ మగుట
నీతనిఁబుత్తెంతు నితనిచేఁబరమ– పూతమై లోకంబు [2]బోధంబు వడయు"
ననవుడు గిరిరాజతనయ ప్రాణేశుఁ – గనుఁగొని ముకుళితకరకంజ యగుచు
"నందికేశ్వరునకు నాకు నొక్కింత – సందు లేకునికి నిస్సందేహ మనుట
[3]భక్తైకతనుఁడవై పలికిన విధమొ?– వ్యక్తిగా నతఁడు నీవై యున్నవిధమొ
యానతి [4]యి "మ్మని యంబిక యడుగ– నా నారదుడు విన నభవుఁడిట్లనియె
"అగునగు నట్టిద యంబుజనేత్రి[5]– తగుఁదగు భక్తైకతనుఁడ నట్లగుదుఁ
జెప్పెద వినుము విశేష [6]మింకొకటి – దప్పదే నతఁడన తర్కించి చూడ
నేమికారణ మనియెదవేని వినుము – తామరసానన! తత్కథాయుక్తి

## శిలాదుని తపస్సు

యాది ననేకయుగాదులనాఁడు – నాదరికమున శిలాదుఁ [7] డనంగఁ
దాపస ముఖ్యుండు దపమొనరించె– శ్రీ పర్వతంబు నైరృత్యభాగమునఁ
గందమూలాదులు గాలియు నీరు– నిందురశ్మలును[8] దినేశరశ్మలును
నాహారముగఁ ద్రికోట్యబ్దముల్ సలిపి – సాహసంబున మరి శతకోటియేఁడు
లావంతశిల తనకాహారముగను – భావించి ఘోరతపంబర్థిఁజేయ
నతనికిఁ బ్రత్యక్షమై యేము నిలిచి – మతి నిష్టమెయ్యది మమువేఁడుమనిన
నత్తఱి నతఁడు సాష్టాంగుఁడై మ్రొక్కి – చిత్తంబులోఁ బ్రీతి సిగు[9]రొత్తి నిగుడ
"సర్వజ్ఞ! పశుపతి! శంకర! శర్వ!– సర్వలోకేశ్వర! శాశ్వత![10] సాంబ!
అవధారు వేదవేదాంతావగమ్య! – అవధారు విన్నపంబాశ్రితసులభ!
శ్రీ మన్మహా[11] దేవ! శివలింగమూర్తి! – యేమిటఁగొఱత యేస్వామి![12] మీ కృపను
నైనను నాకొక్కయభిమతంబైన – దాని వేఁడెద మహాదాని! యీక్షణమ
నీయట్టివానిని నిజభక్తజనప– రాయత్త! [13]సుతుఁగా దయామతి నొసఁగు"
మనవుడు నతనికి నభిమతార్థంబు – నొనరింప [14]నున్నంత వనజాక్షి! వినవె!

1.యని 2. బోధింపఁబడును 3. భక్తవత్సలుఁడైన 4. యిండని 5. అంబుజనేత్రి యనుట పాణినీయముచొప్పున సరికాకున్నను, దెలుఁగున ననేకకవీశ్వరు లట్లే ప్రయోగించిరి. 6. మిందొకటి 7. డు నాఁగఁ; డనాఁగఁ 8. దివసేంద్రురశ్మలును 9. రారి 10. రూప. 11. లింగశివదేవమాకు– నే. 12. నీ. 13. త్తు,ణ 14. నున్నెడ.



అంతటఁ బోవక యాశిలాదుండు – నెంతయు భక్తితో నిలఁజాఁగి మ్రొక్కి
"యభిమతంబగు పుత్త్రునర్థినిత్తేని – యభవ! [1]నీ [2]భక్తియందణుమాత్రమైనఁ
దక్కువ [3]గలిగినఁదల [4]ద్రుంచివైతు – నక్కుమారునకు నీ వడ్డమైయున్న
నట్టేనిఁగొడుకు నిమ్మటు గానినాఁడు –[5]నెట్టణ నేనొల్ల నీ యిచ్చువరము"

## శివుఁడు శిలాదునకు వర మొసఁగుట

నంచు విన్నప మాచరించుడు నతని– సంచితభక్తికి సంప్రీతిఁ బొంది
యాదిసృష్టికి మున్ననాదియై పరగు – నాదిమదీయాంశమగు వృషభంబు
ధర్మరూపమనఁ గృతయుగంబునందు – ధర్మంబు నాల్గుపాదంబుల నడచు
రమణతోఁద్రేతాయుగమునను ధర్మ – మమరఁగ మూఁడు పాదములను నడచు
జగములో ద్వాపరయుగ[6]మందుఁ బాద– యుగమున ధర్మనియుక్తిమై నడచుఁ
బొనరుచుఁ గలియుగంబున నొక్కపాద– మునను జరించు [7]ధర్మనిరూఢి వెలయఁ
దగిలి యిమ్మాడ్కిని ధర్మస్వరూప–[8]మగుట లోకహితార్థుఁ డగు నట్లుఁగాక
పూని ద్వితీయశంభుం డనుపేరఁ– దా నిత్యుఁడై పరమానందలీల
మాకు వాహనమై ప్రమథ ముఖ్యుఁడయ్యు– గోకులపతియయ్యు శ్రీకరమహిమ
వెలసిన యయ్యాదివృషభేంద్రుఁజూచి– "నలి శిలాదునకును నందీశుఁ డనఁగఁ
బుట్టుము; నీవొండెఁ బుట్టంగవలయు– నట్టుగా కేనొండెఁ బుట్టంగవలయు
రూపించి ధర్మస్వరూపులై మహిమ– నేపారుప్రమథగణేంద్రులందెల్ల
మక్కువ పెక్కువ [9]మద్భక్తియుక్తి– యెక్కు[10]వగాఁగ నీ కిచ్చినవాఁడఁ
గాన మిక్కిలిభక్తి గలయట్టిపుత్రుఁ– గాని శిలాదుండు దా నొల్ల ననియె
నిచ్చినవరమింక నేఁదప్పనేర –నచ్చెరువంద మా[11]యనుమతిఁజేసి
పుట్టు ద్వితీయ[12] శంభుండనఁబుడమి– "నట్టిద [13]కా" కని యానందలీలఁ

## నందికేశ్వరుని యవతారము

బుట్టె నయోనిసంభూతుఁడై యతని– కిట్టలంబుగ నందికేశ్వరుఁ డనఁగఁ
బుట్టఁగఁ దోడనె పుట్టె మద్భక్తి – పుట్టక యటమున్న పుట్టె మచ్చింత
పరమతత్త్వామృతం [14]బయ చన్నుఁబాలు– గురుపదధ్యానవిస్ఫురణయ వెన్న

1.మీ. 2. భక్తికి నణు. 3. యైనను 4. దున్మి 5. నెట్టన 6.మున 7. ధర్మువునన వెలసిత 8. మగుచు 9.మాభక్తి 10. యెక్కుడు 11. యానతిఁబోయి 12. శంభుఁడవనఁ 13. కాకంచునానంద 14. ఇట్టి రూపము భారతమందున్నది "దరకొని తెగఁగాల్చునట్టిదయ యగుఁజుమీ!" – ఉద్యోగ. ద్వి–ఆ. ప 197.

వేదాంతసూక్తుల వెడ [1]దొక్కుఁబల్కు - లాదిశివాచారమదియ వర్తనము
గాను మదీయాంఘ్రికమలంబు లాత్మ - లో ని[2]డుకొని భక్తిలోలత్వమెసఁగ
బలువిడిఁబాఱునేఱుల నట్టనడుమఁ - జలికాలమెల్లఁ బుక్కిలిబంటి నిలిచి
యేకపాదాంగుష్ఠమిలమీఁద మోపి - యాకసంబునకు ముఖాంబుజ మొగ్గి
వర్షంబు [3]భోరన [4]వఱుగొని కురియ - హర్షంబుతోడ నల్లాడక నిలిచి
మేదినిఁదలమోపి మీఁదికి రెండు - పాదంబు[5]లను నెత్తి పంచాగ్నినడుమఁ
దలఁచిన డెందంబు దాపంబుఁ బొందఁ - బలికిన నొరెల్లఁబటపటఁబగులఁ
జూచినతెప్పలు సుఱచుఱఁగమర - నేచినయెండల నెడపక నిలిచి
భువియు వడంక నంభోనిధులింక - రవిశశుల్ గ్రుంకఁగూర్మంబు దలంక
దిక్కరీంద్రులు ద్రుంగ దిక్కులు గ్రుంగ - నక్కులాద్రులుస్రగ్గ నహిపతి మ్రొగ్గ
దిక్పతుల్ బెదర నద్దివియెల్లనుదర - వాక్పతి యదర నధ్వరములు సెదర
హరితల్లడిల్ల బ్రహ్మాండముల్ డొల్ల - ధరనుల్కములు (లును?) దుల్ల సురలుభీతిల్ల
నపరిమితంబైన యతివీర ఘోర - తపమాచరించెఁజిత్రము చిత్రమనఁగ;
నంత భయభ్రాంతులై యజాచ్యుతులు - సంతాపచిత్తులై సకలదేవతలు
గ్రక్కున మాయున్నకడకు నేతెంచి - మ్రొక్కి సాష్టాంగులై మోడ్పుఁగేలమర
"దేవ! దేవేశ్వర! దేవతారాధ్య! - దేవచూడామణి! దేవాధిదేవ!
పరమభట్టారక! పరమస్వతంత్ర! - పరమేశ! పరమాత్మ! పరమ! పరుండ!
శంకర! పంకజసంభవాద్యమర - శంకర! దురితభయంకర! యభవ!
యక్షయ! సర్వజ్ఞ! యఖిలలోకైక - రక్షక! దక్షమఖక్షయ!దక్ష!
యని మమ్ముఁ గీర్తింప నచ్యుతాదులను - గనుఁగొని యేమును గన్నుల నవ్వి
"యింత సంతాపింప[6]నేటికి మీకు - భ్రాంతిఁ బొందిన[7]వెఱ్ఱిపశుజీవులార!
[8]నందీశ్వరుఁడు సేయునవ్యతపంబు - చందంబు సూచియో శంకించి రాక
చీరికిఁ గైకొన్నె శ్రీప! నీ పదవి - కోరునే బ్రహ్మ! నీ [9]కొండుకపదవి
ఓరి దేవేంద్ర! నీ [10]యొడఁబడుపదవి - [11]పే రతఁ డెఱుఁగునే పెక్కు లేమిటికిఁ
ననుఁగాని యాతండు నాపదంబైన - మనమునఁ దలఁపడు [12]మా భక్తులాన"
యనుచుఁ బ్రసన్నుండనై యేను వారి - మనముల దిగులెల్ల మాన్పంగఁ దలఁచి
యందఱుఁ గొలిచిరా నచటికిఁబోయి - నందికేశ్వరుడాయ ముందట నున్న

1. ద్రొ. 2.డి 3. జోరన 4.వలగొని 5. లెత్తుక 6. నేఁటికి 7. యట్టి 8. నందికేశ్వరుచేయు 9. కొండొక 10. యొడిఁబడు 11. పే రాతఁ డడుగునే 12. మా కన్నులాన మా భక్తులార.



నతఁడంతరంగంబునందు నన్ గాంచు - గత దేటతెల్లయై కానవచ్చుటయు
నప్పుడచ్చెరువుఁబ్రహర్షంబు భక్తి- ముప్పిరి గొని మనంబున నుల్లసిల్ల
సాష్టాంగమెఱఁగి మదంఘ్రికంజములు- హృష్టుఁడైనెన్నుదురిఱయంగ మ్రొక్కి
యానంద బాష్పపూర్ణాస్యుఁడై కలయ- మేనురోమాంచ సమ్మిళితమై తనర
గద్గదకంఠుఁడై కరములు మొగిచి- తద్గతచిత్తుడై తాఁబ్రస్తుతింప
"మెచ్చితి వరము నీ కిచ్చితి వేఁడు - మిచ్చ యెయ్యది నందికేశ్వర!" యనిన
దరహాస[1]కాంతి వక్త్రమునఁ [2]దుల్కాడ - నరుదొంద మాకు నిట్లని విన్నవించె
"బెన్నిధి యుండగమన్నడుగుదురె?- ని న్నొండు వేఁడెడు [3]నిర్గుణి గలఁడె?
పదవులు గిదవులు పనిలేదు నీదు- సదమలభక్తిఁ బ్రసాదింపు[4] దేవ?"
యనిన గాఢాలింగనావలి నతని- తనువు నా తనువునఁ బెనఁగొల్పి యంత
"భవదీయగాత్ర సంస్పర్శన సుఖము- నవక మెక్కఁగ వాహనం బగు మిట్లు
ఆది మదీయవాహనమవు నీవు- వేదాంతనుత! మహావృషభేంద్ర!" యనుచుఁ
బ్రమథేంద్రపదవికిఁబట్టంబు గట్టి- యమిత సర్వజ్ఞత్వమప్పుడిచ్చుదును
నంతట శ్రీధరుఁడంతట నజుఁడు- నంతట దేవేంద్రుఁడంతట సురలు
[5]ధరఁజాఁగఁబడి మ్రొక్కి కరములు మొగిచి- శరణంచు నందికేశ్వరునిఁగీర్తింప
నతఁడు దయామతి నల్లన నగచు- నతగులౌ సురలను నరవిరికంటఁ
జూచె భయంపడు సురలుఁ దొల్లింటి- యేచిన భీతివోఁజూచినయట్లు
శ్రీగిరినైరృత్యభాగంబు పుణ్య - భాగ మా క్షేత్రంబు పరమపావనము
నందికేశ్వరుని పుణ్యతపంబుచేఁత- '**నందిమండల**' మను నామంబుఁదాల్చె
నచ్చట వర్తించునఖిల జీవులకు - నిచ్చితి నపవర్గమిందీవరాక్షి!
దొరకొను నందికేశ్వరుచరితంబు- విరచించువారికి విన్నవారికిని
నచలితబుద్ధి దృష్టాదృష్టసిద్ధి - ప్రచురవచశ్శుద్ధి భక్తిసమృద్ధి
యిట్టిద కావున నీ నందికేశుఁ -డెట్టున్న నేన కా[6] కేల యొండొకఁడె?"
యని యానతిచ్చుడు నఖిలాండపతికి- ననురాగమున జగదంబ కేల్మోగిచి
యన్నందికేశు నందంద చూచుచును - మన్నన దైవాఱ మఱియు నిట్లనియె
"ఈ నిరహంకార మీ సదాచార - మీ నిరంతరభక్తి యీ ప్రభుశక్తి
యీ సిద్ధపాండిత్య మీ నిత్య [7]సత్య- మీ సుకుమారత్వ మీ యాత్మతత్త్వ

1.లక్ష్మి 2. దొ. 3.నిగ్గిండి 4. నాకుఁన 5. ధరణిఁ జాఁగిలి 6. కెలమినొఁడొకఁడె 7. సత్త్వ.

మీ శుద్ధచారిత్ర మీ పుణ్యగోత్ర – మీ శుభాంచితమూర్తి యీ లసత్కీర్తి
యేరికిఁగల్గునే యెన్నిభంగులను – గారవింపఁగ నీవు గానివారలకు
నిన్ను [1]ధరింపంగ నీకె కాకొరుల – కెన్నంగ శక్యమే యీశ! [2]సర్వేశ!
అట్టిద కాక నీ యంశంబు గాని – యట్టివాఁడింత నీ [3]కనుగులం బగునె!”
యనుచున్న గిరిరాజతనయ వాక్యములు – విని ముదితాత్ముఁడై విశ్వేశ్వరుండు
నారదుదెసఁజూచి “నందికేశ్వరుని – గౌరవమహిమ విఖ్యాతిని వింటె”
యనుచు నానందీశు నధికదయార్ద్ర – వనధిఁ[4] దేల్చుచుఁ గనుఁగొనుచున్న యెడను
నెంతయు భయము నొక్కింతయుఁజూపు – నెంతయు సిగ్గు నొక్కింతయు ముదముఁ
దనకు భూషణములై తనరారుచుండ – గనుఁగవ హర్షాశ్రుకణములు దొరుగ
సులభరోమాంచకంచుకితాంగుఁ డగుచు – దలఁపున డెందంబు దటతట [5]నదర
మస్తకవిన్యస్తహస్తుఁడై తన్నుఁ – బ్రస్తుతింపుచు నున్నప్రభు నందికేశుఁ
గనుసన్నఁ జేసన్నఁ గదియంగఁ బిలిచి – తన నిర్మలప్రసాదముఁగృపచేసి
నెయ్యంబుఁగరుణయు నిండి వెల్విరియ – నయ్యంబికాధవుఁడతనికిట్లనియె.

### శివుఁడు నందికేశ్వరుని మర్త్యమున బసవేశ్వరుఁడుగా జనింపఁ బంపుట

“ఇది శ్రుతిస్మృతిమూలమిది ధర్మశీల – మిది విమలాచారమిది [6]తత్త్వసార
మిది సుమహత్త్వ(హాత)త్వమిది కృతార్థత్వ – మిది యాదిపథమని విదితంబుగాఁగ
నీ కతంబునన నిర్ణీతమై భక్తి – లోకంబునందవలోకింపఁబడియెఁ
బ్రమథాధిపతులకుఁ బార్వతీసతికి – విమలమదీయతత్త్వముఁ బ్రబోధించు
తెఱఁగునకంటెను దెల్లంబుగాఁగ – నెఱిఁగించితిమి [7]నీకు నెక్కుడుఁ గూర్మి
నట్టిద; సర్వజ్ఞుఁ డనుపేరు నీకు – [8]నిట్టట్టునా వలదెల్లచోఁజెల్లుఁ
గాన యామర్త్యలోకమ్మున కరిగి – పూని ద్వితీయశంభుండన మహిమ
వ్యక్తిగా లోకహితార్థంబు సకల – భక్తహితార్థంబు పరమార్థముగను
మా వినోదార్థంబు మర్త్యంబుఁబరమ – పావనంబుగఁ జేయు బసవఁడన్పేర”
నావుడుఁ [9]గేల్మోడ్చి నందికేశ్వరుఁడు – దా విన్నపము చేసె దేవదేవునకు
“మీ యాజ్ఞఁదలమోచి [10]మెయికొని పనులు – సేయుదు నన్నింత సెప్పంగనేల?
[11]మర్త్యలోకమునకు మఱి వేఱె యొకఁడు – గర్త యున్నాఁడె లోకత్రయవరద!

1.భరింపంగ 2. మహేశ 3. కనుగలం 4.ముంచుచు 5. నుదర 6. ధర్మ, పుణ్య 7. నీక యెక్కుడుఁ 8. నిట్టట్టనా 9. గేల్మొగ్చి 10. మేదినిఁబ 11. ఇట్టి ప్రాసముల నీ కవి పెక్కుచోట్లఁ బెట్టియున్నాఁడు.



ఇందున్న నేమి? నా కందున్న నేమి? – యెందున్న నేమి? నీయందు నా యునికి.”
అని విన్నవించిన యా నందికేశు – వినయోక్తులకు జగద్విభుఁడిట్టులనియె,
“గురులింగమూర్తిఁజేకొని వచ్చియేన – పరమతత్త్వార్థతత్పరుఁజేయువాఁడఁ
బ్రాణలింగంబనై భ్రాజిల్లి నీదు – ప్రాణాంగముల నొడఁబడి యుండువాఁడ
రూఢిగా జంగమరూపంబుఁ దాల్చి– వేడుక [1]నినుఁగూడి విహరించువాఁడఁ
దను మనోధనములు [2]దారవోకుండఁ – [3]దనుఁ జేర్చికొనువాఁడ ననఁగి పెనంగి
నా ప్రాణములకుఁబ్రాణంబగుచున్న – నా ప్రమథులకుఁ బ్రాణంబగు నీకు
నాకును సందొక్కనాఁడు లేకునికి – నీకుఁ దెల్లముగాదె లోకపావనుఁడ!”
అని యీఱడిలఁ బల్కునాశంకరునకుఁ – దనువెల్లఁ జేతులై తా మ్రొక్కి నిలిచి
“విన్నపంబేఁ బనివినియెద” ననుచు – నన్నందికేశుండు సాష్టాంగమెఱఁగి
ప్రమథసన్నిహితుఁడై భ్రాజిల్లు శివుని – నమిత తేజోమూర్తి నాత్మలో నిలిపి
నరలోకమల్లదె నా నింతనంత – నరుదెంచె రయమున; నంత నిక్కడను
గురుతరంబైన శ్రీగిరిపశ్చిమమున – నరనుతం బగుచుఁ గర్ణాటదేశ మనఁ
గడు నొప్పునందుఁ బ్రఖ్యాతసద్భక్తి – సడి [4]సన్నహింగుళేశ్వర[5]భాగవాటి
యను నగ్రహారంబునందు విఖ్యాతి – మనుచుండు **మండెఁగ మాదిరా జనఁగ;**
నతని పరమసాధ్వి యతివ **మాదాంబ** – సతతశివాచార సంపన్నధన్య
కొత్తడి [6]నెల్లను గొండొక్క వెద్ద – యుత్తమురాలు ధర్మోపేతగాత్రి
యెల్లవారలకంటె మొల్లంబునందు – నల్లవో యనుజీవనంబునఁ బొదలి
కొడుకులు లేమికిఁ గడు [7]దుఃఖి యగుచు – వెడనోము [8]లన్నియు వేసర నోమి
యాద్యులు వొత్తంబులందెల్ల వెదకి –“హృద్యంబుగా నందికేశ్వరునోము
కామ్యార్థసిద్ధికిఁగారణం”బనుచు – సమ్యగ్వ్రతస్థితి సతికిఁజెప్పుటయు
నమ్మహాత్ములు సెప్పినట్లుగా గుడికి – నిమ్ములఁజని నందికేశ్వరుఁజూచి
సర్వాంగములు ధర సంధిల్ల మ్రొక్కి – ‘సర్వజ్ఞ! నందికేశ్వర! దయాంభోధి!’
యంచుఁబ్రస్తుతి చేసి యతిభక్తి మ్రొక్కి – యంచితవ్రతచర్యలాచరింపుచును
నిమ్ముల సోమవార మ్మాదిగాఁగఁ – దొమ్మిదిదినములుత్సుకవృత్తి నోఁచి
మఱునాఁడు నందిని మజ్జనంబార్చి – గుఱుతైన చందనకుసుమంబు లిచ్చి

1.నీ తోడ 2. దారువోకుండ 3. నను 4. సను 5. భాగవాడ, భోగవాడ 6. లోనెల్ల, లోపల 7. ఈ కవి యిట్లు స్త్రీలింగ రూపముండవలసినపట్లఁ బుంరూపముకూడఁ బ్రయోగించును. 8. లొగిఁ గొన్ని.

మెత్తనివస్త్రముల్ మెయినండఁ[1]గప్పి – యుత్తమాభరణంబులురుగజ్జియలును
నందెలు[2]గంటలు నలవడఁగూర్చి – పొందుగాఁబసిఁడికొమ్ములు [3]గొరిజియలు
వెట్టి ఫాలంబునఁబట్టంబు వెలయఁ – గట్టి నందికి నలంకారంబు సేసి
యక్షతధూపదీపాదులొనర్చి – యక్షణంబున బంచభక్ష్యముల్ [4]కుడిపి
పులగంబు ముందటఁ [5]జబ్రోవగాఁబోసి – పులకండమును నెయ్యిఁ గలపి యర్పించి
పరమమాహేశ్వర[6] ప్రతతికి నెల్ల – బరిణామ మంద సపర్యలు సేసి
"నందీశ! [7]నందీశ! నవనందినాథ! – ఇందుకళాధరు నెక్కుడుఁగుఱ్ఱ!
నా యన్న! నా తండ్రి! నా యాలఱేఁడ! – నీ యట్టి సద్భక్తు నీ యట్టిపుత్త్రు
ఖ్యాతిగా నొక్కనిఁ గరుణించితేనిఁ – బ్రీతి యెలర్ప నీ పేరిడుదాన"
ననుడు నప్పుడు **మాదమాంబకు** నంది – జనులెల్ల నెఱుఁగఁ [8]బ్రసాదంబు వెట్ట
నక్కున మోమున నా ప్రసాదంబు – మక్కువ నెక్కొల్పి మఱి మౌళిఁదాల్చి
మ్రొక్కి నిజావాసమునకు నేతెంచె – నెక్కుడు శుభచేష్ట లెదురుకొనంగ
నంత నెప్పటికంటె ననురాగరసము – వింత వేడుక వుట్టి వెలఁదియుఁ బతియు
లీల వర్తిల్ల; మున్భూలోకమునకు – బాలేందు శేఖరుపనుపునఁ జేసి
వచ్చిన నందికేశ్వరుఁడాత్మలోన – నచ్చెరువంది తా నరుదెంచుపనికి
ననుగుణంబుగఁ దన్నుఁ దనయునిఁగాఁగ – వనజాక్షి [9]నోమె నేమని చెప్పవచ్చుఁ
దలఁచిన కార్యంబు దలకూడె ననుచు – వెలఁదిగర్భమునఁ బ్రవేశింపఁ దడవ
మగువకంతట నెల మసలెఁ దోడ్తోన – తగగర్భచిహ్నముల్ [10]దా నంకురించె
నమృతాం[11]శుఁడగుపుత్త్రుఁడతివగర్భమున – నమరియుండుట[12]నొక్కొయాఁకలిగాదు
జలజాక్షి కడుపున సద్భక్తిరుచికుఁ – డలరుటనో రుచులరుచులై తోఁచె;
బాండురాంగునిమూర్తి పడఁతిగర్భమున – నుండుటనో [13]వెలరొందె మైదీఁగె
పడఁతిశీలపుఁజూలు భవిపాకములకు – నొడఁబడకునికినో యోకిళ్లు వుట్టెఁ
గ్రాలుచు సుతునిరాకకు నోరు దెఱచు – లీలనో సతికావులింతలు వుట్టె
శివమూర్తి దనకు లోనవుటనో తవిలె – శివయోగనిద్ర నాఁ జెలువకు నిద్ర
కాలకంధరుమూర్తి గడుపున నునికి – నో లలితాంగి చన్మొనలు [14]నల్పెక్కెఁ
బెనుపుగ శివమూర్తి వనితగర్భమునఁ – దనరనో నడుము పేదఱిమి వోనాడె

1.గట్టి 2. మువ్వలు 3. గొరిజెలును 4.వెట్టి 5. ప్రోక, 6.ప్రకరంబు కెల్ల 7. నందన్న 8. బ్రసాదించినంత 9. నోఁచె 10. మంకురించె 11. గు 12. నకో 13. వెల్లనొందె 14. గప్పారె.



యోగీంద్రహంసుఁ డయ్యువిదగర్భమున – రాగిల్లుటనొ నడ వేగంబు వదలె
ననఁగ మానినిగర్భ మంతకంతకును – నినుపారి తనుపారి [1] పెనుపారి పొదలి
నవమాసములు నిండ నందీశమూర్తి – నవకమై కడుపులోనన [2]మవ్వమొందె
జనని గర్భావాసమను గుహాంతరమ – తన సమాధికి సుఖస్థానమై పరగ
సిద్ధపద్మాసనాసీనత నతివి – శుద్ధాత్ముఁడై భూతశుద్ధికిఁ జొచ్చెఁ
గడవ నూకుచు నుదకముఁ బాఱఁజల్లి – యదర నెబ్బంగినో యగ్ని దా నేర్చె
బూది దా రాఁజదు పొగయదు తాను – నూదండు ముట్టించె నొక్క దీపంబు
నొప్పుదీపమునఁ దా నున్నయిల్లెల్లఁ – గప్పుగాలకయుండఁగాల్చె లోపలన
"యిలఁగాలు మోపందు నిట్టిబిడ్డండుఁ – గలఁడమ్మ!" యనుచు శత్రులును మిత్రులును
దమతమ పట్లను దా రుండు నోడి – భ్రమితులైకనుకనిఁబాఱుచునుండ
నచ్చుగాఁ దాఁ జౌదళాబ్జంబుఁ గడచి – వచ్చి త్రికూటంబు వసుధపై నిలిచి
సచ్చరిత్రత సుప్తసర్పంబుఁ జోఁపి – క్రచ్చఱ షడ్దళకమలంబు నొంది
కర మర్థి దశదళకమలంబుఁ బొంది – పరగ ద్వాదశదళపద్మంబుఁజెంది
షోడశదళపద్మసురుచిరసౌఖ్య – [3]కేలీవిలోలుఁడై[4] యొలలాడుచును
దాఁటి యాద్విదళపద్మంబునఁ దన్ను – [5]నాఁటించి సచ్చిదానందంబు నూని
చనునధోముఖమగు షట్కమలములు – మునుకొని యిట్లూర్ధ్వముఖములై తనర
నిశ్చలకోదండ నిజగతి నున్న – పశ్చిమనాళ [6]సంభవమైనయట్టి
నాదంబునకుఁ జొక్కి నగముపై మ్రొక్కి – మోదంబునకుఁజిక్కి ముందఱ నిక్కి
సరినూర్ధ్వముఖసహస్రదళాంబుజాత – మరయ నధోముఖమై మించి వెలుఁగ
దివ్యుఁడై షోడ[7]శాంత వ్యోమచంద్ర – భవ్యసుధాపానపారవశ్యమున
నాతతంబుగఁ బరంజ్యోతిస్స్వరూప – మై తన వెలుఁగ వెల్గె వెల్గుచుండ
బలువు ఆ ప్రతిమగర్భంబులోపలను – వెలిఁగెడు దీపంబు విధమును బోలెఁ
బాండురాంగంబైన పడఁతిగర్భమునఁ –[8] బోఁడిగా వెలుగుచుఁ బుత్త్రుఁడీ క్రియను

1. నను 2. చెల్వమొందె, 3.క్రీడా 4. తేలనాడుచును 5. 'నాటు' నిరనుస్వారముగా శబ్దరత్నాకరమందున్నది వ. మీటుగలరథికులను నొక। నాటికి వేవురవధింతు నరుశరములు నో। నాటి పడవైచునంతకు। వేటాడెదఁ బ్రతిబలంబు వీరులనెల్లన్. భార. ఉద్యో. 4ఆశ్వా. ఈ పద్యమునుబట్టి శబ్దరత్నాకరకారులు నిరనుస్వారతను నిర్ణయించిరి. కాని దీనిఁబట్టియే సానుస్వారత సాధితమగుచున్నది. పయికందము నాల్గుచరణములందు ననుస్వారముండఁదగును. 'నాటు'లో ననుస్వారము కలదని పయిద్విపదప్రయోగము కూడఁ జెప్పుచున్నది. భీమఖండమం దీ క్రింది ప్రయోగముగూడ నున్నది. "నాఁటె మందారతరువులతోఁటలందు–" 4 ఆశ్వా. 6. సంబంధమైనట్టి 7. శాంతర్వోమ 8.ఈ కవి యిట్టిప్రాసము మఱికొన్ని చోట్లఁగూడఁ గూర్చినాఁడు

దగిలి శివధ్యానతత్పరత్వమున – మొగిఁదల్లికడుపులో [1]మూఁడేఁడులున్న
సుతభరాక్రాంతయై మతి శ్రమంబంది – సతి దొంటి నందికేశ్వరుగుడికేఁగి
"నోములు గీములు వేములఁగలిపి – నీ మర్వుసొచ్చితి [2]నిఖిలలోకేశ
మఱుఁగుసొచ్చినయట్ల మన్నించి నన్ను – మెఱయింపు సుతునీగి మేలయ్యె నేఁడు
పున్నెంబు సేసిన పొలఁతు[3]లు నెలల– నెన్నఁ దొమ్మిది మోచి కున్నలం గంద్రు
అల్లన మూఁడేఁడులయ్యె[4]నన్నింత – [5]యల్లటపెట్టెదోయన్న! నే నెఱుఁగ
దుర్భరంబైన యీయర్భకు[7] వలని – గర్భంబు కర్కటిగర్భంబు వోలె
నరయంగ నీ యిచ్చు [8]వరములు సాలు [9] నెర (రి?) వు మాన్పింపవే యేమియునొల్ల
నన్నెంత కెత్తుకోనున్నదో కాక – యెన్నఁడు విందుమే యిట్టిగర్భముల!"
ననుచుఁ దా నచ్చోట నచ్చోట నిలిచి – తనువు శ్రమంపడఁదనయింటి కరిగి
పాన్పుపై [10]నుస్సని పరితాపమంది – తన్పుగా నార్ద్రచందనవారిఁదోఁగి
నెవమునఁగనుమూసి నిద్రఁ[11]బొందుడును – నువిదకుఁగలవోలె నుక్షవల్లభుఁడు
జంగమలింగవేషంబొప్పఁదాల్చి – యంగన [12]కిట్లని యానతి యిచ్చె
"నీ మనస్తాపంబు నీవగ మాన్పఁ – గా[13] మించి వచ్చితిఁగమలాయతాక్షి!
"నీ కడ్పులో నున్న యాకుమారుండు – లోకపావనమూర్తిగాక కేవలుండె?
యాదివృషభము శిలాదునికొడుక; – యాదేవదేవుని యానతిఁజేసి
భక్తహితార్థమై ప్రభవించు నీకు – వ్యక్తిగాఁ జెప్పితి వగవకుమింకఁ
బుట్టెడుఁ బుత్త్రుండు; పుట్టఁగఁదడవ – పెట్టుమా బసవఁడ న్పేరు పెంపార"
నని యానతిచ్చిన నంత మేల్కాంచి – కనువిచ్చి [14]చూచుచుఁగాన కెవ్వరిని
"ఈతఁడు మన నందికేశుండు దాన – [15]యేతెంచెఁ గానోపు నింతయు నిజము
బ్రదికితి; నా జన్మఫలమెల్ల నేఁడు – తుదముట్టె" ననుచు సంతోషాబ్ధిఁదేలి
చెలులుఁ జుట్టములు నచ్చెరువంది వినఁగఁ – గల తెఱఁగంతయుఁ[16]గడువేడ్కఁ దెలిపి
యున్నెడఁ గోమలియుదరంబులోన – నున్న మహాత్మునిహృన్నలినంబు
దానయై వెలిఁగెడు తత్పరంజ్యోతి – వానిఁ బ్రబోధించి "వచ్చినపనులు
మఱచితే" యనవుడునెఱిఁగి సద్భక్తి [17]యఱ(ఱు?) కువ గాకుండ సాష్టాంగమెఱఁగి

1. మూఁడేండ్లు మున్న; 2. నిఖిలంబు నెఱుఁగ 3. తుకలెల్ల, 4.నన్నెంత 5.యల్లడ 6.యయ్య! 7.వలన 8.వరము పాలొడలి 9. యెర(రి)పు 10. నుహ్హని 11. జెందంగ 12.కప్పు డిట్లానతియిచ్చె 13. ముందె; మదె 14. చూచుడుఁ 15. యేతెంచెఁ గాఁబోలు. 16. దెలియఁ జెప్పుచును 17. యఱయు లేకుండంగ



ప్రీతిఁ బుత్త్రుఁడు మోద్పుఁజేతులతోడ – నా తల్లిగర్భంబునందుదయించె;
నర్ధోదయమునంద యతనిలో నున్న – యర్ధేందుమౌళి [1]గుప్తాకృతిఁ దాల్చి
యంగంబుపైఁ గడు సాంగంబుగాఁగ – లింగసాహిత్యంబు లీల నొనర్చె.
"వచ్చిన త్రోవ యెవ్వరుఁ గానకుండ – నెచ్చోట నుండియో యేతెంచెఁ దపసి
యిది యే [2]మొకో!" యని యింటివారెల్లఁ – బదరుచు నంత విభ్రాంతులైచూడ
ముడిచిన మడుపుఁగెంజడముడినడుమ – మృదుని చందంబులు వెడవెడ దోఁపఁ
గట్టిన వెలిపొత్తి కచ్చడంబెందుఁ – బుట్టనిరుద్రాక్షభూషణంబులును
రాగికుండలములు రత్నకంబ[3]ళియు – యోగదండంబునునొకచేత [4]గొడుగు
బూదిబొక్కసమును బొలుపారుమేని – బూదిపై నొప్పు త్రిపుండ్ర రేఖలును
దళతళమను మెర్గుపలువరుసయును – గలయ నొత్తిన[5] వాలుగడ్డంబుఁదనరఁ
దపసులరా జొక్కతపసిచందమున – నపుడు **మాదాంబకు** ననురాగమెసఁగ
"నిల్లకప్పడిసంగమేశ్వరంబందు – నెల్లప్పుడును నున్కి; యెట్టులంటేని
యేను **గూడలి సంగమేశ్వరు** పేర – కాన యాగుడిలోనఁ గదలకుండుదును
నా కొడుకొక్క జన్మమున నితండు – లోకహితార్థమై నీకుదయించెఁ
గాన వచ్చితిఁ జూడఁగా నీ భవమున – కేన చూ గురుఁడ నింకిటమీఁదటికిని
నీనందనునకు లింగానర్పితంబు – [6]లాన సుమీ యించుకంతైనఁ గుడుప"
ననుచు సదృశ్యుఁడై యరిగె నతండు – మనసిజహరుఁడు [7]దాఁజనఁగ నంతటను
బాలార్కకోటుల ప్రభలు గీడ్పుఱచు – బాలుని తేజంబు [8]వర్వుటఁ జేసి
సూచీముఖంబైనఁ జొనుపంగరాని – యేచినతిమిరంబు నెల్లమానవుల
యజ్ఞాన తిమిరంబు నావంతలేక – విజ్ఞానమయుఁగని వేగంబ పాయ
వేగక వేగినవిధమైనఁజూచి – రాగిల్లె నిఖిలంబు రవి [9] పాఁగె ముడిగె
జననియు జనకుండు సత్పుత్త్రుఁజూచి – యనురాగరసవార్ధి మునిఁగి యాడుచును
భక్తులఁబిలువంగఁబనిచి యిర్వురును – భక్తిఁ బ్రణామ [10]మేర్పడ నాచరించి
యిమ్ముల సింహాసనమ్మిడి తత్క్ష – ణమ్మ విభూతి వీద్యమ్ములర్పించి
పాదోదకంబులు వట్టిమైఁగడిగి – బూది ఫాలంబునఁబూసి పైఁజల్లి
పంచమహావాద్యపటలంబులులియ – నంచితాగణ్యపుణ్యాత్ముఁదత్సుతుని

1. గుర్వా 2. మకో!, 3. ళము 4. గొడుగు 5. డాల(?) 6. లానచూ! యంచుకయైనఁ గుడ్పినను 7. తా ననఁగ 8. పరగుటఁ జేసి 9. పాంగ్య, పొంక 10. మొప్పఁగ

బసవ నామంబిడి పతియును సతియు – నెసక మెక్కఁగ నున్న యెడఁ గుమారుండు
వెనుకఁజీకటి యుండఁదన కేటితేజ – మనుగతి దీపంబుఁగనుఁగొని నవ్వ
సన్నుతలింగప్రసాదమగ్నతన – యున్నట్లు చనుగుడ్వ [1]నూరక యుండు
శివసుఖామృతమును జేఁగ్రుమ్మరించి – చని [2]సూచుమాడ్కి హస్తములారగించు
శివపదధ్యాననిశ్చేష్టితావస్థఁ – దవులుచందంబునఁ దా వెఱఁగందు
బిలిబిలి సంసారమిలఁ [3]బాఱఁదోలి – [4]చెలఁగి యాడెడుగతిఁజేతులాడించు
మాయాప్రపంచంబు డాయంగనీక – పాయఁదన్నెడు రీతిఁబాదంబులార్చు
వడి మెయిఁదన పూనివచ్చినపనులు – దడవయ్యె ననుచు నుల్కెడుభంగి నులుకు
భవుఁ[5] బాడ నానందబాష్పంబు లొలుకు – పవిది నేడుచుఁగనుఁగవ నశ్రులొలుక
భవబాధలకు నగపడి మొఱవెట్టు – భవులకుయ్యాలించుభాతి నాలించు
నొడయలయడుగులఁ [6]బడి మొఱల్వెట్టు – వడువునఁ బుడమిపైఁ బడి బోరగిల్లు
నిల[7]మఱపడ్డ నిర్మలశివభక్తి – తలయెత్తువడువునఁ దాఁ దలయెత్తు
నరుదొందఁ బద్మాసనాసీనవృత్తిఁ – బొరి నభ్యసించుపొల్పునఁ గూరుచుండుఁ
బూని ద్వితీయశంభుండను నంది – నే నను భావన నిలఁ [8]దోఁగియాడు
నా **వీరమాహేశ్వరాచార** మెల్లఁ – బ్రోవయి నిల్చినపోల్కి నిల్చుండుఁ
గడఁకతో నాది మార్గము దప్పకుండ – నడుగిడులీలఁ [9]దప్పడుగులు వెట్టు
**మలహరుఁ** బేర్కొనుమాత్ర గద్గదము – లలరుకైవడి [10]దొక్కుఁబలుకులు వలుకు
బల్లిదు ల్మాశివభక్తులే యనుచుఁ – గ్రేళ్లువాఱుచు నాడుక్రియఁబాఱి యాడు
నంత[11] వినోదంపుటాటప్రాయమున – సంతతంబును శివార్చన మాచరించు
బుద్ధు లెఱుంగు లేఁబురులుప్రాయమున – సిద్ధంబు భక్తుల శివునిగాఁ దలఁచు
సర్వజ్ఞుఁడైన వృషభమూర్తిగాన – సర్వవిద్యలు సహజంబపాటిల్ల
గతభక్తియుక్తుఁడై గర్భాష్టమమున – సుతునుపనయనంబు శుభముహూర్తమునఁ
జేయుదునని తద్దఁ జిడిముడిపడఁగ, – నా యెడ బసవఁడిట్లని దండ్రికిని:–

## బసవేశ్వరుఁడు వడుగు వలదని తండ్రితో వాదించుట

"వడుగని యిది యేమి గడియించె దీవు – జడుఁడ వెట్లయితివీశ్వరునిఁ గొల్చియును
బరమాత్ముగురునిగాఁ బడసి దుర్నరుల – గురులని తలఁచుట నరకంబు గాదె?

1. చూరక. 2.యాను, 3. గూల, దూల 4. చెలఁగి యాడుగతిఁ జేతులు విచ్చి యాడు 5. జూడ 6. బడమొదల్వెట్టు 7. మర్వు (ఱు) 8. దొంగి 9. దట్టడుగులు (?) 10. ద్రొక్కు 11. వినోదంబులాట.



గతపూర్వజన్మసంస్కారుఁడై పిదప – వితతద్విజత్వంబు పతితంబు గాదె?
నిర్మలగురుకృపాన్వీతజన్మునకుఁ – గర్మజన్మంబు దుష్కర్మంబు గాదె?
యగ్గురుపాదంబులర్చించు నతని – కగ్గిలో హవి వేల్చుటది దప్పుగాదె?
మలహరాత్మకమగుమంత్రంబుఁ [1]గఱచి – పలుమంత్రములు [2]గొనఁబాపంబుగాదె?
శూలి భక్తులకెత్తుకేలది త్రాటి – మాలల కెత్తుట [3]మఱి తప్పుగాదె?
కర్మపాశంబులొక్కటఁదెగు నీల్గి – [4]కర్మంబుత్రాళ్లు దాఁగట్టుకోఁదగునె?
రుద్రాక్షభసితాదిముద్రలు దాల్చి – క్షుద్రముద్రలు దాల్పఁగూడునే చెపుమ?
యీ రీతిఁద్రాటికి దూరమైయున్న – వీరమాహేశ్వరాచారదీక్షితుని
నిర్మితోభయకర్మనిర్మూలు నన్నుఁ – గర్మాబ్ధి ముంచుట ధర్మమే నీకుఁ?
గ్రచ్చఱఁగన్నులఁగానవు గాక – వచ్చునే బసవని వడుగుసేయంగ
బ్రహ్మశిరోహరుఁ బ్రమథైకవంశ్య – బ్రహ్మ[5] వంశ్యుండని భావించె[6]దెట్లు?
జాతిగోత్రాతీతు సద్గురుజాతు – జాతిగోత్రక్రియాశ్రయుఁ [7]జేసె దెట్టు?
లకులస్థుఁడై యున్న యభవుని భక్తు – నికి నేకులం బని నిర్ణయించెదవు?
కావున నెన్నిమార్గములను వడుగు – గావింపఁగా రాదు కథ [8]లేమిచెప్ప"
ననవుడుఁదండ్రియిట్లనియెఁ బుత్త్రునికి – విన[9]వయ్య! బసవయ్య! విప్ర[10]మార్గంబు
నాగమవిధిఁ బదియా(దునా?) ఱుకర్మంబు – లాగర్భసంస్కార మాదిగాఁ గలవు
వానిలో నొకఁడైన నూన మౌనేని – కానేరఁడాతఁడగ్రకులోత్తముండు
అందు విరుద్ధ మెయ్యది రుద్రగణము – [11]నాందిముఖ్యంబుపనయనపూజకును
బనుగొనఁ బ్రణవంబు భర్గుఁడే దైవ – మనుటయు మంత్రంబు నట్లును గాక
పెట్టిన సూత్రముల్ భీమసర్పములు – పట్టినపాత్రంబు బ్రహ్మశిరంబు
పాలాశదండంబు వంకజోదరుని – కోలెమ్ము దలచుట్టు [12]కూఁకటుల్ జడలు
నటితికృష్ణాజిన మది గజాజినము – వఱలు మేధావియే నెఱిభూతి గాఁగ
హరుఁడు భిక్షాటనమాచరింపఁగ – నరిగిన వేషమింపారఁదాల్చినను
నట్టైనఁగాని బ్రాహ్మణుఁడు గాఁడనిన – నిట్టు విరుద్ధమే యీశు భక్తునకు?
వడుగుచేసిన భక్తి వట్టి పాటగునె?– నొడువరితనమునఁ గడవ నాడెదవు
[13]పసిబిడ్డమాటలు పనియు లేదింక – మసలక చేయుమీ మా చెప్పినంత

1. దలఁచి 2.గానఁ 3.మాలమి (ర్మి) గాదె 4. కర్మంపుఁద్రాళ్లు 5. వంశజుఁ 6. చుటె; చితె 7. జేయుటె, జూసితె 8. లేల 9. వన్న! బసవన్న! 10. మార్గమున 11. నందిముఖం 12. కూఁకటల్ 13. పసుబిడ్డ 'అని' యితరగ్రంథములందున్నది.

యిట్టిచోద్యంబు లే మెఱుఁగ మేనాఁటఁ – బట్టి! మా కడుపునఁ బుట్టితికాక
'ప్రాలు గల్గుసుపుత్త్రుఁ బడసితిమింక – మేలయ్యె'నని యేము లీల[1] నున్నెడను
బుట్టివాఁడ కులముపురులు వోనాడ –[2] నెట్టయ్య! తలఁచెదు పట్టి [3]మాయయ్య!
కులదీపకుఁడు పుట్టఁగులము వర్ధిల్లు – **గులనాపకుఁడు** పుట్టఁ గులమెల్ల[4]గ్రుంగుఁ
గులమునకెల్లను గుద్దలిఁగొంటి – [5]వెలిసేయరే నన్ను విప్రులు విన్న?
నిన్నుఁ జేపట్టి [6]యనీతిమై కులము – చెన్నఁటి! పోనాడి చెడనెట్లు వచ్చు?
యుక్తి సెప్పితిమిప్పుడొల్ల [7]వైతేని – భక్తియు నీవును బడ్డట్లు పడుము."
అని నిష్ఠురోక్తుల నందంద పలుక – విని పొంగి బసవఁ డిట్లనియెఁ గోపమున
"బ్రాహ్మ్యంబు భక్తియుఁ [8]బలికెదుకూడ – బ్రాహ్మ్యంబు [9]వేఱెదర్శనమయియుండు
వేఱెదైవంబును వేఱె మంత్రంబు – వేఱె యాచార్యుండు వేఱె వేషంబు
ధ్యానంబు వేఱె బ్రాహ్మ్యక్రియల్వేఱె – మానుగా నాచార్యమార్గంబు వేఱె
కాదేని నగ్నిముఖము, బ్రహ్మశిరము, – నాదిరుద్రుడు శిఖ, హరి యుదరంబు
ప్రాణాదివాయువు ల్ప్రాణంబు, యోని – క్షోణి, దాశ్వేతంబు సూవె వర్ణంబు
నసమాక్షువిధమె గాయత్రి సాంఖ్యాయ – నసగోత్ర మిరువదినాల్గక్షరములు
దానికి మఱి త్రిపాదంబు షట్కుక్షి – పాన లొండును గావు పంచశీర్షంబు
నని చెప్పుఁగాదె మీయాజ్ఞికంబులును – వినుము దైవంబది వేఱౌనొ కాదొ?
కావున నిదియు సాంఖ్యాయనమతము – [10]దైవంబనంగలేదు తా బహురూపు
దాని కాచార్యుండు ధరఁగర్మజడుఁడు – దానికి మంత్రంబు దాను గాయత్రి
ప్రతిదినక్రియ కర్మబంధంబు వేష – మితరేతరము మోక్షహేతువే తలఁప?
నదికాక షడ్దర్శనాతీతమైన – మదనారిసద్భక్తి మార్గంబు వినుము
శ్రుతి"విశ్వతశ్చక్షుఋత" యంచుఁ బొగడు – స్తుతుల మీఱినయట్టి సూక్ష్మరూపంబు
[11]ఆదికి నాది నిత్యానందమూర్తి – శ్రీ దివ్యలింగమూర్తియ సుదైవంబు
నట్టి యీశ్వరునాత్మఁబట్టించి చేతఁ – బెట్టంగఁజాలిన పృథుదయామూర్తి
ప్రకటింప"నగురో రధిక" మనఁ బరగు – సకలస్వరూప మాసమయసద్గురుడు
మంత్రంబులకు రాజమంత్రమై వెలయు – మంత్రంబు దానికి మఱి షడక్షరియు
భవదూరమగు జటాభసితరుద్రాక్ష – సవిశేషమోక్షానుసారి వేషంబు

1. నుండంగఁ 2. నెట్టన్న 3. నాయన్న! 4. గ్రుంగు 5. వెలితి సేయరె ని (న) న్ను. 6. యీ నీతియుఁ గులము 7. వేనియును 8. బదరెదు 9. వేద 10. దైవమన్నది 11. "అదిగాక మహిమదా నది యేమి చెప్ప" ఈ చరణ మొక ప్రతిలో నున్నది.



భువి జన్మపాపౌఘభూజకుఠార – మవిరళసత్క్రియాష్టాంగసద్భక్త
సందర్శనంబుల సకలపాపములు – డిందు మోక్షాంగన వొందుఁగావునను
నిది ఫలప్రాప్తి యింకిటమీఁద లింగ – పదసేవనోత్కృష్టభవ్యసౌఖ్యంబు
ఫలమిట్టిదని చెప్ప భావింప శ్రుతుల – తలమె జీవన్ముక్తి తత్త్వాత్మకంబు
కావున వేఱె మార్గంబుగాఁ జూడు – భావింప బ్రాహ్మ్యంబు భవునిభక్తియును
గలవంద్రు దర్శనంబులు నాఁగఁ గొన్ని – కలిసియుండునె మున్నొకండొకఁడందు
దర్శనంబులు గల్గఁ దలఁచి రేనియును – దర్శనంబది వేఱెతత్త్వరూపంబు
తలఁప నీశ్వరపదతల్లీయసౌఖ్య –ఫలకారణమె కర్మపాశబంధంబు
నిటుగాకయుభయము నేకమంద్రేని – యటుగాదువో నిటలాక్షుభక్తునకు
"ధర నన్యదేవతాస్మరణమాత్రమున – నిరువదెన్మిదిఁగోట్లు నరకంబు [1]లొందు"
నన శ్రుతు[2]లందును వినరె [3] బాపనికి – దినకరపావకదిక్పాలకులను
హరివిరించ్యాదుల నఖిలదేవతల – ధరమూఁడు సంధ్యలఁదాఁగొల్వవలయుఁ
గొలువక తక్కినఁ బొలిసె బ్రాహ్మ్యంబు – కొలిచెనేనియు భక్తి వొలిసెఁ గావునను
[4]బ్రాహ్మణుఁడేనియు భక్తుఁడెట్లగును? – [5]బ్రాహ్మణుఁడెట్లగు భక్తుఁడేనియును?
[6]మావిడిబీజంబు మహిమీఁద విత్తఁ [7]గా వే మగునె పెక్కుగథలేమి చెప్ప?
[8] సహజలింగైక్యనిష్ఠాయుక్తి భక్తి; – బహుదేవతాసేవ బ్రాహ్మణపథము;
కులసతియట్లు నిశ్చల యుక్తిభక్తి; – వెలయాలియట్టు లవ్విప్రమార్గంబు,
కాదేని నందిముఖ్యస్థితిఁ గొలిచి – యాదిదేవుఁడ [9]దైవమనుమంత్ర మెఱిఁగి
తా రుద్రవేషంబుఁ దాల్చెనేనియును – వారక యట్ల తా వర్తింపవలదె?
యిలువేలుపైన సర్వేశ్వరుఁ డుండఁ – బలువేలుపులఁగొల్వఁ [10]బాడియే చెపుమ?
కాన యిన్నియుఁ జెప్పఁగా బనిలేదు – దాన సందియమె గౌతముని దధీచి
వ్యాసుని [11]శాపంబు వప్పిపాలైన – భూసురులకు భక్తి వొలుపొంద నగునె?
యురవడిచేసి భక్త్యుద్రేకములను – బరమార్థ [12]మెడలంగఁ బలికె నా వలదు
ఇది శ్రుతిస్మృతి మూలమేకాని యొండు – పదక [13]వాదంబని భావింపఁజనదు
కర్మమార్గంబగుఁగాక బ్రాహ్మ్యంబు – నిర్మలశివభక్తి నిష్ఠితంబగునె?

1. లయ్యె 2. లెందును 3. బ్రాహ్మనికి 4. బ్రాహ్మఁడేనియు వెండి 5. బ్రాహ్మఁడెట్లగు మున్ను భక్తు 6. మామిడి విత్తు దా మహిమీఁదవిత్త 7. వేమగునే పెక్కు విధులేల చెప్ప 8. సహజైకలింగ 9. దేవుఁడను 10. బాపంబుగాదె, పాటియే చెపుమ 11. శాపంపుటగ్గి 12. మెఱుఁగక 13. వాక్యం.

ఇట్టి బ్రాహ్మణమార్గమిది దథ్యముగను – బట్టి యాడెదవేని వనియు లేదింకఁ
గాకులు వెంచిన కోకిలపిల్ల – [1]కాకులఁ బోలునే కావుకావనుచు
నెక్కడితల్లి మీ రెక్కడితండ్రి – ఎక్కడితోడు ధర్మేతరులార!
**చెన్నయ్య** మా తాత **చేరమ** తండ్రి – పిన్నయ **కక్కయ్య** బిడ్డ నే ననుచు
వేడుక సద్భక్తి విధి నుండువాఁడ – నేడుగడయు మాకు నిది నిక్కువంబు
మీయంత నుండుఁడు మీరును, నేను – నాయంత నుండెద వేయును నేల"?

## బసవేశ్వరుని పెండ్లి

యనుచు సహోదరి యగు **నాగమాంబ** – యను దాను నచ్చోట నుండఁగాదనుచు
నరుదెంచె మఱి [2]పణిహారియింటికిని – నరులిది సోద్యమనంగ నంతటను
వదుగునకని మున్ను వచ్చినయతఁడు – పడఁతి మాదాంబకు భ్రాత సజ్జనుఁడు
పాండురాంగుని భక్తిపరుఁడు **బిజ్జలుని – బండారి బలదేవదండనాయకుఁడు**
"శివభక్తునకుఁ బెండ్లి సేయుదుఁగాని – భవికి నీ" [3]ననుతొంటిబాసఁదలంచి
"ఇట్టిభక్తునకిప్పుడీక నా కూఁతు – నెట్టివానికి నిత్తు నింక నే" ననుచు
బసవకుమారునిపాలికిఁ బోయి – యెసక మెసఁగఁ గూఁతు నిచ్చి తా మ్రొక్కి
"నా బిడ్డఁ జేకొని నన్ను రక్షింప – వే బసవన్న! మాహేశ్వరతిలక!"
యనుచుఁ బ్రార్థన చేసి యా బసవయ్య – యనుమతంబునఁ బుర మభిరమ్యముగను
మకరతోరణములు మణితోరణములు – ముకురతోరణములు మును గట్టఁబనిచి
"గలయంగ వీథులఁ గస్తూరి యలుకుఁ – డెలమి ముక్తాఫలంబుల మ్రుగ్గులిడుడు
రండు భక్తులఁ బిలువుండు మీ రెదురు – [4]వొండు వేగమతోడి తెండు [5]తెండనుచు
నిట వచ్చునయ్యల కెదురు వచ్చుచును – నట వచ్చునయ్యలకర్ఘ్య మ్రొక్కుచును
సింహాసనస్థులఁ జేసి యాకర్మ – సంహారమూర్తుల చరణముల్గడిగి
యవిరళనవ్యపుష్పాంజలు లిచ్చి – ప్రవిమలధూపదీపంబులొనర్చి
యమ్మహాత్ములకు సాష్టాంగుఁడై యక్ష – ఱమ్మ విభూతి వీడ్యమ్ములర్పించి
**కోలాటము**ను బాత్రగొండ్లి పేరణియుఁ – గేళిక జోకయు లీల నటింపఁ
బాయక "చాఁగు! బళా!" యను శబ్ద – మాయతి నాకసం బంది ఘూర్ణిల్ల
నలిరేఁగి వేణువీణావాద్యవితతు – [6] లులియుచు లీలతో నొక్కట మ్రోయ
నానందగీతంబు లగ్గించువారు; – పూని **శంకరగీతములు** వాడువారు;

1. కాకులువోలెఁ దాగావుకావనునె! ఎ. 2 హారునింటికిని 3. నని 4. కొండు 5. లెం 6. లొల.



[1]జతిగీతములమీఁదఁ [2]జప్పట లిడుచు – [3]నతిశయశివభక్తి నాడెడువారు;
నాదిపురాతనాపాదితస్తుతులు – వేదార్థములుగాఁగ [4]వివరించువారు;
నెఱి శివమరులు[5]న గుఱిలేని వేడ్క – నఱిముఱి మిన్నంది యాడెడువారు;
మ్రొక్కి శివానందమునఁ దమ్ము మఱచి – నిక్కపుసుఖమున నిద్రించువారు;
నిఖిలమాహేశ్వరనికరంబు నిట్లు – సుఖలీలఁ గొలువున్నచో బసవయ్య
[6]యప్పాదజలముల నభిషిక్తుఁడగుచు – నొప్పుదివ్యాంబరయుగ్మంబు [7]సాతి
భసితంపునెఱపూఁత పలుచఁగాఁబూసి – నొసలఁ ద్రిపుండ్ర మొప్పెసఁగ ధరించి
మౌళిఁ బ్రసాదసుమంబులు దుఱిమి – పోలఁగ రుద్రాక్షభూషలు దాల్చి
సారమై **లింగపసాయితం** బనెడు – పేరను గల్గు కఠారంబు గట్టి
యానందబాష్పంబులులుఁగులు వాఱ – మేను రోమాంచ సమ్మిళితమై తనర
"బగుతులపాదుకాప్రతతులు నాకు – నగపడె" నంచు నందంద'మ్రొక్కుచును
నొడయల కడుగులు వొడసూపనోడి – [8] మడఁచి వెన్కకుడాఁచి మహినప్పళించి
[9]యూరుల మోఁచేతులూఁది కేల్మోగిచి – వారక యొక్కింత వంగి యుప్పొంగి
తనతొంటి భావంబుఁ దాల్చినయట్టు – లనిమిషుఁడై కన్నులారఁ జూచుచును
భక్తిశృంగార మేర్పడఁ జూఱగొన్న – భక్తికళార్ణవు **బసవయ్యఁ** జూచి
"యిట్టి ధన్యుఁడ నౌదునే యిప్పు"డనుచు – దట్టుఁడు **బలదేవదండనాయకుఁడు**
తన కూఁతుఁ గామినీజనతిలకంబు – ననుపమశృంగారవనధి **గంగాంబఁ**
దోడ్తెచ్చి యట్ల భక్తులకు మ్రొక్కించి – యేడ్తెఱ శుభచేష్టలెదురుకొనంగ
శివభక్తవనితలు సేసలు [10] సల్ల – శివబలం [11]బగ్గలించిన ముహూర్తమున
వేదోక్తశివధర్మవిధి బసవనికి – గాదిలిసుతఁ బెండ్లి గావించె నంత
"నట్టిద కాదె మున్నాదిఁ[12]దలంపు – నిట్టట్ట నావల దిదియె పథంబు
హరునిభక్తులబలంబది లేమిఁగలిమి – హరివిరించులు ద్రుంగుదురు మందు రనినఁ
దక్కిన గ్రహచంద్రతారాబలముల – యెక్కువదక్కువలెన్న నేమిటికిఁ?
గరుణఁ జూచుటయ లగ్నంబు సేయుటయు – వరముహూర్తంబు దీవనయ బలంబు
గాన భక్తులకృప గలదు బసవని – కేనాఁట విందుమే యిట్టి పెండిండ్లు"

1 .జగతీతలము 2. జప్పటు 3. నగణిత 4. వినుతించు; విరచించు 5. లన 6. యప్పాట 7. సాఁతి 8. మడిఁచి 9. యూరువుమోఁచేత నూని 10. వెట్ట 11. బంగవించిన 12. దిఁదలంప.

ననుచు లోకంబెల్ల నాశ్చర్యమంది – వినుతింపఁజొచ్చిరి వీరు వా రనక
అంత [1]భక్తాళికి నభిమతార్థములు – సంతుష్టిగాఁబరిచర్య లొనర్చి
సాష్టాంగుఁడై భువిఁజాఁగిలి మ్రొక్కి – శిష్టభక్తాళికిఁజేతులు మొగిచి
“యిల్లకప్పడి సంగమేశ్వరంబందుఁ – దెల్లంబు మా గురుదేవుఁడున్నాడు
చనియెద వారి శ్రీచరణముల్ [2]గొలువఁ – గనియెద మిక్కిలి కరుణ మీ చేత”
ననుచు సోదరియును నాలును దానుఁ – జనియె నా బలదేవుఁడనుప వేగంబ
అప్పురి బసవఁడల్లంతటఁగాంచి – తప్పక గురుపదధ్యానాత్ముఁడగుచు
గురువున్నపురి దృష్టిగోచరంబైన – ధరఁజాఁగి మ్రొక్కుచు నరిగె నంతంతఁ
గన్నంత నుండి తాఁజన్నంతదవ్వు – నెన్న యోజనమాత్ర మెసఁగి మ్రొక్కుచును
‘గుదురుగదా మున్ను గురుభక్తి శివున – కిది యెంతవెద్ద దానితని వీక్షింప’
నని యెల్లవారలు నర్థిఁ గీర్తింపఁ – [3]జనఁ జొచ్చెఁ బురిగురుస్తవనంబుతోడ;
నప్పురిమహిమ దా నది యెట్టి దనినఁ – జెప్పఁగ నలవియే శేషునకైనఁ
బురియేఱులన్నియుఁ బుణ్యతీర్థములు – పరగంగ [4]గుహలెల్ల హరునివాసములు
గిరులన్నియును హేమగిరులు దలంపఁ – దరులెల్ల రుద్రాక్షతరువులు గలయ
వనములన్నియుఁబుష్పవాటిక లచటి – గనులన్నియును భూతిగనులు [5]దెల్పార
[6]గొలఁకులన్నియు నొప్పు జలజాకరములు – కల గోవులన్నియుఁ గామధేనువులు
గోడెలన్నియు నందికుట్ట లాపురము – వాడలన్నియు రంగవల్లి వేదికలు
నరులెల్ల భక్తులు చిరజీవులెల్లఁ – బరికింపఁ గారణపురుషరూపములు
స్త్రీలెల్లఁ బరమపతివ్రతామణులు – నే లెల్ల [7]నవిముక్తనిధిసమానంబు
పలుకులెల్లను దత్త్వభాషలు జనుల – యులు వెల్ల గీతవాద్యోత్సవరవము
కల్లరి పతితుండు ఖలుఁడు దుర్జనుఁడు – ప్రల్లదుఁ డఱజాతి భక్తిహీనుండు
వికలుండుఁ గొండీఁడు వెదకిననైన – నొకఁడు **కప్పడిసంగమేశ్వరం**బందు
సడిసన్న **కూడలిసంగమేశ్వరుని** – గుడికేఁగి [8]తన్ను భక్తు లెదుర్కొనంగ
గుడిముందటను నిల్చిగురులింగమూర్తి – యడుగులకపుడు సాష్టాంగుఁడై మ్రొక్కి
వేదపురాణార్థవిమలసూక్తులను – నాదంబు పూరించి నలిఁబ్రస్తుతింపఁ

1.భక్తావళి కభి 2. గొలిచి 3. జనిచొచ్చెఁ 4. గుళ్లెల్ల 5. వొల్పార 6. కొలను 7. నదిముక్తినిధి 8. తనుభక్తు లెదురుకొనంగ



## సంగయదేవుఁడు బసవేశ్వరునకుఁ బ్రత్యక్షమగుట

దొల్లింటివేషంబుతో వచ్చి తేట – తెల్లగా సంగయదేవదేవుండు
గుడివెలిఁ బొడసూప గురులింగమూర్తిఁ – బొడఁగని బిట్టుల్కిపడి బసవండు
పెద్దయుఁ బ్రమదంబు [1]భీతియు భక్తి – దుద్దెక్కి తనలోనఁ [2]దొట్రుకొనంగ
నంతంత మఱియు సాష్టాంగుఁడై మ్రొక్కి – వింతవేడుక వెల్లివిరియ నగ్గురువు
చరణము లానందజలములఁ గడిగి – గురుపూజ తన్న కాఁగూడ నర్పించి
పడియున్న, నతిదయాభావామృతంబు – కడకంటఁ [3]గెడఁగూడఁగొడుకు లేనెత్తి
యందంద కౌఁగిట నప్పళింపంగ – ముందట మ్రొక్కుచు మోడ్పుఁగేలమర
నెలకొన్న తత్స్వర నేత్రాంగవిక్రి – యలు భూషణంబులై యాదట నున్న
బసవకుమారు సద్భక్తికి మెచ్చి – వెసఁబ్రసాదంబప్పుడొసఁగి యిట్లనియె;
“వచ్చినపోయినవారిచే నీదు – సచ్చరిత్రము విని సంతసిల్లుదుము
గతకాలవర్తనకంటె సద్భక్తి – మితిదప్పి నడవకు మీ బసవన్న!
శూలి[4] భక్తాలి దుశ్శీలముల్ గన్న – మేలకాఁ గైకొను మీ బసవన్న!
శత్రులైనను లింగహితులై యున్న – మిత్రులకాఁ జూడు మీ బసవన్న!
పట్టినవ్రతములు ప్రాణంబుమీఁద – మెట్టిన విడువకు మీ బసవన్న!
వేఱుభక్తులజాతి వెదకకుండుటయె – మీఱినపథము సుమీ బసవన్న!
చిత్తజాంతకుభక్తిఁ జెడనాడుఖలుల –[5] మృత్యువుగతిఁ ద్రుంపు మీ బసవన్న!
వేదశాస్త్రార్థసంపాదితభక్తి – మేదిని [6] వెలయింపు మీ బసవన్న!
తిట్టిన, భక్తులు కొట్టినఁ, గాల – మెట్టిన, శరణను మీ బసవన్న!
యేఁ దప్పువట్టుదు నిలఁ బర స్త్రీల – మీఁదఁ గన్నార్పకు మీ బసవన్న!
సాధ్యమౌ భక్తప్రసాదేతరం బ – మేధ్యంబకాఁ జూడు మీ  బసవన్న!
నిక్కంపుభక్తికి [7] నిర్వంచకంబు – మిక్కిలి గుణము సుమీ బసవన్న!
ఏ ప్రొద్దు జంగమం బేనకాఁజూడు – మీ ప్రసాదముఁ [8] గొను మీ బసవన్న!
నాలుక కింపుగా శూలిభక్తులను – మేలకా నుతియింపు మీ బసవన్న!
యేమైన వలసిన [9] యెడరైనఁదలఁపు – మీ మమ్ము మఱవకు మీ బసవన్న!
మోసపుచ్చు శివుండు బాసలేమఱకు – మీ సత్య మెడపకు మీ బసవన్న!
అని మృదుమధురాంచితాలాపములను – దనయుఁ బ్రబోధించి తాఁగౌఁగిలించి

1. బ్రీతియు 2. దొట్రి, దొప్పి 3. నొడఁ 4. శాసను”, లాంఛనుల 5. మిత్తిగవైత్రుం 6. మెఱయింపుమీ 7. నిర్వంచకతయె 8. గుద్పుమీ 9. యెడలను.

కొడుకుచే మ్రొక్కించుకొని గురుమూర్తి – గుడిఁజొచ్చి తొంటికైవడిన యున్నెడను
నందఱు నతివిస్మయాక్రాంతులగుచు – నిందుమౌళియ కాక యితఁడు మర్త్యుండె?
యెన్నఁడే గుడికడ [1] నీతపస్వీంద్రుఁ – గన్నవారెవ్వరుఁగలరయ్య! తొల్లి
బసవండు తనకెంత భక్తుఁడో కాక – యెసకంబుతో సంగమేశుండు దాన
వచ్చి తాపసిక్రియ మెచ్చి బోధించి – [2]చొచ్చె నగ్గుడియ తా నెచ్చనో(?) యణఁగె
అతికృతకృత్యులమౌదుమే యిట్లు – స్తుతియింపఁ గనుఁగొనఁజొప్పడె నేఁడు
[3]బాపురా! మాయన్న! బసవకుమార! – [4]బాపురా! మాతండ్రి! భక్తివర్ధనుడ!
నల్లవో! బసవన్న! నందీశమూర్తి! – నల్లవో! బసవయ్య! ముల్లోక[5]వంద్య!
ఇట్టుండవలవదా పుట్టినఫలము – యెట్టును నున్నార మే మేమికొఱయుఁ?
దనయు నొప్పించి వస్త్రము సమర్పించి – వనిత నియోగించి జనకునిఁ ద్రుంచి
పడసిరాద్యులు దొల్లి బసవఁడిట్లిపుడు – పడయునే శివకృప బట్టకబయల"
అని యెల్లవారును [6] నంకింపుచుండ – ననురాగచిత్తుఁడై యా బసవయ్య
**కూడలి సంగయ్య** గుడిమంటపమునఁ – గూడి భక్తావలి గొలు విచ్చియుండఁ
సారాంచితోక్తుల సంస్తుతింపుచును – బూరితంబుగ నాదపూజ సేయుచును
మూఁడుసంధ్యల గురుమూర్తిఁగొల్చుచును – [7]బోఁడిగాఁ బ్రొద్దులు వుచ్చుచునుండె
బసవ పురాణార్థపరిచయస్ఫీత! – బసవపురాణార్థపరిమళాఘ్రాత!
[8] బసవనామావళి పరమానురక్త! – బసవనామావళి పాటకాసక్త!
బసవపాదాంభోజ పరిమళభృంగ! – బసవపాదాంభోజభరితోత్తమాంగ!
బసవకారుణ్యసౌభాగ్యైకపాత్ర! – బసవకారుణ్యసంపత్కళా [9]మాత్ర!
బసవసన్నిహిత సద్భక్తాత్మసఖ్య! – బసవసన్నిహిత సద్భావనంగాఖ్య!
ఇది యసంఖ్యాతమాహేశ్వర దివ్య – పదపద్మసౌరభ భ్రమరాయమాణ
జంగమలింగప్రసాదోపభోగ – సంగత సుఖసుధాశరధినిమగ్న
సుకృతాత్మ పాలకురికి సోమనాథ – సుకవిప్రణీతమై శోభిల్లి తనరి
చరలింగ ఘన కరస్థలి విశ్వనాథ – వర కృపాంచితకవిత్వ స్ఫూర్తిఁ బేర్చి
చను బసవపురాణ మనుకథయందు – ననుపమంబుగఁ బ్రథమాశ్వాసమయ్యె.

1.తనరాజు 2. చొచ్చియు ... నెచ్చటో? 3. 4. బాపురే. 5. కీర్తి ఈ సమాసము నీతఁడు పెక్కుచోట్లఁ బ్రయోగించినాఁడు. "ముల్లోకనాథుని ముట్టంగఁగొలిచి" పండితా. ఇతర కవులుకూడ దీనిఁ బ్రయోగించిరి. "ముల్లోకవిభుండు సక్రి" ఓపిలిసిద్ధి శాసనము. 6. వినుతింపుచుండ 7. బోఁడిమిగాఁబ్రొద్దువుచ్చును 8. బసవాక్షరత్రయ 9.మిత్ర.

# ద్వితీయాశ్వాసము

**శ్రీ** లింగమథనవిలోలకేలీవి – శాలసౌఖ్యానంద! సంగయామాత్య!
అక్కడ నంతఁగళ్యాణంబునందు – నెక్కుడు శివభక్తికెల్లయై పరగు
**బండారి బలదేవదండనాయకుఁడు** – దండి బసవనికిఁ దనయ నిచ్చుటయుఁ
బ్రమథులెంతయుమెచ్చిరాఁబంపఁబోవు – క్రమమునఁ బ్రమథలోకమునకేఁగుడును
బలదేవమంత్రియాప్తుల బంధుజనులఁ – బిలువంగఁబంచి యా బిజ్జలుండనియె

## బసవేశ్వరునకు బిజ్జలుఁడు దండనాయకపదమిచ్చుట

"[1]ఇతనితోఁబుట్టువు సుతుఁ డెవ్వఁడేని – నితని నియోగంబు ప్రతిదాల్పఁగలఁడె?
అనవుడు "కలఁడు మహారాజ! యతని – తనయ ప్రాణేశుండు వినయోక్తిపరుఁడు
నీ రాజ్యమంతయు నిలువంగఁ [2]జాలు – దూరీకృతాఘుండు దోర్బలాధికుఁడు
విను మఖిలకళాప్రవీణుఁడెట్లనిన – జనులెల్ల నెఱుఁగఁగ సంగమేశ్వరుని
చేఁ బ్రసన్నత వడసెను గాన నీకుఁ – దాఁ బ్రధానిగఁదగు ధరణీశ" యనిన
నిజ్జగంబింతయు నేలినకంటె – బిజ్జలుడెంతయుఁ బ్రీతాత్ముఁడగుచుఁ
దన వీటఁదగిన ప్రధానుల హితులఁ – దనయెక్కుభద్రేభమును నమాత్యులను
బసవనిఁ దోడ్తేరఁబంచుడువారు – నెసకంబుతో **సంగమేశ్వరం** బేఁగి
యక్కడ బసవని నసమానుఁ గాంచి – చక్కఁ[3]జాఁగిలి మ్రొక్కి సరణి నిట్లనిరి
"నాకోపభోగాపునర్భవాదులను – నీ కొకలెక్కయే నిజమట్లకాక
శివభక్తిసారానుభవభవ్యసుఖికి – నవశంబ కాక రుచ్యములె యిన్నియును?
నైనను లోకహితార్థుండ వీవు – కాన మా ప్రార్థనఁ గైకొనవలయు
బిజ్జలక్షోణీశు ప్రియము సల్పినను – నిజ్జగతీతలం బేలఁడే (వే?) చెపుమ
మంత్రిపట్టమునకు, మండలంబునకుఁ, – దంత్రంబునకు, నిజాప్తమునకు, మూల
భండారమునకు భూపతిరాజ్యమునకు – నొండేమి నీ వకా[4] కొడయ లున్నారె?
యతఁడు పట్టైఁడుకూటికర్తుండ కాని – క్షితికెల్ల నీవచూ పతివి నిక్కంబు
విచ్చేయు" మని యిట్లు విన్నవించుడును – నచ్చోట భక్తహితార్థంబు దలఁచి

1. హితుఁడు 2. గలఁడు 3. జాఁగిలఁబడి మ్రొక్కి యిట్లనిరి 4. కున్న వారెవ్వరు.

యందఱుఁగొల్వంగ "నట్లకా"కనుచుఁ – గందర్పహరుభక్తగణములనెల్లఁ
గొలిచి తత్కారుణ్యజలరాశిఁ దేలి – యలరుచుఁ జనుదేర నంత నిక్కడను

## బసవేశ్వరుఁడు కళ్యాణకటకము చేరుట

"నదెవచ్చె నిదెవచ్చె" నని విని ముదిత – హృదయుఁడై బిజ్జలుఁ డెదురుకొన్వేడ్క
నలవడఁ బదియురెండామడనేల – గలయఁగఁ గల్యాణకటక [1]మంతయును
శ్రీరమ్యముగ నలంకారింపఁ[2]బంచి – భూరమణుండు శృంగారంబు సేసి
మండలాధీశ సామంత ప్రధాన – దండాధినాథమాతంగతురంగ
పరివారసహి[3]తుఁడై పరమహర్షమున – నరుదెంచి పదహతి ధరణి గ్రక్కదల
వివిధవాద్యధ్వనుల్ దివి [4]దీటుకొనఁగ – నవనీతలేశుఁడల్లంతటఁగాంచె
బసవకుమారు సద్భక్తిశృంగారు – నసదృశాకారుఁ దత్త్వార్థవిచారు
నేకాం [5]గవీరు దేహేంద్రియదూరు – లోకనిస్తారు నలోకానుసారు
జంగమవ్యాపారు సజ్జనాధారు – లింగగంభీరు గతాంగవికారు
విమలశివాచారుఁ ద్రిమలధిక్కారు – నమితమహాచారు నచలితధీరు
విరహితసంసారు వీరావతారుఁ – బరిహృతాహంకారు భక్తివిహారు
శివభక్తిసారు విశిష్టప్రకారు – నవినాశసంస్కారు నతులితశూరు
విపులక్షమాగారు వినయప్రచారు – సుపథైకవిస్తారు శుద్ధశరీరుఁ
గుజనవిదారు సద్గుణమణిహారు – వృజినతరుకుఠారు విహితోపకారు
నతిదయాలంకారు నఘసముత్సారు – హితహృద్గతోంకారు నతసముద్ధారు
శ్రుతిపరిచారు నిర్మోహాంధకారుఁ – గృతరిపుసంహారు ధృతనయాచారుఁ
[6]జారునిర్మలకీర్తి సత్యప్రపూర్తి – సారసద్గుణవర్తి శాశ్వతమూర్తిఁ
గని పాదచారియై చనుదెంచి చేరి – ఘనతరప్రియపూర్వకంబుగ నపుడు
సముచితసత్కారసంతుష్టుఁ జేసి – సమదాంధగంధగజంబు [7]లేళ్నూఱు
పంద్రెండువేలు శుంభత్తురంగములు – పంద్రెండులక్షలు బలవత్పదాతి
పాటి బండారులు పన్నిద్ద ఱందు – మేటితనంబు నర్మిలినిచ్చి తనదు
నఖిలరాజ్యమునకు నర్హుఁగాఁ జేసి – సుఖలీల **బిజ్జలక్షోణీశ్వరుండు**

1. మెంతయును 2. బంపి 3. తమై 4. దీటిమ్రోయు 5. త 6. ఈ ద్విపదము కొన్ని ప్రతులలోనే కలదు 7. లేణ్నూరు.



దానును **బసవనదండనాయకుఁడు** – నా నియోగము గొల్వ నరుదెంచుచుండఁ
బుణ్యపణ్యాంగనల్ పురవీథులందుఁ – బుణ్యాత్ము బసవప్రభునిఁ జూచువేడ్కఁ
"జూడఁగ వచ్చెద సుదతిఁనే" ననుచు – "వేడుక [1]చెఱుపక వేగ ర"మ్మనుచు
"గాలిదొసఁగుఁ గాక! క్రమ్మఱు" మనుచు – "నేలమ్మ! వచ్చిన నేమి నీ"కనుచు
"నేకతంబొకతెవ యేఁగుమీ" వనుచు – నీ కాళ్ల నడచెదనే కాంత!" యనుచుఁ
"బతిగన్న సైఁచునే పడఁతి! ని"న్ననుచుఁ – "బతిగని యెట్లైనఁ [2]బదరని"మ్మనుచు
"బసవన్నఁజూడకపడఁతి!పో"ననుచు – "ముసుఁగిడి వేగ రా మురియక" యనుచు
"దోఁకొని పోయిన దోసమే" యనుచు – "మూఁకలోనికిఁబోకు ముగ్ధవీ"వనుచు
"దిక్కులు చూడక చక్కర"మ్మనుచు –"నెక్కడితరువమ్మ! యింతి! నీ"కనుచు
"మానిని! బసవన్న మహిమ యి"దనుచు – "మానుగా భక్తుల మఱిచూత"మనుచు
"నిట్టి సందడి[3] గలదే యెందు" ననుచుఁ – "దట్టాడకిటు వేగతరుణి!ర"మ్మనుచుఁ
"గంటివే బసవయ్యఁ గమలాయతాక్షి! –"గంటినే మోక్షంబుఁగంటిఁగా"కనుచుఁ
"జూచితే!పోదమాసుకుమారి!"యనుచుఁ–"జూచుచుండఁగఁబోవ సొగయునే"యనుచు
వచ్చువారును జూచువారును గట్ట – నిచ్చువారును జూచి యేఁగెడెవారుఁ
బొరిఁబొరిఁ దెచ్చి విభూతివీడ్యంబు – లరుదొంద బసవయ్య కర్పించువారు
నంగన ల్వివిధపుష్పాంజలు లిచ్చి – మంగళారతులెత్తి మహి మ్రొక్కువారు
"స్వస్తి దీర్ఘాయువు శంకర!" యనుచుఁ – బ్రస్తుతిదీవనల్ పచరించువారు
హృద్యంబుగా గీతగద్యపద్యములఁ – జోద్యతరంబుగా స్తుతియించువారు
వారివారిక కయివారముల్ సేయు – వారును నలిరేఁగి తారాడువారుఁ
గలకలంబులకు డగ్గఱక హర్మ్యాగ్ర – తలములపై నుండి దర్శించువారు
నం దొకయెడ విముగ్ధాంగన యచటి – సుందరులకు సన్న [4]సూపి యిట్లనియె
"పంబిన వివిధ వాద్యంబులుఁ దమ్మ – టంబులు నిస్సహణంబులు సెలఁగ
నందంద "చాఁగు బళా"! యంచునేఁగు – నందికోలలవారు ముందటిగములు
నెల్ల[5]వెల్లెల్లుల కెల్లయై పరగు – నల్లహయా[6]రూఢ మవ్వీరగణము
చక్కగా నీ వ్రేలిచక్కటినడుమఁ – బెక్కు విధంబులం దక్కజం బగుచు
వేడుకఁ గోలాట మాడెడువారుఁ – గూడలి త్రిపురాంతకుని[7]కొల్వువారు
గెడఁగూడి పసిఁడిగిర్గిటకేళికలను – గడు నొప్పు సొన్నలికపురంబువారుఁ

1. జరుపక 2. బఱప 3.గల్గునేయెన్నఁడ 4. చూపుచుననియె 5. పెల్లెలుగల 6.రూఢుఁడప్పరగణము 7. ఁ గొల్చువారుఁ; జూచువారు.

జేరువ నాడెడుపేరణివిధము – సౌరాష్ట్రనాయకుసంప్రదాయంబు
వేడుకc బ్రతిజోకలాడెడువారుc – **గూడలి సంగయ్య**[1] కొలువునర్తకులుc
బాడుచు నట విండ్లపై [2] గజ్జెపరువు – లాడెడువారు [3]రాయనికొల్వువారు
సంగతి నేcగు తురంగ[4]సంఘముల – పింగల బిజ్జలు ముంగలనొప్పు
వర[5]గజారూఢులై యరుదెంచుచున్న – పరమమాహేశ్వరప్రకరంబునడుమ
శివభక్తజనులమీcదివ దృష్టులుcగాcగ – సవినయసంభ్రమాసక్తి మ్రొక్కుచును
నలఘుసన్మణికలాపాంశులు ప్రజ్వ – రిలు మౌక్తికచ్ఛత్రములగమి [6]నీడ
నతమంత్రిజనశిరోనాయకరత్న – వితతిc గూడిన పదాన్వితనఖములను
నెలమిc దలిర్చు భద్రేభంబునెక్కి – యలరారుచున్నట్టి యలమహామహునిc
[7]గారుణ్యమూర్తి విక్రమచక్రవర్తిc – జారునిర్మలకీర్తి సత్యప్రపూర్తిc
గలియుగరుద్రు సత్కరుణాసముద్రు – విలసనభద్రు సద్వినయనిర్ణిద్రు
ధీరు సద్భక్తిశృంగారు నేకాంగ – వీరు **నా బసవకుమారుc** జూచితిరె"
అనవుడు నందఱుc గని యట్లుమ్రొక్క – వనితకు మఱియెక్క వనిత యిట్లనియె
"నలినాక్షి! యీతcడే నందీశమూర్తి – పొలcతి!యీతండె త్రిభువనపావనుcడు
వనిత! యీతcడె **భాగ[8]వాడ మాదవ్వ** – మను [9]నోమిపడసిన యనుcగుcబుత్త్రుండు
పడcతి! యీతcడె మన**బలదేవమంత్రి** – కడుc [10]గూర్చి యిచ్చిన కన్యకమగcడు
సన్నుతాంగి! యితండె **సంగయ్యదేవు** – మొన్నcబల్కించిన ముల్లోకనుతుcడు
[11]మడcది! యాతండె యిమ్మనుజేశుచేతc – గడునొప్పుమన్నన వడసినయతcడు
కన్నులపండు వీ యన్నc జూచినను – బన్నుగా జిహ్వాలపండువు వొగడ
నిట్టిధన్యల మౌదుమే నేcడు మనల – పుట్టువు సఫలతcబొందె నెంతయును"
నని యిట్లు చెప్పుచునడుగుచు జనులు – వినుతింపcగాc బురి [12]వెసcజొచ్చునెడను
జగతీతలేశుండు నగరోపకంఠ – మగడు నా **బసవయ్య** నర్థిcదోడ్కొనుచుc
బరిమితభటమంత్రిపరివృతుం డగుచు – నరుదెంచి భవనాశ్ర [13] యాభ్యంతరమున
మున్నున్నమంత్రులు పన్నిద్ద [14]ఱకును – [15]గన్నాకుగాc బెద్దగద్దియ నునిచి
వరవస్త్రభూషణోత్కరము లర్పించి – యరుదొంద **బసవయ్య** కాతcడిట్లనియె

1.గొలుచు 2. సజ్జపఱపు, గుజ్జుగురపు, గట్టివరపు 3. రాయనిcగొల్చువారు 4.భట్ట 5.రథా 6. నడుమ 7. ఈ క్రింది నాల్గుచరణములు పెక్కు ప్రతులలోలేవు 8.మాదాంబ 9.నోcచి 10.గూర్మిని 11.మడcతి 12. జనc 13. మా 14. అందు 15. గన్నారc



"సకలసామ్రాజ్యపూజ్యస్థితికెల్లc – [1]బ్రకటింపcగా నీవ పతివట్లుcగాక
నా యర్థమునకుc బ్రాణమునకుcబతివి – వేయును నేల?నీవే [2]నేను **బసవ!**
నిన్ను నమ్మితి" నంచు నెయ్యమెలర్ప– మన్నన బిజ్జలక్ష్మాధీశుc డనిన
"సకలలోకైకరక్షకుcడగు శివున – కొక నిన్ను [3]రక్షించుటకు నెంతవెద్ద
కావున మాలింగ దేవుభక్తులకు – [4]నేవేళ వెఱచుండు మింతెయె చాలు
నీ రాజ్య మేలించుటిది యెంతవెద్ద – నీరధి మేరగా నిన్ను నేలింతు"
నని యీఱడిల **బసవనదండనాథుc** – దనుకూలుcడై పల్క నంత **బిజ్జలుcడు**
మఱియుcగట్టcగనిచ్చిమహనీయలీలc – గొఱలునెయ్యమున వీడ్కొలిపె;వీడ్కొలుప;
గా బసవcడు భక్తగణములు దాను – నా **బలదేవనాయకుని** నగళ్లు
తనకు నిజాలయస్థానమై యుండc – దననియోగము గొల్వc దాc జనుదెంచి
లాలితలింగకేళీ [5]లసన్మతిని – లీలానుకూల [6]సచ్ఛీలసంపదల
ననుదినవర్ధమానైశ్వర్యుc డగుచు – జనపతిరాజ్యంబుc జక్కవెట్టుచును
దెసలెల్ల సత్కీర్తిc బసరించుచున్న – బసవనిపూనిక బాసయెట్లన్న

## బసవేశ్వరుని బాస

**శివరాత్రి** నిత్యంబు చెల్లించు బాస – శివభక్తులెల్లను శివుcడను బాస
భక్తుల యెగ్గులు పట్టని బాస – భక్తులకుల మెత్తిపలుకని బాస
మృదునైన నొకమఱి యడుగని బాస – యడిగిన యర్థంబు [7]గడపని బాస
చీమంతయైన వంచింపని బాస – యేమి వేcడిన నడుగిడకిచ్చు బాస
తలcపెట్టులట్టుల పలికెడు బాస – పలుకట్ల నడవడిc బాలించు బాస
పలికి బొంకనిబాస వొలివోని బాస – చలమెడపని బాస సలిపెడి బాస
తప్పc ద్రొక్కనిబాస [8]దరలని బాస – యెప్పుడు భృత్యత్వమెడపని బాస
కలనైన శివునకు గెలుపీని బాస – గెలుపు భక్తులకిచ్చి కీడ్పడు బాస
పరసతిపై దృష్టి వఱపని బాస – పరధనంబులకాసపడకుండు బాస
పరనింద నెయ్యెడc బొరయని బాస – పరమర్మకర్మముల్ వలుకని బాస
పరసమయంబులc [9]బరిమార్చు బాస – పరవాదులను బట్టి భంజించు బాస
హరదూషణకుc జెవులానని బాస – హరగణానర్పితంబంటని బాస

1. బ్రకటంబుగా 2. మన్ను 3. రక్షింపనొండెంత వ్రేcగు 4. ఏవలనెఱచుచుండింతియ చాలు 5. కేళీలోలమతిని 6. సుశీల 7. లెడపని 8. తరగని 9. బొరిమాల్చు.

హరగణపరతంత్రుఁడై యుండు బాస – హరభక్తులెల్లన్న నట్లను బాస
జంగమంబును బ్రాణలింగ మన్బాస – వెంగలిమనుజుల వేఁడని బాస
భవికి మ్రొక్కనిబాస భవి కీనిబాస – భవబాధలకు నగపడకుండు బాస
విషయేంద్రియములకు వెన్నీని బాస – విషమషడ్వర్గంబు విరియించు బాస
వేదోక్తభక్తి సంపాదించు బాస – యాది శివాచార మలరించు బాస
శిరమట్టఁ[1] బాసిన శరణను బాస – శిరమున కట్టు[2] వాసిన మ్రొక్కు బాస
ముట్టినచో [3]వెన్క మెట్టనిబాస – యిట్టివన్నియుఁ దుదముట్టించు బాస
**బసవని**చరితంబు **బసవఁడే** యెఱుఁగు – వసమె యెవ్వరికైన వాక్రువ్వఁదలఁప
[4]ధీరంబుకట్ట గంభీ [5]రంబుతిట్ట – సారార్థములప్రోక జ్ఞానాగ్ని కాఁక
ప్రతినలగుడ్డ విశ్రుతభక్తిగడ్డ – వ్రతములపంట వైరాగ్యంబువెంట
సత్యంబుకలను ప్రసాదంబుకొలను – కృత్యంబుతాఁప యకృత్యాబ్ధితేఁప
వేదాంతములపాటి విద్యలమేటి – నాదంబుక్రోలు సమ్మోదంబుకీలు
శాంతతనెలవు యీశ్వరుకట్టినలవు – దాంతతకలిమి నిత్యత్వంబు [6]బలిమి
వినయంబుతేట వివేకంబుకోట – యనురక్తి యిల్లు నుదాత్తతపెల్లు
తత్త్వంబుతీగ మహత్త్వంబుచేగ – సత్త్వంబువెన్ను నాస్థానంబు చెన్ను

## బసవేశ్వరుని దర్శింప శివభక్తులరుదెంచుట

బసవఁడు **కేవలభక్తుండె** యనుచు – [7]వసిగొని లోకముల్ [8]వర్ణనసేయ
నొక్కొక్క నియమంబు నిక్కంబుగాఁగఁ – జక్కన దర్శింపఁ జనుదెంచువారు
చేకొన్నవ్రతములు చెల్లించు[9]వారు – ప్రాకటవ్రతబుద్ధిఁ బఱతెంచువారు
"ఖ్యాతుఁడో **భక్తిసమేతుఁడో** యరసి – చూతముగాక!" యంచును వచ్చువారు
"బసవనిచేఁబూజ [10]వడయుద"మనుచు – నెసకంబు దళుకొత్త నేతెంచువారు
"నతనిఁజూచినఁ జాలు **నభవునిభక్తి** – యతిశయంబగు" నని యరుదెంచువారు
బసవతీర్థం బేఁగు[11]పరస యనంగఁ [12]బసిగొని యిలఁ గ్రిక్కిఱిసి వచ్చువారు
కరితురగాందో [13]ళవిరచితానేక – వరరథారూఢులై యరుదెంచువారు
[14]ప్రకటరుద్రాక్షసన్మకుటవర్ధనులు – సకలాంగభసితాది శాసనధరులు
విరచితవస్త్రోపవేష్టితమకుటు – లురుజటాజూటవిస్ఫురితశాసనులు

1. బాసియు 2. వాసియు 3. వెన్ను 4. ధీరంపుఁగట్ట 5. రంపుఁదిట్ట 6. చెలిమి 7. పసి 8. ప్రస్తుతి 9. మనుచుఁ-బ్రా. 10. వడయుదు 11. పరుస 12. వసి 13. ళి. 14. ప్రకటితరుద్రాక్షమకుట.



కక్షకరస్థలకంఠోత్తమాంగ – వక్షస్స్థలా [1]దికవరలింగధరులు
నుతసంయమీశ్వరులతులవ్రతస్థు – లతి[2]శీలు రితరపాకాదివర్జితులు
సంభావితులు భవిజనసమాదరణ – సంభాషణాదిసంసర్గవర్జితులు
పరశివధ్యానైకపరతంత్రమతులు – నిరవధిలింగైక్యనిష్ఠితేంద్రియులు
స్వచ్ఛలింగానుభవేచ్ఛాత్మసుఖులు – ప్రచ్ఛన్నలాంఛను ల్ప్రకటలాంఛనులు
నటకులు గాయకుల్ నవరసాత్మకులు – పటుకళావేదులు బహుశాస్త్రమతులు
వాదులు దార్కికుల్ వరకవుల్ దత్త్వ – వేదులు వేదార్థవాదులాదిగను
నెడనెడ నిబ్బంగిఁ గెడఁగూడి నడవఁ – బుడమి యొక్కట నొడ్డగెడవయ్యె ననఁగ
ఖండేందుధరుభక్తగణములిబ్బంగిఁ – దండతండంబులు దారేఁగుదేర
విలసితమృగమదకలితమార్గముల – వెలుఁగుముక్తాఫలంబులముగ్గులమర
ముకురపల్లవమణిముక్తాఫలాది – మకరతోరణముల నికరంబులలర
ఖ్యాతిగా వృషభసమేతమై యొప్పు – కేతనానీకముల్ గ్రిక్కిఱియంగ
నాతతవ్యాసహస్తాకృతి నున్న – వాత[3]పూరణములు వడిఁ గ్రాలియాడ
నుడువీథిఁ గప్పి సమున్నతలీల – నడపందిరులు వెలి[4] గొడుగులుఁ దనరఁ
దతవితతాదివాద్యంబులు మ్రోయ – నతిశయంబుగ విన్కు లంతంత నమరఁ
బాయక **"చాఁగుబళా!"** యనుశబ్ద – మాయతి[5]నాకసమంది ఘూర్ణిల్లఁ
బ్రతిదినంబును భక్త బండారిబసవఁ – **డతిభక్తిరతి** మతి నంకురింపఁగను
శాశ్వతఘనలింగసంపద మెఱసి – యీశ్వరభక్తుల [6]ని ట్లెదుర్కొనుచు

## బసవేశ్వరుని శివాచారనిరతి

మంగళహర్షోదితాంగవిక్రియల – సంగతి నాత్మనుప్పొంగి యుప్పొంగి
భయభక్తియుక్తిఁ [7]దద్భక్తాంఘ్రిచయము – పయిఁజక్కఁజాఁగిలఁబడిమ్రొక్కి మ్రొక్కి
**పటుతరసద్భక్త**పాదాబ్జరేణు – పటలపర్యంకంబుపైఁ బొర్లి పొర్లి
హరభక్తనికరదయామృతవృష్టి – పరిగొని కురియఁ [8]దొప్పఁగఁదోఁగి తోఁగి
యొడయలదివ్యపాదోదకవార్ధి – నడునీటఁగడువేడ్కఁబడి తేలి తేలి
**వరభక్తసందోహ**పరితోషితార్థ – పరమసపర్యసంపద వ్రాలి వ్రాలి
మతిలింగజంగమోచితపరతత్త్వ – **సతతశివార్చనారతి** సోలి సోలి
శరణనిర్మలనిత్యసత్య ప్రసాద – వరసేవన క్రీడ వడిఁ గ్రాలి క్రాలి

1. నేక, ధిక 2. శయులి 3. తోరణములు 4. గొడగులు 5. నాకాశమద్రువ 6. లందెదురుకొనంగ 7. స 8. (క) దొప్పనఁ.

చారువచోవిలాసంబులఁదనర – నో[1]రార వారి సన్నుతిసేసి చేసి
వారి మనోలత వడిఁజుట్టిచుట్టి – సారగాంధర్వరసముఁగ్రోలి క్రోలి
దరహసితాస్యవిస్ఫురణయుఁ దనర – హరగణాస్థానంబునందాడి యాడి
[2]నిక్కంపు [3]భక్తికినిక్కమైయెతన్నుఁ – దక్కి [4]యెంతయు భక్తిఁదాఁజొక్కి చొక్కి
యనవరతము నీప్సితార్థుల కర్థిఁ – దనుమనోధనము [5]లప్పన సేసి చేసి
యందంద పరమతత్త్వానుభవార్థు – లందత్త్వసౌఖ్యజలధి ముంచి ముంచి
ప్రవిమలభక్తి సంపత్సుఖార్థులను – బ్రవిమలభక్తిసంపదఁదేల్చి తేల్చి
యారంగఁ గామసుఖాపేక్షితులను – శ్రీ(స్త్రీ?) రత్నరాజిఁ బూజించి పూజించి
వరరత్నభూషణోత్కరధనార్థులను – వరవస్త్రభూషణావళిఁదన్పి తన్పి
రాజవదుపచారపూజనార్థులను – రాజవదుపచారరతిఁగొల్చికొల్చి
యష్టాంగభక్తిక్రియా సుఖార్థులను – నష్టాంగభక్తిక్రియలఁబూన్చి పూన్చి
శీలసంబంధుల శీలంబు లెఱిఁగి – శీలసంబంధసుస్థితి నుంచి యుంచి
నియమవ్రతాధికనిష్ఠితాత్మకులఁ – బ్రియవస్తుసమితినర్చించి యర్చించి
బసవఁ డీక్రమమున భక్తిసామ్రాజ్య – మెసకంబుతోఁజేయునెడ లసత్ప్రీతి
"ముప్పాఁట నోగిరంబులుఁ బదార్థములుఁ – దప్పక కావళ్ల నెప్పుడుఁబంప
వెండి వేశ్యలయిండ్ల నుండి భోగించు – మిండజంగములు పండ్రెండువే లనిన
నున్నజంగమసంఖ్య [6]మున్ను రూపించి – యెన్నంగ శక్యమే యీశునకైన"
ననుచు భక్తానీక మచ్చెరువంద – ననయంబు భూతిశాసనులాదిగాఁగ
నెల్లభక్తావళి కీప్సితార్థములు – సెల్లించుచును భక్తి సేయుచున్నెడను;

## బసవనిమేనల్లుఁడు చెన్నబసవని మహిమ

బరమేశుభక్తియ ప్రాణమై పరగు – తరుణి యా **నాగాంబ**వరతనూభవుఁడు
ప్రస్తుతింపఁగ [7]నొప్పుబసవకారుణ్య – హస్తసంభూత ప్రశస్తదేహుండు
నసదృశభక్తియోగాత్ముండు **చెన్న – బసవండు** గురుభక్తిపాత్రోత్తముండు
సర్వాంగలింగి సంసారనిస్సంగి – గర్వాపహారి ప్రాక్తనశివాచారి
సారగుణాన్వేషి సరససంభాషి – కారుణ్యరాశి లింగమనః ప్రవేశి
యగణితసుఖశీలి యతిదయాశాలి – నిగమార్థసంవేది నిచితప్రమోది
విరహితోభయకర్మి వరలింగధర్మి – యరివర్గసంహారి యాత్మోపకారి

1.నోరూరి 2.నిక్కంబు 3. బ్రీతికి 4. యెక్కుడు 5.లొప్పన 6.మున్నిరూపించి 7.దగు.



లింగాభిమాని యభంగురజ్ఞాని – సాంగత్యసువిధాని సతతావధాని
పరమానురాగి సద్భక్తి సంభోగి – విరసభవత్యాగి విమలాత్మయోగి
సత్యసల్లాపి ప్రసన్నస్వరూపి – నిత్యప్రతాపి వినిర్గతపాపి
యీశ్వరమూర్తి యతీంద్రియవర్తి – శాశ్వతకీర్తి ప్రసాదప్రపూర్తి
యనఁగ ని ట్లొప్పారి యతులితమహిమ – ననుదినవర్ధమానాంగుఁడై [1]యుండ
"బసవనిశ్రీపాదబిసరుహంబులకు – నసలార నిత్యంబు నర్చ లిచ్చుచును
మించినభక్తిమై మేనరోమాంచ – కంచుకం బధికసమంచితంబుగను
గద్గదకంఠుఁడై కనుఁగవ సుఖస – ముద్గతాశ్రువు లొల్క నుత్సుకలీల
సప్రాణలింగలింగప్రాణమథన – సుప్రసన్నానుభవప్రాప్తిఁ బొంది
నలిగొనమర్కటన్యాయంబునందు – ఫలమునఁబొంది సోపానంబులు డిగి
వెసఁ బొందఁగలుగువాయసఫలన్యాయ – మసలారఁగాఁ జరితార్థతఁ [2]బొంది
గురుభక్తి[3] ఫలసారగుహ్యప్రసాద – వరసేవనాసుఖపరవశలీలఁ
గమనీయ మొంద లింగంబు ప్రాణంబు – రమణఁ బ్రసాదపూరంబు దేహంబు
దిరమగుశుద్ధభక్తియు మానసంబు – హరగణానుభవసౌఖ్యంబు ధనంబు
నిటు గూడ నన్నియు నేకమై కాదె – పటుతరంబుగఁ జెన్న బసవఁడై [4] పేర్చె
భవ్యలింగమున కేర్పడఁ బ్రాణమగుచు – నవ్యప్రసాదంబునకు రుచి యగుచు
జంగమభక్తి కాశ్రయపదం బగుచు – మంగళప్రాప్తికి మందిరంబగుచు
గుఱిగాకవాఙ్మనోగోచరం బగుచు – వఱలెడు శివతత్త్వ [5]వల్లభు మహిమ
బిలిబిలి తలఁపులవలన వర్తిల్లి – మొలచిన తమతమ కొలఁది మాటలను
వినుతించుటెల్లను వెలితియకాదె – పనుగొన నా **చెన్నబసవన్న** నెలవు
కావున బసవండె గణుతింప నెఱుఁగు – భావింప నా **చెన్న బసవన్న** మహిమ
బసవనిమహిమయు భాతిగాఁ **జెన్న – బసవండె** యెఱుఁగు బెంపెసఁగఁ గీర్తింప"
నంచు భక్తానీక మచ్చెరువంద – నంచితభక్తిసమగ్రత మెఱసి

## చెన్నబసవన బసవేశ్వరుని స్తుతించుట

"శాశ్వత! సర్వజ్ఞ! శశ్వద్గుణాంక! – విశ్వేశ శ్రీగురవే నమో" యనుచు
"సద్యఃప్రసన్నానవద్యవేదాంత – వేద్యాత్త! శ్రీగురవే నమో" యనుచు
"దత్తకైవల్యా! యుదాత్తసద్భక్తి – విత్తేశ! శ్రీ గురవే నమో" యనుచు

1. యంత 2. బొదలి 3. సాకార 4. పేర్చి 5. వాల్లభ్య.

"నమిత పరంజ్యోతి రాకారదివ్య – విమలాంగ! శ్రీగురవే నమో" యనుచు
"స్థిరతరసృష్టిస్థితిలయప్రపంచ – విరహిత! శ్రీగురవే నమో" యనుచు
"సకళ నిష్కళ చరాచరరూపవిగత – [1]వికృతాంగ! శ్రీ గురవేనమో" యనుచు
"నాద్యంతరహితనిత్యామలతేజ! – విద్యాత్మ! శ్రీగురవే నమో" యనుచు
"నధ్వషట్కాతీత! యతిపాతకౌఘ – విధ్వంస! శ్రీగురవే నమో" యనుచు
మోక్షా[2]ర్థిరక్షణదక్షకటాక్ష – వీక్షణ! శ్రీగురవే నమో" యనుచు
"నజ్ఞానతిమిరసంహారార్థ[3]దత్త – విజ్ఞాన!శ్రీగురవే నమో" యనుచు
"ధన్యాత్మశిష్యమస్తకకృపాహస్త – విన్యాస !శ్రీగురవే నమో" యనుచు
నఘహరణార్థశిష్యజనోపభుక్త – విఘనస ! శ్రీగురవే నమో" యనుచు
నశ్రాంతభక్త జనాత్మాంబుజాత – విశ్రాంత ! శ్రీగురవే నమో" యనుచు
ననఘ గురుప్రసాదామృతహృదయ – వినివాస ! శ్రీగురవే నమో" యనుచు
భ్రాజిల్ల నా **చెన్నబసవఁడబ్బసవ** – రాజును దనగురుఁ బ్రస్తుతిసేయ

## అల్లమప్రభుని రాక

నంత **నల్లమప్రభు**వను సంయమీశుఁ – డంతకాంతకమూర్తి యతులితకీర్తి
నిర్మూలితోద్రిక్తదుర్మలుఁ డుభయ – కర్మనికృంతనకర్మకర్మఠుఁడు
వైరాగ్యసంసారవర్జితాత్మకుఁడు – దూరదృష్టాదృష్టచారుచర్యుండు
దానప్రతిగ్రహహీనవర్తనుఁడు – మానావమానసమానకీర్తనుఁడు
సమలోష్టకాంచన సమసుఖదుఃఖ – సమమిత్ర శాత్రవ సద్భావనుండు
సప్తధాతుమదాదిసర్వాంగగుణవి – లుప్తచిత్తుండు సంసుప్తిదూరుండు
కాలసంకల్పవికల్ప మహేంద్ర – జాలప్రపంచనిర్మూలనశాలి
పరమశివానందపరవశీభూతుఁ – దురుముక్తకేశయుతో త్తమాంగుండు
దివ్యానిమిషసుధాదృష్టి[4] గోచరుఁడు – భవ్యుండు గాంధర్వపండితోత్తముడు
ఆంతరయాగనిరంతరయోగ – వంతుఁడనంత వేదాంతవేద్యుండు
నిశ్శరీరి శరీరి నిర్నామి నామి – నిశ్శబ్ది శబ్ది వినిర్భావి భావి
ద్వైతయోగక్రియాద్వైతయోగక్రి – యాతీతయోగక్రియాన్వీతుఁడనఁగ
ముల్లోకములఁదేట తెల్లయై భక్తి – కెల్లయై స్వేచ్ఛావిహీనకృత్యమున

1. వికలాంగ 2.ర్థ 3. తత్త్వ 4. భాసనుడు.



లీలఁ గరస్థలలింగవిన్యస్త – లోలేక్షణానందకేళిఁ దన్మఱచి
యిది యేఱు వల్లంబు నిది సెట్టు గట్టు – నిది దెరు వడవి యన్నది దలంపుడిగి
యరుదేర నన్నియు నంతంతఁ దొలఁగి – తెరువిచ్చుటకు నరులరుదని పొగడ
బసవనియసమ విభ్రాజితభక్తి – రసవార్ధి వెల్లివిరిసి నిట్టవొడువ
వచ్చెఁ దద్వీచిప్రవర్తితం బగుచు – వచ్చువహిత్రంబువడువు[1]ను బోలె;
నిచ్చ రత్నపరీక్ష యెఱిఁగి చేపట్టు – బచ్చునుబోలె నబ్బసవయ్యప్రభువు
భావంబు సంగయదేవునియంద – భావనఁ బొరయుడు భక్తిమై మ్రొక్క
రుచిరరత్నప్రభానిచితమై యున్న – యచలితస్వర్ణ సింహాసనం బెక్కి
ప్రభువున్న; నంగప్రభాపటలంబు – లభినుతిఁబొందె దిశాంతరాళముల
నొడల జీవము గల్గియును లేనివాని – నడగల్గియును వర్తనము లేనివానిఁ
గన్నులు[2] వ్రేఁగులుగాఁ గలవాని – మున్ను లింగమ ప్రాణముగ నున్నవానిఁ
జేతనుండయ్యు నిశ్చేష్టలవాని – ఖ్యాతి లేకయు నుతిఁ గడచన్నవాని
బలుకుల మీఱినబాసలవానిఁ – దలఁపులదాఁటిన తత్త్వంబువాని
గుణహీనుఁడయ్యును గుణమిచ్చువాని – బ్రణవాత్ముఁడయ్యు నేర్పడియుండువానిఁ
గని శరణనుచు గద్గదకంఠుఁడగుచుఁ – గనుఁగవ హర్షాశ్రుకణములు దొరుగ
బసవఁడల్లంతటఁ బ్రణమితుండగుచుఁ – నసలార సముచితాభ్యర్చితుఁ జేసి
లింగతూర్యములు సెలంగ నుప్పొంగి – మంగళారతులెత్తె మహిఁ దత్క్షణంబ

## అల్లమప్రభునికి విందువెట్టుట

పళ్లెరంబిడి పంచభక్ష్యాన్నములును – నెల్ల పదార్థముల్ దెల్లంబుగాఁగ
వడ్డించి యబ్బసవండర్థి దొడ్డ – దొడ్డకళ్లుగఁ జేసి తొడిఁ[3]దొడిఁబట్టి
హరునకుఁదొల్లి యా **సురియచౌడరసు** – కరమర్థి[4]నందిచ్చు కరణియుఁబోలె
[5]నందిచ్చుచుండంగ నర్థిఁ జేసేత – నందికొంచును బ్రభువారగింపంగ
బంబి లక్షయు నెను(c?) బదివేలు జంగ – మంబులకనుచు సమగ్రత దనర
నటమున్న చేసినయప్పదార్థంబు – లిటుగూడ సమయుడు [6]నెట్లొకో యనక
యేనకాకోగిరంబింక నీకనుచుఁ – బూని యూఁకింపఁబ్రభువు మెచ్చి యంతఁ
"గో"యని భక్తనికాయంబు వొగడ –"హో"యని సత్కృపాయుక్తి వొల్పార
"బాపురే! బసవ! సద్భక్తసంత్రాణ! – బాపురే! బసవ! సద్భక్తిధురీణ!

1. వడువునుబోలె, ఇట్టి ప్రయోగములు నన్నిచోడని కుమారసంభవమునఁ గూడఁగలవు. 2. వ్రేగులు, వేవేలుగాఁగను 3. బడిపట్టి 4.,5. నందించు 6. నెట్లకో.

నల్లవో! బసవ! యనశ్వరకీర్తి! – నల్లవో! బసవన్న! నందీశమూర్తి!
అమృతంబునందు దివ్యంబగుచేగ – విమలమాణిక్యగర్భమున దీపంబు
చెఱకునఁబండు వసిఁడిఁగమ్మఁదనము – గొఱయైన మలయజ కుజమునబూవు
చిత్తరువునకును జీవంబుఁబసిఁడి – పుత్తళికిని బ్రాణమును నిక్కువముగఁ
బుట్టినయట్టు[1]గాఁ బుట్టితి కొడుక! – నెట్టణ భక్తికి నిలుకడయగుచు
నాదుబసవ! దండనాయకబసవ! – యాది బసవ! యసంఖ్యాతులబసవ!
భక్తులబసవ! యా ప్రమథులబసవ! – ముక్తీశుబసవ! నా ముద్దులబసవ!
సంగన బసవ! ప్రసాదంబుబసవ! – జంగమంబుబసవ! సత్యంబుబసవ!
పండితబసవ! సత్పాత్రంబుబసవ! – బండారిబసవ! సౌభాగ్యంబుబసవ!
తత్త్వంబుబసవ! మహత్త్వంబు బసవ! – సత్త్వంబుబసవ! నిత్యత్వంబుబసవ!
[2]వృషభంబుబసవ! సంవిజ్జ్యోతిబసవ! – విషకంఠుబసవ! వివేకంబుబసవ!
తజ్జ్ఞులబసవ! తత్త్వజ్ఞులబసవ! – ప్రాజ్ఞులబసవ! సర్వజ్ఞులబసవ!
సిద్ధులబసవ! ప్రసిద్ధులబసవ! – శుద్ధులబసవ! ప్రబుద్ధులబసవ!
బసవయ్య! బసవన్న! బసవకుమార – బసవ! బసవరాజ! బసవలింగంబ
వడిఁ బాఱుజలమున కొడలెల్లఁగాళ్లు – వడిఁ గాలుచిచ్చున కొడలెల్ల నోళ్లు
వడి వీచుగాడ్పున కొడలెల్లఁదలలు – వడిఁ జేయు[3] బసవన కొడలెల్ల భక్తి
'బసవా' యనఁగవిన్నఁ [4]బానలొండేల? – పసులకునైనను ప్రబలదే భక్తి?
'బసవా' యనఁగ విన్నఁ[5]బానలొండేల? – [6]పసిబా[7]లురకునైన నెసఁగదేభక్తి?
'బసవా'యనఁగ విన్నఁ బానలొండేల? – యసమాక్షునకునైన నలరదే భక్తి?
'బసవా' యనెడి భక్తిపరులఁ జూచినను – [8]నెసఁగుపక్షులకైన నింపదే భక్తి?
'బసవా'యనెడు భక్తిపరులచేరువను – మసలు జంతువులకు నెసఁగదే భక్తి?
'బసవా' యనినఁజాలుఁ[9]బానలొండేల? – ననలార విషమైన నమృతంబు గాదె?
"బసవా!"యనినఁజాలుఁ[10]బాన లొండేల – పసిగ మైఁగులిశంబుగుసుమంబు గాదె?
"బసవా" యనినఁజాలు[11]బానలొండేల? – వసుధ శత్రులు మిత్రవర్గంబు గాదె?
"బసవా" యనినఁజాలుఁ[12]బానలొండేల – వెసఁగాలు కార్చిచ్చు వెన్నెల గాదె?
లింగైక్యసౌఖ్యకేళీలోల[13]భక్తి – జంగమప్రాణాను[14] సంధానశక్తి

1. మున్పుట్టితి 2. "సౌందర్య(ము)బసవ? సాధ్యులబసవ! నందీశు బసవ! యానం దంబు బసవ!" కొన్ని ప్రతులయందుఁగలదు. 3. బసవ! నీ, 4. 5. బాస 6. పసు 7. బాలులకు 8. నెసఁగఁబక్షుల 9. 10. 11. 12. బాస. 13. యుక్తి 14. సంధానుషక్తి.



యుభయప్రసాదసంయోగోపభుక్తి – త్రిభువనంబుల నున్నదే యితరులకు"
నని పెక్కుభంగుల నగ్గింపుచుండ – [1]ననుషక్తి నా బసవనకుమారుండు
మిక్కిలిసద్భక్తి మిక్కుటంబుగను – మ్రొక్కుచు నందంద మోద్పుఁగేలమర
"భక్తవత్సల! [2]పరాపర! పరమాత్మ! – ముక్తివల్లభ! [3]దివ్యమూర్తి! సర్వజ్ఞ!
ప్రభువ! జంగమలింగ! ప్రమథాగ్రగణ్య! – ప్రభువ! సంగయదేవ! పరమానురాగ!
కారుణ్యనిధి! సమగ్రత సూపి నీకు – నారగింపఁగ [4]బెట్టునంత భక్తుఁడనె?

## పార్వతి ప్రమథులకు విందువెట్టు కథ

కైలాసమునఁ దొల్లి గఱకంఠుఁ గొలువ – శైలేంద్రకన్యక సనుదెంచునెడను
మారారి యట్ల ప్రమథవర్గమెల్ల – నారంగ సారూప్యధారులై యున్నఁ
బరమేశుఁడెవ్వఁడో ప్రమథులందెవరొ? – యరుదెంచి యెఱుఁగలేకంబిక నిలువఁ
బార్వతీసందేహభావన యెఱిఁగి – పార్వతీశుఁడు దక్కఁబ్రమథు లక్షణమ
తమతమ తొంటిరూపములు వోవిడిచి – రమణ నొండొండురూపములు వొల్పార
గోమేషవానరకుక్కుటముఖులు – సామజశరభోష్ట్ర శార్దూలముఖులు
మహిషాశ్వసారంగమార్జాలముఖులు – నహికేసరి వరాహవిహగాదిముఖులు
ద్విముఖచతుర్ముఖత్రిముఖైకముఖులు – నముఖపంచముఖసహస్రాదిముఖులు
లంబోష్ఠలంబాక్షలంబనాసికులు – లంబోదరులు నతిలంబకర్ణులును
గజకర్ణు లజకర్ణు లజితకర్ణులును – విజయఘంటాకర్ణ వీరకర్ణులును
బాహూరుముఖులును బాహూరుతనులు – బాహూరుపాదులు బాహువక్త్రులును
బహుబాహుబహుపాదబహుతాలుజిహ్వ– బహువర్ణ బహుకర్ణ బహురూపధరులు
నై యున్న ప్రమథగణానేకకోట్ల – నాయంబ గని యద్భుతాక్రాంత యగుచు
నతులితనిజసహజాకృతి నున్న – పతికి మ్రొక్కుచును సంస్తుతిపూర్వకముగ
"విను ప్రమథాధీశ! వీరలందఱును– దన మనోధర్మంబు దారిట్లెఱింగి
కామరూపంబు [5]సక్కఁగఁ దాల్చి రొప్ప – నీమహా[6] గణములకెల్ల నీక్షణమ
పెట్టుదు విందు సంప్రీతిమై భక్తి – పుట్టెడు నంచు విభూతులిప్పించి
యరిగి మహాకాశ మనియెడిబయలఁ – బరగఁ దత్త్వములను పందిరుల్ వెట్టి
యవికలాజాండంబు లనుభాండములను – వివిధపక్వాన్నాదివితతులు గూర్చి

1. ననురక్తితోడుత నా బసవండు 2. పరాత్పర 3. దయా 4. బెట్ట నంతశక్తుఁడనె. 5. చక్కనఁ 6. ప్రమథుల.

భవ్యకల్పద్రుమఫలపల్లవములు – దివ్యామృతంబునఁ దివుటఁ దాలించి
క్షీరేక్షురసదధిఘృతవార్ధికోట్ల – క్షీరేక్షురసదధిఘృతములు నినిచి
యకలంకరసరసాయనములు గూర్చి – సకలదీర్ఘి కల వాసన చేసి [1]కలపి
మఱియుఁ జింతామణిమందిరభిత్తిఁ – దఱిఁదఱిఁ బదపదార్థములు సిత్రించి
సురభిసహస్రసుస్థిరజన్మదేశ – వరదివ్యలోచన వలయువస్తువులు
వెండియు సమకూర్చుచుండంగఁ బ్రమథ – మండలి ప్రమథ [2]కుమారు నొక్కరుని
"యరయుమా యవసరం బయ్యెనొ కాదొ? – గిరిజాలయంబున కరిగి నీ" వనుడు
"నవుఁగాక" యని వచ్చి యంబికఁగాంచి –"యవసరంబే"[3]యనియడుగఁగఁదడవ;
"ప్రమథుల నిట్టున్నభంగిఁ దోడ్తెమ్ము – ప్రమథకుమార! వేపరువు[4]న"ననుడు
"నొక్కింత [5]వెట్టిన నొగి నారగించి – గ్రక్కునఁదోడ్తెత్తు గణములనెల్ల
నరుగంగఁ జాల నిట్లాఁకొని" యనుడు – సరసర లింగావసరముఁజెల్లించి
సొంపార గిరిజ వడ్డింప వడ్డింపఁ – బొంపిరి నోగిరంబులు పదార్థములు
కులపర్వతంబులంతలు గళ్లు సేసి – నలినారగింపంగఁ గలపదార్థములు
నోగిరంబులు సమయుడు వెఱఁగంది – యాగౌరి యత్యద్భుతాక్రాంత యగుచు
"నెన్నంగఁబ్రమథులకెల్లఁ గావించి – యున్న పదార్థంబు లోగిరంబులును
మానుగాఁ బ్రమథకుమారుఁడొక్కరుఁడ – తా నారగించెఁ జిత్రముసిత్ర!మింక
నేమిసేయుదు"[6]నంచు నీశ్వరుకడకు – హైమవతీదేవి యరుదెంచి మ్రొక్కి
తలవాంచియున్నెడ దరహాసదీప్తి – [7] వెలయంగఁ బ్రమథుల వినుతిసేయుచును
"గౌరి! యిం దొకసిట్టిగణ మిట్టివాఁడు – తోరం[8]బు గణములగౌరవం బెట్టు
లవు "**నసంఖ్యాతాస్సహస్రాణి**" యనుచు – భువి"సేవ మేతన్నిబోధ[9]త" యనుచుఁ
దొడఁగి వేదములు సంస్తుతిసేయఁబోయి –[10]నడుఁకుచు[11]వడవడవడఁకెడినేఁడుఁ
గావున ప్రమథులక్షయులనపాయు – లావిర్భవన్మహిమాఢ్యు లద్విజులు
నవ్యయులనుపములమరులక్షరులు – దివ్యులు భవ్యులు ద్రిభువనస్తుతులు
సుభగులు సుగుణులు సుమతులు శూరు – లభవు లప్రతిము లత్యానందయుతులు
వేదాంతవేద్యులు విశ్వైకనుతులు – నాదికారణులణిమాది సద్గుణులు
లింగాంశు లయ్యాదిలింగసంభవులు – లింగమూర్తులు మహాలింగైకతనులు
లింగాశ్రయులు ప్రాణలింగసంగతులు – లింగసదర్థులు లింగానుభవులు

1. పట్టి 2. కుమారుని నొకని 3. బేమని 4. నావుడును 5. వెట్టెదే; నెట్టఁదా, 6. ననియా 7. వెలుఁగంగ 8.పు 9.ధితమ 10.యడఁకుచు, నడఁకుచు. 11. గడగడ.



లింగగంభీరులు లింగకారణులు – లింగవ్రతస్థులు లింగచేతనులు
లింగవినోదులు లింగసంచయులు – లింగావధానులు లింగాత్మసుఖులు
లింగాభిమానులు లింగశాసనులు – లింగసత్ ప్రాణులు లింగతత్పరులు
సర్వశుభోదయుల్ సర్వాధిపతులు – సర్వసంపూర్ణులు సర్వకారణులు
[1]వేయేమి? ప్రమథుల కాయంబు మాకుఁ – గాయంబు గాకొండుగాయంబు గలదె?
ఇందొక్క ప్రమథునియిచ్చనజాండ – సందోహములు సెడు జనియించు నిలుచు
నదిగాక హరివిరించాది దేవతలఁ – గుదియింతురనుటెల్ల నిది యెంతవెద్ద
తప్పకిందొక్కఁడు ఱెప్పవెట్టుడును – నప్పుడ సర్వసంహార మౌ[2]ననినఁ
గావున వర్ణింపఁగా నగోచరము – భావించి చూడ మా ప్రమథులమహిమ"
యంచుఁ బ్రశంసింప నంబికాదేవి – సంచితమానసాశ్చర్యయై యుండె;
నట్టిపార్వతియు మున్నారగింపంగఁ – బెట్టఁజాలదు విందు విన్నపాపనికి
దేవ! దేవస్తుత్య! దివ్యలింగాంగ – భావనాతీత! సద్భావసన్నిహిత!
శంకర! [3]దురితభయంకర! శౌరి – పంకజ ప్రభవాదికింకరోల్లసిత!
శుభకర! చిన్మయ! జ్యోతిస్స్వరూప! – ప్రభువ! [4]పరాపర! భక్తవత్సలుఁడ
సర్వకల్యాణ! సంసారవిదూర! – సర్వజ్ఞ! జియ్య! సాక్షాత్సంగమేశ!
నెట్టణ నిష్ఠించి నీకారగింపఁ – బెట్ట నాశక్యమే? పృథుదయా[5]భావ!

**అల్లమప్రభువు బసవనికి వరములిచ్చుట**

యనుచుఁ బ్రశంసింప [6]నల్లమ మెచ్చి – వినుతదయామృతవనధి నోలార్చి
"సురభి చింతామణి సురభూరుహములు – వర(రు?)వులై యుండంగ వరమీగియెంత
వెద్దనా" కనుచు సంప్రీతి సిత్తమునఁ – దద్ద సంధిలఁ బ్రసాదము గృప సేసి
తలఁచిన[7]పదపదార్థములు సేకూడ – వలె నన్న వస్తువులిలఁ [8]దాన పొందఁ
బలికినబాసయుఁ బాటియై తనర – నిలిచినమార్గంబు నిలుకడ గాఁగఁ
బట్టినపదదైనఁ బసిఁడియై వెలుఁగ – ముట్టినబయలైన మూర్తి సేకొనఁగఁ
దెఱలినశివునైన వెఱవక గెలువఁ – దఱిమినజంగమఘట్టున కోర్వఁ
జాలు నక్షయలింగసంపదలిచ్చి – లీలఁ దత్త్వార్థసమ్మేళనంబొలయ
మోహమాయాదితమోరాశిఁ ద్రుంచి – దేహేంద్రియాది విద్వేషం బడంచి
మున్ను దత్త్వస్థితిఁ దన్నుఁ దా నెఱిఁగి – తన్నును సత్క్రియోదాత్తతఁగూర్చి

1. వేయేలఁ 2. ననఁగఁ 3. యఖిల సంస్తవ! వామదేవ! 4. పరాత్పర 5. మూర్తి 6. నల్లన 7. యర్థముల్ దద్దఁ జే 8. దామె.

లీనమై ప్రాణంబు లింగమం దొలయఁ – గా నాథుఁ డాప్రాణలీనమై యుండఁ
గా నిరంతరపరమానందసుఖము – నూనిన శివభక్తియుక్తి మార్గమున
వడి **“దివారాత్రౌచ వర్జయే”** త్తనఁగఁ – బడుసదాంతర్యోగభాతిగైకొలిపి
ఘనబహిరంగ శృంగారాంతరంగ – వినుత ప్ర[1]మథన సంవిత్సుఖలీల
దివ్యానుభవవార్ధిఁ దేల్ప నబ్బసవఁ – డవ్యయశివతత్త్వ మనువు నెఱిఁగి
యుప్పు [2]ముల్లియ నీర నుంచినయట్లు – గప్పురంబున నగ్గిఁ గప్పినయట్లు
వడగల్లవర్షంబు వారాశిఁ గురియు – వడుపునఁ దా లేక వర్తింపుచుండెఁ
బ్రభువుచరిత్రంబు భక్తిమై భక్త – సభలందుఁ జదివిన సంప్రీతి విన్న
సరససమంచిత సచ్చిదానంద – సురుచిరలింగైక్యసుఖము [3] వర్ధిల్లు

## వంగకాయలు లింగములైన కథ

వెండియు నొకనాఁడు దండనాయకుఁడ – ఖండితభక్తివికస్వరలీల
జంగమార్చన సేయుసమయంబునందు – దొంగలు బందివెట్టంగ నూహించి
లింగవంతులు గాని [4] లెంగుల కతని – యంగణాంతరమున కరుగరాదనుచు
వంగకాయలు గట్టుకొంగులఁ బొదివి – లింగసన్నిహితులభంగి వర్ధిల్లఁ
జనుదెంచి యా బసవనదండనాథుఁ – గని భయంపడి మ్రొక్కఁ గన్నులనవ్వి
“లింగవంతులుగాని లెంగుల కీశ్వ – రాంగణంబున కెట్టులరుదేర వచ్చు
నింక భక్తుల కాక యీశ్వరార్చనలు – కొంకక చేయుఁడు గూర్చుండుఁ” డనిన
నుల్లముల్ గలఁగ నొండొరులఁ జూచుచును – జల్లన గుండె [5]దిగుల్లన[6]నవయ
భావించి“మన [7]మెట్టు బందిఁ జిక్కితిమి – దేవర గలిగెనా చావు దప్పెడిని
మన కింక నెమ్మెయి [8]మగిడిపోఁ బోల” – దని కృతనిశ్చయులై కూరుచుండి
సరసర మును లింగసహితులపోలెఁ – గరములు [9]సాఁచుడుఁ గట్టుకొంగులను
భంగి నా బసవయ్య భావసంగతిని – వంగకాయలు ప్రాణలింగంబులయ్యె

## బల్లేశుమల్లయ్య కథ

అట్టిద కాదె మున్వ్యవహార మేఁగి – నట్టిచో లింగాలయంబు లేకున్న
“సంతతలింగ [10]సంస్పర్శన నియమ – మంతరించినఁ జచ్చునటె సెట్టి” యనుచు
గుంచితమతిఁబూరిగుడి [11]వన్ని యచటఁ – గుంచంబుఁ గొండగోఁగులఁ బూజసేసి

1. ప్రమోద 2. ముడియ 3. వర్ధిల్లు 4. వెంగలు లతని 5. ధిగిల్లన 6. నవియ, విరియ. 7. మీద 8. మగుడి 9. సాఁపు;దోఁచు 10. దర్శనసమయంబు, అం. 11. గట్టియెక్క, కు



“కఱకంఠుగుడి యిదెకంటిమే” మనుచుఁ – [1]బెఱికసెట్లాతనిఁ బిలిచి చూపుడును
నాయతభక్తి **“శివాయ నమోన – మో”** యని యందంద మ్రొక్కి ముమ్మారు
వలగొని యింటికి వచ్చి కుడ్చుడును –“నిల లింగ మనుచు నిహీ! మల్లభావ
గుంచంబునకుమ్రొక్కి కుడిచెఁ [2]బొట్టారఁ – గుంచంబుఁగొనిరండు [3]గొలువఁగవలయు
నాఁకటి కక్కఱకైనదె వేల్పు – వేఁకువఁ గుంచంబు వెండియు వలయు”
ననుచు నా శివదేవు నపహసింపంగ –‘వినఁ [4]గూడ”దని చేయి వీనులఁ జేర్చి
“చా!కుక్కలార! సాక్షాల్లింగమూర్తి – గాకకుంచమె? [5]యెఱుంగక మొఱం(ఱిం?)
గెదురు
నమ్మరే రండు పినాకిఁ జూపెదను – గ్రమ్మన” నని యేఁగఁగాఁదొంటియెడను
బ్రాకారమును ముఖభద్రమంటపము – శ్రీకరంబుగ స్వర్ణశిఖరంబు గుడియు
విరచితంబై యొప్పు వృషభేంద్రుఁడెదుర – నరయఁగుంచము లింగ మయ్యెనతండు
నెల్లలోకముల[6]ను బల్లేశుదేవు – మల్లయ్యనా నొప్పె మఱి యట్లుఁగాక

## కాటకోటని కథ

**కాట**[7]**కోటఁడు** నాఁగఁ గలఁ డొక్కగొల్లఁ – డేట[8]పెంట్రుక దన కీశ్వరుండనుచుఁ
బాలెల్లఁ బెంట్రుకపైఁ [9]బోయఁదండ్రి – గేలి సేయుచువచ్చి కాలఁదన్నుడును
ఖ్యాతసద్భక్తిమైఁ **గాటకోటండు** – నాతని కలుగుచుఁ జేతిగొడ్డటను
[10]భూతలంబునఁ బడి పొరిఁబొరిడొల్ల – నేతరి వెనుకముందించుక లేక
తల దెగిపడ వ్రేసెఁ దా భవంబనెడు – పులితలఁ దెగవ్రేయుపొలుపు వర్ధిల్ల
నిక్కడనితఁడు దా నిట్లు వ్రేయుటయు – నక్కడఁ గైలాసహర్మ్యకవాట
జాలముల్ గూడ జర్జరితమై [11]పడియెఁ [12]గీలాకో! గొడ్డలి “గైలాసమునకుఁ
గడుఁజోద్య”మనినరుల్ [13]బుడిబుళ్లువోవ – నదరఁబెంట్రుక లింగమయ్యె[14]నంతటను
బంబిన **బావూరిబ్రహ్మయ్య**భావ – నంబునఁగాదె జొన్నలు లింగమయ్యెఁ
గావున భక్తులభావంబు లింగ – దేవునకును జన్మదేశంబు [15]గాదె
బసవని భక్తిసౌభాగ్యప్రభాతి – యెసకంబు దలపోయ నిది యెంతవెద్ద?
చపలలు శివునిలాంఛనపరులగుచు – నపవర్గకారణులై రదెట్లనిన:–
నేణాంకధరుభక్తి కెక్కు “ననాద – రేణ శాఠ్యేన” యన్ క్రియఁదలపోయ

1. బెఱెక 2. గడ్పార 3. కొల్వంగలేదు 4. గాదనుచుఁజెయి5. కనుకనిమొఱింగెదరు 6. బల్లేశ్వరుదేవ 7. కోటండనాఁగలఁ 8. పెంట్రిక 9. గీటఁ, జిందఁ 10. ఈ ద్విపద కొన్ని ప్రతులలోలేదు 11. కూలె 12. కీలకో 13. బుడి బుళ్లిఁబోవ 14. వెండియును 15. గాన

ననుచు భక్తానీక మచ్చెరువంద- నను [1]షక్తి ముచ్చుల నబ్బసవయ్య
యచ్చులcగాcజూచి యభిమతార్థంబు- లిచ్చి భక్తులc జేసె [2]నిజ్జగంబెఱుcగ

## జొన్నలు ముత్తెములైన కథ

మఱియును నొకజంగమం బేcగుదెంచి- యతిముతి నభ్యంజనావసరమున
"[3]నిత్యనేమం బిది నేcటిప్రొద్దునకు- ముత్యాలపొడి మాకు ముక్కున వలయుc
గదలక మెదల కీక్షణమాత్రలోనc-బదివుట్లముత్యముల్ బసవ! యి"మ్మనిన
సరసర[4]లింగపసాయితశస్త్ర - కరతలుcడై చూడc గనుదృష్టి నున్న
జొన్నల [5]ప్రో(c?)క విశుద్ధముక్తాఫ-లోన్నతరాశియై యున్న నవ్వుచును
"సన్నుత! పదివుట్లసంఖ్య మీకేల?-యెన్ని మీ వలసిన వన్ని గైకొనుcడు"
అనవుడు"నట్లకా"కనుచు ముత్యములు-గొనిపోయెc బెఱికలc[6] దనరనన్నియును.

## మొఱటద వంకయ్య కథ

**మొఱటద వంకయ్య**మున్నొక్కనాcడు- కఱ [7]కంఠభక్తుcడొక్కరుc డర్ధరాత్రి
నరుదేరc బొడగని యడుగుల కెరcగి- సరసోచిత క్రియా [8]సంతుష్టుc జేయ;
"మాలింగమునకుc నేమమ్మొక్క మొదవు-పాలును మారేడుcబత్తిరి వలయు,
నటుగాని యవసరం బలవడనేర;- [9]దిటసెల్లునో యని యేcగుదెంచితిమి
ఎడసేయc [10]గా దింక నీక్షణంబునను- గడియింపకుండినc [11]గాదు గార్యంబు
హరభక్తులూర లేరొరుల నే నడుగc- బొరుగూరికీ [12]వేళc బోవంగరాదు
ఇంకనె" ట్లన నాత్మ నించుకేనియును- **గొంకక వంకయ్య** గొడ్డు నక్షణమ
కొనివచ్చి యొకవట్టికొఱట సంధించి- మనసిజహరభక్తమండలిc దలcచి
"యీకొఱటన [13]పత్తిరీ గొడ్డునంద- ప్రాకటంబుగc బాలువడయుదు" ననుచుc
గుండ వేగమ కద్గికొనివచ్చి పిదుకc - గుండ నిండcగc బాలుగురిసె నాగొడ్డు
కొఱటనె పత్రి యంకురితమై [14] పరిగె- వఱల నామొఱటద వంకయ్య గోసి
తెచ్చి యా భక్తున కిచ్చి నేమంబు- సెచ్చెరc జెల్లించెc జెప్పc జిత్రంబు
అనcగ విందుము దొల్లి యాద్యోక్తులందుc- గనుcగొంటి మిప్పు డీ కటకంబునందు

1. రక్తిమైముచ్చులను బసవయ్య 2.నిలవట్లుగాక 3.ఇక్కడ 'నిత్తెనేమ'మనియు 'ముత్తేల పొడి' యనియు దిద్దcదగియున్నను, వ్రాcతప్రతు లన్నింటను నిట్లేయుండుటచేతను, 'నిత్యనేమ' మని యీ కవి మఱికొన్ని చోట్లcగూడc బ్రయోగించుటచేతను, నట్లుచేయ లేదు. 4.వశాయత 5.ప్రోcగు 6. దనకైనయన్ని 7.కంఠు8.సంపన్నుc సంపూర్ణుc 9.ఇటు సె10.రా 11.గాదు లేదనిన 12.ప్రొద్దువో 13.పత్రియీ. 14. తనరె, పర్వె(ర్వ)



బసవని దృష్టిసంస్పర్శనంబునన - [1]యెసcగు జొన్నలప్రో(c?)క యిందఱుc జూడc
బొనరుచు ముత్యాలప్రో(c?)కయై తనరె" - నని భక్తమండలి వినుతింపుచుండc

## సంగమేశ్వరుcడు బసవని మూcడవకన్నడుగు కథ

జెచ్చెర మఱియు నీప్సితవస్తు[2]వితతి - నెచ్చుగా బసవcడిట్టిచ్చుటc జూచి
"వేడుకయ్యెడు నాకు వేcడంగ" ననుచు - రూఢిగా జంగమరూపంబుcదాల్చి
చక్కన సంగమేశ్వరుcడ యేతెంచి - గ్రక్కున మూcడవక[3]న్నడ్గc దడవ
ఆయత లింగపసాయితహస్తుc - డై "యెఱుcగనె నీదుమాయ నే" ననుచు
ముకురంబుcజూపుచు"ముక్కన్ను నీకు - నకలంక! సహజంబ యదెచూడు" మనిన
నద్దంబులోన ఫాలాక్షంబుc గాంచి - యద్దేవదేవుండు దద్ద లజ్జించి
యప్పుడక్కడన నిరాకార మగుడుc - జప్పరింపుచుc జూచి"చా!పంద! పంద!
ఓడకుమోడకు మోరోరి! సంగ! - ఓడకుమోడకు మొకటి[4]యు నొల్ల
నెఱుcగవే సత్యమాహేశ్వరులిండ్ల - నెఱయంక కానిని నిజగతి నన్ను
దాసయ్యవలె నిన్నుc దవనిధి వేcడ - నా సిరియాలున ట్లాత్మజుc గోరc
గనకవృష్టి యడుగc గరికాలునట్ల - వనితకు నెడవుచ్చు మన నంబిభాతి
వెండియుc **గుమ్మరగుండయ్య** కిచ్చు - మిండప్రాయంబుc గామింపc గాదేవి
స్వర్గాపవర్గాది సౌఖ్యంబులొల్ల[5] భర్గ! - [6]నీ ప్రమథుల భక్తులయిండ్ల
నలరుచు డించిన యా ప్రసాదంబె - కలదు భోగింపcగాc గలకాలమెల్ల
సర్వభక్తాత్మ! మీ జలకంబువాcడు - గుర్వుగా మా **కాటకోటయ్య**గారు
హర! మీ నగరిమాలకరి **పుష్పదంతుc** - దరిదిపూజారి కన్నప్ప [7] **దేవయ్య**
యిండెగట్టెడిది **మా[8] యిండెరేకవ్వ** - ఖండదీపమువాcడు [9]గా **నమినంది**
నెట్టణ దీవించి నీకు విభూతిc - బెట్టెడువాcడు మా **పిళ్లనైనారు**
అను[10]షక్తిమై గంధ మర్పించువాcడు - మనసిజసంహర! **మాయణుమూర్తి**
వరద! మీ ధూపంబువాcడు **మాచయ్య** - వరకీర్తి! మీ గంటవాc డోహిళయ్య
ధర మంగళారతుల్ [11]దరిసించువాcడు - వరద! **సోమయగారు** శరణవత్సలుcడు
వంటకట్టెలు దెచ్చువాcడు **మారయ్య** - పంటింపc **గరికాలు** పడివెట్టువాcడు
కఱకంఠ! యడబాల **సిఱుతొండనంబి** - [12] మఱి బానసమునది మా **సంగళవ్వ**

1. యెసcగ 2. సమితి 3.కన్నడుగుటయు 4.నేనొల్ల 5.భర్గుని 6.నిన్గొల్చిన 7.దేవుండు 8.యిండి 9.కడమలనంబి 10.రక్తిమై 11.దనరించు 12.మఱియుబానసముది.

కరికాళచోడు(?)వళ్లెర మిడువాఁడు – గరగ[1]కావటివాఁడు ఘనుఁడు **హొన్నయ్య**
రమణీయమగు నోగిరంబుల [2]పరిసె – నమువాఁడు సెన్నయ్య **విమలదేహుండు**
ఆరగింపఁగఁ బెట్టునవసరంబులది – **వీర[3]చోడవగారు** విశ్వైక వినుత!
అడపంబువాఁడు **రేచయ**మును(?)[4]బాలు – పడుప్రసాదులు **బిబ్బబాచయ్యగారు**
మృదుఁడ! మా నాట్యనమిత్తండి వైద్యుఁ – డదరంగఁ **గల్లిదేవయ్య!** వెండీఁడు
మలహర! సామవేదులు పురోహితులు – వెలయఁ బౌరాణికుండిల **మాయిభట్టు**
కోరి మీ పరిహాసకులు **గళియంబ – [5]గారు వాగీశనైనారు** వాఠకుఁడు
**శ్రీ పతిపండితుల్** శివుఁడ! మీ[6]కవులు – నా **పండితయ్య**గారనుఁగుఁబండితులు
నాదివీణెలవాఁడు మాదిరాజయ్య – నాదరసజ్ఞుఁడు నలి **శంకరయ్య**
కరణంబు గర్మసంహర! **కేశిరాజు** – ధర **జగదేవుండు** దండనాయకుఁడు
గణనాథుఁడిందు శేఖర! మీ ప్రధాని – ప్రణుతించి[7]చూడ మా ప్రభువు మీ ప్రభువు
ఇఱవత్తుఁడు గజసాహిణి యశ్వసాహి – యొఱపుగాఁ **జేరమ యోగి**యొడయఁడు
అనఘ! **రామయ్య** యేకాంతంబువాఁడు – నొనర **బల్లహుండు** గుంటెన, **సఖినంబి**
**శంకర!** నీ బంటు **శంకరదాసి** – యంకంబువాఁడు [8]**నేణాదినాథుండు**
లెంక దా **మంచయ్య** లీల మీ నగరి – సుంకీఁడు [9]**సుంకేశు బంకయ్య**గారు
సురియఁబట్టెడువాఁడు **సురియచౌడయ్య** – పొరిఁ**గులచ్చిరియారు** భువి హేళగీఁడు
హర! నీకు **బెజ్జమహాదేవి** దాది – ధర రుద్రపశుపతి దామంత్రవాది
సువిధాని! **కక్కయ్య** భువి జాలగాఁడు – శివరాత్రి [10]**సంగయ్య** [11]సెలిబోగ[12]తండె
దేవరదాసయ్య దేవ! [13]దాసీఁడు – భావింపఁ **గిన్నరబ్రహ్మయ్య** బచ్చు
**మడివాలు మడివాలుమాచిదేవయ్య – కడమలనంబి** సొప్పడ [14]దివ్వెలాఁడు
తెల్లంబు గోడలు దీర్చెడువాఁడు – [15]సల్లీల **గోడలమల్లయ్యగారు**
**కుమ్మరి గుమ్మరగుండయ్యగారు – బొమ్మయ్య** వేఁటకాఁడిమ్మహిలోన
కమ్మ [16]రమ్ములవాఁడు ఘనుఁ **డిల్లహోళ – బొమ్మయ్య** గీలారి నెమ్మిఁ జండండు
[17]మాయావి **బల్లేశుమల్లయ్య** [18]గట్టె – బోయీఁడు బాచయ్య భూరికొటారి
పాలువిదుకువాఁడు లీల **వంకయ్య** – పాలుగావంగ నేర్పరి **గొడగూచి**
కావున నీదు సకలనియోగంబు – మావారలై యండ మన్మనోరమణ!

1. కావడి 2. పరికరము 3. చోడప 4. మనవాలు 5. నారు 6. కావ్యుఁడా 7. చూడఁగఁ బ్రభువు 8. నేణాది 9. బంకీశుసుంకయ్య 10. బంకయ్య 11. చవి 12. తద్దె 13. మాసీఁ(స్టీ?)డు 14. దివ్వటీఁడు 15. బల్లిదుల్ 16. తమ్ముల వాఁడు 17. మాయారి 18. కొట్టు.



ఏమిటఁ గొఱఁత? నా కేమిటఁగడమ?– ఏమైన నడుగు నీకిచ్చెదనింక
మానంబు వదలిన[1]మదిఁ దల్లడిలిన – మానుగాఁ బ్రమథులయాన నీ యాన
కాలకూటము గుత్తుకకు రాకమున్న – క్రాలుపురంబులు గాలకమున్న
గౌరివివాహంబు గాకటమున్న – యార నజాండంబు లలరకమున్న
తివిరి మూర్తులు నెన్మిదియు లేకమున్న – భువి హరిబ్రహ్మలు వుట్టకమున్న
యటమున్న యటమున్న[2]యటమున్నమున్న – యిట నీవు నా స్వామి [3]షేను నీ బంట
కఱకంఠ! [4]యిదియేమి [5]గళవళించెదవు – వఱల నా చేతఁ బోవచ్చునే"యనుచు
నసమాక్షుతోడ[6] మాఱంకమై గెలిచె – బసవఁడుద్యద్భక్తి [7]భాతిమై నిట్లు

### బసవఁడు గొల్లెతచల్లకడవఁ బడకుండఁబట్టిన కథ

వెండియు నిర్మలాఖండిత[8] కీర్తి – దండనాథాగ్రగణ్యుండు [9]పుణ్యుండు
సజ్జనసుతుఁడు బసవఁ డొక్కనాఁడు – బిజ్జలుకొలువునఁ బ్రీతిఁ గూర్చుండి
"యొడకోడకు"[10]మనియొక[11]కడవెత్తు – మాడికి బాహుయుగ్మముఁజాఁపఁదడవ
"ఇసుమంత"[12]బూడిద నొసలఁబూసినను – మసలక కొండంతమరు[13]లొందుననుట
తెల్లం" బనుచు రాజు మెల్లన నగుచుఁ –"జెల్లఁబో బసవయ్య! శివమరుల్ గొంటె
[14]బ్రమసితే తలకెక్కి భక్తిరసంబు – గుమతివై నిండినకొలువులోపలను
"నోహో"యనుచు"నోడకోడకు"మనుచు – బాహుయుగ్మము సాచిపట్టుటే"మనినఁ
"స్వగుణసంకీర్తన దగదు సేయంగఁ – దగదని యున్నను నగుసభ" యనుచుఁ
"త్రిపురారిగుడితూర్పుదెస నేఱునేలఁ – **గపిలేశ్వరంబండుఁ** దపసి యొక్కరుఁడు
ఆ లింగమునకు నిత్యము నాఱువుట్ల –[15] పాల మజ్జనమార్పఁ గాలువల్ గట్టి
వీథివీథుల వెల్లివిరియ నేనుఁగుల – పాద[16] ఘట్టనములఁ బంకంబు రేఁగ
నా వీథిఁజల్లఁ దా నమ్ముచుఁ[17] గఱఁకఁ – బోవుచోఁగాలూనఁ బోయినఁదొసఁగఁ
గదురొంపిఁ[18]గాలుజారుదుఁజల్లకడవ – పడఁ[19]బోవ [20]గొల్లెత"బసవరో"యనిన
బట్టితి నచ్చటఁ బడకుండఁ గడవఁ – జట్టన చేతులు సాచి యే ననుచు
గొల్లెతరూపంబు గొల్లెతయిల్లు – గొల్లెత యున్న [21]యిక్కువయుఁ జెప్పుటయు

1. మహిఁ,మతిఁ 2. యంతకమున్న 3. యేను 4. యిట్లేల 5. కలవరించెదవు 6. మాఱాఁకమై 7. బ్రాంతి 8. మూర్తి 9. ధన్యుండు 10. మంచునొ 11. కడువెత్తు 12. బూడిది, బూడిదె 13. లెత్తె 14. భ్రమసితే 15. పాలు 16. ఘట్టనచేత 17. గడవఁబోవుచుఁగాటక బోయినిదొసఁగ (యనఁగ)? 18. గాల్దెమల్పడఁ 19. బడ 20. బ్రాంతప్రతులన్నింటను 'గొల్లెత' యను రూపమే కలదు 21. యింకువయు.

రప్పించి గొల్లెత రాజు దా నడుగఁ – దప్పక బసవయ్య సెప్పినయట్ల
చెప్పుచు [1]నొఱగినచేతి ఱొంపియును – నప్పుడు జాఱంగ నంటినకాలి
ఱొంపియుఁ జూపి యెఱుంగ[2] రె యితని – పెంపునకిది[3] సెప్పఁ బెద్దయే తొల్లి

## తిరుచిట్టంబలుని కథ

ప్రవిమలభక్తి విభ్రాజిత [4]లీల – భువి [5]నఱువాద్దడి మువ్వురిలోన
శ్రీనిలయుఁడు **దిరుచిట్టంబలుండు** – నా నొక్కభక్తుఁ డనశ్వరకీర్తి
కరమర్థితో వర్షకాలంబునందు – హరపూజనార్థమై [6]యట్లొక్కనాఁడు
చని పుష్పములు గోసికొని వచ్చునెడను – వననిధితీరంబునను గాలు జాఱి
పడి వడిఁ బుష్పముల్ వడకుండ భక్తుఁ – డదరుచుఁ"జిట్టంబలాధీశ"యనుడుఁ
బరముఁడు భక్తునిఁ బడకుండఁ బట్టు – పరుసున ననుఁ బట్టె బసవలింగంబు
వడి నట్టులును [7]గాక వసుధేశ వినుము – [8]పుడమిని సొన్నలి[9] పురవరంబునకును
బోయినచోటఁ దత్పురి సుఖగోష్ఠి – నాయతభక్త సభాభ్యంతరమున
సిద్ధరామునిఁ జూచి శివభక్తవితతి – "సిద్ధుండ! లోకప్రసిద్ధంబు గాఁగ
నభినవశ్రీగిరి యనఁగ నిప్పురము – నభినవలీల సొంపార రచించి
**యా పర్వతము మల్లికార్జునదేవు** – నేపారఁ గొనివచ్చి యిచ్చట [10] నిలిపి
ధ్రువముగా లక్షయుఁ దొంబదివేలు – శివలింగములను జెచ్చెరఁ బ్రతిష్ఠించి
దానికిఁ దనఁగ మర్త్యములోనియన్న – పానముల్ ముట్టక భక్తిపెంపునను
సహజమకుటము నొసలికన్నుఁ దనర – మహితయోగానందమహనీయలీల
మేనినీడయు భువి మెట్టిన[11]–యజ్జ – గానఁగఁబడ దనఁగాఁ జరింపుచును
నమితసమాధియోగాంతంబునందుఁ – బ్రమథలోకమునకుఁ బన్నుగా నేఁగి
యక్కడఁదత్త్వరహస్యసద్గోష్ఠి – మక్కువ నెక్కొన మసలి [12]యే తెంతుఁ
[13]బ్రఖ్యాతమిది [14]మాకుఁ బ్రమథలోకమున – నాఖ్యాతసత్కీర్తి[15] యగు బసవాఖ్యుఁ
బొడగంటిరే [16]భక్తభూరిసద్గోష్ఠి – గడు[17]నొప్ప నిక్కడఁ గలుగు నక్కడను
నతఁ డుండు నా విందు మఖిలలోకముల – సతతసాన్నిధ్యానుషక్తిమై" ననిన
శివభక్తతతిఁ జూచి **సిద్ధరామయ్య** – "ప్రవిమలగతి నేఁడు ప్రమథలోకమున
నరసి వచ్చెద"నంచు నాక్షణంబునను – నరిగి కైలాసనగాగ్రహర్మ్యమున

1. నూఁగిన 2. వే 3. యొక్క 4. మహిమ 5.నఱువత్తాది? నఱువత్తాండి 6. యందొక్క 7. గాకవిన్ పుడమీశ! 8.కడయను 9.కపురంబుకును 10. నునిచి 11.యడుగు 12. యేతెంచు 13. ప్రఖ్యాతియిది 14. మీకు 15. యట 16.మీరు.



## సిద్ధరామయ్య కైలాసమున కరుగుట

నజ [1]కాలబుద్ధ క్షయాంత[2]రజ్యోతి – నిజ[3] బలప్రియ యామ్యనీల రుద్రేశ(శ్వ?)
యీ(రే?)శాన శర్వ సర్వేశ భర్గ ప్ర – కాశ సురాధీశ గౌరీశ ధన్య
వామదేవ భవోద్భవ ప్రచండ ధర – వామదేవో(హో?)గ్ర సంవాహ పినాకి
ధాతృ విధాతృ హుతాశన శివ మ – హాతేజ సూక్ష్మలయ క్రూరదంష్ట్ర
క్షేమేశ [4]వికరణార్చిష్మంత దమన – భీమాభిధానోగ్ర పింగాక్ష [5]కర్తృ
విషధరానంత నివృత్తి నిధీశ – వృషభగణాధ్యక్ష విభు వాయువేగ
హరరత్నకర బభ్రు హంతాగ్నిదుఃఖ – కర సుఖకర [6]సుదుంబర కాలరుద్ర
హరిహరబ్రహ్మసౌమ్య స్వామి మృత్యు – హర భయానకహలాహల పరం[7]ధామ
వజ్రదేహావ్యయ వట రుద్ర దీర్ఘ – వజ్రదంత వియోగ వట విరూపాక్ష
సహనేశ శంభు పంచశిఖ నియోక్తృ – గుహ రుద్ర[8] బాధక గోపతీశాన
పింగ ళాసాధ్య మాతంగ రోహిత[9]సు – రంగ కపాలధర స్థూలరుద్ర
శాశ్వతే శోర్ధ్వకేశ త్రిదశేశ – విశ్వేశ చండేశ విత్తేశ వృషధ
రాక్షయరుద్ర కాలాగ్నిరుద్ర త్రి – యక్షఫణీంద్ర విచక్షులాదిగను
రుద్రచిహ్నాలు గ్రాల రుద్రాత్ములైన – రుద్రగణాధీశ్వరుల్ సేరికొలువ
శ్రీనంది నందినాథానంద వృషభ – సానంద గోముఖ హయ[10] ముఖాభంగ
దండపా ణీశాన చండీశ [11]రుద్ర – రుండాభరణ రుద్ర పుండరీకేశ
పర్వతాభరణ దర్ప సుభద్రశర్వ – సర్వజ్ఞ సర్వాత్మ సర్వసంహరణ
దారుక రేణుక ధవళాక్ష వీర – వీరక వీరభద్రారూఢ భద్ర
త్రిజటి ధూర్జటి లోకవిజయాట్టహాస – నిజబల విషబల నీల నిశ్శంక
నీలలోహిత నిత్య నిష్కళ శాంత – కాల మహాకాల కాల కాలోగ్ర
రూప నిరూప విరూపాక్ష విశ్వ – రూప పుష్కళ శాంతరూప వృషాంశ
యుగ్రాక్షభర్గాసితగ్రీవపింగ – ళోగ్రకాయాతీత(?) యుత్తుంగవిముఖ
కరిముఖ నరముఖ కపిముఖ ద్విముఖ – శరభముఖాముఖోష్ట్రముఖ శార్దూల
ముఖ చతుర్ముఖ పంచముఖ సుముఖాష్ట – ముఖ నవముఖ దశముఖ షణ్ముఖైక
ముఖ సహస్రముఖ దుర్ముఖ వికటాక్ష – మఖహర విషహర [12] మలహర మృత్యు

1. కలా. 2.క 3. గుణ 4.విత 5. కృత్య 6. సదంబర 7. ధాత 8. ఘాతుక 9.కు 10. ముఖనంద 11. రౌద్ర 12. శిఖి, స్మర

హర యమహర గజాసురహర సకల – సురహరాసురహర పురహర భృంగి
గజకర్ణశార్దూల కర్ణాశ్వకర్ణ – విజయఘంటాకర్ణ [1] వీరగోకర్ణు
లాదిగా బలసి సదైశ్వర్యలీల – నాది ప్రమథగణేంద్రావళి గొలువ
సనకసనందన సన్మునీశ్వరులు – ననుఁగులై [2]తమహృద [3]యాబ్జముల్ వూన్ప
నుపమన్యు వామదేవ పవిత్రపాణి – కపిల కణ్వాగస్త్య కౌశిక సుబల
శ్వేత దధీచి వసిష్ఠ [4]కణ్వాత్రి – గౌతమ కశ్యప సూతానిలాత్మ
మాండవ్య హరిత మార్కండేయ పులహ – శాండిల్య వత్స కుత్స పులస్తిశక్తి
బాదరాయణ భృగు బక దాల్భ్య రురు శి – లాద మౌద్గల్య వర్ణాద శాకల్య
[5]గర్గ శౌనక [6]చతుష్కర్ణమృకండు – భార్గవాంగిరస విభాండక శునక
మైత్రేయ బల్లకి మంకణ చ్యవన – మిత్రావరుణ నారదాత్రిసౌవర్ణ
పైలసుమంతుసుబ్రహ్మణ్య మంద – పాల సుమిత్ర రైభ్యక సత్య సుమహ
పర్వత జైమిని పౌలస్త్య గార్గ్య – దుర్వాసు లాదిగా సర్వ సన్మునులు
[7] వెలుఁగ నాశీర్వాద వేదనాదముల – నలరుచు నందంద యనుకీర్తిసేయ
సుర నర దనుజ ఖేచర సిద్ధ సాధ్య – గరుడ గంధర్వోరగ ప్రకరంబు
ద్వాదశాదిత్యు లేకాదశరుద్రు – లాది నవబ్రహ్మ లష్టవసువులు
సురపాగ్ని యమదైత్య వరుణగంధవహ – నరవాహ [8]హరదిశానాథయూథంబు
శ్రీవాగ్వధూనాథ జిష్ణులు నవిక – లావరణస్థులై యభయముల్ వేఁడఁ
దుంబురునారదాదులు సుగీతామృ – తంబున నెయ్యంబు దనర నోలార్ప
నంబికా [9]సహితుఁడై యాస్థానమంట – పంబునఁ బేరోలగంబున నున్న
శివదేవుఁగనుఁగొని సిద్ధరామయ్య – యవిరళభక్తి సాష్టాంగుఁడై మ్రొక్కి
"విన్నపం బవధారు విశ్వలోకైక – సన్నుత!" మర్త్యంబు సద్భక్తజనులు
"ప్రమథలోకంబున బసవండు[10]గలఁడొ – ప్రమథేశుకొలువునఁ బరికింపు" మనిరి
"బసవసంస్తుత్య! సద్భక్తైకదేహ! – యసలార నున్నరూపానతి" [11]మ్మనిన

**శివుఁడు తన హృదయమున బసవనిఁ జూపుట**

"నాలోక మీలోక మననేల బసవఁ – డేలోక [12]మునను లేఁ? డెల్లచో నుండుఁ
బ్రమథులయందు సద్భక్తులయందు – నమరంగ నా హృదయాబ్జకర్ణికను

1. విమల 2.నిజ 3.యంబులఁ బూ 4. కణాద 5. గార్గ్య 6. జతుకర్ణి 7. వెలయ 8. భవనిశా 9. సహితమై 10.కలఁడు 11. మ్మనుడు 12.మందు లేఁడెట్లు తలంపఁ



సతతంబు గురులింగ [1]చరణములయందు – నతిముదమున నుండు నాది బసవఁడు
అట్టొట కి[2]టుసూడుమా"యని శంభుఁ – డిట్టలంబుగఁ దన హృదయంబుఁదెఱవ
సంగతంబగు కరస్థలము లింగంబు – జంగమావళికిని శరణుకరము
ననిమిషుఁడై చూచు హరుమీఁదిదృష్టి – గనుఁగ హర్షాశ్రుకణవితానంబు
దరహసితాస్యవిస్ఫురణయుఁ దనరఁ – బరమశివధ్యానపారవశ్యమునఁ
బద్మాసనస్థుఁడై పరమేశు హృదయ – పద్మంబునం దున్న బసవనిఁ జూచి
ప్రమథులు హర్షింప నమరులు మ్రొక్క – నుమబోటి యత్యద్భుతోపేతగాఁగ
నా మూర్తిఁ గని సిద్ధరామయ్య యుద్గ – తామితానందపూర్ణాత్ముఁడై [3]తనర.
హరుఁడు పర్వతపుత్త్ర నరవిరికంటఁ – బొరిఁ బొరిఁ జూచుచుఁ"బూర్ణేందువదన!

**శివుఁడు పార్వతికి బసవని మహిమ తెలుపుట**

చూచితే బసవనిసురుచిరమహిమ – యీ చెల్వునిల్కడ యేరికిఁ గలదె?
వెలయఁగ నయ్యాదివృషభేంద్రుఁడనఁగ – నలి నేన రెండుమూర్తులు ధరించితిని
విను"తవపుత్త్రోభవిష్యామి" యనుచు – నెనయ శిలాదున కేన పుట్టితిని
అసలార భక్తహితార్థమై యేన – వసుధ జనించితి [4]బసవండనంగ
నెసఁగ నిట్టిద[5]కాన యీశుండ నేన – బసవఁడ≡ పేరి సద్భక్తుండ నేన
మున్నును మన బసవన్న సద్గుణ మ – హోన్నతి యెఱుఁగవే యొగి నట్లుఁగాక
లోకాధిపతి నేను లోలాయతాక్షి! – ప్రాకటంబుగ లోకపావనుఁడితఁడు
కారణలోకసంహారుండ నేను – కారణలోకోపకారి యితండు
భక్తవత్సలుఁడ నేఁ బర్వతపుత్త్రి! – భక్తరత్నములకు బండారి యితఁడు
భక్తైకదేహుండ భావింప నేను – భక్తజనప్రాణి బసవఁడీక్షింప
ముక్తికి రాజఁజూ ముద్దియ నేను – భక్తికి రాజుసూ [6]బసవఁ డీక్షింపఁ
[7]బసరింప నే లింగపట్టబద్ధుండ – బసవండు సద్భక్తిపట్టబద్ధుండ
అచరలింగంబ నే నచలేంద్రతనయ! – సచరాచరక్షోణిఁ జరలింగమితఁడు
సనునాది నా పేరు [8]శంభుండనంగఁ – బొనర ద్వితీయశంభుఁడు వీనిపేరు
స్థిరభక్తి మమ్ముఁ గొల్చినఁగాని లేదు – ధర వీనిఁ దలఁచినంతనె [9]ముక్తి గలదు.
అలరుచుఁ బ్రాణదేహార్థముల్ నాకు – నిల నిత్తు రఖిలభక్తులు నొక్క యెడను

1. చరణంబులందు, జంగమంబందు 2. కిదె 3. యుండ 4. బసవేశుఁ డనఁగ 5. కాక 6. బసవండు తలఁపఁ 7. బ్రసరింప 8. శంభుండనాఁగఁ శంభుండునాఁగఁ 9. కల్గుభక్తి.

నచ్చుగాఁ బ్రాణదేహార్థముల్ బసవఁ – డిచ్చుచునుండుఁ[1]దా నెల్లభక్తులకు
నా యతమతి బసవా యనఁబరగు – నీ యక్షరత్రయం[2]బిట్లొక్కమాటు
సదువు నాతని ముఖసదనంబు నందె – కదలకుండుదుము మా గణములు నేము
పొదలు నెవ్వని యాత్మ [3]సుదితసద్భక్తి – యదియు బసవని మహత్త్వంబ కాదె
పరికింపనెవ్వఁడు వడయుఁ బ్రసాద – వర[4]ముక్తి యది బసవని కృప గాదె
మదిలోన నెవ్వఁడు మముఁ దలపోయు – నదియెల్ల బసవనియంశంబ కాదె
[5]పసరించు జంగమభక్తి యెవ్వండు – వసుధలో నది బసవనివృత్తి గాదె
భక్తిపట్టము దాల్ప బసవఁడు దక్క – శక్తిసమేతులు [6]జగతిపైఁగలరె
యదిగాక యొక్క నాయందేల భక్త – హృదయస్థుఁడై [7]చూడ నిట్లున్నవాఁడు
అంచు వెండియుఁ బ్రస్తుతించుచు శంభుఁ – డంచితమతి బసవయ్యకిట్లనియె
"బసవ! మర్త్యమునందు భక్తులు గలరె? – [8]యెసకమై సంసార మిష్టమే నీకు?"
నని యానతిచ్చుడు నద్దేవు హృదయ – వనజస్థుఁడగు బసవండిట్టులనియె
"మందునకైనను మర్త్యలోకమున – నిందు శేఖరుభక్తుఁడెందును లేఁడు
భక్తుండ నేన చూ భక్తులిందఱును – భక్తాత్మ! మీ స్వరూపంబ కావునను
వెండియుఁ గలదొక్క విన్నపంబింకఁ – జండేశవరద! ప్రసన్నత వినుము
జంగమలింగప్రసాదోపభోగ – సంగతసుఖసుధాశరధి నోలాడు
[9]నిటువంటిభవములెన్నేనియు లెస్స – యిట యపవర్గమహిష్ఠతకంటెఁ
గావున శునకసూకరక్రిమికీట – కావహజన్మంబులైనఁ గానిమ్ము
సు[10]ప్రసిద్ధము జంగమప్రసాదంబ – యేప్రొద్దు భోగింప [11]నెట్లు గల్గినను
జాలుఁబో భవకోటిశతసంఖ్యలందు – [12]నోలినఁ బుట్టింపు మొకటియు నొల్ల"
ననవుడు గౌరీశుఁడతిదయాదృష్టిఁ – గనుగొని సిద్ధరామునకుఁ జూపుడును
శివునకు మ్రొక్కుచు సిద్ధరామయ్య – భువికి నేతెంచి యద్భుతము నెక్కొనఁగ
భక్తసమూహికి బసవయ్యమహిమ – వ్యక్తిగాఁ జెప్పంగ నట్ల నేవింటి"
ననవుడు బిజ్జలుఁ"డట్టు లౌటకును – జనులకునెల్ల [13]దృష్టంబిప్పుడిదియ"
యనుచు నమూల్యవస్త్రాభరణములఁ – బొనరంగఁ [14]**గాళవ్వబోయత** కొసఁగి

1. నెల్లెడ భక్తతతికి 2.బెవ్వఁడేనియును 3.నొదవు 4.భక్తి 5. ప్రసరించు 6. జగములఁ 7.కూడ 8.ఎసఁగు నీ సంసార 9.నటు... లెన్నైనను మేలు 10. ప్రసిద్ధగ 11.నిట్లు 12. నోలిని.... మొకటినే 13. దృష్టము గాదె యిదియు, ననుచు 14. గాటకబోయిని.



"యవికలాజాండతత్త్వాత్మకుఁడైన – శివుఁడు గరస్థలాసీనుఁడై యుండ
సర్వగతుండైన శంభుభక్తునకు – సర్వగతత్వంబు సహజంబ కాదె
సర్వమయుండైన శర్వుభక్తునకు – సర్వమయత్వంబు సహజంబకాదె
దూరేక్షణంబును దూరశ్రవణము – దూరవిజ్ఞానసిద్ధులు మొద ల్గాఁగ
నణిమాదిసిద్ధులు నభవుభక్తునకు – గణుతింప నెంత శ్లాఘ్యంబు దా" ననుచు
సకలమానవులు మస్తకతటన్యస్త – ముకుళితహస్తులై మ్రొక్కుచునుండ
"నల్లవో"యనుచు భూవల్లభుఁడతులి – తోల్లాసచిత్తుఁడై యెల్లవస్తువులు
దట్టుఁడు బసవనదండనాయకున – కిట్టలంబుగఁ గట్టనిచ్చె సంప్రీతి
గురుభక్తిశృంగార! గుణగణాధార! – వరదయాలంకార! సురుచిరాకార!
ఖ్యాతగంభీర! దుష్కర్మవిదూర ! – గీతమహోదార! ధూతసంసార!
అకుటిలచి త్త ! శివాచారవేత్త ! – ప్రకటతత్త్వాయత్త ! ప్రవిమలవృత్త !
అజ్ఞానజైత్ర! యుదాత్తచరిత్ర! – విజ్ఞానపాత్ర! సంవిత్సుఖామాత్ర!
రూఢవ్రతోత్తుంగ! రుచిరాంతరంగ! – గూఢప్రసాదాంగ! గొబ్బూరిసంగ!
ఇది యసంఖ్యాతమాహేశ్వరదివ్య – పదపద్మసౌరభభ్రమరాయమాణ
జంగమలింగప్రసాదోపభోగ – సంగతసుఖసుధాశరధినిమగ్న
సుకృతాత్మ పాలుకురికి సోమనాథ – సుకవిప్రణీతమై శోభిల్లి తనరి
చరలింగఘనకర [1]స్థలివిశ్వనాథ – వరకృపాంచితకవిత్వ స్ఫూర్తిఁ బేర్చి
చను బసవపురాణ మను కథయందు – ననుపమంబుగ ద్వితీయాశ్వాసమయ్యె.

* * *

1. స్థల

# తృతీయాశ్వాసము

శ్రీ రుద్రభక్తాంఘ్రి శేఖర! శుద్ధ – వీరమాహేశ్వరాచార! సంగాఖ్య!
దండియై మఱియొక్క మిండజంగమము – వెండియు బసవనదండనాయకుఁడు
మంత్రులుఁదానును మహిపతి వనుపఁ – దంత్రంబునకు జీవితము వెట్టునెడను
"వచ్చి యీ యర్థంబు వలయు నింతయు – నిచ్చినఁగాని యొండేనొల్ల"ననుచు
ధట్టించి యడుగుడుఁ బెట్టెలమాడ – లట్టున్నభంగి నాయయ్యకు నొసఁగఁ
దంత్రసమేతులై ధరణీశుకడకు – మంత్రివర్గంబేఁగి మఱి యిట్టులనిరి
చెప్పినఁ గొండెమౌఁ జెప్పకయున్నఁ – దప్పగు నటుగాన చెప్పఁగవలసెఁ
బనిసేయ వెఱతుము బసవయ్యతోడ – ధనమెల్ల నొక్కమిండని కిచ్చె"ననుచుఁ
గొండెంబు సెప్పినఁ గోపించి రాజు – బండారి బసవనదండనాయకుని
రప్పించి "మాయర్థ మొప్పించి పొమ్ము – దప్పేమి? సాలుఁబ్రధానితనంబు
'దండింపరా' దనుతలఁపున నిట్లు – బండార [1]మంతయుఁ బాడు సేసితివి
పరధనం బపహరింపనిబాస యండ్రు – పరధనం [2]బెట్లొకో బసవ! కైకొంటి
వేయుమాటలు నేల వెఱతుము నీకు – మాయర్థ మొప్పించి నీయంత నుండు"
మనవుడుఁ గించిత్ప్రహసితాస్యుఁడగుచు – జననాథునకు బసవనమంత్రి యనియె
"పరమేశుభక్తి యన్ సురతరు వుండ – హరుభక్తి యన్ కనకాచలం బుండఁ
గామారిభక్తి చింతామణి యుండ – సోమార్ధధరుభక్తిసురధేను వుండ
బగుతుఁ డాసించునే పరధనంబునకు – మృగపతి యెద్దెస మేయునే [3]పుల్లు?
[4]క్షీరాబ్ధిలోపలఁ గ్రీడించుహంస – గోరునే పడియలనీరు ద్రావంగఁ?
జూతఫలంబులు సుంబించు చిలుక – [5]భాతి బూరుగుమ్రానిపండ్లు గన్గొనునె?
రాకామలజ్యోత్స్నఁ ద్రావు చకోర – మాకాంక్ష [6]సేయునే చీకటిఁ ద్రావ?
విరిదమ్మివాసన విహరించుతేఁటి – పరిగొని [7]సుడియునే బబ్బిలివిరుల?

1. మింతయుఁ 2. బెట్లకో 3. పిల్లు 4. భాగవతమందలి "మందారమకరంద" పద్యము దీనిఁబట్టి పుట్టినది. ఇట్టిసీస మీయన చతుర్వేదసారమందు నున్నది 5. యేతెఱంగునఁ బీల్చునేరే(ఁగు) ని పండ్లు 6.గోరునే 7. విరియు.



నెఱుఁగునే యలదిగ్గజేంద్రంబుకొదమ – యెఱపంది [1]చను సీక? నెఱుఁగవుగాక
యరుదగు లింగ [2]సదర్థులయిండ్ల – వర(రు?) వుడ నా కొకసరకె యర్థంబు
పుడమీశ మీ ధనంబునకుఁ జే సాఁప – నొడయల కిచ్చితి నొడయలధనము
[3]పాదిగ దఱిఁగిన భక్తుండఁగాను – గాదేని ముడుపు [4]లెక్కలుసూడు" మనుచు
ధట్టుఁడు బసవనదండనాయఁకుఁడు – పెట్టెలు ముందటఁ బెట్టి తాళములు
పుచ్చుడు మాడ లుప్పొంగుచుఁ జూడ – నచ్చెరువై లెక్క కగ్గలంబున్న

## నక్కలు గుఱ్ఱములైన కథ

**"మధుర[5]పాండ్యుడు** దన మంత్రిచే నిట్టు – లధికమర్థంబిచ్చి హయముల[6]విలువఁ
బనుచుడు నతఁడు సద్భక్తిపెక్కు వను – [7]జనిచని జంగమార్చ[8]న సేయఁజేయ
నర్థమంతయుఁ బోవ హయముల విలువ – నర్థంబు లేకున్న ననుమాన ముడిగి
పొలమునక్కలనెల్లఁ బిలిచి తెప్పించి – నలిఁ బాండ్యభూనాథునకుఁ [9]బొడసూపఁ
జొక్క నైనారుల మిక్కిలి కరుణ – నక్కజం బంద నానక్క లన్నియును
నిలఁ గంకణములతేజలు నయ్యెఁ గాదె – మలహరుభక్తులమహిమ దలంప
నిది సోద్యమే" యంచు నెల్లభక్తులును – సదమలచిత్తులై సంతసంబంద
నతివిస్మయాక్రాంతుఁడై బిజ్జలుఁడు – "ఇతఁ డీశ్వరుఁడకాక యితరుండె?" యనుచు
వర[10]వస్త్ర [11]భూషణావళి సమర్పించి – పరమానురాగుఁడై నరులెల్ల వినఁగ
"బండారిమీఁద నెవ్వండేని[12]యింకఁ – గొండెంబు [13]సెప్పు నా కుక్కలఁ జెండి
నాలుకల్గోసి సున్నము సాలఁబూసి – పోల వేఁచినయిస్మ వోయింతు నోళ్ల"
ననుచు నబ్బసవసింహము వీడుకొల్పఁ – జనుదెంచె నగరికి జనులు నుతింప.

## బసవఁడు తన భార్యచీర విప్పించి యొక జంగమున కిచ్చినకథ

వెండియు నొక్కయ్య వేశ్యాలయమున – నుండి బాని[14]సఁబిల్చి "బండారినగర
[15]మన [16]నిత్యపడి వేఁడికొని వేగరమ్ము" – అనవుడు"నట్లకా"కని పోయి యచటఁ
బడఁతి యబ్బసవయ్య పట్టంపుదేవిఁ – బొడగని కట్టినపుట్టంబు సూచి

1. చంటికి నేఁగదు 2. సమర్థుల 3.పాదికె, పాదిగె 4.లెక్కకుఁజూడు 5. పాండ్యుడు 6. దేరఁ 7. జనఁజన 8. నలుసేయుడును, సేయునెడను 9.దొడుసూప 10. రత్న 11. భూషణోత్కరము 12.మాకు 13.సెప్పిన చండికుక్కలను; ఇక్కడ యచ్ఛబ్దార్థ మేకవచనమునను దచ్ఛబ్దార్థము బహువచనమునను గలదు. 14. బానిసె 15. మున 16. ఇక్కడ 'నిత్య' అనియే యన్ని వ్రాఁత ప్రతులందునున్నది.

యసలారఁ బడి [1]వేఁడుడంతఁ జాలించి – మసలక బానిస [2]మగిడి యేతెంచి
అక్క! [3]యేమందు నీయాన నేనిప్పు – డొక్క సోద్యముఁగంటి నక్కడి కేఁగి
యట్టి దివ్యాంబరంబఖిలలోకములఁ – బుట్టదు బసవయ్యపట్టంపుదేవి
కట్టినపటవలిపుట్టంబు సూచి – నెట్టణ వచ్చితి నీ కెఱిఁగింప
[4]భావ వేఁడినఁజాలు బసవయ్య యిపుడ – యావస్త్ర మొసఁగెడు [5]నరగలిగొనఁడు
పరగు మహాదేవుభక్తులచేత – నరుదరు దనఁగ [6]గణారాధనములఁ
గొనివచ్చి జంగమకోటి సస్నేహ – మున నిచ్చినట్టి యమూల్యవస్త్రములు
[7]వెంజావళియు జయరంజియు మంచు – పుంజంబు [8]మణిపట్టు భూతిలకంబు
శ్రీ వన్నియయు మహాచీని చీనియును – భావజతిలకంబు పచ్చనిపట్టు
రాయశేఖరమును రాజవల్లభము – [9]వాయుమేఘము గజవాళంబు గండ
[10]వడము గావులు సరిపట్టును హంస – [11]పడియు వీణావళి పల్లడదట్టి
వారణాసియు జీకు వాయుఁ[12] గెందొగరు – గౌరిగనయమును క్షీరోదకంబు
పట్టును రత్నంబుపట్టును సంకు – పట్టును మరకతపట్టు పొంబట్టు
నెఱపట్టు వెలిపట్టు నేత్రంబుపట్టు – మఱి తవరాజంబు మాందోళిరవియుఁ
జంద్రాతపంబును సాంధ్యరాగంబు – నింద్రనీలంబు మహేంద్రభూషణము
సన్ననడంచును శరధియు మేఘ – వన్నెయు రుద్రాక్షవన్నె కాంభోజి
పులిగోరుపట్టును భూపతి రుద్ర – తిలకంబు సరిపట్టు మలయజసిరియు
గొలనిమేఘము గజావళి హయావళియు – వలిపంబు సరి[13] గమ్మితెలుపు దివ్యాంబ
రంబును నుదయరాగంబు దేవాంబ – రంబు పొత్తియు గుజరాష్ట్రంబుపట్టు
మొదలుగా నెఱుఁగమే మును దరతరమ – పదపడి[14] మనవారు వడసినయట్టి
మానితవస్త్రవితానముల్ గలవు – గాని యావస్త్రసమానముల్ గావు
తథ్య మిట్టిద" యని దాసి సెప్పుడును – మిథ్యసేయక వేశ్య మిండనిఁ జూచి
"నలి దలిర్పఁగ[15] నీవు నా [16]తోడివలపు – గలవేని బసవయ్యకాంత గంగాంబ
కట్టన[17]పుట్టంబుఁ గ్రక్కునఁదెచ్చి – నెట్టణ నాకిమ్ము నేర్పు దలిర్ప"
ననవుడు "నట్లకా" కనుచు మిండండు – సని కాంచి! బసవ "నీవనిత గంగాంబ

1. వేఁడుటంతఁ 2. మగుడి3.యేమనిచెప్ప నీయాననిప్పు 4.బావ 5. అరుగలి 6. లింగారా 7.కెంజావళి 8. మహి 9. తాయిమేఘముగజదా 10. వళము 11.వళి 12. గనయము 13. దమ్మివాలు 14. దమ 15. నీకు నా మీఁది 16. మీఁద – గలదేని, 17. పటవలి పుట్టంబు.



కట్టిన [1]పటవలిపుట్టంబు [2]మాకు – నిట్టున్నభంగిన యిప్పింపవలయు"
ననవుడుఁ దనసతి నాస్థానసదన – మునకుఁ బిల్వఁగఁబంచి ముద్దియఁ గదిసి
"పుట్టు సా వెఱుఁగనియట్టిమహాత్ముఁ – డిట్టలంబుగ నీదు పుట్టమడ్గెడిని
పుట్టమీ వేగ మీపుట్టమిచ్చినను – బుట్టము మన" మనియట్టిచందమున
లజ్జయు సిగ్గు దలంపక బసవఁ – డజ్జలజాక్షి వల్వఱిముఱిఁ బట్టి
యొలువంగ నొలువంగ నొక్క వస్త్రంబు – దళితాంబుజానన మొలఁబాయకున్నఁ
గనుఁగొని యద్భుతాక్రాంతాత్ములైన – జనములఁ గనుఁగొని జంగమంబనియె
"గహనమే చూడ జగద్ధితసూత్ర – సహజవాహనులగు శంభుభక్తులకు
నలి **నిడిగుడినయనార**ను భక్తుఁ – డిల [3]నాలిచీరలొ[4]ల్చిడె భక్తులకుఁ
బంద్రెండువర్షముల్ వాయక నేని – పంద్రెండుమూరల [5]పసిఁడిపుట్టంబు
విపరీతగతిఁదన్ను [6]వేఁడుడు నొక్క – దపసికిఁ **దేడరదాసయ్య** యీఁడె
అదిగాక **బల్లహుం**డఖిలంబు నెఱుఁగ – సదమలచిత్తుఁడై సతిని మున్నీఁడే?
యఱలేక రూపించి యడుగంగఁదడవ – మఱిమొన్న యధరుండు మాణిక్య మీఁడె?
[7]దండియై మొన్న యధరుఁడిమ్మడించి – మిండభక్తునకు నర్మిలి నర్థమీఁడె?
మహి నిడుగుడిని **బెర్మాణి** య≡ గణము – గహనంపుదుర్భిక్ష కాలంబునందుఁ
జాటించి సకలార్థ[8] సంపదల్ సంద్ర – జూటుభక్తుల[9]కిలు చూఱవెట్టండె?
తనయపెండిలిసేయుతత్ప్రస్తవమునఁ – జనుదెంచి యొకతపోధనుఁడు వేఁడినను
నక్కాంత వెంద్రుకలప్పుడ కోసి – చక్కన మానకం[10] జారుఁడీఁడెట్టు?"
లనుచు గీటునఁబుచ్చుచును మిండగీఁడు – కినియునో [11]తడవైనఁదన వేశ్యయనుచు
బసవని వారించి వసుధఁబ్రోవైనఁ – బసిఁడి చెఱంగుల పట్టువస్త్రములు
మోపిడి తనమోవనోపి [12]నన్నియును – నేపారఁ గొని [13]వచ్చి యిచ్చె లంజియకు
"నిక్కంబు బసవని నిజభక్తిమహిమఁ – దక్కువ[14] గాదయ్యెఁ దరుణిమానంబు"
అని భక్తమండలి వినుతింపుచుండ – వనిత యంతర్వాసమునకేఁగె నంత.

## సూర్యాస్తమయ వర్ణనము

బసవనిభక్తి ప్రభాపటలంబు – దెసల వసుంధర దివి [15]దీటుకొనఁగ
దినకరుఁ డాత్మీయ తేజంబు దఱుఁగు – డును మది లజ్జించి చని యపరాబ్ధిఁ

1. పటువలి 2. నాకు 3.నారి 4.ఇట్టిసంధుల నీతఁడు పెక్కుచోట్లఁ గూర్చినాడు. 5.పట్టు 6. వేఁడెడు, వేఁడిన 7.వెండియు 8.సమితియుఁజంద్ర 9.కిలఁజూఱ 10.జారుండుయీఁడె 11.తడసిన 12.యన్ని 13.పోయి 14.వడదయ్యె 15.నిట్టవొడువ.

బడియెనో యన్నట్లు భానుండు గ్రుంకెఁ– జెడిమిత్రుఁడరుగ రాజీవముల్ మొగిచె
భేరులు శంఖముల్ భోరనఁ జెలఁగె – మార[1]సంహారు నాగారాంతరముల
నలరుచుఁబంచమహా[2]శబ్దరావ – ములు మ్రోసె భక్తసమూహాలయముల
ఘనధూపధూమసంజనిత మేఘములు – సెనసి కప్పినమాడ్కిఁ జీకటుల్వర్వె
వరముక్తిసతి బసవని[3]కి నారతులు – పరువడినెత్తు దీపంబులో యనఁగ
నక్షత్రచయ మంతరిక్షంబు నిండి – యక్షీణతరకాంతి యసలార వెలిఁగె
చంద్రునిచేటు దైత్యేంద్రునిపాటు – నింద్రునిభంగంబు నెఱిఁగి యెఱింగి
గొఱియ[4] మ్రుచ్చిలి శూద్రకుండను రాజు – నఱకు వడుటతొల్లి యెఱిఁగి యెఱింగి
[5]జారులఁ జోరులఁ జర్చించుకవుల – భూరివివేకంబుఁబొగడ[6]ంగనేల?
యనఁగ సంధ్యావేళయందు సద్భక్త – జనులు లింగార్చనల్ [7]సలుపంగ నంత
మిండజంగమకోటి నిండారుభక్తి – దండనాయకుఁడంప దండతండములు
ఘనసారతాంబూలగంధప్రసూన – వినుతాభరణవస్త్ర వితతులు గొనుచుఁ
గరమర్థి[8] లంజెఱికంబు సేయంగ – నరిగెద మేమంచు ననురక్తి నరుగ

## ముగ్ధ సంగయ్యకథ

లింగసర్వేంద్రియలీనుండు **ముగ్ధ – సంగయ్య** నానొక్క శరణుఁ డీక్షించి
భక్తిననుచువాఁడు బసవబండారి – వ్యక్తమిట్లేఁగెడు [9]వార్జంగమములు
కొనిపోవునవి గంధకుసుమకర్పూర – వినుత తాంబూలాదివితతులట్లయ్యుఁ
జను నిది లింగావసరవేళ[10]యున్న – పనులకు నేఁగెడు పగిది గా" దనుచు
నదియును నొక్కలింగార్చన గాఁగ – మది నిశ్చయించి సమ్మదము [11]దుల్కాడఁ
గలనైన లంజెఱికం బనునట్టి – పలు కెఱుంగమిఁ జేసి బసవయ్యఁ జూచి
"యేనును బోదునా యీయయ్యగాండ్ర – తోన లంజెఱికంబు మానుగాఁ జేయ"
ననవుడుఁ గించిత్ప్రహసితాస్యుఁడగుచుఁ – "జనుజియ్య! నా ముగ్ధసంగయ్యదేవ!"
యని గారవింపుచు నాయయ్య కపుడుఁ – గనుఁగొన సహజశృంగారంబు సేసిఁ
పరిచారకులఁబిల్చి పటుభక్తి గల్గు – తరుణియింటికిఁ బంపఁ దత్సతిఁజూచి
"గణుతింపఁ బ్రమథలోకంబుకన్యకయొ?– గణిక సాక్షాద్రుద్రగణికయో? తలఁప

1. సంహరు నిజమందిరంబులను 2. వాద్య 3. నివాసములఁ బ 4. మ్రుచ్చును. పెక్కు ప్రతులలో 'మ్రుచ్చును' ఉన్నది 5. జారచోరులకథల్ నర్చించు 6. నేమిటికి 7. సలుపుచు నుండ 8. 'లంజఱికము' అని వ్రాఁతలలోఁ గలదుగాని కవి "చేకూరె నిట్టిలంజెఱిక" మని ప్రయోగించెను 9. వారుజంగములు 10. చిన్న 11. దొల్కాడ.



జిత్తరురూపమో? [1]చెలువయో పసిఁడి – పుత్తడియో" నాఁగఁ బొలఁతి యేతెంచి
ముగ్ధమిండనిపాదములమీఁదఁ బడివి – దగ్ధ [2]మిండెత సముద్యద్భక్తి మెఱసి
పడిగంబు వెట్టించి పాదముల్ గడిగి – కడువేడ్కఁబాదోదకంబు సేవించి
ప్రీతియెలర్ప విభూతివీడియము – లాతన్వి దాన సమర్పణ సేసి
యనుపవచ్చినవారలరుగ మిండనికిఁ – దనహస్త మిచ్చి తోడ్కొని పోవునెడను
స్ఫాటికసోపానసంక్తి నొప్పారు – హాటకకుట్టిమహర్మ్యస్థలమునఁ
గలయంగఁ గస్తూరికలయంపి [3]మీఁద – వెలుఁగు ముక్తాఫలంబుల ముగ్గులమరఁ
గంభకట్లను మేలుకట్లను బొలుచు – గంభీరపుష్పకాగారంబునందు
మహితలంబితరత్నమాలికానిచయ – బహుమణిదీపవిభ్రమకాంతి వర్వ
మించి వెల్గెడుపట్టెమంచంబు పుష్ప – సంచితంబగు నండజముపాన్పు దనర
వివిధసౌరభసుఖాన్విత మగుమంద – పవనంబు జాలకపంక్తిఁ[4]దన్పార
శ్రీరుద్రవరదివ్య సింహాసనంబొ?– గౌరీమనోహరు చారుపుష్పకమొ?
గంగావతంసుని శృంగారగృహమొ? – అంగజవిజయుని యనుఁగుమంటపమొ?
అన నతిరమణీయమగు సజ్జపట్టుఁ – గని మిండఁ డద్భుతాక్రాంతాత్ముఁ డగుచు
[5]నదియును నాతి లింగార్చనసేయు – [6]సదనంబుగాఁ దన మదిలోనఁ దలఁచి
యుత్తుంగసింహాసనోపమంబైన – యత్తన్విచారు పర్యంకంబు దిగువ
నవనిపైఁ [7]గంబళి యాసనంబుగను – శివసమారాధన సేయఁ గూర్చుండి
భూతి సర్వాంగముల్ వూయుచో నతఁడు –"భూతివూయవదేవి వొలఁతి నీ"వనిన
"నిచ్చఁబార్వతి వూయు పచ్చవిభూతి – యిచ్చె నొక్కయ్య నా కీ[8]మునిమాపు
వూసితి సర్వాంగములఁ జూడు" మనుచు – భాసురంబగు మేని [9]పసుపుఁజూపుడును
వలయుచో రుద్రాక్షములు ధరింపుచును –"లలన! రుద్రాక్షముల్ దాల్పవే"మనిన
"కడుఁ గందు లవణసాగరతీరమునను – బొడమిన రుద్రాక్షములు [10]సహింపమిని
దెల్లంబు క్షీరాబ్ధితీరమందుండు – తెల్లరుద్రాక్షముల్ దెచ్చె నొక్కయ్య
యెప్పుడుఁ దాల్ప నున్నెక్కిన" వనుచు – నప్పొల్తి ముత్యాలహారముల్ సూప
నక్కజుండగుచు ముత్యాలసూసకము – ముక్కునఁ దాల్చిన ముత్యంబుఁ జూచి
"యుత్తమాగంబున నువిద! రుద్రాక్ష – లుత్తమంబయ్యెఁ బో క్రొత్త మాకిదియు

1. చెలువపసిండి 2. మిండెత అనియే వ్రాఁతప్రతులు 3. చల్లి 4. నింపార 5. నదియె యానాతి 6. సదనంబకా 7. గంబళంబాస 8. మును 9. పసపు 10. ధరింపమిని

నెక్కడ వినఁబడ[1]దిట్లు రుద్రాక్ష – ముక్కునఁ[2]దాల్చినముఖ్యమే?"మనిన
"దేవ! యేమనిచెప్ప? దేవుఁడే యెఱుఁగు – నా విశేషంబు వేదాతీత" మనుఁడు
నురుజటావలి విచ్చి యొత్తిచుట్టుచును – "దరళాక్షి! జడలేల తాల్ప వీ" వనిన
సగముప్రసాదపుష్పములకు [3]నునిచి – [4]సగమునఁదాల్చితి సన్నంపుజడలు
సన్నుతతద్భస్మసమ్మిశ్ర మగుచు – వెన్నున [5]నిదె చూడు వ్రేలెడి" ననుచు
పటుగళాభరణసంఘటితమై యొప్పు – పటవలికుచ్చులు వడఁతి సూపుడును
"భువి నిట్టిభక్తురాలవు గచ్చడంబు – ధవళాక్షి! మఱి యేల తాల్ప వీ" వనిన
"లింగవంతులు గాని లెంగుల దృష్టి – భంగిగా నాపయిఁబాఱకయుండఁ
గట్టితి సర్వాంగకచ్చడం" బనుచుఁ – గట్టిన సమకట్టుఁగాంత సూపుడును
వనిత యపూర్వలాంఛనధారిగాఁగ – మనమునఁ దలపోసి మహిఁజాఁగిమ్రొక్కి
"యిట్టిలాంఛనమున కెవ్వ రాచార్యు? – లెట్టివి నియమంబు? లెట్టిది సపర్య?
తరుణి! మీ గురుసంప్రదాయంబు వారు – ధరణి నే తావునఁ దపము సేయుదురు?
సంతతంబును [6]నేరి సద్గోష్ఠి [7]నుందు – రింతయుఁజెప్పు మాకేర్పడ" ననిన
"నాగమనిగమోక్తి నవ్వామదేవ – యోగిచే శివదీక్ష యొప్పంగఁబడసి
కైలాసమునఁదపోవేళ మెప్పించి – శూలిచేఁ బడసె మున్నీలాంఛనంబు
అది గారణముగఁబూర్వాచార్యురాలు – సదమలాత్మక హిమశైలతనూజ
శ్రీనందనునిగెల్చి శివుని మెప్పించి – మేన నర్ధము గొన్న మెలఁతవర్గంబు;
జగములన్నియుఁ దన శక్తిఁబాలించు – జగదేకసుందరి సంతతిమేము;
శివరహస్యాది ప్రసిద్ధశాస్త్రములు – శివునిచేఁబడసిన చెలువశిష్యలము;
ఆకాంక్షతోడ జన్నావులపాలు – సేకొని యష్టావశేషంబు సేసి
చెఱకుకట్టెలపొడి సేరెఁడు సల్లి – మఱి యిష్టలింగసమర్పణ సేసి
తప్పక యీ ప్రసాదంబింతగొందు – మెప్పాటఁగలనైన నెఱుఁగమోగిరము
[8]గలిగెనే వెండియుఁగందమూలాది – ఫలపత్త్రశాకముల్ భక్తులిచ్చినను
స్వామికర్పించి ప్రసాదంబు గొందు – మేమని చెప్పుదు [9]మీ తపశ్చరణ?
తనువును, మనమును, ధనమును విడిచి – మనికులై రసికులై,మగ్నులై గోష్ఠి
తవులంబు [10]గలిగినతజ్జంగమాను – భవమందు నెప్పుడుఁ బాయకుండుదుము.
అనఘ! త్రికాలలింగార్చన మీఁది[11]పనులు దక్కఁగ లేవు[12]బగళులు రేలు

1. దిట్టి 2.దాల్చుటముఖ్యమేయనిన 3. నిలిపి 4.సగముదాల్చితిఁగడు 5.నివె 6. నెట్టి 7. నుండు 8. గలిగిన 9. మిది 10.గలయట్టి 11.పనులొండునున్నవే 12.పగలును రేయు



గతి మాకు వేఱొండు గలదె జంగమమ – గతి మనోవాక్కాయకర్మంబులందు
ఇట్టిది గురుమార్గమిది నిజవ్రతము – ఇట్టిది సారిత్రమిది లాంఛనంబు
తలఁప మా గురుసంప్రదాయంబువారు – గలరు శ్రీగిరి యాదిగా నెల్లయెడల
నధిపసాక్షాజ్జగదంబాసమాన – లధికంబు గలరు దాక్షారామమునను"
అని సమంచితవిదగ్ధాలాపములను – వినుపింప నాయయ్య విస్మితుండగుచుఁ
జెలువ పర్యంకంబు సింహాసనముగఁ – దలఁచి గంధద్రవ్యతాంబూలవితతి
యొడఁబడ నంత నొండొండు శోధించి – [1]"పడఁతర్ఘ్యపణ్యముల్ వట్టు" నావుడును
"దనరఁగ నీయయ్య మనసు వచ్చుటయుఁ – గనుఁగొన నా నేర్పుకలిమిగా" కనుచు
హాసనంబు దళుకొత్త నర్ఘ్యపణ్యములు – పసిఁడిబిందెలఁ[2]బట్టి పడిగముల్వెట్టి
గ్రక్కున సకలోపకరణంబులోలి – జక్కొల్పి యమ్ముగ్ధసంగయ్య కలరఁ
గరమొప్ప గంటలుఁ గాంస్యతాళములు – నరుదొంద మ్రోయ ధూ[3]పానంతరంబు
దెఱవ యుదంచిత[4]దృగ్దీధితులను – నటితిహారంబుల యంశుజాలములఁ
బొలుపగు కంకణస్ఫురితరోచులను – మిళితమై కన్నులు మిఱుమిట్లు [5]గొనఁగ
వెలుఁగు నీ రాజసంబులపళ్లెరముల – నలర నందిచ్చునయ్యవసరంబునను

## చంద్రోదయ వర్ణనము

"మలసంహరుఁడు జటామకుటంబుమీఁద – నిలిపియు నా కందు నెఱిఁబుచ్చలేఁడు
భక్తులపాదసంస్పర్శనంబునను – వ్యక్తిగా నిర్మలత్వంబుఁబొందుదును"
అని యాత్మఁ దలపోసి యరుదెంచుమాడ్కి – వనజారి ప్రాఙ్ముఖంబున నుదయించె
బసవని సితకీర్తి వర్వెనా, శివుని – భసితాగరాగప్రభలు వర్వె నాఁగ,
నా రుద్రునట్టహాసాంశులు దనరె – నా, రజతాచలచారుదీధితులు
విలసిల్లెనా, నభోవీథి నెల్లెడల – నెలకొని యచ్చవెన్నెల వెల్లి [6]విరియ
నక్కాంత **ముగ్ధసంగయ్యకుఁ** బ్రీతి – నెక్కొని యాత్మలో నివ్వటిలంగ
ననయంబు లింగపూజనల నటించు – తనదు విలాసినీజనుల రావించి[7]
"**యక్కమహాదేవి!** యల్ల మద్దెలలు – జక్కొల్పి వేగంబ సంధించుకొనుఁడు (ము)
[8]స్వరమానమున **బసవప్రమథవ్వ!** – కరమర్థిఁ బట్టఁడు(ము?) కాహళ లోలి;

1. పడఁతియర్ఘ్యమ్ములు 2.నించి 3.పాంతంబునందు 4.దృగ్విదీధితుల 5.వోవ 6. చూప 7. ఈ పాదమునకుఁ దర్వాత "జవనికఁ బట్టింప సరసమై నిలిచి– కవళవ్వ పూర్వరంగము ప్రసంగించు" ఒక్క ప్రతిలోనున్నది 8. స్వరమాన మెఱిఁగి బసవప్రమథవ్వ.

**సకళవ్వ**! నీవును **సంగళవ్వ**యును – [1]నొకరీతి నిలువుఁడు సుకరంబుగాఁగ;
**బాలరుద్రమ**! యొత్తుపట్టఁగ [2]వాళ(సె?) – గ్రోలు వాయింపుము! గుడ్డవ్వ!నీవు
సిట్టితాళము వట్టు శివదేవి! నీవు – సట్టన నృత్యంబు సరసంబెఱింగి;
సంగుదాసమ! మహేశ్వరి! వీర[3]భద్ర – లింగవ్వ! మీరు గేళికలు [4]సేయుండు;
రమణదుకూలాంబరమును [5]గంచుకము – నమరించికొని [6]చల్లడము బిగియించి
యేతెమ్ము నీవు పురాత్మ! శీఘ్రు – మాతతమ్ముగ నృత్యమాడుదు గాని
తాళముల్వట్టుఁడు దాళగింపుండు – నాళతివేళకు నందఱు ననుచు
నవిరళంబుగ [7]నంత నార్భటం బిచ్చి – జవనిక [8]రప్పించి సరసమై నిలిచి
పొలుపగు ముఖరసంబును సౌష్ఠవమ్ము – లలియు భావంబు ధూకళియు[9]ఝుంకళియు
మఱియు రేవము విభ్రమమును రేఖయును – నెఱయంగ నీ రీతి నృత్యంబు సలుప
లింగార్చనంబు సల్లీలఁ జేయుచును – మంగళారవములు [10]సంగడి నులియ
[11]వెల్ల వేగుడు స్వచిత్తోల్లాస[12]మమర – సల్లీల[13] **నమ్ముగ్ధసంగయ్య**కిట్టు
లంగన పరిచర్య లాచరింపగ – లింగావసరము సెల్లించు[14] నంతటను
నొగి మనోహరుని పాదోదకసేవ – నగణితలీల దివ్యాంగుండనైతి
నఖిలమాహేశసమగ్రప్రసాద – సుఖసేవ నా కింకఁజొప్పుడునేని
నిలుకాల నిలువంగనేరక తిరుగు – నలమట వాయుఁబొమ్మని తలపోసి
వచ్చినమాడ్కి దివాకరుండంతఁ – జెచ్చెర నుదయాద్రిశిఖరమెక్కుడును
బసవనియాత్మ కింపెసఁగ మిండండు – వెస నేఁగుదెంచి తా వెండి యిట్లనియె
"బసవ! యేమని చెప్ప భర్గుఁడే యెఱుఁగు – నెసఁగ లంజెఱిక మే నీ రాత్రిసేఁత
నీవును మా తోడ రావైతిగాని – వేవునంతకు నొక్క విధమైన సుఖము
ఐనను లంజెర్క మచ్చోటఁ జేయు – చో నిన్నుఁ దలఁచితిఁజుమ్మయ్య బసవ!
పుట్టితిఁగాని మున్నిట్టి సుఖంబు – నిట్టిలంజెఱికంబు నెఱుఁగ నెన్నఁడును
మలహరుకృపలేని మత్తికాంద్రకును – గలుగునే లంజెఱికం [15]బిట్లు నేయఁ
బగలు రాత్రియు నెడఁ[16]బడక లంజెఱిక – మొగినెన్నియుగము[17] లిట్లొప్పుగఁ జేసి
పడసితి చెప్పుమా పరమేశుచేతఁ – గడునొప్పు లింగజంగమసంపదలను

1. నొకరితలైనిల్వు, మొకరితలై 2. వాళ కోలు 3. భద్రు 4.సల్పుండు 5. గచ్ఛళియు; గంచగళియు 6.గచ్ఛడము 7. నిట్టులావిర్భవించి 8.ప(పు)ట్టించి 9. ఝుంకంబు 10.సంగతినొలయ 11.వెల్లి 12.మలర 13.నమ్మిండ 14.నత్తఱిని 15.కంబు సేయఁగ 16.తెగక, తెగకుండ నెన్ని 17. లొప్పఁగ నిట్లు చేసి.



సడిసన్న శివభక్తి సౌభాగ్యమహిమ – లొడఁగూడునే వెండి యొండుమార్గమున
నాకును నీ కారణమునఁ గాఁజేసి – చేకూరెనిట్టి లంజెఱిక మీ రాత్రి
బండారి! నీయాన[1]పసిబిడ్డనాఁట – నుండియు శ్రీగిరి నుండుదునచట
ననుపమకదళీవనాంతరబిల్వ – వనముల నేకాంతవాసంబునందుఁ
బన్నుగా నఱకాలఁగన్నును నొసలఁ – గన్నును గలమహాగణములు గలరు
చూతుము గాని యెచ్చోట మున్నిట్టి – భూతిశాసనధారిఁ బొడగాన మేము
పొలుపగు పచ్చవిభూతిపూఁతయును – దెలుపగు రుద్రాక్షములు నెఱ్ఱజడలు
నంతకుఁదగిన సర్వాంగకచ్ఛడము – వింతయై యున్నది యింతి [2]వేషంబు
నిట్టిలాంఛనదారి నిట్టివిరాగి – నిట్టి [3]నిష్ఠాశాలి నేమనవచ్చు?
ఇంతి నొక్కతెఁజెప్పనేల తత్సతికి – సంతతంబును బరిచర్యలు సేయు
లలనలందఱు నట్టిలాంఛనధరులు – చెలువలమహి[4]మంబు శివుఁడె యెఱుఁగు"
ననుచుఁ దత్సతుల లాంఛనములు నచటి – తన మిండతనమును దప్పకచెప్పఁ
బలుమాఱు నడుగుచు నలి జంగమములు – సెలఁగుచు నొండొరుఁ [5]జేవ్రేసి నవ్వ
బసవండసమ సముల్లసనుఁడై చెన్న – బసవని దెసఁజూచి పసరింపఁదొడఁగె
"ఇట్టి నెట్టణభక్తి యిట్టిముగ్ధత్వ – మిట్టిమహత్త్వంబు నెందును గలదె?
నిక్క మీశ్వరుఁగాని నిజ మెఱుంగమిని – ముక్కంటిభక్తులు ముగ్ధలు గారె?"
అని ప్రశంసింపంగ నా చెన్నబసవఁ – డనురక్తి ముకుళితహస్తుఁడై మ్రొక్కి
"పరగు నీ నూతనప్రాక్తనభక్త – వరగణంబులలోన వచియింపఁజూప
నిల నిట్టి ముగ్ధలు గలరొకో?" యనుచు – నలి దీటుకొనఁగ విన్నపము సేయుడును
బరమానురాగసంపదఁ దేలి సోలి – కరమర్థి మఱిముగ్ధగణముల కథలు
పసరింపఁ దలఁచి సద్భక్తి **బండారి** – **బసవయ్య** యా చెన్నబసవనికనియె

## రుద్రపశుపతి కథ

వ్యక్తంబెఱుంగవే యయ్యేళయూర – భక్తుండు మును రుద్రపశుపతి నాఁగఁ
ప్రథితమౌ నాదిపురాణమందబ్ధి – మథనావసర మొక్కకథికుండు సదువఁ
గమలజ కమలాక్షులమితదైత్యాదు – లమరులు సెడి పాఱ నందుద్భవించి
పొరి నజాండములెల్ల దరికొని కాల్చు – గరళంబు మ్రింగె శ్రీకఱకంఠుఁడనిన
నా రుద్రపశుపతి యాలించి భర్గుఁ – డారగించుట నిక్కమా విషం? బనుడు

1. పసు 2.రూపంబు 3. నిష్క్రియురాలి; నిస్స్పృహశాలి 4.దా 5.రుల్చేయివ్రేసి.

'ననుమానమా! త్రావె హరుఁడు విషంబు – బనుగొన నటమీఁదిపను లెఱుంగమన
విని యుల్కిపడి వీపువి[1]ఱిగి"హా! చెడితి' – నెనినేలఁబడి [2]పొర్లియక్కటా! నిన్ను
వెట్టిఁ జేసిరిగాక! విశ్వేశ [3]యెట్టి – వెట్టివారైనను విషముఁద్రావుదురె?
బ్రదుకుదురె? విషమ్ముపాలైనవార? – లిది యెట్లు వినవచ్చు; నేమి సేయుదును?
నిక్క మెవ్విధమున నిన్నె కానె(కె?) ఱుఁగ – ముక్కంటి! నాకింక దిక్కెవ్వరయ్య?
నా కొఱకైనఁబినాకి! యివ్విషము – చేకొన కుమియవే నీకు మ్రొక్కెదను
కటకటా! మేన సగంబున నుండి – యెట [4]వోయితవ్వ! నీ వెఱుఁగవే గౌరి!
ప్రమథగణములార! పరమాప్తులార! – సమసిన వెండి మీ శక్యమే కాన?
శతరుద్రులార! యసంఖ్యాతులార! – క్షితిధరకన్యకాపతిఁగావరయ్య!
వీరభద్రయ్యరో! విషముఁబ్రాణేశుఁ – డారగించె [5]నిఁ కెట్టులవునోకదయ్య!
ఓ పురాతనులార! యొడయండు బ్రదుక – నోపు[6]నొకో! విషంబొగి నారగించెఁ
జావు దప్పింపరే సద్గురు [7]నాథు – దీవన [8]లీయరే కావరే శివునిఁ
దల్లి లేని ప్రజలఁదలఁతురే యొరులు – తల్లి యున్న విషముఁద్రావనేలిచ్చు!
పరమేశుఁడీ బారి బ్రదికెనేనియును – మరణంబు లేదువో మఱి యెన్నఁటికిని!
నని ప్రలాపింపుచుఁ [9]బనవుచునొందు – వినఁజాలఁబ్రాణము ల్విడుతు నే ననుచుఁ
దడయక ఘనజలాంతరమున నుఱుకఁ – బడకుండ నా **రుద్రపశుపతి**ఁబట్టి
పార్వతీసహితుఁడై ప్రమథరుద్రాది – సర్వసురాసురసంఘంబు గొలువ
హరుఁడు ప్రత్యక్షమై"యడుగుము నీకు – వరమిత్తు నెయ్యది వాంఛింతం"బనుడుఁ
గడుసంభ్రమంబున మృదుపదాబ్జములఁ – బడి **రుద్రపశుపతి** భట్టారకుండు
"ఏమియు నే నొల్ల నీ విషసేవ – [10]నేమేమి వుట్టునో యే వినఁజాల
గ్రక్కున నుమియవే కాలకూటంబు – నిక్కంబు [11]నాకెక్కె నీయావి" యనిన
దశనకాంతులు దశదిశలఁ బర్వంగఁ – బశుపతి యా రుద్రపశుపతి కనియె
"ఇట లోకములలోన నెన్ననే కాక – యట మ్రింగ నుమియంగ నది యెంతవెద్ద
యణుమాత్ర [12]నా కంఠమందుఁ జిక్కినది – గణుతింప నున్నదే కాలకూటంబు
యింత సంతాపింప నేల నీ"కనుచు – వింతన వ్వొలయంగ [13]సంతరించుడును
"నమ్మంగఁ జాలఁ బినాకి యివ్విషము – గ్రమ్మన నొక్కింత గడుపు సొచ్చినను

1. వీఁగి 2.పొర లక్కటా; 3. యిట్టు 4.పోతివపుడు; పోయితపుడు 5.ను నెట్టు 6.నకో 7. మూర్తి 8.బడయరే, బొందరే 9.బనువుచు 10.సేమియుఁ బు 11.కిది; కింక 12. మా 13. సంతసింపుమన



[1]బెద్దయుఁ బుట్టునో పిమ్మటివార్త – దద్దయు విన [2]నోపఁ దా [3]మున్న చత్తు
సమయనిమ్మొండేనిఁ జావనీవేని – యుమియు మివ్విషమొండె నొండు సెప్పకుము
తక్కిన [4]మాటలు దనకింప"వనుచు – నిక్కంబు తెగువమై నిష్ఠించి పలుక
'నుమియకుండినఁజచ్చునో ముగ్ధ'యనుచు – నుమ [5]బోటి యాత్మలో నుత్తలపడగ
"నుమిసినఁ[6]గొని కాల్చునోతమ్ము" ననుచుఁ – గమలాక్షముఖ్యులు గడగడ వడఁకఁ
బ్రమథులాతని ముగ్ధభక్తికి మెచ్చి – యమితమహోత్సవులై చూచుచుండ
నొక్కింత నవ్వుచు నుడురాజధరుఁడు – గ్రక్కున లేనెత్తి కౌఁగిటఁ జేర్చి
ప్రమథులయాన నీ పాదంబులాన – సమయ నివ్విషమున సత్యమిట్లనిన
నమ్మవే వలపలి నా తొడ యెక్కి – నెమ్మిఁ జూచుచునుండు నీలకంఠంబు"
నని యూరుపీఠంబునందు ధరించె – మును గుఱియున్నదే ముగ్ధత్వమునకు
నదిగాక కుత్తుక హాలాహలంబు – కదలినంతటనె చచ్చెదఁగాక! యనుచుఁ
దన కరవాలు ఔమ్మున దూసి మోపి – కొని కుత్తుకయ చూచుచును ఔప్పలిడక
పశుపతి తొడమీఁదఁ బాయక రుద్ర – పశుపతి నేఁడును బరగుచున్నాఁడు

## నక్కనైనారు కథ

ఇల నొప్పు చోళమండలమున మఱియు – నలి **నీలనక్కనైనా**రనుగణము
ఉవిదయుఁ దానును శివలింగపూజ – సవినయప్రీతిమైఁ జలుపు చున్నెడను
శివదేవుపై నొక్క సెలఁది వ్రాకుడును – "శివశివ! ప్రేలు శివునకు" ననుచు
[7]నా పొల్తి యప్పుడ తూపొడ్వఁ దడవ – కోపించి యాతఁడు గొంతి కిట్లనియె
"పాపికా! బ్రమసితే ప్రాణవల్లభునిఁ – దూపొడ్వఁగూడునే [8]తుంపురుల్నిండ
నిటుగాని నీ భక్తి యెఱుఁగంగరాదె! – యెటయేనిఁ బొమ్ముని న్నేనొల్ల" ననుచు
వెడలంగ నడిచి యవ్విభుఁ[9]డు దా రాత్రి – మృదునర్చనము సేయునెడ లింగమందు
[10]నక్కాంత దూపొడ్చు చక్కటిఁ దక్కఁ – దక్కెల్లఁ [11]బ్రేలిన నక్కజంబంది
పతి వేగ సతి [12]వెంటఁ బాఱి పాదముల – కతిభక్తియుక్తి సాష్టాంగుఁడై మ్రొక్కి
"పాపి! పొ"మ్మని నిన్నుఁబలిపినయట్టి – పాపంబు సైరింపు పటుభక్తినిరత
నీవు దూపొడిచినతావు దక్కంగ – దేవుని మేనెల్లఁ జూవె ప్రేలినది
ఈ దిక్కు దూపొడ్చి యీ సంకటంబు – నా దేవునకు మాన్పవే దయతోడ"

1. బిందంబు? 2.నోర్వ 3.మున్నె 4.బుద్ధులు 5.కొన్ని ప్రతులలో బోఁటి (స్త్రీ) సానుస్వారముగా నున్నది 6. గాలుచునో 7.నా పొలఁతియునప్డుతూపొడుచుడును 8. తుంపుర్లు 9.దర్ధ 10. నక్కాంత 11.బ్రేలుడు 12.వెన్కఁ

ననుచు వెండియు మ్రొక్క నంగన వచ్చి – తనపతి ప్రాణేశుతనువున నున్న
పొక్కులు వొడఁగని పురపురఁబొక్కి – అక్కటా! యీ పొక్కులణఁగునే యింకఁ
బెనిమిటి దన్నుఁ జంపినఁ జంపనిమ్ము – అనుచుఁదూపొడువ కే నరిగితినపుడు
కాన, నా తప్పునఁ గాఁజేసి శివుని – మేనఁ బొక్కులు గడు [1]ఇక్కటంబయ్యె
పోనవే మున్ను దూపొడిచినచోట – నీవలిపొక్కు; [2]లింకెన్నియు నేల?
నా నిమిత్తమునఁబినాకి కిట్లయ్యె – నీ నిరోధంబింక నేఁజూడఁజాల
ననుచుఁ బరిచ్ఛేదియై భక్తురాలు – దన శిరంబున కల్గఁదత్రప్తవమునఁ
దెఱవ ముగ్ధత్వంబు దేట[3] తెల్లముగ – మెఱయింతుఁ బొమ్మని మెచ్చి [4]యక్షణమ
భవరోగవైద్యుఁడు వార్వతీకాంతుఁ – డవినాశుఁడజుఁడు ప్రత్యక్షమై నిలిచి
ప్రమథులురుద్రులు బ్రహ్మేచ్యు[5]తేంద్రు – లమరసంఘము యథాక్రమమునఁగొలువఁ
గరు[6]ణానిరీక్షణస్ఫురితసుధాబ్ధి – నిరువుర నోలార్చి యీప్సితార్థములు
[7]వేఁడుఁడిచ్చెద" నన వెలఁదియుఁబతియుఁ – బోఁడిగా సర్వాంగములుఁ బొదమ్రొక్కి
'దేవ! దేవాధీశ దివ్యలింగాంగ! – నీవు ప్రత్యక్షమై నిలిచిన మీఁద
వెండియు మఱియొండు వేఁడెద మనుట – యొండేమి? యది[8]యు నిన్నొల్లమిగాదె!
కావున, మీ పాదకమలాంతరంగ – భావసంపూర్ణ సంపద గృపసేయు'
మని విన్నవించుడు నతివకుఁ బతికి – ననుపమపరమవరానందమూర్తి
ముఖ్యాపవర్గసముదితోపభోగ – సౌఖ్యత్వమపుడు ప్రసాదించె శివుఁడు.

## బెజ్జమహాదేవి కథ

మఱియును [9]విను బెజ్జమహాదేవి యనఁగఁ – గఱకంఠ శ్రీపాదకమలాంతరంగ
"యెల్లనియోగంబు లెల్లబాంధవులు – నెల్లవారలు గల్గ నిట్లు భర్గునకుఁ
దల్లి లేకుండుట దా విచిత్రంబు – దల్లి[10] లే కది యెట్లు దా నుదయించె?
దల్లిసచ్చెనొ కాక త్రైలోక్యపతికిఁ – జెల్లఁబో! యిట్లేమి సేయంగవచ్చుఁ?
దల్లిసచ్చినఁగాదె తాను[11]డస్సితిని – ఎల్లవారికి దుఃఖమిట్టిదకాదె
తల్లి గల్గిననేల తపసి గానిచ్చుఁ – దల్లి గల్గిననేల తల జడల్గట్టు?
దల్లియున్న విషంబుఁ ద్రావ నేలిచ్చుఁ? – దల్లియుండినఁదోళ్లు దాల్ప నేలిచ్చుఁ?

1. నేని వట్రిల్లె 2. లింకిన్నియు 3. తెల్లమిగ 4. తత్క్షణమ 5. తాదు 6. ణావలోకన 7. వేఁడుఁడు నావుండు 8. నిన్నునొల్లమి 9. మును 10. లేకెట్లొకో తా జనియించె 11. డస్సెడిని.



దల్లి పాముల నేలధరియింప నిచ్చుఁ? – దల్లి బూడిద [1]యేల తాఁ[2]బూయనిచ్చుఁ?
దల్లి వుచ్చునె భువిఁ దనయునిఁ దిరియఁ?– దల్ల వుచ్చునె సుతు వల్ల కాటికిని
దల్లి లేకుండినతనయుండు గాన – ప్రల్లదుఁడై యిన్ని వాట్లకు వచ్చెఁ
జన్నిచ్చి పలుమాఱు వెన్నయుఁ బెట్టి – పన్నుగా నిన్నియుఁబాలును బోసి
[3]యాఁకొనఁగాఁ గడు పరసి పొలిచ్చి– సాఁకించి పెనుపదే జనని గల్గినను
దా నింతవాఁడయ్యెఁ దల్లి లేకయును – దానెంత వెరుఁగునో తల్లి గల్గినను?
బెండిండ్ల నోములఁ [4]బేరంటములను – బండువుదినములఁ బాటిజాతరలఁ
దగినపోఁడిమి సేయుతల్లి లేకున్న – వగవరే మఱి యెట్టిమగబిడ్డలైన
నూర కుపేక్షించి [5]యుండంగఁ దగునె? – [6]ఆరంగఁ దల్లి[7]నై హరిని నేనైన
నరసెదఁగాక; యిట్లఱేక పెనుచు – తరుణియ కాదెట్లు దల్లి దా" ననుచు
ననయంబు బెజ్జమహాదేవి దాన – జననియై [8]పరమేశుఁ దనయుఁ గావించి
[9]తొంగిళ్లపై నిడి లింగమూర్తికిని – నంగన గావించు నభ్యంజనంబు
ముక్కొత్తుఁజెక్కొత్తు ముక్కన్నుఁబులుము – నక్కొత్తుఁగడు పొత్తునట వీపు నివురుఁ
బెరుఁగంగవలె నని తరుణి వీద్వడఁగఁ – జరణము ల్కరములుఁ జాఁగంగఁదిగుచు
నలుఁగులు నలుచు నర్మిలి గట్టిపెట్టి – జలములు వీపునఁ జఱచు [10]నంతంత
వెగచి బెగడకుండ వెన్ను వ్రేయుచును – నొగి మస్తకమున నీరొత్తు దోయిటను
వదనంబు సొచ్చునో యుదకంబులనుచు – నదుముఁ[11] బొట్టను నోరికడ్డంబు వట్టుఁ
జెన్నుగాఁ[12] బసుపార్చి చేయు మజ్జనము – గన్నులుఁ జెవులును గాఁడంగనూఁదు
నంగిటముల్లొత్తు నందంద [13]వ్రేల – దొంగిళ్లఁ గార్నీరు దోనెత్తి మిడుచు
బడఁతిచే నీరఁ దూపొడిచి బొట్టిడును – [14]మడఁది యంగుష్ఠంబు మన్నింత[15]మెదిచి
[16]కడవ నంటినయట్టి పిడుకవిభూతి – యదరఁ బుత్త్రుని నొసలారంగఁ బూయు
[17]నెత్తుగ్రుంగెడు నని యెత్తంగ వెఱచి – యత్తన్వి ఔమ్మున నక్కున నదుము
కాటుక[18] యిడునంత గన్నగు ననుచుఁ – గాటుకయిడు మూఁడుగన్నులఁ గలయఁ
జన్నిచ్చుఁబక్షులఁ జననీదు మీఁద – నన్నాతి గొందిన వెన్నయుఁబెట్టుఁ
జెక్కిలి గీఁటుడుఁ జెలఁగి యేద్వంగ – నొక్క వేలిడి పోయు నొకకొన్నివాలు

1. నేల 2.బ్రుంగనిచ్చు 3. యాఁకొనకుండంగ నరసిపాలించి; యాఁకొనకుండఁగ ద్పరసి పాలించి(లిచ్చి) 4. బేరఁటంబులను 5. యుండుట దగునే 6. ఆరయఁ 7. నేహరు నకునైనను 8. ప్రాణేశుఁ 9. తొంగిళ్లపై 10. నందంద 11. గడుపునోరి 12. బసపార్చి 13.వ్రేళ్ల–పిడుచు 14.మడఁచి 15.నొసల 16.కడువ 17.నెత్తిబ్రుంగెడు 18. వార్నంత

ఉగ్గులు [1]వోసియు నువిద సంప్రీతి – నగ్గించు నొగియించు నట బుజ్జగించు
ముద్దాడు నగియించు ముద్దులువేఁడు – నద్దికొ౯ వీరెవ్వరయ్యరో యనుచుఁ
బన్నుగా నుదరంబుఁ బాన్పుగాఁజేసి – [2]కున్న జోసఱచుచు సన్నుతిఁబాడుఁ”
గొడుకని [3]యిబ్బంగిఁ గొనియాడుచుండఁ – బడఁతి నిశ్చలముగ్ధభావంబునకును
శివుఁడును మెచ్చి తాఁ జేకొనియుండె – నువిద గావించు బాల్యోపచారములు
శ్రుతి‘యేకయేవహి రూపేణ”యనియు – స్మృతి “సాధకస్సంస్మరేత్సదా”యనియు
ధర “తస్య తన్మయతాంయాతి” యనియు – హరునివాక్యము గాన యది యేలతప్పు
భక్తుఁ డెబ్బంగిగా భావించు శివుఁడు – వ్యక్తిగాఁదద్రూపుఁడై యుండు టరుదె?
యని భక్తమండలి [4]వినుతింపఁ గొన్ని – దినములు సనఁగ నద్దేవదేవుండు
వెండి యమ్మకుఁ బ్రసన్నుండు గాఁదలఁచి – దండిరోగంబైన [5]తఱుచంటిక్రియను
జన్నును గుడువక సంధిల్ల నోరు – వెన్నకుఁ దెఱవకయున్న యక్షణమ
బిట్టులిక్కిపడి [6]తల్లి బిమ్మిటి నొడలుఁ – బట్టలే కాపద గిట్టి “నాయన్న!
నాకున్న! నా పట్టి! నా [7]చిన్నవడుగ! – నా కుఱ్ఱ! చన్నేలరా కుడ్వవైతి
నీ చెమటయుఁ జూచి నెత్తురు[8]నవుదు(?) – నో చెల్ల![9]యెటు సూడనోపుదునన్న!
తల్లిఁగదన్న! యింతటి కోర్తునన్న! – ఎల్లెడ నొరుల నే నెఱుఁగఁగదన్న!
[10]కలిగితి లేక యొక్కఁడవు గదన్న! – తలరక యే నెట్లు ధరియింతునన్న!
నేలపై[11]నా కాళ్లు నిలువవురన్న! – ఏల పల్కవు సెప్పవే యన్న! నీకు
నతిమియో?[12]కోవయో?[13]యంగిటిముల్లో!– ఎఱుఁగనుమందుమ్రా
కేమియు” ననుచు

[14]బసవుఁ బలవరించుఁబయిబడి పొరలుఁ – గసుఁగొను మైవుడ్కఁగౌఁగిటఁజేర్చుఁ
గప్పుఁదెఱచుఁ గప్పుఁగ్రమ్మఱఁ దెఱచుఁ – దప్పక వీక్షించుఁ దల్లడంబందుఁ
బొంగెడుఁగడుపుముప్పునను ‘బొప్పనికి – నంగిటిముల్లయ్యె’నని నరులనఁగ
నడలుచుఁ గడుశోకజడధిఁ దేలుచును – బడఁతి పుత్త్రుండున్న భావంబుఁ జూచి
కడుపు వెలితియైన నొడయనంబికిని – నెడవోయి [15]యచ్చటఁ గుడువ లేకున్నఁ
గునియుచుఁ గుమ్మరగుండయ్య వాద్య – మున కాడి యచ్చటఁగొనఁదిన లేక
వచ్చి చేరమ చక్రవర్తి వాయింప – నచ్చెరువుగ నాడి యాఁకట [16]బడలి

1.వెట్టియు 2. కున్ననిఁ జఱచుదు 3. యుబ్బుచుఁ 4. హర్షింపఁ 5. తతిచంటి; 6. మూర్ఛబిమ్మిట 7. చిన్ని 8. నవుదు 9. యిటు 10. కలిగియులేకయొ 11. గాళ్లును 12. కొదమయో 13. యంగుటి; యంగుడు 14. బసువు 15. యటకొనఁ 16. డస్సి.



‘వెడయాట లివి[1]యెల్ల వేగి యాడినను – గడుపు నిండునె’ య[2]ని గ్రక్కునవచ్చి
పిట్టవ్వకై రాచవెట్టికిఁ బోయి – యెట్టకేలకు నింత పిట్టారగించి
సామవేదులయింటఁ జచ్చినపెయ్యఁ – బ్రేమం[3]బుతో వండి పెట్టంగఁ గుడిచి
[4]కామింపఁగాఁ గరికాళవ్వయింట – మామిడిపండులు మఱుఁగున నమలి
పోయి చెన్నయయింటిఁబులియంబకళముఁ – జేయుఁ దీయక జుఱ్ఱి **చిఱుతొండనంబి**
కొడుకు[5]మాంసము వేఁడికొని [6]విందుసేసి – యెడపక నిమ్మవ్వయింట భుజించి
యారగింపఁగఁ జవియైనఁ జోడవ్వ – కోరతో నిచ్చినఁ గొని యారగించి
యాసక్తి **సురియచౌడ**[7]య్య చేకళ్ల – కాసించి తట వెండి యంతటఁబోక
నిన్న నింతయు నొక్క నొలఁతుక సెప్పెఁ – గున్న! యాఱడి [8]వుచ్చుఁగూడునే నన్ను
మలమల మఱుఁగుచు నిలనాడనేల – కొలఁదిదప్పినకుడ్పు గుడువంగనేల?
బ్రదుకున్నదే యిట్లు వైకుడ్పులందు – నది యేల కడుపూఁదదయ్యెడుఁ జెపుమ
చన్నిత్తుఁ బలుమాఱు వెన్నయుఁ బాలు – నెన్నఁడుఁ దప్పింప నెందైనఁ దెత్తుఁ
[9]గుడుపు నీ కెయిదదే కొడుక యిట్లేల? – అడిగి కుడువఁబోయి తాదట[10]లేక
యిన్ని దినంబులు [11]నేరీతిఁ జాలె – నిన్న నీ కడుపేల నిండదు సెపుమ
యేయెడ వంచింప ‘రేయును బగలుఁ – జేయి దిగం డిట్టిసితగుండు గలఁడె?”
యని యొండె వేసర నాసరఁగన్న – జననిగదా యని[12]చనవునఁ బలుకఁ
దెల్ల మిప్పుడు మీఁదఁ దొల్లి నా యట్టి – తల్లులు గలరె యీ ముల్లోకములను
బనుగొన నీవు నా ప్రాణంబు[13]గాఁగ – [14]ననురక్తి గొనియాటకది నీవె సాక్షి
[15]యెట్టేని మాయుంచినట్టుల యుండి – బెట్టినంత గుడిచి యట్టుండితేని
యెప్పాట నినుఁ బొందునే తెవుల్నొప్పి? – నిప్పునఁ జెదలంటునే నీకు నీవ
చేసికొనఁగఁ దెవుల్సిద్ధించెఁగాక – యీ సంకటంబు నీ కేల [16]తావచ్చుఁ
బనియేమి?మాటలఁ బాయునే తెవులు – నినుఁ[17] గొంత వీఱిఁడితనమడ్గనేల?
[18]చాలఁ జూడంగ నీ సంకటం బింక – బాలుండ! నీ మీఁదఁ బ్రాణము ల్విడుతు”
నని తనశిరమున కలు[19]గ నున్నంతఁ – దన తల్లి కపుడు ప్రత్యక్షమై నిలిచి
**యడుగు మిచ్చెద నీకు నభిమతంబనుడుఁ – గొడుక! నా కొక కోర్కి కొఱంతయుఁగలదె?**

1. వెల్లివేఁగినాడినను 2.యంచుఁగ్రమ్మఱ 3. మీఱఁగఁజేసి 4. కామించియాకరి 5. మాంసమడిగి 6. యెత్తుచేసి 7.దనిచేతకళ్లఁ 8. ఁబుచ్చ 9. కుడుపు నీ కిందదే 10. బోక; మఱియు 11. నిది యెట్లు 12. చదువున 13. గాన 14. ననుషక్తి 15. వట్టేలయట్టేని 16. రా 17. గ్రొత్త... మడుగుదురె 18.చాలుఁ 19.గంగనంత

నీవు నిరోగివై నిత్యుండవై సు – ఖావాప్తి [1] నుండు నాకంతియె చాలు
కన్న మోహంబునకంటె నగ్గలము – ఎన్నఁ బెంచినమోహమెందు నటండ్రు
అటుగాన నినుఁ గన్నులారఁ జూచుచును – నిట యుండుటయె నాకు నీప్సితంబనిన
మందస్మితముఖారవిందుఁడై తల్లి – నందంద కౌఁగిట నప్పళింపుచును
'ముల్లోకములకెల్ల ముత్తవ(త్తోవునా?) నాకుఁ – దల్లివిగాన నా తల్లి! నీయట్టి
తల్లి[2]వి గలుగంగఁ దనకు రోగంబు – లెల్లెడఁబొందఁగ నెట్లుండవచ్చు'
ననుచు నిత్యత్వ మాయమ్మకు నొసఁగె – ననుపమ పరమ పరానందమూర్తి
యమ్మయై శివుఁ గొనియాడుటఁ జేసి – యమ్మవ్వ యను నామమయ్యె వెండియును

## గొడగూచి కథ

"శివుదేవుఁడన నొక్క శివభక్తి[3] యుతుఁడు – నువిదయుఁ[4]దానుఁ బొర్గ్గారి కేఁగుచును
రూపించి [5]కడగొట్టు పాపఁదారింటి – కాపిడి 'యటయిట కదలకుమమ్మ!
పడుచులతో నాడఁ బఱవకు మమ్మ! – నొడివిన మా వ్రతం బెడపకుమమ్మ!
గుడి కేఁగి నిత్యంబుఁ గుంచెఁడుపాలు – బడరున కారగింపఁగఁ బెట్టుమమ్మ!
నమ్మిపోయెదము సుమ్మమ్మ! మఱాకు – మమ్మ! మా యమ్మ! మాయక్క! మా తల్లి
కొమ్మ! నీకొక [6]మంచిబొమ్మయు లెస్స – బొమ్మపొత్తికలును బోయి తెచ్చెదము"
అని యప్పగించుచు నరిగిన, వారి – తనయ గాళ్లు మొగంబు దాఁ గడిగికొని
మంచిగంగులపాలు [7]మరగంగఁ గాఁచి – కుంచెఁడు గోరతోఁగొలిచి చేపట్టి
కోరయు [8]బొత్తిస(?) కొంగునఁ గప్పి – భోరునఁ జని శివాగారంబుఁ జొచ్చి
కోర ముందఱఁ బెట్టి ధారుణిమ్రొక్కి – "యూరగింపవె దేవ!" యని విన్నవించి యా
పిఱుసని యొక్కింత మఱువున నిలిచి – మఱి వచ్చి చూచుడు గఱిగంటి గామి
బాల దల్లడమంది భయమునఁబొంది – పాలేల యారగింపవు లింగమూర్తి?
కాఁచుట సాలదో కమ్మ వల్వమినొ– ప్రాఁచియో విఱిగెనో పడుచ నేననియొ?
ప్రొద్దెక్కెనో [9]యొంద [10]బొగయువచ్చెడినొ? బుద్దివుట్టదొ నెయ్యివోయకుండితినొ?
కడువేఁడియో నీరు గలసినవనియొ?– ఎడ వాద్యములు లేక యేనె తెచ్చిననొ?
చాలవో యివి యాలపాలు గావనియొ?– పాలపైఁ జిత్త మేఁబఱపితి ననియొ?
కోర బెడంగనో [11] కుంచెఁడు లేవొ?– ఆరగింపఁగఁ బెట్ట నేరకుండితినో?

1.నుండ 2. యునుండంగఁ 3. పరుఁడు 4. దాఁబొరుగూరి(బొన్నూరి) 5. కడఁబుట్టు 6.చిన్న 7.మరలంగఁ 8. బొత్తిన; బొప్పెన 9. యెండపొడ 10. బొగవట్టిచెడెనొ 11. అన్ని ప్రతుల నిట్లే కలదు.



మీఁదువో [1]యినవనో మీఁగడ లేదొ?– దెచ్చునెడ నెవ్వరేఁజూచిరనియొ?
యూరకేమిటికిఁ బాలొల్లవు ద్రావఁ – గారణంబేమేనిఁ గలదేనిఁ జెపుమ
నిక్కంపుటాఁకలి నీకు లేదేని – గ్రుక్కెఁడైనను గొని [2] చిక్కించు నాకుఁ
[3]గుడుపునకియ్యెడ [4]గుడగుడ లేల – కుడికెఁడు దెత్తు నా గుజ్జునోగిరము
మూలపన్నారుల యాలోవిలోనఁ – బోలె లున్నవి వంపు వోయి తెచ్చెదను
ఉట్టిపై బానలో నున్నది నెయ్యి – యిట్టున్నఁ దెచ్చెద నిష్టమే చెపుమ
కుండెఁడున్నది వోయి కొనివత్తుఁ బుల్ల – [5]కండంబు వలెనేని గ్రక్కునఁజెపుమ
[6]అచ్చన యెల్లి మాయయగారినగరఁ – జెచ్చెరఁ బిల్వవచ్చెద నారగింపు
మా శివసోదరిమఠమునఁగలదు – పాసెంబు దెచ్చెదఁబాలు ముస్రావు
షోడశపండువు సూడఁబోదండు(?) – పోఁడిగా నీ పాలు పురహర!కొనుము
వీరభద్రుని జాత్రవేళ [7]నిన్బండి – యే రొప్పఁ బనిచెద నీ పాలు ద్రావు
మెడమడు గేమిటి కీ పాలలోని – కడుకులు దెచ్చెద నట్లైనఁ జెపుమ
యిత్తఱి శిశువుండ నెట్టులంటేని – పొత్తునవైనను నెత్తి త్రావుదము
పిన్నపన్నారులు సిన్నిబొమ్మలును – నిన్ని గూడడుకులు నెన్నేనిఁబండ్లు
నా కెల్లి మా వారు నలిఁ దెత్తురపుడు – నీకు నిచ్చెదఁగాని నీ యాన! త్రావు
పాలును జల్లారెఁబలుకవు దోడ – నేల యాలింగ! నన్నేఁచెద వనుచుఁ
బాప యీశ్వరునకుఁ బలుమాఱు మ్రొక్కఁ – గోపించు భంగించుఁ గుప్పించునఱచుఁ
గటకట వాపోవుఁగరము[8]లు విఱుచుఁ – దటతట నేలతోఁదాఁకించుఁగాళ్లు
ధారుణిఁబడి బయల్దన్నుచు నేడ్చుఁ – గోరదిక్కును జూచు మారారిఁజూచు
బుజ్జగించును [9]వెడ్లు బుడ్లును బెట్టు – నిర్జీవిక్రియఁబడు నివ్వెఱఁగందు
నెప్పటి య ట్లేడ్చు నెలుఁగెత్తి పిలుచుఁ – దొప్పునఁ బడుఁ గోరఁ దొలఁగంగ[10]నూకు
వెఱచి ముందఱఁబెట్టు మఱి పలుమాఱు – నెఱఁగుఁ [11]బాదంబుల కెట్లుఁ ద్రావమిని
[12]నిట్టైనఁగాని పాలేఁ ద్రావ ననవు – ముట్టవు మూర్కొనవట్టె యున్నవియు
నీవారగింపమి మా వారు విన్నఁ – జావనడ్తురు నన్ను సంశయంబేల
తనకు నెప్పుడుఁ జావు దప్పదు[13] మగిడి – చన నిచ్చుటనె చత్తుసరివోదు" ననుచుఁ
దనతల శివునితోఁ దాఁకించుకొనఁగఁ – జనునంతలోనన [14]చక్కనఁబట్టి

1. యిన? (యనొ) మరి. 2. చిక్కింపు 3. కుడుపున కెయిదదేఁ గుడువలేననియె 4. గుద గుద 5.ఖండంబు 6. అర్చన 7.నీ బండి 8. దాటించుఁ 9. వెళ్లుబుళ్లును బెట్టిఁ 10. బెట్టు 11. బాదములకు నెట్టుఁ 12. నెట్లైన 13.మగుడి 14.చక్కటఁ

యా రుద్రుఁడతిదయాహసితాస్యుఁ డగుచుఁ – గోరతోఁ బాలెత్తుకొని యారగింప
"నన్నింత యేఁచితి పిన్నగాఁ[1]జేసి – మిన్నకపోదు మాయన్నకుఁజెప్పి
మఱికదా యున్నది మాట[2]లింకేల – కఱకంఠ! యింతయు మఱవకు"మనుచుఁ
గుడుక దెమ్మని పుచ్చుకొనుచు నబ్బాల – వడిగొని యింటికి వచ్చి నిత్యమ్ము
నిట్ల కొంపోయి తానిచ్చుచునుండ – నట్ల శివుండుఁబాలారగింపంగ
నూరికిఁబోయిన వారెదుర్గాఁగఁ – దా రేఁగుదెంచు నత్తఱిఁదొంటియట్ల
మృడుఁడు వాలారగిం[3]చుడు బాల రిత్త – కుడుకఁ [4]జేతను బట్టికొని యేఁగుదేరఁ
బొడగన 'యిట యెందుఁ[5]బోయెదు రిత్త – కుడుక యెచ్చటనుండి కొనివచ్చె'దనిన
'మీరు సెప్పినయట్ల మృడునకుఁబాలు – కోరతోఁ గుంచెఁడు గొలిచి కొంపోవ
నారగింపఁగ మ్రొక్కి యనయంబు నిట్లు – కోర యిమ్మన పుచ్చికొని వత్తు'ననిన
"నేనాఁటఁ ద్రావుఁ బాలీశుండు వడుచ – కానీవ త్రావితో కాదేని తోడ
నాడెదు పడుచుల కచట[6]ఁ బోసితివొ? – యేడఁ [7]జల్లితివొ [8]మైయెఱుఁగవు గాక
తన్నుమహాభక్తతతి [9]యుద్దేసించి – పన్నుగా 'నారగింపవె దేవ!' యనుచు
నతిభక్తిఁ బ్రార్థింప నారగించుటయు – క్షితి దుర్లభంబన్న నితరులతరమె?
యెట్టు నమ్మెడి దంచుఁబట్టిఁదిట్టుచును – 'నట్టైనఁజూత'మం చామఱునాఁడు
బాలచేతనె తండ్రి వట్టించుకొనుచు – లీలతోఁగుడికేఁగి పాలతోఁ గోర
ముంద[10]ఱిక్రమమున ముంద[11]ఱనఁ బెట్ట – నందికొనండయ్యె నా లింగమూర్తి
బాలముగ్ధత్వంబు ప్రవిమలభక్తి – [12]యాలోకమున వెలయింపంగఁ దలఁచి
యా శివదేవుఁడు నంతఁ గోపించి – [13]"యోసి! నేఁడేల పాలొల్లండు ద్రావ
ముక్కంటిముట్టెనే [14]మూర్కొన్నె చెపుమ – పెక్కులు ప్రేలితి [15]వక్కజంబుగను
శివునకు నని యుద్దేసించినపాలు – దవిలి నిత్యంబును ద్రావినద్రోహి!
పొట్టప్రచ్చెద[16] నెందుఁ బోయెద'వనుచు – గట్టుగ్రమునఁగూడ [17]ముట్టుడు మున్న
బాల వాపోవుచు బలువిడినేఁగి – [18]హాలింగ! హాలింగ! హాలింగ! యనుచు

1.జూచి 2.మాటలేలిఁకను 3.పుడు 4.దాఁజేఁబట్టుకొనుచు నేతేర 5.బోయితి కొన్ని ప్రతులలో 'యెందువోయెదు' అని కలదు.'ఎందు, అందు, ఇందులు' ప్రథమాంతముగాఁ గళగాఁజెప్పఁదగియున్నవి. 6.నిచ్చితివొ 7.జల్లితొదేహ 8.మైయెఱుఁ, మెయ్యెఱుఁ, 9.యుద్దేశించి 10.టి 11.ట 12.యీ లోకులకు 13.యోశి! 14.ఇక్కడ 'మూర్కొన్నె మూర్కొనెనె, అనునర్థమునఁ గలదు. "ముట్టునేమూర్కొన్నె" అని యెక్క ప్రతిలోనున్నది. మఱియుఁ గొన్నింట "మూర్కొనెనె' అని గణభంగముగాఁగలదు. 15.ప్రేలరిపడుచ 16.నెందువోయెద 17.ముట్టెడు 18.హాలింగ! హాలింగ! యనుచుడగ్గఱుడు.



జేతికోరకు మున్ను [1]సేయిసాఁచుచును – నాతని కొడుఁగుడు నంతలోపలను
హరుఁ డోడకోడకు మనుచు నక్షణమ – వరదయామతిఁ దనవక్షంబుఁ దెఱవ
జగదభినుతకరడిగ భోగనాథు – నగణిత [2]దివ్యలింగాంగంబు సొరఁగ
నమ్మాత్రలో[3]నహహా! పోయె ననుచుఁ – గ్రమ్మనఁ దండ్రి [4]గూఁకటి వట్టుటయును
వెలుపలఁ [5]గూఁకటి వెండ్రుకల్ సిక్కె – వెలయ లింగంబులోపలఁ జిక్కెబాల
యిల నేఁడు నాఱునెలల కొక్కమాఱు – నలరి [6]కూఁకటివెండ్రుకలు [7]గత్తిరింప
'బాల నిశ్చలముగ్ధభావ సంపదకు – నీ[8]లోకమున దృష్ట' మిది యని పొగడ
గొడగూచి యని చెప్పఁబడి మహామహిమ – నడరెఁ దా నాముగ్ధ యదియునుగాక

## దీపదకళియారు కథ

ఏపార మఱియుఁ గాంచీపురంబునను – దీపదకళి యన దృఢభక్తియుతుఁడు
పొరుగూరి కొక్కనాఁడరుగ నొక్కెడను – హరుఁడు జీర్ణాలయంబందుండఁజూచి
"కటకటా!యీశుఁడొక్కఁడ యున్నవాఁడు – పటుతరాటవిలోనఁ బగయును బెద్ద
కచ్చడంబులు గూడఁ గట్టించె మునులఁ – జెచ్చెర ముక్తులఁజేసె దానవులఁ
గనుమూయ నెడయులే [9]దనఁగ ముమ్వెట్టి – గొనియెనవ్యాసవాద్యనిమిష వరులఁ
దిరముగా ద్వాదశాదిత్యుల నొక్క –[10] దెరువునఁ బోకుండఁదిరువుడుకొలిపె
వెలయ ననంగుఁ గావించె నంగజుని – వెలుఁగనిపురములు వెలిఁ[11]గించెఁ బేర్చి
చెనసి దామోదరుఁజేసె దామోద – రుని విధిపాలు సేసెను విధిఁబట్టి
కరుణాకరుండని గారవింపంగ – నరుదగు సర్వసంహారంబు చేసెఁ
గావునఁబగ వెద్ద దేవదేవునకు – నీ విపినంబులో నెట్లుండవచ్చు
గుడియును[12]ప్రస్సియుఁ[13]గూలిపోయినది – యడరుమంటపమును నరివియైనయది
కోటయుఁబడ్డది గూడ నయ్యైక – వాటంబు [14]లును జివ్కి వసుధఁ ద్రెళ్లినవి
ఒడల నర్ధము గొన్న యుమబోటి వుట్టు – పొడ లేదు శివునంద యడఁగెనో [15]కాక
భయమందియొంటిగోడయు[16] మీఁదఁగుసువు – వయిచుకొన్నదియును వనరుచు నెదుర
మును శివుఁడిచటఁబుట్టిననాఁటనుండి – చెనసి తమ్మళి భజించిన చొప్పు లేదు
ఇది యేల వేయును నిచ్చట నునికి – యది ప్రమాదమ యసహాయంబుగాన

1. చెయిసాఁచునట్టు–లాతనినొడ(ద)రుచు 2.లీలదివ్యాంగంబు 3. ననహా; 4.కూఁకట 5. గూఁకట 6. కూఁకట 7. గత్తరింప 8. లోకులకు 9. దనిశమ్మువెట్టి 10. తెఱఁ(ర)గునఁ 11. లుఁగించి పేర్చె 12. ప్రప్పియై, ప్రస్సియై 13.గూలుచున్నదియు 14.లుఁజివికి 15.కూడ 16. తలఁగస(సు)వు.

నిక్క మీశుండపో యెక్కటి [1]వీరుఁ – డొక్కఁడు నిక్కడ నున్న యప్పటికి
నూరక వట్టివిచారంబులెల్లఁ – దా రక్షయగునె సంహారరుద్రునకు"
నని నిశ్చయించి తానచ్చోన యుండి – తనయింటి [2]యావత్తుధనమును మున్ను
సంచితంబగు వస్తుసమితియుఁ జిల్ల – పెంచాదిగా [3]మట్టగించి తెప్పించి
గుడియు మంటపమును గ్రొత్త గావించి – కడునొప్పఁ జట్టు నగడ్తఁ ద్రవ్వించి
కోటయుఁ గొమ్మలుఁ గొత్తడంబులుఁ గ – వాటంబులును దగువంకదారలును
బెట్టించి [4]వంపుడుగట్ట యగడ్త – చుట్టును బోయించి యట్టళ్లు దీర్చి
పొలుపొందఁ [5]డెంకణంబులు వెక్కువన్ని – నలిఁబడగలుఁదోరణంబులు గట్టి
కొత్తడంబులఁగోటకొమ్ముల [6]గొడుగు – లెత్తించి బలుమగలెందఱో యనఁగ
[7]వ్రాలినకుసులును వసులుదూలములు – ఱాలుగుండ్లును నిస్మ సాలఁదెప్పించి
కోటకొమ్ములఁ దగుచోటఁ బంచించి – కోట యీ క్రమమునఁ బాటించి యంత
లోఁతుగా నడబావిలోనఁ గట్టించి – [8]పాఁతర్లఁ గొలుచు నేర్పడ సంగ్రహించి
యగ్గుడిచుట్టు బిల్వాశోకసురభి – గుగ్గులు క్రముకాదికుజములు వెట్టి
మరువంబు దవనంబు మాచిపత్త్రిరియు – వరుసను బహుపుష్పవాటికల్ నాఁటి
[9]జాలవారిని దివ్వటీలను బల్ల – గోలలవారిని గుడిపూజరులను
నొడిసెలకాండ్రను నోజులవారి – బడిపని [10]జనులను బంతంబుబంట్ల
ద్వారపాలుర సువిధానుల విండ్ల – వారిఁ దలారుల వారక యేలి
వారును దాను నవారితశక్తి – [11]గోరంతప్రొద్దు మేకొనికట్టు బిగిచి
యాయత పంచమహావాద్యరవము – పాయక రేయును బగలును మ్రోయఁ
బోటరులగు నజాంభోజనాభులకుఁ – గోట సాధింప నగోచరంబనుచు
మనుజులక్కజమంది వినుతింపుచుండ – ఘనకీర్తి నటు గొంతగాలంబు సనఁగ
ధనమెల్లఁ దన్నిమిత్తమునను సమయ – మునుకొని పరివారమునకు జీవితముఁ
బెట్టలేకున్నను [12]బెగడక జగతి – చుట్టును జాల రాచుచుఁ దిరుగుచును
అంతంతఁ గవదివియల నాఁటఁ బొడిచి – యంతఁ దొల్లిటికంటె నగ్గలికముగ
మొలనున్నగంటలు మ్రోయఁ దాళంబు – లులియ నొడ్డణము గుబ్బలు గజ్జియలును
ధ్వనియింప నల్లన తాటన వుచ్చు – చును సువిధానంబు సువిధాన మనుచుఁ

1. ధీరుఁ 2. యాతుర 3. ఁబరికించి 5. చంపుడు 5. నంకణంబులు 6. గొడగు 7. వాలిన 8. పాఁతళ్లఁ
9. జాలదారిని 10. వారిని 11. గోరతప్రొద్దుమై కొనకట్టు కూడ(డి) 12. బెగడంగ..



[1]గుడిని మానిసి గొమ్మకొమ్మ దప్పకయ – [2]యడువరిపై నున్నయట్లొక్కరుండు
వేయుముఖంబుల వేనవేల్విధులఁ – బాయక యట్టుల బలము సేయుచును
నీ విధంబున రాత్రులెల్ల వేగింపఁ– గా వెండి నూనియ గవదివియలకు
నొక్కింతయును లేకయున్న నూహించి – గ్రక్కున మాఁకుల కణికలు వేర్చి
కవదివియలభాతిఁ గాల్చుచు మంట – లవిరళంబుగఁ బెట్టి యట్లు వేగింప
నొక్కకొఱడు గొఱ్ఱ యొక [3]మ్రానుమఱ్ఱ – యొక్కబడియ బఱ్ఱయొక కట్టెగిట్టె
మందునకైనను మ్రాఁకనుపేరు – నెందును లేకుండ నేఁగుడు నంత
[4]కసువునఁబిరు( పిరి?) వెంట్లుగాఁ దాల్చిచేత – నసలారఁ గవదివియలభాతిఁ బట్టి
యిలఁ[5] దీగదీపంబుపొలుపు వఱ్ఱిల్ల – నలి మనోవేగంబున జగతిచుట్టుఁ
దిరుగుచు మఱి కొన్ని దినములు [6]నడవఁ – బొరిఁ బల్లు [7]గుట్టెడుపూరియఁ బుడుక
సదసఱ్ఱ నలి నఱ్ఱ సరి [8]గస్సుగఱ్ఱ – వెదకియుఁ గానక మది విచారించి
కచ్చడంబాదిగాఁ గలచీరె లెల్లఁ – జెచ్చెర వెంట్లుగాఁ జేసి ముట్టించి
దివి[9] వెలింగెడు మెర్గుదీగెలో నాఁగఁ – గవదివియల [10]భాతిఁ గరములఁబట్టి
వెసఁగొని తిరుగ న [11]వ్వెంట్లుఁ జెల్లుడును – మసలక చీకటి మఱువునఁజేసి
పగవారు సొత్తురో పరికింపరామి – నగుఁ బ్రమాదం [12]బంచు నాత్మలోఁదలఁచి
గ్రక్కునఁదలవెండ్రుకల జడయల్లి – చక్కన దీపంబు సంధించిపట్టి
యింతట వేగుఁబోయిం[13] కఁబ్రొద్దనుచు – నెంతయు రయమున నెప్పటియట్ల
[14]జగతిచుట్టుఁ దిరుగ జడ యెల్లఁగాలి – బగబగయనఁగ దీపదకళియారి
తలగూడ దరికొనఁ దడవ శంభుండు – జలజాక్ష జలజజ శతమఖార్చితుఁడు
కంతుసంహరుఁడంత కాంతకుఁడతిని – తాంతసదానందుఁ డంబికాధవుఁడు
త్రిభువనారాధ్యుండు దివ్యశరీరుఁ – డభవుండు శివుఁడు ప్రత్యక్షమై నిలిచి
దీరు మహోదారు దీపదకళియ – నారును గారుణ్యవారాశిఁ దేల్చి
"యిచ్చ యెయ్యది నీకు మెచ్చితి [15]వేఁడు మిచ్చెద" నావుడు నిలఁజాఁగిమ్రొక్కి
"మెచ్చులు వేయును వచ్చె నొండొల్ల – నిచ్చమై విన్నపంబేర్పడ వినుము
ఈవిపినంబులో నెక్కడి బడుగు – దేవరో యనఁగ శ్రీదివ్యలింగాంగ
లోకాశ్రితుఁడ! భక్తలోకకుటుంబి! – యేకాకివై యుండు టిది నీతిగాదు

1. గూడ 2. యాదుపరి 3. మ్రాఁకు 4. కసువు 5. దీపగంభంబు 6. సలిపి, సనఁగ 7. గుట్టుకోఁబూరియుబరక
8. గసవుగఱ్ఱ (గాండ్ర) 9. వెలుంగు మెఱుంగు దీగయోయనఁగఁ 10 యట్ల 11. వ్వెట్లు
12. బనియాత్మనూహించి 13. యింతవ్రా 14. జగిలె(లి) 15. మడుగు.

అనయంబు రజితాద్రి[1]యట్టిదుర్గంబు – మనకుఁ గల్గఁగ వేఱె మన్నెముల్ సేసి
కొనియుండనేల యీ వనదుర్గ మందుఁ” – [2]జనుసనుమనుచుఁ బుష్పకవిమానంబుఁ
జక్కన నద్దేవు నెక్కించి తాను – నెక్కి దీపదకళి యెంతయునొప్పు
గుడియు మంటపమును గోటయుఁగూడఁ – గడునర్థిఁ గొనిపోయెఁ గైలాసమునకుఁ
బురహరు మెప్పించి బొందులతోన – యరుగుభక్తులు గలరన్నిలోకముల
గుడితోన లింగంబుఁ గొనిపోవుభక్తుఁ – డదరఁగఁ గలఁడయ్య! యఖిల లోకములఁ
గడుఁగడుఁ జోద్యంబుగాదె తలంపఁ – బుడమిఁ బుట్టనిభక్తిఁ బుట్టెఁదా ననుచు
దేవదానవమానవావలి వొగడఁ – గా వీరభక్తశిఖామణి యైన
యట్టిదీపదకళియారి ముగ్ధత్వ – మిట్టలంబైయొప్పె నిల” నట్టుఁగాక

## నాట్యనమిత్తండి కథ

“కదునొప్పు వెండియుఁ గంచిలోపలను – మృదుమూర్తి నాట్యనమిత్తండి యనఁగఁ
బోఁడిగా శివభక్తపుంగవుఁడొక్క – నాఁడు శ్రీ యేకామ్రనాథుని గుడికి
నాయతభక్తిమై నరిగి కూత్తాడి – నాయనారిని సదానందస్వరూపిఁ
దాండవమూర్తి నత్యద్భుతాకారు – దండిగజాసురదళనావతారు
బాలేందు శేఖరు ఫాలలోచనుని – గాలకంధరు శూలఖట్వాంగధరునిఁ
బొడగని పూజారి నడిగె “నీశ్వరుని – [3]నడుమటు వీఁగియున్నది యొక్కదెసకు
వారక కొంకరవంకరల్వోయి – గౌరీశుచేతులు పూరించి[4]నవియు
ముక్కొంకులును బోయి మోచియు మోవ – కొక్కవాదంబట్టులున్నది శివున
కున్నపాదంబును నూరుమధ్యమున – నున్నది [5]యీచవో యున్న భావమున
నిలువులువడి శివునేత్రత్రయంబు – నొలుపుగా ఱెప్పలు వొందకున్నవియు
మలహరుశిరమును [6]నిలువక యొక్క – వలనిక యంతయు వ్రాలియున్నదియు
మృడదేవు కెంజడ [7]ముడివీడినదియుఁ – గడుఁజోద్యమిదియేమి గారణం?”బనుడు
నా శివబ్రాహ్మణుఁడల్లన నగుచు – “నీ శివునకు రోగమిట్టులైనదియు
వాయు[8]దోషము దీని వారింపకున్నఁ – గాయజహరునకుఁ గడుఁ బ్రమాదంబు
దడసిన నింకొండు దలఁచిన శివుని – యొడలెల్లఁ గూడ నిప్పుడ కొంకు[9]వోవు
దీనికి నౌషధంబే నెఱుంగుదును – బూని చేయింపుమా మానెడు” నంచు
నాలిసేయుచుఁ బల్క నది దథ్యగాఁగ – నా లింగవంతుఁ డట్లాత్మఁదలంచి

1. యనెడు 2.జనుమందునపుడు 3.నడుమునువిఱిగి 4.నయవి 5.యూఁచ 6.నలవోక 7.ముడియవీడినది 8.దోషంబింక, దోషంబిది 9. లొదవు.



తనయింటఁగల పదార్థమ్ములు ధనము –[1]మునుకొని కొనివచ్చి ముంద[2]టఁబెట్టి
“కోరియింతయును జేకొనియైననిపుడు – మారారిరోగంబు మాన్చి తేనియును
నా సతియును నేను నా సుతుల్నీకు – దాసులమయ్యెద మాసక్తితోడ
నెట్టైన నీ వింతవట్టు పుణ్యంబు – గట్టికోవే” యనఁ గల ధనంబెల్లఁ
గొని“వాయుతైలంబుఁగూర్చి యౌషధము – లెనయంగవండితి” ననుచు నాముదము
నూనియ నొక్కింత నులివెచ్చఁ జేసి– చేనిచ్చెఁదత్క్రియ సెప్పుచు నతఁడు
వాయుతైలముఁ గొనివచ్చి యక్షణమ – మాయాపహరుమేన మర్దనసేసి
తవిలి యా వావిలిచివుళులుమ్మెత్త – చివుళులు [3]దక్కెడిచివుళు [4]లాముదము
చివుళులు పండినజిల్లెడాకులును – నివి యాదిగా మందులిన్నియుఁగూర్చి
చెచ్చెరఁ దనువెల్ల సేకంబుసేసి – పొచ్చెంబు లే కిస్సుమపొట్లాలఁ గాఁచి
పుచ్చుచు నరచేత వెచ్చఁ జూపుచును – నిచ్చ యెఱిఁగి కాఁక లిచ్చును వలయు
పథ్యంబులారగింపంగఁ బెట్టుచును – [5]దథ్యంబుగా వెండి తగుక్రియ ల్సేయఁ
గొన్నిదినంబులు సన్నఁ దద్భక్తుఁ – డన్నీలగళుఁ జూచి“యిన్ని నాళ్లయ్యె
నాపోవ నొక్కింతయైనను గుణము – సూపదు వార్వతీశుశరీర మందు
నననేల! నిక్కము నట్టిద కాదె; – పనుగొన నేనెంత భ్రాంతిఁ బొందినను
నారంగ నడవులయాకులు నలము – వేరు వెల్లంకియు మారసంహరుని
యొడలిరోగము మాన్ప నోపునే యింక – నెడసేయనేటికి నేఁగాక శివుని
వాయుదోషమునకు వైద్యుండ”ననుచు – నాయయ్య గడునిశ్చితాత్ముఁడై యంతఁ
దలఁ కించుకయు లేక తన ప్రాణమునకు – నలుగంగఁ బ్రత్యక్షమై నిల్చి శివుడుఁ
పార్వతీకాంతుఁడు భక్తవత్సలుఁడు – శర్వుఁడర్వాచీన సౌమ్యస్వరూపి
గీర్వాణవంద్యుండు[6] సర్వేశ్వరుండు – సర్వజ్ఞుఁడజహరిశతమఖార్చితుఁడు
నాట్యలోలుండు బినాకహస్తుండు – నాట్య[7]నమిత్తండి నలిఁగౌఁగిలించి
“మేదురకీర్తి! నిఁ మెచ్చితి వేఁడు – మాదట నిచ్చెద నభిమతార్థములు”
ననుడు “నేమియు నొల్లనభవ! మీ దివ్య – తనువు వేఱొండుసందంబైన యదియు
వెండి వంకలువోయి వెడరూపుగాక – యొండేమి గడుఁజూడ నొప్పియున్నదియు
రోగమో! సహజమో! యోగీంద్రవంద్య! – ఈ గరిమంబు నా కెఱిఁగింపు” మనిన
“నిది దాండవాకార[8]మెట్టులంటేని – ముదమున నాట్యాభిముఖుఁడనై నిల్చి

1. కొనివచ్చిముందటఁ గుప్పగాఁబోసి 2. ర 3.తక్కలి 4. లామిదెపుఁ, జి 5. దథ్యగా వెండియుఁ ద, 6.కృత్తివాసుండు 7. నిమిత్తండి 8. మెట్లంటివేని.

'హో'యని డమరుగంబొగినొక్కమాటు–వాయింపఁదడవసర్వములయ[1]బొందుఁ(ద)?
జరణంబు దొంగలి చలనగాఁ జేసి – పరగంగ నక్షత్రపంక్తులు డుల్ల;
వినుతమహోద్రేకవీక్షణాటోప – మున నజాచ్యుతదేవముఖ్యులడంగ
మూవలగంటల మ్రోఁతకు వెఱచి – దేవి యున్న సగంబు ధృతిఁదన్నుఁగలయ
ఖ్యాత మహోద్ధత కరతాడనముల – నాతతదిక్తతి [2]యవలఁజనంగ
వడి మహోచ్ఛ్వాసనిశ్శ్వాసోపనిహతి – బడబాలనం బాఱ జడనిధు లింక
గతిని మెట్టెడుపాదఘట్టనచేత – నతులధాత్రీతలంబది ధూళి గాఁగ
నురవడిమై జిఱ్ఱఁదిరిగి నిల్చుడును – బొర[3]మాలి దిగ్గజంబులు వొడవడఁగ
[4]గ్రక్కున జాఱి టంకారంబుచేత – నెక్కొన్న కులగిరుల్ నెఱిఁబొడిగాఁగ
నొందంగఁ బాదాగ్ర మూఁది నటింపఁ – గ్రిందటికూర్మంబు [5]గిజగిజగాఁగ
మహితజటాచ్ఛటా విహతి నజాండ – బహులకటాహంబు వఱియలుగాఁగ
నురుకిరీటవిఘాతనోద్వృత్తిఁజేసి – పొరిఁదత్త్వ సందోహములు వెల్లగిలఁగఁ
దాండవోద్ధతిఁజేసి ధరియింపఁబడిన – దండిఫణీంద్రుండు దలరి రోఁజంగ
నిటురోఁజుచున్న ఫణీంద్రు నూర్పులకు – స్ఫుటఫాలనేత్రాగ్ని భుగులన నెగయ
వడి నెగసెడినేత్రవహ్నిరోచులకు – జడలపైఁ జంద్రుఁడాసగమును గరఁగఁ
గలయ సుధాసూతి గరఁగినకతన – బలువిడి నమృతంబు దల డిగి పఱవఁ
దలడిగి పఱతెంచు తత్సుధాపూర – మలరి ముంచుడు జీవములు వచ్చి యంత
నురమున శిరమున నొగి గళంబునను – గరముల భూషణోత్కరములై వెలిఁగి
పరగుసురాసుబ్రహ్మోచ్యుతాది – వరకపాలావళుల్ శరణు వేఁడుచును
బొబ్బలు వొడువంగఁ బొంగి యార్వంగ – నుబ్బి యాళతిసేయ నొగిఁ దాళగింప
గ్రీడ వట్రిల జతిగీతముల్ వాడ – నాడుదుఁ బ్రమథులు సూడఁదాండవము
కావునఁ దాండవాకార మత్యర్థి – భావించి కొలుతురు[6]భక్తు లెప్పుడును"
ననుచు నానతియిచ్చి యద్దేవదేవుఁ – డనురాగలీలమై నతుల మౌగ్ధ్యమున
మించిన నాట్య నమిత్తండి మహిమ – నంచితకనక దివ్యవిమానమునను
గొనిపోయెఁ గైలాసమునకు సద్భక్త –[7]జనులు సజ్జనులును వినుతింప" మఱియు:

## ఉడుమూరి కన్నప్ప కథ

"శ్రీకాళహస్తిగిరి ప్రదేశమున – శ్రీకంఠభక్తుండు లోకైకసుతుఁడు
ఉడుమూరి కన్నప్పఁ డొక్కనాఁడర్థి – నడవికి వేఁటమై నరిగి యొక్కెడను

1. మౌను 2. యౌలనణంగ 3.ఁబొరి 4. టక్కున.... కటారంబు 5. గిజగిజ 6. భక్తులు భువిని 7. జనులును మునులును.



దోడెఱుకులుఁ దాను దోఁపున నుండి – యాడ నొక్కింత నిద్రావస్థ దోఁపఁ
గలయఁగ రుద్ర చిహ్నాలతోడ నీశుఁ – డలరుచుఁ దపసియై యరుదెంచి తన్ను
జవుకమందునిచి నొసల భూతివెట్టి – శివతీర్థకలశాభిషిక్తుఁ గావించి
"చనఁజన ముందట ఘనలింగమూర్తిఁ – గనియెదు; ప్రాణలింగంబు నీకదియు'
నని యుపదేశించినట్లు స్వప్నమునఁ – గని మేలుకాంచి నల్గడలు వీక్షింప
మును లేని దొకద్రోవ ముందటనున్నఁ – 'బొనరనిక్కలయయ్యెఁబోకల'యనుచు
దన తోడి యెఱుకుల నునిచి యొక్కండ – చనఁజన ముందట ఘనలింగమూర్తి
యున్న సంతోషించి కన్నప్పదేవుఁ – డున్నత భక్తి సంయుక్తుఁడై మ్రొక్కి
"కలగన్న చోటికి గంపఁ గొంపోవ – ఫలసిద్ధి యగుటెల్ల భాగ్యంబుగాదె?
మును దపోమూర్తి సెప్పిన లింగ మిదియ – తన ప్రాణనాథుఁడౌ" నని నిశ్చయించి
"బాస గాదింక నీ ప్రాణలింగంబుఁ – బాసి పోఁదగదు మా [1]పల్లియ కితని
గ్రక్కునఁ గొనిపోయి కట్టుదుఁ బాక – నిక్కడ నునుపరాదెండఁగాలంగ
బుద్ధులు సెప్పియు బుజ్జగించియును – దద్దయుఁగీడ్పడఁదగ వెడ్డు వెట్టి
వలసిన వస్తువు లిలఁ దెచ్చియిచ్చి – వలపించి కొని పోవవలె" నని తలఁచి
పరమహర్షమున విస్ఫా[2]రాంగుఁడగుచు – వరముగ్ధభావన హరునకిట్లనియె
"అక్కటా!యిదియేమి హరుఁడ యొక్కరుఁడ – విక్కడనుండుట[3] యేమి గారణమొ?
తల సూప కేయూరి తమ్ముళ్ళతోడ – నలగి వచ్చితి సెప్పు మలుక దీర్చెదను
గొరగ లుమ్మెత్తపత్తిరిఁ బూజసేయ – మరులెత్తి వచ్చితో యురుతరాటవికి;
[4]పరసలత్రొక్కునఁ బడఁ జాలకీవు – సిరిగిరి నుండక సురిఁగి వచ్చితివొ?
జడలకు నొడలికి సవతులువోర – నుడుపఁ జాలక వచ్చి యడవిఁ జొచ్చితివొ?
చెన్నయ్య గలసినఁ జెడెఁగులంబనుచు – నిన్ను లోకులు వెలియన్న వచ్చితివొ?
పలుమాఱు నంబికి బడిపనుల్సేయ – సొలసి వచ్చితివొ యిచ్చోట డాఁగంగ
నాఁటి బ్రహ్మయు నేఁడు నాయంబు దప్ప – వేఁటాడ వచ్చితో వేయును నేల
నా తోడి మోహంబునన నన్నుఁబ్రోవ – నేతెంచితో వేడ్క యెసఁగ నిచ్చటికి!
యెట నుం(యుం?)డి వేంచేసి తెట్లు నీ బ్రదుకు?– ఇట నుం(యుం?)డ![5]జొచ్చి
(నీ వెంతగాలంబు?
ఎక్కుడుగోద నిన్నిక్కడ వైచి – యెక్కడవోయె నే నేఁగెదఁ జెపుమ?
ఒడల నర్ధము గొన్న యుమబోటి యెద్ది? – యెదరైన నవ్వరే యెక్కడివారు?

1. పల్లెకు నితని 2. రాంగమమర 3. కేమి 4. పరుస 5. వచ్చి

కట్టిన గోచి యెక్కడ [1]నొల్వువడితి? వట్టేల వచ్చితి వడవి కొక్కఁడవ?
చంక బొక్కసమును సడలియున్నదియు – శంకింప కొంటెట్టు సరియించెదయ్య!
కొండలలోన నొక్కండ వీవిట్టు– లుండంగ వెఱవవా ఖండేందుమౌళి?
మృగములు నురగము ల్మితి మేరలేవు – నగవు గాదిచటనున్నను బ్రమాదంబు
ఎఱుకుఁ బన్నలు గన్న నేఁతురు నిన్నుఁ – గఱకంఠ! మా పల్లెఁ గలదెల్ల సుఖము
అడవుల మనుబిళ్ళ కడు మంచిపాలు – నొడిపిలి పాసెంబు నుడుప నేతులును
నిప్పపూవును దేనెలెల్ల ఫలాదు – లొప్పెడు వెదురుఁబ్రాలోగిరంబులును
మఱి యట్లుఁగాక నీ మనసు వచ్చినను – నెఱచులుఁ గఱకుట్టు లెన్నేనిఁగలవు
రావయ్య! మ్రొక్కెద దేవదేవుండ! – ప్రేవులు మాడంగఁ జావఁదప్పినదె?”
యనుచుఁ బాదాక్రాంతుఁడైన నీశ్వరుఁడు – దన తోడఁ బలుకీమి మనసులోపలను
“నింత[2]గాలము నుండి యిట గుడువండొ? – కంతునిర్దళను డాఁకటఁ బల్కలేఁడు
చెవులు సిల్లులు వోవఁ జీరంగనేల – శివునకేమేనిఁ దెచ్చెదఁ గాక”యనుచుఁ
జని కందమూలాదిశాకముల్ మృగము – లును దృష్టి మాత్రలోనన పరీక్షింప
మునుకొని “యంతకుమున్నధరిత్రిఁ – జనిన జీమూతవాహనుఁడును శిబియుఁ
గీర్తిముఖుండును గీర్తింప నాది – కర్తకు నర్పింపఁగా నెఱుంగమిని
దమ శరీరము లొండుగ్రమమున సమసి – యమిత సాహసవంతులనఁగ నిబ్బువిని
సవిశేషకీర్తిభాజను లైరిగాని – ప్రవిమలమతి లింగభాజను ల్గార”
యనుచు సౌందర్య మహాకాయులనఁగ – దనుజేశులతిఘోర తపమాచరింప
నెంతయుఁబరితోష హృదయుఁడై భర్గుఁ – డంత దైత్యులకుఁ బ్రత్యక్షమైనిలిచి
“యా యధోక్షజ కమలాసనవాస – వాయతస్వర్గ మోక్షాది భోగములు
చెచ్చెర వేఁడుఁడిచ్చెద” నని యాన – తిచ్చుడు సాష్టాంగమెఱఁగి దానవులు
“మా జలంధరుఁడభిమానంబుగొన్న – యాజనార్దనుపదమరిదియే మాకు
మా గజాసురునిచే మడిసినయట్టి – వాగీశ్వరత్వంబు వలెనె నిన్నడుగ
మా తారకునిచే విధాతమై చెడ్డ – యాతని యింద్రత్వమది యేల చెప్ప
నటుగాక వ్యాఘ్రాంధకాది దానవులు – నిటలాక్షు పగతులై నీ చేతఁదొల్లి
వడసన మోక్షంబు భక్తిమైతగిలి – పడయుట సోద్దెమే పానలొండేల
దేవ! నిత్యానంద! దివ్యలింగాంగ! – దేవ! మహాదేవ! దేవాధిదేవ!
ఎల్ల దైవత్వంబులెల్ల భోగంబు – లెల్లవి యెఱుఁగుదు మొల్ల మేమియును

1. గోలువడితి, నొల్వఁబడితి 2. గాలంబేని, (బేమి).



నీ రమ్యమగు మా శరీరము లీకు – నారగింపంగ నాహారము ల్గాఁగఁ
గరుణింపుఁ”డనుడు శ్రీకంఠుఁడిట్లనియె – “ధరఁగాళహస్తి భూధరసమీపమున
మృగములై పుట్టుఁడు మిమ్ము వధించి – బగుతుఁడొక్కఁడు పరిపక్వంబుసేసి
యర్పింపనేర్చుఁ గన్నప్పఁడనంగ – [1]నర్పింప నపుడు మిమ్మారగించెదను”
అని యానతిచ్చుడు నసురు లక్షణమ – చనుదెంచి ప్రజలును వనితలుఁదారు
మృగములై లింగసమీపంబునందుఁ – దగిలి జన్మించి యెంతయుఁబ్రీతిఁదమ్ము
నొరులకుఁ గానరాకుండ వర్తింప – వరమృగావలి సేరవచ్చిన నుబ్బి
యొక్కొక్కకోలన యొక్కొక్క మృగము – నుక్కడఁగింపుచు నుత్సవంబలరఁ
జెచ్చెరఁగోలలు దెచ్చియక్షణమ – త్రచ్చి మెల్లన మంట దరికొల్పి కాల్చి
మంచి మాంసముగ శోధించి [2]శోధించి – పంచిన మాడ్కి ఖండించి ఖండించి
కాల్చుచుఁ బక్వంబుగాఁ ద్రిప్పి త్రిప్పి – ప్రేల్చుచు వెండియుఁగ్రియకొల్పికొల్పి
తవిలి ఖండింపుచుఁ దాఁజవిసూచి – చవి[3]యున్న లెస్స మాంసము దొప్పఁబెట్టి
చిఱుతయుఁగఠినంబు ఛిద్రంబుమొఱకు – కఱకును గారాకు గాకుండఁజూచి
యింపారి నునుపారి కంపు సొంపారి – పెంపారి చాల నొప్పెడు బిల్వపత్రి
నలి దీటుకొనఁగోసి తలసజ్జఁజేసి – యలరు జుంజుఱు వెండ్రుకలమీఁదఁదాల్చి
చక్కనమొగలేటి సదమలోదకము – లక్కజంబుగ రెండువుక్కిళ్లఁబట్టి
దావలికరమునఁ జాపంబు శరము – లేపార వలచేత నిట మాంసమున్న
దొప్పయుఁబట్టి కన్నప్పఁడేతెంచి – చెప్పుఁగాలనుదొంటి శివుమీఁది పూజ
పోనూకి తెచ్చిన పుక్కిటినీట – మానుగా శివునకు మజ్జనంబార్చి
పతికివెండ్రుకలపైఁబత్తిరి రాల్చి– మఱి దొప్పఁ దెచ్చిన మాంసమర్పించి
యనయంబు నిట్లు గన్నప్పదేవుండు – ననురాగమునఁ గొల్వ, మునుగొల్చుతపసి
యేతెంచి యప్పరమేశ్వరు మ్రోల – నీ తెఱంగంతయు నేర్పడఁజూచి
యెక్కడి మ్లేచ్ఛుఁడో యెన్నఁటఁగోలె – నిక్కడ నన్యాయ్య మిట్లుసేసెడిని
నేమిసేయుదు నంచు నేవగింపుచును – నా మాంస ఖండంబు లటు[4]వాఱనూకి
యపవిత్రమయ్యె శివా[5]గారమనుచుఁ – దపసి పంచామృత స్నపనంబుసేసి
పాదోదకములు దత్ప్రాంతంబునందు – వేదోక్తముగఁ జల్లివెండి పూజించి
వేగుండి యాతని[6]విధమెల్ల నరసి – వేగినఁ దపసి యుద్వృత్తిమై వచ్చి
“అక్కటా! యెంగిలి యదియు మాంసంబు – పుక్కిటినీరును బూజ్యమే పూజ;

1.నర్పించు 2. సాధించి 3. చూచి మంచి 4. వోవ 5.వాస 6. వృత్తాంత మరసి.

చెప్పఁగాలను నూకు శివభక్తిగలదె? – యెప్పాట వినఁబడు[1]నే?[2]యెట్లుసైఁప
వసుధ మృగాదుండు వాఁడు; నేఁ దపసి – నసమానవిగ్రహంబన నెట్లువచ్చు?
[3]నిచ్చటఁ దొల్లియు నేనుంగుతోడఁ – జెచ్చెరఁబోరదే చెలఁది యెట్లనిన
హరుఁడెండఁగాలెడి ననుచు నచ్చెలఁది – పరువడిఁదన నూలు దెరచీరభాతిఁ
దిరిగివచ్చిన వృక్ష తృణగుల్మలతలఁ – బురికొల్పి మీఁదఁగపోతముల్ దీర్చి
కరువుఁ బ్రతిష్టించి గంటయు వేది – విరచించి శిఖరంబుఁగరమొప్ప నిలిపి
ద్వారబంధంబులు దగిన వాకిళ్లు – నారంగ గర్భగృహాదులు దీర్చి
యకలంక కరవీరముకుళప్రభాతి – ప్రకటించి దేహళీబంధంబునందు
రమణీయ శతసహస్రదళాబ్జపంక్తు – లమరు పూజాప్రబంధానేకరచన
గావించి చెలఁది త్రికాలంబు భక్తి – భావనమై శివుఁబాయక కొలువ
హరుమీఁదఁ జెలఁది మున్నల్లిన నూలు – గరి యంత నేతెంచి కాంచి కోపించి
“పాయకశివుమీఁదఁ[4] బాదొట్రువెట్టి – పోయెదునిది[5] యేమివురు [6]వోకో”యనుచు
ఘనకర్ణ చలిత సంగత మారుతమునఁ – బొనరిన[7]పా దొట్రుఁబోవంగఁ [8]ద్రోచి
వెండి [9]తాఁదెచ్చిన తుండాంతరమున – నిండారుమొగలేటి నిర్మలాంబువుల
[10]నంబికాధవునకు నభిషేకమార్చి – [11]యింబులఁ గుంభస్థలంబుపైఁబెట్టి
తెచ్చినకలువల నచ్చఁ దామరల – నిచ్చలుఁ [12]బూన్చుచు నిటలలోచనునిఁ
గరియును[13]నిట్లు త్రికాలంబుగొలువ – నరుదెంచి చెలఁది దా నాగ్రహంబంది
“కమనీయలీల నా కట్టినగుడియు – నమరుమదీయ[14] నిత్యార్చనావలియు
నెట్టికర్మియొ చెర్చి యేఁగెడు నింక – నిట్టి శివద్రోహ మెట్టుసైరింతు”
ననుచు నొక్కెడఁబొంచికొనియుండ గజము – సనుదెంచికోపించు చందంబుసూచి
యంతరాంతర మించుకైనఁ దలంప – కంతఁ బరిచ్ఛేది యై యుపాయమున
దుండాగ్రమునఁ జొచ్చి తొలుచుచుఁ జెలఁది” – దండిమదేభంబు తలకెక్కి చంపెఁ
గాన యిక్కడ నమార్గము సేయుధీర – మానసుఁడెంతవాఁడైనఁగానిమ్ము
అట్లు నేఁడును వాఁడు నరుదెంచెనేని – యెట్లైన జంపక యేఁ బోవననుచు”
వెనుకదిక్కునఁ బొంచికొని సమీపమునఁ – దన పొడసూపక తపసి యున్నెడను

1. నెట్లుసయంప 2.యేను;యిట్లు 3.నిచ్చటనే తొల్లియేనుంగు 4.పాదుట్రు, పాదుట్ర, 5.యేటి 6. నకో 7. బాదుట్రు 8. నూకి 9. మున్ 10. నమ్మహాదేవునక 11.యిమ్ముల 12.బూజించి 13.నట్లత్రి 14. దివ్యార్చ



గన్నప్ప దేవుని ఘనముగ్ధతయును – సన్నుతభక్తియు[1]సంస్పృహత్వంబుఁ
దపసికిఁ జూపఁగఁ దలఁచి [2]శంకరుఁడు – విపరీతగతిఁద్రినేత్రపరీతమైన
వదనంబు ధరియించి వలపలికంట – నుదకంబు గాఱంగ నున్నయత్తఱిని
అరుదొందఁ దొల్లిటియట్ల కన్నప్పఁ – డరుదెంచి యరుదెంచి హరుకంటినీరు
పొడఁగని బిట్టుల్కిపడి భయభ్రాంతిఁ – దొడరుచు నరుదారఁదొల్లింటిపూజ
గ్రక్కునఁదన చెప్పఁగాలఁ బోనూకి – పుక్కిటి నీరు[3]ను బుగులున నుమిసి
తలవంచి పత్తిరి [4]డులిచి మాంసంబుఁ – దలరుచు [5]నర్పించు తదవసరమున
నా నేత్రజల పరిహారార్థముగను – దా నీశ్వరునకు నంతర్ధారయెత్తు
భంగి జలంబులుఁ బత్తిరిబ్రుంగి – మంగళంబై యొప్పె మఱియుట్లఁగాక
తలఁగంగ నతనిపాదహతిఁ దొలంకి –[6]యలరి పాదోదకంబై వెల్లివిరియఁ
బొలుపుగఁ గన్నప్పపుక్కిటనీరు – గలయఁ ప్రసాదోదకం[7]బయి తనర
నాలింగమూర్తి యపాంగోదకముల – పోలలింగోదకపూరమై తనరఁ
ద్రివిధోదకంబులుఁ ద్రినయనుమేనఁ – బ్రవిమలంబై యిట్లు భ్రాజిల్లె నంతఁ
దవిలి ప్రసాదికిఁ ద్రివిధోదకములు – ప్రవిమలమతిఁ [8]బొందఁబాడియ[9]నంగ
సర్వాంగములుగూడ జలములు వర్వ – సర్వేశుభక్తుఁ డాశ్చర్యంబు నొంది
యగ్గలంబయ్యె నపాంగాశ్రు లనుచు – బెగ్గిలి నేత్రమ్ము దగ్గఱి చూచి
“కటకటా! యిదియేమి గర్జంవువుట్టె – నిటలాక్ష! నీకంట నీరుగాఱెడిని
నీ నింద విని గౌరి నీఱైననాఁడు – దానించు కేనియుఁదడి [10]గంటలేదు;
జనకుచేఁ దనయునిఁ దునిమించునపుడు – కనికరంబునఁగంటఁ గ్రమ్మదు నీరు
చీర సించుచువిప్రు [11]లార(ఱ?)డివైచి – కారించుతఱి నుదకము లేదు గంట
నాఱాల వాట్లు ఱివ్వనఁ దాఁకునొవ్విఁ – గాఱవకు నాఁడును గంటఁ బాష్పములు
పరసతికై పట్టువడ్డ భంగమునఁ – దొరుగవు నాఁడును దోయముల్ గంట
వెట్టికేఁగెడు [12]తట్టఁబట్టి యెత్తుడును – నట్టిచో వెడల వపాంగోదకములు
నేఁడు నీకడకంట నిర్నిమిత్తంబ – పోఁడిగా జలములు పూరించుటేమి?
ఆలుబిడ్డలఁబాసి యడవుల గిరుల – పాలైతినని [13]దుఃఖపడి యేడిచెదవా?
ఏకాకినైతి నింకేక్రియఁ బ్రోతు – లోకంబులని ధృతిలేక యేడ్చెదవా?

1. సత్ప్రియత్వంబు 2. లింగంబు 3. పై 4. డులిపి 5.నర్పింపఁదద 6. యలరఁ బా 7.బులై 8.బొందుపాడి 9.నాఁగ 10.లేదుకంట 11.ఇక్కడ రేఫప్రాస సాంకర్యము 12. కట్టె 13. చింతపడి.

కడపుగాలంగ నాఁకటికోర్వలేక – తడవయ్యె రాడఁని తలఁచి యేడ్చదవొ?
అక్కడ దండిమృగాలిచే నాదు – చిక్కుట నూహించి నిక్కమేడ్చెదవొ?
పనిపాటుసేయనోపక యొంటివిడిచి – చనియెనో తమ పల్లెకనుచు నేడ్చెదవొ?
అటిముటినొక పువ్వుమటిమూరుకొన్న – నెఱయఁబ్రాణమునకు వెఱచియేడ్చెదవొ?
కారణం బేమి? గన్గంటఁ బుట్టెండు – నీరు గాఱఁగ నేడ్వ నీకేమి వలసె?
చెప్పవేనా"కని చేర్చు గౌఁగిటను – నప్పళింపుచును 'నాయట్టి పుత్త్రుండు
గలుగ నీ కేల యప్పుల బ్రుంగ'ననిన – పొలుపునఁగంటి యప్పులు వాఱఁదుడిచి
"పాసియుఁ బాయదు వ్యాసంగ"మనుచు – నీసరి లింగముల్ నిను నరరయ్య!
[1]ఊరకోనాయన్న![2]యూరకో తండ్రి! – [3]యూరకో నా స్వామి![4]యూరకింతేల?
యుమ్మలికము తగ దుడుగవే" యనుచు – ఊమ్మున నేత్త్రోదకమ్ములట్లొత్తు
'నెసఁగ నా ముగ్ధత కీకంటిలోని –[5]కసువ పొ'మ్మన్నట్లు గన్నుశోధించుఁ
గరతలాంగుళములఁ గనుఱెప్పలెత్తి – 'నెర సున్న'దని పాఱ[6]నిష్ఠించి యూఁదుఁ
బరగునాలుక గ్రుడ్డుపైఁ ద్రిప్పిత్రిప్పి – యొరయుచు నొరయుచు నొయ్యనఁజూచుఁ
జీరావిఁగొని కంటఁజేర్చి హత్తించి – చీరెల్లఁదడిసినఁజిక్కువెండియును
నీ కడకంట వ్రేలిడి యొత్తనొత్త – నా కడకంట ధారావలి వర్వె
నా కడకంట వ్రేలదుమ నట్లదుమ – నీ కడకంట నీరెంతయుఁ దొరిగెఁ
గొలుకులు రెండు నంగుళములనదుమఁ – గలయఁగఁగన్నెల్ల గొలుకులై కాఱె
నక్కన్నుఁగొలుకులు నరచేతమూయఁ – బక్కిళ్ళఁ బింజించి పాఱంగఁ దొడఁగె
నెట్టును నేత్త్రాశ్రులెడతెగకున్న – నెట్టణ దుఃఖించి బిట్టువాచఱచు
నడుగులఁబడి మ్రొక్కు నంజలియొగ్గు – నడలు నిల్చును నిల్వఁబడు లేచుఁజూచుఁ
'కటకటా!' యనుచు లింగముఁ జుట్టిచుట్టి – యటయిట యేఁగుచు నాత్మలోపలను
"నానంద బాష్పమ్ము లంద మేనియును – నాననంబునఁ దోఁప దానందచిహ్న"
సారకటాక్ష వీక్షణ జాలమైనఁ – గారుణ్య జలములు గావ యుష్ణములు
ఘర్మజలంబులక్రమ మందమేని – ఘర్మ జలంబులు గన్నులఁగలవె?
ఒండు దుఃఖం బేని యూహించి చూడ – రెండుగన్నులఁ గాఱ కుండునే నీరు?
తానొక్క గంటనె ధార వర్వెడిని – కానోపు [7]నక్షిరోగంబ యేమేని
చెప్పఁ జిత్రము! గోడిఱెప్ప వెర్గినదొ? – తప్పవోనోపునో? తడికంటివిధమొ?

1. ఊరుకో, ఊరకు, 2. ఊరుకో, ఊరకు 3. ఊరుకో, ఊరకు 4. ఊరుకోయేల, 5. కసవ 6. నిట్రించి 7. గంట.



నొవ్వియో పొరగప్పెనో? మాదతెవులొ?– పువ్వువట్రిల్ల నాపువుకంటి [1]పోటొ?
మయిలవడ్డదియొ దుర్మాంసదోషంబొ? – అయిరయో వెండియు నక్షిరోగంబొ?
కానోపు ని ట్లనుమానంబు లేదు – దీనికి[2]మందుమాఁకే నే మెఱుంగ
నాయన్న! నా తండ్రి! నాయిష్ట సఖుఁడ! – నా యయ్య! నా జియ్య! నా ప్రాణనాథ!
సర్వాంగసుందర! శంకర! యీవి – గు (గూ?) ర్వణంబెటు దొరకొనెనయ్య!నీకు
ముక్కంటి వాఁడని మూఁడు లోకముల – నిక్కంబు వెఱతురు నిటలలోచనుఁడ!
యెన్నఁడు నీ కొక్క ఖిన్నంబు లేదు – గన్నుఁ జూచిన నిట్టు గైకొండ్రె సురలు
కంటి చిచ్చున మున్ను గాలిన వారు – కంటివార్తకు నికఁ [3]గనలరే మగుడ;
వినుమెంత గన్ను గానని వలపైన – వనితలిట్లంగ హీనుననకుఁ జిక్కుదురె?
రూపింప నిట్లు కురూపివై యున్న – నేపార భక్తు'లిహీ' యని నగరె
నేఁడెందుఁ [4]బోయెనో నేత్త్రంబు హరికి – నాఁడిచ్చి నట్టి యనశ్వరమహిమ
పొలమున నాఁ [5]బోతుఁ బులి గొన్నయట్టి – పొలుపయ్యె నేనెట్లు నిలువంగనేర్తు
నెవ్వరి కెఱిఁగింతు? నెట్లు ధరింతు – నెవ్విధిఁబోవుదు? నేమి సేయుదును?
[6]చెప్పంగలేదొండు సేయ లేదొండు – నిప్పాటఁ జూచుచు నేనుండఁ జాల
నాకంటఁ బుట్టిన నాఁటను గోలె – శ్రీకంఠ రోగంబు సెంద దెన్నఁడును
యొప్పని కన్నులో నున్నట్లుగాఁగఁ – గప్పెద నా లెస్సకంట నీ కన్ను
నా కన్న చూ మందు నీ కంటి కనుచుఁ – జేకొని శరమున ఛేదించి పుచ్చి
కఱకంఠు కంటిపైఁ గన్నప్ప దేవుఁ – డటిముటిఁ దననేత్ర మర్పింపఁదడవ
అక్కంటఁ దొరుగు ధారావళి యడఁగి – గ్రక్కున డాపలికంట నుప్పొంగఁ
గించి త్ప్రహాస సంకీలితా ననస – మంచితాంభోజాతుఁడై తన నేత్ర
కమలంబుశివునేత్ర కమలమైయునికి – కమితమహోత్సాహ మాత్మఁదుల్కాడఁ
గ్రేకంట లింగంబు డాకన్నుఁ జూచి – యీ కంటికిని మందు నీ కన్నె కాక
యనుమానమింకేల యనుచుఁ దన్నేత్ర – జనిత నిర్మలజలధారదొరుగ
గందువ దన చెప్పుఁ గాలి యుంగుటము – వొందించి డాకన్నువుచ్చఁ గైకొనునడు
నంతలోపలన ప్రత్యక్షమైయప్పు – డంతకసంహారుఁ డనురాగ మెసఁగఁ
గన్నప్పదేవర కరయుగగ్రహణ – సన్నుతహస్తుఁడై చక్కన నిలువఁ
గలిత సమావలోకనమాత్ర యంద – యలరెఁగన్నప్పని వలపలి కన్ను

1. పాదో 2. నౌషధంబేనేమెఱుంగ 3. గలఁగరే 4. నేఁడెందువో 5. 'పోఁతు' సానుస్వారముగాఁ గొన్ని ప్రతులలోఁ గానవచ్చును 6. చెప్పలే దొండునుజేయ.

నాతనిచేఁ గొన్న యాకన్ను నిచ్చె – నో తన కన్నిచ్చెనో శివుఁడనఁగ
నంతకమున్ను వామాంబకజనిత – సంతతఘన బాష్పజలధారలుడిగి
కన్నప్ప దేవుని కన్నులు శివుని – కన్నులు[1] వోల నొక్కండైన యట్లు
కన్నప్ప దేవుని [2]నన్నుల నపుడు – సన్నుతానంద బాష్పంబులుదొరిగె
హరుకంటఁ దొల్లి త్రిపుర వీక్షణమునఁ – దొరిగిన జలములు [3]దోడయ్యె ననఁగఁ
గరుణానిరీక్షణ [4]స్ఫురితాంబుధార – విరచింప నానందకరమగు టరుదె?
అంతటనిఖిలసురాసుర ప్రముఖు – లంతంత మ్రొక్కుచు నభయంబు వేఁడ
మస్తక విన్యస్తహస్తులై మునులు – ప్రస్తుతం బెఱుఁగుచుఁ బ్రస్తుతుల్ సేయ
శివదుందుభులు మ్రోయభువిఁబుష్పవృష్టి – [5]ప్రవిమలంబైకుర్యఁ బ్రమథులుప్పొంగ
గన్నప్ప శుద్ధ ముగ్ధతయు మహోగు – ణోన్నతియును భక్తియోగ సంపదయు
నాపరాపరుడు ప్రత్యక్షమైయునికిఁ – గోపించి మును బొంచికొనియున్న తపసి
కనుఁగొనిసంభ్రమాక్రాంతాత్ముఁడగుచుఁ – జనుదెంచిభువిఁజక్కఁ జాఁగిలి మ్రొక్కి
“తలఁప నీ సహజ ముగ్ధత్వ మెఱుఁగమిఁ – దలఁచితి నీకహితంబుసేయంగఁ
దప్పుసైరింపు గన్నప్ప! దయాత్మ! – చెప్ప నున్నదె నీవ శివుఁడవుగాక
యిట్టి ముగ్ధత్వంబు నిట్టి వీరత్వ – మిట్టి మహత్త్వంబు నెందును గలదె?
విందుమే యవికల వేదశాస్త్రములఁ – గందుమే మూఁడులోకంబులఁ దొల్లి?
బాపురే! కన్నప్ప! పరమ లింగంబ! – బాపురే! కన్నప్ప! ప్రమథవిలాస
నల్లవో! కన్నప్ప! నా లింగముగ్ధ – నల్లవో! కన్నప్ప! నల్లనైనార!”
అనుచు నిట్లా తపోధనుఁడతిభక్తి – వినుతింప నుమబోటి విస్మయంబొందఁ
గన్నప్ప! శివుఁడు నాకాంక్షనొండొరులఁ – గన్నులఁజూచుచు నున్న యత్తఱిని
దవిలి యొండొంటితోఁ దగునన దొరసి – నివిడ యొండొంటితో నిద్దమై బెరసి
చూపులు సూపుల లోపలఁజొచ్చి – యేపార నేకమై యెంతయు నొప్పి
కన్నప్పదేవుని కన్నుల సఖులో! – అన్నీలకంధరు కన్నుల కవలో?
తవిలి కన్నప్ప కన్గవ దర్పణములో? – భవునయనంబుల ప్రతిబింబ యుగమొ?
నెమ్మిఁ గన్నప్ప నేత్రమ్ములపా[6]య – గొమ్ములో? శివునేత్రగుప్తాంకురములో?
రమణఁగన్నప్ప నేత్రముల బీజములో? అమృతాంశు శేఖరు నక్షిఫలములో?
అనఁగఁ గన్నప్ప దేవునిలోచనములు – మనసిజహరునిలోచనములై శివుని

1. కొలికి 2. కనుగవ 3. దొడరెననంగ 4. స్ఫురితసుధాబ్ధి 5. నవిరళంబై 6. యుగొమ్మ(మ్ము)లో.



కన్నులు గన్నప్ప కన్నులై యిట్లు – సన్నుతి గడచి సమున్నత స్ఫురణ
నాల్గుఁ గన్నప్ప నైనారినేత్రములో? – నాల్గు నీశ్వరునయనంబులో యనఁగ
మృదుని మూఁడవ కంటిక్రింద నిర్గడల – నడర రెండును రెండునై మించి వెలుఁగఁ
జూపును జూచు తద్రూపును(పము)దారు – నేపారఁ ద్రివిధంబు నేకమై యునికిఁ
దమ నేత్రములఁ దమ్ముదార వీక్షించు – క్రమమయ్యె శివునికిఁ గన్నప్పనికిని
నెఱి నాల్గు గన్నుల నిజదీప్తినంత – పఱగప్పి నట్లుండె ఫాలలోచనము
కాలునే యింక నీ కంటఁ జూచినను – నోలిఁబురత్రయంబొందు గల్గినను
గాలునే యింక నీ కంటజూచినను – నా లక్ష్మి నందనుండంగంబుగొన్నఁ?
గాలునే యింక నీ కంటఁ జూచినను – గాలుఁడు వెండియుఁ గ్రమము దప్పినను?
గాలునే యింక నీ కంటఁ జూచిను – నే లోకమును నంత్యకాలంబునాఁడు?
కన్నప్ప సదయాంబకము మున్నుశివుని – కున్న నట్లునుగాక యుగ్రాక్షుఁడండ్రె?
[1]నాఁడ యీ కన్నప్ప నయనముండినను – వేఁడునే సిరియాలు విందారగింప?
నాఁడ యీ కన్నప్ప నయనముండినను – బోఁడిగా సైఁచేనే భ్రూణహత్యకును
ఈ చారునేత్రాబ్జ మీశునకున్నఁ – జూచునే నిమ్మవ్వసుతుచావు నాఁడు?
పంబి యీయమృతాంబకం బున్నశివుడు – నంబి కన్నులుసెడ నాఁడేల చూచు?
ఈ నేత్రమున్న మున్నీశుండుబాలుఁ – బోనిచ్చునే పాముపుట్టఁ దొడ్కంగ?
ఇతని నేత్రంబున్న నిన్నియు నేల? – యతి దయాపరుఁ డన నుతికి నెక్కండె?
ఇతని నేత్రంబు మున్నీశుకున్న – నతిభూమి సౌందర్యుఁడన భువిఁ జనఁడె?
ఇట్టి నేత్రంబు మున్నెప్పుడు నున్న – నెట్టి కాంతల మెచ్చునే హరుఁ” డనఁగఁ
గన్నప్ప నేత్రంబుకతమున నీశుఁ – డెన్నంగ సర్వసంపన్నుఁడై నెగడె
కన్నప్ప పాదరక్షాస్పర్శ శివుఁడు – సన్నుతభక్తవత్సలుఁడనఁబరగె
ఈ చెప్పు నాఁడు దన్నింత సోఁకుడును – నా చంద్రుఁ డభినంద్యుఁ డయ్యె లోకముల
ఈ చెప్పు నాఁడు దన్నింతసోఁకుడును – నేచిన తీర్థమై యిల నొప్పె గంగ
ఈ చెప్పుదానయ్యెనేఁ బద్మభవుఁడు– చూచున కాదె యీశునిమస్తకంబు
శ్రీపతి గానని శ్రీమహాదేవు – శ్రీపాదభక్తుల శ్రీపాదరక్ష
పరమేష్ఠి గానని యురులింగమూర్తి – శిరమున నొప్పు విశిష్టభూషణము
చెప్పెడిదేమి? గన్నప్పపాదంబు – చెప్పు మహత్త్వంబు సెప్పఁ జిత్రంబు
ఇతని పాదోదకాయత సిద్ధిఁగాదె – సితకరమౌళి ప్రసిద్ధుఁడై పరగె

1. ఇది కొన్ని ప్రతులలో లేదు.

ఇతని నిర్మాల్యసంగతిఁజేసికాదె – రతిపతిహరుఁడు నిర్మలదేహుఁడయ్యె
ఇతనిగండూషాంబు కృతసేవఁగాదె – జితపురత్రయదైత్యుఁడతిలోకుఁడయ్యె
ఇతనిప్రసాదవిహితభుక్తిగాదె – క్షితిధరకన్యకాపతి నిత్యుఁడయ్యె
ఈ దేవుఁడితని ప్రసాదంబుఁగుడిచి – వేదశాస్త్రముల వివేకంబు గడఁచె
శివుఁడు గన్నప్పయుచ్ఛిష్టంబుఁగుడిచి – యవికలవిధి నిషేధాతీతుఁడయ్యె
లింగంబు గన్నప్ప యెంగిలిగాన – యంగమంతయు నుత్తమాంగమై యొప్పె
గణనాథుచేత లింగసమేతుఁడయ్యె – గణుతింప నంబిచే ఘనభక్తుఁడయ్యె
సన్నుతికెక్కి మా కన్నప్పచేత – సన్నుతసర్వప్రసాదాంగుఁడయ్యె
ననుచు భక్తానీక మసమానలీల – వినుతింప జగములు విస్మయంబంద
నన్నగజా[1]ధీశుఁ డంత నందంద – కన్నప్ప దేవునిఁగౌఁగిటఁజేర్చి
పరగుచతుర్వర్గ[2]ఫలము లాదిగను – వరమిత్తు నడుగుము వాంఛితార్థమ్ము”
లనవుడుమందస్మితాననుండగుచు – [3]ననురక్తిముకుళితహస్తుఁడై మ్రొక్కి
“యెఱుఁగమోక్షములపే రెఱుఁగవాంఛితము – లెఱుఁగ వేఁడెడుమార్గ మెఱుఁగ నేమియును
ఎఱుఁగుదు నెఱుఁగుదు నెఱుఁగుదు మఱియు – మఱియును మఱియు ముమ్మాటికినిన్ను
కావునఁ గోరిక కడమయుఁ[4] గలదె? – దేవ! మూలస్తంభ దివ్యలింగాంగ!
నీ యతులిత దయాన్వితదృష్టి – నా యందు నాఁటి కొనలు [5]వసరింప
నా దగు సంస్పృహపాదితదృష్టి యిట్లు – నీ దృష్టిలోనన నెక్కొని పొదలఁ
గరుణింపు దక్కిన వరము లేనొల్లఁ – బరమాత్మ!” యని విన్నపంబాచరింప
నభిమతార్థప్రదుఁడట్ల కన్నప్ప – కభిముఖుఁడై నిల్వనంత నిద్దఱును
వెలయఁ దా రన్యోన్యవీక్షణానంద – కలితాత్ములై తిరుకాళ[6] త్రిపురిని
గన్నప్పదేవుఁడు గౌరీశ్వరుండు – సన్నిరీక్షణలీల నున్న వారిపుడు
నిక్కంబు గన్నప్ప పుక్కిటినీరు – ముక్కంటి కభిషేకమున కెల్లప్రొద్దు
నేఁడును గన్నప్ప నిర్మాల్యమందుఁ – బోఁడిగా శివునకుఁ బూజసేయుదురు
మృడుఁడు గన్నప్ప కర్పించినఁగాని – యదరంగ నేఁడును నారగింపండు
కన్నర్పితము సేసెఁ గాన లోకములఁ – గన్నప్పఁ దనఁగ మహోన్నతి కెక్కె
నచ్చట నేఁడు గన్నప్పండు శివుఁడు – నచ్చెరువందంగ నట్లున్నవాఁడు
కావునఁ దొల్లి ముగ్ధస్వభావులకు – దేవుండు కృపసేయుఁదెల్ల మి”ట్లనుచు
బసవయ్య ముగ్ధగణసమూహి కథలు – పసరింప నా చెన్న బసవయ్య వినఁగఁ

1. ధిపు 2. పదము 3. ననురక్తి 4. లేదు 5. బ్రసరింప 6. హస్తిపురిఁ



బృథివి నీ ముగ్ధ(గ్ధ?)ల కథలు దాఁజెప్పఁ – గథలయ్యె' నని కథకథకు నవ్వుచును
నతులితానందసంగతి నున్న భక్త – వితతికి బసవఁడున్నతలీల మ్రొక్కి
“యిప్పురాతనులందు నెఱుఁగరే తొల్లి – యొప్పార నిత్యంబు నొక్క భక్తుండు

### కళియంబనాయనారు కథ

నలిరేఁగి కళియంబనయనా[1]రనంగ – నిల మిమ్ము నగియించు నిదియె[2]నేమముగ
మెచ్చించె [3]శివదేవు మీరొక్క మాటి – కిచ్చ నవ్వుట సాలదే నన్ను మనుప”
ననుచు నవ్వించుచు నవిరళభక్తి – జనితసుఖామృతవనధిఁ దేలుచును
బసవఁడు జంగమప్రకరంబునిట్టు – లసలార నోలగంబై యుండిరంత

### సకలేశ్వరు మాదిరాజయ్య కథ

“పెద్దలతేఁడు వెన్నుద్దుల మొదలు – బుద్దులప్రోక విబుధనిధానంబు
నమితవచోరాశి సుమనోనురాగుఁ – దమలినచిత్తుఁ డుద్యద్గుణాన్వితుఁడు
సకలవీణా ప్రవీణకళావిదుండు – నకలంకనాదవిద్యాపండితుండు
వేదవేదాంతసంపాదితతత్త్వ – వాది సంసారదుర్వ్యాప్తి సంహారి.
యమనియమాదివ్రతాచారవర్తి – శమదమసద్గుణాశ్రయచరిత్రుండు
ధీరమహోదారదిక్పూర్ణ కీర్తి – కారుణ్యమూర్తి నిర్గతసకలార్తి
మహితసజ్జనశిఖామణి నాఁగఁబరగు – మహి **సకలేశ్వరమాదిరాజయ్య**
గారి సద్భక్తి విఖ్యాపితమహిమ – ధారుణి నెట్లన్నఁ దా విస్మయంబు
నగణితకీర్తిమై నంబెయన్పురము – దగు రాజధానిగా ధరణి యేలుచును
శ్రుతి వీర్య వితరణ రూపవివేక – చతురతరూఢి రాజ్యంబు సేయుచును
జంగమలింగైక్యసద్భక్తియుక్తి – నంగీకరించుచు నర్చలిచ్చుచును
నొడఁబడ రాజవదుపచారములను – గడియగడియదప్పకెడ భజింపుచును
వివిధపుష్పదళ సద్భవనాంతరమున – శివదేవు సంస్తుతిసేయుచున్నంత
రమణ బత్తీసాదిరాగంబులకును – నమరనన్నియు దండియలు నియోగించి
యే రాగ[4]మున సకలేశునకర్థి – యా రాగ వీణ దా నలరి ధ్వనింప
రావణహస్తంబు బ్రహ్మవీణయునున – లావణ్యవీణ కైలాసవీణయును
నాకాశవీణ పినాకివీణయు వి – వేకింప సారంగవీణయుఁ గూర్మ
వీణయు స్వాయంభు వీణయు గౌరి – వీణయుఁగిన్నరవీణయు జనక

1. రునాఁగ 2. నీమముగ 3. శివునట్లు 4. మా.

యనునివి మొదలుగానందులో మున్ను– ధ్వనియించినట్టి యాదండియల్ దివిచి
తనరుచు మొగచాళమును నవతాణ – మును మఱి[1]సవతాణమును దీపు బెరయఁ
దాళపట్టియయుఁ గత్తరి చోళవణియు – లీల సారణయుఁ దలిర్ప సంప్రీతి
నివుడంగ "సకలేశ నిత్యకల్యాణ! – అవధారు ప్రాణనాయక! నాదమూర్తి!
యంచును [2]వాయించు నా రాగమంద – యంచితాళప్తికి నభిముఖుండగుచు
సదమలచిత్తుఁడై సప్తస్వరముల – నుదయించు శ్రుతులిరువది రెండుఁగూర్చి
ఘనతర నారాటకావుళం బనెడు – ధ్వనిగూడఁ [3]జౌదళంబను శారిరమున
[4]ననిబద్ధ రూఢిమై నాళతిఁ జేసి – తనరెడు గమకసప్తకము సంధిల్ల
మానితంబగు మంద్రమధ్యతారములు – దానొంద లయలంకితంబులు నిగుడ
లాలిత శుద్ధసాళగములు బెరయఁ – గ్రాలుచుఁ దేశిమార్గంబులు వెలయ
లలిద్రుతమధ్య విలంబితంబులను – నలిఁ దాళమాతమానంబులు సూపి
ధాతులసంగతుల్ జాతులరీతి – భాతిగఁ గూర్చి నిబద్ధరూపమున
లాలితంబుగను వైళంబుఁ దాళంబు – సాళి పెళ్ళాపెల్లి జాయనుజాయి
యుచితమెయ్యారంబునోగిఁబంజళంబు – ఖచరంబు విషమంబు గ్రహమోక్షణంబు
భజవణి [5]రవణియు భరణి[6]మిఠాయి – [7]నిజవణి నివళంబు నిచయవైధసము
నిగితి సుధాయి [8]సన్నిగీతంబు మిశ్ర – మగు గ్రహత్రితయంబు నంశుకలలిత
గాఢంబు లలి రాగ కాకును బొచ్చ – గాఢంబు మఱి దేశి కాకును సింధు
నలిఁగరుణాకాకు నఖకర్తరియును – హళువాయియును ధరహరసమవాయి
పరగ గుండాగుండి భ్రమరలీలయును – గురుడి మోడామోడి పొరిరవాళంబు
[9]తీఖ్ఖాయిహొయలును[10]రిఖ్ఖిలవిళగు – చొఖ్ఖాయియాదిగా సొగయు తాయములు
దళుకొత్త దేశాక్షి ధన్నాసి దేశి – మలహరి సకలరామక్రియ లలిత
సాళంగ నాట గుజ్జరి మేఘరంజి – వేళా [11]వుళియుఁ జిత్రవేళా[12]వుళియును
మాళవి సిరియు వరాళి కాంభోజి – గౌళపంచకము బంగాళంపు గురిజ
భైరవిద్వయమును బడపంజరంబు – నారంగ గుండక్రియయుఁ గౌశికయును
దేవక్రియయు మధ్యమావతి తోడి – యావసతంబును నాదిగాఁగలుగు
విరచిత స్త్రీ రాగపురుషరాగములు – సరసమై లక్ష్యలక్షణనిర్వికార
పూరితనాదగంభీరవినూత్న – సారోక్తిగీతంబు లారఁబాడుచును

1. సవరాణము 2. వాయించె 3. జోకళం 4. ననిబంధ 5. రవణియు 6. వితాయి 7. నిజవణావలివణి
8. సనగితంబు 9. తిక్కాయి 10. రిక్కిల 11.హురి 12. హురి.



దమతమ [1]కళిలవాద్యంబులు మ్రోయఁ – గ్రమమొందఁ గేళికగతి నటింపుచును
వారివారికి హర్షపూరముల్గ్రాఁగఁ – గోరి భక్తాలికింపార మ్రొక్కుచును
బాయక రేయును బవలు లింగార్చ – నాయతామృతవార్ధియందోలలాడ
నఖిల సామ్రాజ్య సమంచిత సరస – సుఖముల కెమ్మెయి సొగయకున్నెడను
**మల్లరసను** నొక్క మండలేశ్వరుఁడు – దొల్లి యిట్టుల రాజ్యమొల్లక విడిచి
శ్రీగిరి కేఁగి [2]సచ్చింతాసమాధి – నాగిరి బిల్వవనాభ్యంతరమున
నున్నవారని వారియురుభక్తిగుణమ – హోన్నతికయు ధ్యానయోగసంపదయు
శివభక్తిత్వానుభవసమగ్రతయు – శివభక్తగణములచే వినఁబడుదు
నప్పుడు శ్రీగిరికరుదెంచి రర్థిఁ – జొప్పారు **మల్లరసును** జూచువేడ్క
రయ మందఁగా మాదిరాజయ్యగారు – క్రియ దులుకాడ నగ్గిరి శృంగములను
స్ఫాటికపర్వతబహుశృంగములను – హాటకరత్నమయాంచితాద్రులను
బాతాళగుహల నభ్రంకషశిలల – భూతలప్రచ్ఛన్న పురవరంబులను
స్పర్శవేదుల మణిపర్వతంబులను – దర్శనముక్తిప్రదస్థానములను
ఖగమృగనాగసంకరనివాసముల – నగణితోద్యానవనాంతరంబులను
బర్వతచూడానిపతితధారాంబు – నిర్వికల్పప్రవాహోర్వీస్థలముల
నంతంత నిలిచి యేకాంతదేశముల – సంతతలింగపూజనలు సల్పుచును
జనుదెంచి చనుదెంచి యనుపమబిల్వ – వనసమీపంబున ఘనతరంబైన
రుద్రాక్షశైలముల్ రుద్రాక్షతరులు – రుద్రాక్షగనులును రుద్రాక్షనదులు
భసితంపు గిరులును భసితంపుఁ దరులు – భసితంపు గనులును భసితంపు నదులు
లింగపర్వతములు లింగవృక్షములు – లింగాకరంబులు లింగతీర్థములు
జంగమశైలముల్ జంగమతరులు – జంగమగుల్మముల్ జంగమలతలు
సల్లాపశైలముల్ సల్లాపతరులు – సల్లాపగుల్మముల్ సల్లాపలతలు
గాయకశైలముల్ గాయకతరులు – గాయకగుల్మముల్ గాయకలతలు
గాయకమృగములు గాయకాలులును – గాయకపక్షులు గాయకఫణులు
నాట్యపర్వతములు నాట్యవృక్షములు – నాట్యగుల్మంబులు నాట్యవల్లరులు
నాట్యమృగంబులు నాట్యపక్షులును – నాట్యోరగంబులు నాట్యవానరులు
దనరు కాష్ఠజ్యోతులును దృణజ్యోతు – లును వాలుకాజ్యోతులును జ్యోతినదులు
జలపర్వతంబులు జలవృక్షములును – జలవిహంగంబులు జలమృగావలులు

1. రఖిల 2. నిశ్చింతా

బహువర్ణవృక్షముల్ బహువర్ణశిలలు – బహువర్ణగుల్మముల్ బహువర్ణలతలు
బహురూపవృక్షముల్ బహురూపశిలలు – బహురూపగుల్మముల్ బహురూపలతలు
ఖేచరవృక్షముల్ ఖేచరగిరులు – ఖేచరగుల్మముల్ ఖేచరలతలు
హర్మ్యపర్వతములు హర్మ్యవృక్షములు – హర్మ్యగుల్మంబులు హర్మ్యవల్లరులు
మృగరూపవృక్షముల్ మృగరూపశిలలు – మృగరూపగుల్మముల్ మృగరూపలతలు
ఖగరూపవృక్షముల్ ఖగరూపశిలలు – ఖగరూపగుల్మముల్ ఖగరూపలతలు
నరరూపవృక్షముల్ నరరూపశిలలు – నరరూపగుల్మముల్ నరరూపలతలు
సురరూపవృక్షముల్ సురరూపశిలలు – సురరూపగుల్మముల్ సురరూపలతలు
సూతవృక్షములు ప్రసూతవృక్షములు – సూతశైలములు ప్రసూతశైలములు
గంధర్వవృక్షముల్ గంధర్వశిలలు – గంధర్వగుల్మముల్ గంధర్వలతలు
నీడలు దిరుగని నిత్యశైలములు – నీడలు దిరుగని నిత్యవృక్షములు
నీడలు లేని సాన్నిధ్యశైలములు – నీడలు లేని సాన్నిధ్యవృక్షములు
దూరంబునను నీడ దోఁచు శైలములు – దూరంబునను నీడ దోఁచు వృక్షములు
ప్రొద్దొక్కపాయయై పొలుచు శైలములు – ప్రొద్దొక్కపాయయై పొలుచు వృక్షములు
తరులును గిరులును దగిలి రమింపఁ – బరగనప్పుడె పుట్టు బాలశైలములు
తరులును గిరులును దగిలి రమింపఁ – బరగ నప్పుడె పుట్టు బాల వృక్షములు
శైలముల్గొలువంగ శైలములెక్కి – లీలనేఁగెడు రాజశైల సంఘంబు
వృక్షముల్గొలువంగ వృక్షములెక్కి – యీ క్షితిఁ జనురాజవృక్ష సంఘంబు
ఎక్కి వీక్షింప నీ రేడులోకములు – నక్కజంబుగఁగాంచునట్టి శైలములు
ఎక్కి వీక్షింప నీ రేడులోకములు – నక్కజంబుగఁగాంచునట్టి వృక్షములు
ఎక్కి [1]యూఁగించిన నెక్కడికైనఁ – జక్కనఁగొనిపోవఁజాలు శైలములు
ఎక్కి [2]యూఁగించిన నెక్కడికైనఁ – జక్కనఁగొనిపోవఁజాలు వృక్షములు
ఎక్కి తలంచిన నేరూపమైన – గ్రక్కున నప్పుడ కాఁజేయు గిరులు
ఎక్కి తలంచిన నేరూపమైన – గ్రక్కున నప్పుడ కాఁజేయు తరులు
సగము [3]వృక్షంబులు సగము శైలములు –సగము [4]మృగంబులు సగ మండజములు
పండువృక్షములట్ల ప్రబలుశైలములు – గొండలక్రియ గిరికొన్న వృక్షములు
ఒక్కొకగడియ కొక్కొకపండు రాలు – నక్కజంబగు గడియారవృక్షములు
ఒక్కొకగడియ కొక్కొకమాటు చెలఁగు – నక్కజంబగు గడియార శైలములు

1.యూఁకించిన 2. యూఁకించిన 3. మృగంబులు 4. వృక్షంబులు



మొదలికి నఱికిన నదికికొన్తరులు – మొదలికిఁ ద్రుంచిన నదికికొన్ లతలు
వైచినఁ గ్రమ్మఱవచ్చి యచ్చటన – పై చని నెలకొను పాషాణములును
రవితోన యుదయించి దివి దాఁకఁబెరిఁగి– రవితోన దిగ[1]జాఱి భువిఁగూడు గిరులు
నాలుగువాఁకిళ్లు నలిఁగానుపించు – నాలుగుచరుల యానడు మెక్కి చూడఁ
బురములు(ను) గాన్పించు భూరిమహత్త్వ – మరుదగు శ్రీగిరి గిరులన గిరులు
నాలుగువాఁకిళ్లు నలిఁ గానుపించు – నాలుగు [2]కొమ్ముల నడుమెక్కి చూడఁ
బురములు(ను) గాన్పించు భూరిమహత్త్వ – మరుదగు శ్రీగిరి తరులనఁ దరులు
సంగతంబుగ నెక్కుజనులఁబాతాళ – గంగ నాడించు గంగాశైలములును
సంగతంబుగ నెక్కుజనులఁబాతాళ – గంగ నాడించు గంగావృక్షములును
చని యెక్క నయ్యష్టషష్టితీర్థములు – సనక చూపెడు నష్టషష్టిశైలములు
చని యెక్క నయ్యష్టషష్టితీర్థములు – సనక చూపెడు నష్టషష్టివృక్షములు
పొరిఁబొరిఁ దమలోన నొరయంగ నగ్ని – దరికొని కాలంగఁ దనరు శైలములు
పొరిఁబొరిఁ దమలోన నొరయంగ నగ్ని – దరికొని కాలంగఁ దనరు వృక్షములు
క్షీరపర్వతములు క్షీరవృక్షములు – క్షీరతటాకముల్ క్షీరదీర్ఘికలు
దధిపర్వతంబులు దధివృక్షములును – దధితటాకంబులు దధిదీర్ఘికలును
ఘృతపర్వతంబులు ఘృతవృక్షములును – ఘృతతటాకంబులు ఘృతదీర్ఘికలును
నమృతపర్వతంబులు  నమృతవృక్షములు – నమృతతటాకంబు లమృతదీర్ఘికలు
రసపర్వతంబులు రసవృక్షములును – రసతటాకంబులు రసదీర్ఘికలును
కనకపర్వతములుఁగనకవృక్షములు  –  గనకతటాకముల్  గనకదీర్ఘికలుఁ
గనకమృగంబులుఁగనకోరగములుఁ – గనకభృంగంబులుఁ గనకపక్షులును
గనకంపుగుల్మముల్ గనకంపులతలుఁ – గనకంపురేణువుల్ గనకంపుటిసుముఁ
గనకంపుఁబురములుఁ గనకహర్మ్యములుఁ – గనకంపుఁగోటలుఁ గనకంపుగుళ్లు
మణిపర్వతంబులు మణివృక్షములును – మణిగుల్మవితతులు మణిలతావళులు
రత్నపర్వతములు రత్నవృక్షములు – రత్నగుల్మంబులు రత్నవల్లరులు
ఒకగొమ్మశోకంబు నొక గొమ్ముసురభి – యొకగొమ్ము న్యగ్రోధ మొకగొమ్ముసింత
యొకగొమ్ముగురవంక మొక గొమ్ముగ్రముక – మొకగొమ్ము ఘనసారమొక గొమ్ముసెఱకు
నొక గొమ్ముసందనం బొకగొమ్ముదిలక – మొకగొమ్ముసంపకం బొకగొమ్ముగ్రోవి
యొక గొమ్ముమందార మొక గొమ్ముపకుళ – మొకగొమ్ము మారేడు నొక గొమ్మువొన్న

1. బెర్గి 2. కొమ్మల

యొక వువ్వువిరవాదియొకవువ్వుమల్లె – యొక వువ్వు సేవంతి యొక వువ్వు గోఁగు
నొక వువ్వు గరవీర మొకవువ్వు గలువ – యొక వువ్వుదామర యొక వువ్వు మొల్ల
యొక వువ్వు గోరంట యొక వువ్వుజాజి – యొక వువ్వుసెంగల్వ యొక వువ్వుమొగలి
యొక వందు సహకార మొకవందునిమ్మ – యొకవందు[1]నారింజి యొక్కవందరఁటి
యొక వందు[2]నేరేడు నొక వందు[3]వెలఁగ – యొకవందు ఖర్జూర మొక్కవండీడ
యొక వందు దాడిమం బొకవందు[4]మోవి – యొకవందు గంగరే గొకవందు వనస
వ్యాపించి మొదలొక్కటై [5]యిట్లుగూడ – రూపితంబగు బహురూపవృక్షములు
ఒక దిక్కు మణిశ్వేత మొకదిక్కు వీత – మొక దిక్కు మాంజిష్ఠ మొక దిక్కురక్త
మొక్కదిక్కు గపోత మొకదిక్కు నీల – మొక్కటఁదోఁపంగఁ బెక్కువర్ణముల
వఱలియొప్పెడు బహువర్ణశైలములు – వఱలి యొప్పెడు బహువర్ణవృక్షములు
కొంత విద్రుమమును గొంత ద్రాక్షయును– గొంత దారదవల్లి గొంత దాంబూలి
యేపార మొదలొక్కటై [6]యిట్లుగూడ – రూపితంబగు బహురూపవల్లరులు
నడర నేతెంచి లింగాంగణంబులను – సుడిగొని కసువులు దుడుచుమారుతము
లిమ్ముల [7]లింగాలయమ్ములఁ గలయ – సమ్మార్జనము సేయు స్వల్పవర్షములు
చట్టన నేతెంచి సర్వలింగముల – చుట్టును మ్రుగ్గులు వెట్టుసస్యములు
ఎలమి లింగము లున్నయెడల కేతెంచి – జలకంబు లార్చుచుఁ జనుతీర్థములును
నందంబుగఁ [8]దిగిచి యా లింగములకుఁ – జందనంబులు వూయు చందనతరులు
భ్రాజింప ముప్రొద్దు వటులింగములనుఁ – [9]బూజింప నేతెంచు పుష్పవాటికలు
వేడుక [10]నెపుడువివిధ లింగములకుఁ – గూడి ధూపములిచ్చు గుగ్గులుతరులు
దనర లింగములకుఁ దగ [11]నివాళులిడి – చనుతృణజ్యోతికాష్ఠజ్యోతిచయము
నలర లింగములకు ననయంబు వచ్చి – ఫలములర్పణసేయు బహువిధతరులు
నమరలింగములకు ననయంబువీగి – యములునివేదించు[12]క్రముకాదితరులు
ధరణి వెండియుఁ దమతమపేళ్లమీఁదఁ – బరగ నీశ్వరనామ మరుదుగా నిలిపి
"వృక్షేశ శర" అని వృక్షాలయముల – వృక్షలింగముల నర్చించు వృక్షములు
"గిరినాథ! శర"అని గిరిగహ్వరముల – గిరిలింగములఁ గొల్చు గిరిసమూహంబు
"మృగనాథ! శర" అని మృగనివాసముల – మృగలింగములఁ గొల్చు మృగసమూహములు

1. నారంగ మొక్క, నారదంబొక్క 2. ఫలపూర మె. 3. ద్రాక్ష 4. మొరలి 5. యుండి కూడ 6. పసరించి 7. లింగాంగణమ్ముల 8. డిగిచి 9. బూజించి చనుదెంచు 10. తోడ 11. నివాళించి 12. క్రముకతరువులు.



"ఖగనాథ! శర" అని ఖగమండలముల – ఖగలింగములఁగొల్చు ఖగసమూహంబు
"నురగేశ శర"అని యురగాలయముల – నురగలింగములఁగొ?)ల్చురగసంఘములు
"భృంగేశ శర"అని భృంగాలయముల – భృంగలింగముల నర్చించు భృంగములు
"జలనాథ! శర"అని జలజాకరముల – జలలింగములఁగొల్చు జలజాకరములు
"తీర్థేశ శర"అని తీర్థాలయములఁ – దీర్థలింగముఁ బ్రార్థించుతీర్థములు
"మునినాథ! శర"అని మునిపల్లెలందు – మునిలింగములఁగొల్చు ముని సమూహంబు
"శబరేశ శర"అని శబరాలయముల – శబరలింగము గొల్చు శబరసంఘములు
నుపమకు మిగిలిన యురువీరఘోర – [1]తపములాపాదించు తాపసవరులు
నిట్టలంబుగమీఁద బుట్టలు వెరిగి – మెట్టల క్రియ నున్న మేటి సన్మునులు
విరచితంబై మీఁద వృక్షముల్ మొలవ – నురువృక్షములభాతి నున్న సన్మునులు
శిలలతోడఁగూడఁ గలయఁగఁ బెరిగి – శిలరూపములభాతి నలరు సన్మునులు
ముక్తకేశములొడల్ముంచిపైఁ బెరుగ – వ్యక్తనీలాద్రులట్లలరు సన్మునులు
మేదిని దలమోపి [2] మీఁదికి నూర్ధ్వ – పాదులై తపములాపాదించు మునులు
నేకపాదాంగుష్ఠమిలమీఁద మోపి – ప్రాకట[3]తపములాపాదించు మునులు
పంచాగ్నినడుమను బయల దీర్ఘికలు – మంచి పాఱఁగఁ దపములుసేయు మునులు
జలపత్రవాలుకానిలకందమూల – ఫలశిలాహారులై పరగుసన్మునులు
వృక్షముల్వెట్టంగ భిక్షముల్గుడిచి – యక్షయకాయులై యలరుసన్మునులు
పర్వతంబులు వెట్ట భైక్షముల్గుడిచి – నిర్వికల్పస్థితి నిల్చు సన్మునులు
నొనర జలక్రీడయును వనక్రీడఁ – దనరుచుఁ దనియు గంధర్వదంపతులు
నమితస్వయంభు లింగార్చనాసక్తి – నమరంగ నేతెంచ నమరవర్గములు
జలకన్యకలు నొప్పు బిలకన్యకలును – జలపురుషులు నొప్పు బిలపురుషులును
గరినివహంబులుఁబురుషమృగములు – శరభశార్దూలాదివరమృగావలులు
గండమృగములు భేరుండ తండములుఁ – జండోరగములు శిఖండి యూథంబు
దొడరి యన్యోన్యశత్రుత్వంబులుడిగి – యడరుచుఁ దమలోన నాడుచు నెపుడుఁ
దనరి యొప్పెడు బిల్వవనమహత్త్వంబు – గని వినుతింపుచు వనమధ్యమందు
వినయస్థుఁడై తన్ను వెదకుచువచ్చు – "ననఘుని మాదిరాజయ్య మనంబుఁ
జూచెదఁగాక" యంచును మల్లికార్జు – నాచార్యుఁ దపరిమితాంగంబుఁ దాల్చి
తెరువున కడ్డమై దివియును భువియుఁ – బరిపూర్ణముగఁ జాఁగఁబడియున్నఁజూచి

1. తపములఁ జరియించు 2. మెయికొని యూర్ధ్వ 3. వ్రతము.

పరమయోగీంద్రుఁడో? భసితంపుగిరియో? – ధరఁబడ్డ రుద్రాక్షధరణీరుహంబొ?
సదమలజ్యోతియో శంభురూపంబొ? – విదిత చిదబ్ధి సముదితపూరంబొ?
యెచ్చోటఁ బోవరాదెట్లొకో" యనుచు – నచ్చెరువంది మాదాఖ్యుఁ"డీ క్రమము
నరయుదు"నని యుత్తమాంగంబు దిక్కు – పరిగొని మూఁడేఁడులరసి కానకయుఁ
బదపద్మములమీఁదఁ బడ కిటువచ్చు – టిది దప్పు దానంచుఁ బదపడి మగిడి
యచ్చోటనుండి యయ్యడుగులదిక్కు – గ్రచ్చర వర్షాష్టకమునకు వచ్చి
యంత భయభ్రాంతుఁడై "నీదురూప – మంతసూపక యేలయా! యిటు లేఁప
నే నెంతవాఁడ నిన్నెఱిఁగెద ననఁగ – నానందమూర్తి! నీ యడుగులు సూపి
రక్షింపవే" యని ప్రస్తుతింపుచును – బక్షద్వయము సాఁగఁబడియున్నఁ జూచి
యయ్యవసరమున నమ్మల్లికార్జు – నయ్యగా రంతఁ బ్రహసితాస్యుఁ డగుచుఁ
దన తొంటిభావంబుఁదాల్చి " నీ మనసుఁ – గనుఁగొననిట్లైతి" ననుచు మాదాఖ్యు
"లెమ్మ"ని చెయి సాఁచి లేవంగనెత్తి – క్రమ్మఱ నందంద కౌఁగిటఁ జేర్చి
"యిట్టి సాహసి వౌదువేమమ్ముఁ జూడ – నెట్టయా వచ్చితి విచ్చటి" కనుచుఁ
దన నివాసస్థానమునకుఁ దోడ్కొనుచుఁ – జని యంతలింగావసరము సేయించి
తన ప్రసాదము వెట్టి యనుపమతత్త్వ – జనితానుభవసుధావనధిఁ దేల్చుచును
గొంత ప్రొద్దటయుంచుకొని యుండి"యింకఁ – గొంతగాలము గ్రియాభ్రాంతిమైధరణి
నుండఁగఁదగు" నని యురుతరకీర్తి – మండితసద్గురు మల్లికార్జునుఁడు
నానతియిచ్చుడు నమ్మాదిరాజు – "తా నెట్లు వోవుదు నానందమూర్తి
తగు నిఖిపేద నిధానంబుఁ గాంచి – దిగవిడ్చి యేఁగునే [1]మగిడి కూలికిని?
కంటి మీ శ్రీపాదకమలంబులేను – మంటి నింకేటికి మగుడుదు ననిన
మెల్లన నవ్వుచు [2]మేలు గా కనుచు – మల్లికార్జునుఁడు సముల్లాసకీర్తి
నిత్యస్వరూపవినిశ్చితం బైన – ప్రత్యయంబుల నొడఁబఱపఁగఁ దలఁచి
"యట్టేని ర"మ్మని యట నొ(యొ?)క్కదుమ్మ – చెట్టు గావించి నిశ్చింత సమాధి
నిట(యుం?) నుండు మీవని యట యేఁగి తాను – గుటిల వేషంబున గొల్లని భాతి
బఱపువేళ్లును మొద్దుఁబాదముల్ గుజ్జు – చిఱుదొడలును దొప్పచెవులును బరడు
ప్రక్కలు బీఱనరములును జిదక – ముక్కును ముడిబొమల్ మొగిదోని కడుపుఁ
బొక్కిళ్లువోయిన చెక్కిళ్లు వలుద – బొక్కిఱొమ్మును బెద్దనిక్కిన మెడయుఁ
బల్లమీసములు నేర్పడు కాయకన్నుఁ – బిల్లి గడ్డంబును నల్లని మేనుఁ

1. మగుడి, మగుడఁ 2. మేలకాక.



బ్రాఁకువట్టినపండ్లు బ్రద్దచేతులును – వీఁక కాళ్లను నడ్డివీపును దనర
ములుగత్తియుచ్చుఁ గోకలుఁజూఁడుఁగొడుపు – మొలతిత్తి నిడిదొడ్డ మొలకచ్చుగట్టి
గాలిదప్ప(బ్బ)ఱ వెండ్రుకల్ దూలియాడ – నీలవెట్టుచు నుతి [1]మెట్టిఁ జూచుచును
గుక్కలఁ బిలుచుచు ఱిక్క వెట్టుచును – నెక్కొన నొరగాల నిలుచుచుఁ జనుచు
గొడ్డలి [2]బరిగమ్మి గూటికుండయును – దుడ్డుఁగోలయుఁ బట్టి తొడిఁదొడిఁగొన్ని
మేఁకపిల్లలఁ దన చాఁకిట నిఱికి – వీఁక దబ్బఱవాట్ల విసరిద్రేయుచును
గొన్ని మేఁకలరొప్పికొని వచ్చి తుమ్మ – నున్న కాయలు రాల్చియును నంతఁబోక
యిమ్ములఁ దన మీఁది[3]కొమ్మెక్కుగొల్లఁ – గ్రమ్మఱ నఱకంగఁ గలుషించిచూచి
"నా మీఁదికొమ్మేల నఱకె[4]దు రోరి – గామిడిగొల్ల! యీ కాననంబునను
మాకు నీడై యున్న యీ కొమ్మెకాని – చేకొని నఱకంగఁ [5]జెట్లులు లేవె?
శంకమాలితి క్రొవ్వి చక్క మైమఱచి – యింక నా చేత నీ వెట్లు సాఁగెదవు
పాపవుగొల్ల నిఙ బఱతుఁగా క"నుచుఁ – గోపించి తిట్టుడు గొల్లందు నవ్వి
"బాపురే నిర్వాణి! బాపురే తపసి! – బాపురే బాపురే కోపపుంజంజ!
పాపంబుఁ బొందెదుకోపించువాఁడు – పాపిగా కేనేల పాపి నయ్యెదను
స్థలియించు కోపాగ్ని కణములఁజేసి – కలఁగదే మానసఘనసరోవరము
ఎసఁగెడు కోపాగ్ని నింకదే చెపుమ – మసలక హృదయాబ్జమకరందధార
[6]వెలువడు కోపాగ్ని వేఁడిమిఁజేసి – నలఁగదే సచ్చిదానందపద్మంబు
జ్ఞానంబు సొంపొ! విచారంబు పెంపొ? – ధ్యానంబుఫలమొ యీ తామసగుణము?
నా కేమి సెప్పెద, వీకాననమున – లేకున్నవే చెట్లు నీకుఁగూర్చుండ
నిట్టిశాంతాత్మకు లెచ్చోటఁగలరు! – పుట్టుదురే నినుఁబోల సంయములు!
వఱదవోవునెలుఁగు గొఱపడంబనుచు – నెఱుఁగక యీఁత కాఁడేఁగి పట్టుడును
వడిఁ బాఱునెలుఁగంత వానినపట్టఁ – గడనున్నవాఁ'డోరి! విడువిడు' మనుడు
'విడిచితి నది దన్ను విడువ' దన్నట్టి – వడువున విడిచిన విడుచునే [7]మాయ
పొంగి చిచ్చుఱుకంగఁ బోవుచుఁ జీర – కొంగోసరించు పెన్వెంగలియట్ల
[8]చెల్లుఁ బొమ్మని సన్న్యసింపఁబోవుచును – నిల్లప్పగించు నయ్యిబ్బందియట్ల
పదిపడి నూతిలోఁబడఁబోయి తాప – వెదకుచు మెట్టెడి [9]వీఱిఁడియట్ల
జ్ఞానాత్ముఁడై సర్వసంగముల్ విడిచి – తా నాశ్రమముఁ గోరు తపసిచందమున

1. మిఱిమిచూచు 2. యునుగమ్మ 3. కొమ్మయొక్కతఁడు 4. దవోరి 5. జెట్లు లేవెట్టు? 6. వెలిఁగెడు 7. యాస 8. చెల్లెఁ బొమ్మని 9. వీఱఁడి.

నిల మరు ల్వోయె రోఁకలి గొనిరండు – తలఁజుట్టుకొనియెదఁ దా నన్నయట్లు
పొనలేల చెఱకుపందెమందొక్క – యీనె సిక్కిన నోడుటేకాదె తలఁప
రోసి సంసారంబుఁ బాసి యెక్కింత – యాసించె నేనియు నది వెల్తిగాదె?"
అని తన్ను ముదలించుచును నెట్టయెదురఁ – దనతొంటి భావంబుఁదాల్చినఁ జూచి
కనుమూసి తలవంచి [1]కలయ లజ్జించి – ఘనతరశోకాశ్రుకలితాస్యుఁడగుచు
"నెక్కడిభక్తి? నా కెక్కడిముక్తి? – ఎక్కడఁ జూచినఁ దక్కునే మాయ
గతి మతిచైతన్య కర్మక్రియాదు – లతిశయంబై కల్గునంతకుఁ దనదు
క్రియ యెట్టులట్లు వర్తింపక శివుని – దయ వడయంగ నిశ్చయమెట్లు వచ్చు
కసుఁగాయఁద్రెంచినఁగా యగుఁగాక – పసనిపండగునయ్య భ్రాంతిఁబొందినను
శాశ్వతకీర్తి నిశ్చల భక్తియుక్తి – యీశ్వరుకృప లేక యేల సిద్ధించు?
కటకటా! నాయట్టి కర్మికినిట్టి – పటు నిస్పృహత్వంబు ప్రాప్తవ్య మగునె?"
యనుచున్న మాదిరాజయ్య గారలను – గనుఁగొని మల్లయ్య గౌఁగిటఁ జేర్చి
"కర్మవిదూర! దుఃఖంబింత వలదు – కర్ములకేల మాకడరు రావచ్చు?
నీవు మర్త్యమునకుఁ బోవుటకొఱకు – నీ వికల్పములెల్ల నేమెచేసితిమి
ఏమిగారణ మనియెదవేని వినుమ – యా మహాదేవుని యానతిఁజేసి
వసుధకు సద్భక్తివర్ధనార్థముగ – బసవండు నా నొక్క భక్తుండు వచ్చి
యున్నవాఁ డాతని యుదితగోష్ఠీ స – మున్నతసుఖవార్ధి నోలలాడుచును
బరమశివాచారసరణి వర్తిల్లఁ – జరియింపవలయు నద్ధరణిలో నీవు
ఎనయంగ నార్నూఱునేఁబదియేండ్లు – సనియె నీ విట వచ్చి సంయమితిలక!
ఎన్న నింకేఁబదియేండ్ల కిక్కడికి – నిన్ను రప్పించికొనెద నిక్కువంబు
యిటుగూడ నేడునూతేండ్లకుఁగాని – యిట యున్కిగానేర దిప్డు డీప్సితము
నేమేనియును వేఁడు మిచ్చెద" ననుడు – నా మల్లికార్జునయ్యకుఁ గేలుమొగిచి
"శ్రీయందమే పరస్త్రీ నిక్కువంబు – నాయువందమె మాయ కది జన్మభూమి
స్వర్గ మందమె యధ్రువం; బింకమోక్ష – వర్గ మందమె మున్న భర్గునిపదము
ఏమియు నొల్ల నీ వెఱుఁగవే దేవ! – స్వామి! సర్వజ్ఞాన!సకలేశ" యనుచు
నంతంత సాష్టాంగుఁడై మ్రొక్కి నిలుచు – నంత వారి కృపఁగళ్యాణంబునందు

1. కమియ.



బసవనియెదుటఁ బెంపెసఁగంగ నిలిచె – నసముందు మాదిరాజయ్య తత్క్షణమ
ఇట బసవఁడు సంగమేశ్వరు [1]నందు – నటమున్న పొడగాంచి సాష్టాంగ మెఱగి
మ్రొక్కునమ్మాత్రన ముందటనున్న – నక్కజుండగుచు నందంద మ్రొక్కుడును
వత్సలత్వంబు నివ్వటిలంగ నతులి – తోత్సవలీలమై నుల్లసిల్లుచును
నంచితలింగసుఖాపారసార – సంచితామృతవార్ధి ముంచి యెత్తుచును
బసవనిచేఁబూజ వడయుచునుండె – నసలార మాదిరాజయ్యగారిట్టు
లీ జగత్త్రయి సకలేశ్వర మాది – రాజయ్యగారి నిర్మల చరిత్రంబు
విస్తరించినఁ బ్రీతి విన్న వ్రాసినను – బ్రస్తుతభక్తి శుభంబులు సెందు
ధీమణి! సుజనచింతామణి! బుధశి – ఖామణి! ధర్మరక్షామణి! శుద్ధ
శరణజనానందకరణ! సత్పథవి – హరణ! సంతతదయాభకరణచేతస్క
లలిత నిర్మలయశః కలితదిగంత! – ఫలిత సద్భక్తి సమ్మిళితాంతరంగ!
రహితషడ్భావ! [2]విరచితసద్భావ! – మహిత తత్త్వార్థ సన్నిహితావధాన
విదిత ప్రసాద సంవిత్సౌఖ్యభోగ – ముదితాత్మ సంగత సుఖసుధాశరధినిమగ్న
ఇదియ సంఖ్యాత మాహేశ్వరదివ్య – పదపద్మ సౌరభభ్రమరాయమాణ
జంగమలింగ ప్రసాదోపభోగ – సంగత సుఖసుధాశరధినిమగ్న
సుకృతాత్మ పాలుకురికి సోమనాథ – సుకవిప్రణీతమై శోభిల్లి తనరి
చరలింగ ఘనకరస్థలి విశ్వనాథ – వరకృపాంచితకవిత్వస్ఫూర్తిఁబేర్చి
చను బసవపురాణమను కథయందు – ననుపమంబుగఁదృతీయాశ్వాసమయ్యె.

* * *

1. నంద యట 2. విరహితదుర్భావ.

# చతుర్థాశ్వాసము

శ్రీగురులింగ! సుస్థిరదయాపాంగ– యోగాత్మ! భక్తిమహోత్తుంగ! సంగ!

## మడివాలు మాచయ్య కథ

మఱియును మడివాలు మాచయ్యనాఁగ – నఱలేని వీరవ్రతాచారయుతుఁడు
శ్రేష్ఠుఁడు జంగమ[1]ప్రష్ఠుఁడు న్యాయ – నిష్ఠురాలాప మహిష్ఠమండనుఁడు
నిష్ఠితేంద్రియగుణాన్వితుఁడు లింగైక్య – నిష్ఠాపరుఁడు సుప్రతిష్ఠితకీర్తి
భవిజన సంసర్గపథపరిత్యాగి – ప్రవిమలతత్త్వానుభవసుఖాంబోధి
పరగు భాషా[2]వ్రతపాలనశాలి – [3]దరితషడ్వర్గుఁ డాస్థానంబుజ్యోతి
రజకజాత్యావృతప్రత్యక్షరుద్రుఁ – డజరామరుండయోనిజుఁడవ్యయుండు
శరణపదాంభోజషట్పదుండనఁగ – బరగి హిప్పరిగె యన్పురవరంబునను
నుండంగ బసవనియురుభక్తివార్ధి – నిండారి [4]దెసలను నిట్టవొడుచుడుఁ
బొంగి లింగానందపూరితుండగుచు – జంగమదర్శనాసక్తి నేతెంచి
బసవనిచేఁ బ్రణిపత్తి గైకొనుచు – నసమజంగమకోటి కర్చులిచ్చుచును
బంటింపక [5]వరువుఁ బనులు సేయుచును – గంటి నా చేతులకసివోవ ననుచు
బాస వట్రిల్ల సద్భక్తసంఘంబు – మాసిన వస్త్రముల్ మఱి మోసికొనుచు
వేవుజామున నేఁగి వేఱొక్క రేవు – గావించి యుదుకుచు [6]ఘట్టనల్ సేసి
శస్త్రసమేతుఁడై సద్భక్తవితతి – వస్త్రముల్ రజతపర్వతభాతిఁదాల్చి
పరిగొనివచ్చుచోఁ బురవీథి "భవులు – శరణులవస్త్రముల్ సంధిల్లిరేని
నోడఁజాఁబొడుతుఁజుండొ" యనిఘంట – నాడాడ వ్రేయుచుఁగూడఁ జాటుచును
మఠమున కేతెంచి [7]మణుఁగులన్నియును – గఠినము ల్గాకుండ [8]ఘట్టించి మడువ
నట్టిచో జంగమంబరుదెంచి యడుగ – నెట్టికట్టంబైన [9]నిచ్చి మ్రొక్కుచును
నా వస్త్రముల వారలడుగవచ్చినను – లేవనకందిచ్చు లింగసంపదను
అంత నద్భుతచిత్తుఁడై **బసవండు** – సంతతంబును విని సంస్తుతుల్ సేయ

1. నిష్ఠుండు 2. ప్రతి 3. దురితషడ్వర్గ సంహరపరాపరుఁడుఁ 4. దెసలకు 5. వరవు, పెక్కు ప్రతులలో 'వరువు' కలదు. 6. గడియలు 7. మడుపు 8. గట్టించి 9. నిచ్చుచుమ్రొక్కి.



"నలిభక్తతతివలువలుదుకుచాకి – విలసితభక్తియు నిలఁజెప్పఁబడియె
నదిగాక యేకాకియన్మడివాలు – సదమలభక్తి భాషయు నొప్పెఁ గాని
యిట్టి సద్భక్తియు నిట్టి మహత్త్వ – మిట్టి [1]సామర్థ్యంబు నెఱుఁగ మే"మనుచు
సల్లీల ననిశంబు సంస్తుతు ల్సేయఁ – దెల్లగానటు గొన్ని దినములు సనఁగ
బఱతెంచుచో [2]ముట్టుపాటైన నొకని – నఱిముఱిఁ జంపి మాచయ్య యున్నెడను

## మాచయ్య తెరువరిని జంపెనని పౌరులు బల్లహునకుఁ జెప్పుట

వీరువారన కెల్లవారునుగూడి – ధారుణీశ్వరు సభాస్థలికేఁగి మ్రొక్కి
"బల్లహ! వినుము నీ పట్టణంబునను – బ్రల్లదుండొక చాకి బత్తుండననుచు
మొలఁగఠారముగట్టి తొలఁగండు త్రోవ – తొలఁగించు నే బల్లిదులఁబిఱుసనఁడు
చాటుఁ "జీరలమూట సంధిల్లిరేని – పోటు ముందఱ" [3]ననిపోటులమాట
నంగళ్ల నిలిపె బేహారముల్మాన్చె – సంగడి నిటయట సరియింపరాదు
పురవీథి నెవ్వరేఁ బోయినఁ జూచి – పరిగొన [4] కనుకనిఁబాఱంగఁ దోలు
[5]నెదురను బసి గుల్ల మేనుంగు బండి – యదియేమి సోద్దెమో కదియంగ వెఱచు
నల్లంతఁబొడగని [6]చల్లన నవసి – కల్ల వెల్లైపాఱుఁగథలేల? నేఁడు
వింత వాఁడొకఁడు మున్వినమిఁగాఁజేసి – సంతకుఁ బోవుచో సంధిల్లినంతఁ
బొడిచి మీఁదికిఁజిమ్మెఁబొందియు నచటఁ – బొడలేదు మ్రింగెనో పోయెనో దివికి
నటగార్యమెఱుఁగమే [7]మవనీశ! వినుము – ఇట వచ్చితిమి నీకు నెఱిఁగింప"ననిన
బసవనిదెసఁ జూచి పార్థివేశ్వరుఁడు – కసిమసంగుచు మహోగ్ర[8]త నిట్టులనియె
"ఇది యేమివిపరీతమింక నెవ్వరికి – బ్రదుకంగవచ్చు నీ భక్తులచేతఁ
గోకలుదుకు చాకి గ్రొవ్వి యిప్పురము – [9]లోకంబునెల్ల గల్లోలమార్చెడిని
జాకికి [10]నింతేల శ్రద్ధలు జనులఁ – జేకొన కడిచెడుఁ జేరంగనీక
యిట్టిచోద్యంబు లేమెఱుఁగ [11]మేనాఁట – ముట్టినఁ జీరలు ముఱుగునే చెపుమ
పురజనులకు మున్నె చరియింపరాదు – పరదేశికింక రాఁబాసె మా పురికి
నెంతబల్లిదుఁడొ నేఁడ్వింతవాఁడొకఁడు – సంత కేఁగఁగఁజంపె శవమును లేదు

1. చోద్యముగాన మెన్నఁడు ననుచు 2. ముట్టి 3. యను 4. కినుకమైఁ 5. నెదుటను 6. యార్చినఁ జూచి 7. మవనీశ్వరుండ! 8. మున నిట్లనియె 9. లోకుల 10. నింతేసి శ్ర(న)ద్దలే, జనులఁ 11. మెన్నఁడును.

ఆకసంబునకేఁగు నట్టలుఁగలవె? – చాకి రక్కసిక్రియ జనుల మ్రింగెడిని
తిట్టఁడు వలుకఁడు ముట్టినమాత్ర – నిట్టు సంపఁగఁ గూడునే పెఱవాండ్రఁ
బాడిఁదలంపక బత్తుండననుచుఁ – బాడుగాఁ జంపు నీ పౌరులనెల్ల”
ననుచుఁబురోహితు లనుమతంబునను – దన యామికులఁజూచి ధారుణీశ్వరుఁడు
“చాకి నచ్చోటన చంపుండు వొండు – కాక మ్రింగిన వానిఁ [1]గ్రక్కిన రండు”
అనవుడు బసవఁడిట్లనియె నాతనికి – “విను మీఁదెఱుంగక వెడలనాడెదవు

**బసవఁడు బల్లహునకు మడివాలు మాచయ్యమహిమఁ జెప్పుట**

లేకులు [2]లోకుల కాకఱపులకుఁ – “జాకిచా”కని యేల సందడించెదవు
చాకియే యతఁడు సాక్షాల్లింగమూర్తి – కాక యేటికిఁ గనుకనిఁబలికెదవు
కులజుండ నతఁడె యకులజుండ నతఁడె – కులములేకయు నన్నికులములు నతఁడె
ఆ నీలగళు నపరావతారంబు – గాన యాతఁడు సర్వగతుఁడెట్టులనిన
సరసిజభవుజడల్ జన్నిదంబులుగఁ – బరగ భిక్షించిన బ్రాహ్మణుఁడతఁడ
మహితాపవర్గ సామ్రాజ్యపట్టంబు – వడి భవాంబుధిఁద్రిప్పు వైశ్యుండు నతఁడే
యిల సత్క్రియారంభఫలములు గోసి – సొలవక నూర్చెడు శూద్రుండు నతఁడ
యాదిశక్తియ మున్నుపాదానముగను – [3]నాదబిందులు గారణంబుగఁ దగిలి
వేడుక బ్రహ్మాండ వివిధ భాండములఁ – గూడ వానెడు[4]నాది కుమ్మరి యతఁడ
హరియెమ్ము దండంబునహిపతి ద్రాడు – నరసింహుపెనుపగు నఖరంబు గ్రొంకి
[5]యవని మోచినవరాహం బెఱగాఁగ – నవనిఁ గూర్మంబును నల్లమత్స్యంబు
గాలమి ట్లేకోదకంబునఁదిగిచి – లీలనటించు నా జాలరి యతఁడ
చటుల సంసృతి జీవఘటచక్రకర్మ – పటుపరివర్తన భ్రమణంబుఁ గూర్చి
కీలు వొందించి యా క్రియ [6]రాటనముల – వాలి యాడించు నా వడ్రంగి యతఁడ
మును జీవమను లోహమునకు జ్ఞానాగ్ని – నొనరఁగఁ బదనిచ్చు కనుమరి యతఁడ
ఇచ్చుచో నెఱిఁగి కల్లచ్చుల నూకి – యచ్చుల నొరగొను నగసాలి యతఁడ
హరిణమై రమియించు నజునిశిరంబు – శరమునఁద్రెంచిన శబరుండు నతఁడ
హరిముఖ్యకృమికీటకాదిపశువుల – వెరవునఁ బాలించు వ్రేతఁడు నతఁడ

1. గ్రక్కినే 2. లేకుల 3. నాదు బిందువుఁగా 4. నాఁటి 5. ననలికూ 6. వరాటనము.



[1]ప్రకటితకపట నాటక సూత్రములను – వికృతి ప్రకృతులార్చు వెండీఁడు నతఁడ
కులనగంబులు నూకి జలధులు సల్లి – పొలము[2]వోడేర్చు నా బోయయు నతఁడ
ఏకార్ణవంబైనయెడ నజాచ్యుతులఁ – జేకొన కుదికెడు చాకియు నతఁడ
మహితభక్తాళికి మడుఁగులు సేఁత – మహినిష్ఠ మడివాలు మాచయ్య యనఁగ
నిన్నియుఁ దానయై యిట్లున్నయతని – కెన్నెద వొకగులంబిది నీకుఁదగునె?
కారణపురుషావతారుఁ డాయయ్య – చారుచరిత్ర విస్మయమెట్టులనిన
నరసింహశార్దూలకరిదైత్యచర్మ – పరిధానుభక్తులపరిధాన వితతి
గాని యొండుదుకఁడు, వానిని నంటఁ – గానీఁడు నితరుల ఘట్టించునెడను
భక్తుల చీరల భక్తులకిచ్చు – యుక్త సద్భక్తినియుక్తి వట్రిల్ల
జంగమంబడిగిన సమకట్టనిచ్చు – భంగిగా లింగసంపద దులుకాడఁ
జీరలువైచినవా[3]రడిగినను – వారికిఁ దమతమ వస్త్రంబులిచ్చు
నటమీఁద నతని మహత్త్వంబు వినఁగఁ – గుటిలాత్ములకు సమకూడదు మఱియు
జీర లంటినమాత్రఁ గారించుభక్తుఁ – దూరకుండునె చంప కీరు వోయినను
వల దభిమానంబు వొలివుచ్చుకొనకు – మిల నొరులేల నీ వెత్తిపోయినను
జుట్టవ్రేలను జక్కఁ జూపఁగఁగలవె? – అట్టేల? వల” దన్నఁ గట్టుగ్రుఁ డగుచుఁ
“గారణంబులుఁ గథల్ గల్పింప కిచట – నూరక చూచుచు నుండు మీ” వనుచు
బసవని వారించి పాపాత్ముఁ డంత – వెస యామికులఁ జూచి “వేఱుపాయమునఁ

**బిజ్జలుఁడు మాచయ్యను జంప నేనుఁగుఁబంపుట**

దొలఁగకాతఁడు వచ్చుత్రోవను మీరు – [4]తలఁగ కాతనిఁ దలతలమని నిలిచి
సమదాంధగంధగజంబుఁ బైకొలపి – సమయింపుఁ” డనవుడు జనులుత్సహింప
మావంతు లేఁగి సామజముఁ బైకొలిపి – యా వీరవరురాక కరికట్టి [5]నిలువ
నల్లంతఁ బొడగని యార్చి బొబ్బిడుచుఁ – “**గల్లినాథుని భద్రగజ** మొక్కనరుని

**మడివాలు మాచయ్య యేనుఁగును జంపుట**

యేనికదున్నకు నేల పంకించు – మానవుల్పానక మగుడఁడో” యనుచు
గంటయుఁ గొడుపును గదియింపఁ దడవ – పంటించె నేనుఁగుఁ బలమెల్ల నవిసె

1. ఈ ద్విపద కొన్ని మాతృకలయందు మాత్రముగలదు. 2. బోడేర్చు 3. వారడ్గఁదడవ 4. తొలఁగకాతనిఁ దొలతొల 5. యెదుర... యార్చినఁజూచి–క

నంతటఁబోక మావంతులు నూక – నంతంత డగ్గఱ నంతకుమున్న
వెన్నున నెలకొనియున్న వస్త్రములు – నన్నభోమార్గంబు[1]నందిఱియించి
చేతిగంటయు నంద చేర్చి మైవెంచి – చేతులు [2]సమరుచు నేతెంచి [3]చూచి
దండియై మావం[4]తుతండంబుఁ జంపి – తుండంబుఁ జేపట్టి త్రోచి రాఁదిగిచి
యంజలిగుంజలి [5]యల్లార్చి పేర్చి – భంజింపుచును వీరభద్రుండు దివిరి
వడి నృసింహునివైచు వడుపున వైచుఁ – బడనీక లోచేతఁ బెడచేత వేయు
నచ్చుగా నార్చుచు హరుఁడిభదైత్యు – వ్రచ్చినగతి వ్రచ్చివందఱలాడుఁ
గోపించి విష్ణునికోలెమ్ము రుద్రుఁ – డేపునఁ [6]దునిమినట్టిల నెమ్ములేఱు
మాలకు మాంసంబు మఱి గొడారికిని – దోలు[7]ను గాకుండఁదొలఁగంగ వైచి
త్రోవ నేతెంచుచోఁ దొలఁగనిబాస – గావున నతులవీరావతారుండు
నిమ్మార్గమున భక్తులెల్ల నుప్పొంగ – నమ్మదకరి పొడవడఁచి[8] యక్షణమ
"ఎవ్వండు నా మీఁద నేనుంగుఁ గొలిపె – నవ్వసుధేశుక్రొవ్వడఁతుఁ బొ"మ్మనిన
నింతవృత్తాంతంబు నెఱిఁగి బిజ్జలుఁడు – నంతక [9]మున్ను మోమల్లన వంచి
బసవని దెసఁ జూడఁ బరమహర్షమున – వసుధేశునకు బసవనమంత్రి యనియె

### బసవఁడు బిజ్జలునకు శివభక్తులమహిమఁ జెప్పుట

"వలదని వారింప వారింప వినక – చలమునఁ బంచితి జనులమాటలను
నేనుంగుఁ గోల్పడె మానంబు వొలిసెఁ – దూనిక చెడె శివద్రోహంబుఁ దగిలె

### ఇరువదాండారి కథ

ధరణీశ! విను తొల్లి ద్రావిళభూమిఁ – గరయూరిచోడభూవరుని రాజ్యమున
మున్నరవాద్దడిమువ్వరిలోన – నెన్నంగ నొక భక్తుఁ**డిరువత్తుఁ** డనఁగ
నపగతసర్వసంగపరీత చరితుఁ – డపరిమిత ప్రతాపానూనకీర్తి
సాహసాంకుఁడు శివద్రోహరగండఁ – డాహవవీరభద్రావతారుండు
సకలలోకప్రపంచకళావిరక్తుఁ – డకుటిలచిత్తుఁ డత్యద్భుతకీర్తి
సకలశాస్త్రాభ్యాసశౌర్యాన్వితుండుఁ – బ్రకటశివాచారపరుఁ డనఁబరగి
యౌవనప్రారంభమందు సద్భక్తి – భావనుఁడై భయభ్రాంతుల మీఱి
విస్మయలీల శ్రౌతస్మార్తవిహిత – భస్మరుద్రాక్షవిస్ఫారాంగుఁడగుచు
వరభక్తసందోహచరణారవింద – పరిచరణ క్రియాపరవశుఁడగుచు

1. నందు సంధించి 2. దిమరుచు 3. యెదిరి 4. త 5. యార్చిమైవెంచి 6. విఱిచినట్లె మ్ములువిఱుచు 7. నన్నట్లుగాఁ 8. యేతెంచి 9. మున్నఱువత్తాడి.



శివభక్తులకు నెగ్గుసేయు పాతకుల – నవిచారమునఁ జంపునట్టినేమంబు
ప్రాణస్థలంబుగాఁ బ్రమథోక్త శివపు– రాణార్థపదవిశారదుఁడన నొప్పి
యుండంగఁ జోడమహోర్వీతలేశు – శుండాల మతిరౌద్రపిండితంబగుచుఁ
గలితమదో[1]ద్రేకజలధారలొలుక – వలవేగమున ననివారితవృత్తి
విడివడి యప్పురవీథి నేతెంచు – నెడ నొక్కభక్తుండు గడజాము లేచి
వేవునో ప్రొద్దని వేవేగ మంచి – పూవుఁదోఁటలు సొచ్చి భావించి చూచి
పరగిన[2]పెనుగాలి బలువునఁ జేసి – చిరిఁగిన ఱేకుల ఛిద్రపుష్పములు
క్రిగ్గాలి దూలఁదాఁకినఁ బొంగి తుదలు – బుగ్గరించినయట్టి మొగ్గ పుష్పములు
సుడిగాలిఁగడివోయి తొడిమలు వదలి – పడియున్న యాస్వయంపతితపుష్పములు
[3]మఱుఁగులఁ గొమ్ములమాటులఁ దుదల – [4]నొఱపున నున్నపర్యుషితపుష్పములు
బహుకీటకోత్కరనిహతిచేఁ దావి – రహితమైయున్న యుపహతపుష్పములు
కావని వర్జించి కమనీయమైన – తావి వొంపిరిగొని తనరుపుష్పములు
సజ్జ నిండఁగఁ గోసి సంభ్రమంబడర – సజ్జన భక్తుఁ డాసామజంబెదుర
హరపూజనోత్సవపరవశుండగుచు – నరుదెంచుచోట నక్కరి గూడముట్టి
తుండాగ్రమునఁబట్టి [5]తూకించివైచి – రెండు గొమ్ముల నొక్కె రుండంబుగాఁడఁ
బ్రాణవియోగతాపమున భక్తుండు – "ప్రాణేశ! శివశివ! పరమాత్మ!" యనిన
యెలుఁగు [6]వినేతెంచి **యిఱువదాండారి** – మలహరభక్తునిపలుకుగా నెఱిఁగి
బిట్టుల్కిపడి మదిఁ [7]గట్టుగ్రుఁ డగుచు – "నిట్టియార్తారవం [8]బేమొకో!" యనుచు
బఱతెంచి భక్తునిపాటు భద్రేభ – మఱిముఱితనము నల్లంతటఁ గాంచి
నిశితకుఠారసన్నిహితుఁడై పొంగి – 'పశువ! త్రుంచెద [9]నిన్నుఁబఱవకు' మనుచు
మార్కొన నతనికి మలయుచు గజము – మార్కొని యెదిరె నున్మదము వట్రిల్ల
నేనిక రక్కసుఁడీశ్వరుమీఁదఁ – గానక పఱతెంచు గతియును బోలె
దీకొనఁ[10]గని, మదోద్రేకవిజృంభి – తాకారుఁడై పేర్చి యార్చి మైవెంచి
సంహారరుద్రుని చాడ్పునఁ గోప – రంహస్స్ఫురణమయి సింహనాదంబు
పూరించి చూపఱ దూరించిపాఱ – వారించి మదకరిఁ గారింతు ననుచుఁ
బఱతెంచి తొండంబుఁ బట్టి రాఁదివిచి – [11]మఱి నేల [12]కొఱగిన మా వంతుఁబట్టి

1. ద్రిక్క 2. ఱేకులుబలుగాలి నెడలి –చిరిఁగియున్నట్టియా 3. మదుగుల 4. నొదవుల 5. తూలించి 6. కేతెంచిన 7. గట్టుగ్రమగుచు 8. బిదియేమి 9. దున్న 10. గరి 11. పిఱిఁదికి నూఁకి పైకెఱఁగి మా వంతు 12. కొఱిగిన, కొఱుగనమ్మా.

మడియించి యెడగాలఁబుడమికినూ(?)కి – మెడఁద్రొక్కి పెడబొబ్బలిడుచు ఘీఁకునఁగ
హస్తికుంభస్థలన్యస్తస్వకీయ – హస్తకుఠారుఁడై యట వ్రయ్యఁదివియ
శుంభద్గజేంద్రంబు కుంభినిఁ ద్రెళ్లె – దంభోళిచేఁ బర్వతము ద్రెళ్లినట్టు;
లిట చోళభూవిభుఁడింతయు నెఱిఁగి – యట వచ్చి యిఱువత్తు నడుగులకెరఁగి
నిటలాగ్రహస్తుఁడై నిలిచి భావించి – "కటకటా! భక్తునిఁ గారించె గజము
హరుభక్తులకు మున్నజాచ్యుతాదులును – సరియుఁ గారన్న నిక్కరిచావు సరియె?
ఏనుంగు వశువదియేమి దా నెఱుఁగు – నేనుంగు నేలిన యే ద్రోహిఁ గాక
చచ్చెద నా చావుసరి యన్న నోరు– వుచ్చు నట్లైనను జచ్చి శుద్ధుండ"
ననుచు నప్పుడ **యిర్వదాండారి**మ్రోల – జనపతి దన శిరంబునకుఁ దా నలుగ
నట్టిచో శివుడు ప్రత్యక్షమై చోళ – [1]పట్టవర్ధను భయభక్తియుక్తికిని
**ఇఱువదాండారి** మహిష్ఠభక్తికిని – గఱకంఠుఁడజుఁడు శంకరుఁడక్షయుండు
మెచ్చి భక్తునిప్రాణమిచ్చి మావంతుఁ – జెచ్చెర నపుడ సంజీవితుఁ జేసె
నంతఁబ్రాణము మత్తదంతికి నొసఁగె – యెంతయు మహిమ న**య్యిఱువదాండారి**
నా చోడవల్లభు నతిదయాదృష్టిఁ – జూచి కైలాసవాసులఁజేసె శివుఁడు
మదియించి భక్తుని మడియించి నేనుఁ – గదియు నప్పుడ చచ్చె నా చోడనృపతి
ప్రేమం బెలర్పఁగ "భృత్యాపరాధ(?) – స్వామినోదండ" యన్నదువు నిష్ఠించి
తన కరిద్రోహంబు దన ద్రోహముగను – దన కల్గెనన్న నీ తప్పునకింక
గుఱి యెట్టు బిజ్జలక్షోణీశ ! నీవ – పఱపంగఁ దలఁచితి భయమాత్మ లేక.

## బావూరి బ్రహ్మయ్యగారి కథ

మఱియు **బావూరి బ్రహ్మయ**నాఁగ నొక్క – గఱకంఠు భక్తుఁడఖండితకీర్తి
వీరమాహేశ్వరాచారవ్రతస్థుఁ – డారూఢగాఢ మహత్త్వకాంతుండు
[2]మంగళభక్తిక్రియాంగభాషాంగ – సంగతచరితుఁడభంగప్రతాపి
స్థైర్యసంపన్నుండు శౌర్యపండితుఁడు – ధైర్యప్రపూర్ణుండవార్యవీర్యుండు
సత్యవచోరాశి శరణాగ్రగణ్యుఁ – డత్యుత్తమోత్తముఁడనఁగ నిబ్భువిని
బరగ జంగమలింగపాదారవింద – పరిచరణ క్రియాపరతంత్రలీల
నలయక పువ్వుఁదోఁటలు వెక్కు గూర్చి – తొలుకోడి గూయంగ బలువిడి నేఁగి
పూవులు గొనివచ్చి పుష్పమాలికలు – భావించి సంధించి భక్తుల[3]కిచ్చి

1. పట్టభద్రుని 2. జంగమ 3. కిచ్చు, నట్టి.



యట్టి కాయకలబ్ధియందు నిత్యంబు – చట్టన జంగమార్చనలు సల్పుచును
వర్తిల్ల మఱియొక్క వాదంబునందుఁ – గర్త గౌరీశుండ కాఁబ్రతిష్ఠించి
కలునందిఁబుల్లును బులగంబు మేపి; – యిలయెల్ల నెఱుఁగ జొన్నలు లింగముగను
జేసి యో! యనిపించి భాసురభక్తి – వాసనమై నుండ వడినొక్క నాఁడు
ధరణీశుఁ డొక్కఁడు దంత్రంబుఁ దాను – బరమండలంబులపైఁ బోయి పోయి
బాపూరి చేరువఁ బ్రాగ్దిశయందుఁ – బూవుఁదోఁటలచెంత భూపతి విడిసి
యున్నెడ నతనిమహోద్దండగజము – తన్నుఁ దా మఱచి మదగ్రస్త మగుచుఁ
గడిఁదిమావంతునిఁ బడ ఝూళిసేసి – విడివడె దండెల్ల విరియఁద్రోలుచును
నీడకు నులుకుచు నింగిఁవ్రేయుచును – జూడ మల్లార్చుచు జనులఁ జంపుచును
ననివారితోద్వృత్తిఁ జనుదెంచుగజముఁ – గనియు **బావూరిబ్రహ్మన** లెక్కగొనక
వచ్చుచో మదకరి వడిగొని యెదుర – నుచ్చాటనము సేసి హో[1]యన్నునుదుర
బిట్టుల్కి సంధులు వ్రిదిలి ఘీఁకునుచు – [2]నెట్టోడి తుండంబు నిటలంబుఁ గూర్చి
వెనువెనుకకు భీతిఁ జని నదీతీర – మునఁ బడి చనలేక మూర్ఛిల్లి యపుడు
జీవంబు విడుచుడు మావంతు లేఁగి – యా విభునకు నిట్టు లనిరి బెగ్గిలుచు
"విడివడి మదకరి వడిగొని పఱచు – నెడ నొక్కభక్తయ్య యీ పల్లెనుండి
చని పుష్పములు గోసికొని వచ్చునెడను – గని మహోద్రిక్తమై కదియముట్టుడును
గాదన కేతించి కరతలంబార్చి – "చా! దున్న! నిలు" మని జంకింపఁ దడవ
వెనువెనుకకు భీతిఁ జని నదీతీర – మున విడ్చె జీవంబు" నన విని విభుండు
"[3]నాయయ్య నాగజం[4]బట్లెంత యేచె – నో" యని [5]వగచుచు నొయ్యన వచ్చి
యమ్మహాత్ముని చరణమ్ముల కెరఁగి – "యిమ్మదకరి నీకు నెదురించుతప్పు
సైరింపు" మని చక్కఁ జాఁగి మ్రొక్కుడును – గారుణ్యరసవార్ధికడలున ముంచి
[6]యమ్మహీజనులెల్ల నాశ్చర్యమంద – **బమ్మయ్య** మదకరిప్రాణ మట్లిచ్చెఁ
బరగ **బ్రహ్మయ**గారిశరణు సొచ్చుదును – జరితార్థుఁ డయ్యె భూవరుఁడు వెండియును
సజ్జనభక్తులచరితంబు లిట్లు – బిజ్జలక్షోణీశ పెక్కు వర్ణింప
[7]వెరవతి మార్కొన్నఁ బొరిగొంద్రు వెఱచి – శరణన్నఁ బ్రోతురు హరభక్తవరులు
గాన యిన్నియుఁ జెప్పఁగాఁ బనిలేదు – భూనాథ! మనవలతేని, [8]లే పొదము
కలియుగరుద్రుఁడుగాక మాచయ్య – తలఁపఁగ మర్త్యుఁడే ధరణీశ యిదియ
[9]కర్ణంబు" నావుడు **బిజ్జలుఁ** దంత – లజ్జయు సిగ్గును బుజ్జగింపగ

1. యనియదువ 2. నెట్టాడి, నెట్టాడిసి(?) 3. నీ 4. బిట్లింత 5. వెఱచుచు 6. యమ్మహా 7. వెరవిఁడి 8. పోవుదము 9. కజ్జంబు.

### బసవన్న బిజ్జలుని మాచయ్యకడకుఁ బిలుచుకొనిపోవుట

'నవుఁగాక' యని వచ్చి యఖిలంబు నెఱుఁగ – భువి సమస్తాంగము ల్వొంద నల్లంతఁ
బడియున్న **బండారి బసవయ్య** వచ్చి – **మడివాలు మాచయ్య** యడుగుల కెఱఁగె
నసమానలీలఁ బెంపెసఁగఁగీర్తించి – బసవఁడిట్లని విన్నపముసేయఁ దొడఁగె
"వలదని వారింపఁ జలమున ముక్కు – వొలియించుకొన్నట్టు వురులు వోనాడి
యిక్కడ రానోడి యెప్పటఁగోలె – నక్కడ సాష్టాంగుఁడై యున్నవాఁడు
పక్షికిఁదొడనేల పాశుపతంబు? – ఈ క్షితీశ్వరుఁడన నెంతటివాఁడు?
ఎదురు నీ కెవ్వఁ డీ రేడు లోకముల – సదయాత్మ ! యీ తప్పు సైరింపవలయు"

### మాచయ్య బిజ్జలుని యేనుఁగును బ్రదికించుట

నని విన్నవించిన నట్ల కాకనుచు – జననాథు లెమ్మనఁ బనిచి తత్క్షణమ
యట్టయుఁ బొట్టయు నస్థులుఁ గూడఁ – బెట్టించి జనులు విభీతులై చూడ
భసితంబు దునియలపైఁ జల్లి యతని – యసమగజేంద్రంబు నొసఁగి తొల్నాఁడు
పొడిచి వైచిన పీనుఁగుడువీథిఁ దాఁకి – పడ నప్డు సభ భయభ్రాంతులై బెదర
బొందికిఁ బ్రాణంబుఁ బోసి **మాచయ్య** – యందఱుఁ జూడంగ నంతరిక్షమున
నున్నవస్త్రములకు వెన్నొగ్గి జనులు – సన్నుతిసేయఁగఁ జనియెఁ జాటుచును
**బసవఁడు మాచయ్య** పాదము ల్గొలిచి – యసమాను మఠమున కనిచి యేతెంచె
సకలనియోగంబు జనపాలకుండు – ముకుళితహస్తులై మ్రొక్కుచు నుండ

### మాచయ్య బసవనిగీతమును విని కోపించుట

అంత **మాచయ** దొంటియట్ల సద్భక్తి – సంతతసత్క్రియాస్పదలీల నడవ
మఱికొన్ని దినముల కఱలేక బసవఁ – డఱిమురి నొకగీత మానతిచ్చుడును
భక్తులు దన యొద్దఁ బాడఁగఁ దడవ – యుక్తియే" యనుచు మహోగ్రతతోడ
'శివశివ' యని కేలు సెవులఁ జేర్చుచును – 'నవినీతుఁ డిట్టుండె హో కల్లినాథ!
చెల్లబో! దీనులఁ జేసి శరణుల – కెల్లను దా నొకయిచ్చువాఁ డయ్యె
ఎన్నఁడు గ్రోఁతి యయ్యెను? వెక్కిరింప – నెన్నఁడు గఱచె నిం కెక్కడిభక్తి
దోసంబు గాదె భక్తులు దీని విండ్రె – బాసలు గీసలు వాట వాడకుఁడు
మాయొద్ద' ననుచును మాచయ్య గినిసి – కాయకంబున కరుగంగ నిక్కడను



### బసవన్న మాచయ్య కడకేగి మన్నింప వేఁడుట

నంత నంతయు విని యాత్మలోఁగలఁగి – యంతంత ధరణి సాష్టాంగంబు లిడుచు
బసవఁడు భక్తజనసహాయుఁ డగుచు – వెస నేఁగుదెంచి భయసమగ్రవృత్తి
**మడివాలుమాచయ్య** యడుగులపొంతఁ – బుడమి సర్వాంగముల్ వొందంగ మ్రొక్కి
"యాక్రాంత సంతతాహంకార నిరతు – నక్రమాలాపు నిర్వక్రాపరాధు
నూర్జితక్రోధు వివర్జితసత్యు – దుర్జనాచారు ననిర్జితకాము
నజ్ఞానపుంజంబు నపగతశౌచు – విజ్ఞానహీను వివేకవిదూరు
నిర్భాగ్యచూడామణిని భక్తిరహితు – దుర్భావకు నవినీతుని నన్ను నింకఁ
గాచి రక్షింపవే కారుణ్యపాత్ర !– యేచినమద్గర్వమెల్ల మాయించి
**లాలితంబుగ నాల్గు లక్షలమీఁద – నోలి [1]నర్వదినాల్గువేలగీతములు**
గావించుటిది [2]యెగ్గు గని యేవగించు – భావన నాకయ్యె నీవు గైకొనమి
నా యతప్రీతి నోయనకున్న నింకఁ – జా! యనవయ్య నా సంగయ్యదేవ!"
యనుచు నిట్లాత్మనిందాతిదీనోక్తు – లను విన్నవించుడు విననట్ల వినియు
జంగమపరతంత్రుఁడంగావికారి – లింగదమాచఁడాలీఢశౌర్యుండు
"నధముఁడా! క్రొవ్వితే? హరభక్తులరయ – నధములే? నీ వొకయర్థాధిపతివె?
అడిగెడువారు లేకయ్య నీ వింత – బడగవైతివి; మఱి! బాపురే!" యనుచు
"అట్టియాచకుల నే నటు గందుఁగాని – యిట్టిత్యాగులఁ గాన మేలోకములను
పాన లిన్నియునేల? బసవ! నీయిచ్చు – నేనికదున్నలు నిలఁబచ్చుమన్ను
గుఱ్ఱపుగాడిదల్ గుటిలంపుసతులు – నెఱ్ఱకోకలు బ్రాఁతియే శరణులకు
నీ దిక్కుఁ జూడుమా నాదు జంగమము – పేదఱికములేని పెల్లు సూపెదను
[3]నదిగో" మ్మనుచుఁ జల్ల నందంద నెగయు – సదమలోదకకణజాలమంతయును
మరకత [4]నీలనిర్మల పుష్యరాగ – వరవజ్ర విద్రుమ వైడూర్యముఖ్య
వినుతరత్నాచలవితతియై వెలుఁగ – నినుఁడు ఖద్యోతమ [5]ట్లిరవిరిఁ(?)దోఁప
నట పౌరు లత్యద్భుతాక్రాంతు లగుచు – నిట బిజ్జలుఁడుఁదారు నేతెంచి చూడ
నమరి మాచయ యుండెఁ బ్రమథప్రసాద – విమలపుష్పాంచితవృష్టి పైఁగురియ
బసవని నభిమతఫలములఁ దనుప – నసమాక్షుఁడర్చితుఁడై యున్నయట్లు
జంగమంబొప్పె నాలింగావతార – సంగతి మాచయ్య సద్భక్తిమహిమ

1. నిర్వది 2. యెట్లుఁగని యెలుఁగించు 3. నదెకొ 4. మౌక్తికమణి 5. ట్లిఱివిరి.

మెఱుఁగఁగ జాలక యిన్నిరూపములు – వఱలఁగఁ దాల్చిన తెఱఁగునుబోలె
అట్టి జంగమ సభాభ్యంతరాళమున – నొట్టిన రత్నంపుఁదిట్టలకఱుత
భక్తుల కేనసూ బండారి నన్న – యుక్తి **నబ్బుసవరా జుండె** వెండియును
వారక యా **మడివాలుమాచయ్య** – గారల శ్రీపాదకంజంబులకును
మున్ను సాష్టాంగుఁడై మ్రొక్కుచుఁ జేరి – సన్నుతి సేయుచు శరణు వేఁడుచును
“నీ మహత్త్వముఁ జూడ నే నెంతవాఁడ – ధీమణి! సంగయ్య! దేవ! సర్వజ్ఞ!
నీవు శంకరుఁడవు నేను గింకరుఁడ – నీవు నిర్మలుఁడవు నేను దుర్మలుఁడ
నీవు విజ్ఞానివి నే నవిజ్ఞాని – నీ వమృతాంగుండ వే విషాంగుండ
నీవు మహాదాత వేఁ గృపణుండ – నీవు పశుపతివి నేఁ బశుజీవి
స్వామి! త్రైలోక్యచూడామణి వీవు – భూమి నిర్భాగ్యచూడామణి నేను
బొరి నిట్టి దుర్గుణంబులప్రోఁకలోన – నరయంగఁ గలదె నా యందు సద్గుణము
రక్షింపు మిట్టిగర్వప్రాప్తు నన్ను – శిక్షింపవే యయ్య! జియ్య నాదైన
యపరాధశతసహస్రావలి సైఁచి – విపరీత మహిమాఢ్య! వేయునునేల?”
అనుచున్న బసవన్న నందంద కౌఁగి – టను జేర్చి కారుణ్యవనధి నోలార్చి (ర్చె?)
“కలుగునే కాదె లింగంబునందైనఁ – దలఁపఁ గోపప్రసాదంబులు రెండు
చేరింటికైనఁ జెచ్చెరఁ [1]గడువఁగొను – వారు సేపట్టరు వాయించికాని
ధర నంతకంటెను దమ భృత్యవితతి – [2]నొరయక చేపట్టుదురె యట్లుఁగాక
యందులమాలిన్య మడఁపఁగఁ గాక – యెందుఁ జీరల కల్గునే రజకుండు?
అట్టిద బసవయ్యఁ బట్టి మాచయ్య – ధట్టించి నిర్మలత్వంబు నొందించె
నెన్నంగ వేమాఱు నెంతగాఁచినను – వన్నెక్కుఁగాదె సువర్ణంబు మిగుల
నింతింతగాఁ జేయ నిక్షుఖండంబు – నంతకంతకుఁ దీపు లధిక మౌఁగాదె
అంపానఁ [3]గోసిన ఱాచిన నెఱయఁ – గంపెక్కుఁగాదె శ్రీగంధంబునకును
ఱాచిన మడివాలు మాచయ్య యొరసి – చూచుడు **బసవయ్య** శుద్ధసద్భక్తి
తనరంగ నేఁడుగదా! తుదముట్టె” – ననుచు భక్తాళి కీర్తన సేయుచుండ
ముకుళీకృత వికంపితకరాబ్జుఁడైన – సుకుమారు బసవయ్యఁ జూచి మాచయ్య
“విను మహంకారించినను భక్తియగునె – విని యెఱుంగవె పురాతనులలోపలను

1.గుడుప (డ్ప?) విలుచు 2. నరయక 3. డ్రెంచిన.



## మాచయ్య బసవన్నకు శంకరదాసికథఁ జెప్పుట

జడయ శంకరమహాస్థానంబునందు – సడిసన్న శరణుండు **శంకరదాసి**
కాలకర్మాకర్మకలితమహేంద్ర – జాలవిలోలనిర్మూలనశాలి
జన్మజరామరణోన్మదాపహుఁడు – చిన్మయానందవశీకృతాత్మకుఁడు
రౌద్రమహోద్రేకరంజితవీర – భద్రుండు ప్రత్యక్ష ఫాలలోచనుఁడు
దండితాజాండ కరండదోర్దండ – మండితాడంబరతాండవమూర్తి
విలసితకీర్తి నిర్మలుఁడు సంసార – తలగుండుగండఁ డతర్క్యప్రతాపి
నాఁగఁ బ్రఖ్యాపితానశ్వరలీల – వీఁగుచుఁ బ్రచ్ఛన్న వేషంబునందు
బొంతకు గంతకుఁ బ్రోవిడి పోవు – నంతకు విక్రయంబార్చి తెప్పించి
యక్కజంబందఁ గాయకలబ్ధి [1]నిత్య – మెక్కవుఁ దఱుఁగవు [2]నేను మానికలు
జంగమకోట్లకు సముచితార్చనలు – భంగిగాఁ జలుపుచుఁ బ్రభుడున్నయెడను
**దేడరదాసయ్య** సూడంగ వచ్చి – వేడుక మదిఁ [3]దులుకాడంగ మ్రొక్కి
యొక్కింత సుఖగోష్ఠి నుండి వీడ్కొనుచుఁ – జక్కన మఠమేఁగి [4]సదయుఁడపోలెఁ
“గటకటా! యింతలింగ [5]సదర్థుఁ డయ్యు – నిట యీఁగకును దవుడింటిలో లేదు
**శంకరదాసి** లసద్భక్తిమహిమ – మింకనెన్నటి కంచు నె[6]డ్డవగచుచు
నక్కటికను **దుగ్గళవ్వకుఁ** జెప్పి – చిక్క గంపెఁడుకొల్చు శ్రీఘ్రంబ పనుప
“నట్టట్టె! పుత్తెంచెనటె కొల్చుదాసి – యట్టిదకాక మేలయ్యె నెంతయును
గొలుచునకిచ్చె మున్నోకయుఁ జించి – యిల నేమియదుగునో యీ మాకుఁగలదె?
బిడికిట నొకమాటు వుడుకంగఁదడవ – పిడికిటిలోననె యడఁగె గంపెఁడును
[7]నత్తవనిధియును నందలయించెఁ – దొత్తడిసంపద దొలఁగెఁ దత్క్షణమ
కూడు మందునకైనఁ గొలు [8]చిన్నిలేక – యాడకాడకు గాదియలు వాడువాఱె
దాసి మువ్వడసినతవనిధి యట్లు – దాసయ్య దివుచుడుఁ దత్క్షణమాత్ర
పరిభవాద్భుతశోక పారవశ్యమున – దురపిల్లు దాసికి **దుగ్గళవ్వనియె**

## దుగ్గళవ్వ దేడరదాసయ్యకు శంకరదాసిమహిమ చెప్పుట

“కలవానియట్ల నిక్కంబు నీ వొక్క – బులుసరితనమునఁ బుచ్చితి కొలుచుఁ
దనర నేనుఁగుపండ్లు దాఁబట్టిచూచు – మనుజుండు బ్రదుకునే మడియునకాక

1. నిక్క 2. నేడు 3. దొలు 4. పథనుండ 5. సమర్థుఁ 6. నుదవగచుచును, నెడ్డవగుచుచును 7. నత్తప 8. చింత.

నెట్టన శరణుల నిలుకడ లరసి – పట్టిచూడంగ నీ ప్రాప్తియే చెపుమ
మృడుఁడు ప్రసన్నుఁడై యడు గడుగుమన – [1]నడిగెనే గెలిగొని యడకించెఁగాక
[2]యదియేల చేయుకాయకలబ్ధి యెంత? – కదలకయుండు జంగమసంఖ్య యెంత?
యక్కజంబైన కాయకలబ్ధి నిత్య – మెక్కవు దఱఁగవు నేను మానికలు
జంగమకోటుల సంతుష్టిసేయు – లింగసదర్థుల లేమి యెట్టిదియొ?

## ఈశ్వరుఁడు శంకరదాసికి మూఁడవకన్ను నిచ్చిన కథ

ఖండేందుధరుఁడు లోకత్రయంబునను – వెండియు నాయయ్య వెలయింపఁదలఁచి
'యడుగు'మటంచుఁ బ్రత్యక్షమై నిలువఁ – జిడిముడిపడక సంస్మితవక్త్రుఁడగుచుఁ
గర్తలకర్త మత్కర్తవై నీవు – వర్తింప నింకొండు వరమేల వేఁడ
కడుఁగాక యేమియు నడుగమి సిగ్గు – వడియెద వడిగెదఁ బగలింటియట్ల
రాత్రియు సూఁదిదారంబు గ్రువ్వంగ – నేత్రములకు దృష్టి నెక్కొల్పుమనుడు"
వరదుండు దరహాసవదనాబ్జుఁ డగుచుఁ – గరమర్థి మిక్కిలికన్నిచ్చుటయును
హరునిచేఁ బడసిన యామీఁదికన్ను –పరదైవ దోర్దర్పహరణార్థమగుట
శంకరదాసి నిశ్శంకితవృత్తి – శంకరేతర సర్వ సమయారి యగుట
నిటలతటాంబకోత్కట చటులాగ్ని – పటుదృష్టివాతను బలువేల్పులెల్లఁ
జిటచిటఁ బ్రేలుచుఁ జటచటఁ బాసి – పటపటఁ బగులఁగఁ గటకటాయనక
వేల్పన్న పేరికి వెనుకొని [3]పుట్టు – మాల్పఁగ మఱికొన్ని వేల్పులు వోయి
బలువిడి శివ[4]శరణుల మర్వు సొచ్చి – తలఁకుచు మ్రొక్కు వేల్పులనెల్లఁ గాచి
యనయము మువ్వెట్టిగొనుచును [5]బడుగు – పనులు వంపఁగఁజేసి బ్రదుకుదమనుచు
[6]మసనక ముంగిటికసువులు నూక – [7]కొసనక మానక కొట్నంబు దినముఁ
బుట్టెఁడు దంపంగఁ బోలక మఠము – చుట్టును జాల రాఁజుచునుండు పెద్ద
పోటికట్టెలు వొలమున మోచితేరఁ – గాటిపాపఁడు వసిఁ గాచుచునుండఁ
గడుభక్తితోఁ గటకంబు మైలారుఁ – డదర నెప్పుడు గొడ గిడి తోడ నడవ
జేరి యాకడమల [8]చేటికాత్రేఁడు – దారలువట్ట నుద్యత్కీర్తులులియఁ
దక్కిన [9]యా పెఱదైవంబులెల్ల – నొక్కటఁ బనులు సేయుచుఁ గొల్చియుండ

1. యడిగెనేగేలిగోన 2. యదియేమిసే, యదియెల్లఁ జే 3. పట్టు 4. భారువుల 5. బడగు? 6. మసలకు 7. కొసరక, మారక 8. జెట్టికాత్రేఁడు 9. బెంతర, జంతర.



నొప్పి యష్టాదశయోగపీఠములు – దప్పక [1]యేఁటేఁటఁ గప్పంబు [2]లరువ
'ముక్కంటి! నీ యింటికుక్కల'మనుచు – జక్కులు గిక్కులు మ్రొక్కుచుఁగొలువఁ
దగిలి వారలమహత్త్వము విని యంత – జగదేకమల్లుఁ డసహ్యాభావమున

## జగదేకమల్లని కథ

హరి నడంచుటయొ బ్రహ్మాదిదేవతలఁ – బొరిమాల్చుటయొ బుడిబుడి వేలుపులను
[3]బఱచుట సోద్యమే కఱకంఠుచేత – నెఱయ ఫాలాభీలనేత్రంబు వడసి
ముక్కన్ను వడయు(వాఁడొ?)ట నిక్కమేనియును – జక్కన విష్ణుని సమదృష్టినిలిచి
వేయేల వడఁకక పోయినఁజాలుఁ – బో!" యని కల్యాణపురమధ్యమందు
గోవిందుప్రతిమ యుక్కునను గావించి – భావించి యటమీఁదఁ బంచలోహములుఁ
బోయించి కడుసొంగముగఁ బ్రతిష్ఠించి – పాయక రేయును బగలును గొలువ
**శంకరదాసి** యచ్చటి కేఁగుదెంచి – యంక కాఁడునుబోలె హరభక్తులలర
నఱిముఱి మొగవాడ దెఱచి వీక్షింపఁ – బఱియలై విష్ణునిప్రతిమ నుగ్గగుడు
నట[4]మున్న మీఁదిలోహంబెల్లఁ గరఁగి – యిట వాదములఁబడ నేతెంచినట్టు
లరుదేర విష్ణునిఁ [5]బొరిమాల్చెఁగూలఁ– బరసమయులు భయభ్రాంతులై [6]పఱవఁ
గట్టుగ్రలీల **శంకరదాసమయ్య** – యిట్టు వర్తింపంగ నిల నరుల్వొగడ
నెఱుఁగవే విని చూచి యేఁజెప్పనేల – కఱకంఠునకునైనఁ గావ శక్యంబె?
భక్తులసద్గోష్ఠిఁ బాసియుండినను – భక్తియు భయమును బాటిల్లుఁగాక
భక్తులసద్గోష్ఠిఁ బాసియుండినను – భక్తియు భయమును బఱపఱగాదె!
ఇదియేమి సోద్యమో యీశుఁడే యెఱుఁగు – విదితంబుగా మఱి చదువఁబెట్టినను
గలమతియును జెడ్డకారణంబయ్యె – నిల నిన్నియును జెప్పనేల? ర"మ్మనుచు
వందుచుఁ గుందుచు [7]వనట నిర్వురును – నందంద సాష్టాంగులగుచు నేతెంచి

## దుగ్గళవ్వయు దేదరదాసియు శంకరదాసయ్యను మన్నింపవేఁడుట

"కావవే జియ్య! **శంకరదాసమయ్య!** – దేవ! దెసయు దిక్కు నీవ మా"కనుచు
మ్రొక్కుచుఁ గరములు మోడ్చినఁ జూచి – "యక్కటా! వీరెవ్వరయ్య [8] వోచెల్ల!
దాసిదేవయ్యగారా! [9]సరణార్తి – మీ సరివారమా? మీకిట్లు దగునె?
ఇట విజయంచేయు టేమికార్యంబొ? – [10]ఎటపయనం బిట్టు లేఁగుచున్నారొ?

1. యేఁడేఁట 2. లిడుచు 3. బఱపుట 4. యున్న 5. బరిమార్చె 6. పర్వ 7. వడినిరువురుమ 8. రోచెల్ల 9. శరణార్థి 10. ఎటకైనఁబయనమైయేఁ.

కరుణించి యిచ్చుటి కరుగుదెంచితిరొ? – హరహర! మము మఱవరుగదె యెందు?
నిట్టి భయంబును నిట్టినిగర్వ – మిట్టి భక్తియుఁ గల్గునే యితరులకు
బాపురే! **దాసయ్య!** బడుగులాదరువ ! – బాపురే! **దాసయ్య!** భక్తులప్రాప!
వచ్చితే [1]యేమేనిఁ దెచ్చితే మాకు; – నిచ్చితే బ్రదుకు మా[2]యీసరయ్యకును
కోకమ్మి పడసినకొలుచు గాదియల – లేకేమి కొనిరావుగాక యేమియును
నేటంపుసంపద లెందేఁగెనింక – మాట [3]లేటికిని రమ్మా పాఱఁగొనుచు
వీసము నాసము విడువంగ ముడువ – నోసరించినధనం బుండునో యిచటఁ
ద్రవ్యమా!" బనుచు నద్దాసయ్యచేతఁ – ద్రవ్వింప జంగమాస్థానదేశమున
నక్కజంబంద నందంద కడాని – [4]నక్కులై వెడలంగ నక్కజంబంది
యాదాసియును **దుగ్గళవ్వయుఁ** జాఁగి – పాదాబ్జములమీఁదఁబడి లేవకున్న
"నూలికి మొదలును గూలియు [5]నిచ్చు – నోలికిఁ గొలుచిచ్చి చేలఁగొన్నట్టి
యీగి చెల్లింపక యెట్లునాచేతఁ – జాగెద" వనిపోయి శంభుని నాఁగు
కదుఁగాక యింకొందు[6]దడ(డు?) పల్లియిచ్చి – పడయుము పుట్టెఁడుపందుమునుముక
కుడిచికట్టిన[7]బడుగులచేతనొండెఁ – బడనడ్చికొనుమ యిమ్మడియు ముమ్మడియు
గాదేని పేదల[8]సాదులచేతి – యా దీవనలన మేలయ్యెడిఁబొమ్ము
బడుగుభక్తులకాళ్లపైఁ బడ్డఁగలదె – కుడువఁగఁగట్టఁగ విడువఁగ ముడువ
నేదియుఁ గాదేని పాదము[9]ల్విడువు – లేదన్నఁ బోపునే పేదలమునుక
యిన్నియుఁ జెప్పఁగానేల యీ పసిఁడి – మన్నైనఁ గొనిపొండు గొన్ని పెర్కలను
ననవుడు "నిట్లేల యానతిచ్చెదరు? – త్రినయన [10]యతిగర్వతిమిరాంధు నన్ను
నపరాధశతసహస్రపరీతకృత్యు – నుపమింపరాని గర్వోపేతచిత్తుఁ
గరుణఁ దప్పులసైఁచి కావవే!" యనుచు – శరణు వేఁడుచును బ్రశంసించుచున్న
సదయాత్ముఁడై యంత శంకరదాసి – ముదమున భక్తసమూహి గీర్తింప
నిరువుర లేవంగనెత్తి కారుణ్య – శరధి నోలార్చి ప్రసాదింపఁ దడవ
అవలఁ దొల్లిటికంటె నతిశయంబగుచుఁ – దవనిధి **దేడరదాసయ్య** కలరె
గర్వించినను నట్లకాక సద్భక్తి – నిర్వాహమొందంగ నేర్చునే బసవ

### మాచయ్య బసవన్నకు నిమ్మవ్వ కథఁ జెప్పుట

అదియును గాక నిమ్మవ్వ యనంగ సదమల – సత్క్రియాస్పద భక్తినిరత

1.బడగు 2. యీసురయ్య 3. లేమిటికి 4. నక్కులు 5. నిచ్చి యోలికిఁ 6. కదువల్లె 7. బడగుల 8.సాదల 9. ల్విడుఁడు 10. వరగర్వ.



యకుటిల వీరవ్రతాచారయుక్త – ప్రకటజంగమలింగ పరతంత్రచిత్త
సంసారరహిత నిష్కళ మహిమావ – తంస సజ్జనసముద్యద్గుణోపేత
హరభక్తులిండ్లకు నర్ఘ్యపణ్యములు – కరమర్థి మోచుచుఁ గాయకం బలరఁ
గొడుకు భక్తులయిండ్లఁ గోవులఁ గావ – నుడుగక కాయకోద్యోగలబ్ధమున
జంగమాసక్తి లసద్భక్తియుక్తి – సంగతి దినములు [1]జరపుచున్నెడను

### సిరియాలుని కథ

నంచితమతి సిరియాలుండు నాఁగఁ – గంచిలో నిత్య జంగమము లేవురకు
నిష్టాన్నపానాదులీప్సితార్థములు – దుష్టిగా నందిచ్చుశిష్టవ్రతమునఁ
జరియించుచుండంగ సర్వేశ్వరుండు – సిరియాలు భక్తిలోఁ దరయఁగఁ దలఁచి
కృతక తపోధనాకృతి నేఁగుదేర – హితజంగ[2]మార్థమై యేతెంచి సెట్టి
మస్తకవిన్యస్తహస్తుఁడై తపసిఁ – బ్రస్తుతింపుచుఁ బదాబ్జంబుల కెరఁగి
"స్వామి! వే వేంచేయవే! మహాపురుష! – నీ[3]మనుమని నిత్యనేమంబుసలుప"
నని విన్నవించుడు నత్తపోధనుఁడు – "ననఘ! మాయిచ్చ సేయఁగ నోపుదేని
నింతకంటెను సుఖం బెద్ది మా" కనుచు – సంతసంబందుచు సదయుఁడపోలె
సిరియాలుఁ గరుణాభిషిక్తుఁజేయుచును – నరమాంస మొక్కొక్క వెరవున నడుగ
"సర్వజ్ఞ! మీ మనోజ్ఞంబైనయట్టి – సర్వలక్షణగుణ సంపూర్ణుఁ డొక్క
వరపుత్త్రుఁడున్నాఁడు, నరమాంస మింకఁ – బొరుగింటికిని విల్వఁ బోయెదనయ్య?
అరుదైన మీవ్రతోద్యాపన నేఁడు – కరమర్థిఁ జెల్లింతు క్షణముగొ" మ్మనుచు
నడుగులఁ బడి **సిరియాలుండు** దపసి – నొడఁ[4]బర్చి యింటికి వడి నేఁగుదెంచి
తన సాధ్వి కొయ్యన తత్కార్యధార – వినిపింప "నీవేల వెఱచెద" వనుచు
**సంగళవ్వ**యు నప్డు చదివెడుపుత్త్రు – **మంగళం**బలరఁ గ్రమ్మనఁదోడితెచ్చి
"మనయింటఁ బండువుదినము నేఁ"డనుచుఁ – గనుఁగొని వధ్యశృంగారంబు సేసి
బాలుని ముక్తివిలోలు సిరాలు – లీలయుఁబోలెఁ దల్లియును దండ్రియును
నిండారుమనమున నిహతుఁ గావించి – ఖండించి నానాప్రకారముల్గాఁగ
శాకంబు లొడఁగూర్చి జనులెర్గకుండ – శ్రీకంఠమూర్తిఁ జెచ్చెరఁబిల్చి తెచ్చి
శ్రీపాదయుగళాభిషేకంబు సేసి – యా పాదజలములత్యర్థిఁబ్రాశించి
సంచితోన్నత సుఖాసనమున నునిచి – మించి యర్చించి పూజించి వడ్డించి

1. సలుపు 2.మార్థియై 3. మనమిడి నిత్తెనేమము? 4. బఱచింటికి.

యంగనయును సెట్టి సాష్టాంగ మెరఁగఁ – బొంగి తాపసి శాకములు వేఱువేఱు
పరికించి చూచి యేర్పడ శిరోమాంస – మరసి యెయ్యెడఁగాన కంత నిట్లనియె
"తలసూచియైనను దనయునిమీఁది – వలపు దక్కింపంగ వచ్చుఁ బొమ్మనియె
తలదాఁచుకొన్నారు; తగవయ్య! బాలు – తలగొని యిఁక మీరు ధన్యులుగారు
ఏమియు లేదు శిరోమాంస మిట్లు – నేమంబునకుఁ జెల్లునే? యాగమోక్తి
దాన "**సర్వస్య గాత్రస్య శిరః ప్ర – ధానం**" బనెడుమాట గానేర దింక
ననవుడుఁ బతియును నతివయు బెదరి – "యనఘ! మహాత్మ! యి ట్లానతీఁదగునె
ఉపమింపఁ గేశదుష్టపరీతశాక – ముపహతం బనఁబడునో యని వెఱచి
పుచ్చితి మదియు నిప్పుడు చందనంగ – సెచ్చెరఁ బాకంబు సేసెఁదా" ననుచు
మఱితెచ్చి యా శిరోమాంస మర్పింపఁ – గఱకంఠమూర్తి గన్గంట వీక్షించి
"యిల నెట్టి యన్న దాతలు నిన్నుఁబోలఁ – గలరయ్య! యింతయుఁ గడుసాంగమయ్యె
నేనాటఁ బ్రతి వోల్పలేని యభీష్ట – దానంబు సేసితి దీనికిఁ దగఁగ
నీ వలపట మేము నీవు దాపటను – దేవతార్చనములు దీర్చి [1]సపంక్తిఁ
గడుఁ బ్రీతితోడ లింగప్రసాదంబు – గుడువనినాఁడు నా కొడఁబాటు గాదు
కంటి మంటినని యాకాంక్ష నిదేమి – కొంటిమో తింటిమో కొడుకుమాంసంబు
నిచ్చ సేయంగ మున్నిచ్చినక్షణము – పుచ్చుకో నీవ యేఁ బోయెదనింక"
ననవుడు సెట్టి భయభ్రాంతిఁ బొంది – వనితఁ జూచుడు "నింక ననుమానమేల?
ర"మ్మంచు లింగార్చనమ్ము సేయించి – క్రమ్మన వడ్డింపఁగాఁ దపోధనుఁడు
"నతిథిపూజలు సేయునవసరంబునను – సుతులును దారు నుత్సుకలీలతోడఁ
బొత్తునఁ గుడుతు రట్లుత్తమపురుషు – లిత్తఱి నీకైన నెట్లు సేయాడు
నిప్పుడు గానరాఁ డేఁడి మీ సుతుఁడు – చెప్పమే యప్పుడు సిరియాల! నీకు
నెన్నఁ బుత్త్రులు లేనియింట మాకెట్టు – లన్న దానముఁగొన నర్హమౌ చెపుమ
ధృతి '**నపుత్త్రస్య గతిర్నాస్తి**' యనఁగ – గతిహీనులిండ్లఁ గుడుతురె సంయములు
కాన పుత్త్రుఁడు గలఁడేని పిల్పింపు – లేనినాఁడొల్లము పానలే"లనినఁ
జకితదేహుఁ డగుచుఁ జయ్యన మ్రొక్కి – "యకలంక! మీ రప్పుడున్నారు నేను
విన్నాఁడఁ బుత్త్రుఁడున్నాఁడు సదువు – చున్నాఁడొ! యాడుచున్నాఁడొపిదపఁ
జనుదెంచి మఱి మీ ప్రసాదంబు వాఁడు – గొనియెడిఁగాక భోజన మాచరించి

1. మా పంక్తి.



రక్షింపవే యోగిరములు శాకములు – అక్షయాత్మక! చల్లనారకయుండ"
ననుచు మ్రొక్కుడును దదంగనఁ జూచి – "పనిచిన 'నౌఁగాక' యని పిల్వరాదె
తల్లి విల్చిన రాని[1]తనయులు గలరె – తెల్లంబుగా నాల్గుదిక్కుల నిలిచి
యెలుఁగెత్తి పిలువుమా యేము వినంగ – నలరుచు రాకేమి యట్లయుండెడినో"
అనవుడు "నుత్తరం బాడంగ నేల" – యనుచు నేతెంచి తూర్పాదిగా నిలిచి
చెలఁగుచుఁ దాపసిచెప్పినయట్టు – లెలుఁగెత్తి సుతుఁ దల్లి విలువఁగఁదొడఁగె

## సంగళవ్వ కొడుకును బిలుచుట

"పూర్వజన్మార్జితభూరికర్మములు – గుర్వణఁగించు నా కొడుక! రావయ్య!
దక్షిణాధీశ్వరుదర్పమడంచు – దక్షతగల్గు నాత్మజుఁడ రావయ్య!
విరసపశ్చాజ్జన్మమరణదుఃఖములు – [2]పొరిమాల్పఁ జాలు నా పుత్త్ర! రావయ్య!
ఉత్తరంబేలు నుదాత్తయోగీంద్రు – చిత్తంబునకు వచ్చుశిశువ! రావయ్య!
అలరు నా కోపభోగాతీతపదము – లలవడె నేఁడు నాయయ్య! రావయ్య!
దండధరోద్దండ దండప్రశక్తి – ఖండింపనోవు పుత్త్రుండ! రావన్న!
పాయనివ్యామోహపాశబంధములు – కోయంగఁజాలు నా కుఱ్ఱ! రావన్న!
ద్రవిణాదికేషణత్రయ విజృంభణము – తవులునఁ బడని నా తండ్రి! రావన్న!
సురరాజనుతుఁడు విశ్రుతతపోవేషి – వరదుఁడైనాఁడు నా వడుగ! రావన్న!
అంతకాంతకమూర్తియగు తవరాజు – సంతసంబంద నా సామి! రావన్న!
ఘోరనిస్సార సంసారవారాశి – పార మీఁదించుపాపండ! రావన్న!
అంచితాగణ్య పుణ్యప్రాప్తి నమరు – కాంచీవిలాసు నగ్రజుఁడ రావన్న!
దివిజకన్యకలతో దివి ముక్తికన్య – కవయనున్నది భక్తికాంతుండ! రావె!
దండడి మీయయ్య దక్షిణభుజము – నందంద యదరెడినన్న! రావన్న!
భానుఁడెంతేనియుఁ బడుమట వ్రాలె – శ్రీనిలయుండ! నా సీరాల! రావె!
స్వాదొంద నర్ధేశసఖునిసన్నిధిఁ బ్ర – సాదంబుఁ గొనఁగ నా గాదిలి! రావె!"
అనుచు నాలుగుదిక్కులందు నందంద – తనయునిఁ బిల్చుశబ్దంబులోపలను
జనితమై దిక్కులసంజ్ఞలు దోఁప – వనితాలలామ విల్వంగ నంతటను
గుండలంబులు గ్రాలఁ[3]గూఁకటి వ్రేల – [4]మండనం బొలయ సౌమ్యపుఘంట లులియ
రావిరేకయుఁ దూల భావంబు వోల – నా విధియు నదల హర్షంబు వొదల

1. తనయుండుగలఁడె? 2. పరిమాల్పఁ జాలునాపట్టి 3. గూకటల్ వ్రా(వ్రే) ల 4. మండలం.

నందెలు మ్రోయ మోక్షాంగన డాయ – సందేహ [1]ముడుగ నాశ్చర్యంబు[2]దొడుగఁ
జూపఱు గీర్తింప సురలు శంకింపఁ – దాపసి వీక్షింపఁ దండ్రి మైవెంపఁ
దల్లి గౌఁగిలిసాఁపఁ ద్వరితంబు దోఁప – ముల్లోకములుఁ జూడ ముద్దు దుల్కాడఁ
బఱతెంచె సుతుఁడు; నప్పాటనీశ్వరుదు – కఱకంఠుఁడజుఁడు మాకాంతుదుగ్రాక్షుఁ
డక్షరుం డా **సిరియాలు**కట్టెదుర – నక్షణంబునన ప్రత్యక్షమై నిలువ
నంతలో [3]**సిరియాలు**ఁడతివయు సుతుఁడు – నంతంత ధరణి సాష్టాంగులై మ్రొక్కి
కలగని మేల్కన్నకరణి నద్భుతము – దళుకొత్తఁ జెలగి కీర్తనలు సేయఁగను
"శ్రీశ! వాణీశ! సురేశ! సన్ముని గ – ణేశ దిశాధీశు లెలమి నంకింప
నా రుద్రగణములు నా పురాతనులు – వీరభద్రాదులు సేరి కొల్వంగ
సద్భక్తు లతులితోత్సవలీలఁ దనర – నద్భుతాక్రాంతాత్ములై [4]నరుల్వొగడ
నలరి చందననంగ నాప్తవర్గంబు – నల**తిరువెంగాణి**నంగఁ దత్సఖుల
నంచితమతి సిరియాలు సీరాలుఁ – **గంచేదువాడలు**ఁ గైలాసమునకుఁ
బ్రవిమలకనకదివ్యవిమానపంక్తి– దివిఁదేజరిల్ల నద్దేవదేవుండు
గొనిపోయెఁ, గైలాసమున **సిరియాలు**ఁ – దనుపమప్రమథగణాస్థానమందు
భవుఁ జూచి తనుఁజూచి ప్రమథులఁజూచి – భువిఁదనపెట్టిన పుత్త్రునిఁ జూచి
"పుడమిఁబుత్త్రునిఁజంపి మృడునిచే మగుడఁ – బడసి కైలాస మేర్పడఁ జూఱగొనిన
యిటువంటివాఁడెవ్వడేఁ దొల్లి యిపుడు – నట యిట గలఁడె నా యట్టి భక్తుండు
ఏనకా" కని మదినెంతయుఁగ్రొవ్వి – తా నహంకారించి తలఁపంగఁదడవ
చిఱునవ్వు నవ్వుచు శివుఁ డది యెఱిఁగి – 'చిఱుతొండర'మ్మని చెయివట్టికొనుచు
నిమ్మహీతలమున కేతెంచి యపుడ – క్రమ్మఱ నిమ్మవ్వకడ నిల్వఁబడుడుఁ

## నిమ్మవ్వ కథ

బడఁతియు బిట్టుల్కిపడి సంభ్రమమున – నడుగుల కెరఁగి పాదాబ్జముల్ గడిగి
యంగన ప్రచ్ఛన్నలింగమూర్తులకు – సాంగోచితక్రియాభ్యర్చనల్ సేసి
పంచభక్షంబులుఁబాయసాన్నాదు – లంచితప్రీతిఁగావించునయ్యెడను
భువిఁబథిశ్రాంతులుఁబోలె సెట్టియును – శివుఁడును వెడ నిద్ర సేయుచున్నెడను
**నిమ్మవ్వ** యర్ఘ్యపణ్యమ్ములకేఁగఁ – గ్రమ్మన గోవులఁ గాచి బాలుండు
వలసి యాఁకొని వచ్చి "యమ్మమ్మ!" యనుచుఁ – దలుపు [5]గట్టనూకితల్లి లేకున్న
నటయిట వరికించి యందొక్కబూరె – కుటిలాత్ముఁడై పుచ్చికొని నమలంగ

1. మఱుఁగ 2. దొఱఁగ 3. జిఱుతొండఁ 4. నరుల్బొడ 5. గ్రక్కున



నంతటిలోన **నిమ్మవ్వ** యేతెంచి – యంతంతఁ 'జీ! కుక్క!' [1]యని యిల్లుసొచ్చి
"పదుచు వాపముచేసె మృదునోగిరములు – [2]దొడికిలి తినె శివద్రోహి వీఁ"డనుచుఁ
బచ్చిచెక్కలఁ దలఁబగులంగనడిచి – చచ్చినపీనుఁగు జఱజఱ నీడ్చె
అననేల? పుత్త్రమోహంబు సీమంత – యును లేక కొడుకు చా వొరులెర్గకుండ
గాడిలోపల వైచి కసువుపై డిగిచి – వేడుక మదిఁదులుకాడంగ మఱియుఁ
బాకయత్నము సేయ బాలునిచావు – నేకాంతమున శివుఁడెఱిఁగింపఁ దలఁచి
"చిఱుతొండ! చూచితే! చిత్ర మివ్వనిత – తఱుసంటి [3]యాఁకలి ధరియింపలేక
క్రమ మెర్గఁ డొకబూరె గ్రక్కున డిగిచి – నమలెనో నమలఁడో నాతి వీక్షించి
'పాకమింతయు వృథాపాకంబుసేసె – యీ కుక్క ద్రోహి వీఁడేల నా'కనుచు
నఱిముఱిఁ బట్టి నిజాత్మజుఁ జంపి – జఱజఱ నీడ్చి యా చక్కటి వైచె
నదె చూడు" మనుచుఁ బాదాంగుష్ఠమునను – బొదివిన కసువెల్ల బోవనూకుడును
జూచి శిరఃకంప మాచరించుచును – నా చిఱు[4]తొండఁ డత్యాశ్చర్య మందె
నంగన వాక ప్రయత్నాంతమందు – జంగమములకు మై జలకంబు[5] సేసి
యతుల లింగోపచర్యల నర్చలిచ్చి – యతివ వడ్డించు నయ్యవసరంబునను
నింతిపుత్త్రునిఁజంపు టెఱుఁగనియట్ల – యంతకాంతకమూర్తి యప్పు డిట్లనియె
"ఇంతి! నీ పుత్త్రుఁడా యింతకమున్ను – నెంతయు నాఁకొని యిట సీరిచీరి
యెక్కడ వోయెనో? యెట్లున్న వాఁడొ? – అక్కటా! డస్సెఁ గదమ్మ! బాలుండు
కరుణమాలినయట్టి కాంతవు గదవె? – హరహర! చెయ్యాడ దారగింపంగఁ
బెంపమే కానమే బిడ్డలఁ దొల్లి – యింపొనె కీడు మేలింట నేమేని
వండినఁ దిన; నెట్టివారైన శిశువు – లుండంగఁ దార కైకొందురే యిట్లు?
కనికరం బింతయు మనసున లేక – వనిత! మా కేటికి వడ్డించి తవ్వ!
పసిబిడ్డ లుండంగఁ బాడిగాదిట్లు – మసలక సుతుఁ బిల్వుమా యొల నివల"
ననవుడు "నట్లగు నగు నాఁటదాన – ననియె చూచెదవయ్య! యయ్య నీమాయ
లెఱుఁగుదు నెఱుఁగుదు నే బేలఁ గాను – కఱకంఠ! యిదియేల కథలువన్నెదవు
ననుఁజూచి [6]సిరియాలుఁ డని తలంచితివొ? – పనియు లే దారగింపక పోవరాదు
ప్రామిఁడి[7]యై మేడుపడియెడు దానఁ – గామి నీ వెఱుఁగవే కడయింటిపొడువ
కామించి సుతుఁ జంపి క్రమ్మఱఁ బిలువఁ – గామారి! నీ యిచ్చు కైలాసమొల్లఁ

1. యనుచిలు 2. దొడికిలెనే 3. యాకటదరియింపలేక 4. చిరియాలు 5. లార్చి 6. చిఱుతొండఁడని 7. నై(మై) మైదుపడియెడు.

దన ద్రోహమునఁజేసి తాఁబోయెఁబొలిసి – గొనకొని యా ద్రోహిఁగూడు నే తలఁప"
నన [1]**సిరియాలుండు** విని యంత శోక – వనధిఁ దేలుచుఁ దలవంచి లజ్జించి
యడఁకుచు నిశ్చేష్టితాత్ముఁడై యుండఁ – బడఁతి నిర్మలభక్తిభాతికి మెచ్చి
యంతకుమున్న నిజాకృతిఁ దాల్చి – యంతకాంతకుఁడు ప్రత్యక్షమై నిలువ
"నోహో! ఇదేమయ్య! యుచితమే యిట్టు – లాహా! మహాత్మ! మహాత్ములగుణమె?
అఱిముఱిఁజన్నుఁబాలర్థించి యేడ్చు – చిఱుత[2]చే నొకపిండికరు (ఱు?) డిచ్చి తల్లి
తనచన్ను మఱపించి కొనిపోయినట్లు – చనరాదు నిమ్మిచే సందేహపడకు
మొదలికిఁబ్రాణంబు నొడలుప్రాణమున – కొడఁబడియున్నట్టు లుభయనామములు
నమరెడు లింగజంగమమూర్తి విడిచి – భ్రమకు హేతువులగు భావము ల్దాల్ప
నవ్వరే నిన్నును నన్నును భక్తు – లివ్వేడబంబులకెల్ల లోనైన
నేల యీ బహురూపు [3]లే నేమి నిన్ను – సోల వెల్తిగ మున్ను సూచితినయ్య!
ముక్కంటివై మఱి మూఁడు[4]నుగన్ను – లక్కజంబుగ నున్న నవియు లేకున్న
హరరూపమై యున్న నరరూపమన – గురురూప కాదె సద్గురుసన్నిహితులు
కఱకంఠ! [5]యిట్లేల కళవళించెదవు? – వెఱవకు వెఱవకు వేఱకాఁదలఁప
వేయేల **గుండయ్య** ప్రాయంబు వడయ – నే[6]యఱ్ఱుకప్పుతో నేఁగితి చెపుమ
**భోగయ్య** యింటికిఁ [7]బోయిననాఁడు – ఏ గౌరిసహితమై యేఁగితి చెపుమ
దాసయ్యచే వస్త్రదానంబు గొనఁగ – నేసోమకళఁ దాల్చి యేఁగితి చెపుమ
**మానకంజారుని** మందిరంబునకు – నేనందినెక్కి నీ వేఁగితి చెపుమ
ఈ **చిఱుతొండని** యింటికి నీవు – నే చతుర్భుజముల నేఁగితో చెపుమ
కావున నీ చమత్కారము ల్మాను – మీ వేడబము లెల్ల [8]నే మెఱుంగుదుము
ఎట్టైననుండు మీ విట్టారగింపఁ – [9]బెట్టుదు నీయాన ప్రిదిలితినేని"
అనుచు నిష్ఠించి **నిమ్మవ్వ** పల్కంగ – మనసిజాంతకుఁడు మెల్లన నవ్వుదనర
నట్టైన నవుఁగాక" యని యారగింపఁ – బెట్ట నా[10]**సిరియాల** సెట్టికిట్లనియెఁ
గడుభక్తిఁ **జండేశకాటకోటాదు** – లడరంగఁ దండ్రుల నాప్తులఁ దప్ప
నడచినఁ జంపరే? నఱకరే మగుడఁ – బడయరే? వేఁడరే ప్రత్యక్షమైన
విను మట్లుఁగాక ద్రావిడదేశమందుఁ – జనినపురాతన శరణులలోన

1. జిఱుతొండండు 2. చేతికిఁబిండి 3. లేమేని మున్ను, లేవైనమున్ను 4. ముక్కన్ను 5. నీవేల 6. యర్తి 7. బోయెడి 8. నే నెఱుంగుదును 9. బెట్టకనాయాన 10. చిఱుతొండ.



## నరసింగ నయనారుని కథ

**నరసింగ**[1]**మొన్నయనా**రనురాజు – ధరణి మద్భక్తుఁ డాతని యగ్రమహిషి
కరమర్థి నాయూరిపరమేశుఁ గొలువ – నరుగుచోఁ బూజార్హమగుపుష్పమొకటి
పుచ్చి మూర్కొనుడును బువ్వులవడుగు – నచ్చెల్వ నాసికం బప్పుడ కోయ
నచ్చోటి కప్పుడ యచ్చోడనృపతి – వచ్చుడు సతితోడ వనితలు మ్రొక్కి
"దేవ! తప్పేమియుఁ గావింప దిచట – దేవి వోవుచు నొక్కపూవుమూర్కొన్న
లింగార్థమై యున్న చెంగల్వపూవు – నంగన మూర్కొనె నని ముక్కుగోసి
వైచి నీ పూజారివడు" గని చెప్ప – "నోచెల్ల! తగ దిట్టు లుచితమే నీకు"
ననుచుఁ బూవులవడ్గు నప్పుడ విల్వఁ – బనిచి "నీ కిది భక్తిపాటియే వడుగ!
యెట్టివివేకివై తిటమున్ను పువ్వు – ముట్టినచెయి మొట్టమొదటికిఁ గోసి
మఱికదా కోయుట మగువ నాసికము – ఎఱుఁగవు నిన్ను [2]నాకేమనఁ గలదు?
అనుచు నిజాంగన నచటికిఁ బిలువఁ – బనిచి భూపతి [3]వాఁడి [4]బాడితయెత్తి
"నిన్ను నీ వెఱుఁగక యన్నెక్కి క్రొవ్వి – మున్నీశ్వరార్థమై యున్నపూవునకుఁ
జాఁచిన చెయ్యేది సక్కన నపుడు – చాఁచినట్లే చాఁపుచాఁపు ర"మ్మనుచు
ముట్టిన [5]యంగుళుల్ మొదలికి నఱికి – పట్టఁ జూచిన మణికట్టు ఖండించి
[6]తివిచినమోచెయ్యిఁ ద్రెవ్వంగ నడిచి – యవిచారమున మొద[7]లంట వదల్ప
నత్తఱి నేము ప్రత్యక్షమై నిలిచి – తుత్తున్కలై యున్న యత్తన్వి చేయి
మును గోసివైచిన ముక్కును నొసఁగి – జననాథునకు నంత సామీప్యముక్తి
యిచ్చినఁ గైకోఁడె యీ జనవ్రాత – మచ్చెరువందుచు నర్థిఁ గీర్తింప

## కొట్టరువు చోడనికథ

అట్టునుగాక [8]మున్ [9]పట్టంబుదేవి – కొట్టరువందు మా కొల్చుఁగుడ్చుచును
గర్భిణినాక తద్గర్భంబులోనె – యర్భకు సహితంబ హరియింపఁదడవ
కోరి మోక్షము వేఁడికొనఁడె మెచ్చినను – నారచోడఁడు! మఱి యట్లనే మెచ్చి
భంగిగా నభిమతఫల మడుగుమనఁ – [10]గింగాణమును జేయ దంగనఁ జూడు
తప్పుసేసిన మహోద్ధతభక్తియుక్తిఁ – దప్పేమి సంపెఁ బో తన్వి దనూజు
నడుగంగవలదె ప్రత్యక్షమైయున్న – యెడ? నింతిమాహాత్మ్య మేమనవచ్చు

1. మున్నయ 2. నే నేమనఁ 3. తాన 4. బాడి స1ద, – 5. వ్రేళ్లను; నంగుళులను 6. తివిరిన 7. లంతవిడ్పింప 8. యీ 9. పట్టంపు 10. కింగాణి.

నడిగినఁ జంపితి వడుగఁ దనూజు – మడియించి పిల్చితి మఱి పిల్వదతివ
[1]ఇట్టిట్టిభక్తు లనేకులుండంగ – నెట్టయా [2]సిరియాల! యేనకా కంటి
భక్తితో గర్వించి పలుకుటయెల్ల – యుక్తియే?" యనుచుఁదద్భక్తవత్సలుఁడు
బాలుని నంత సప్రాణుఁ గావించి – కైలాసమున [3]కన్పెఁగమనీయలీల
"జంగమలింగపూజనము వీక్షింప – భంగిఁజతుర్వర్గ ఫలములకంటె
నుత్కృష్ట"మని ధరనుండె నిమ్మవ్వ – సత్క్రియలందెల్లఁజనునె గర్వోక్తి
యట్టిదకాక యహంకరించినను – బట్టిచ్చునే భక్తి బసవకుమార!
హరుఁడు దా వెండియు [4]నంతఁబోనీక – సిరియాల! రమ్మని చెయివట్టికొనుచు

## హలాయుధుని కథ

సరసర భక్తవేషంబులతోడ – ధరహలాయుధుఁడున్నపురికి నేతేర
నా హలాయుధుఁడు నత్యర్థిఁ[5]దుల్కాడ – మాహేశ్వరులకు సమ్మతిఁజాఁగి మ్రొక్కి
నవినయసంభ్రమవివశాత్ముఁడగుచు – నవసరోచిత సత్క్రియాదులఁ దనిపి
ముక్కంటిమూర్తికి ముదము వహింప – మక్కువ సుఖగోష్ఠి మాటలాడుచును
"నెంతదవ్వులనుండి యేఁగుదెంచితిరొ? – యెంతయేనియుఁబథశ్రాంతులువోలె
నున్నవా"రని యిట్లు విన్నవించుడును – నన్నీలగళమూర్తి యతని కిట్లనియె
"ధరణి మహాభక్తదర్శనార్థంబు – చరియించు జంగమోత్కరములోపలను
నరుదంద నయంబు నాడుచుండుదుము – కరమర్థి భక్తులే గతియుఁగా మేము
మముఁ దమపాలిలింగముగ వారంత – నమితసంగతిఁగొనియాడుచుండుదు[6]రు
**తిరునీలకంఠుండు వరగొండపతియుఁ – గరికాలచోడండు నరియమరాజు**
**యెలయదంగులిమారఁ డేణాధినాథుఁ – డిలఁ జేదిరాజు వాగీశనైనారు**
**చేరమ శ్వపచయ్యగారు సోమాసి – మారుండు పిళ్లనైనా**" రనఁబరగు
వీరాదిగా భక్తవితతిచే నొల్ల – నారాధ[7]నలు గొన్నవార మీ క్రియను
నీడాడ యని చెప్పనేల! యిద్ధరణిఁ – గూడ నేఁజొరనిభక్తులయిండ్లు లేవు
మమ్మెఱుంగనిభక్తుఁ డిమ్మహి లేఁడు – ఇమ్మహిఁబెద్దగాలమ్ము మా[8]సుళువు
మును పెట్టివారు మెచ్చనియట్టి భక్త – జనము లౌననఁగ మా దినములు గడచెఁ
జేపట్టి మము రూపుసేసినవార – లేపారు భక్తుల [9]నేకులు గలరు
నరిది మా బ్రదుకు మున్నాదిఁబుట్టినది – పెరిఁగినది **నిరాళపుర**మను వీడు

1. ఇట్టి భక్తులనేకు లీ భువినుండ 2. చిఱుతొండ 3. కంపెఁ 4. నంతటఁ బోక 5. దొల్కాడ 6. ము? 7. నములుగొన్నార 8. సుళువు 9. యెట్లతాననిన. అ.



పుట్టితిఁగాని యిబ్భువిఁదల్లిదండ్రు – లిట్టివారనియెర్గ నేమనిచెప్ప
నింపార **నిమ్మవ్వ** యెత్తి చన్నిచ్చి – పెంపఁగఁబెరిఁగితి బిడ్డనిభాతి
నడరఁ**గెంభావిభోగయ్య** సెట్టార్చి – నడపింప భువి నడుగిడఁ గఱచితిని
బడిపను లేమేనిఁబంపుచు నంబి – కడుకొని పిలువంగ నుడువ నేర్చితిని
గడుఁగూర్మిఁ **జెన్నయ్య**గారిపొత్తునను – దొడుకొని కుడుపంగఁగుడువ నేర్చితిని
అఱకొఱ లేక **దాసయ్య**మచ్చునను – గఱచితి వస్త్రంబుగట్ట నంతటను
గడఁకతోఁ గూఁతుక్రుమ్ముడిఁ గోసిమాకు – జడఁగట్టె మానకంజారుండు మఱియు
మిండండనై యాడుచుండంగఁ జూచి – వెండి బల్లహుఁడొక్క వెలఁదిఁగావించె
ఇమ్మిండనికి [1]ధనం బెక్కడిదనుచు – ముమ్మడిపడి సేసె **మొన్నయధరుఁడు**
అంత **దాక్షారామమం** దహర్నిశముఁ – గాంతాసుఖోపభోగంబులందుచును
నరుదెంచి మొన్న నా **సిరియాలు**నింట – వరపుత్త్రుఁగంటి దేవరఁగూడుకొనియె
భువిని నా సుఖదుఃఖములు నీకుఁజెప్ప – కెవరికిఁజెప్పుదు నే **హలాయుధుఁ**డ!

## జంగమరూపధారి యగు శివుఁడు హలాయుధునకు సిరియాలుమహిమఁ జెప్పుట

అట్లునుగాక చోద్యంబు వెండియును – నెట్లన్న వినవయ్య! యేఁజూడఁజూడ
**సిరియాలు**ఁడాకంచిపురి యేడువాడ – లరుదుగాఁగొనిపోవ నందులోపలను
గలసి పుత్త్రుఁడు వోయెఁ గైలాసమునకు నిలఁజిఱుతొండని కెన యెందుఁగలరె?
మలహరుఁడాతనిమనసు లోఁతరయఁ – దలఁచి శంకరకింకరులు మొదల్గాఁగఁ
గడఁగి వ్రతస్థులఁ దొడంగి పుత్తేర – నడిగినట్టుల వారి కతిభక్తియుక్తిఁ
జెఱకురసంబు నీప్సితవస్తువులును – నఱలేక యందిచ్చి కఱకంఠుఁగొలువ
నదిగాక హరుఁడరువదియొక్కదినము – వదిగొని కంచిలో వాన [2] గుర్పింపఁ
గడఁగి నిత్యము నేగురొడయల కన్న – మిడుచుండఁదపసులం దెచటలేకున్నఁ
బరముండుదాన తాపసిక్రియ నంత – నరుదెంచి **సిరియా**[3]**లు**వరపుత్త్రు నడుఁగఁ
గడునర్థిఁ గొడుకుశాకములు గావించి – మృడుని మెప్పించి యప్పుడు సుతు మగుడఁ
బడసి కైలాస మేర్పడఁజూఱగొనియె – నడరంగ నున్నార మందు నాఁడేము
అట్టి భక్తుఁడు గలఁడయ్య లోకములఁ – బెట్టంగవచ్చునే పుట్టినసుతుని
మచ్చరంబున భక్తిమాటలాడంగ – వచ్చుఁగా"కని పేర్చి [4] హెచ్చి కీర్తింప

1.ప్రయంబెట్లగున (బిట్లెయ్దద)నుచు 2. గావింప 3. ల 4. పేర్చి

శివ! శివ! ఇది యేమి సెప్పెదవయ్య! – శివుఁడేమి నరులభక్షింప రక్కసుఁడె?
శిశువు సద్భక్తుని [1]**సిరియాల నంబి** – పశువరింపఁగఁజంప భక్తిహీనుండె?
మీ రొడయలుగాన మీమాట బొంకు – నారాదు గాక యేనాఁటఁబోలగునె?"
అని మిథ్య సేయఁగ నా మృదుమూర్తి – "విను హలాయుధ! పురాతనులలోపలను
సతుల నిచ్చినవా రసంఖ్యాతకోట్లు – సుతుల నిచ్చినవారు శతకోటికోట్లు
తమ్ము నిచ్చినవారు దా రనంతంబు – నిమ్మహి లేరన నిది నీకుఁ దగునె?
హరుఁడు భక్తులమనం బరయంగఁదలఁచి – యరుదైన వస్తువు లరుదెంచి వేఁడ
నరగలిగొన కిత్తు రట్ల భక్తులును – ధరఁబుట్టెనే భక్తి సిరియాలుతలనె?
కఱకంఠుఁడును వేఁడెఁగావున నిట్లు – **చిరుతొండఁడు**ను బెట్టె సీరాలు బాలు
నరయింపు నమ్మవే ధరణిలోపలను – గరమర్థి నూరూర **సిరియాలు** చరిత
మేటియై చను భక్తకూటువలందుఁ – బాటలుగాఁ గట్టి పాడెడువారుఁ
బ్రస్తుతోక్తుల గద్యపద్యకావ్యముల – విస్తారముగఁజేసి వినుతించువారు
నటుగాక సాంగభాషాంగక్రియాంగ – పటునాటకంబుల నటియించువారు
మునుమాడి వీరు వా రననేల కూడి – కనుఁగొన ఱోళ్ల రోఁకళ్లఁబాడెదరు
అనుమాన మొక్కింతయును లేదు దీని" – కనవిని కలుషించి యా **హలాయుధుఁడు**

**హలాయుధుఁడు, సిరియాలు కథ విని కోపించి శివునకును, సిరియాలునకును వెలివెట్టుట**

"అట్టెట్టు [2]వేఁడె నాహరుఁడు మాంసంబు; పెట్టె[3]నా చిఱుతొండసెట్టితనూజు?
భక్తవత్సలుఁడెట్లు భక్తుని మ్రింగె? – భక్తుఁడేనియు వెట్టు భక్తునిఁజంపె?
హరహరా! యట్టి దేవర యట్టి భక్తుఁ – డరుదగు లేదువో సరిసమానంబు
తల్లి రక్కసియైనఁదా నెట్లుబ్రదికె? – నల్లవో శివుఁడు దానవుఁడయ్యె నయ్య!
ముదిసి ముప్పున నింత మది[4]మరుల్వొంది – మదనారికిని ధృతిమాలంగఁదగునె?
కోమటి బుద్ధుల కోలాసఁ జేసి – కామించి సుతుఁజంపెఁగాక యెట్లన్న
ముట్టరు భక్తులు మున్ను మాంసంబుఁ – బెట్టుదురే తన్నుఁబెద్ద సేయుదురె?
అడిగెఁబో మనసు లోఁతరయఁదప్పెమి? – కొడుకుఁ జంపఁగఁ గత్తిఁగొన్న యంతటనె
మృడుఁడు జాణండేని మెచ్చంగవలదె? – కడుఁగడు మోహించెఁగాక పుత్త్రునకు
మఱి యట్లుగాక యచ్చిఱుతొండఁడరయ – నెఱవణిగల భక్తినిరతుఁడేనియును

1.జిఱుతొండ 2. వేఁడెనే 3. నే 4. మఱంబొంద.



[1]నోరవోఁజూచునే యొగిఁదన్నుడాఁచి – [2]యారఁబ్రాణంబున కాసించె నతఁడు
తమసుతుఁడైన జంగమమ కాఁడెట్లు? – సమయింపఁగూడునే శంక దాలేక!
పొరుగింటిచిచ్చైనఁదరికొనుఁగాని – దరికొనదే [3]యిట్లు దమయింటిచిచ్చు
వెలుపలిదుఃఖంబు వెలిఁబోయెననినఁ – బొలుపయ్యె నిట్లుండవలవదే భక్తి?
మృడునకు నరమాంసమేకాని యొందు – మెడకుఁబోదయ్యెనో మేలయ్యెననుచుఁ
దలర కీశ్వరుమీఁదఁదా నింతభక్తి – గలవాఁడు శాకపాకములు గావించి
యన్నీలగళునకుఁదన్నేల పెట్టఁ – డెన్నంగ నిది భక్తహింస గాదెట్లు
తనయుని నొప్పించెఁదన్ను వంచించె – ననుమాట [4]కోడి పుత్త్రు నపుడ పిలువఁ
బంచెఁగా "కప్పు దర్పించితిఁబిలువఁ – బంచుట యిది భక్తి [5]పాటిగా దింక"
ననియెనే చిఱుతొండఁడట్లునుగాక – చనుదెంచి యర్థించి చంపించినట్టి
మనసిజారియును మ్రింగనఁ(?) గొండియయ్యె – ననుమాట కంజిపుత్త్రుని నపు డుమిసెఁ
గాక త్రేన్పులు గఱ్ఱుగఱ్ఱున వెడలఁ – జేకొని యారగించెనె కడుపార
సెట్టికిఁగర్మంబుఁ దిట్టు దేవరకుఁ – గట్టిల్లె నింతియ[6]కాదె కావునను
భక్తుని మ్రింగిన పచ్చిరక్కసుఁడు – భక్తుని జంపఁ బాల్పడు సూనెగాఁడు
నిది యొక్క కథయుఁగా నిల రచియించి – చదువుమూఢులకు నసంఖ్యాతులకును
వెలియుఁజుండో" యని వ్రేసెఁ జేతాళ – మలుక రెట్టింపంగ నా **హలాయుధుఁడు**
అంత నత్యంత భయభ్రాంతిఁబొంది – యంత కారియు **సిరియాలుండు** నతని
యక్కజంబైనకోపాటోపదృష్టి – కొక్కింత గెలఁకుల [7]కోసరించుచును
నుల్లము ల్గలఁగ నొండొరుల మొగంబు – లల్లన చూచుచుఁ దలడిం[8]చుచును
నున్న యిద్దఱ **హలాయుధుఁడు** వీక్షించి – "మన్నింపఁదగు జంగమములుగా మిమ్ము
నిట క్రిందిమాటలకేఁదప్పువట్ట – నిటమీఁద **సిరియాలు** నీశ్వరువార్త
మఱచి యాడితిరేని మా భక్తు లెడకు – మఱి మీరు హరుని కోమటి తోడివార"
లనవుడు నుత్తరం బాడంగ వెఱచి – మనసిజారియును నుమాకాంతఁదలఁపఁ

**పార్వతి సంగళవ్వతో నేతెంచి తమ పతుల వెలిదీర్ప హలాయుధుని వేఁడుట**

బార్వతియును దాను భక్తియ౯ సుదతి – సర్వాంగములు దాల్చి చనుదెంచునట్లు
సంగళవ్వయుఁదానుఁజనుదేరఁగాంచి – జంగమాకృతిఁగని చని హలాయుధుఁడు

1. ఒరవోవఁ 2. యరయఁ 3. యిల్లు 4. కంజిపుత్త్రుని నప్డపిల్వ 5. పాడి 6. కావున, మఱియు 7. కోసరింపుచును 8. పు.

మ్రొక్కి తోడ్తెచ్చి సముచితక్రియాదు – లక్కజంబుగఁజేయ నంబిక యనియె
"నఖిలంబు నెఱుగంగ నజ జనార్దనుల – ముఖమున ఔమ్మున ముదిత లుండియును
వారక తమతమ వలచినవారిఁ – గోరి పోదురు వారి గుణమేమి సెప్పఁ
బొలుపొందఁగాఁదనపురుషునిగాని – కలనైన నెఱుఁగదు గౌరి దా నట్టి
పరమపతివ్రతాపరల మట్లయ్య – హరపాదభక్తినిరంతరాత్మలము
'ఒడలాదిగా హలాయుధుఁడు భక్తులకు – నడిగినవస్తువు లెడపక యిచ్చు'
ననుచు సద్భక్తసభాంతరంబులను – ఘనతరంబుగఁజెప్పఁగా విని యేము
వచ్చితి మట్ల మా వాంఛితార్థంబు – లిచ్చిదీవనఁ బొందవే హలాయుధుఁడ!
మహితశివాచారమార్గానుపాల! – సహజైకలింగనిష్ఠాపరతంత్ర!
విదితసద్భక్తి సంవిత్సుఖామాత్ర! – సదమలసర్వప్రసాదైకగాత్ర!
జంగమశృంగార! సత్యగంభీర! – లింగానువర్తి! యభంగురకీర్తి!
నెట్టణ శరణుండ! నిర్మలాంగుండ! – ధట్టుండ! మోక్షవిద్యాపండితుండ!"
అంచు నగ్గింపఁగా నా **హలాయుధుఁడు** – నంచిత ప్రీతి [1]దుల్కాడఁ గేల్మొగిచి
"వ్యక్తిమై భక్తులవరువుడఁబ్రస్తు – తోక్తుల కోర్తునే? యొడయ లిచ్చెదరు
మా భక్తు లతులసామర్థ్య లిట్లవిర – [2]తాభీష్టవస్తువు లడుగుఁడేమేని."
అనవుడుఁ [3]"**జిఱుతొండ**ఘనునాతియిదియ; ననఘ! యీశ్వరునియర్థాంగన నేను
బతి బాహ్యలైయున్న సతులేమిగొఱయు – బతు లేమిగొఱభక్తి బాహ్యలేనియును
గావునఁ దప్పులు వోవిడ్చి స్నేహ – భావన నతిదయాభావంబు దాల్చి
పతులకు నతులసద్భక్తి భిక్షంబుఁ – బ్రతిభమై మాకు సౌభాగ్యభిక్షంబుఁ
బెట్టవే?" యనుచు సంస్పృహభాతిఁగరుణ – వుట్ట నాశైలేంద్రపుత్రి వేఁడంగ
నటమున్న చిఱుతొండనతివయు మ్రొక్క – నిట హలాయుధుఁడును మహేశ్వరావలియు
హరునకు సెట్టికి నభయంబులొసఁగఁ – బరమాత్ముఁడజుఁడు శ్రీపార్వతీశ్వరుఁడు

**శివుఁడు ప్రత్యక్షమై హలాయుధు ననుగ్రహించుట**

కంతుసంహరుఁడు శ్రీకంఠుఁడుగ్రాక్షుఁ – డంతకుమున్న ప్రత్యక్షమై నిలువ
నలరుచుఁ బ్రమథరుద్రానేకకోట్లు – బలసి డగ్గఱి యిరుగెలఁకులఁగొలువ
వెనుకదిక్కునఁ**దిరువెంగాణి**నంగ – యును **సిరియాలుండు** [4]దనరఁగీర్తింప
ముందఱ నందంద మ్రొక్కుచు భక్త – సందోహ మచలితానందంబు నొంద

1. దొ 2. తాభీప్సితార్థంబు 3. సిరియాల 4. ననుగీర్తిసేయ.



దివిజదానవపద్మభవహరిముఖ్యు – లవికలావరణస్థులై ప్రశంసింప
సర్వసన్మునులు నాశీర్వాదనాద – పూర్వకంబుగ హస్తములు దలఁదాల్పఁ
దుంబురునారదాదులు ప్రీతిఁబాడఁ – బంబిన దేవతూర్యంబులు సెలఁగఁ
**గరికాల,సిరియాలచరితాది**కథలు – నరుదందఁబాతకు లంతంతఁజదువ
నటమున్న నిటలతటాక్షపదాబ్జ – ఘటితఫాలస్థల పటుదేహుఁడగుచు
జనితనేత్రానంద సలిలాభిషిక్త – వినుతవక్త్రాంబుజ విలసనుండగుచు
గద్గదప్రోద్భూత కంధరాంచిత స – ముద్గతస్తవన సంయుతదేహుఁడగుచు
సవినయ సంభ్రమ సంస్పృహానంద – వివశాంతరంగాది విభ్రముండగుచు
నున్న హలాయుధు నన్నీలగళుఁడగు – చెన్నొందఁ గౌఁగిటఁజేర్చి సంప్రీతి
నా హలాయుధునియుద్యద్భక్తిమతికి – సాహసంబునకు నసాధ్యనిష్ఠకును
మెచ్చె నచ్చెరువు నర్మిలి దొట్రుకొనఁగఁ – జెచ్చెర నతులిత శ్రీలింగమూర్తి
మెఱుఁగులఁగన్నులు మిఱుమిట్లువోవ – వఱలెఁడుకనక దివ్యవిమానపంక్తి
యవిరళంబై వెల్గ నతఁడు వాలించు – నవపురంబులు గూడ శివభక్తవితతి
నా హలాయుధుని యత్యద్భుతభక్తి – మాహాత్మ్యమలరార మహిజను ల్వొగడ
లాలితానందసల్లీల దలిర్పఁ – గైలాసమునకుఁజక్కనఁగొనిపోయె
సిరియాల దర్పాపహరణార్థముగను – హరుఁడిల మెఱయించె నా హలాయుధునిఁ
గావున నెందును గర్వోక్తిభక్తి – భావన కెక్కునే బసవకుమార !

**మిండనైనారు కథ**

మఱియును సద్భక్తిమహితమండనుఁడు – **మిఱుమిండనైనారు** మేదురకీర్తి
జంగమారాధనా శ్రాంతనితాంత – సంగతసుఖ విగతాంగవికారి
యతులశాపానుగ్రహ[1]సమగ్రకీర్తి – యతిశయశుద్ధశివైకమానసుఁడు
దుష్టజనోద్దండదోర్దళనుండు – శిష్టజనోత్కృష్ట శీలపాలనుఁడు
ధరణిఁ [2]జేగొండనా విరచింపఁబడ్డ – పురవరంబందు సుస్థిర భక్తియుక్తి
నెలనెల శివరాత్రి నీమంబు భక్తి – వలగొని పంద్రెండువర్షము ల్సలిపి
యిచ్చమైఁబదు[3]మూఁడవేఁటి యంత్యమున – వచ్చి **చెల్లంతిరువాలూర**ఁబరగు
వాల్మీకిదేవుని వాసంబునం ద – కల్మషభక్తి జాగరము సెల్లించి
పాపవిధ్వంసుని భక్తులుఁదాను – గోపురంబున నిష్టగోష్ఠి నున్నెడను

1. సమర్థమూర్తి 2. బెంగొండ 3. మూఁటియేఁటి.

## ఒడయనంబి వాల్మీక దేవుని గుడికి వచ్చుట

నరుదందఁగా నంబి పరమనాచమ్మ – వరగృహంబున నుండి వాల్మీకిదేవు
గుడికి నేతెంచునయ్యెడఁబురజనులు – గెడగూడి త న్నిరుగెలఁకులఁగొలువ
సంతసంబున గ్రంథక్రంతల [1]నిఱికి – యంతంత జనులు ఘేయని జయవెట్ట
గద్యపద్యాద్యనవద్యకావ్యములు – హృద్యంబుగా సత్కవీశ్వరు ల్వొగడఁ
బరిహాసకుఁ[2]ల్సేరఁబాఠకుల్ బట్లు – వరగుణాంకనలుగైవారము ల్సేయ
గాయకు ల్దాళము ల్గదియించి మ్రొక్కఁ – బాయక తాపసప్రభులు దీవింప
వసిగొని వారికి వాంఛితార్థంబు – లొసఁగుచు నంతంత మసలి నిల్చుచును
బదనఖకాంతి భూభామవక్షోజ – పదకరత్నప్రభాప్రఖ్యమై వెలుఁగ
రాజిత[3]భూషణప్రభలు దిగ్గజశి – రోజమౌక్తికములరుచి నుల్లసిల్ల
నతులదివ్యాంగదీధితు లుదయార్కు – నతిశయాత్మజ్యోతిగతిఁ[4]బ్రజ్వరిల్ల
స్థిరదశనద్యుతుల్ శృంగారలక్ష్మి – వరముఖముకుర భాస్వరలీల వెలుఁగ
వరదృజ్మరీచు లావాల్మీకిదేవు – చరణాబ్జరుచిరవిస్ఫురణఁబొల్వార
మకుటమాణిక్యాంశుమంజరు ల్సురగి – రి కలిత శేఖరాకృతిఁబ్రజ్వరిల్ల
వరవిటాకృతిఁ[5]బొల్చి హరు నిరవద్య – కరుణామృతాటోపకలితవారాశిఁ
దేలుచుఁ బసిఁడి బొందియకోల వట్టి – క్రాలుచుఁ గేరుచు సోలుచుఁగతులు
తడఁబడఁ ద్రొక్కుచు దండయిచ్చుచును – బడసిచూచుచు బయ [6]ల్వొడిచియాడుచును
సంగడికాంద్రను జప్పరించుచును – నంగ మెక్కంగ దిగంగఁజూచుచును
బొలఁతిభావము దలపోయుచు నాత్మ – విజయంబు మెఱయుచు విఱ్ఱవీఁగుచును
నెక్కుడువిటచేష్ట లేపార నెదిరి – లెక్క సేయక సుఖలీల నందంపు
సంబవు లిడుకొని సరసర నొడయ – నంబి సద్భక్తగణవ్రాతమునకు
మ్రొక్కక కరములు మోడ్ప కందంద – చిక్కక స్రుక్కక చక్కన వచ్చి
గుడిసొచ్చి తననిత్యపడి వేఁడికొనఁగ – మిడమిడమిడుకుచు మిఱుమిండఁడనియె

## ఒడయనంబిగర్వమునకు మిఱుమిండఁడు కుపితుఁడై వెలివెట్టుట

నోరి వీఁడెవ్వఁడు రా? రాజమౌళి – ధీరదిగ్గజములఁజీరికిఁగొనక
క్రొవ్వె! మా భక్తులకొలఁదెఱుంగండు – నవ్వాలుమీకేశుఁడడ్డమే తనకు
ఫాలాక్షుఁడలిగిన భక్తులు గావఁ – జాలుదు రట్టిద పోలగుఁగాక!

1. నిలిచి 2. ల్కేరఁ 3. భూషిత 4. దేజరిల్ల 5. దాల్చి 6. లొడసి. ల్దొడసి.



అతుల మహోద్ధతాయత మహాభక్త – తతి యల్గెనేఁగావఁదరమె యీశునకు?
కడుఁగడు గర్వియై కానఁడాతనిని – గుడివెడలింపుఁడు గూడదు చూడ"
ననవుడు విన్నవారాశ్చర్యమందఁ – జనుదెంచి యొక్కపూజారి గేల్మొగిచి
"దేవ! మున్నెఱుఁగవే? యీ వాలుమీక – దేవదేవుఁడ లసత్ప్రీతిదుల్కాడ
నచ్చెరువంద నీ యయ్యపాటలకు – మెచ్చియో భక్తికి మెచ్చియో యెఱుఁగఁ
బడి నిత్యవేమాడ లెడపక యిచ్చు – నడిగిన వెండియుఁగడపఁడేమియును
గొడుకని మన్నించుఁ గడుముద్దు సేయు – నెడవోవు లంజియయింటికిఁ దాన
యనురాగహేతు సర్వార్థసంపదలఁ – దనిపి నంబికి విటత్వంబు సెల్లించు
నిల విదూషకుభాతి నిరువురవలపు – లలర నన్యోన్యగుణాంకన ల్సేయుఁ
గ మర్థిఁ దాన నాగరకునట్లతని – సరసోచితాలాప సంపదఁదనుపు
ధరఁదాన పీఠమర్దకులీల నెల్ల – పరిచర్యలును బడిపనులును జేయు
నన్నియు ననవేల నమ్ముడువోయి – యున్నాఁడు శివుఁడు నం బెన్నకు" ననిన
"నీతఁడా నంబి? ము న్నితనికా శివుఁడు – ప్రీతితోఁబడివెట్టుఁ? బెద్దమేలయ్యె
నీతని బగితియు నితనికిఁగూర్చు – నాతనికూరిమిఁజూతఁడి"ట్లనుచు
"నంబియు గింబియు నంబికిఁగూర్చు – సంబుండు గింబుండు సకలభక్తులకు
వెలియుఁజుండో" యని వ్రేయించె ఘంట – నలిరేఁగి **మిఱుమిండనల్లనైనారు**
అట యున్నవారెల్ల నక్కజంబంద – "నిటయున్కి [1]పాటిగాదింక రం" డనుడు
ముఖమంటపంబున మును గొలువున్న – యఖిలభక్తులయాగ్రహంబు నాలించి
భయభక్తియుక్తియు భక్తైకదేహ – తయు నంబికెఱిఁగింపఁదలఁచి శంకరుఁడు

## వాల్మీకేశుఁడు సాకారుఁడై మిఱుమిండనికి వెఱచి యొడయనంబితో చాటుగాఁబాఱిపోవుట

నయ్యా! యనుడు నేమియయ్యా! యనెడుత – దియ్య(?) వాక్యంబు నజ్జియ్య యడంచి
గ్రక్కునఁజేసన్నఁ గదియంగఁబిలిచి – చక్కన సాకారసన్మూర్తిఁదాల్చి
వడవడవడఁకుచు వాల్మీకదేవుఁ – **దొడయనంబిని** దన పెడకచ్చఁ[2]జక్కఁ
బట్టించుకొనుచు సద్భక్తసమూహి – కట్టెదురఁజనంగ గడుభయమంది
చప్పుడు గాకుండ జలహారి దెసకు – నప్పుడ తొలఁగి యొయ్యన నడ్గులిడుచు

1. పాడి 2. జంకఁ

*మదుకుచు దీపముల్ మఱుఁగు వెట్టుచును – నొదుఁగుచు మూలల కోసరించుచును
గాలిసన్నడఁపుచుఁగరముల గోడ – ఆలూఁదికొనుచును ల్వాలించుకొన్చు
లాలిత నవపుష్పమాలావిలంబి – కీలనపంక్తుల క్రేవలఁదారి
[1]తలఁకున డెందంబు తటతట [2]నుదర – [3]నలఁగుచు గర్భగృహాంతంబు వెడలి
మెల్లనమెల్లన మెట్టుచుఁదొలఁగి – యల్లనల్లనఁదల్పులండకుఁ జేరి
సంగతి జాలక సమతులఁదొంగి – తొంగిచూచుచు నెడఁదొలఁగి నిల్చుచును
బోవకుండఁగ నోడి పోవంగనోడి – యావాలుమీకేశుఁడాత్మగలంగ
సందులు వ్రిదుల సంచలనంబు వొడల – సందడిదొఱఁగి పూజారుల మొఱఁగి
ఘనభక్త నిచయంబుఁగనుఁగొన వెఱచు – చనుగరాగ్రములు దృష్టులకడ్డమిడుచు
స్రుక్కుచు సరగున సొకనాసి వెడలి – చక్కనగుడి వెన్కదిక్కున కరిగి
యెగురుదురో(?) యని వగవంగ వెనుక – [4]మగిడి యాలించుచు బెగడుచుఁజనుచుఁ
జొక్కాకుగాలికి స్రుక్కుచునిక్కి – నిక్కిచూచుచు నలుదిక్కులరయుచుఁ
[5]జెంగి చెంగి చనుచుఁబొంగటి వంగి – వంగిపాఱుచుఁ దొంగితొంగి తాఱుచును
నటమున్న కలుకోట యందొక్కఱాయి – స్ఫుటపదాంగుళమున భువిఁబడనూఁకి
కడుభయంబున గండికను దూఱివెడలి – వడిగొని కుఱుజంగ నిడుజంగ [6]గునుకు
పరువు బాటయఁబెట్టి పఱవ ముందటను – ధరనొప్పి క్రోశ మాత్రంబున నొక్క
వరవిచిత్రోద్యానవన మున్నఁజూచి – యరుగక దిగ్భ్రమితాత్ముఁడై నిలిచి
"యూరోయిది యటంచు నూరుగా దురుత – రారణ్యమో యూరు నడవియుఁగాదు
హృద్యశాఖాతతి నిత్తరులొప్పు – నుద్యానవనముగా నోపు నీ వనము
గానిమ్మిదియు నూరుగాకున్నఁజాలుఁ – గాని ఘోరాటవియైన నుద్యాన
వనమైన ననుచు నల్లన వనాంతరము – చనఁజొచ్చి తొంటి తెర్వునకుఁదొలంగి
మూఁక చింతలవడి మోకమామిళ్ల – వాఁక నొప్పెడు సరోవరము నీక్షించి
పారిజాత వకుళ బంధూక కర్ణి – కార క్రముక కోవిదారముల్గడచి
చందన ఘనసార చంపకాశోక – మందార తరువుల కందువదాఁటి
యిమ్ముల మాదిఫలమ్ముల కురవ – కమ్ముల నారికేళమ్ముల క్రేవ
మాగధీ కరవీర మాలతీ కుంద – నాగకేసర వికీర్ణస్థలి నడుమ

*ఈ రెండు ద్విపదలు గొన్ని ప్రతులలో లేవు. 1. తలఁగు 2. నదర 3. నలుకును 4. మగుడి 5. జంగిచంగి 6. లిడుచు.



మల్లికా విద్రుమ మాధవీ ద్రాక్ష – వల్లరీవేల్లన సల్లీలఁదనరి
లలితతదీయ కిసలయ ప్రసూన – ఫలమంజరుల ప్రభఁబ్రజ్వరిల్లుచును
బంబి పున్నాగరంభాపరివేష్టి – తంబగు సంతానధరణీరుహంబు
పొడఁగని ముందట [1] గుడియకాఁదలఁచి – యదుగెత్త కతిసంశయాత్ముఁడై చూచి
యీ వనమధ్యమందిది యొక్కగుడియొ? – కావింపఁబడియున్న ఘనకల్పతరువొ?
ఈతరుశాఖల హేమకుంభములొ? – భాతి విద్రుమలతాప్రసవ మంజరులొ?
ఈ మంజరులలోన నిదిరత్నపంక్తి – యో మల్లికాతతియో! పుష్పతతియొ?
ఈ పుష్పపంక్తి మాకెనయుఁగాదనుచు – నేపారి యిట్లున్న యెలమి వేష్టించి
ప్రాకుగట్టినయట్టి మానంపుగుడియొ? – ప్రాకటపుష్ప విస్ఫార గుల్మములొ?
ఈ గుల్మమధ్య మహీజరాజునకు – బాగొందఁజల్లని పవనంబు నొసఁగఁ
జాలుపచ్చని పట్టునాలవట్టములొ? – క్రాలుచునున్నట్టి కదళీదళములొ?
ఈ కదళీదళానీకంబు సుట్టి – ప్రాకారములలీలఁబ్రజ్వరిల్లెడిని
వినుతికెక్కన కల్పవృక్షంబ యిదియు – ననుమాన మొక్కింతయును [2]వలదనుచు
శీతలంబై కడుఁజెన్నొందుచున్న – యాతరుచ్ఛాయ కట్లల్లన యేఁగి
భువి ని[3]పతితపుష్పములు గద్దెగాఁగ – శివుఁడు సుఖాసనాసీనుఁడై యంత
నెగయు నిట్టూర్పులు నిగుడఁగ ఱొమ్ము – నిగుడించుకొని నంబిమొగముఁజూచుచును
సంగతానన ఘర్మజలములు గరత – లాంగుళంబులఁబుచ్చి యవలవైచుచును
నలిఁగదళీదళచలన సంకలిత – మలయానిలమునకు మనసువెట్టుచును
నానావిధానేక నవపుష్పపరిమ – ళానూనవాసన కాత్మఁ[4]జొక్కుచును
ఘనసారచందనక్ష్మాజ సౌరభము – తనువు (పు?) సంగతికిడెందంబు నొగ్గుచును
బరిమళాహృత భృంగపక్షోపనిహతిఁ – దొరుగు పుప్పొడికిని శిరము సాఁపుచును
హిమకరశేఖరుఁడమృతాంగుఁడిట్లు – గమనోపతాపోపశమము వహింప
నొయ్యనొయ్యన నంబి కున్మదం బడఁగ – నయ్యెడ భక్తి భయం బాత్మఁదొడఁగ
"నయ్యా! ఇదేమయ్య! జియ్య! నీయట్టి – యయ్యకు నిట్టి భయం బాత్మఁదోఁచు
టింతవట్రిల్లు టిదే[5]మొకో?" యనిన – నంత వాల్మీకేశుఁడతని కిట్లనియె

**వాల్మీకేశుఁడు శివభక్తుల మహిమ నొడయనంబికిఁ జెప్పుట**

"నవికలవేద వేదాంతపురాణ – వివిధ శాస్త్రార్థ సంవిత్ప్రమాణముల
మాకును మద్భక్తమండలికిని వి – వేకింపఁగా నెద్ది వేఱుభేదంబు?

1. గుడిగాఁ దలంచి 2. వల్వదనుచు 3. నిపతితమైన పువ్వులగద్దె 4. జొన్పుచును 5. మకో?

భక్తులకేన చూ ప్రాణంబు నాకు – భక్తుల దేహంబు పరమార్థ మిదియు
మద్భక్తసేవయ మత్పాదసేవ – మద్భక్తదేహంబు మాదుదేహంబు
మద్భక్త వినుతియ మద్గుణవినుతి – మద్భక్తనిందయే మత్తత్త్వనింద
సన్నుతలీల మా జంగమావలిని – మన్నింపకున్నను మఱి నిష్ఫలంబు
శంభు పూజనముదా "[1]**స్థావరేనిష్ఫ – లం భవే**" త్తని శ్రుతు ల్చాటెడిఁ [2]గాదె!
భక్తైకదేహుండ భక్తవత్సలుఁడ – భక్తసత్ప్రాణుండ భక్తాశ్రితుండ
భక్తపరాధీనయుక్తుండ నటు – భక్తికేఁగూర్చుట ప్రఖ్యాతి గాదె

**బాణుని కథ**

ఎట్టన్న! వీరమాహేశ్వరభక్తి – నెట్టణ గలుగు వినిశ్చలాత్మకుఁడు
బాణుండు నాఁగ సద్భక్తిక్రియాధు – రీణుండు లింగమూర్తికి సాంగముగను
వేయుమాఱులు నిత్యవిధి నేమముగను – బాయక పూజలుసేయుచునుండ
దేహధర్మములకుఁదెఱపి లేకున్న – బాహుసహస్రంబు బాణున కిచ్చి
యది యొక్కమాఱు వేయవసరంబులను – సదమలభక్తిమైఁజలుపఁజేసినను
"**బాణునకు**ను మెచ్చి బాహుసహస్ర – మేణాంకధరుఁడిప్పుడిచ్చెఁదా" ననుచు
సందర్శనాసక్తిఁజనుదెంచుభక్త – సందోహశివకథాసంగతినుండ
"నటమున్న చేయులింగార్చనలకును – నిట యెడలేకున్న [3]నెట్లొకో" యనుచు
సడిసను లింగావసరములు సేసి – తొడఁగి ప్రసాదంబుఁగుడుచునంతకును
వారించి చొరనీక వాఁకిట నిలిచి – యేరికైనను [4]నేన యిల గోష్ఠి యిచ్చి
వాకిటి కాపులవాఁడనై యతని – వాకిలి గావనే లోక మెఱుంగ

**పిట్టవ్వ కథ**

వెండియు **నమ్ముదిగొండ** యన్పురిని – దండియై **కరికాలమండలేశ్వరుఁడు**
కావేరి గట్టింపఁగడఁగి యిల్లాది – వోవ 'నీకై యేను వోయెద' నంచుఁ
**బిట్టవ్వ** భక్తికిఁబ్రియపడి కాదె – వెట్టికిఁజనుటెల్ల విను మట్లుఁగాక

**కలికామదేవుని కథ**

నిత్యార్థమగు స్వామిభృత్యసంబంధ – కృత్యసద్భావనక్రియ దులుకాడ
నక్కటా! స్వామిదివ్యాంఘ్రికంజంబు – లొక్కింతయును గందునో యనకిట్లు

1. స్థావరం 2. గాన 3. నెట్లకో 4. నేఁగ నిల.



పంబిన మర్మమేలంబున **నొడయ – నంబి** యన్వాఁడు భయం బింత లేక
వెడపను ల్వంపఁగ వేశ్యయింటికిని – నెడయును బుచ్చంగ నిట్లెఱింగియును
వారక **యత్తిరువాలూర** భక్తు – లూరక చూచుచు నున్నారు గాని
తారొండె శివుఁబంపఁదగ దన్నవారు – గారొండె నంబికి వేఱొక్క (?) భృత్యుఁ
బనిపాటు సేయ నేర్పడ నియమింప – రననేల వేయును" ననుచు నుగ్రమునఁ
**గలికామదేవు**ఁడన్గణము నీ యూరు – దలఁచిన నీ వార్త దడవిన యపుడ
యెట్టిబల్లిదునైనఁబట్టి భంజింప – నట్టిచో నే నేఁగి య ట్లొడఁబఱచి
చక్కన నాతని సముఖంబునందు – నొక్కటిసేయనే యొం డిఁకనేల?
చేయొగ్గి మీ తాతచేత మా తాత – యాయతిచూపి ప్రాఁతప్పు గొన్నాఁడె
అడిగినప్పుడు నీకు నర్థమిచ్చుటయు – బడిపను లేమేనిఁ బాఱి సేయుటయు?
మిక్కిలి భక్తినిమిత్తంబు గాదె – యెక్కుడుగాఁగ నీ కేఁగూర్చుటెల్లఁ?
గావున మా భక్తగణములనడుమ – నీ వహంకారించి నిలువ నెవ్వఁడవు?
భ్రాంతి "**సంసర్గజాః పాపగుణా భ – వంతి**" యన్చదువు దా వసుధ నాకయ్యె
నీ కారణంబునఁగాక భక్తులకు – మాకును నొల్లమి మనసునఁగలదె?"
అని యిట్లు పెక్కు దృష్టాంతరంబులను – మనసిజహరుఁడు **నంబనకు**ఁ దెల్లముగ
భక్తుల మహిమయు భక్తుల ఘనత – భక్తుల నడవళ్లుఁ బాటించి తెలిపి
నయమును నధికవినయమును భక్తి – భయమును దత్త్వనిర్ణయము సంధించి
ప్రథితజంగమమహాభక్తస్థలంబు – పథముఁజూపుడుఁజాఁగఁబడి మ్రొక్కి నంబి
"సద్గురుమూర్తి! జగద్గీతకీర్తి ! – హృద్గతంబైయున్న మద్గర్వమడఁచి
సద్గతిఁజూపి నీ జంగమభక్తి – తద్గతుఁజేసితి ధన్యుండ నైతి
నరిగి దైన్యముఁజూపి యభయంబు వేఁడి – శరణని ప్రార్థించి సంస్తుతుల్ సేసి
యడుగులఁబడి బంటనై యాడిపాడి – పడయుదు నెట్లైన భక్తులకరుణఁ
జూడుమా! యింక నీ సుతుభక్తి" యనుచు – నాడాడ భక్తాళి కభిముఖుండగుచు
నందంద బారెంట నంత మూరెంట – నందుండి ధరణి సాష్టాంగంబు లిడుచు
దాళముల్ గ్రంగన ధ్వనియించి మ్రొక్కి – వేళానుకూలవిలోలరాగములఁ
బరగు మహాభక్తచరితలు నాద – భరితమై చనఁదిరుపాటలు సేసి
పాడుచు నొక్కొక్క భక్తునిచరిత – వేడుకఁబొగడు నవ్విధ మెట్టులనిన

## ఏణుమూర్తి నైనారు కథ

లీలమ్రైదన ప్రాణలింగంబునకుండ్రి – కాలంబునందును మేలిచందనము
ననురక్తి నియతిగా నర్పింపుచుండ – ధనమెల్లఁజందనంబునకు సమయుడుఁ
గడులేమి వుట్టిన గంధ మెబ్బంగి – గడియింపఁజాల కయ్యేడ నిర్ణయించి
[1]తలఁపఁగ నేల దాఁగలిమియు భక్తి – కలిమిగా కర్థంబు కలిమియే కలిమి
నా మనంబునఁదెంపు లేమియే భక్తి – లేమిగా కర్థంబు లేమియే లేమి
తనువుండ మనసుండఁదల్లడం బంద – నను మెచ్చునే ప్రాణనాథుఁడీశుండు
తనువెల్లఁగూడ గంధముగాఁగఁదిగిచి – యనుష(ర)క్తి నిత్యంబు నర్పింతు నింక
నెత్తురు వెడలిన నిగ్గు దేరినను – నిత్తఱిఁదనుగుణం బింతసూపినను
మెఱుఁగు లేవడియైన మించు సడలిన – నెఱిఁజందనమునకుఁగొఱఁత దోఁచినను
జాయ దప్పిన నెఱి సామాన్యమైనఁ – బూయుచో [2] నురలినఁబొలుపు [3]గందినను
గంపొందు వలచినఁగడలు గట్టినను – గెంపు దక్కువయైనఁగ్రియ వెల్తియైనఁ
దనుపు లేకున్నఁ బూఁతకు రాకయున్న – నునుపు గాకున్న వాసనకుఁదేకున్న
మఱి కదా శివునకు మాకు నంకంబు – అఱిముఱితనమిప్పు డదియే!" యనుచు
ముదమున వలపలిమోఁచేయి సానఁ – గదియించి తిగిచి శ్రీగంధంబు వడసి
శివున కర్పించి భజించి మెప్పించి – భువి నరుల్ సూడఁజూడ విమానమెక్కి
మృడుపురంబునకు నప్పుడు బొందితోడ – నడచిన యేణుమూర్తినయనారిబంట

## కడమలనంబి కథ

ప్రాణలింగమునకుఁబ్రతిదినంబునను – జాణత వెలయ నిజవ్రతంబుగను
గడు నర్థితోడ నఖండదీపంబు – లెడపక నిత్య వేయేసి ముట్టింప
నదియ నిమిత్తమై యర్థంబు సమయ – మదిలోన నొక్కనుమానంబు లేక
"తనువు దక్కంగ నర్థంబెల్ల సమసెఁ – దనువు నివేదించు తఱి యయ్యె నింకఁ
దలయును మేనును దరికొల్పి పెద్ద – వెలుఁగు వెట్టెద" నంచు వెంద్రుకల్ విచ్చి
జ్వలనంబునకుఁబట్టి శంభు మెప్పించి – వెలసిన యా కడమలనంబిబంట

## గుగ్గలుకళయారు కథ

ఆసక్తిమై మహిసాక్షి ధూపంబు – బాసగా వెండియుఁబ్రాణేశ్వరునకు
నేఁడునాఁడనకుండ నిత్యనేమముగ – మూఁడుసంధ్యల ధూపముగ సమర్పింప

1. తలఁకఁగ 2. నురివి 3. దప్పినను



నాలిమంగళసూత్ర మది యాదిగాఁగ – లీల నర్థంబు సెల్లించునత్తఱిని
[1]దిరుపరంధామమం దురగేశ్వరేశుఁ – దురగకన్యక లతిస్ఫురణమ్రైబాడ
సోలి ముందటి కింత వ్రాలుడు ధరణి – పాలుఁడు మును పెక్కుపాయంబులందుఁ
జక్కొల్పఁ జాలక సంచలింపంగ – నక్కడి కేఁగి యత్యర్థిఁదుల్కాడ
"వలసినయంత గుగ్గిలము నాకిందు – నిలిపెదఁజక్కఁగా నిటలాక్షు" ననుడు
మహినొక్క వ్రోఁకగా మహిసాక్షివోసి – మహిపతి యొప్పించి మహిఁజాఁగిమ్రొక్కి
యలరుచుఁగైకొని యఖిలంబునెఱుఁగ – బలువుగానొకపటు(ట?) వలి[2]చించియొక్క
దిక్కీశుతోడ సంధించి వేఱొక్క – దిక్కు శస్త్రంబుతోఁ దిగిచి బంధించి
గ్రక్కున శస్త్రంబుఁ గంఠంబునందు – నెక్కొల్పి వెనుకకు [3]నిగుడంగఁదడవ
యెప్పటియట్ల నాగేశుండు నిలిచి – యప్పుడు ప్రత్యక్షమై కరుణింప
నలి దీటుకొన నపునర్భవలీల – వెలసిన గుగ్గలుకళియారిబంట

## అరివాళు నయనారి కథ

లీల వెండియుఁదన లింగంబునకుఁద్రి – కాలంబు నియమంబుగా రాజనంబు
ప్రాలోగిరము సమర్పణసేసి తాను – నాలింగ[4]లీనమై యట్లువర్తింపఁ
దమ మొల్లమంతయుఁ దత్కారణమున – సమయుదు నొందుపాయము లేమిఁజేసి
కొడవలి గడియించికొనుచుఁగైకూలి – వడి రాజసములకు నొడఁబాటు చేసి
పట్టిననియమంబు [5]వ్రతి వాల్చుచుండ – నట్టిచోఁగూలియుఁబుట్టకయున్న
[6]నిట్టుపవాస మేన్దినము లుండంగ – నెట్టకేలకు బియ్య మిరుస గల్గినను
సరసరఁగొనివచ్చు సంభ్రమంబునను – ధరఁదాఁకి పడి[7]న నెత్తఁగ రాక ప్రాలు
[8]నెరియలపాలైనఁ"బురహర! నీకుఁ – గరమర్థి నర్పింపఁగా నేఁగుదెంచు
నత్తఱి విచ్ఛిన్నమయ్యె నేనింకఁ – జత్తునకా" కంచుసంశయం బుడిగి
పెడకచ్చకొడవలి మెడఁబెట్టి మూఁపు – తడుపంట సంధించి తన్నుంగఁదడవ
పరమేశ్వరుం డట్టి బాసకు మెచ్చి – ధరణిఁ బ్రసన్నుఁడై కరుణఁజూచుదును
బరమపునర్భవప్రాప్తుఁడై యున్న – **యరివాళు నయనారి** కనుఁగు భృత్యుండ

## అడిభర్తుని కథ

మఱియును నప్పాండ్యమండలంబునను – మఱియొందు గాయకం బెఱుఁగమిఁ జేసి

1. దిరువరందామయం 2. చిందె(ది)నొక్క 3. నీల్గంగఁ 4. లింగియై 5. ప్రతిపాల్చు 6. నిట్టుపవాస 7. బియ్యము రివెత్తరాక 8. సరియల.

వలయెత్తి నీటిలో [1] వైవంగఁదడవ – వలఁదొల్త వచ్చిన వలుఁదమత్స్యంబు
నదియు 'శివప్రీతి' యనిపోవ విడుచు – నిదియ నేమముగాఁగ నితరమత్స్యముల
నంగడిఁ బోకార్చి యందుల లబ్ధి – జంగమారాధనల్ సలుపుచు లీలఁ
జరియింప దినములు సనఁగ వేఁటయును – బరికింప నేనాళ్లువాఱమి డస్సి
వలఁగొని మఱునాఁడు [2]వైవంగఁదొలుత – వలనుగా నందు సువర్ణమత్స్యంబు
వచ్చిన నదియు 'శివప్రీతి' యనుచు – నచ్చోన పోవిడ్చి యవలవైచుడును
నమ్మీన వచ్చుడు నారేవు విడిచి – యెమ్మెయి వలవైవ నెప్పటి మీన
తగులంగ విడువంగఁదగులంగఁ విడువఁ – బగలెల్ల నమ్మీన పట్టువడంగ
"నాత్మేశునకుఁబ్రియంబన్న మత్స్యంబు – నాత్మార్థమై[3]కొను టనుచితం"బనుచు
నింటికి నేతెంచి యిట రాత్రి వుచ్చి – తొంటి యేటికిఁబోక తూర్పు దీర్ఘికను
వల యెత్తివైచుడుఁదొలినాఁటిమీన – మలరుచు వచ్చుడు నట్ల పోవిడిచి
మఱి వైవ నమ్మీన మసలి వచ్చుడును – జిఱునవ్వు నవ్వుచు "శివునిమత్స్యంబు
నేడ చూచినదాన యీ యేట[4]వైవ – నాడ [5]యీశ్వరు మీన మరుదెంచెనేని
వలఁజేతఁబట్ట నా వ్రత మిదియనుచు – వలయెత్తి యూఁకించి వైచి తివ్వుడును
వలతోన తొడిఁబడి వచ్చి ముక్కన్ను – నలిఁ జతుర్భుజములు నందివాహనము
నమరంగ శివుఁడు ప్రత్యక్షమై నిలిచి – ప్రమథేంద్రపదవి యారంగ నిచ్చుడును
నా నిరంతరపరమానందసుఖము – లానుచునున్నట్టి యడిభర్తబంట

### ఏణాధినాథుని కథ

అనయంబు భూతిరుద్రాక్షధారణులఁ – దన ప్రాణలింగభావన విశ్వసించు
నిదియ నేమముగాఁగ **నేలాపురమున** – సదమలలీల రాజ్యంబుఁజేయుచును
నొడఁబడ గెలిపించె నొడినవీటఁ – బడి భరం బేఁగి కప్పంబులు గొనుచు
నవనీశులకు నెల్ల నక్కుఁగొట్టిగుచు – భువిఁబ్రవర్తింప నబ్భూపతు లొక్క
దళవాయి శాసనధారిఁగావించి – బలసహితంబుగాఁబనుపఁగఁదడవ
తన తంత్రమును దానుఁ జనుదెంచి తాఁకి – యనిసేయు భూతిరుద్రాక్షధారణునియుఁ
గని 'శివ శివ' యంచుఁగరవాలువైచి – చనుదెంచి భువిఁజక్కఁజాఁగిలిమ్రొక్క
'నెటువోదుపో'మ్మంచు[6]నటయేఁగుదెంచి – స్ఫుటశక్తిఁగరవాలుఁబూఁచి[7] వైచుట

1 2. వయ్యంగఁ 3. కొనుడను; కొననను 4. నేయ, వయ్య? 5. నీ 6. నతఁడేగు 7. వ్రేయుడును.



'దాలింగ' మనిమ్రొక్కఁదన కంఠమందు – వాలంబు మున్నువూమాలగాఁజేసి
యక్షరుం డపుడు ప్రత్యక్షమై నిలిచి – యక్షరత్వంబు దయామతి నొసఁగ
క్షోణి లసత్కీర్తిఁగొఱలినయట్టి – యేణాధినాథుని యిలుపుట్టుబంట

### చేదివల్లభుని కథ

అట్టు విభూతిరుద్రాక్షధారులను – నెట్టును శివుఁడనియెడిభక్తియుక్తిఁ
జరియించుచుండంగఁబరరాష్ట్రపతులు – దురమునఁదనచేత విరథులై పాఱి
రుద్రభక్తులభాతి రూఢిగాఁబంచ – ముద్రధారులఁబదుమువ్వరఁజేసి
పనుచుడుఁగపటలాంఛనధారు లపుడు – చనుదేరనతిభక్తి వినమితుం డగుచు
దారు [1]ణాంచితనిశాతక్రూరశస్త్ర – ధారల [2]జర్జరితంబు సేయంగఁ
బరికించియు నితరభావంబు లేక – గురురూపకాఁగఁగైకొని మ్రొక్క నపుడ
ప్రత్యక్షమై నిల్చి పార్వతీనాథుఁ – డత్యుత్తమంబు నిత్యత్వంబు నొసఁగ
నల్లలితోన్నతిఁజనిన విముక్తి – వల్లభుఁడగు చేదివల్లభుబంట

### కరయూరిచోడని కథ

సంగతంబుగ నట్ల శాసనధరుల – భంగిగాఁదన ప్రాణలింగంబ యనుచుఁ
బరమవిశ్వాస సద్భక్తిభావమునఁ – బరగుచో నన్యభూపతులపై దండు
వుచ్చుడు ముప్పదివొణకల తలలు – నచ్చెరువుగఁగొట్టి తెచ్చుచో నందు
నెత్తుట నొకదల జొత్తిల్లి బిగిసి – యత్తఱి జడతల యనుపోల్కి నున్నఁ
గనుఁగొని 'హరహరా!' యని తత్ క్షణంబ – తనతలఁదఱిగి యత్తలమీఁదఁబెట్ట
నంతటిలోనఁబ్రత్యక్షమై నిల్చి – కంతుసంహరుఁడు మోక్షము గరుణింప
మును జడతల కిచ్చె ముడితల యనఁగఁ – జను కరయూరిచోడని బంటుబంట

### కళియంబనైనారు కథ

పనిసేయ నోపక బానిసకొడుకు – చని లింగధారియై చనుదేరఁదడవ
బానిసకొడు కనుభావంబు లేక – తా నీశుఁడనుచుఁబాదంబులు గడుగ
"మన సిరియక[3]కొడ్కుమల్లండు వీనిఁ – గనుఁగొనవే కాళ్లు గడిగెద!" వనుచుఁ
జులుకఁగాఁ బూర్వంబుఁ దలఁచి పల్కుచును – బొలఁతి జలంబులు వోయకున్నంత
"నాలినేసితి గదా హరమూర్తి" ననుచు – నాలి చేతులు రెండు నప్పుడ నఱకి
మలహరుకారుణ్యనిలయుఁడైనట్టి – **కళియంబనైనారి**గాదిలిబంట

1. దాఁచిన 2. దనువు జర్జరితంబుసేయ (?) 3. కన్న.

## ఇరువదాండారి కథ

జంగమలింగభాస్వద్భక్తి యుక్తి – సంగతిదినములు [1]జరపుచునుండ
నంతకాంతకుఁడు భక్తాకృతి వచ్చి – బొంతయుఁగచ్చడంబును దాఁప నిచ్చి
యంత నప్పుడ యదృశ్యము సేసి పిదప – బొంతయుఁగచ్చడంబును వేఁడఁదడవ
చెచ్చెరఁదనదాఁచి నచ్చోట వెదకి – యెచ్చోటఁగానక “యెత్తున కెత్తు
ననఘ! మీ కిచ్చెద” నని తులాయష్టిఁ – దనర [2]వేఱొకబొంతయును గచ్చడంబు
నొక్కదిక్కునఁబెట్టి యున్న దిక్కునను – బెక్కువస్త్రంబులు నెక్కొల్పి తూఁప
సమము గాకుండినఁదమయింటఁగలుగు – నమితాంబరంబులు నర్థంబుఁదాను
వచ్చి యత్తుల యెక్క వరదుఁడక్షణమ – మెచ్చి యా ప్రమథత్వ మిచ్చుడు ధరణిఁ
బాండురాంగునిభక్తిఁబరగిన **యిర్వ – దాండారి** కనుగులంబైన భృత్యుండ

## దంగుళి మారయ్య కథ

జంగమార్థంబకా సకలార్థములును – భంగిగాఁజలుపుచుఁ[3]బరగుదుర్దశను
నడవంగ శివుఁడొకనాఁడు వర్షమునఁ – దడియుచు నర్ధరాత్రం బేఁగుదేర
‘వరతపోధనమూర్తి వడఁకెడు’ ననుచు – వరుసతోఁదనపాక వ్రచ్చి కాల్పంగ
‘నాఁకొంటి’ ననవుడు నట తొలునాఁడు – వీఁకతో నలికినవిత్తులు నీళ్ల
[4]విదళించికొని తెచ్చి వేఁపి దంపించి – సుదతియుఁదాను నుత్సుకలీలతోడఁ
బాకయత్నము సేసి భక్తి వడ్డించి – శ్రీకంఠు నపుడ మెచ్చించి విముక్తి
సంగతి సుఖలీలఁజనినట్టి **యెళయ – దంగుళిమారయ్య** [5]లెంగిలిబంట

## గణపాలుని కథ

భవి నొక్కరునిఁదన భువి నుండనీక – శివసహితులఁజేయుఁజేకొనకున్న
వేదార్థములు దెల్పి యాదిఁజూపియును – గాదన్న దృష్టసంపాదనఁజూపి
యడిగిన [6] నెంతర్థమైనను నిచ్చి – యొడఁబఱుపంగ సర్వోపాయములను
గఱకంఠుభక్తుండు గానొల్లకున్న – మఱి చంపునదియె నేమముగ వర్తింపఁ
బరమేశ్వరుఁడు దన బాసలోఁతరయ – నరుదెంచి [7]వెలమఁద్దై“యరి యప్పనంబు
[8]గానుక గట్నంబుఁగడఁగి సుంకంబు – పూనిక వెట్టియుఁబొరి [9] నెన్నుఁబన్ను
[10]నరువ నేమియుఁదన్ను నల[11]జడి వెట్ట – ధరణీశ తగ” దంచుఁదా మొఱలిడఁగ

1.సలుపుచు 2. రెండొక 3. బరమహర్షమున 4. విదలిం 5. లెంగుల 6. నెంతైన నర్థంబులిచ్చి 7. వెలువఁ (మఁ)ద్దై? 8. గానిక 9. న 10. నరయి 11. మట.



“వాకిటికాఁపులవారల మొఱఁగి – యోకాఁప! నీ వెట్లొకో వచ్చి తిపుడు
సర్వమాన్యము నీకు గుర్వుగా నిత్తు – శర్వుభక్తుండవై చరియింపు” మనుడుఁ
“దనకు [1]నొమ్మదుభక్తి తన వంశమందు – మునుభక్తు [2]లెవ్వరుమనరిట్టు” లనుడు
“మనుపఁగ మాపూఁట మఱియట్లుఁగాక – ధన మిత్తు మన మిత్తుఁదన రాజ్యమిత్తు
నొడఁబడు” మనుడు సర్వోపాయములను – నొడఁబడకున్న మహోగ్రతతోడ
జళిపించి యసమనిశాతఖడ్గమునఁ – దల ద్రెవ్వ వ్రేయుచోఁదత్క్షణమాత్ర
హరుఁడు ప్రత్యక్షమై ‘యడుగడ్గు’ మన్న – “వరమూర్తి! నీ యిచ్చువరము లేనొల్ల
నంగద భక్తుండవగు” మంచు శివుని – లింగసహితుఁజేసి లీలమైఁబ్రమథ
గణవంద్యు సద్భక్తిగతిఁజూపి ప్రమథ – గణమూర్తియై యున్న **గణపాలు**బంట.

## కుమ్మర గుండయ్యగారి కథ

పరగిన[3] యప్పెనుపట్టపులూరఁ – దిరునీలకంఠ దేవరగుడి కేఁగి
యొక్కనాఁడేతెంచుచున్నెడ రాత్రి – గ్రక్కునఁ జీకటిఁ గానంగలేక
వెలఁది యొక్కతె హర్మ్యతలమున నుండి – యిల నెత్తి చల్లుచో నెంగిలినీరు
పైనిండ “హరహరా! ప్రాణేశ” యనుడు – మానిని యేతెంచి మహిఁజాఁగి మ్రొక్కి
యట తోడుకొనిపోయి యభ్యంజనాది – పటుతర సత్క్రియా పరిపూర్ణుఁజేసి
క్షమఁగొని యనుచుడుఁజనుదేర[4]ఁ దడవ – రమణి“వారాంగనార్థము సిక్కి” తనుచుఁ
గట్టుగ్రమునఁబతిఁగవయకున్నెడను – “అట్టేల డాయ ర” మ్మని కొంగువట్టి
తరళాక్షిఁదిగిచిన “దన్ను ముట్టినను – దిరునీలకంఠ దేవరయాన” యనుడు
నాసతి నంటక యట్లకాకనుచు – బాసతోడన యెను(ఁ?) బదియేండ్లు సలుప
నప్పరముఁడు భక్తుఁడై వచ్చి యొక్క – గప్పెర నేనిచ్చి క్రమ్మఱవచ్చి
యట్ల కప్పెర యదృశ్యము సేసి యడుగ – నెట్లును గానక యింతియుఁబతియు
వడవడ వడఁకుడు వరతపోమూర్తి – “వెడమాటలను బోను వేయేల నమ్మఁ
గప్పెర[5]గొనకున్న గాంతయుఁబతియుఁ – జెప్పిన శపథంబు సేయుఁడు వచ్చి(డటంచు?)”
కుంభిని జనులెల్లఁగూడి చూడంగ – గంభీరజలములఁగామినిఁబతిని
దండి గుండముముంపఁ దత్క్షణమాత్ర – మిండప్రాయంబులై మీఁదికి నెగయ
నటమున్న ప్రత్యక్షమై ధరనిల్చి – నిటలాక్షుఁడతిదయాన్వీతభావమున
నెప్పటట్టుల భువి నెను(ఁ?)బదియేండ్లు – నొప్పార సుఖలీల నునుప మీఁదటను
మండితానంద ప్రమథ వైభవమున – నిండారు **కుమ్మరగుండయ్య**బంట.

1.నోవదు, వోవదు 2.లెన్నఁడు 3.యప్పె(గుహిప్పరిగె), యన్-టూర 4.నిచట 5. గొనిరండు

## పూసల నయనారు కథ

రూఢిగా విక్రమచోడఁడు ధరణిఁ – గూడఁగఁబసిఁడిని గుడి నియోగించి
లింగప్రతిష్ఠ సల్లీలఁజేయంగ – మంగళంబలరార మానసంబునను
దానును రత్నవిమానమయంబు – గా నొక్క గుడిగట్టి కాలకంధరుని
నాసక్తి మెప్పించి యరిగినయట్టి – పూసలనయనారి దాసానుదాసి

## మఱికొందఱ కథలు

ధర రాజ్యమొల్లక తిరుముడి దాల్చి – పరము నమ్మిన **తిరుపాలు**ని బంటఁ
**దిరునావకపురీశు**కరుణఁబ్రాణేశు – నిరవెర్గి కొల్చినతిరు[1]కుర్విబంట
ధర రోహిణియుఁదాను హరుకృపఁజనిన – **తిరుపూరి** [2]**తిరుమూలదేవు**నిబంట
ననయంబు భక్తసహస్రార్చలందుఁ – జెనసి ముక్తికిఁజను[3]**చిఱుపులి**బంటఁ
బడినిత్య మొకమాడ భర్గుచేఁగొనుచు – నడరుచిఱుత్తొ(త్తు)ణయని బంటుబంటఁ
జన్న పురాతనశరణులబంట – నున్ననూతన భక్తయూథంబుబంట
నిటమీఁద శివుఁగొల్చి యీప్సితార్థములు – పటుతరంబుగఁగాంచు భక్తులబంట
ననుచు భక్తులచరిత్రాంకన లిట్టు – లనురక్తిఁదిరుపాట లమరఁబాడుచును
వింతవేడుక వుట్ట వినుతి సేయుచును – నంతంతఁజాఁగి సాష్టాంగంబు లిడుచు
మ్రొక్కుచుఁగరములు మోడ్చుచు“మీరె – దిక్కునుదెసయును దేవ!” మాకనుచు
“[4]మీబంట మీ దూత మీ డింగరీఁడ – మీ బిడ్డ మీ పన్న మీ లెంకవాఁడ
మీ దత్తి [5]మీ ప్రాఁత మీ ధర్మకవిలె – మీ దాసి ననుఁగావరే దయతోడ”
ననుచు **నంబన్న** భక్తావలిఁజేర – వెనుక నంతంత నవ్విభుఁడేఁగుదేర
నభయార్థి యగు**నంబి** నట్ల కైకొనుచు – నభవున కెదురేఁగి యందఱు మ్రొక్క
**మిఱుమిండనయనారు** మెఱవణి మెచ్చి – కఱకంఠుఁడాభక్తగణసహితంబు
కైలాసవాసులఁగాఁజేసె; **నంబి** – భూలోకమునను సల్లీలతో నునిచెఁ
గావున భక్తుఁడు గర్వింప భక్తి – భావన కెక్కునే **బసవకుమార!**”
అని యిట్లు **మాచయ్య** యతిభక్తియుక్తిఁ – జనిన సద్భక్తుల చరితము ల్దెలిపి
బుద్ధులు నీతులుఁబోలంగఁ జెప్పి – పెద్దైన గర్వంబుపెల్లు మాయించి
మెఱుఁగులఁగన్నులు మిఱుమిట్లువోవ – వఱలెడు రత్నపర్వతము లత్యర్థి

1. కుర్వి; నెఱిఁగికొల్చిన తిరుకురుబులి 2. తిరువూరి 3. చిఱువురి 4. మీ దూత మీ బంట మీ డింగరీఁడ 1 మీదయలోవాఁడ మీ ప్రాఁతవాఁడ 5. మీ పన్న.



నా జంగమంబున కర్పించి **బసవ – రాజు** వీడ్కొలుప నిరంతరభక్తి
**నబ్బసవండు** పాదాక్రాంతుఁ డగుచు – నుబ్బుచు భక్తాలియును దాను నరిగె
నప్పొరు లెల్ల సాష్టాంగులై మ్రొక్కి – “తప్పదు దేవర దా నీతఁ”డనుచుఁ
గరములు నిజమస్తకంబులఁదాల్చి – యరిగిరి ధారుణీశ్వరుఁడును దారు
మహిఁదొంటియట్టుల **మాచయ్య**భక్తి – మహిమమైఁద్రిభువనమాన్యుఁడై యుండె
**మడివాలు మాచయ్య** మహనీయచరిత – మదరంగఁజదివిన నర్థిమై విన్న
హరుభక్తి బుద్ధి దృష్టాదృష్టసిద్ధి – సరసవచశ్శుద్ధి సంపద లొందు
గురుభక్తివిస్తార! గురుభక్తిసార! – గురుభక్తిపరతంత్ర! గురుభక్తితంత్ర!
జంగమసుఖకృత్య! జంగమభృత్య! – జంగమహితచర్య! జంగమధుర్య!
లింగార్చనాసక్త! లింగసద్భక్త! – లింగలీన! ప్రాణలింగధురీణ!
సత్ప్రసాదాపాంగ! సత్ప్రసాదాంగ – సత్ప్రసాదపరీక్ష! సత్ప్రసాదాక్ష
సర్వస్థలైకభాస్వద్భక్తిసౌఖ్య! – సర్వస్థలైకభాస్వర సంగనాఖ్య!
ఇదియసంఖ్యాత మాహేశ్వరదివ్య – పదపద్మసౌరభభ్రమరాయమాణ
జంగమలింగ ప్రసాదాపభోగ – సంగత సుఖసుధాశరధినిమగ్న
సుకృతాత్మ **పాలకురికి సోమనాథ** – సుకవిప్రణీతమై కవిత్వస్ఫూర్తిఁబేర్చి
చను **బసవపురాణ** మను కథయందు – ననుపమంబుగఁజతుర్థాశ్వాస మయ్యె.

* * *

# పంచమాశ్వాసము

## కిన్నర బ్రహ్మయ్య కథ

శ్రీకర! భక్తిరత్నాకర! దోష – భీకర! విమలగుణాకర! సంగ!
ఇమ్మహి వెండియు నీశ్వరభక్తుఁ – డిమ్ములఁ**గిన్నర**[1] **బమ్మయ**నాఁగ
వీరవ్రతైకనిష్ఠారమణుండు – సార [2]శివాచార పారాయణుండు
లోకైకపూజ్యుఁడ లోకానుసారి – యేకాంతభక్తి మహిష్ఠ మండనుఁడు
నఘటితనాద విద్యాపండితుండు – నఘవినాశన కారణావతారుండు
విదితకారుణ్య సముదితానురాగ – హృదయుండు సర్వజీవదయాపరుండు
సల్లలితుం డన శరణమార్గమున  – కెల్లయై భక్తిమహిష్ఠతఁబరగి
భక్తులకును వర్వుఁబనులు సేయుచును – వ్యక్తిగాఁ[3]**బొండూర** యుక్తిపెంపునను
గాయకంబులు వెక్కు గఱచుటఁజేసి – వేయువిధంబుల విత్త మార్జించి
నిర్వంచకస్థితి శర్వభక్తులకు – సర్వధనంబులు సమయంగ నంతఁ
గ్రీడార్థమై మఱి కిన్నరవీణ – వేడుక నొకనాఁడు వినిపింపఁదడవ
కిన్నరేశ్వరవంద్యుఁడన్నారదాది – సన్నుతనాదానుషక్తుండు మెచ్చి
పరగంగఁ**గిన్నరబ్రహ్మయ్య** నాఁగ – ధరణిఁబేరిచ్చి నిత్యముఁబడిగాఁగ
నొక్క మాడయురూకయును బాతికయును – మక్కువఁ గరుణింప మహినరుల్వొగడఁ
జేకొని జంగమానీకంబునకు స – దాకాలమును నర్పితము సేయుచుండ

## కిన్నర బ్రహ్మయ బసవనియొద్దకుఁబోవుట

బసవని యసమ[4]సద్భక్తి సౌరభము – వసుధపై వెల్లివిరిసి దెసల్గప్ప
రాగిల్లి **కిన్నరబ్రహ్మయ్య** సనియె – వేగంబె బసవని వీక్షించువేడ్క
బసవఁడు **గిన్నరబ్రహ్మయ్య**రాక  – యెసకంబుతో సంగమేశ్వరునంద
కని యెదురేఁగి చక్కన చాఁగి మ్రొక్కి – యనునయోచిత సత్క్రియాదులఁదనిపె
గరమొగ్గి పాదోదకప్రసాదములు – నిరతిశయప్రీతి నిత్యంబుఁగొనుచు
సవిశేషతత్త్వానుభవభవ్యగోష్ఠిఁ – దవులుచు బసవఁడుత్సవలీల నుండ

1. బ్రహ్మయ 2. వీరా 3. బోడూర 4. విభ్రాజితభక్తి – రసవార్ధి ... నిట్టవాడువ.



నంత వినోదార్థమై యొక్కనాఁడు – సంతోషచిత్తుఁడై చని కిన్నరయ్య
యాపురంబునఁద్రిపురాంతకదేవు – గోపురాంతరమునఁగూర్చున్న యెడను

## గొఱియ కథ

వారాంగనార్థమై వధియింప విలిచి – కోరి మిండం దొకగొఱియఁజేపట్టి
యవ్వీథిఁ జనఁ[1]ద్రి(ది?)వ్వంగఁ ద్రాడు – ద్రెవ్వుడు గొఱియ దద్దేవాలయంబు
పఱతెంచి సొచ్చుడుఁ[2]బైపడి వాఁడుఁ – బఱతేరఁ **గిన్నరబ్రహ్మయ్య** గాంచి
"పోవక నిలునిలు బొప్ప! యీ గొఱియ – దేవాలయముఁజొచ్చెఁ జావున కోడి
యింకఁజంపుట దోస మిట్లుగాదేని – కొంకక వెలసెప్పి కొను[3]ము రెట్టైన
మృదుభక్తు లొప్పింతురే శరణన్న – జడనరులైనను జంపంగనీరు
చరజీవులకు నెల్లఁజావును నొప్పి – సరియకాదే యెందుఁజర్చించిచూడ
నీకు దీనినిఁ జంప నేమమే! చెపుమ – యాకాంత దీని[4]నే యచ్చొత్తినదియె?
పడయరానిది భువిఁబసిఁడియకాదె? – కడుఁగాక మాడైన నడిగిన నిత్తు
నదె కొమ్ము" నావుడు "నక్కటా! యిట్టి – చదురుండుఁగలఁడయ్య జగతిలోపలను
గుడిసొచ్చు [5]మడిసొచ్చు గుండంబుసొచ్చు – విడుతురే గొఱియల విలిచినవారు?
త్రోవ నదెట్టులు దొలఁగకవచ్చు? – నీవకా కిబ్భువి నీతిమంతుఁడవు–
ఎఱుఁగ మే మెన్నఁడు నిటువంటి వెందుఁ – గొఱగాదు దడసినఁగోపించు లంజె
'పెట్టెద వెల' యని బిగిసెడుఁ బెద్ద – ఇట్టి దయాపరుఁడెచ్చోటఁగలఁడు?
చరజీవులకునెల్లఁజావును నొప్పి – సరియె తా ననియెడుఁజర్చింపనట్ల
మనుజుల ప్రాణంబు మఱి వేయుమాడ – లననేల యిన్నియు నతఁడు బొంకెడినె?
వేయిచ్చియైనను విడిపించు [6]గొఱియ – యీయయ్య[7]సంపఁగనీఁడు వా" మ్మనుచుఁ
బోవవచ్చిన "బొప్ప! పోవకు" మనుచు – వేవేగఁదెప్పించి వేయుమాడలను
నిచ్చి"బొంకినఁ బోవనీఁజుమ్ము [8]రోరి! – యచ్చొత్తి విడుతు నే నటమీఁదెఱుంగ"
ననవుడు 'నౌఁగాక' యని మాడలెన్ని – కొని లంజెయింటికిఁజనిచని మగిడి
"గొఱియలేకున్నఁ బెద్దఱికమే?" యనుచు – మఱియొక్క గొఱియఁ గ్రమ్మఱవిల్చికొనుచు
బోయినఁజొరనీక పొలఁతి గోపించి – "చా! యెట్టిమిండఁడ చనుసను మింక
సరివిటుల్ నవ్వంగఁజక్క నా యిల్లు – చొర సిగ్గుగా దెట్లు శూన్యంపుగొల్ల!

1. దెవ్వఁగా 2. బరువడి 3. మిన్నడైన 4. పైన 5. గిడి 6. గాని 7. గొనిపోవ 8. గొఱియ–న

చదివెదు వెక్కులు శ్లాఘ్యమే? పసిఁడి – వెదవెట్టఁ[1]బంతు నే వీథులనెల్ల
ఇస్సిరో! లంజెర్కమే యిట్లు నీకు – దుస్సి కట్టుదుగాక దొంతరలెల్ల
బ్రతుకంగనోపునే పడఁతి యీసారె – నెదిరి నే మనఁజాలు నే లింకఁబడుపు
బొజుఁగులు గొఱియలఁబోకార్పఁగలరు – ప్రజలకుఁదనకును బట్టుగ్రాసంబు
మఱ! బాపురే! లంజె మనెడుఁబొమ్మనఁగ – గుజగుజలకు నెల్ల [2]గుఱియైతినింక
నగుబాటు వట్రిల్లె నాతులలోన – మొగమెత్తనేర్తునే? మున్నెఱుఁగవొకొ!
అభిమానకత్తె దానగుట నీ" వనుచు – నభిమాన మెడలంగ నతివ వల్కుడును
"బాయఁ జూ పెనుఁబెనుఁబండువు [3]లందు – వేయేల గొఱియల వేయుమాడలకు
విలిపించి మఱి కదుపులభంగిఁదెత్తు – వలసినంతర్థంబు వ్ర(వ్య?) యమున కిత్తుఁ
జిన్నవోనిత్తునే చెలువలలోనఁ – జెన్నుగాఁ బండువుసేయు మీ " వనిన
"వేల్పుల కని మున్ను విలిచినగొఱియఁ – బాల్పడి తేకున్నఁబండువుసేయ
వెఱతుము సంపునో వేల్పు ద"మ్మనిన – నఱిముఱి 'నట్ల కా'కనుచుఁదత్ క్షణమ
కామాంధునకు నొక్క గార్యంబుఁగాన – రామి దెల్లముగాన రయమున వచ్చి
గొఱియఁబట్టుడుఁదద్దఁ గోపించి చూచి – పరువడిఁ**గిన్నర బ్రహ్మయ్య** [4]యెదిరి
"పట్టకుపట్టకు బసవరా[5]జాన – పట్టినఁదలఁ దెగఁగొట్టుదు నింక
నంజుదురే శరణాగతవజ్ర – పంజరం బిదియె మా భక్తులబిరుద"
మనుచుఁదగ్గఱుడు వాఁడలుగు [6]వెర్కినను – గినిసి రౌద్రోద్రేకమునఁ బొంగిప్రేసి
నిశితఖడ్గాయుధనిహతుఁగావింపఁ – బశుపతిగుడి వెలిఁబడియె శిరంబు
'బాస హీనునిబొంది వాడియే శివు ని – వాసంబునం దుండ దోస' మన్నట్టు
లట్టయు నీడ్పించి [7]యగడ్తవైపించెఁ – గట్టలు గట్టి మూఁకలు సూచుచుండ
[8](నంత నా వృత్తాంత మక్కర్మిబంధు – లెంతయు విని తమ యిచ్చలో వగచి
తగువారుఁదామును ధరణీశుఁజేరి – వగచుచు నేడ్చుచు జగతీశుకనిరి)
"త ప్పేమియును లేదు దమవాఁడు గొఱియ – చొప్పునఁజనిగుడిసొచ్చి పట్టుడును
భక్తుఁడు **గిన్నర బ్రహ్మయ్య** నాఁగ – శక్తిమంతుఁడుగాన చంపె" నావుడును
నుర్వీశ్వరుండు గోపోద్రేకవహ్ని – వర్వ నిట్లనిపల్కె **బసవయ్య**ఁజూచి
"హరుభక్తు లధికదయాపరు లండ్రు – నిరపరాధులఁజంప నీతియే మీకు

1. బుత్తు 2. గొలఁదైతి 3. సేయ 4. యెయిది, పలికె, యెఱిఁగి 5. రాజదియు 6. వెర్కుడును, 7. యగడితవైచె (దీనినిగూర్చి పీఠికలో చూడుడు) 8. (నక్కర్మిచుట్టాలుఁ బక్కాలునంత గ్రక్కున బిజ్జలుకడ మొఱలిడుచు)



మనుజులఁబ్రోలిలో మననీరు గాక – పనియేమి గొఱియలకును మీకుఁజెపుఁడ
మామీఁద నొకరాజు మఱి చెప్పఁగలఁడె? – భూమిలో' నన్నట్లు వొడిచివైచెదరు
రాజులకు నిరపరాధులఁజంపు – టోజయే? భక్తుల కుచితంబు గలదె?
కాలఁదన్నుట మాంసఖండంబు లిడుట – బాలునిఁజంపుట ఱాలవైచుటయుఁ
గులములు సెడిపోయి కుడుచుట దండ్రి – తలఁదెగఁగొట్టుట దన్వి నిచ్చుటయుఁ
దమ్ము[1] దొరలఁజాల ధర్మంబు లండ్రు – ఎమ్మెయిఁదగదండు రెదిరి[2] దొరలిన
మీర యేలుదురు గా కీరాష్ట్రమెల్ల – ధారుణి యేలంగఁదమ కింకఁబాసె
నప్పటి కప్పటి కదియేల [3]వెఱవ – నొప్పుకో రాజ్యంబు దప్పేమి"యనుడుఁ
"గర్జంబు మీఁదెఱుంగక పల్కుటెల్ల – బిజ్జలక్షోణీశ పెద్దఱికంబె?
ధర్మము ల్కర్మలు దప్పుదు రెందు – ధర్మముల్ భక్తులు దప్పరు వినుము
కిన్నరబ్రహ్మయ్య సన్నుతకీర్తి – పిన్నవాఁడే యూరకున్నను జంప?
నట్టేల? యెద్దినె ననుటయు గొందిఁ – గట్టుద మనువారు గల రెట్లు సెపుమ
ఏర్పడఁగార్యాంశమెఱుఁగుము మాట – లార్పుము తగువారి నరయఁగఁబంపు
మఱి యెందుఁబోయెడు మర్యాదలెల్ల – నెఱుఁగుదు గాకేమి యింతయు" ననినఁ
దన ప్రధానులఁ[4]జూచి ధారుణీశ్వరుఁడు – పనిచినఁ ద్రిపురాంతకునిగుడి కేఁగి
కిన్నరబ్రహ్మయ్యఁగన్నంత మ్రొక్కి – "అన్నన్న! తగునె? నీ యట్టి భక్తుండు
హింసకు లోనౌట కేమికారణము? – సంసారి నేటికి సరిచేసికొంటి
విగమెడ దునిమెద విదియేమి వుట్టె – జగములలో రిత్తసడి వచ్చె నీకుఁ
గొఱగాని జఱభుల కొయ్యనగాండ్ర – గొఱియల వార్తలు గూడునే త్రవ్వ
భూమీశ్వరుఁడు మమ్ముఁబుత్తెంచె నరయ – నేమని చెప్పుదు మింక" నావుడును
"నివి యేల వెడమాట లిన్నియు వాఁడు – తివియఁదివియఁద్రాడు ద్రెవ్వడు గొఱియ
గుడిసొచ్చుడును 'బట్టఁగూడదు దీని – విడువుము కాదేని వెలసెప్పి కొనుము
ఇమ్మడి ముమ్మడి యిచ్చెద' ననిన – నెమ్మెయి నొల్లక 'యిట్టి భక్తుండు
వేయిచ్చియైనను విడిపించుఁగాని – యీ యయ్య[5] గొనిపోవనిచ్చునే' యనిన
'విండ్రె యీ మాటలువేయుమాడలకుఁ – గొండ్రె యెచ్చోటను గొఱియ' నన్నట్టు
వెక్కసం బందంగ వేయుమాడలను – జక్కఁగ నెన్నితిఁజౌకంబు ద్రోచి
'యెప్పాట[6] మగిడిన నీఁజుమ్ము' రనుచుఁ – జెప్పి యచ్చొత్తితి శివలాంఛనంబు

1. దొర్లిన 2. దొర్లినను 3. వెఱతు–మొ(ప్పఁగో) 4. బిల్చి 5. సంపంగనీఁడు వొమ్మనుడు 6. మగుడిన

కాంత దన్నెంతయుఁగడవఁబల్కినను – నెంతయుఁ గొన్నాఁడ నే ధనం బనక
కొండొకప్రొద్దుండి వెండి యేతెంచి – మిండండు బసవనిమెడఁద్రాడు వెట్ట
వలదని వారింప నలుఁగు వెఱికినఁ – దలఁ ద్రుంచివైచితిఁ దప్పెవ్వరిదియొ?
అట్లొట కీ త్రిపురారియె సాక్షి– పట్టినఁబలికింతు నిట్టని చెపుఁడ”
అనవుడు నతివిస్మయాక్రాంతు లగుచు – జననాథునకు నిట్లు వినుపింపఁదడవ
“యద్దిరా! భక్తుని యఱ[1]గొడ్డెతనము – విద్దె లాడెడుఁగాక విందుమే తొల్లి
విపరీత మిందఱు వినఁ‘బలికింతుఁ – ద్రిపురారి’ ననుటెల్లఁగపటమో నిజమొ?
చూతముకాక!” యంచును బిజ్జలుండు – నేతెంచె నధికవిభూతి భాతిగను
బసవఁడుఁ**గిన్నరబ్రహ్మయ్య** పాద – బిసరుహాక్రాంతుఁడై ప్రీతియెలర్ప
‘శృంగారములకీల శివుకరవాలు – మంగళత్వమునికి మానంబుమనికి
విజయంబుత్రుళ్లు వివేకంబుపెల్లు – నిజగుణస్తుతి యూఁత నిష్ఠలచేఁత
సత్యంబుభాతి యాస్థానంబుజ్యోతి – ప్రత్యయంబులరాజు భావుక మోజు
యాగంబు తునియ విరాగంబుగనియ – యాగమంబులతెల్ల [2]హర్షంపుటెల్ల
శాంతంబుప్రోగు సజ్జనభక్తిబాగు – దాంతత పెంపు వ్రతాపంబుసొంపు’
నని యసమాన సమంచితార్థముల – వినయపూర్వకముగా వినుతి సేయుచును
నుండంగ, నఖిలనియోగంబు గొలువఁ – దండతండముల భక్తవ్రాత మలర
గుడివడు గటమున్న కుంచియకోల – పొడసూప కేఁగినయెడఁగిన్నరయ్య
దరహసితాస్యుఁడై తలుపులదిక్కు – నరగంట నొక్కింత యఱలేక చూడ
నఱిముఱి నటమున్న యప్పురాంతకుఁడు – వెఱచితల్పులువాఱఁదెఱచెఁ జోద్యముగ
“దాసికిఁ దెఱచె ముఱ దలుపు లనంగ – నాసకలము విందు మది గానఁబడియెఁ
దనరుచుఁ ద్రిపురాంతకుని కవాటములు – గనుఁగొననంతలో నన పాసి పడియె
బాపురే! కిన్నరబ్రహ్మయ్య యింక – నోపుఁబోఁబలికింప నీ పురాంతకుని”
ననుచుఁజూపఱు గనుఁగొని ప్రస్తుతింపఁ – జనుదెంచి బ్రహ్మయ్య సంతోష మలర

### కిన్నరబ్రహ్మయ్య పిలువ శివుఁడోయని పల్కుట

“మనసిజక్రీడాంతమునఁజేయిప్రేసి – వనితపాలిండ్లు నీవని నిశ్చయించి
యడరఁగ నాతఁ‘డయ్యా!’ యని పిలువ – నొడయనంబన్నకు నోయన్న శివుఁడ!
వెలయఁగ[3] దాసమయ్యలవాదులోన – నిలఁబిపీలిక[4]యందుఁబలికిన శివుఁడ!

1. గొండె 2. హర్షంబుయె (నె?)ల్ల 3. దాసుమయ్యల 4. లోన.



మున్ను **బాపూరిబ్రహ్మన్న**కుఁబలికి – జొన్నలు నీవయై యున్న శంకరుఁడ!
పలుకవే నాబారిఁబాఱి” తన్నట్టు – లలుఁగుమోహణమున హస్తంబు దొడిగి
**కిన్నరబ్రహ్మయ్య** సెన్ను [1]దుల్కాడఁ – బన్నగధరుమహాభక్తులఁదలఁచి
యాయతి నభిముఖుండై “త్రిపురాంత – కా”యని పిలుచుడు “నో[2]”యనుచుండె
బిట్టుల్కి మూర్ఛిల్లి [3]బిమ్మిటిఁ బొంది – నెట్టోడి లింగ సన్నిహితులు దక్క
ఖగమృగోరగ నరకరితురగాదు – లగు సమస్తచరాచరాది జంతువులు
నుక్కఱి మ్రగ్గి యట్లున్నవియున్న – చక్కటిఁ బ్రాణము ల్గక్కున విడిచె
నాకటకం బిట యట కానఁబడియె – లోకంబులెల్లఁగల్లోలంబు నొందె
నీక్షితి గంపించె నినుఁడస్తమించె – నక్షత్రములు డుల్లెనగములు ద్రెళ్లె
నంబుధు లింకెఁగూర్మంబుఁ దలంకె – నంబరంబిల మ్రొగ్గె నహిపతి స్రగ్గె
ననిలుండు దొలఁగె స్వాహాపతి మలఁగె – వనజనాభుఁడులికె వనజజుఁడలికె
సమసుప్తిఁబొందించి జగములఁ ద్రుంచి – ప్రమథులు లోకముల్ దమమయంబుగను
నాడుచుఁ బాడుచు నసమానలీలఁ – [4]గ్రీడింప మఱియు సత్క్రియ [5]దులుకాడ
నవికలానేకభక్తావళి వేర్చి – సవిశేషగతి మహోత్సవములు సలుప
బాయక రేయును బగలును గూడ – మ్రోయంగ నేడ్దినంబులు సన్న పిదప
భువనోపకారార్థబుద్ధిమై బసవఁ – డవిరళగతిఁగిన్నరన్నకు మ్రొక్కి
“సజ్జనశృంగార! సత్యగంభీర! – యిజ్జగదాధార! యీశ్వరాకార!
మంగళగుణధామ! మహిమాభిరామ! – లింగాభిరూప! యభంగప్రతాప!
నిర్జితాహంకార! నిఖిలోపకార! – దుర్జనదూర! విధూతసంసార!
కారుణ్యపాత్ర! యకల్మషగాత్ర! – వీరవ్రతాచార్య! విపరీతశౌర్య!
యంచితాగణ్య నిరంతరపుణ్య! – సంచితసుఖలీల! శరణవిలోల!
సన్నుతకీర్తి! సాక్షాద్రుద్రమూర్తి! – కిన్నరబ్రహ్మయ్య! కృపసేయు” మనిన
బసవయ్యచే[6] ప్రేసిప్రహసితుండగచు – నసమాక్షుఁజూచి‘హే’[7]యనుచువారింపఁ
దొల్లిటియట్ల యద్భుతలీల నడరె – నెల్లలోకములు మహిష్ఠతఁబరగెఁ
గటకంబుసూడ నెప్పటియట్ల ప్రబలె – నిట చరాచరజీవు లెల్లను బ్రదికె
బిజ్జలుఁడంతలో బిమ్మిటి దెలిసి – యజ్జనౌఘముఁదాను సాష్టాంగ మెరఁగి
“యభయమే జియ్య! యత్యద్భుతకీర్తి! – యభయమే దేవ! మహామహిమాఢ్య!

1. దొల్కాడ: 2. యనిపలుక 3. బిమ్మట(టి) 4. గ్రీడింపుచుండ 5. దోఁపమఱియు 6. భక్తిఁ బ్రణమి 7. యని నివారింప

కిన్నర బ్రహ్మయ్య! గీర్వాణవంద్య! – కన్నుల గానని కష్ట లోకులము
అజ్ఞానజీవుల మపగతమతుల – మజ్ఞుల మధికసర్వాపరాధులము
కడసన్న నీదు విఖ్యాపితమహిమ – కడ యెఱింగెద మనఁగా మాతరంబె?
నీ యాజ్ఞఁదలమోచి నిటలలోచనుఁడు – 'నో'యనెఁబిలిచిన 'హే'యన్న నుడిగె
నింతటిలోన నీరేడులోకములు – సంతాపవర్తన సమసుస్తిఁబొందె
[1]నిప్పుడు గరుణింప నిట్లుల్లసిల్లెఁ – జెప్పఁ జిత్రము గాదె యెప్పాటనైనఁ
బరగంగ నిహలోకపరలోకములకు – హరుఁడవు నీవ శంకరుఁడవు నీవ
భవుఁడవు నీవ సద్భక్తుండ వీవ – భువిలోన మఱి సెప్పఁబోల్పంగఁగలరె?
నిద్దంబుగా నీట నద్దుము పాల – నద్దుము మాకింక నన్యథా లేదు
ఒక్క మాకేల, బ్రహ్మోక్తజీవులకు – నిక్కంబు దెస దిక్కు నీవ కావెట్లు
కావున, మముఁగటాక్షప్రేక్షణమున – భావింపవే కృపాభావం బెలర్ప"
ననుచు మఱియు మ్రొక్కియభినుతిసేయఁ – గనుఁగొని దరహాసకలితాస్యుఁడగుచుఁ
"గఱకంఠుభక్తుల కఱగొఱ లేక – వెఱచి బ్రదుకు వొమ్ము వేయునునేల?"
నని మును విశిరస్కుఁడైన మానవుని – జనులెల్లరు నెఱుంగ సప్రాణుఁజేసి
చనియెఁగిన్నరబ్రహ్మ శరణుండు భక్త – జనులును బసవఁడు ననురాగమంద
'నిశ్చయం బీతఁడే నిటలాక్షుఁ'డనుచు – నాశ్చర్యహృదయుఁడై యరిగె బిజ్జలుఁడు
అంత నట్టులు గిన్నరయ్య సద్భక్తి – కాంతుఁడై త్రిభువన [2]ఖ్యాతిమై నుండెఁ
బసరింపఁగిన్నరబ్రహ్మయ్యచరిత – మసలారఁజదివిన నర్థిమై విన్న
భక్తియు సకలవిరక్తియు సహజ – భుక్తియు నభిమతభోగము ల్గలుగు

## కలకేత బ్రహ్మయ్య కథ

మఱి, **కలకేత బ్రహ్మయ**నాఁగ నొక్క – నెఱవాది భక్తుండు నిర్మలకీర్తి
జంగమవిశ్వాసి లింగాభిమాని – ([3]సంగతచరితుఁడభంగప్రతాపి
నిర్మూలితోభయ కర్మసంచయుఁడు – భర్మలోష్టైక సద్భావగోచరుఁడు
మహిత జీవన్ముక్తి మానసవర్తి – సహజలింగైక్యనిష్ఠాసమన్వితుఁడు
లోకైకనుతుఁడు దృణీకృతలోకుఁ – **దేకాంగవీరు**ఁడపాకృత కర్మి
శుద్ధలింగాత్మ ప్రసిద్ధానుభవుఁడు – సిద్ధమహాద్భుత శీలుండు నాఁగఁ)

1. నప్పుడ... నట్లుల్ల 2. ఖ్యాతుఁడై యుం 3. సంగతశుద్ధ ప్రసాదానుభవుఁడు – స్థైర్యసంపన్నుండు శౌర్యపండితుఁడు – ధైర్యప్రపూర్ణుండవార్యవీర్యుండు – సత్యవచోరాశిశరణాగ్రగణ్యుఁ – డత్యుత్తమోత్తముఁ డనభువిఁదనరి – ఇట్లు రెండుమాతృకలందుఁ గలదు.



దగిలి గిల్కయు దక్షుతలకొమ్మువోలెఁ – దగరుకొమ్మునుబట్టి తనవేష మమరఁ
గోరి త్రివిక్రము కోలెమ్మువోలె – సారంగ నొక గుదియయుఁజేతఁబట్టి
కలకేత వేష మింపలరంగఁదాల్చి – నలువొప్ప భక్తుల నగళులకేగి
"పరసమయంబులఁబొరిమాల్పఁదాఁకు – ధరరుద్రు నిటలాగ్ని తగ[1]రేఁగు దెంచె
జినదర్శనంబులఁజిఱ్ఱు ముఱ్ఱాడు – మన వీరభద్రుని మదకరివచ్చె
నిమ్మహిభక్తుల యిలువిందు నచ్చె – నమ్మహాప్రమథచయము [2]ముద్దు వచ్చె
**దుగళవ్వ**గారి సుతుం డేఁగుదెంచె – **మొగి సంగళవ్వ** తమ్ముఁడు వీఁడె వచ్చె
నమ్మలా! రక్కలా" రని నగించుచును – నిమ్ముల నిత్యంబు నిరుసయుఁగొల్చు
కొనివచ్చి జంగమకోటి కత్యర్థి – ననయంబుఁబరిచర్య లాచరింపుచును
సన్నుతభక్తి సమున్నతలీల – నున్నెడ నియతిమై నొక్కభక్తుండు
భాతిగాఁ**గిన్నర బ్రహ్మయ్య**ఁ జూడ – నేతెంచి యేతెంచి యేఁగఁజాలమిని
**గలకేత బ్రహ్మయ్య**గారి సన్నిధిని – నలసి పథిశ్రాంతుఁడై పడియున్న
"డస్సి శరీరంబు గ్రుస్సి పాదములు – వ్రస్సి యెంతయును శ్రవంపడి యిట్లు
చనుదేర నీకింతవని [3]గలదయ్య!" – అనవుడు నాయయ్య యంత వీక్షించి
"నంబి కీశుఁడు దొల్లి నలిఁబడివెట్టు – నింబుగా జనులెల్ల నెఱుఁగఁగ నిపుడు
పడివెట్టుఁ **గిన్నర బ్రహ్మయ్య**గారి – కెడపక యని నరు ల్బుడిబుళ్లు వోవ
విని చూడవచ్చితి వినవె దారిద్ర్య – ఘనదుఃఖ మార్చునో యనుబుద్ధిఁజేసి
వంతయు గింతయు వట్రిల్లె నిచటి – కెంతద వ్వట చెప్పవే యయ్య మఠము
చనియెద నా యయ్యఁగనుఁగొన్నఁ గాని – తన [4]దప్పివో" దని తథ్యంబు వలుక
"నిప్పాట నది యొక్కయెప్పుగా నతనిఁ – జెప్పకు సెప్పకు నేకూలి గాని
పని వెలఁగొని చేయుబంట్లకు రాశి – గొనవచ్చునే తన కూలియే తక్క
ఫలములు గుఱితిడు భక్తుల కెట్టు – లలవడు లింగనిరంతరసుఖము
పదవులు గిదవులు వళ్లును గిళ్లు – మదనారి సద్భక్తమండలి కరుదె?
యంతద వ్వింక నెట్లరిగెదు డస్సి – యెంత యర్థంబైన నెత్తికొ."మ్మనుచు
నడరఁ[4]జేగుదియయు [5]రాలప్రోకఁ – దడయ కొండొంటితోఁ దాఁకింపఁ దడవ
తంగెడుపూవులు ధరణిఁ బ్రోవిడ్డ – భంగి నర్థంబున్నఁ బైచీర గప్పి
కనుఁగవ హర్షాశ్రుకణములు వెల్లి – గొన నర్థి మోపెత్తికొనుచు భక్తుండు
వలివేగమున వచ్చి వచ్చి యెంతేని – బలువిడిఁజక్కన **బసవనమంత్రి**

1. నే 2. ముందు 3. గల్గెనయ్య 4. దృష్టివో 5. రాలువీఁక

నగరోపకంఠంబునను మోపువైచి – దిగదిగఁబోయి తాఁదెచ్చినక్రమము
వచ్చిన దాదిగా వార్తయుఁబూస – గ్రుచ్చినయట్లుగా గురువుగాఁజెప్పి
“**బసవన్న! కలకేతబ్రహ్మయ్య** మాకు – నొసఁగినర్థము మోవ నొకఁడ నేనోపఁ
బనుపవే వేఱొక్కవరిచారు మాకు” – ననవుడు బసవఁ డత్యాశ్చర్యమంది
“యిట్టివా రగుదురే యీశ్వరభక్తు – లెట్టున్న వారల నేమనవచ్చుఁ?
గాయకం బలరంగఁగలకేతవిద్య – యాయయ్యమహిమ దా నతివిస్మయంబు
కల్పవృక్షం బీగి ఘన మందమేని – యల్పభోగమకాక యపవర్గ మెద్ది?
చింతామణులయీగి [1]చెప్పుదండేని – చింతింప శాశ్వతసిద్ధి యందెద్ది?
మేరువుఁజెప్పుదమే పైఁడిదక్కఁ – గోరి యందొకటైనఁగొనఁదినఁ [2]గలదె?
కామధేనువు నిత్యమే మున్ను దాను – కామించువారికిఁగార్యముల్ సలుపఁ
గల కేతబ్రహ్మయ్యగారి మహత్త్వ – మిల గారవింపంగ నిన్నిటికంటె
నతులితలీల సర్వార్థసిద్ధులకు – నతిశయస్థితిహేతు వగుచున్న యదియుఁ
**గిన్నర బ్రహ్మయ్య**ఁగీడ్పడఁ బలుకఁ – జన్నె యొండొరుల కాశరణుండు దక్కఁ
గానోపు నతఁడు సాక్షాత్సంగమేశుఁ – [3]డేనాఁటి కితరుల కేల చొప్పడును
దనుఁజూప కిబ్భంగి ధరణి వర్తించు – ననువుగా కతఁడేమి యల్పుఁడే” యనుచు
భక్తునకును దోడు వరిచారు నిచ్చి – [4]వ్యక్తసందర్శనాసక్తి నేతెంచి
బసవఁడు **కలకేత బ్రహ్మయ్య**గారి – కసలార నందంద సాష్టాంగ మెరఁగి
యంజలీకృతకరకంజుఁడై నేత్ర – సంజనితానందజలరాశి [5]మునిఁగి
యెసక మెక్కఁగ నుతియించుచు నున్న – బసవనిఁ**గలకేత బ్రహ్మయ్య** యనియె
“బసవ! [6]యీ **కిన్నర బ్రహ్మయ్య** భువిని – బసరింపఁగా నిట్టి భక్తుండు గలడె?
**ఒడయనంబి**కి మున్ను వడివెట్టు శివుఁడు – పడివెట్టు **గిన్నర బ్రహ్మయ్య** కిపుడు
పలికించుటయు నిత్యపడిగొనుటయును – వెలయ నయ్యిరువురవృత్తి [7] యొకాక
ముట్టఁగొల్చిన ఫలం బిట్టుండ వలదె? – వట్టిమాట [8]లవేల వలయు వస్తువులు
నిటలాక్షు [9]వేఁడక నిక్క మున్నవియె? – కటకటా! మే మింతగాలంబుఁగొలుచు
టక్కటా! నిష్ఫలం[10]బయ్యె నిత్యంబు – నొక్కొక్క వాతికయును గొనలేదు
శివపూజఫలము సేసేతఁగొన్నట్లు – [11]తవిలి యాతనికి నంతన సమకూఱెఁ
బున్నెంబు మాలినపా(డు?) వలమెల్ల – నెన్నంగ నున్నార మే మేమి గొఱయు

1. ఁజెప్పుదంటే 2. నేది? 3. డేనాటని 4. వ్యక్తి 5. దేలి 6. మి 7. యుకాక 8. లు నేల 9. నడుగకఁ, గొల్వక 10. బయెశివపూజ – యొ 11. భువిమముబోంట్లకుఁ బొందంగఁదరమె?



మృడుఁ బూజసేసి [1] వ్రేల్మిడితోడఁబసిఁడి – పడయు టరిదిగాదె పగలెల్లఁబనులు
ముక్కుఁజెమట వెండి యక్కునఁదొరుగఁదొరుగఁ – జిక్కఁజేసినను గుంచెఁడుగాని లేవు
ఇన్నియుఁజెప్పఁగనేల మాకిన్న – రన్నకుఁజెప్పు వ్ర(వ్య?) యంబును బెద్ద
ఒకమాటు రజతమహోర్వీధరంబు – నకుఁజని యేతెంచుటకు మెచ్చువచ్చె
నచ్చుగా శివుని ‘నో’యనిపించె ననుచుఁ – జెచ్చెరఁ దనుఁ జూడవచ్చువా[2]ర్గలరు
వ్ర(వ్య?) యమునకర్థంబు వలయునో శివుఁడు – దయపడి యిచ్చు నర్థమునకుఁదోడు
బిలిబిలికాయకంబులు సేసి పడసి – యిలఁబాఁతినర్థంబు నిసుమంత గలదు
**శంకరదాసయ్య**చరణము ల్గొలుచు – [3]లెంకల కెట్లును లేదనరాదు
బసవ! మీ బ్రహ్మయ కెసఁగఁగ జెప్పి – వెసఁబండ్లు వుత్తెమ్ము వేనవే లయిన
నిదె యర్థమిచ్చెద నిటువంటి” దనుచుఁ – బదడు సేపట్టుడుఁబసిఁడియైవెలుఁగ
బసవఁడక్కజమంది ప్రణుతింపుచుండ – వెసఁ**గిన్నరయ్య** యీ వృత్తాంత మెఱిఁగి
పఱతెంచి **కలకేతబ్రహ్మయ్య**గారి – [4]కెఱుకువ దులుకాడ నిలఁజాఁగి మ్రొక్కఁ[5]
**గలకేత బ్రహ్మయ్య** [6]**యల కిన్నరయ్య** – నలరుచుఁగౌఁగిట నందందచేర్చి
యతిదయామృతవార్ధి నభిషిక్తుఁజేసి – [7]నుతనిష్ప్రపంచ సన్మతికీలు సూపి
యప్రతర్క్యాదిలింగప్రాణమథన – సుప్రసన్నానుభవప్రాప్తుఁజేసి
యిరువుర లింగావసరము సేయించి – సరసోచి[8]త క్రియాసంతుష్టిఁజేసి
బసవనఁ**గిన్నర బ్రహ్మయ్య**గారి – మసలక వీడ్కొల్పి యసమానలీలఁ
**గలకేత బ్రహ్మయ్య** నలిఁదొంటియట్ల – విలసితభక్తి నిశ్చలలీల నుండెఁ
**గలకేత బ్రహ్మయ్య**ఘన చరిత్రంబు – వెలయఁగఁజదివిన వినిన వ్రాసినను
నభవుకారుణ్యకటాక్షేక్షణమున – నభిమతఫలసిద్ధియగు నక్షణంబ

## మోళిగ మారయ్య కథ

మఱియును **మోళిగ మారయ్య** యనఁగఁ – గఱకంఠు సద్భక్తగణ [9]విలాసంబు
ప్రచ్ఛన్నరుద్రుఁడవిచ్ఛిన్నకీర్తి – స్వచ్ఛసదాచారసంపత్ప్రపూర్తి
విజితకామక్రోధవిమలమానసుఁడు – నిజగతి లింగైక్యనిష్ఠాపరుండు
మంగళచరితుఁడు లింగసదర్థుఁ – డంగవికారదూరైకవర్తనుఁడు

1. వెల్మిడిలోన 2. రలకు 3. లెంకుల 4. కఱుకువ... నందందమ్రొక్కి 5. అంజలీ కృతకరకంజుఁడై నేత్ర, సంజనితానంద జలరాశిదొరుగ. ఇది యొక ప్రతిలో నధికముగా నున్నది. 6. గార్గిన్న 7. హితప్రాణలింగ 8. తాలాపసంపదఁదనిపి 9. విలాసుండు.

సవిశేషజంగమార్చనపరతంత్రుఁ - డవికలవిధినిషేధవివర్జితుండు
ప్రవిమలాంగుఁడు నిష్ప్రపంచగుణాఢ్యుఁ - డవిరళతత్త్వానుభవసుఖాంభోధి
కర్మాపహరుఁడు లింగప్రాణమథన - మర్మజ్ఞుఁడన లసన్మహిమఁబెంపారి
యనయంబు నతులఘోరాటవికేఁగి - ఘనతరంబుగ మోచి కట్టెలు దెచ్చి
యంగడి విక్రయం [1]బార్చి తెప్పించి - జంగమారాధన సలుపుచునుండు
రసరసాయనములు బసవని నగర - నసలార భోగించి యాదట[2]ఁబోక
జంగమకోటి నిచ్చలు నొక్కమాటు - భంగిగా నారగింపఁగఁబెట్ట వచ్చి
"బసవ! మారని యట్టిభక్తులు గలరె? - వసుధలో నీ యింటిరసరసాయనము
లతనినగరఁగాంచు నంబకళంబు - ప్రతివచ్చునే యెన్ని భంగులనైన
ననిశంబు నతనికాయకలబ్ధి యెంత - సంతుష్టి సేయు టాశ్చర్యంబు గాదె?
బాపుఁ **మోళిగమార!** భక్తివిస్తార - బాపురే" యని మ్రోలఁబ్రస్తుతి సేయ
నసలార విస్మితుం డగుచు నేతెంచి - **బసవఁడు** ప్రచ్ఛన్నభావంబు నొంది
**మోళిగ మారయ్య** ముద్దియఁగాంచి - లాలితోద్యత్సముల్లాస మెలర్ప
'శరణార్థి' యని చక్కఁజాఁగి మ్రొక్కుడును - దరుణియునటమున్న 'శరణార్థి' యనుచు
నడుగుల కర్ఘ్యపణ్యంబులు దేర - నొడఁబడ కెఱిఁగెదరో యనుమతిని
"అమ్మమ్మ! మాలింగ మాకొన్నవాఁడు - క్రమ్మన వడ్డింపు రమ్ము లె" మ్మనుచు
సరసర లింగావసరము సెల్లించి - పరికించి యం దొక్కవడిగంబు క్రింద
విడియలతో రెండువేలమాడలును - [3]నడకి యమ్మకు శరణార్థి సేయుచును
సదమలలింగప్రసాదంబు గొనుచు - విదితముత్పులక సముదితాత్ముఁడగుచు
ధర నిరుపేద నిధానంబుఁగన్న - కరణిని హర్షాశ్రుకణములు దొరుగ
"నిదిగదా భవదుఃఖగదకు(ము?) నౌషధము; - ఇదిగదా భక్తిమహిష్ఠతపంట;
ఇదిగదా నా పుట్టినింటికల్పకము! - ఇదిగదా ముక్తికి నిక్క దాననుచుఁ
బొంగి ప్రసాదైకభోగియై తద్గృ - హాంగణంబున నిల్చి యాత్మలోపలను
నీ సదనం బంత నింతఁగన్నంత - దోసంబులెల్ల విధూతము ల్గావె
యీ నగరద్వార మిటియ నేతెంచు - నా నరుఁడపుడ కృతార్థుండు గాఁడె
యీ సీమలోఁజరియించు జంతువులు - చేసిన భాగ్యంబు సెప్పంగఁదరమె
యీ గృహాంతరరేణు విసుమంత నొసల - [4]బాగొందు నతనికి భక్తి వర్ధిల్లదె?

1. బార్చినలబ్ధి 2. లేక 3. నడికి 4. బాగొందఁబూసిన.



కడిఁదిపాతకము లిక్కడఁబ్రసాదంబు - గుడిచినఁ[1]జెడు సమకూఱు దేనియును
నొడఁబడ నిచ్చటికడువనీరైనఁ - బుడిసెఁడు ద్రావినఁబొలియుఁబాపములు"
నని తలపోయుచుఁజనియె నా బసవఁ - డనురాగచిత్తుఁడై; యంత నిక్కడను
మధ్యాహ్నమగుటయు **మారయ్య** లింగ - తద్ధ్యానసుఖనిరంతరవర్తి యగుచు
వాకిటఁగట్టెలు వైచి యేతేర - నా కాంత యెదురేఁగి యడుగులు [2]గడుగ
భంగిగా జంగమ[3]ప్రణిపత్తి [4]దీర్చి - లింగార్చనంబు సల్లీలఁజేయుచును
బడిగంబు క్రిందట బసవఁడు మున్న - [5]యడకిన మాడల విడియలు గాంచి
"యెక్కడివిడియ లిం? దెవ్వరు వచ్చి - రిక్కడి?" కని తనయింతి నడ్గుడును
"దేవ! యొక్కయ్య యేతెం చారగించె - భావింప నటమీఁది పను లే నెఱుంగ
నప్పుడ విచ్చేసె" నని విన్నవింపఁ - "[6]దప్పదు బసవఁడు దాన కానోపుఁ
గడు నర్థసంపదగల భక్తులరసి - బడుగుభక్తులఁబ్రోవఁబాడియ కాదె?
దాత గాఁడే యిట్లు దాఁబ్రోవ కెవరు - ప్రోతురు మేలయ్యోఁబో బ్రదికితిమి
తన బిడ్డఁడని [7]మనఁదలఁచి యిచ్చుటకిఁ - జనుదెంచె నింతియ చాలదే మాకు
నిమ్ముల మాలింగ మిచ్చిన కాయ - కమ్మ యీ పూఁటకుఁగలిగున్న" దనుచుఁ
జక్కన నిద్దఱు జంగమంబులకు - నొక్కొక్క విడియ నియోగించి మ్రొక్కి
సదమలస్థితి నున్న జంగమకోటి - [8]పద పద్మములు గడ్గి భక్తితో వారి
శ్రీపాదజలములు సిలికింపఁగట్టె - మోపు [9]గడానియై యేపారి వెలుఁగ
వేడుక మదిఁదులుకాడ వేయేసి - మాడలయెత్తుగాఁగూడ ఖండించి
యున్నజంగమకోటి కొక్కొక్కనక్కు - చెన్నుగా నర్పణసేసి మ్రొక్కుడును
నక్కజం బందుచు నా జంగమములు - గ్రక్కున బసవనికడఁబ్రసరించి
"మిక్కిలి భక్తికి నిక్కంబు నియతి - కెక్కుడు చేఁతకు సెల్లయై పరగు
**మోళిగ మారయ్యఁ**బోరంగ భక్తు - లేలోకమునఁగలరే" యని పొగడ
**బసవఁడు!** యిట్లేల యానతిచ్చెదవు? - నిన్నన్న దేమేని మున్నొండు గలదె?
[10]బడుగు భక్తులకెల్లఁబ్రాణంబునిన్నుఁ - గడ [11]సన్న భక్తులు గలరె యిబ్భువిని
మాబోటి భక్తులమనికియు నునికి - నీ బయిసియె కాదె నిఖిలోపకార!
విని యెఱుఁగము దొల్లి విడియ లనంగఁ - గనుఁగొనఁబడియె నీ కారణంబునను

1.జను 2. గడిగి 3. ప్రతిపత్తి 4. దీర్ప 5. యడికిన, యడఁచిన 6. దప్పఁడు 7. మమ్ముఁ 8. పదములుగడిగివే భక్తితో 9. సువర్ణమైదీపించి 10. బడగు 11. చిన

బాపు! భాగ్యప్రాణి! బాపు! కృపాత్మ! – బాపురే! ధనవంత! బాపు! కీర్తీశ
నల్లవో బసవయ్య నా కిచ్చినట్టు – లెల్లభక్తావళికి నిత్తయ్య! తొల్లి
**మడివాలు మాచయ్య** మనుమల మమ్ము – విడువక నడుపుకో వేయును నేల?"
అని పెక్కు భంగుల నాలి సేయంగ – ఘనతరశోకాంబు కలితాస్యుఁడగుచుఁ
"గనకాద్రియరయునే కాకిగుణంబు – నినుముగుణ మరయునే పరుసంబు
గుణనిధి వీవు దుర్గుణనిధి నేను – గణుతింపఁగలదె సద్గుణము నా యందు
వెలివాడఁగలుగునే వేదఘోషంబు – నిల నావమునఁగల్గునే [1] రాగిముంత
తలఁపఁగుంపటిలోనఁదామరదుంప – మొలచునే యిన్నియు ముదలింప నేల
గతవివేకునిఁగావఁగాఁదగు నీవ – గతి దయాభావ! సంగయదేవ!" యనుచు
**మారయ్య** పాదపద్మంబుల కెరఁగి – సారాంచితోక్తుల సంస్తుతింపుచును
నభయంబు వేఁడుచు నడుగులమీఁద – సభయాత్ముఁడై యున్నఁ[2]జయ్యన నెత్తి
యసలారఁగౌఁగిట నందంద చేర్చి – బసవని కారుణ్యరసవార్ధిఁదేల్చి
యలరంగ మృదుమధురాంచితాలాప – ములఁబ్రబోధించుడు నలి దులుకాడ
**మారయ్య**గారికి మఱియును మ్రొక్కి – యారఁగ బసవరా జరిగె; నంతటను
**మోళిగ మారయ్య** ముందటియట్ల – లాలితభక్తిసల్లీలమై నుండె;
నారఁగ **మోళిగ మారయ్య**గారి – చారుచరిత్రంబు సదివిన విన్న
నిత్యప్రసాదవినిర్మలాత్మీయ – సత్యసుఖంబులు సల్లీలఁగలుగు

## కన్నడ బ్రహ్మయ్యగారి కథ

పరగంగఁ**గన్నడ బ్రహ్మయ్య** నాఁగ – ధర నొప్పు సద్భక్తిపరుఁడు వెండియును
దర్పితసంసారదళనుండు జంగ – మార్పితప్రాణదేహార్థాభిమాని
యద్భుతచరితుఁడుద్యద్భక్తియుక్తి – సద్భావనోపేత చరలింగమూర్తి
సారవీరవ్రతాచారుండు జంగ – మారాధకులలోన నగ్రగణ్యుండు
సంచిత బాహ్యపూజాపరతంత్రుఁ – డంచితాంతస్సపర్యాపరాయణుఁడు
నిరవద్యహృద్య వినిర్మలభక్తి – పరతంత్రుఁడన లసచ్చరితఁబెంపారి
కత్తియు బలపంబుఁ గావిచీరయును – గత్తెర యిసుము నక్షతలును ముండ్ల
బంతియు నీలికప్పడమును ద్రిండు – [3]మంతరకాటుక మఱి చండవేది
సెలగోల యొంటట్ల చెప్పులుఁ[4]బీఁకె – యొలుకులబూడిదయును వాటుఱాలుఁ

1. చెంబుచిట్టి 2. జక్కన 3. మంతకాటుకయును 4. పీఁక, క్రొత్త



గుక్కలవాకట్టుఁగొంకినారసము – గ్రక్కునఁగంకటిరజ్జువు నమర
సూచీముఖంబైనఁజొనుపంగరాని – యేచినచీకటి నిండ్ల పంచలకుఁ
జిడిముడి పలుకులఁ జేరి యుల్వరసి – గడియకన్నంబును గడపకన్నంబు
గోడకన్నంబును గుఱి [1]నేలకన్న – మోడక త్రవ్వి యి ల్లొయ్యన చొచ్చి
పరికించుచో భక్త భవనంబులైన – సరసరదీపంబు సంధించి వారి
పాదాబ్జములమీఁదఁబడి మేలుకొలిపి – పాదోదకంబు ప్రసాదంబుఁగొనుచు
"శరణనియెడి సత్యశరణులయిండ్ల – వరవుడ బ్రహ్మఁడన్వాఁడ నే" ననుచు
నెడనెడ నేఁగుచు నితరు[2]లిండ్లైనఁ – దడయక పదపదార్థంబులు దేవి
కొనివచ్చి జంగమకోటికి వరువుఁ – బను లాచరించు చిప్పాట వర్తింప
జంగమ[3] మొకనాఁడు చాల నేతేర – భంగిగా నిది పట్టపగలని యనక
"నేలకన్నంబిడి నిఖిలేశునగరఁ – జాలనర్థముఁదెత్తుఁజక్కన" యనుచు
నరుగుచో **బసవఁడు** పురవీథిఁ గాంచి – యరుదొంద భువిని సాష్టాంగుఁడై మ్రొక్కఁ
"బట్టుము గత్తియు బలపంబుఁగన్న – పెట్టఁబోవలయు నా కిట్టున్న భంగి
నొం[4]డెడ ధనములే దొనర **బిజ్జలుని** – బండారమిలు సూప బసవ! ర" మ్మనినఁ
బ్రత్యుత్తరం బీనిబాస గావునను – నత్యనుచిత మన 'కట్లకా' కనుచుఁ
**గన్నడ బ్రహ్మయ్య** గారిఁదోడ్కొనుచుఁ – గన్నంపుము ట్లెల్లఁగరమర్థిఁగొనుచు
నునుపరియునుబోలె నొడక నగరు – చనఁజొచ్చి బండారుసదనంబుఁజూప
గడియకన్నం బిడఁగాఁబడదెల్లఁ – గడసన్న పసిఁడియై పుడమి వెలుంగఁ
జొచ్చి పెట్టెలలోని సొమ్మెల్లఁగొనుచు –విచ్చేసె బ్రహ్మయ్య యచ్చెరువంద
నంగరక్ష[5]కులెల్ల నరిగి యట్లున్న – భంగిన యవ్వార్తఁబతి కెఱిఁగింప
'బసవఁడునాబారిఁబాఱెఁ బొ'మ్మనుచుఁ – గొసిమసంగుచు మహో[6]గ్రొమునరేఁగుచును
నవుకులు గీఁటుచు "నక్కటా! తన్ను – శివభక్తుఁడని విశ్వసించుటయెల్ల
వఱితిపాలుగఁ జేసెఁ జిఱుతవాఁడనక – యఱలేక మన్నించు [7]నంతయుఁగంటిఁ
బట్టపగలు గన్నపెట్టించె బసవఁ – డెట్టొకో ప్రాణంబుఁబట్టియున్నాఁడు
అడిగిన వలసి [8]నంతర్థ మీ నెట్టు – లడరఁగ విశ్వాసియయ్యె నిట్లింత
కెత్తికొన్నాఁడింక నిటమీఁద నెంత – కెత్తికోనున్నాఁడొ యెఱుఁగరా"దనుచుఁ

1. లేని 2. లయిండ్లఁ 3. ముళొక 4. డేడ 5. కులుదారరిగి 6. తను 7. టంతయుఁ గలిగె 8. నయంతర్థమీనె – య.

గన్నులమంటలు గ్రమ్మ నేతెంచి – కన్నంబువాకిటికనకంబుఁజూచి
యతివిస్మయాక్రాంతమతిఁ జిట్టమిడిచి – గతకోపుఁడై క్షితిపతి యిట్టులనియె
“నెక్కడిపసిఁడిప్రో వెక్కడి దొంగ – యెక్కడికన్న మిదేమి వన్నితివి?
**బసవనమంత్రి!** యేర్పడఁజెప్పు” మనిన – వసుధేశునకు **బసవనమంత్రి** యనియె
“భక్తుండు **గన్నడ బ్రహ్మయ్య**నాఁగ – వ్యక్తలింగం బనియుక్తప్రతాపి
**కన్నడ బ్రహ్మయ్య**గారి మహత్త్వ – మెన్నఁగ శక్యమే యీశునకైన
నాతని శ్రీచరణాంగుష్ఠయుగము – ఖ్యాతిగాఁగల్పవృక్షములకు నూఁత
ఆ మహా[1]త్మునియమృతావలోకనము – కామధేనువులసంఘముపుట్టినిల్లు
చింతింప నాతనిచిత్తంబుచిగురు – చింతామణులకు నిరంతరాశ్రయము
అరయంగ నతనిహస్తాంగుళస్పర్శ – విరచింపఁగాఁబర్సవేదుల గనులు
నతని శ్రీపాదసంగతి ముక్తిభూమి – యతని ప్రసాదంబు నమృతంబుతేట
యతనికోపంబు సంహారకారణము – నతని కారుణ్యంబ యపవర్గ మింత
నణిమాదిసిద్ధులు నాతనిబంట్లు – గణుతింప నింత లింగసదర్థుఁడయ్యుఁ
బట్టిననియమంబుఁబాయక కన్న – పెట్టిన నర్థమెకాని ముట్టఁడు సేత
‘నిది గుమార్గము భక్తియే’ యనవలదు – ఇదియె తా సన్మార్గ మెట్టు లంటేని
యిలఁజూదమునఁబాండవులు భ్రష్టులైరి – నలిజూదమున మూర్ఖ నగజేశుఁగూడె
వేఁటాడి **రాముండు** వెలఁది గోల్పడియె – వేఁటాడి యెఱుకు దా విశ్వేశుఁగలసెఁ
బరసతీవశ్యులై నరపతుల్ ద్రుంగఁ – బరసతీవశ్యుఁడై హరుఁగూడె **నంబి**
చంపి మాండవ్యంబు సరిఁగొర్తఁబడియెఁ – జంపి చండుండు ప్రసాదంబుఁ గనియె
బొంకిన బ్రహ్మకు భువిఁబుట్టుమాలె – బొంకి **చిర్తొండండు** బొందితోఁజనియె
గొఱియమ్రుచ్చని శూద్రకుఁడు [2]నఱకువడెఁ – గఱకంఠుగణనంది గలసెఁదెర్వడిచి
రమణ “**రాజ్యాంతే నరక**” మన ముక్తి – విమలతఁగనిరి చేరమయుఁజోడండుఁ
గాన యెట్లును నమార్గం బనరాదు – తా నీశ్వరార్థ మన్తలఁపునఁజేసి
ధర “**నధర్మో ధర్మతాం వ్రజే**” త్తనఁగ – హరునివాక్యముగాన యట్టిద పథము
నిన్నియు ననవేల యిందఱకంటెఁ – **గన్నడ బ్రహ్మయ్య** గతి యెట్టిదనిన
నెప్పుడు జంగమం బేతెంచు నింటి – కప్పుడకాని పోఁడసహాయలీల
నిది వగ లిది రాత్రి యెట్లొకోయనుచు – మదిలోన లే దణుమాత్రంబు భయము
నదియును శివభక్త సదనంబ యేని – ముదమునఁబేర్సెప్పి మ్రొక్కుచువచ్చు

1. పురుషుదివ్యావ 2. నర్కఁబడియె



నిల్లిల్లుఁదప్పక యితరాలయముల – నెల్లయర్థము దెచ్చు నిహపరంబులకు
దూరమైనట్టి లుబ్ధులయిండ్లు సొచ్చి – వారలఁజరితార్థవంతులఁజేయ
జనియించినట్టి ప్రాక్తనపురుషుండు – ననవేల కడువిస్మయము గాదె తలఁప
ముట్టిన త్రవ్విన మెట్టిన ఠావు – పట్టినకైదువు ల్వసిఁడిమయంబు
ప్రాకటంబుగ నిన్ను రక్షింపఁదలఁచి – కాక **బ్రహ్మయకు** శ్లాఘ్యమె పదార్థంబు
లెక్కకుమిక్కిలి లేకున్నఁదప్పు – తక్కినబండరు లెక్కలు సూడు”
మనుచు నబ్బసవఁడత్యనురాగలీలఁ – గనుఁగొని బండరు కవిలియ సదువ
నక్కజం బందుచు నవనీశుఁ డుండె – నిక్కడ **బ్రహ్మయ్య** యింటి కేతేర
సుదతియుఁ బతికి నుత్సుకత దుల్కాడ – నెదురేఁగి యడుగుల కెరఁగి కన్నంపు
ముట్టులుఁజేతిసొమ్మును నందుకొనుడుఁ – జట్టన **బ్రహ్మయ్య** జంగమావలికి
ముదమంది ధరఁ జాఁగిమ్రొక్కెఁ దత్ క్షణమ – ముదితయుఁ దాను సముదితసద్భక్తి
మించి వెలుంగంగఁబంచభక్ష్యములు – నంచితంబైన దివ్యాన్నపానములు
గావించినట్టి పక్వంబులు జంగ – మావలి కంత సమర్పణసేసి
వారి ప్రసాదసుధారసవార్ధి – నారంగఁదేలుచు నాదట మఱియు
ధనధాన్యవస్త్రవాహనభూషణములఁ – దనిపి జంగమల సత్కరుణాభివృద్ధిఁ
**గన్నడ బ్రహ్మయ్య** [1]మున్నెట్టు లట్ల – సన్నుతభక్తిమహోన్నతి నుండెఁ
**గన్నడ బ్రహ్మయ్య** ఘనచరిత్రంబు – విన్నను జదివిన విస్తరించినను
మృడు దయామృతరస మిళితేక్షణమున – నొడఁగూడువారి కిష్టోపభోగములు

## ముసిఁడి చౌడయ్య కథ

అసదృశలీలఁబెంపారి వెండియును– ముసిఁడిచౌడయ్య నా ముక్కంటిగణము
నిఖిలసజ్జనభక్త ముఖముకురంబు – సుఖశీలసంబంధ సుపథప్రచారి
అఫలార్థకృతసత్ క్రియాసమన్వితుఁడు – సఫలీకృతామోఘ సత్యప్రతాపి
తత్జ్ఞుఁడు సంసారతలగుండుగండఁ – డజ్ఞానజనదూరుఁడపగతభయుఁడు
వీరరసాంభోధి గారణపురుషుఁ – డారూఢదివ్యామృతావలోకనుఁడు
నధికశాపానుగ్రహసమర్థుఁడఖిల – విధినిషేధక్రియా విరహితాత్మకుఁడు
అక్షయకీర్తి దృష్టాదృష్టలోక – సాక్షికప్రత్యయచరలింగమూర్తి
స్వసమయభూతి శాసనజనాధారుఁ – డసమానవీరభద్రసమానుఁడనఁగఁ

1. మున్నున్న, మున్నిటి.

బరగుచు నాఁబోతు భక్తుఁడు దపసి – మరణంబు నొందిన మగిడించు బాస
నడచుచో నంబుధి నది యడ్డ[1]మైన – నడఁగించి త్రోవన యరిగెడు బాస
భక్తిసత్క్రియలు దప్పక చేయుబాస – వ్యక్తిగా భక్తినియుక్తిఁబెంపారి
భువి నొప్పి ముసిఁడి యన్పురవరంబునను – సవిశేషభక్తిమైఁజౌడయ్య యుండ
బసవనిభక్తిసౌభాగ్య మహత్త్వ – మసలార విని [2]దర్శనాసక్తిఁజేసి
భక్తులుఁదానును బరమానురాగ – యుక్తులై చనుదెంచుచుండ నొక్కెడను
జాలదోయిటనెత్తి చల్లిన నిసుము – రాలినియట్టి యరణ్యాంతరమున
ముసిఁడివృక్షంబు లొప్పెసఁగ నెల్లెడల – పసిఁడి[3]కొండలభాతిఁబండి వెలుంగ
"నసలార ముసిఁడిపండ్లారగింపంగ – నెసఁగ లింగములకు నిష్టమైనయది"
యనుచు భక్తానీక మానతిచ్చుడును – విని సంస్మితానన విలసితుం డగుచుఁ
జనిచని ముసిఁడివృక్షంబుల మొదలఁ – దనకరవా లూని దట్టుఁడై నిలిచి
'యారగింపవె దేవ!" యని విన్నవింప – వారివారిక గణవ్రాత మేతెంచి
నమృతాంశుధరునకు [4]నర్పించి వేడ్క – నమృతాంశుధరుభక్తు లారగించుచును
"ముసిఁడిచౌడయ యనుముందటిపేర – యెసఁగుఁబో జగముల [5]నెట్లును నింక"
ననుచుఁద్రస్తరు లాడుచును సంతసమునఁ – జనుదేరఁగల్యాణమున[6]కు సంప్రీతి
యెసకమెక్కఁగ సంగమేశ్వరునంద – బసవన్న సౌడయ్య భావంబు గాంచి
చక్కన నెదురేఁగి జగతీతలమునఁ – జక్కఁ జాఁగిలఁబడి మ్రొక్కి తోడ్తెచ్చి
యుచితోపచారనియుక్తిఁ గావించి – యచలాత్మ ముసిఁడిచౌడయ్య నేప్రొద్దు
సంగమేశ్వరునంద సద్భక్తిక్రియలు – భంగిగాఁగొలుచు[7]చు బసవయ్య సలుప
నసమానలీలఁగళ్యాణంబునందు – ముసిఁడిచౌడయమహోల్లసనప్రయుక్తి
నెడపక సద్భక్తి కెల్లయై యిట్లు – నడుచుచు మఱియొక్కనాఁడుత్సవమున
నార్యులు దీవించియనుప వివాహ – కార్యార్థమై యరుగంగఁగట్టెదురఁ
గటకంబు రాజమార్గంబునఁజెలఁగి – నటియించు భక్తగణంబులనడుమ
ఘనవిమానస్థుఁడై గగనమార్గమునఁ – జనుదెంచు తవరాజుశవము వీక్షించి
"వావిరి తవరాజవల్లభుచేత – దీవెన లందకపోవంగఁ దగునె?
పరిణయంబున కిత్తపస్వి యేతేర – కరిగెడువాఁడఁ గా నటు నిలుఁడనుచు
నలుఁగుమోహణమున హస్తంబు దొడిగి – జళిపించి మొనసూపి నలిరేఁగి యార్చి

1. పడిన 2. తదీయా 3. కుండల 4. నర్పితంబనుచు 5. నెల్లను 6. లసద్భృత్తి 7. డు భక్తులుగొలువ.



యరుదెంచి దగ్గఱి "యయ్యగారలకు – శరణార్థి శరణార్థి శరణార్థి" యనుడు
"శివమస్తు శివమస్తు శివమ" స్తటంచుఁ – దవిలి తోడ్తోడన తపసి దీవింప
"డిగు డిగు గొరగ! నాకగపడి తింక – నగవు గా దిచట నున్నను సయిరింప
నందివాహన! నీకు నరవాహనంబు – పొందగునే చూచి భువి నరు ల్నగఁగ"
ననుచుఁబాదము వట్టి యల్లార్చి తివియఁ – గనుఁగొని దరహాసకలితాస్యుఁడగుచు
ధరడిగ్గి ముసిఁడి [1]చౌడరసు నందంద – కర మభిలాషమైఁగౌఁగిటఁ జేర్ప
సత్యస్వరూపుఁడు సౌడరాయండు – నత్యద్భుతాక్రాంతులై నరు ల్పొగడఁ
దోడ్తోన తవరాజుఁదోడ్కొని పెండ్లి – కేడ్తెఱ[2] దళుకొత్త నేఁగంగ నవలఁ
బొలమేర వటవృక్షముల సమీపమున – నలిరేఁగి గోపాలకులు నటింపుచును
గము[3]లేర్చి యుద్దించి కాల్గన్న వారిఁ – దమలోనఁగేలివాదంబు [4]వుట్టుటయు
"గోకులపతియాన గుఱి [5]యది మీకు – మాకును బసవనిమఱ్ఱియ" యనుడు
న్యగ్రోధముల[6]యర్త నడచుచు సజ్జ – నాగ్రగణ్యుండు సౌడయ్య యాలించి
పసులవాండ్రనుగూడఁ"[7]బద రిదియేమి – **బసవనిమఱ్ఱి** యన్పలుకయ్యె" ననినఁ
బ్రెబ్బొంతపెయ్యలపెద్ద యందొకఁడు – "నిబ్బసవనివార్త యెఱుఁగుదుఁ గొంత
యట తాతచే వింటిన ని తమతాత – చిటిపొటి వాండ్రకుఁ జెప్పె మాకెల్ల
నలుక రెట్టింప రెం డాఁబోతు లిచట – [8]మలయుచు నేడ్దినంబులు వోరఁబోర
నెత్తురు వఱదలై నేలయంతయును – జొత్తిల్ల నొకవోతు సొలసి చచ్చుడును
నచ్చోన [9]పాఁతినఁజెచ్చెర మొలచె – నచ్చుగా నీమఱ్ఱి యట్లుగావునను
**బసవనిమఱ్ఱి** యన్పలు కయ్యెనండు – రసలార మఱియుఁజోద్యం బట్లుఁగాక
కఱచిన మాంసంబు గతి నుండుఁబండ్లు – విఱిచినరక్తంబువిధి నీరుగాఱు
నేనాఁట మఱ్ఱిపా లెఱ్ఱనైయున్నె – తా నమ్మరే [10]చూడఁదథ్య"మిట్లనుడు
వారించి "యిదివ్రాఁతవా"ర్తని యొద్ది – వారెల్ల [11]నుడుప నవారితవృత్తి
పసరింపఁ"గ్రొత్తేమి ప్రాఁతేమి యింక – బసవనిమృతి సెవిఁబడ్డపిమ్మటను
మురియుచు బసవఁడు ముందఱఁజనక – పరిణయంబునకేఁగఁ బంతమే నాకుఁ
బడయకపోయెడుపలుకులే?" లనుచుఁ – బెడబొబ్బలిడుచు సంప్రీతినార్చుచును
"వెడలుము వెడలుము వృషభేంద్ర!" యనుచు – [12]వడినెయ్యియలుగున వటమూఁది

1.చౌడయ్య 2. ముదముననేఁగ నప్పాట 3. లేరియుద్దింప 4. లుపుట్టె 5. యఱె 6. చెంతనరుగుచు 7. బదురి, బదమి 8. నలిరేగి యేడుదినమ్ములువోర 9. ప్రాఁతినఁ 10. జూడఁదప్పది 11. నుడువ 12. నడరంగవటముపై నలుఁగుసాచుదును.

నటమున్న నంది[1]పాఁతదరి యద్ధరణి – పటపటఁబగులంగ వటవిటపంబు
చట్టన వ్రేళ్లతోఁజటచటఁమనఁగ – గట్టెగసల్లంత మిట్టిపడంగ
నందఱు నతివిస్మయాక్రాంతులుగను – నందుండి [2]యూఁకించి యవనికి నుఱికి
నిలిచి [3]నిట్రించి ఘణిల్లుల్లనఁగ – నలరుచు అంకె లందంద వైచుచును
వాల మల్లార్చుచుఁ గాలఁద్రవ్వుచును – నేలఁగోరాడుచు నీడ కుర్కుచును
నుడువీథి కెగయుచు నొడలు వెంపుచును – వడిగొని పఱచుచు [4]నిడుజంగ లిడుచుఁ
దగిలి గద్దించుచుఁ దలఁకుచు మూతి – యిగిలించికొని మొగంబెత్తిచూచుచును
జిఱుపెండవెట్టుచుఁజిఱలు వొద్చుచును – గుఱుజంగలిడుచు దిక్కులుసూచికొనుచు
గెలఁకులఁదన్నుచుఁ గ్రేళ్లువాఱుచును – [5]బులుగఱ చుమియుచుఁ మలఁగినాకుచును
బోరన నెగయుచుఁబొంగుచుఁగొమ్ము – లోరగించుచు మలయుచు వంగికొనుచు
నూఁకరల్వెట్టుచు నురవడింపుచును – మూఁకకు నెగయుచు ముస్సు ముస్సనుచుఁ
జవుడయ్యఁజూచుచు సంతసిల్లుచును – దవులంబు సేయుచుఁదపసి వెన్కొనుచు
బాసికంబును నాఁటి పసపుటక్షతలు – నా సమంచిత సుగంధానులేపనము
లొనరంగ వింతచెన్నొలయంగ గంట – లును మువ్వలును గజ్జెలును మ్రోయుచుండ
నంతంతఁదనరారి యాలఱేఁ డుండ – సంతోషమున **ముస్డిచౌడరాయండు**
బడిసివైచుచుఁజేరి మెడఁగౌఁగిలించి – యడుగులు గడిగి పుష్పాంజలు లిచ్చి
యాయతధూపదీపాదు లొనర్చి – నేయుఁబాలును బొట్టనిండ వడ్డించి
“నడవుము నడవుము [6]నందెన్న! నీవు – నడవ కేఁబెండ్లికి నడవ [7]నిక్కంబు”
అనవుడు లోకంబు లచ్చెరువంది – వినుతింపఁదద్భక్తజను లుత్సహింప
[8]నందఱు ముందఱు నరుగు నత్తపసి – ముందఱ నాఁబోతు మురియుచు నడవ
నరుగఁగ నరుగఁగ నంత ముందఱను – నురవడి నుప్పొంగి యుడువీథి దాఁకి
హిద్దొర యనునది యిల నిండిపాఱఁ – దద్దయు నుద్వృత్తి ధరఁదన్ని నిలిచి
“ఎఱుఁగవే వారాసు లెల్ల నొక్కయ్య – యఱచేతిలోనన యణఁగుట మఱియు
భవి పుట్టి యొల్లక భువి ముదలింప – సవిశేషభక్తప్రసాది దాసయ్య
కాదె నిన్ బోకార్చి కాల్నడయంద – యీ దేశమంతయు నెఱుఁగంగ దాఁటె
మఱియు గజ్జేశ్వరుమసణయ్య దన్ను – మఱచి శివార్చనామగ్నుఁడై నడుమ
నుండఁ బై రానోడి రెండు దిక్కులను – ఖండితంబై నీవకావె పాఱితివి?

1. పోత 2. యంకించి 3. దృష్టించి 4. వటము మూర్కొనుచు 5. పులుగఱనైచుచు 6. నందెన్న’ అనియే కలదు 7. నీయాన 8. నందఱి.



వెడ[1]వాఁగయేమని వెల్లిసూపెదవు – అడఁగుము ద్రోవయి” మ్మనుచుఁ**జౌడయ్య**
అలుఁగుమోహణమున హస్తంబు దొడిగి – జళిపింప నీరెల్లఁజల్లనఁబాసి
నీరిపర్వత మన నింగి నుప్పొంగి – తారాపథంబునఁదా నిట్టవొడిచె
నాకాశగంగచే హరుభక్తమహిమ – నేకాంతమున విన నేఁగినయట్లు
[2]అయ్యేఱు **ముసిఁడిచౌడయ్య**కు వెఱచి – చయ్యన నేఁగె రసాతలంబునకు
నన్నట్లు త్రోవ నీ రఱిముఱిఁబఱవ – మిన్నక నడుమెల్లఁదిన్నెలై యుండ
“రండు రండిపుడు[3]నీరము నడు మడువ – రెండు గా వనుమాట రిత్తయ్యె” ననుచు
**ముసిఁడి చౌడయ**గారు ముందఱ నడవ – నసమభక్తానీక మానందలీల
నంతంత నిలుచుచు నార్చుచుఁ గుప్పి – గంతులువైచుచు గతికి నిల్చుచును
నెడనెడ నార్చుచుఁబెడబొబ్బ లిడుచు – వడిఁబిల్లమెఱములు వైచుచు లేచి
పరువులు వెట్టుచు నరుగ ముందఱను – నరుదారఁదపసియు నాఁబోతు నడవ
దరహసితోల్లాసవరవక్త్రుఁడగుచు – నరిగెఁ**జౌడయ్య** దా నద్దరి నిలిచి
“పెల్లున లోకంబు [4]లెల్లను ముంప – గొల్లన నడచు నీ త్రుళ్లెల్ల నడఁగె”
ననుచు నమ్ముసిఁడిచౌడయ్య సద్భక్త – జనసహితంబుగా ననురాగలీల
నరిగి యొప్పారఁదత్పరిణయక్రియలు – పరితోషమతి [5]సమాప్తంబు గావించి
బగుతు లెదుర్కొన మగిడి కల్యాణ – నగరంబు వీథుల నడతెంచుచుండఁ
దపసియు నాఁబోతుఁదనతోడ నడవ – విపరీత మతి నరు ల్విభ్రాంతిఁబొంద
జయజయధ్వను లాకసము నిండి చెలఁగ – రయమునఁబఱతెంచి రమణి యొకర్తు
భావించి **చౌడయ్య**పాదము ల్నొసలు – మోపంగ ధరఁజాఁగి మ్రొక్కినఁజూచి
యనునయం బొదవ “శతాయుష్య” మనుచుఁ – జనుదెంచి [6]తమనిజస్థానదేశమున
దొల్లింటియట్ల యద్భుతలీల నుండ – నల్లకన్యక మృతమైన మర్నాఁడు
జనకాదు లేద్చుచుఁగొని వచ్చివచ్చి – కనుఁగొని **చౌడయ్య**గారికి మ్రొక్కి
“నిన్న మీ పాదముల్ నెన్నుదు రిఱియ – సన్నుతి మ్రొక్కిన సతి నేఁడు సచ్చె
నీ దీవనయుఁదప్పునే” యని వారు – పాదము ల్విడువక పలవరింపంగఁ
[7]‘దొలదొలఁ’[8]డనుచును ‘ద్రోవ కడ్డంబు – నిలిచి వాచర్వక నిలునిలుఁ’డనుచుఁ
గంపరం బవనిపై దింపించి మహిమ – వొంపిరిగొన నోరవోవఁదట్టుచును

1. ప్రంత యిదియేల వెల్లిసూపఁగను 2. అయ్యెడ 3. నీర్నడుమప్రేసినను 4. లుల్లడి (డింపంగ) 5. జేసి బహుమాన మెసఁగ 6. తన 7. దొలఁగుఁడటంచును 8. మనుచునాత్రో

'నెనయ దీవించువా రేండ్లేల యిత్తు' – రనుపలు కప్పుడ యాలంబు గాఁగ
నిశితఖడ్గం బార్చి నిఖిలంబు నెఱుఁగ – 'శిశువ! లె'మ్మని పేరఁజీరఁగఁదడవ
[1]కట్టులు వటు కనఁగాఁదెగినిద్ర – బిట్టుల్కి తెప్పిఱినట్టును బోలె
నతిసంభ్రమాక్రాంతమతిఁదేఱిచూచి – యతివ **సౌడయ్య**కు సాష్టాంగ మెరఁగె
తల్లియుఁదండ్రియుఁదమపుత్రితోన – యుల్లంబు దళుకొత్త నొగిఁజాల మ్రొక్కి
"**ముసిఁడిచౌడాచార్య!** యసమానశౌర్య – వసమె నీ గరిమంబు వర్ణింపఁదలఁపఁ
బ్రాణోపకారికిఁబ్రత్యుపకార – మేణాంకధ [2]రమూర్తి యిలఁజేయఁగలదె?
దాసులఁగా మమ్ము దయ నుద్ధరింపు – మీ సంసరణవార్ధి [3]యింకఁదోఁపంగ"
నంచు విన్నప మాచరించుడు మువుర – నంచితప్రాణలింగాంగులఁజేసి
గతవత్సరంబులు గాక మూవురకు – శతవత్సరాయు వాయతిఁగరుణింపఁ
"బ్రాణదానముసేయఁబరులవశంబె? – ఏణాంకధరునకు నిల నరు[4]దన్న
జా నొందఁగ మసిఁడిచౌడయ్య ప్రాణ – దానంబుసేసెఁజిత్రము సిత్ర" మనుచు
మ్రొక్కుచు లోకంబు వెక్కసపడఁగ – నెక్కుడుకీర్తికి నెల్లయై యంత
మహనీయసద్భక్తిమహిమ దుల్కాడ – సహజైకలింగి యాచౌడయ్య నడవ
నతని మహాద్భుతోన్నతిఁజూడఁజాల – కతిమతిహీనులై యన్యదర్శనులు
"తొడ[5]సూడుపోతుల జడలతమ్మళ్లఁ – బడయుఁదానటె చూ సబంబులఁగన్నఁ
**జవుడయ్య** గారలచందంబు సూత – మవుఁగాక తప్పేమి" యనుచు దుర్బుద్ధి
గోనెగర్భం బిడి మానిసి రూపు – దా నిల్పి [6]బూడిది దళముగాఁబూసి
యన్నిగందువల రుద్రాక్షము ల్వ్యాన్చి – జన్నిదంబులు వెట్టి జడలను బెట్టి
యడిపొత్తి సించి కచ్చడము సంధించి – కడపట నొకనాడు గుడికడ వైచి
యింతట నంతట నెఱుఁగని యట్ల – సంతల నిలిచి దూషకులు సెలంగ
"నక్కటా! గుడికడ [7]నదియొక్కదపసి – దిక్కుమాలినపీన్గు డ్రెల్లి యున్నదియు
కుడువఁగట్ట విడువ ముడువలేదనియొ! – బడుగుఁబీనుఁగుగాన భక్తులు రారు
ఎల్లవారికిఁబ్రాణమేమి నిత్యంబు? – చెల్లఁబో! యెవ్వరుఁజేర రియ్యెడకు
నెట్టు సూడఁగవచ్చు నింక ధర్మంపు – గట్టియయైనను [8]బెట్టుదం" డనుచు
దమ్మళ్లఁ గొందఱఁదపసులఁబిలిచి – గ్రమ్మన నొకవిమానమ్ముఁగల్పించి

1. కట్టినకట్లప్డు చట్టనఁ దెగఁగ – బిట్టుల్కి నిద్రఁ దెప్పిఱినట్లు వొరలి 2. రునకు నిలనరు దయ్య 3. యినుక 4. దెన్న 5. తొడఁగూడఁ(డుపో)బో (తోడుగూడుపో?) 6. బూడిదె 7. నదె 8. బెట్టుదమ.



"గుడికడ [1] నెన్నటఁగోలె నున్నదియొ? – పడికి [2] వల్చెడుఁజేరి పట్టరా" దనుచుఁ
దార యాకృతకంపుఁదపసిశవంబుఁ – జేరి విమానంబుఁజేర్చి సంధించి
జగదభినుతుఁడగు **చౌడయ్య**గారి – నగరిపొంతను విమానంబు రాఁబనిచి
యల్లంత నల్లంత నపహసింపుచును – గల్లరిలోకులగము లేఁగుదేర
నడతెంచు నవ్విమానంబులో శవముఁ – బొడఁగని **చౌడయ్య** గడుదూరమంద
కృతకంపుశవముగా మతిలోన నెఱిఁగి – యతిదరహసితాస్యుఁడగుచు నుప్పొంగి
"యవికలాజాండంబు లలిగినఁజెఱుపఁ – దవిలి కూర్చినఁగావ దక్షులైనట్టి
మదనారి భక్తులమహిమఁదలంప – నిది యెంత వెద్ద దా నీరూపమునకుఁ
బడయుదు నొడలును బ్రాణంబు"ననుచు – మృడభక్తమండలియడుగులు దలఁచి
వడిగొని డగ్గఱి వాలార్చి [3]చూచి – విడిసేసి గాయంబు గడుమొనసూపి
యందుండి [4]లంఘించి యావిమానంబు – నందున్నకృతకాంగు హస్తంబు వట్టి
గ్రమ్మనఁ"దపసి లే లె"మ్మని పిలువ – నమ్మాత్రలోన జీవాంగుఁడై లేచి
**ముసిఁడిచౌడయ**కంటె ముందఱ నిలిచి – వసుధపైఁదజ్జనావలి సోద్యమందఁ
**జవుడయ్య**గారి శ్రీచరణాబ్జములకుఁ – దవలి సాష్టాంగుఁడై తా మ్రొక్కి నిలిచి
"హరుఁడవు నీవ సద్గురుఁడవు నీవ – కరుణింపు మీ పాదుకాతతి మోవ
ఖ్యాతిగా భవదీయకారుణ్యగర్భ – జాతుండ నన్యధా [5]నీతు లెఱుంగ"
నంచుఁబ్రార్థనసేయు నాతని నపుడ – సంచితగురులింగ సంగతుఁజేసి
యతుల కోపోద్రిక్తుఁడై కసిమసఁగి – కృతకులఁదునుమంగ మతిఁదలంచుడును
బరవాదు లతిభయభ్రాంతాత్ము లగుచు – నరుదెంచి యంతంత ధరఁజాఁగిమ్రొక్కి
"యసమాన **ముసిఁడిచౌడాచార్యవర్య!** – దెసయును దిక్కును దేవ! యేద్గడయు
నీవ మా కన్యథాభావంబు లేదు – కావవే యజ్ఞానజీవుల శరుల
సకలాపరాధుల సైరించి మమ్ము – సుకృతవంతులఁజేయు సుజనాగ్రగణ్య!"
యని విన్నవించుచు నభయంబు వేఁడ – ఘనకృపామతి నార్తజనశరణ్యుండు
సజ్జనశ్రేష్ఠుండు **సౌడరాయండు** – నజ్జనానీక మత్యర్థిఁ గీర్తింప
గతపూర్వలాంఛనాకృతులఁగావించి – యతులిత శివసమయస్థులఁజేసి
యసదృశలీల **నమ్ముసిఁడిచౌడయ్య** – వసుధ నెప్పటియట్ల వర్తించుచుండె

1. నిన్నటఁ (గూలియు)...యు 2. యువచ్చెడిఁ, వ్రేసెడిఁజేరి ఇచట "వినరాని శబ్దంబు వినఁగఁ బాడుచును, ఘనవిఘ్ననామంబు గణుతించిచదువ" అని యొక్క ప్రతియందుఁగలదు. 3. విడిని, దిగిచి 4. జళిపించి 5. రీతు.

ముసిఁడి చౌడయగారి యసదృశచరిత – మసలార వినిన నత్యర్థి వ్రాసిననుఁ
జదివిన సద్భక్తిసంపద లొందు – మదనారికరుణఁబ్రమథలీల దనరు

## సురియ చౌడయ్య కథ

వరకీర్తి **సురియచౌడరసు**నా మఱియుఁ – బరికింపఁగారణపురుషరత్నంబు
లింగ[1]ధర్మజ్ఞాని లింగాభిమాని – లింగయోగానంద సంగతాత్మకుఁడు
గాఢవీరవ్రతారూఢప్రతాపి – గూఢలింగైక్య నిరూఢమానసుఁడు
ఉభయలింగప్రసాదోపభోగుండు – త్రిభువనపూజ్యుండు శుభకరకీర్తి
శుద్ధాంతరంగప్రబుద్ధుండు గతవి – రుద్ధకర్మేంద్రియబుద్ధీంద్రియుండు
సదమల [2]కీర్తి భాస్వత్పుణ్యమూర్తి – సదయాత్ముఁడపగతసంసారభయుఁడు
శిష్టమహోత్కృష్టశీలపాలనుఁడు – ఇష్టాష్టవిధభక్తిపుష్టి చేతనుఁడు
కాయనియుక్తవికారదూరుండు – మాయాప్రపంచావిధేయవర్తనుఁడు
నన విలసిల్లి కళ్యాణంబునందు – ననయంబు నేఁడు నాఁడనక ముప్ప్రొద్దు
భంగిగా సద్గురుభావంబు నందు – జంగమకోటి కర్చనలు సేయుచును
బాయసాహారముల్ పంచభక్ష్యములు – నాయతభక్తిదివ్యాన్నపానములు
డెక్కొనగూడ వడ్డించి సంప్రీతి – మ్రొక్కి కరాంబుజంబులు దలమోపి
"పాయక శ్రుతి"[3]రసా నృక్తస్యజిహ్వా – గ్రే" యని యేప్రొద్దు మ్రోయుఁగావునను
నారంగ నీ జంగమావతారమున – నారగింపవె దేవ!" యని విన్నవించి
జంగమం బారగింపంగఁదానంత – లింగార్చనక్రియాసంగతి నిలిచి
పొరి మజ్జనోదకంబులకట మున్న – పరముపై నానందబాష్పముల్ దొరుగఁ
బూజించు నవపుష్పరాజికి మున్న – రాజాంకుపై హృత్సరోజంబు విరియ
ధూపవాసనకు మున్ ధూర్జటి మ్రోల – వ్యాపితాంతర్గతవాసన దనర
వెలుఁగు నీరాజనంబుల కటమున్న – మలహరునంద యాత్మజ్యోతి ప్రబల
వినివేదితపదార్థవితతికి మున్న – తన ప్రాణపద మీశ్వరున కర్పితముగ
లింగార్చనము [4]దాను బొంగి చేయుచును – నంగచేష్టలకు నంతంతఁబాయుచును
సుభగలింగముఁజూచిచూచిక్రాలుచును – నభవామృతం బాని యాని వ్రాలుచును
సురుచిరోక్తుల సోలిసోలి పాడుచును – స్థిరసుఖాంబుధిఁదేలి తేలియాడుచును
మంగళోన్నతబహిరంగంబు నంత – రంగంబుఁదనప్రాణలింగస్థ మగుచు

1. మర్మ 2. స్ఫూర్తి 3. "భక్తజిహ్వాగ్ర – కేయని" అని దిద్దిన గణము కుదురును 4. బొంగిపొంగి.



నమరెడు నిత్యలింగార్చనవేళ – సముచితనైవేద్య సమయంబునందు
మెఱవడియై సురె వెఱికి ప్రాణమున – కొఱగోసినట్టుల యొకదెసఁజేర్చి
జంగమలింగావసరము సెల్లించు – భంగిగాఁదనప్రాణ లింగంబునకును
బళ్లెరమున నెల్లపదపదార్థములు – పెల్లుగా వడ్డించి వేరువేరునను
నరుదొందఁగడిగడి కందిచ్చుచుండఁ – గరమర్థితోఁగడిగడి కందుకొనుచు
భక్తవత్సలుఁడగు పరమేశ్వరుండు – వ్యక్తిగాఁజేసేత నారగించుడును
ముప్ప్రొద్దుఁబ్రాణలింగప్రసాదంబు – సుప్రసన్నత జంగమప్రసాదంబు
గూడ భోగించుచు [1]రూఢి వెంపార – వేడుకఁ**జౌడయ్య** విహరించుచుండ
"హరునకు నిత్యంబుఁ**గరికాలచోడ** – నరపతి [2]యారోగణము నెమ్మిఁజలుపఁ
బలకలనేఱినప్రాసంగుఁబ్రాలు – నలవడ మున్నూఁటయఱువదివుట్లు
ననయంబుఁబత్రశాకాదులలోని – కననేల ముప్పందు మట మిరియాలు
నారగింపనె కాని యప్పదార్థముల – పేరీశ్వరుఁడెఱుంగ నేరఁ"డనంగఁ
గమియంగఁ బదపదార్థములు వడ్డించి – నమర సాయుధుఁడయి యవల నిల్చుండ
నప్పటి కప్పటి కాస్వాదనములఁ – జప్పుడు వినఁబడ నెప్పుడు శివుఁడు
ననురాగలీల నెక్కొన నారగించె – ననఁగ విందుము దొల్లి యదియునుగాక
**మాదరచెన్నయ్య** మహనీయకీర్తి – యాదట మదిఁదులుకాడఁదొల్నాటి
యంబకళంబు జిహ్వాగ్రంబు వళ్లె – రంబుగాఁ దన కర్పితం బాచరింప
శివుఁడారగించెఁబ్రసిద్ధిగా నందు – రవిరళప్రీతి మైనట్లు వెండియును
**వీరచోడవ్వ** దాక్షారామమందు – నారగింపఁగఁజవియైనఁగంపించెఁ
గుడుకతోడన మఱి గడి యెత్త నోడి – తడయక పులగంబు దాసిచేఁబనుపఁ
"బుత్తెంచె మాయక్క వులగంబు నీకుఁ – జిత్తజాంతక! యిదే చేకొను" మనినఁ
బ్రీతిమైఁజెయిసాఁచి భీమేశుఁడతివ – చేతిపులగముఁజెచ్చెరఁబుచ్చికొనుచు
నారోగణముసేసి యందఱుఁజూడఁ – గోరఁగ్రంగన వైచె గుడివెలి ననఁగ
వినఁబడె మఱియును మును గథలందుఁ – గనుఁగొనఁబడియె నేఁడనురాగలీలఁ
గటకానఁ**జౌడయ్య**గారిచేఁగళ్లు – నిటలాక్షుఁడారగించుట నిప్పు" డనుచు
నఖిలభక్తావళి యంతఁగీర్తింప – సుఖలీల నుండె నా **సురియచౌడయ్య**
**సురియచౌడయ**గారి చరితంబు వినినఁ – గరమర్థిఁజదివిన గారవించినను

1. రూఢి 2. యారోగిణము.

సహజజంగమలింగసదయాభివినుత – నిహితప్రసాదవినిర్మలచరిత
స్వానుభవాతిశయానందమలరు – మానిత[1]సద్భక్తి మహిమ వర్ధిల్లు

**తెలుంగు జొమ్మయ్య కథ**

మలహరసద్భక్తి[2]మహితుండు మఱియుఁ – **దెలుంగు జొమ్మయ్య** నాఁ డ్రిమలాపహరుడు
సంతత సద్భక్తి సహజసౌభాగ్య – వంతుఁడు సర్వజీవదయాపరుండు
పుణ్యపాపోన్ముక్తపూతమానసుఁడ – గణ్యపుణ్యోదయకారణాత్మకుఁడు
ఆనందకలిత మహాప్రసాదావ – ధానసంధాన విద్యావిశారదుండు
నశ్రాంతశుద్ధశివాచారయుతుఁడు – విశ్రుతాంచితకీర్తి వీరసత్తముఁడు
లోకహితార్థుఁడలోకుండు శివప – దైకనిష్ఠాపూరితాంతరంగుండు
కలియుగజనితమృగవ్యాధరుద్రుఁ – డలఘుపరాక్రముఁడసమానదాని
శివభక్తిపరతంత్రసిద్ధుండు సకల – భువనపావనుఁడన భువి నుల్లసిల్లి
లింగార్చనక్రియాలీల సల్పుచును – జంగమారాధనాసక్తిఁగ్రాలుచును
ఘనరూఢిఁగళ్యాణకటకంబునందు – ననురాగలీల **జొమ్మయ్య** వర్తింప
నంత నిక్కడను **శివానందుండు** నా ని – రంతరలింగతద్ధ్యానాత్ముఁ డగుచుఁ
బరమపరానందపారవశ్యమునఁ – బరమకాష్ఠీభూతభావనఁదగిలి
శ్రీశైలమున సమంచితనిర్ఝర ప్ర – దేశంబునను సమాధిస్థుఁడై యుండఁ
బదనఖంబులు భువిఁబర్వి వెల్గుచును – విదితమై క్రిందికి వేళులు వాఱ
నలిఁగరస్థలి నఖములు వెలుంగుచును – దెలుపారి మీఁదితీగలభాతిఁబ్రబల
నురుముక్తకేశంబు లొడలు గప్పంగ – ధర నీలగిరిమాడ్కి గురుమూర్తి దనర
నాయయ్య శిష్యుఁడత్యాయతభక్తిఁ – బాయక కొల్చుచుఁబరతంత్రలీల
ననయంబుఁగందమూలాహారుఁడగుచు – ననుషక్తిఁదానును నచటన యుండ
నంత వినోదార్థు లగుచు గంధర్వ – కాంతలుఁబతులు నక్కడ పోయి పోయి
"తెల్లఁదీగలతోడ నల్లఁదనంబు – నల్లది యెట్టిదో?" యనుచు "దూరమున
శిలయొకో శిలకుఁదీగలు [3]గల్గుటెట్టు – లిల వృక్షమో వృక్షమే నాకులెవ్వి?
ముదియెల్గు గానోపుఁగదలఁజాలకయ – యదె యున్న"దనుచు నంతంత వీక్షింప
సుదతులఁబరుషులఁజూపులఁజూచి – యదయుఁడై శిష్యుఁడత్యాగ్రహంబొదవఁ
"గానరా! పరమయోగానందమూర్తిఁ – దా నన్యభావనఁదలఁపంగఁదగునె?

1. శివభక్తి 2. కలితుండు 3. గల్గెనెట్టు?



యజ్ఞానులార! మృగాకృతిగాఁగఁ – దజ్జ్ఞునిఁబోల్చిన తప్పునఁబోయి
పుట్టుఁడు మృగములై భువి" నంచు నప్పు – డిట్టలంబుగ శాప మిచ్చుడు వారు
నంత భయభ్రాంతు లగుచు [1]నక్షణమ – యంతంతఁబ్రణమిల్లి "యక్కటా!మీర
లానతిచ్చినయట్టు లన్నియునేల – కానమి మాయందుఁగలిగె నెంతయును
నదియును మున్నపహాస్యభావమున – మది నొండు దలఁచినమార్గంబు గాదు
ఐనను జాల నజ్ఞానంబు గలదు – తా నెట్టు దప్పునే తమకర్మఫలము?
ఇన్నియు నననేల? యీ శాపమోక్ష – మెన్నఁడు మా? కింక నెయ్యది దెఱఁగు?
ఇప్పుడు దయసేయవే మహాపురుష! – తప్పులు సైరించి దయతోడ" ననినఁ
"దప్ప దమోఘంబుఁదమశాప మనినఁ – జెప్పెడి దొండేమి సెచ్చెరమీరు
పుట్టుఁడు మృగములై భువిని **గళ్యాణ – పట్టణాంకితవన** ప్రాంతంబునందు
శూలిభక్తుఁడు **దెల్గుజొమ్మయ్య** యనఁగ – భూలోకపావనుఁడాలింగమూర్తి
చే మీకు మరణంబు సిద్ధించెనేని – కామించు శాపమోక్షంబగు మఱియు
నాయయ్యచేఁజచ్చునమ్మాత్రఁజేసి – పాయనిముక్తిసంపదయు సిద్ధించు"
ననవుడు నట్లకా కనుచు గంధర్వ – లనురాగమునఁగటకాంతికంబునకు
మృగములై తొల్లింటిమెలఁతలుఁబతులుఁ – దగిలి యరణ్యమధ్యమునఁజనింప
మదిలోనఁ**దెలుంగు జొమ్మయ**గారి రాక – కెదురుసూచుచునున్న యెడనొక్కనాఁడు
నలరుచు నయ్యరణ్యాంతరంబునను – **దెలుంగు జొమ్మయ్య** వత్తిరిఁగోయుటకును
మెల్లన యేఁగఁగ మృగము"లితండ – తెల్లంబు గానోపుఁ **దెలుంగు జొమ్మయ్య**"
యనుచుఁజుట్టును నిల్చి యఱచుచునెందుఁ – జననీక యరికట్టుకొనె నొక్కమృగము
"మరణంబుమీచేత [2] మాకైనఁగాని – కరుణాత్మ! శాపమోక్షంబు [3]దా లేదు
వేడుకమై నిత్యవిధి[4]కైన వేఁట – లాడవే మా మీఁద నఖిలోపకార!
గంధర్వులం దొక్కగార్యకారణము – సంధిల్లి మాకిట్టి శాపంబు వచ్చె"
ననుచుఁదద్వృత్తాంతమంతయుఁజెప్పి – "కనుఁగొన శాపమోక్షం [5]బగుటకును
దా నిక్క మిదియు మీచే నేము సావఁ – గానప్డు దివ్యవిమానము ల్వచ్చి
కొనిపోవుఁగైలాసమునకుఁదత్క్షణమ – జనులకు నెల్ల దృష్టప్రత్యయముగ
నరయ శాపంబె మున్నాయయ్య యీగి – వరము గాకిది మాకుఁబరికించిచూడ
నవధరింపఁగఁగల దది యెట్టులనినఁ – దవిలి ము న్నేము గంధర్వ లోకులము

1. గంధర్వు– లంతంత 2. మఱిగల్గకున్న 3. గా 4. నీవు 5. బుగాంచుటకు–మహిమీఁద మీచేత మఱిమృతిఁ బొంద – మహనీయ

అమలాత్మ!  మాకింక నపవర్గపదవి – సమకూరు మీచేతఁజచ్చుటఁజేసి
యదిగాన మమ్ము దయామతిఁజూచి – బ్రదికింపవే" యని ప్రస్తుతింపంగ
నక్షయమూర్తి దివ్యజ్ఞానదృష్టి – నీక్షించి తత్కార్య మిట్లౌట యెఱిఁగి
యరుగుట సాలించి యంతన మగిడి – కరమర్థిఁగొంతవత్తిరిఁగోసికొనుచు
సరసర నసమానశరణాగ్రగణ్యుఁ – డరుదెంచి [1]కనుఁగొని యనురాగలీలఁ
బచ్చనితలచుట్టుఁబచ్చకు[2]ప్పసము – నచ్చెరువుగ విల్లు నమ్ములు వట్టి
నందనవన మరణ్యంబుపై విడియు – చందంబునను సహజక్రియఁబొల్చు
బలువేఁటకాఁడు, నాపంచాస్యుమీఁడు – చలమును బలమును గలజాగిలములు
దనుఁబరివేష్టించికొని యేఁగుదేర – ననఘుండు **జొమ్మయ్య** సన నరణ్యమున
సమ్మృగావలి యుబ్బి **జొమ్మయ్య** మీఁదఁ – గ్రమ్మనఁజనుదేరఁగా వేఁటకాఁడు
సడి గేల డుయ్యుడు సారమేయములు – నడర **నంకమ**పోలె విడిపించికొనుచుఁ
బొంగి మనోవేగమునఁగూడ ముట్టి – యంగద మృగముల నార్చుచు వ్రేయఁ
గుక్కలఁ జంకించి కోలల కెగసి – చక్కన **జొమ్మయ్య** శరముల కెదిరి
చచ్చుచు శాపమోక్షంబులు గాంచి – యచ్చోన గంధర్వులై నిల్చి **తెలుఁగు**
**జొమ్మయ్య**గారి పాదమ్ముల కెరఁగి – సమ్మదలీలఁ బ్రశంస సేయుచును
నతనిచే మరణంబు లగుటను జేసి – యతులితాగణ్యపుణ్యప్రాప్తిఁబొంది
ప్రవిమలకనక [3]దివ్యవిమానములను – శివలోకమునకుఁజెచ్చెర నేఁగుచుండఁ
గ్రూరత [4]నెగిదెడు కుక్కల మొఱఁగి – తా రేయుశరములఁదప్పించుకొనుచు
**జొమ్మయ్య** చేతన క్రమ్మనఁజచ్చి – యమ్మృగరూపంబు లఱఁగి మ్రొక్కుచును
గంధర్వులై కనకవిమానచయము – సంధిల్ల నేఁగు టాశ్చర్యంబు గాదె
"యదె కుక్కలేఁగు నా నంతలోపలను – నిదె పోయెఁబోయెనా నెగసిపోయెదును
ఎప్పాటనైనఁదా రేయుబాణములు – తప్పునే? తాఁకియుఁదాఁక వయ్యెడిని
మృగముల కేనాఁట మించివెలుంగు – గగనంబునను గనకవిమానపంక్తి
మేదినిఁగారణమృగరూపధారు – లాది వీ రెవ్వరో యాతఁడ యెఱుఁగు
నితరుఁడే **జొమ్మయ్య** యిహలోకరుద్రుఁ – డతులకారణపురుషావతారుండు"
నని తోడివేఁటకాండ్రచ్చెరువంది – వినుతింప నిబ్భంగి వేఁటలాడుచును
నిచ్చటిమృగముల నెరిఁబొలియించి – యచ్చుగా శివపురి కనుపుచు[5] నుండి
యుర్వీశుఁడాదిగా నొక్కొక్క[6]నాఁడు – సర్వజనంబులుఁజనుదెంచి చూడ

1. వేవిన నను 2. కుబుసము 3. విమానమ్ములెక్కి 4. నెగడెడు 5. నుండె–నుర్వీ 6. మాటు.



హరభక్తవితతియు [1]నరుదెంచి [2]చూడ – "నరు"దని పొగడ **జొమ్మయ్య** వీక్షించి
"పృథుగురుధ్యాన మన్బిందివాలమునఁ – బ్రథితసంసారమున్ పంచాస్యుఁద్రుంచి
మును భక్తదర్శనం బను ముద్గరమునఁ – జనుపురాకృతకర్మమను దుప్పిఁజంపి
గుర్వాజ్ఞ యనుకత్తి కుంతంబునందుఁ – బూర్వాశ్రమంబను పులిఁబడఁబొడిచి
సుజ్ఞానమను వాఁడి సురియఁ జేపట్టి – యజ్ఞానమను వరాహంబుఁజెండాడి
యాయతి సద్భక్తియను తోమరమున – మాయాప్రపంచ మన్మనుఁబోతుఁ[3]దునిమి
వినుతశివాచారమను కుఠారమున – జినలోకపథమను చివ్వంగిఁజదిపి
విమలప్రసాదమ న్విల్లు పూరించి – భ్రమితేంద్రియము లనఁబడు నిర్లనేసి
భాషాప్రణీతమన్బడు బల్లగోల – నీషణత్రయమను నెలుఁగు కన్నొడిచి
హరమహత్త్వంబను నద్దాయుధమునఁ – బరవాదులను మృగోత్కరముఁగీటడఁచి
వెలసిన యా[4]బలువేఁటకానికిని – నిలమృగంబులఁజంపు టిదియెంత వెద్ద
యదిగాక పరికింప నరుగుచో నతని –  పదఘట్టనలఁ జచ్చు బహుజంతువులకు
నగు మోక్షమనిన **జొమ్మయ్య**చేఁజచ్చు – మృగము లేఁగుట సోద్యమే శివపురికి"
ననుచు **నబ్బసవయ్య** యర్థిమైఁబొగడ – ఘనకీర్తిఁ గళ్యాణకటకంబునందుఁ
జోద్యతరంబుగా **జొమ్మయ్య**  సిరస – ముద్యద్గుణాంకుఁడై యుండెఁదెల్లముగఁ
దెలుఁగు **జొమ్మయ్య** నిర్మలచరిత్రంబు – నలవోకఁజదివిన నర్థిమై విన్న
[5]రాజ్యాభిషిక్తుఁడై రంజిల్లుఁబ్రీతిఁ – బూజ్యత [6]లింగసామ్రాజ్యంబుఁబొందు
సారజంగమపాదసరసిజయుగ్మ – ధారాళమకరందధౌతశిరస్క!
శారదనీరదహారనీహార – తారామరాహారధౌతయశస్క !
యంచితకర్ణరసాయనకల్ప – సంచితపరిపాకసత్యవచస్క !
మహనీయరుద్రాక్షమాలికాభూతి – విహితమండనకాంతి విలసదురస్క !
సంగాఖ్య! సమసుఖసదమలప్రాణ – లింగనిరంతర లీనమనస్క !
ఇది యసంఖ్యాతమాహేశ్వరదివ్య – పదపద్మసౌరభభ్రమరాయమాణ
జంగమలింగప్రసాదోపభోగ – సంగతసుఖసుధాశరధినిమగ్న
సుకృతాత్మ పాలుకురికి సోమనాథ – సుకవిప్రణీతమై శోభిల్లి తనరి
చరలింగఘన**కరస్థలి విశ్వనాథ** – వరకృపాంచితకవిత్వస్ఫూర్తిఁబేర్చి
చను బసవపురాణమను కథయందు – ననుపమంబుగఁబంచమాశ్వాస మయ్యె.

1. ననయంబు 2. చూచి–య 3. ద్రుంచి 4. నెఱ 5. రాజితభక్తి సామ్రాజ్యంబు నొందు 6. నభిమతభోగముల్ గలుగు.

# షష్ఠాశ్వాసము

## ఏకాంత రామయ్యగారి కథ

శ్రీ మన్మహాభక్త చిరతరవరద – యామృతపూరవిహారసంగాఖ్య
మఱియు నేకాంత రామయ్య నానొక్క – నెఱవాది భక్తుండు గఱకంఠమూర్తి
శమదమస్ఫురణానుషక్తుండు జైన – సమయకోలాహుఁడమితప్రతాపి
యతులితశివసమయప్రతిపాలుఁ – డతిశయవీరభద్రావతారుండు
నిస్పృహేంద్రియగుణాన్వీతచేతనుఁడు – నస్పృశ్య భవిజనుఁడపగతభయుఁడు
లింగ[1]సమ్యజ్ఞాని లింగావధాని – లింగగంభీరుఁడభంగురకీర్తి
యేకాంతభక్తి సుశ్లోకుఁడు మర్త్య – లోకపావనుఁడు త్రిలోకవంద్యుండు
ధీరమహోదారశూరగంభీర – సారగుణస్తోమధౌరేయుఁ డనఁగ
నెగడి నిత్యక్రియానియతప్రయుక్తి – దగిలి శివార్చనాంతమున నత్యర్థిఁ
బ్రమథలోకమున కుద్యమలీల నరిగి – విమలాత్మవీరక వీరభద్రాది
గణ నికాయములకుఁబ్రణమిల్లి వారి – గుణకీర్తనలు సేసి కోర్కి దైవాఱ
శివభక్తి తత్త్వానుభవ సదేకాంత – [2]సవిశేషసుఖసుధాశరధి నోలాడి
యెప్పటి[3]యట్లిల కెలమి నేతెంచి – ముప్పూఁట నిమ్మార్గమునఁజరింపంగ
బసవనిభక్తి సంపత్సముద్రంబు – దెసల ధరాస్థలి దివి నిట్టవొడువ
స్వచ్ఛుండు సందర్శనేచ్ఛ నేతెంచి – ప్రచ్ఛన్నయుక్తి నబ్బసవనిఁజూచి
"యాకటకమునందు నేకాంతరాముఁ – డేకాకియై చరియించుచునుండ
నొక్కజైనుఁడు సెప్పు లూడ్వకవచ్చి – చక్కన శివనివాసంబుఁజొచ్చుడును
లోపల రామయ్య గోపించి చూచి – "యీ పాపమున కింక నేగుఱి గలదు
రోరి! జైనుఁడ! తగ దుడురాజధరు న – గారాంతరముఁజెప్పుఁగాళ్లఁజొరంగఁ;
గడవఁజొచ్చితినని మృదునకుఁజాఁగఁ – బడి మ్రొక్కు చెప్పులు వాఱంగ వైచి
యటుగాక తక్కిన నంతకోద్దండ – పటుదండ బాధలపాలైతి పొమ్ము

1. మర్మజ్ఞుండు 2. సవినయ 3. యట్లట్లయెలమి.



ఇంకఁజెప్పులతోన [1]యిట్లుంటివేని – శంకింప కిప్పుడ సందుసందులకు
నఱకుదు" ననవుడుఁబిఱుసన కతఁడు – "నఱిముఱి నింతేల యాగ్రహించెదవు?
ముక్కంటిగుళ్లకు దిక్కు గల్గితివి – నిక్కపు భక్తుండ! నీకేల వెఱతు
గుడి వసదియ వేల్పు[2]లొడయండు జినుఁడు – నుడువకుకాదేనిఁబడయుమా[3]మగిడి
దల దర్గియిప్పుడ మలహరుచేత; – నిలనీవె భక్తుండ వితఁడె వే"ల్పనిన
"నితనిఁజంపుట[4]యిది యెంత దలంపఁ – [5]బ్రతినఁజూపమి భక్తిపంతంబు గాదు
శిరమిత్తుఁబడయుదు జినసమయంబు – శిరము ద్రుంపుదు బాసఁజెల్లింతు" ననుచు
శ్రీకంఠుభక్తికిఁజేవ యెక్కంగ – **నేకాంతరామయ్య** యిట్లని పలికె
"శిర మిచ్చి పడయుట యరిది యంటేని – బరవాది! [6]వినుర మా భక్తులమహిమ
యొక్క భక్తుండు జం[7]బూర్మహాకాళుఁ – డక్కజంబుగ శిర మభవున కిచ్చి
యిలయెల్ల నెఱుఁగంగ నెలమితోఁబడసెఁ – దల నట్టతోఁ గీలుకొలిపి ప్రాణంబు
అట వార్తగలిగి యీకటకంబునందుఁ – బటుమతి **గోవిందభట్టారకుండు**
శివుని నిర్మాల్య మిచ్చిన మస్తకంబు – [8]తవిలిచి కొను టిది దప్పు దప్పనుచుఁ
గఱకంఠునకుఁదల[9]దఱగి పూజించి – నెఱయ మూన్నాళ్లకు మఱియొండుశిరము
వడసె వెండియు నొక్కభక్తుఁడిట్టిదియుఁ – గడు నపహాస్యంబుగాఁబ్రతిష్ఠించి
మూఁడుదినంబులు ముక్కంటి యచట – లేఁడొ తాఁజచ్చినవాఁడొ కా కనుచు
**మొఱటద వంకయ్య** యఱిముఱి శిరము– తఱుగంగ మొలవఁగఁ దఱుగఁగ మొలవఁ
దఱిగెడు తలలును బూన్పని శిరముఁ – [10]బూన్చినపిమ్మటఁబుచ్చెడు శిరము
బూన్చెడి శిరమును మొలచిన శిరము – మొలవఁగ లోలోన నలిఁదోఁచు శిరము
మొలచెడు శిరమును మొలచిన శిరము – మొలవఁగ లోలోన నలిఁదోఁచు శిరము
తఱిగెడు శిరమును దఱుగని శిరము – తఱుగక తనుదాన యొఱఁగెడు శిరము
సరసర హరుమీఁద సంధిల్లుశిరముఁ – బొరి నొయ్యనొయ్యన పొడవగు శిరము
కన్నులార్చుశిరముఁగాదనుశిరము – మిన్నక శివుమ్రోల మెలఁగెడి శిరము
నున్నతి మీఁదన యుండెడుశిరము – సన్నసేయు శిరము జరిగెడు శిరము
నారుచుశిరము నౌనౌ ననుశిరముఁ – గేరెడుశిరమును దారెడుశిరముఁ
బారుతెంచుశిరంబుఁబైపడుశిరము – గారవంబున శివుఁగలసెడి శిరము

1. ఇట్లుండితేని 2. టొ, నొ 3. మగుడి 4. యెంతయిదిముదలింప 5. ప్రతిఁజూపకుండుట (కునికిదా) 6. వినర 7. బురి 8. తవిలించినిలుచుట 9. దఱిగి, 10. బూన్పంగ నొయ్యనఁ బొందగు శిరము.

[1]ననలంబుమీఁదను నలరెడు శిరము – ననలంబు మ్రింగుచు నటయుండుశిరము
బొబ్బిడుశిరమును నుబ్బెడుశిరము – గుబ్బనఁబడి తద్ద గునిసెడుశిరము
నాలుక త్రోయుచునలి గొనుశిరము – శూలిని వెక్కిరించుచు నుండుశిరము
నుఱికుర్కిపడుశిర మొఱగెడుశిరము – మఱియు సంధిల్లుచు [2]మఱపడుశిరము
పొగడెడుశిరమును నగియెడుశిరముఁ – దెగడెడు శిరమును దీవించుశిరము
శరణనుశిరమును జయవెట్టుశిరము – సరసమాడుశిరముఁజదివెడుశిరము
[3]మలరెడుశిరమును మార్కొనుశిరము – [4]దలఁకకీశ్వరుతోడఁ దాఁకెడుశిరము
'బా'పనుశిరమును బాడెడుశిరముఁ – 'జాపంద'యని శివు జంకించుశిరము
నిప్పాటఁ[5]బసికమై నీశ్వరుఁబూన్పఁ – గుప్పలుగొని తల ల్గుడిఁబిక్కటిల్ల
మారారి విస్మయమానసుం డగుచు – "నోరోరి! వంక! నా కూరుపు వోదు
ఓడితినన్నను మేడెమువాడువఁ – బాడియే నీ వీరభక్తికి నిలువ
నా వశంబే?" యని దేవదేవుండు – నావంకతందె శ్రీహస్తంబు వట్టి
యనురాగమునఁబొల్చు నత్తలలెల్లఁ – దన లింగమూర్తిలోనన ధరియించె
శంకించుచును నరు ల్సంస్తుతి సేయ – **వంకయ్య** శివునిమాఱంకమై గెలిచె
నిటువంటి భక్తు లనేకులు గలరు – కుటిలాత్మ! విన నీకుఁగొలఁది గాదెట్లు
నెఱుఁగవే తొల్లి మీయేగ్గడవారిఁ – బఱపిన మా శివభక్తులమహిమ;

## తిరునావుకరశు కథ

**తిరునావలూర**ను పురిఁ**దిరునావ – కరిశుండ**నఁగ జైనగురుఁడొక్కరుండు
జినసమయాచార్యుఁడనఁజనునట్టె – మును శూలకుట్టెత్తి మూల్గుచు నేలఁ
బడి పొరలుచుఁబ్రాణపరితాపమందు – నెడ వారి [6]తోఁబుట్టు వేతెంచి చూచి
"యీ మంత్రతంత్రలూలామాలములను – నో మలదేహి! నీ కుడుగదు నొప్పి
బ్రదుకంగవలతేని భక్త[7]సమ్మతిని – మదనసంహరు దివ్యమంత్రంబు గఱవు
వేగంబ నీకు నీ రోగమయ్యెడును – రాగిలి యీప్సితార్థములు వొందెడిని"
ననవుడు "భక్తుండ నయ్యెదనింక – ననుమాన మొక్కింతయును వల" దనుచు
శపథంబు నేయుడుఁజయ్యన నతివ – త్రిపురారిభక్తులఁదివుటఁదలంచి
యనుపమదివ్యపంచాక్షరీమంత్ర – మున భసిత మలంది మొల దిగఁదుడువ
శూలకుట్టుడుగుడుఁజోద్యంబు నొంది – యా లలనకు నతఁడష్టాంగమెరఁగి
"పడఁతి! నీకతమున బ్రదికితి నింక – నడర భక్తుండనే నయ్యెద" ననుచు

1. ఈ రెండుపాదములు నొక ప్రతిలోఁగలవు 2. మఱుపడు 3. మలసెడు 4. దలర 5. బసిగమై 6. తోబుట్టుగే.



శ్రీపతినాథునాజ్ఞాపనఁజేసి – **నాపగలూరి**కి నరిగి యక్కడను
నిలఁబంకమందున్న జలరుహమట్ల – వెలివాడనున్న నిర్మలసుచరిత్రు
గురుమూర్తిఁగదిసి **యత్తిరునావకరిశుఁ** – డరుదంద సాష్టాంగుఁడై మ్రొక్కి నిలువ
ముదమునఁదద్గురుమూర్తియు [1]నతనిఁ – బదపడి శివభక్తిపరుఁజేయఁదలఁచి
తనదు కృపావలోకనమాత్రఁ[2]జేసి – నొసలి దుర్లేఖలు [3]గసిమసి సేసి
శివతీర్థకలశాభిషేక మొనర్చి – సవిశేషలింగ[4] సంస్కార మొనర్చి
సంచిత శివహస్త సంగతుఁజేసి – పంచభూత [5]వికారపథమునఁబాపి
యంగలింగనియుక్తి మంగళక్రియల – సంగత[6]సత్యప్రసాదాంగుఁజేసి
విగతవాయుప్రాణవిధు లాచరించి – నెగడ లింగప్రాణనిష్ఠితుఁజేసి
సిద్ధమంత్రమునఁబ్రసిద్ధుఁగావించి – [7]శుద్ధాత్ముఁజిన్మయజ్యోతిఁగీలించి
వినుతజీవన్ముక్తికిని హేతువైన – యనుపమ శివరహస్యార్థము ల్దెలిపి
తమ కరుణాప్రసాదముఁగృపసేసి – విమల సద్భక్తిసంవేత్తఁగావింపఁ
**దిరునావకరిశి**యుఁదేజిష్ణులీలఁ – బరమశివాచార పారవశ్యమున
భవభక్తవితతికి భువిఁజాఁగిమ్రొక్కి – శివమహోత్సవములు సేయఁగఁబనిచి
వాహనవస్త్రసువర్ణాభరణ స – మూహార్చనక్రియ ల్ముదమునఁజలిపి
వలపారఁదన మనోవాక్కాయ కర్మ – ములఁ బ్రాణదేహార్థముల నివేదించి
భూతిరుద్రాక్షవిభూషణపరమ – పూతవ్రతస్థుఁడై భువిఁబ్రవర్తింప
"నన్యదర్శనమార్గుఁడయ్యె వీఁ"డనుచు – నన్యాయమున జైను లందఱు నతని
[8]గరికిఁబెట్టుడు భద్రకరి ముట్టనోడెఁ – గరిచర్మధరుబంటుఁగరి యేమిసేయు?
విషము వెట్టుడుఁగుడ్చి విజయుఁడై నిలిచె – విషసంహరునిబంటు విష మేమిసేయు?
[9]బహ్వగ్నిఁద్రోవఁబైఁబడ నాఱె వహ్ని[10] – జిహ్వాంతకునిబంటుఁజిచ్చేమిసేయు?
జలముల ముంపుడుఁజాలవు ముంప – జలమౌళిబంటును జల మేమిసేయు?
జంపంగ నేక్రియఁజాలక తమ్ముఁ – జంపునో యితఁడని శరణుసొచ్చుదును
గంటకులగు జైనకర్ములఁగాచి – తొంటిలాంఛనములు దుడిపించి యంత
రుద్రాక్షభసితాదిరూపిత పంచ – ముద్రాధరులఁజేసి రౌద్రముతోడ
వెసజైనప్రతిమల విట [11]తాటమాడి – వసదులన్నియు వ్రచ్చి వైపించెఁగాదె
లలి జైనసమయకోలాహలుఁడనఁగఁ – గలుగు మా **తిరునావకరిశి** దేవుండు

1. నంత 2. నతని 3. గసిబిసి. 4. సంస్కారుగాఁ జేసి 5. శరీరబంధంబు 6. సద్యః 7. శుద్ధాత్మఁజిన్మయ 8. కరినిగొల్పుడు 9. బ్రహ్మాగ్ని...10. జిహ్వ 11. తటమార్చి.

## ఇరుత్తాండి కథ

యోరి! చెల్లత్**తిరువాలూర** మఱియు – మారారిభక్తుఁడు మహి**నిరుత్తాండి**
యనఁగ నొక్కయ్య జాత్యంధుఁడై యుండి – మనసిజహరునకు మజ్జనార్థముగ
గుడిముందఱను నొక్క గొలను గావింపఁ – గడఁగి కుద్దాలంబుఁగంపయుఁగొనుచుఁ
ద్రవ్వుచు నొకశంకుదరి నొకశంకుఁ – ద్రెవ్వనిత్రాట సంధించి చేపట్టి
మ్రోఁకువెంటన యెడతాఁకుచుఁజుట్టి – ప్రోఁకగాఁబోయుచుఁబ్రొద్దులు పుచ్చ
జినసమయులు"దీనిఁ జెరుపుదఁ[1]" డనుచుఁ – గనుఁగొని పెక్కువిఘ్నములుగావింపఁ
[2]దలఁక కెప్పటియట్లత్రవ్వుచునుండ – నిలమ్రోఁకుఁద్రెంచి శంకులు వాఱవైవఁ
గఱకంఠుచే నప్డు కన్నులు వడసి – యఱిముఱి వసదులు వెఱికి వేఁటాడి
జినసమయులనెల్లఁజీకులఁజేసి – కనఁబర్చెఁగాదె మాగణ **మిరుత్తాండి**

## పిళ్లనైనారు కథ

మఱియు శ్రీకాళినా మహినొప్పు పురిని – నెఱిశివబ్రాహ్మణునికి నుదయించె
నలరి కుమారుని యంశంబునందు – నలువొప్పఁగాఁ**బిళ్ళనయనా** రనంగ
జనకుఁ[3]డర్కుటఁబెట్టికొని యొకనాఁడు – చని సరోవరతీరమున బాలు నునిచి
తా నఘమర్షణస్నానంబు చేయఁ – గా నభోవీథిని గౌరియు శివుఁడు
మానితదివ్యవిమాననిరూఢ – యానులై చనిచని "యల్ల బాలుండు
మనకుమారునియట్లు" యనుచు నగ్గిరిజ – కనుఁగవఁజూచుడుఁజనుఁగవ సేఁప
నవనీతలంబున కరుదెంచి బాలుఁ – గవుఁగిటఁజేర్చి కూఁక[4]టి వుడుకుచును
దేవి దా శాంభవదీక్షితుఁజేసి – భావించి శివభక్తిపరునిఁగావించి
కడుపారఁజనుఁబాలు గుడిపి పసిండి – కుడుకతో వెండియుఁగొన్ని సే నిచ్చి
గౌరి దా నీశ్వరు కడ కేఁగె నంత – నీరఁ గ్రుంకిన ధరణీసురోత్తముఁడు
భోరున లేచి విస్ఫారదివ్యాంగ – చారుదీధితిఁగ్రాలు సత్పుత్రుఁగాంచి
"యోరి! చ న్నిచ్చినవా రెవ్వ రిచట – నో రెక్కడివి పైఁడికోరయుఁబాలు
నెవ్వ రేతెంచిరి యెక్కడి కేఁగి – రెవ్వల నున్న వా రిట చెప్పు" మనుచు
జన్నిదంబునను జేసాఁచి వ్రేయుడును – దిన్నని నగవును సన్నపుటేడ్పు
కన్నులఁ దొరిగెడు చిన్ని బాష్పములు – గ్రన్నన సెలవులఁగాఱుదుగ్ధములు

1. మ 2. దలర 3. డు నొకనాఁడు దనచంకఁబెట్టి 4. ట.



చెన్నొలయఁగఁగోరఁజేతఁగప్పుచును – "అన్నన్న! నన్నేటి కడిచెదు వినుము
దివి [1]నల్లవోయెడు దేవదేవేశు – కవనుండి యయ్యుమాకాంత యేతెంచె[2]
యురుజటాజూటభాస్వరుకడ నుండి – చిరమణిమకుటభాస్వర యేఁగుదెంచె
తగఁజంద్రరేఖావతంసుని నిల్పి – సుగుణావతంస దత్సుదతి యేతెంచె
ముక్కంటి వాని సమ్ముఖమున నుండి – యిక్కంటితో నొక్కయింతి యేతెంచె
కరమొప్ప నీలకంధరుకడనుండి – సరసరఁగంబుకంధర యేఁగుదెంచె
ఘనచందనాంకువక్షఃస్థలిఁబాసి – స్తనచందనాంకవక్షఃస్థలి వచ్చె
ఉరగేంద్రహారుని యూరులనుండి – కామిని వరహంసగమన యేతెంచె
ముల్లోకములఱేని ముందఱ నుండి – ముల్లోకములకెల్లఁదల్లి యేతెంచె
చన్నిచ్చెఁగడుపార మన్నించి మఱియుఁ – గొన్నిపాలు పసిండికోరలోఁబిదికి
నిలిపి వచ్చిననీలగళునిపాలికిని – బొలఁతి యల్లదె చూడు వోయెడి" ననిన
నా మహీసురుఁడద్భుతాత్ముఁడై యయ్యు – మామహేశ్వరులకు మహిఁజాఁగి మ్రొక్కి
కొడుకుఁదా నఱకట నిడుకొని వచ్చి– మడఁదియుఁదాను సమ్మదలీల నుండఁ
బార్వతీస్తనపయఃపానప్రసక్తి – సర్వజ్ఞతయు వచస్సంసిద్ధి దనరి
వేవిన గుడికేఁగి వేనవేల్విధుల – భావించి పార్వతిఁబ్రస్తుతించుడును
అంబిక స్వర్ణతాళంబు లొసంగ – దుంబురునారదాదుల మీఱి పాడఁ
గరమర్థితోడ శ్రీకాళినాథుండు – విరచితంబై యొప్పు వెలిగొ [2]డుగులును
నక్షయనిధియు ముత్యాలపందిరియు – నీక్షితిఁబ్రతిలేని హేమాసనంబు
ఖండేందుధరుఁడప్డు గరుణింపఁగనక – దండె యందల మెక్కి తా వైభవమున
భాతిగా ధారలు పరమతధూమ – కేతువు నాఁగఁబ్రఖ్యాతమై మ్రోయ
నురుతరలీలఁగులోత్తుంగచోడ – ధరణీశు శివభక్తిపరులఁ గావించి
యలరుచు సుగతసహస్రద్వయంబు – గొలువఁగఁ జను బౌద్ధగురుఁ బాఱఁద్రోలి
లీలమై మఱి రెండువేల బౌద్ధులను – బాలించి శివభక్తిపరులఁగావించి
తిరుమరక్కడయను పురిని బ్రహ్మేశు – చిరకవాటములు సుస్థితిఁదెఱపించి
**తిరు**[3]**నావలూరు** నాఁబరగునప్పురికి – నరుదెంచి జైనులనందు జయించి
యిల సర్పదష్టుఁడై యీ ల్గినయట్టి – [4]వెలమనిప్రాణముల్ వేగంబె పడసి
మధురేశుదేవి సమ్మతమునఁజేసి – మధురకేతెంచుడు మనుజేశుకడకు

1. నదేపోయెడు 2. యేతెంచి (తర్వాతఁగూడ క్వార్థకములేయున్నవి) 3.పాళనాయనా 4. వెలువ.

జైనులు బౌద్ధులు సనుదెంచి యపుడు – "**జ్ఞానసంబంధి**నాఁగా నొక్కశిశువు
నాతతవేదబాహ్యసమయధూమ – కేతుండు నాఁగ్రొవ్వి యేతెంచినాఁడు
పురి వెడలింపుము నరనాథయనిన – "గురుఁడటే యచ్చోఁడనరపతి కతఁడు
నూరక వెడలిం [1]చుటుచితంబుగాదు – వారి నోడింపుఁడే వాదుననైన"
ననుడు జైనులు వదునెనిమిదివేలు – చని [2] యెట్లుఁదర్కింపఁజాలక నిలిచి
నర్ధరాత్రంబప్పు డతఁడున్నయింట – స్పర్ధమైఁజిచ్చిడ జ్వలనుండు వెఱచి
యెదుర నిల్వఁగఁబడ్డ "నేమేమిరోరి! – సదనంబు గాల్పనా చనుదెంచి తీవు
విహ్వాలుఁగావించి వీరభద్రుండు – జిహ్వాలు నీరెండు సేతులుఁదొల్లి
కోసివైవఁగ నున్నకొఱఁత నీముక్కు – గోసివైపించి యేఁగొన మఱిఁగెదవు
జైనుల గీనుల శక్తిసూచెదము – దీనఁదప్పేమి యీ భూనాథుమేనఁ
బ్రాపించి యుష్ణజ్వరస్వరూపమునఁ – దాపమొందింపుము దహన! కాచితిమి"
యనవుడు నతనిదేహంబునఁబొంది – ఘనతరజ్వరరూపమునఁగొని కాల్ప
**మంగయక్కరసి** యమ్మండలేశ్వరుని – యంగన తనపతియనుమతంబునను
తా నప్డు రప్పించి **జ్ఞానసంబంధి** – కా నాతి సాష్టాంగయై విన్నవింప
"వారెవ్వరేఁగలరారాజు నొడలి – యీరుజఁబాపంగ నింతయు [3]వలదు
వలపల మాపాలు వామభాగంబు – బలహీను[4]లార! మీ పాలు మంత్రింపుఁ"
డంచు[5]ను భూతి మంత్రించి చల్లుడును – సంచితంబుగ మేనిసగమును బాసి
వామభాగమునన జ్వర మిన్మడింప – నామును ల్మంత్రింప నగ్గలంబైన
"నారోగ ముడుపవే శ్రీరుద్రమూర్తి – యీరుజ మాన్పవే కారుణ్యపాత్ర
నాతెవు[6]లార్పవే నల్లనైనార – యీతాప[7]మడఁపవే యీద్యచరిత్ర
నాగదఁబాపవే యోగీంద్రవంద్య! – యీగహనజ్వర [8]మిగిరింపు తండ్రి"
యని పెక్కువిధుల మహారవం బులియ – జనపతి ప్రార్థింప **జ్ఞానసంబంధి**
క్రమ్మన భసితంబుఁగలయఁగఁజల్లి – మువ్మాఱు దిగఁదుడ్చి, ముట్టినంతటను
బొఱటిపాండ్యేశుడు వొలుపారమున్ను – పొఱడువోయినవీపు పొఱడుమానుటయు
భావింపఁబొంకయ్యెఁజావకపోవు – నా వీఁపు పొఱడని యాడుమాటయును
**గూనిపాండ్యుండ**ను హీనత్వ ముడిగి – తా నొప్పె నంత **సుందరపాండ్యుఁ**డనఁగ
రెట్టించి దాపటఁదొట్టినజ్వరము – చట్టన నుడుగుడు సతియును దాను

1.పను 2. యెను 3. వలయు 4. రాల 5. దిర్నీరు 6. ల్మాన్పవేఁ 7. ముడుపవే 8. మెడలింపు.



భువి సమస్తాంగము ల్వొందంగ మ్రొక్కి – యవసరోచితసత్క్రియాదు లొనర్ప
"జినమంత్రలేఖయు శివమంత్రలేఖ – యును నగ్నిలో వైవ నొగిఁగాలకున్న
వారిదె గెలు"పని వార్నుడువుడును – ధారుణీశ్వరుఁజూచి "దానఁదప్పేమి
పసిఁడితో నొకగుక్కపల్లు దూఁచుడును – బసిఁడియునెముకయుఁబ్రతివోల్పఁదగునె
పాలకావడి తూన్కి ఱాలఁ[1]దూన్చుడును – బాలును ఱాలును బ్రతియెతలంప
మలయజంబులు వట్టిమ్రాఁకులుఁ[2]దూన్ప– మలయజంబులు వట్టిమ్రాఁకులు సరియె
శివమంత్రలేఖయు జినమంత్రలేఖ – తవిలి కూర్చిన నేమి దత్తుల్య మగునె"
యంచును "శివ"యను నక్షరద్వయము – పంచవర్షాఢ్యుండు పత్రిక వ్రాయ
మండలాధీశుండు రెండు లేఖలును – మండెడు పెనుపగు మంటలో వైవఁ
గరమెత్తు నంతన సురసురఁగమరి – పరవాదిజినమంత్రపత్రంబు గాలె
హరమంత్రపత్ర మయ్యర్కునిఁగన్న – సరసిజదళమట్ల కర మొప్పియున్న
జినమునుల్తల సచ్చియును దోఁక సావ – కనిరి "ముమ్మాటికి నరయఁగవలయు
శివమంత్రలేఖయు జినమంత్రలేఖ – తవిలి కావేరిమధ్యంబున వైవ
నేటఁబోయినపత్ర మోటపత్రంబు – నేటికి నెదురెక్కుడిది నిజం" బనినఁ
"బిడికిటఁగోమటిఁబొడువంగమఱియుఁ – బొడువుమా యనుక్రియఁబోవంగరాదు
ఊరక పోనీకు మోడినవారి – ధారుణిజనులెల్లఁ దల లెత్తిచూడ
నెట్టఁగాఁగాల్పించి యిచ్చట నినుప – కొఱ్ఱులఁ[3]దివియింపు కువలయేశ్వరుఁడ!"
యనవుడు నవుఁగాకయని జినమునులు – జనపతియును దారుఁజనుదెంచి యంత
నాకులు కావేరియందు వైచుడును – జేకొన నెదురెక్కె శివ మంత్రలేఖ
వారి మంత్రం బాకు వఱదనే కలసెఁ – బూరించునే చమత్కారమంత్రములు
అంత నా పిళ్లనైనారు భూనాథు – సంతోష మలరార సద్భక్తుఁజేసి
పదునెనిమిదివేలు మొదలిజైనులను –బొదిగొని పిలిపించి పొరిఁబొరిఁబట్టి
యచ్చెరువందఁ**గులచ్చిరియారు** – చెచ్చెర నటమున్న చేయించినట్టి
కాలియున్న యినుపశూలంబునందు – నోలిఁ[4]దివ్వించుచు వ్రాలి యిద్ధరిణిఁ
బరగఁగ **దిరువూర**ఁబఱపుట వినవె – యురుభక్తియుక్తిమై నోరి జైనుండ!

## నిడుమారని కథ

పుడమినట్టులు సెప్పఁబడియె వెండియును – నిడుమారఁడనునొక్కనిఖిలేశ్వరుండు

1. బూన్చు 2. బూన్ప 3. దీయింపు 4. దీపిం.

దన యేలుభూమి దాఁదక్కఁదక్కెల్ల – జినమార్గవర్తు లౌటను [1]నిషేధించి
మందునకైన భస్మత్రిపుండ్రాంగి – యెందును లేకున్న నెట్లొకో యనుచు
మది విచారించుచు మనుజేశుఁడుండఁ – దదవసరంబున మదనారిభక్తి
మానసుండగు శివజ్ఞానసంబంధి – నా నప్పు డా పాండ్యభూనాథుధరణి
కేతెంచి వీరమాహేశ్వరోద్యుక్తి – భాతిగాఁబ్రభవించి పరవాదులైన
జినమార్గవర్తుల నినుపకొఱ్ఱులను – గనలఁగఁదివియించె ననుచు నీవార్త
విని యట నిడుమారవిశ్వంభరేశుఁ – డనఘుడు దన దేశమున నెన్నఁబడ్డ
జినపదాచార్యుల జినమంత్రయుతుల – ననవేల వీరు వా రనక రాఁబనిచి
“క్షితి నవాంతరశాస్త్రమతములు వన్ని – శ్రుతిబాహ్యులై చను మతిహీనులార!
పశుకర్మ నొకనరుఁబరమేశుఁడనుచుఁ – బశుపతి నెఱుఁగని పశుజీవులార!
పొసపరి శూన్య దుర్బోధలఁదగిలి – భసితం[2]బలందని పాతకులార!
అద్వైతకర్మమాయాకుయుక్తులను – సద్విధిఁజెందని చండాలురార !
అజ్ఞానబోధల కాలయం బగుచు – విజ్ఞానరతి లేని విద్వేషులార!
[3]యెట్టొకో నా ప్రజ నింతగాలంబు – బట్టి దుర్బోధలపాలు సేసితిరి
అటుచూడుఁడా యిప్పు డభవుసద్భక్తుఁ – డటె **పిళ్లనాయినా** రాపాండ్యభూమి
సర్వప్రమాణ దృష్టప్రత్యయములు – శర్వుఁడ కర్తగాఁజనఁబ్రతిష్ఠించి
జినబౌద్ధసమయంబు లను పేళ్లు దుడిచి – మునులఁదివ్వించె నాయినుపకొఱ్ఱులను
గాన కొల్వుండు మా శ్రీనీలగళుని – గానినాఁడిందఱఁగ్రాఁగినకొర్ల
భువిఁదలక్రిందుగాఁదివియింతు” ననుచు – శివభక్తవర్యుఁడాశిష్టేశ్వరుండు
నిశితఖడ్గాయుధాన్వితహస్తుఁడగుచుఁ – బశువరింపుచుఁగొర్లపాలు సేయుచును
నంతలో శివభక్తులగు జినమునుల – సంతోషచిత్తుఁడై చనఁగాచెఁగాదె
నిడుమార భూనాథు మృడుభక్తిమహిమ – సడిసన్న లెఱుఁగవే జైనకష్టుండ!

## నమినంది కథ

మఱియును నమినంది మా భక్తుఁడొకఁడు – వఱలుఁచెల్లత్తి**రువాలూరి**లోనఁ
దిరిగి యార్జించి [4]నే దెచ్చి భర్గునకుఁ – బరువడి వేయుదీపములు ముట్టించు
వ్రతతత్పరతఁబ్రీతి వర్తింపుచుండఁ – గుతగులై జైనులు గూడి యయ్యూర
భక్తుఁడొక్కఁడితనిఁబాఱఁగఁదోలు – యుక్తులెట్లని పెక్కులూహించి చూచి

1. విశేషించి 2. బుఁ బూయని పాపాత్ములార 3. యెట్టకో 4. నెయ్.



యల్ల పొద్దుడిలో సహస్రదీపంబు – లెల్లెడ ముట్టించు[1]నిది నిజవ్రతము
నీయూర నితనికి నెవ్వరు నెయ్యి – వోయకుండినఁదాన పోయెడిఁగాక
యంచు నాలోచించి యతనికి ఘృతము – నించుకయును బోయ నీకున్న వచ్చి
“ప్రాణేశ నేయి యెప్పాటనులేదు – ప్రాణము ల్విడుతు దీపంబు లాఱినను”
అంచుఁబరిచ్ఛేది యగుడు నద్దేవుఁ – డంచిత ప్రీతిఁబ్రత్యక్షమై నిల్చి
“**వరదసోమయ** యర్ఘ్యపణ్యంబులందుఁ – బరువడిఁదొల్లి దీపము లెత్తినట్లు
సజ్జనలీల మజ్జనబావిలోని – యజ్జలంబులు వోయ నలరు దీపములు
కానక యన్యాయకారులై యున్న – జైనుల పనులును జచ్చెడునేఁడ”
యని దేవదేశుఁడానతిచ్చుడును – విని మహానందసంజనితాస్యుఁడగుచుఁ
గొలనిజలంబులఁగోటిదీపంబు – లలరఁగ ముట్టించి యాడుచున్నెడను
నఱవంగ నొక్క వెయ్యయును లేకుండ – నఱిముఱిఁబసులెల్ల హతమైనఁజూచి
“యిదియేమి సోద్యమో యింతలోఁబసులు – మెదలవు గదలవు మృతిఁబొందె నల్ల
పాటిదేవరచేతఁబడసి దీపములు – కోటానఁగోటి యీకొలని నీర్వోసి
ముట్టించినాఁడటే యిట్టి చోద్యంబుఁ – బుట్టునె శివభక్తు లెట్టి [2]వారుండ్రొ?
యిట నెయ్యి వోయంగనీక యుండినను – గటకటా శాపించెఁగాక యత్తపసి
కాదేని [3]బిట్టపిడ్గరఁబసు ల్సచ్చు – నా దీనఁదప్పేమి పోదండుగాక”
యనుచు నేతెంచి సాష్టాంగులై మ్రొక్కి – వినుతింపుచుండ నా ఘనకృపామూర్తి
పసుల ప్రాణం బిచ్చి పరగ జైనులకు – నొసఁగఁడే శివదీక్ష యోరి జైనుండ!

## సాంఖ్యతొండని కథ

వెండియు విను **సాంఖ్యతొండండు** సోడ – మండలంబున శాంతమంగయన్పురిని
బౌద్ధునికడుపునఁ బ్రభవించి మఱి ప్ర – బుద్ధుఁడై బౌద్ధవిరుద్ధసంగతిని
దొలుమేని తనపుణ్యఫలమునఁజేసి – వలగొని శివ[4]భక్తివాసన నిగుడ
“భక్తుండనైనను బ్రదుకంగ నీరు – భక్తుండఁగాకున్న బ్రదుకు [5] దానేల
యామటఁబదిటలింగార్చకుం డనెడు – నామంబు వినఁగరా దేమి కర్మంబొ?
యిట్టి భవద్భక్తిహీనుకడుపునను – బుట్టింపఁదగునయ్య భూతేశ్వరుండ!
యేలయా నన్నింత యీశ్వర! కరుణ – మాలి పుట్టించితి మలధారియింట
నిండారుసద్భక్తి నిను భజియింప – నొం డుపాయమ్ము లే దొగి నట్లుఁగాక

1. టిది 2. భూనుతులొ, వార్గలరొ, వారలరొ 3. కాదెబిట్టకబిఱ్ఱుగా 4. తత్త్వ 5. దాలేదు.

సిద్ధంబు వేదవిరుద్ధంబు జైన – బౌద్ధచార్వాకదుష్పథ సమయములు
మూఁడును నిర్మూలముగఁ జేయు దనుక – మూఁడు ఱాలనువైతు ముప్ప్రొద్దునిన్ను
నిది నిజవ్రత" మంచు నిలఁబ్రవర్తింప – నది వెల్లివిరిసి [1]యేన్నాళ్లు వాఱంగ
గుడి కేఁగరామిని గుదగుదమనుచుఁ – గుడువక [2]యేన్నాళ్లు గడచినపిదప
నేఱు డొంకిన గుడి కేఁగియు "లెక్క – నేఱ నేమిటికి ఱాలెన్ని వైచినను
మిసిమింతుఁడవు గావు మృడ! దేవ! యేను – విసివితి నివియేల వేయును నింక
నీ యొక్కటియె చాలుఁ బో" యని పెద్ద – ఱా యెత్తికొనిపోయి "కో" యని వైవ
శివలింగ మంతలోఁజేతులు సాఁచి – యవుదలఁబడకుండ నాఁగి నవ్వుచును
"మెచ్చితి వరము నీ కిచ్చితి నడుగు – మిచ్చ యెయ్యది" యన నిలఁజాఁగి మ్రొక్కి
"హరియును బ్రహ్మయు నాది నంత్యంబు – పరికించి కానని యురులింగమూర్తి
వేనవేల్విధముల వేదంబు లరసి – కానక వెదకెడు ఘనలింగమూర్తి
సకలసిద్ధాంతశాస్త్రపురాణయుక్తి – నిక మిట్టి దనరాని నిజలింగమూర్తి
సనకసనందనమునిముఖ్యవితతి – మనములు గడచిన మహలింగమూర్తి
శేషవాసుకి బహుజిహ్వోక్త వినుతి – భాషలు గడచిన పటులింగమూర్తి
కంటి మీ శ్రీపాదకమలంబు లేను – మంటిఁజాలదె నాకు మఱియొం డదేల?
మల్లెమొగ్గల వైవ మదనుని వేఁడి – [3]వెల్లఁగాఁజేసితి దెల్లంబుగాదె
ఱాలవైచినఁగరుణాలోకనమునఁ – బాలించితివి భక్తిపరునిగా నన్ను
నన్యాయమున నీకు నహితంబు సేయ – ధన్యత్వ మీగి సోద్యము గాదె జియ్య!
స్తుతియును నిందయు హితము నహితము – మతిఁదలంచినను సమానము ల్గావె
భక్తవత్సల! భక్తపరతంత్ర! భర్గ – ముక్తివల్లభ! దయామూర్తివి గాన
నిందించి నంబన్న నీ గుణకీర్తిఁ – జెంది **మల్హణుఁడు**ను జేరరె నిన్నుఁ
గావున నన్ గటాక్షప్రేక్షణమున – భావించి యీ ఱాయి పూవుఱాయిగను
అలవడ నీయుత్తమాంగంబుదెసను – నెలమి నుండఁగఁజేయు మెల్లగుల్లందు"
ననుచు నవ్వేద[4]బాహ్యంపు మార్గములు – దునిమివైవఁడె **సాంఖ్యతొండండు** జైన!

## కోవూరి బ్రహ్మయ్య కథ

మఱియుఁ**గోవూరిబ్రహ్మయ్య** నాఁగ నొక్క – గఱకంఠుభక్తుఁడఖండితకీర్తి
జినమునులకుఁదనకును దర్కమైన – జినసమయుఁడు వాదమున సిగ్గువడియు

1.. 2. మూ 3. వెల్లగాఁజేసిన వేల్పవునీవు , తెల్లంబుగాఁగ 4. బాహ్యపుసమయములు.



వటమహీజాత మచ్చటనున్నఁజూచి – "యటుగాక దృష్ట మివ్వటముఁగాల్చెదవొ
పడసెదో చెప్పుమా భక్తుఁడ" యనిన – "మడియింపఁగూడదేఁబడసెద" నన్న
మంత్రతంత్రములచే మట్టిగాల్చినఁగు – మంత్ర కుతంత్ర కుమాయాపహారి
వసుధ నీతైయున్న వటముపై నపుడు – భసితంబు సల్లి యెప్పటియట్లు నిలిపి
వఱలఁగఁ గోవూరివసదులన్నియును – జెఱపఁడే బ్రహ్మయ్య సిగ్గేది జైన!

## తేడర దాసయ్య కథ

మఱియును విను పొట్లచెఱు వనుపురిని – వఱలంగ నేణ్బూరు వసదులు గట్టి
వెలయ ము న్నిరువదివేల్జినమునులు – గొలువఁగ జినకులగురుఁడొక్కరుండు
నా బల్లహునకు ముఖ్యాచార్యుఁడగుచుఁ – దా బుద్ధిసెప్పుచుఁదగఁబ్రబోధింప
క్షితిపతియైన [1]యా **సింగబల్లహుని** – యతివ సుగ్గలదేవి యకలంకచిత్త
తానును **తేడరదాసయ్య** వరద – యానూనసద్భక్తిమానస గాన
తమగురుస్వాములౌ దాసిదేవునకు – రమణి యాస్థితి విన్నపముసేసి హితులఁ
బుచ్చుడు నప్పు **డప్పొట్లచెర్వు**నకు – నచ్చెరు వందంగ వచ్చునయ్యెడను
జినమును ల్వెక్కు గుచ్చితములు సేయఁ – గని నూఁకుచును లెక్కగొనకేఁగుదేర
నగ్గురు శ్రీచరణాంబుజంబులకు – సుగ్గలదేవి యుత్సుకలీల మ్రొక్కి
భామ గురుప్రసాదామృతాంభోధి – లో ముదంబారఁదేలుచు మునుంగుచును
వేఱొకతావున విడియింప నతఁడు – మీఱివచ్చుట నటమీఁద నెట్లగునొ
యనివచ్చి జినమును ల్వినిపింప రాజు – జినసమయుఁడుగాన వనిత కిట్లనియె
"సతి కొక్కగతియును బతి కొక్కగతియు – నతివ! యేలోకంబునందైనఁగలదె
యెక్కడి గురువు[2]లు నేనాఁటిబుధులు – చక్కన నంపుము జైనులు విన్న
విపరీత మగు నింక వేయును నేల – చపలాక్షి! యనుపు మీసాముల" ననిన
నధికకోపోద్రిక్తయై "వీరిరాక – యధమజైనులపెంపు లడఁపనె కాదె
పురుషునకు సతికిఁదెరు వొకఁడైన – గురుశిష్యులకు వేఱె తెరువులు గలవె
స్త్రీవివాహమునాఁడు సేసినబాస – నీవ విచారించుకో వేయునేల?
గడియించుకో భార్య గలదేని యోర్తు – విడువుము నన్ను నే మృదుఁగాని యొల్లఁ
గాదేని యోడింపు వేదశాస్త్రాది – వాదతర్కప్రతివాదంబులందు"
నంచు సుగ్గలదేవి మించిపల్కుడును – గుచ్చితులగు జైన[3]కూళలందఱను

1. దే 2. లిందేటివి 3. గురులనం.

బిలిపించి **బల్లహు**కొలువున వారి – వలపట నవరత్న కలితమై తనరు
సింహాసనాసీనుఁజేసి యాజైన – సంహారుఁడైనట్టి సద్గురుదేవు
దాసయ్యపాదము ల్డాసి యొత్తుచును – నా సుగ్గలవ యుండె నా జినమునులు
[1]మంత్రతంత్రానేకమాయాదులను గు – యంత్రమహేంద్రజాలాదివిద్యలను
అద్వైతశూన్యమాయావాదకర్మ – విద్వేషమున [2]జైనవితతి దర్కింప
వేదవేదాంతాదివాద సిద్ధాంత – వాదతర్కముల సంపాదించి మించి
న్యాయవైశేషి కాద్యఖిలవాగ్ధృష్ట – ధీయుతోక్తులఁబెక్కు దెఱఁగులు సూపి
"నద్వితీయుఁడు రామనాథుఁడే కర్త – సద్విధిసర్వము సర్వేశ్వరుండు
శ్రుతి "**యేక ఏవ రుద్రో** " యనుతత్త్వ – గతి "**లింగమధ్యే జగత్సర్వ**" మనియు
రతి "**లింగబాహ్యాత్పరం నాస్తి**" యనియు – సతత మిట్టులు శ్రుతి చాటెడిఁగాన
యీక్షింప నింతయు నీశ్వరమయము – దక్షత గల్గెనా తర్కింపుఁ"డనిన
"నింకఁదర్కింపంగ నేది?యంతయును – శంకరుఁడనియెడు సచరాచరంబు
వలదుపో గుడి కేఁగి కొలిచెద మనఁగఁ – గలఁడంతటను గఱకంఠుఁడు మఱియు
నంగజహరుఁడు సచరాచరంబులకు – నంగమో జీవమో యాత్మయో చెపుమ"
యనిన [3]"శ్రమణులార! యాదిప్రశ్నకును – వినుఁడుత్తరంబ"ని వెండి యిట్లనియె
"నీరాష్ట్రములకెల్ల నీరాజుదక్క – ధారుణి మఱి చెప్పలే రనుటెల్ల
నోలి సమస్తపిపీలికాదులును – మాలలు బోయలు మహిపతి యనుటె
సర్వేశు [4]సుగుణవిచారితవృత్తి – సర్వంబునందును సంకీర్ణపదమె
యదిగాక వినుఁడీశ్వరాద్వైత మనుట – యిదియు సర్వాద్వైతమే యట్లుఁగాక
గుడికేఁగి మీకింకఁగొలువనేలనిన – వెడఁగు ప్రశ్నకు మీరు వినుఁడుత్తరంబు
సర్వగతంబైన చంద్రాతపమున – సర్వశిలలు నుండఁజంద్రకాంతంబు
స్రవియించు నా రెంటిసామరస్యమున – స్రవియించునే యున్నశైలములెల్ల
శిలలపై వెన్నెల గలుగదే [5]కలిగి – ఫలమేమి యది ప్రాణపదముగా దట్లు
చంద్రికకొఱక తచ్చంద్రకాంతంబు – చంద్రాశ్మముకొఱక చంద్రిక యరయ
సర్వగతుండగు శర్వులోపలను – సర్వంబు నుండంగ శరణునిమనసు
కరఁగురెంటికి సమకళ [6]గల్గుఁగాన – కరఁగునే తక్కిన నరుల చిత్తములు
నఖిలంబు లింగమధ్యంబున లేదె – యఖిలంబు నుండియు నం దేమిఫలము

1.యంత్రతంత్రార్థమాయావాదములఁగు 2. నసద్వృత్తిఁదర్కింప 3. కక్షప 4. ఁడగుణ 5.కలిమి 6. గల్గు



శరణునికొఱకె శంకరునిలీలయును – శరణునిహృదయంబు శంకరుకొఱక
మొదవుఁగ్రాపును దనయదియ కాఁదలఁచు – మొదవున కటె ప్రాణపదముగాక్రేపు
బ్రదుకుఁగాఁపును రెంటిపరిణామమంద – మొదవుగాఁపును నెఱుంగదు గ్రేపుఁగాని
మది లింగభక్తసన్మథనంబునంద – బ్రదుకు నెంతయుఁబ్రాణపథముగానుండు
స్వాతివాన గురియు జలములోనెల్ల – నేతఱి [1]గఱిఁగొన దిట్టిచిన్కులకె
కాని, నోర్దెఱవదు గఱి చిప్ప యొకటి – తానెల్ల వానలఁదడియుచు నుండు
నుభయసంగతిఁజేసి యుదయించు రత్న – మభవుని శరణుని యనువును నట్ల
కావున లింగభక్తస్నేహలీల – మీ వశంబె యెఱుంగఁగావలులార!
రమణమై నాడంబరమకాక లింగ – [2]సమధనసుఖములజాడ లేలింక
యంగమో జీవమో యాత్మయో యనిన – వెంగలిప్రశ్నకు వినుఁడుత్తరంబు
అంగంబు పూర్వకర్మావశేషంబు – నంగంబు సుఖదుఃఖసంగతినెలవు
నంగంబు పుణ్యపాపాలయం బట్టి – యంగంబు శివుఁడుగా దది వోవనిండు
జీవుఁడు శివుఁడని భావింతురేని – జీవుఁడు మలినుఁడు శివుఁడు నిర్మలుఁడు
జీవుఁడు దుష్కర్మి శివుఁడు నిష్కర్మి – జీవుఁడు సకళుఁడు శివుఁడు నిష్కళుఁడు
జీవుఁడు పశుమూర్తి శివుఁడు పశుపతి – జీవుఁడముక్తుండు శివుఁడు ముక్తుండు
జీవుఁడు సభవుండు శివుఁడభవుండు – జీవుఁడనిత్యుండు శివుఁడు నిత్యుండు
జీవుఁడశుద్ధుండు శివుఁడు శుద్ధుండు – జీవుఁడు మృతదుఃఖి శివుఁడమృతుండు
జీవుఁడు సంసారి శివుఁడసంసారి – జీవుఁడు సందేహి శివుఁడసందేహి
కావున, జీవుఁడు దేవుఁడు గాఁడు – పోవఁగ నిండది వొలుపుగా దింక
నాత్మయుఁబరమాత్మ యనరాదు వినుఁడు – ఆత్మ దాఁబంచభూతాత్మకంబయ్యు
నాత్మ దాఁబంచేంద్రియాత్మకంబయ్యు – నాత్మ దా దేహగుణాత్మకంబయ్యు
నుండుఁ గావున నాత్మయును గాఁడు శివుఁడ – ఖండిత సూక్ష్మవికస్వరలీల
సకలముఁగపటనాటకసూత్రములను – బ్రకటించు చైతన్యభావంబు శివుఁడు
అందు "నణోరణీయా" ననఁజొచ్చి – నందు లేకున్నట్టి శంభుఁడు శివుఁడు
నూవులలోపలి నూనియయట్ల – భావింపఁగాష్ఠంబుపావకునట్లు
పూనిపాషాణంబులో నిను మట్ల – తా నేత్రములలోని తద్రూపమట్ల
యలవడఁబాలలోపల నేయియట్ల – జలకుంభములలోని చంద్రునియట్ల
వెలుఁగు నద్దంబులోపలి నీడయట్ల – తలఁపఁబూసలలోని దారంబునట్ల

1. గఱిగొన 2. సుమ... జూడలేదింక.

ఘటపటాదులలోని గగనంబునట్ల – పటికంపుశిలలోని భావంబునట్ల
వెలయ బీజములోని వృక్షంబునట్ల – నలరు శబ్దంబులోపలి యర్థమట్ల
పర్వతంబులలోని ప్రతిశబ్దమట్ల – సర్వంబునందును శర్వుండునట్ల
ముల్లు గుట్టఁదెఱపి యెల్లెడ లేక – యెల్లచోఁదానయై యిట్లున్నవాఁడు
ఈశుండు సకలలోకేశుండు గర్మ – నాశుండు నాదు రామేశుండె" యనిన
"యవునేని దాసయ్య! యఖిలంబునందు – శివునకుఁగల్గువిశేషంబు లెవ్వి?
శివుఁడు నిత్యుండటె యవి యనిత్యములు – శివుఁడునని‌త్యుండో శివుఁడందులేఁడొ
శివుఁడు దైవంబటె యవి యదైవములు – శివుఁడు నదైవమో శివుఁడందులేఁడొ
శివుఁడటే పశుపతి యవి వశురాశి – శివుఁడును బశువయో శివుఁడందులేఁడొ
యందొక్కటైనను హరుని గుణంబుఁ – జెందంగవలవదా యిందులో" ననిన
నన్యాయవాదుల నతగులఁజూచి – ధన్యుఁడు [1]దేడరదాసి యిట్లనియె
"నూనియగాఁజేసి నూల్కొనుదీప – మా[2]నూ వులందును నలరునే చెపుఁడ
నువ్వులఁగల్గునే నూనియ గుణము – నువ్వులలోపల నూనియ లేదె
యీశునిగుణమేల నిన్నిటఁబొందు – నీశుఁడు దానెట్టు లిన్నిట లేఁడు
నువ్వులలోపల నూనియ గలదు – నువ్వులు గల్గునే నూనియలోన
సర్వజ్ఞునందును సర్వంబునుండు – సర్వజ్ఞుఁడుండునే సర్వంబునందు
నీ హేతువులకెల్ల నిట్లు చూడుండు – ఊహింపఁగా లేకయును గలవిధము
మథనపక్వక్రియామానంబునందుఁ – బ్రథితంబుగా మీఁదఁ బరము గాన్పించుఁ
గలుగంగవలెనన్నఁగలుగు జ్ఞానికిని – కలుగ దజ్ఞానికివలె నన్నునైన
సర్వజ్ఞుఁడిట్టుండు సర్వంబునందు – సర్వప్రమాణాదిసంసిద్ధ మిదియు "
ననవుడు జినమును లపహసింపుచును – మనమునఁదలపోసి మఱియు నిట్లనిరి
"పెక్కు లెఱుంగుట వెద్ద మేలయ్యె – నిక్క మింతయుఁగూడ నిటలాక్షుఁడేని
కలుగునే మలమూత్రములు విడ్చు [3]ఠావు – నిలమెట్టవచ్చునే యిది సెప్పు" మనిన
కూడజైనులనెల్లఁ గూళలఁజేసి – దౌడలు వడునట్లు దాసి యిట్లనియె
"యెఱుఁగరె జైనులా! రెన్నఁడు మీర – లెఱుఁగని కార్యమే యిది మీకుఁగ్రొత్తె
మృడుఁడు లేఁడనియెడు జడకర్మవాది – నడుతలమెట్టియే నడుతు మేప్రొద్దు
మనసిజహరుఁడు లేఁడని పల్కు నధమ – మనుజుల నోళ్లు మామర్గడంబులకుఁ
గింకిరిపడకుఁడీ బొంక నే నేర – నింక నే మడిగిన నిట్ల చెప్పెదను

1. దేవర 2. నూనెయం 3. తావు.



భావింప నీ రెండుఠావులు దక్క – దేవదేవుఁడు లేనిఠా వున్నదెట్లు
సకలంబుఁదానయై సకలంబునందు – నికము దాఁబొందని నేర్పరి యతఁడు
సకలంబుఁబుట్టించి సకలంబునందు – నికము వుట్టకయున్న నేర్పరి యతఁడు
సకలంబు నడపుచు సకలంబునందు – నికము దానడవని నిర్గుణి యతఁడు
సకలంబుఁద్రుంగించి సకలంబునందు – నికము ద్రుంగనియట్టి నిత్యుఁడతండు
సకలముఁదనలోన నందు లేకునికి – సకలము నడఁచెడు జాణఁ డతండు
సకలంబుఁదన నిజాజ్ఞాప్రభావమునఁ – బ్రకటించు[1]చైతన్యభావకుఁడతఁడు
సకలంబు లీల నిచ్ఛామాత్ర నిలిపి – వికృతంబు లార్చు నిర్వికృతి యతండు
కలిగి యంతటిలోనఁగలుగనివాఁడు – కలఁడన్న వారికిఁ గలిగుండువాఁడు
తలఁపుల మిగిలిన తత్త్వంబువాఁడు – తలఁచినవారికిఁ దన్నిచ్చువాఁడు
కొలఁదికి మీఱిన గుణములవాఁడు – కొలఁది యెఱింగినఁ గూడుండువాఁడు
వలపింపరానట్టి వలపులవాఁడు – వలచినఁబాయక వరమిచ్చువాఁడు
గమియింపరానట్టి గమకంబువాఁడు – గమియించువారికిఁగడసూపువాఁడు
పట్టంగఁజూచినఁబ్రభసూపువాఁడు – పట్టిన మఱి బట్టబయ లగువాఁడు
వినికికి మిగిలిన వేషంబువాఁడు – వినునంతలోనన విహరించువాఁడు
దృష్టికిఁదాటిన తేజంబువాఁడు – దృష్టించి చూచినఁదెలి వగువాఁడు
వాసనగడిచిన వర్తనవాఁడు – వాసనమైఁగూడ వర్తించువాఁడు
చవులకు మీఱిన సారంబువాఁడు – చవులఁబాసినఁదాఁబ్రసన్నుఁడౌవాఁడు
పలుకులు గడచిన బాసలవాఁడు – [2]పలుకు లెఱింగిన ఫలియించువాఁడు
[3]భక్తవత్సలుఁడనఁబరగినవాఁడు – శక్తికతీతుఁడై సడిసన్నవాఁడు
యుక్తికిమీఱిన యుక్తులవాఁడు – వ్యక్తి సాక్షాల్లింగమై యున్నవాఁడు
కావున మాలింగదేవునిమహిమ – భావింప నెఱుఁగ మీ ప్రాప్తియకాదు
రామనాథుండు సర్వంబును నగుట – భూమి నభక్తులఁబొందకుండుటయు
నప్రసిద్ధపుమాట లనవల దిపుడు – సుప్రసిద్ధముగ దృష్టప్రత్యయముగఁ
జూపెద మీరడ్గ నోపెదరేని – యీ పొట్లచెఱువులో నెన్నఁగఁబడ్డ
వసదు లేణ్ణూరును వ్రచ్చివైపింతు – పనుల మిమ్మేమని పఱతు నే" ననిన
"నెన్నిమార్గంబుల నీతనిఁ జెఱుప – కున్నఁ"గాఁదని జైను లూహించి చూచి
"దృష్టాంత మిప్పుడు దృష్టమౌఁగాని – దుష్టోరగంబునఁదొడికింత" మనుచు

1. సర్వజ్ఞభావకుఁ 2. పలికినయట్లున్నఁబైఁబడువాఁడు 3. భక్తికతీతమై పరగిన

వాసుకి మెచ్చుక వాని నాలుకలు – గ్రోసెడు నన్నట్టి ఘోరసర్పంబు
గడువలోపలఁబెట్టి, “కలఁడయ్య! యిందు – [1]మృడుసర్వగతుఁడని నొడివెద”వనిన
“కలఁడనుమానమే ఘటములోపలను – కలుగఁడేనియు సర్వగతుఁడె రామయ్య”
యనుచు నూతనపురాతన మహాభక్త – జన పాదపద్మ సంస్మరణాత్ముఁడగుచు
నిర్భయుఁడై చేరి నిలిచి తత్కుంభ – గర్భస్థ మైయున్న దుర్భరోరగము
రోఁజుచుఁబొంగుచు [2]మ్రోగుచు లోనఁ – దాఁజప్పరించుచు దొడలడఁచుచు
నెడనెడఁగడువలోఁబడఁగడచుచును – గడవడించుచు భుజంగము విజృంభింప
“రామనాథుండు [3]సర్వగతుఁ డవ్యయుఁడు – రామేశుభక్తు లీ భూమి నుత్తములు
పరముఁ గొల్వనివారు పరమపాతకులు – నరులెల్ల వింటిరే నాశపథంబు”
నంచు నా ఘటములో హస్తంబు దొడిగి – పొంచున్న సర్పంబుఁగుంచి తివుచుడును
పటికంపులింగమై స్ఫుటకాంతిఁజేసి – చటుల భాస్కరకరపటల మంతయును
విటతటముగ దిశాతటములఁగప్పఁ – గుటిలాన్యసమయ విఘటనతదీయ
పటుతరకరతల ఘటతమై వెలుఁగ – నటుగూడ జనులు ఖే యని జయవెట్టఁ
దటుకున జైనులు గుటిలత యడఁగి – ఘటితఫాలస్థల కరకంజులుగను
సుగ్గలదేవి యౌత్సుక్యంబు దనర – నగ్గురుదేవుఁడా నగ్గించుచుండ
బల్లహుఁడాదిగా నెల్లజైనులును – దల్లడంబందుచు ధరఁజాఁగి మ్రొక్కి
రంత దేడరదాసమయ్య బల్లహుని – సంతోషమున లింగసహితుఁగాఁజేసి
యిట దర్క ముత్తరించుటఁజేసి యల్ల – పటికలింగంబు నప్పట్టణంబునను
నుత్తరేశ్వరుఁడన నొగిఁబ్రతిష్ఠించి – యత్తఱి నా దాసమయ్య యేణ్ణూరు
వసదులు ద్రప్పించివైచి జైనులకు – నొసఁగఁడే శివదీక్ష యోరి జైనుండ!

## హిరియ నాచయ్యగారి కథ

**మారుడిగ**నుపురి మఱియొక్క భక్తుఁ – డారంగ **హిరియ నాచయ్య**గా రనఁగఁ
బరు లెఱుంగకయుండ భక్తుఁడైయుండఁ – బరవాదిజైనులు ప్రల్లదంబునను
నేడ సూచినఁదామె యెలమిని వెయ్యి – యేడునూర్వసదుల కిది వొడవనుచు
నొక్కశివాలయంబున్నఁ[4]ద్రప్పించి – చక్కన నచటి పూజారిఁగారింపఁ
“బరవాదిజైనులఁబఱపక యింకఁ – బరమున కారగింపఁగఁబెట్టరాదు
తప్పగుఁదడసిన నిప్పురి” ననుచు – నప్పుడ **నాచిదేవయ్య** దా వెడలి

1. మృదుఁడు సర్వంబని 2. మ్రోయుచు 3. సర్వసమక్షముండు 4. ద్రవ్వించి.



పదినాళ్ళలోనన పంద్రెండువేలు – మదనారి సద్భక్తమండలిఁదాను
నెలమి దలిర్ప వేయేణ్ణూరు లింగ– ములఁబండ్ల కెత్తించి వలివేగమునను
నడతెంచి చుట్టు **మారుడిగ**పై విడిసి – “బడుగు[1] బాఁపఁడు బట్టు పరదేశిమొదలు
దడయక జైనులు దక్కఁ దక్కెల్ల – వెడలుఁడో”యని యెల్ల వినఁగఁజాటించి
యందులో దేరసు లనఁబదుమువ్వు – రందఱ వారించి హరభక్తు లలరఁ
దలపడి తాఁకి జైనులఁగూడ ముట్టి – తలపట్లు వట్టి యుద్ధంబు సేయుచును
దమకంబుమైఁదార తమతమశిరము – లమితకోపోద్రిక్తులై తఱిగికొని
యెలమి నత్తలలు డాపలికరంబులను – వలచేతఁగరవాలములు జళిపించి
చెలఁగి యత్యంత విజృంభితులగుచు – నలరుచుఁదూఁగాడ నలుఁగులు వెలుఁగఁ
గునియుచు నాడుచుఁగోయని యార్వ – జినమును భీతిమూర్ఛిల్లి వాపోవఁ
మునుమాడి యాజిన మునుల మోఁదుచును – గనికని శిరములు దునిమి వైచుచును
రూఢిమై నాడుచుఁబాడుచు వెయ్యి – యేడునూర్వసదులఁగూడ లెక్కించి
జినరూపముల తలల్ సిద్రుపలుసేసి – జినవసదులమీఁది సిడములు నూకి
యొక్కొక్కలింగంబు నొక్కొక్కవసది – నక్కజంబుగ నిల్పి యఖిలంబు నెఱుఁగ
నారంగఁదలలతో నట్టలుగూర్చి – ధారుణి వెలయరే తేరసు లనఁగ
**నాచిదేవయ్య** యనశ్వరమహిమ – నీచుఁడ! యెఱుఁగవే నిన్నటివార్త!
పాటివేల్పని మీరు వాటించు జినుని – చేటెఱుంగరె యొండు సెప్పనే లింకఁ
బఱచుట సోద్యమే పశువుల మిమ్ము – మఱియును నా **హులిగఱ** యనుపురిని

## సోమన్న గారి కథ

శూలిభక్తుండు దా **సోమన్న** యనఁ ద్రి – కాలంబుఁజేయు లింగస్పర్శనంబు
నేమంబుగాఁగోరి భూమి వర్తింపఁ – గా మఱియొకనాఁడు గన్నులు నొవ్వఁ
గడుసంకటంబునఁగానంగరామి – గుడికిఁ బోనేరక కుడువక యున్నఁ
దానొక్కరుఁడ తక్కఁదత్పురినెల్ల – జైనుల కావ యసహ్యాభావమున
“గుడువ కుండఁగనేల గుడికడ కేము – దొడుకొని పోయెద మడరఁగ నిపుడు”
అంచు జైనులు దోడికొంచుఁదత్కార్య – వంచకు ల్పురహొన్నవసదికి నేఁగి
“మ్రొక్కుము వీఁడె మీ ముక్కంటి” యనినఁ – గ్రక్కున జినుతలఁగరములువెట్టి
పుడికి లింగాకృతి వడువుననున్న – దొడఁగి ముమ్మాఱు వ్రేల్మిడి మ్రొక్కి మ్రొక్కి

1. బ్రాహ్మఁడు.

వలగొని సర్వాంగములును సంధిల్ల – నిలఁజాఁగి మ్రొక్కిన “నింక లే చాలు
జినుఁడు ప్రసన్నుఁడై తనుఁగొల్వనిచ్చెఁ – బనిలేదు మా బుద్ధిగొని యిటబ్రదుకు”
మనవుడు సోమన్న యాగ్రహంబంది – “జినునికి గినునికిఁజేతు లెత్తుదునె
చా, పన్నలార! సాక్షాల్లింగమూర్తిఁ – జూపెద రం” డంచు లోపలి కేఁగి
కన్నులఁగట్టిన [1]కవణంబు వుచ్చి – మున్ను లేచుచు బల్మిఁగన్నులు దెఱవ
నటమున్న జినరూప మటయట పాసి – పటపటఁబగులుచు నిటయటవడఁగ
నిటలతటానలోత్కటచటులాక్షుఁ – డట జినప్రతిమమధ్యంబున నిలిచె
ఖ్యాపితార్వాచీనరూపంబు దనర – గోపతివాహనుఁడేపు [2]దలిర్ప
సురహొన్న వసదిన సోమేశుఁడనఁగఁ – బరగె మా సోమన్నభక్తికి మెచ్చి
ముంజేతికంకణంబున కద్ద మేల – భంజింపఁబడు జినప్రతిమయ సాక్షి
యిలఁబ్రసిద్ధము నేఁడు నెఱుఁగుదు గాదె – **హులిగఱ**లోపల నోరి జైనుండ!

## వైజకవ్వ కథ

వెండి బరవళిగవెలఁది **వైజవ్వ** – ఖండేందుధరపాదకమలాంతరంగ
మగఁడాదిగాఁబురి మనుజులందఱును – వగవఁగ జినమార్గవర్తులై నడవ
నాతి మగండొక్కనాఁడు జైనులకుఁ – బ్రీతితోఁబర్వంబు వెట్టునయ్యెడను
దరళాక్షి పదపదార్థములు గావించి – వరుఁడు జైనులఁబిలువంగఁబోయినను
దరుణియు నప్పదార్థములు వీక్షించి – “హరమూర్తియొకఁడైన నరుగుదేడయ్యొ
బరికింపఁదాఁ జేయు పాయసాన్నములు – పరమేశ యితరులపా”లయ్యొ ననుచుఁ
గడుఁగడు దుఃఖాగ్నిఁగ్రాఁగుచు నున్న – యెడఁ దపోవేషియై మృడుఁడు యేతేరఁ
బడఁతియుఁగడుభయంపడి యప్పుడులికి – పడి వడి సంతోషపడి చక్కఁజాఁగఁ
బడి పలుమఱు మ్రొక్కఁబడి పాదధూళిఁ – బడి పొరలుచును బైఁబడి **వైజకవ్వ**
యాదిదేవునిమూర్తియగు తవరాజు – పాదంబులు గడిగి ప్రాశించి మ్రొక్కి
సముచిత సత్కారసంపదఁదనిపి – యమలిన దేహు సుఖాసీనుఁజేసి
పదపదార్థమ్ములుఁబక్వాన్న ములును – గదళీదళం బిడి కన్ను దనియఁగ
వడ్డింపఁదపసియు వడి నారగింప – సడ్డలు సేయుచుఁ జప్పరింపంగ
సంతోషమునఁగుద్వఁజనుదెంచి జైను – లంతకాంతకమూర్తి నల్లంతఁగాంచి
యంతన మగిడిపో నధిపుఁడేతెంచు – నంతన తపసియు నట్లదృశ్యముగఁ

1. కవళంబు, కమలంబు 2. దీపింప.



“బాసోసి వైజి! తాపసి యెం దణంగె? – గాసిపడక చూపు క్షపణులచేతఁ
గన్నంతటను జూడఁగాదను తపసి – కెన్నెదల్ గల్గె నీకిటు గుడ్వఁబెట్టఁ
గూడునే తనయిల్లు వాడు సేసితివి – యేడ దాఁచితి చెప్పు బూడిదగొట్టు
మగనియాజ్ఞకు మీఱఁదగునె యి ట్లేమి – తగులమో కాక యత్తపసికి నీకు
సమ్మతంబగునేని చను” మని యతివ – సమ్మెటఁగొని చాటుచాటున వ్రేయ
నతివయు లెక్కసేయక శివుఁదలఁపఁ – బతి వ్రేయు వ్రేట్లెల్ల సతిమీఁదఁబడక
పిట్టారగింపంగఁబెట్ట శంభుండు – **పిట్టవ్వ**కై రాచవెట్టికిఁబోయి
సోలుచుఁగ్రాలుచుఁబ్రేల[1]గింపుచును – నాలంబు సేయుడుఁగోలలవారు
నలుకమై‘వడుగ! పొ’మ్మని వ్రేయువ్రేట్లు – కలయఁజోడని నియోగముఁదాఁకినట్లు
వసదులు నిండఁగ వాడలనడుమ – మసలిన తమ జైనపసులను దాఁక
త్రట్లను గట్టి ముచ్చుట్లును జుట్టి – వ్రేట్లతోడన తమవీవుతో ళ్లగయ
నులికుల్కి వీఁగి వీపులు విర్చుకొనుచుఁ – గెలకు లారయుచుఁజేతులు నొగ్గికొనుచు
నుఱికుర్కిపడుచు [2]దబ్బఱమానుఁడనుచు – వెఱవేఁకు లందుచు విభ్రాంతు లగుచు
హోయని జడియుచు నుపతపించుచును – వాయెత్తి యేడ్చుచు వసదు లెక్కుచును
నందుండి యుఱుకుచు నైదవెట్టుచును – సందుల కేఁగుచుఁగ్రిందు సొచ్చుచును
చెఱవులమునుఁగుచుఁజెట్లఁబ్రాఁకుచును– బఱచుచునొండొరుమఱువుసొచ్చుచును
వ్రేట్లకు నులుకుచు విహ్వాలు లగుచుఁ – ద్రట్లంటి చూచుచుఁ‘దమకర్మ’మనుచు
జినువెన్క డాఁగుచుఁ‘జిక్కితి’మనుచుఁ – గనుకనిఁజనుచు‘నెక్కడ సొత్తు’ మనుచు
‘వచ్చెఁజా’వనుచు‘దైవమెఱుంగు’ననుచు – ‘నొచ్చితి’మనుచును వెచ్చనూర్చుచును
దలలు గుండులతోడఁదాఁకించికొనుచు – నిలఁబడి పొరలుచు‘నెట్లొకో’యనుచుఁ
దొరిగెడి మేని నెత్తురు లంటియంటి – పొరిఁబొరిఁజూచుచుఁ‘బొక్కితి’ మనుచుఁ
‘జొరఁజోటు’లే దంచు సొమ్మసిల్లుచును – ‘హరుకృత్యమో కాక’ యనుచు నిబ్బంగి
సంతాపమున వ్రేట్ల జైనులు వొరల – నంతలో నొకబుద్ధిమంతుఁడీక్షించి
“చాటున నొకవ్రేటు సతి వ్రేయఁజాటు – చాటున నీ జైనకోటిఁదాఁకెడిని
యక్కజంబుగను నినాంశులు వోలె – నొక్కొక్క వ్రేటు వేయు ముఖముల్గాఁగ
**శ్రీచంద్రముని**వోయి చెఱువుపాలయ్యె – **నాచార్యముని** వోయి యగడితఁబడియె
**వరచంద్రముని**వోయి వసదెక్కి యుఱికె – **నరహతముని** వోయియడవులఁగలసె

1. రొప్పు, రించు 2. నబ్బుర మిదియనుచు.

**క్షపణేంద్రముని**ప్రాణ ముపతాపమొందె – **విపులేంద్రముని** వీపు విక్కన వితిగె
**రాజేంద్రముని** బిట్టు ప్రాణముల్ విడిచె – **నీ జినకులగురు**ఁడింతలోఁబొలిసె
నింతయుఁగూడ నొక్కింతయై మడిసెఁ – గంతుసంహరుచెయ్ది గానోపు" ననుచు
నతివ కద్దము సొచ్చి యతని వారింప – నతగులపై ప్రాలునవ్వేటు లుడిగె
భార్య సద్భక్తితాత్పర్యురా లగుట – యార్యేతరుఁడెఱింగి య ట్లెర్గనట్టు
"లన్నంబు వెట్టితి వన్నన్న మున్న – త న్నెఱుంగకయుండఁదపసి కొక్కనికి
నటుగాక శిక్షించి తందర నిప్పు – డిటు మునీంద్రులకెల్ల నెగ్గు సేసితివి
ముది గొరగల తంత్రములు మంత్రములును – మదిమది నన్నేల బ్రదుకంగనిచ్చు
వెఱతుము తమయిల్లు వెడలుమీ" యనుచు – నఱిముఱిఁద్రోచుడు న**వ్వైజకవ్వ**
చనుదెంచి చనుదెంచి జైనాలయంబుఁ – 'గని శివాలయ మిది గానోపు'ననుచు
వనిత మున్నిలు వెలువడమిగాఁజేసి – కని వసదియు గుడియును నెఱుంగమిని
'ముక్కంటి శర'ణంచు మోడ్పుఁగేలమర – మ్రొక్కుచువసది యమ్ముద్దియగదియ
నటజినప్రతిరూప మప్పుడ వ్రస్సి – యటయిట వడఁగఁదదభ్యంతరమున
నుదయించె నద్భుతాస్పదలింగమూర్తి – ముదిత సముదితసమ్మదలీలఁదనరఁ
"బురుషుఁడు శివభక్తివిరహితుఁడేని – బురుషుని మీఱుట దరుణికిఁబథము
దుర్గతిఁబొంద దెందును బతిఁబాసి – భర్తుని గొనియాడు పడఁతియు నట్ల
చనఁగ నాలాయని యను మునిభార్య – యనసూయయు బురుషుఁడు నభక్తుఁడైన
బాసి శంభుని గొల్చి పడసెను గాదె – భాసురంబగు మోక్షపదవి వెండియును
నిల యెల్ల నెఱుఁగఁగ దిలకవ్వనాఁగ – వెలఁది యీశ్వరభక్తి విముఖుఁడైనట్టి
మగనిఁబాయుదు వాఁడు దెగనున్న యెడను – నెగిది శివాలయం బింతి సొచ్చుదును
వెనుకొని యేతెంచి పెనిమిటి శివుని – వెనుక దాఁగిన నాతి గినియుచుఁగొంగు
వట్టి తివ్యఁబురుషభావమైయుండె – నెట్టణ శివభక్తి నిష్ఠగాఁజేసి
యనుచుఁజెప్పఁగ విందు మాద్యోక్తులందుఁ – గనుఁగొనఁబడియె నీ కాంత సద్భక్తి"
యని యసంఖ్యాతభక్తావలి వొగడ – జన నికాయంబు ఖే యని జయవెట్ట
నా జిన మును లెల్ల నాశ్చర్యమంది – **వైజకవ్వ**కు మ్రొక్కి వడిఁబ్రస్తుతింప
**వైజవ్వ** భావోద్భవంబౌటఁజేసి – వైజనాథుం డన వసుధపై వెలసి
భ్రాజిల్లు టెఱుఁగవే బరవళిగందు – వైజకవ్వ మహిమ యో జైన కూళ!
చన్న సద్భక్తుల శౌర్యాతిశయము – లెన్న ననంతంబు లిన్నియు నేల



నాఁటి[1]లింగము నేఁడు నవసెనే చెపుమ – నాఁటి[2]భక్తమహిమ నవసెనే నేఁడు
చిటిపొటిసమయంబు లిటువంటి వడఁప – నట వెద్దలేల నే మైనఁజాలుదుము
గబ్బున జైనమార్గమె యాది యనుచు – నిబ్బంది జినమును లీ యబ్బలూర
మెట్టి మాతోఁబ్రతిఘట్టించి యాడ – నెట్టణ వాదంబు నిల్పి గెల్చినను
"నటువోవ దింకఁబ్రత్యక్షప్రమాణ – మిటు సూపుమా" యని యటు ముదలింప
"హిరియవసదినాఁగఁ బురినెన్నఁబద్ద – యురుజినాలయ మినుఁదుదయమౌనంత
లోనన గోడలతోనన కూలి – తానప్డ మీ వేల్పుతలయును బగిలి
నేలపాలయ్యెనేనియు నీశుబంటఁ – జాలుఁబో యిదియ దృష్టముచూడుఁ"డనుచు
వచ్చినంతటిలోన వసదియుఁగూడ – వ్రచ్చి వందఱ లాడువడువునఁద్రెళ్లె
జినరూప మంతఁదుత్తునియలైపడియె – జనులు జైనులును నాశ్చర్యంబు నొంద
నిలువ దప్పురిఁగూలు నేఁడును వసది – యిలయెల్ల నెఱుఁగరే యిన్నియునేల
ముదిలంజెపడు పట్లు ముందటికథలు – పదరి చూపఁగలేని [3]పందవే నేఁగు
వరకీర్తి **మొఱటద వంకయ్య**గారి – వరవుడఁ బిఱుసనవచ్చునే నాకు
యిప్పుడ శిరమిచ్చి యేడుదినంబు – లిప్పురవీథులనెల్లను మెఱసి
తలవడయుదు ధరాస్థలియెల్ల నెఱుఁగ – దలతలచూడను గలదురా శక్తి
యటమీఁదఁగళ్యాణకటకంబునందు – నటయిట మందునకైన లేకుండ
వసదు లన్నియు వ్రచ్చి వందఱలాడి – వెస జినప్రతిమల విసమాల్తు నిదియు
బాస మిమ్మిరుగాలిపసుల నింకొండు – చేసిన నిం కొండు సిద్ధియుఁగలదె"
యనవుడు"నట్లకా"కని యొక్కదెసను – జినసమయస్థులు సేరిచూడంగ
బసవఁడు సహితంబు భక్తనికాయ – మెసకంబుతోఁగొలు విచ్చి కూర్చుండ
నా బిజ్జలుఁడు దంత్ర మప్పురాంతరము – నా బాలవృద్ధాదు లంతంతఁజూడ
నచ్చెరువంద **నేకాంతరామయ్య** – కచ్చించికొని యంకకాఁడునుబోలె
దరహాసకాంతి వక్త్రమునఁదుల్కాడ – నరుదొంద భక్తగణాళికిమ్రొక్కి
యార్చి బొబ్బిడిపొంగి యలుఁగు గంఠమునఁ – జేర్చి క్రుమ్ముడి యొక్క సేతసంధించి
యాసురంబుగ నల్గ నప్పుడట్టకును – బాసి శిరము కేల "బాపు బా" పనఁగ
బసవఁడు గీర్తింప భక్తసమూహ – మసమానలీలఁగో యని పొంగియార్వ

1. నిష్ఠయు 2. భక్తి 3. పందనేనేను.

క్ష్మాతలేశుఁడు శిరఃకంపపూర్వముగఁ – జేతులు రెండును శిరమునఁదాల్ప
వారక జయజయధ్వనులు ఘూర్ణిల్ల – పౌరజనములు విభ్రాంతులై చూడ
నవికలసకలవాద్యధ్వను ల్సెలఁగ – వివిధ నాటకమహోత్సవము లొప్పార
వలచేత నలుఁగు డాపలిచేత శిరము – దులుకాడ వీథివీథుల మెఱయుచును
జతులు వెట్టఁగఁదాళగతుల కాడుచును – క్షితిఁగటారముమీఁదఁజేరినిల్చుచును
శరణార్థిసేయుచు జయవెట్టఁడనుచుఁ – బిరిగొని యార్చుచుఁబెడబొబ్బ లిడుచు
నిప్పాటఁగలయంగ నేడుదినంబు – లప్పురి మెఱసి **యేకాంతరామయ్య**
వచ్చి యప్పురు[1] గుడివాఁకిట నిలిచి – "వచ్చెనా బాస శ్రవణులార!" యనుచు
**నేకాంగవీరు**ఁడలోకానుసారుఁ – **దేకాంతరాము**ఁ డపాకృతకర్మి
చక్కన శిరమట్ట సంధింపఁదడవ – నొక్కింత కొకదెస కొరవో యుండె
'హరుఁడు వేల్పగుట **కేకాంతరామయ్య** – శిరములోకులకెల్ల గుఱి' యన్నయట్లు
**ఏకాంతరామయ్య** శ్రీకరమహిమ – లోకాంతమయ్యెఁద్రిలోకంబులందుఁ
[2]బ్రత్యక్ష మీతఁడే పరమేశుఁడనుచు – నత్యద్భుతాక్రాంతులై జను ల్వొగడ
'గడుదురాత్ములఁజూడఁగా దని తమకుఁ – బెడమొగం బిడె' నని భీతిల్లినట్లు
జనపాలుకునిచేత జయపత్ర మిచ్చి – జినసమయులు వచ్చి శివభక్త వితతి
ముందటిదెసఁజాఁగి మ్రొక్కఁగఁబడిన – యందఱిమొగములయం దచ్చులొత్తి
యారిచి పెడబొబ్బ లందంద యిడుచు – వీరమహేశ్వరవితతి యుప్పొంగి
వెనుకొని వసదుల విఱుగఁగొట్టుచును – జినప్రతిమల తలల్చిదిమివైచుచును
నసమానలీలఁగల్యాణంబునందు – వసదియు జినుఁ డనువార్త లేకుండఁ
గసిమసంగుచుఁజంపి గాసివెట్టుచును – వసుధలో జిను లనువారి నందఱను
నేలపాలుగఁజేసి నిఖిలంబు నెఱుఁగఁ – గాలకంధరుభక్తగణసమూహంబు
అనుపమశౌర్యు **నేకాంతరామయ్య** – ననురాగలీలమైఁగొనియాడుచుండ
ననయంబు బసవఁడు దనసంగమేశుఁ – డని భక్తిఁగొల్వ **నేకాంతరామయ్య**
వరకీర్తిమై నిట్లు వర్తింపుచుండె – ధర లసద్భక్తివిస్ఫురణమై మఱియుఁ
బ్రథితుఁడీ **యేకాంతరామయ్య** దివ్య – కథ విన్న వ్రాసిన గారవించినను
జల హాలహల వహ్ని శస్త్రాస్త్రబాధ –నలి నాగ మృగ రోగములభయంబణఁగు
విపులదృష్టాదృష్టవివిధ సౌఖ్యములు – నపవర్గములు గల్గు హరుకృపఁజేసి

1. యెప్పటి 2. ప్రత్యయ.



## షొడ్డలదేవు బాచయ్యగారి కథ

ధీరుండు షొడ్డలదేవుబాచయ్య – గారు నా వెండియుఁగఱకంఠమూర్తి
నిర్గతేంద్రియవైరివర్గదుర్గుణుఁడు – భర్గనిరర్గళాంతర్గతధ్యాని
యుగ్రాక్షభక్తగణాగ్రగణ్యుండు – నిగ్రహానుగ్రహోదగ్రశౌర్యుండు
కష్ట గుణాశ్లిష్ట దుష్ట జనారి – శిష్ట జనానంద పుష్టి పాలకుఁడు
దుర్భావరహితుఁడగర్భసంభవుఁడు – నిర్భవాశ్రయుఁడపునర్భవశాలి
శాంతుండు దాంతుండు సదమలభక్తి – కాంతుండు నిర్జితావాంతరసమయి
పరదైవ పర్వతప్రథితదంభోళి – పరదైవసందోహతరుకుఠారంబు
పరదైవశుండాలపంచాననుండు – పరదైవవార్ధిశుంభత్కుంభజుండు
"త్రినయనునతులితోద్రిక్తశౌర్యంబు – చనునందికేశ్వరు సర్వజ్ఞతయును
భృంగినాథుని యేకలింగనిష్ఠయును – భంగిగా నవ్వీరభద్రురౌద్రంబు
భృగుదధీచ్యాదులపృథుశాపశక్తి – తగుగౌతమాదుల తర్కప్రయుక్తి
గురునాథుఁ డిన్నియుఁగూడ బాచాంక – వరదివ్యమూర్తిగా విరచించెనొక్కొ
కానినాఁ డిటువంటి కలియుగరుద్ర – మానితపృథుదివ్యమహిమ యెట్లొనరు"
ననుచు లోకంబు లత్యర్థి గీర్తింప – ననురాగలీల నూనిన భక్తియుక్తి
'సిద్ధాంతముల శ్రుతిస్మృతిమూలములను – బద్ధవేదాంతసంపాదితోక్తులను
న్యాయవైశేషికాద్యఖిలశాస్త్రముల – నాయతబహుపురాణాగమార్థముల
సహజానుమానాదిసర్వప్రమాణ – బహుతర్కవాదజల్పవితండములను
వెలయు నుత్పత్తిస్థితిలయకారణుఁడు – నలరు నిత్యానందుఁ డంబికాధవుఁడు
పశుపతి దాఁగర్త వలువేల్పులెల్లఁ – బశువులే'యని ప్రతిపాలన సేసి
జినసమయస్థులశిరములు దునిమి – మును విష్ణుసమయులముక్కులు గోసి
యద్వైతులను హతాహతముగాఁదోలి – విద్వేషవాదుల విటతాటమార్చి
చార్వాకవాదుల గర్వం బడంచి – సర్వేశుభక్తియే యుర్వి నిష్ఠించి
దిట్టయౌ **షొడ్డలదేవుబాచయ్య** – యిట్టిసద్భక్తిమహిష్ఠుఁడై నడవ
నెడనెడ సౌరాష్ట్ర మేఁగి యేఁటేఁటఁ – గడు నర్థితోడ జాగరము సెల్లించు
దిన మేఁగుదెంచుడుఁ'దివుట సౌరాష్ట్ర – మున జాగరము సేయఁజనియెద'ననుచు
బిజ్జలునకు వినిపింపఁగ నతఁడు – "కర్జ మెంతేనియుఁగలదు వోరాదు
కొట్టరువునఁబళ్లు గొలువఁగవలయు – నిట్టేల చెల్లు నీ కిరుదెస కొలువు

బాలెంతలంజియపడపట్ల రాచ – యూళిగంబును భక్తియును గూర్చి నడవ
సౌరాష్ట్రమున కీవు సనుము గాదేని – సౌరాష్ట్రనాథుఁడు సనుదేర నిమ్ము
శివరాత్రి గివరాత్రి సేయుట మాను – తవిలి యీయుళిగంబు దప్పింపరాదు”
అనుచు నప్పురవాదులనుమతంబునను – జనపతి వారించుడును బోక నిలిచి
“ముదలించి పలుకుడు మూర్ఖుఁడై పోక – యదియుఁగష్టముగాదె యతఁడన్నయట్లు
వచ్చు నిచ్చటికొండె వరదుఁడు నాకు – నచ్చటి కేఁగున ట్లయ్యెడు నొండె
దీనఁదప్పినదేమి నా నిజవ్రతము – తా నెట్లు శివునకుఁదప్పింపవచ్చు”
ననుచు నిశ్చింతాత్ముఁడై యున్న యెడను – ఘనుఁడు **సోమేశుఁ** డాదినము దొల్నాదు
[1]మడఁపులేఖయు నందిపడగయుఁగొనుచుఁ – బడిహారిక్రియఁబట్టపగలె యేతెంచి
**కొట్టరువు**నఁబళ్లు గొలిపించుచుండ – నట్టిచో **బాచయ్య** కాతఁడిట్లనియె
“సౌరాష్ట్రనాథుండు సనుదెంచుచుండి – భోరన ముందఱఁబుత్తెంచె నన్ను
శంకరు నానతిఁజదువుకో లేఖ – యింకిటపూఁటకు నేఁగుదెంచెడిని
నాసక్తిమై నింక ననిశంబు మీని – వాసంబునన యుండవలయుఁ గావునను
నీ పెద్ద గాదియలోపలఁగొలుచు – వేపోయఁబనుపుము వెడలి **సోమేశుఁ**
డచ్చోటఁబ్రత్యక్ష మయ్యెడి” ననుచు – నచ్చుగాఁజెప్పుచు నతఁడదృశ్యముగఁ
“జనుదెంచు నిచటికి సౌరాష్ట్రనాథుఁ – డనుమాన ముడుగుఁడీ యదియెట్లు లనిన
వచ్చెనే మున్ను రావణుని మన్నించి – యచ్చోన చిక్కెఁగా కనిపల్కవలదు
భక్తుఁడే యతఁడు దపఃఫలోన్నతిని – శక్తిమంతుఁడు గాక చర్చించిచూడ
భక్తులచేఁ బట్టువడుఁగాక శివుఁడు – భక్తిహీనుల[2]కేల పట్టిచ్చు శివుఁడు
విలసితభక్తి సద్విధి మెచ్చికాదె – యెలమి **గుడ్డవ్వ**కు నెదురుగా వచ్చి
కదల కట్టుల చిక్కెఁగాదె **సోమేశుఁ** – డదియేల నావిందె గనుపురంబునను
గావునఁజూడంగఁగందు మిప్పురిని – దేవునిరాకకు దృష్ట మిచ్చటికి
పడిహారి భావనఁబఱతెంచె నతఁడు – నదర సౌరాష్ట్రనాయకుఁడ కానోపు
సకళనిష్కలభావ సన్నుతశక్తి – నిక మెట్టి పడిహారులకు నున్నదెట్లు
వచ్చెనిట్లానతియిచ్చె లోకులకు – నచ్చెరువుగ నెల్లి [3]యరుదెంచుఁజుండి
యిట యదృశ్యుండయ్యె నీశుండ” యనుచుఁ – గటకంబునరులు విఖ్యాతిసేయంగఁ
దవిలి సమ్మదసముద్భవవారి గ్రమ్మ – శివునియానతి లేఖ శిరమునఁదాల్చి
పుర మప్డు శుభముగా విరచింపఁబంపి – కరమనురక్తి **బాచరసు** వెండియును

1. ముడుపు 2. కెట్లు 3. యరుదెంతునంచు, ని.



**బసవయ్య** మొదలుగాభక్తులు దాను – నసమమొడ్డోలగంబై యున్న యెడను
వింతచే నానందవిభ్రమంబెసఁగ – నంతంతఁబాడంగ నంతంత నాడ
నదెవచ్చె వచ్చె వియన్మండలమున – నిదెవచ్చెవచ్చు **సోమేశు**ండనంగ
నీరధు లేడు ఘూర్ణిల్లినభాతి – సారగంభీరవాద్యారవంబెసఁగ
భోరన మ్రోయుచప్పుడు వినఁబడఁగ – సౌరాష్ట్రనాథుఁడాశ్చర్యంబెలర్పఁ
దివిరి **కొట్టరువు** గాదియ వ్రచ్చికొనుచు – భువిఁబ్రతిష్ఠుండయ్యె నవని గంపింప
‘సిద్ధరామయ్య దా శ్రీగిరికేఁగి – శుద్ధాత్ము **మల్లికార్జును**నిఁబ్రార్థించి
కొనుచు నా **సొన్నలిక**ను పురంబునకుఁ – దానెట్లు రప్పింపఁగా నేరఁడయ్యె
నిప్పు డిచ్చటనుండి యీ **బాచతండె** – రప్పించుకొనియెఁ [1]జేరఁగ **సోమనాథు**
నిట్టిధన్యుఁడు గల్గునే’ యని భక్తు – లిట్టలంబుగ నుతియించుచునుండ
నచ్చెరువందుచు నా **బిజ్జలుండు** – వచ్చి సాష్టాంగుఁడై వడిఁబ్రణమిల్లి
సకలనియోగంబు జయవెట్ట బసవఁ – డకలంకలీల **బాచయ్య** నంకింప
వలివేగమున గాదియలు వడఁద్రోచి – నెలకట్టుకట్టించి నిమిషమాత్రమున
వరరత్నఖచితసువర్ణాలయంబు – విరచించి కోటగోపురము లెత్తించి
ప్రవిమలోద్యద్భక్తి **బాచిరాజయ్య** – శివరాత్రినియమంబు సెల్లించెనంత
నలిఁగొట్టరువు **సోమనాథు** డనంగ – వెలసె లోకావలి వినుతింపుచుండఁ
దెల్లగాఁ**షొడ్డలదేవు బాచయ్య** – సల్లీల సద్భక్తి కెల్లయై పరగ
లలినన్యసమయ కోలాహలమహిమ – కిల **బిజ్జలుండు** సహింపక మఱియుఁ
గుమతియై యప్పురిసమయులుఁదాను – రమణఁబ్రతాపనారాయణపురిని
గోవిందప్రతిమ సద్భావంబెలర్ప – గావించి యొకగుడిఁగట్టించి మంచి
దినమున నతనిఁబ్రతిష్ఠగావించి – యనురాగలీలమై నంతఁ[2]గొల్విచ్చి
యున్నెడ నఖిలనియోగంబు గొలువ – నన్నరేంద్రుండు దా నందఱఁజూచి
“బాచిరా జటయేమి భక్తుండ ననియొ – యేచియో యీ కార్య మెఱుఁగఁడో
తా లెక్కసేయక తమకొలువొల్లఁ – డో లీల నిట్టి యొడ్డోలగంబులకుఁ(యెఱిఁగి
జనుదేరకుండు టే”మని యాగ్రహింప – మనుజేశునకు బసవనమంత్రి యనియెఁ
దవిలి నీయుడిగంబుఁదప్పించెనేని – బవరంబు ముట్టినఁబాఱెనేనియును
దప్పని దండింపఁ దగ వగుఁగాక – యిప్పరదైవంబు [3]లిండ్లిండ్లకడకు
నేల రా వనవచ్చునే పతి వీవు – **జోళవాళిక** కాక **వేళవాళికిని**

1. బోరన 2. గొల్వించి 3. లిండ్లకునతని.

వత్తురే యన్యదైవంబులయిండ్లు – చొత్తురే భక్తులు సూతురే విం(డె
లింగైకనిష్ఠావిలీనుండు భృంగి – యంగజారాతికి నతివ యైనట్టి
యర్ధనారికి (మ్రొక్కక భవునిదక్షి – [1]ణార్ధ మేర్పఱిచియు నట(మ్రొక్కెననిన
నిట వేయునేల మాహేశ్వరవితతి – చిటిపొటివేల్పులcజేరికిcగొం(డె
వినవె **ఘంటాకర్ణు**cడను (ప్రమథుండు – ముసు పరశబ్దంబు వినసినేమంబు
గాన ఘంటలు ఘణఘణయని (మ్రోయ – వీనుల నొకవేనవేలు ధరించి
లోకంబులందు **ఘంటాకర్ణు**cడనcగc – (బ్రాకటంబుగcజెప్పcబడియె వెండియును

## అరియమ కథ

[2]నదియట్టు లెఱుcగవే **యరియమ**నాcగ – మొదల నర్వద్దాడి ముప్వురలోన
వెలయ **మహేం(ద్రమంగళ** మనుపురిని – నెలకొన్న సద్భక్తినిష్ఠ పెక్కువను
దనయొద్ద నొండొకదైవంబుcబేరు – కొనువారి తలcదెగcదునుముదు ననుచు
నున్నెడ నింటికి నొక్క (బ్రాహ్మణుcడు – సన్నుతి రు(ద్రంబుcజదువుచు వచ్చి
భిక్షంబు వేడుడు(బ్రీతిమైc దాన – భిక్షంబు గొనివచ్చి పెట్టంగ నురిలి
యందులో నొకమెదు కవనిపైcబడ్డ – సందడింపుచు నన్యశబ్దంబుcబలుకc
గట్టు(గ్రమునcజేతిచట్టువంబునను – గిట్టి యాభూసురు పొట్ట (వచ్చుడును
"నక్కటికము లేక **యరియమ**నాcగ – నొక్క భక్తుcడు సంపె నొక్క విద్వాంసు
'**ధర (బ్రాహ్మణో న హంతవ్య**' యనంగc – బరగిన వేదోక్తిcబరపరసేసి
స్వాధ్యాయపరుcడగు స(ద్బాహ్మణుండు – వధ్యుcడే యూరక వధియింపcదగునె
యడుగ భిక్షంబు వెట్టెడిది గాదేని – గడపెడి దింతియకాక చంపుదురె"
యనుచు భూసురు లా(గ్రహంబునcగూడి – జననాథునకు నంత వినిపింపcదడవ
యప్పుడ పిలిపించి **యరియమ**రాజుc – "[3]దప్పేమి మునుజేసెcజెప్పుమా వి(ప్రు
నేలచంపితి నీతియే యింత బుద్ధి – మాలుదురే భక్తి మదిcగల్గు ఫలమె
చెప్పు కాచెద మేమి[4]సేసె నాతండు – చెప్పవేనియు సరిసేసెద మిట్లు
చెల్లునే' యనవుడుcజిఱునవ్వు నవ్వి – "చొల్లువాఱుడుమాటలెల్ల నేమిటికిc
జంపితి నట్లైనcజంపినవిధము – చంపంగc దగుతప్పు శంభుcడ యెఱుcగుc
గావcజంపcగcగర్త దేవుcడ కాక – కావcజంపcగ మీరు గర్తలె" యనుడు

1. ణార్ధంబయేర్పఱచట 2. అదియెల్ల 3. తప్పేమిసేసె నీ వి(ప్రుcడుసెపుమ 4. సేసి నాcడతcడు.



"భవికీటకంబుతో శివభక్తిపరుని – భువి సరిసేయుట యవినీతి" యనక
ధరణీశ్వరుండు మద(గస్తుcడగుచు – సరిసేయcబంచుడు నరియమ మగిడి
వచ్చుచో నొకశివావాసంబులోను – సొచ్చి చేతాళంబు లిచ్చుచు నిట్టి
పరమపాతకుcడనcబడు (ద్రోహితోడ – సరి సావcదగునయ్య పరమాత్మ" యనుడు
**నరియమరాజు** లింగైకనిష్ఠకును – బరమనిర్మలభక్తిభాతికి మెచ్చి
"పరదైవనామదుర్భాషణుతోడ – సరిసేయవచ్చునే శరణుని" ననుచు
నక్షణమా(త్ర నెయ్యంబుతోcదనదు – వక్షంబు దెఱచి యావరలింగమూర్తిc
'జొరుచొరు'మనుడు నా **యరియమరాజు** – కరమర్థితో లింగగర్భంబు సొచ్చె
నత్తఱి 'నదెపోమె నదెపోయె' ననుచు – నత్తలవరు లేcగునంతకు మున్ను
వెలుపల మూరెcడు మొలకచ్చతోcక – వెలయ లింగంబులోపలc(బవేశించె
భంగిగా మా శివభక్తు లెయ్యెడల – వెంగళివేల్పుల [1]వినcగ నొల్లమికి
**యరియమ**గట్టిన యయ్యంబరంబు – కరిగాదె నేcడును గానవచ్చెడిని

## వీరశంకరుని కథ

**వీరశంకరు**c డన వెండియు నొక్క – మారారిభక్తుని చారి(త్ర వినుము
కల నైనcబరసమయుల దైవములను – దలcపడు ముట్టcడు వలుకcడు దోడ
నదియె నేమముగ సమ్మదలీల నడవ – నదియొక్కనాcడు స్వప్నావస్థయందు
"నంటితి నొకబౌద్ధు" నని కలగాంచి – కంటగించుచు మేలుకని విచారించి
"కుక్క ముట్టిన కడ్వకును విధి యేమి – చక్కనcగాల్చినcజాలున కాదె"
యని కృతనిశ్చయుc డగుచు శ్రీగిరికిc – జనుదెంచి **హాటకేశ్వర** దేవునొద్ద
విస్ఫులింగంబులు వెడలుచు నగ్ని – (ప్రస్ఫురింపcగ బగబగయను నినుప
పెనముపైcగూర్చుండి భీకరోద్వృత్తిc – గనలెడు నయ్యిన్న పెనము కాcకకును
రెట్టించి ముప్పదిరెండాయుధముల – దట్టుండు గెలసంబు దా నాచరించి
మదనారి మెప్పించి మహితసాయుజ్య – పదవిc దత్క్షణమా(త్రcబడసెcగావునను
నంతకాంతకుభక్తు లన్యదైవముల – నంతయు నొల్లమి సహజంబు వినుము

## శివలెంక మంచయ్యగారి కథ

**శివలెంకమంచయ్య** శ్రీకాశిలోనc – దవిలి **విశ్వేశ్వర**స్థానంబునందుc
దప్పక శివునకుcదనపది(వేళ్లు – ముప్పూcటcబూజించి యప్పుడ పడయు

1. వేcడ

జను లద్భుతం బంది వినుతింపనట్ల – యనయంబు వర్తించుచును రూఢి వెలయ
నక్కజం బందఁగ నన్యదర్శనుల – ముక్కుపైఁగత్తియ నైక్కె మప్పురిని
నెత్తించి 'వీరమాహేశ్వరపదమె – యుత్తమ మీశ్వరుఁడొక్కండె కర్త'
యని ప్రతిష్ఠింపంగ నన్యదర్శనులు – చని యంత వారణాసిని గదాధరుని
గుడిసమీపంబునఁగూర్చుండి గర్వ – మడరఁ దర్కోన్ముఖులై పిలిపింపఁ
బసిగమై **మంచెనభట్టారకుండు** – నసదృశమహిమ దుల్కాడ నేతేర
సమయులు దమతమశాస్త్రంబు లెత్తి – భ్రమగొని యొక్కొక్క ప్రశ్న సేయుడును
నయ్యయి శాస్త్రసూక్త్యర్థంబులందు – నయ్యయి సమయుల కియ్యకోలుగను
నిపుణతమై సకలపురాణశాస్త్ర – విపులార్థవాదము ల్విఖ్యాతి వెలయఁ
జూపుచు వెండియు శ్రుతిసంహితాది – రూపితార్థంబుల రూఢిగాఁబ్రశ్న
సేయుడు **లెంక మంచెనపండితులకు** – నాయెడ సమయులు వాయెత్తనోడి
"చదువులు గిదువులు సాలుఁబో"వేయు – [1]నదియేల దృష్ట మే మయినను గలదె
యనవుడుఁ"దనక తా నరుగ నవ్విష్ణుఁ – గొనిపోయి విశ్వేశ్వరునకు మ్రొక్కింతు
నింకఁ"జూడుం డంచు **లెంకమంచెయ్య** – యంకించి నరు లెల్ల నటు ప్రస్తుతింప
మారారి సద్భక్తమండలిఁదలఁచి – "యోరోరివిష్ణు! [2]నీకొడయఁడైనట్టి
విశ్వేశునకు మ్రొక్క వెడలి ర"మ్మనుడు – నశ్వరపరదర్శనస్థులు వడఁక
శ్రీరమణుండు మంచెన పండితయ్య – గారి యానతికిని గడగడ వడఁకి
మ్రొక్కుచు నత్తిరుముట్టంబు వెడలి – చక్కఁదెర్వునఁబాదచారియై నడవ
**శివలెంక మంచెయ్య** శివభక్తవితతి – దవిలి ముందట మహోత్సవలీలఁజనఁగ
నగ్గదాధరువెన్క నన్యదర్శనులు – నగ్గలికము సెడి యరుదెంచుచుండ
నక్కజంబుగ నటు హరిఁగొనివచ్చి – మ్రొక్కించె విశ్వేశ్వరునకు **మంచెయ్య**
భువి"**శివభక్తః ప్రభు ర్మమ**" యనఁగ – నవిరళంబయ్యెఁగేశవునివాక్యంబు
**మంచెనపండితు** ల్మఱి తన్నుఁబిలువఁ – 'బంచినపని సేసి బ్రదుకుదు' ననుచుఁ
జక్కనఁజనుదెంచి మ్రొక్కె నంతటను – 'జిక్కె' నంచును గూడి శివభక్తు లలర
"నదిగాదె నేఁడును హరి విశ్వనాథు – నెదుర మ్రొక్కినయట్టు లిల నున్నవాఁడు
నేవాదులును విష్ణు లేవంగనెత్తఁ – జూవె చాలక యిట్లు సూచుచున్నారు
హరునకుఁబ్రతిలేమి యన్నియునేల – ధరఁజూఁగఁబడియున్న హరిరూపసాక్షి

1. నిదియేలదృష్టాంత (మిటుచూపగలవొ) మేఁజూపఁగలదె. 2. కృష్ణ.



## శంకరదాసయ్యకథ

భక్తులయాజ్ఞలోపలివాఁడు హరియు – భక్తు లల్గినఁజెడు బ్రదుకుఁగూర్చినను
ధరణి నెట్లన్న **శంకరదాసి** యనఁగఁ – బరికింప రెండవఫాలలోచనుఁడు
ఇట యల్గిచూచిన నితరదైవంబు – లటవ్రయ్యలై పడు నన్యదర్శనులు
తొల్లియు జగదేకమల్లఁడన్పెద్ద – **బల్లహు** నొద్ద సంపాదనసేయ
బిలిబిలి పరసమయులు దల్లడిల్ల – నలిగి **శంకరదాసుమయ్య** సూచుడును
ఫాలకరాళవిశాలనేత్రాంత – కీలావళీస్ఫురత్కాలాగ్ని గ్రమ్మఁ
గ్రక్కున నచటి నారాయణప్రతిమ – వ్రక్కలయ్యెనుగాదె వసుధ యెఱుంగ
నరయ శూన్యాలయంబై యున్నయట్టి – తిరుముట్ట మది దాన కరిగాదె చూడఁ
గావున మా[1]భక్తగణములమహిమ – నీ వేమియెఱుఁగుదు నిఖిలేశ్వరుండ
యననేలవేయు నట్లైన **బాచరసు** – ఘనమహత్త్వముసూతుగాదె తొల్లియును
యణకించి పలుకఁ దత్క్షణమాత్ర నీవ – ప్రణుతింప **సోమేశు** రప్పించుకొనఁడె
[2]**కొట్టరువు**నఁబళ్లు గోటానకోట్లు – పెట్టియు మనుజులపేళ్ళు వ్రాయండు
కదియఁబంచాక్షరి కవిలియవ్రాసి – చదువు లెక్కలు [3]వెర సది దప్పకుండ
నెఱుఁగుదుగాదె మున్నేఁజెప్పనేల – యెఱుఁగుదుగాకేమి యిటమీఁదిపనులు"
నంచును వృత్తాంతమంతయుఁబసవఁ – డంచితమతి విన్నవించి పుచ్చుడును
'వాద మన్నను బోవవలయుట తగవు – గాదె' యంచును సముద్గతకోపుఁడగుచుఁ
జనుదెంచి భక్తులఁగని మ్రొక్కి నిలువ – జననాథుఁడాగ్రహంబున నిట్టులనియె
"నరుదగు నఖిలలోకాధీశుఁడైన – హరిప్రతిష్ఠకు నమాత్యవ్రాతమెల్లఁ
జనుదేర నీవేల చనుదేర విచటి" – కనుడుఁగోపోద్దీపితాంగుఁడై పొంగి
"పుట్టఁజుట్టువుమాలి చుట్టుముట్టాడు – నిట్టిట్టివేలుపు లెట్టునరేంద్ర!
కర్తలనియెదవు కర్తలిం దెవరు – కర్తలకర్త మత్కర్తయ కాదె
కర్తవ్య మింతయుఁగర్త శంభుండు – కర్తవ్య మెందును గర్తకు సరియె
కర్తప్రధానుండు గాక తక్కెల్లఁ – గర్తయు హర్తయుఁగలఁడె వేఱొకఁడు
హరియును గిరియును నజుఁడును గిజుఁడు – సురలును గిరలును హరునిసమంబె
యిల '**మమ కర్తా మహేశ్వర**' యనుచుఁ – బలికెడు విష్ణుఁడు పరమేశుఁడగునె
యటుగాక స్థితికర్త యందమే విష్ణుఁ – డిట పుత్రు రక్షింప నేలొకో లేఁడు
నలువ దైవంబనుపలుకులు మున్నె – పొలిసెఁగాదే తల[4]వొలిసినయపుడు
కాఁడువో యుత్పత్తికర్తయు నజుఁడు – పోఁడిగాఁ దనతలఁబుట్టించుకొనఁడె

1. శివ 2. కొట్టారమున 3. వెరుసది 4. పోయిన

ధర జినబౌద్ధులు దైవంబులేని – నరరూపులై యుండుదురె మహత్త్వఁగి
పశుకర్ములగు వేదబాహ్యులువారు – పశుపతు లగుదురె ప్రత్యక్షమిదియు
నననేల '**హస్తినాహన్యమానోఽ ప్తి** – యన[1]నిరీశ్వరుని విశ్వాలయుఁడనఁగ
నేనుఁగు వెన్కొని యెగిది [2]మట్టాడు – చోనైన వసదులు సొరరెట్టివారు
మాయ [3]దైవం బనుమాట లేమిటికి – మాయ దానట పేరు మఱి దైవమగునె
హరునధికారులు నజుఁడును హరియు – నరయంగ శ్రుతిబాహ్యు లాయున్నము
నెవ్వండు గర్త యీ యేవురియందు – నెవ్విదర్శనము లి ట్లెన్నఁగ నాఱు (గురు
శ్రుతి '**ఏక ఏవ రుద్రో**'"యన్నయట్టు – లితరదైవంబుల నెన్న నేమిటికి
వేదంబు దైవమే వేయును నేల – నాదిసోమకుచేత నపహృతంబగునె
తలరునే పృథివియు దైవమేనియును – నిలయమై యుండునే మలమూత్రములకు
నెఱయ దైవమె నీరు నిట్టపాటులను – వఱలునె యణఁగునె యఱచేతియందు
ననలుఁడు దైవ మే నటు భంగపడునె – మును సర్వభక్షుఁడై చనునె లోకముల
నక్కరువలి దైవ మంద్రేని నొక్క – దిక్కున నుండునే దిక్పాలుఁడనఁగఁ
దలఁపఁనాకాశంబు దైవమంద్రేని – బ్రళయంబుఁబొందునే ప్రమథులచేత
నిలుకాల నిలువఁగ నేరక తిరుగు – నిల దినేశుండు సర్వేశ్వరుం డగునె
యానిశాపతి దైవ మన నెట్లువచ్చు – [4]నానాఁటికిని గళానష్టతఁబొందు
నఖిలంబునకుఁగర్త యాత్మయేనియును – సుఖదుఃఖములఁబొందిసొగయుచునున్నె
కావున మున్ని ట్లొకండొకొక్కటికి – దైవంబు లేనియుఁదారు వుట్టుదురె
కర్మంబ యంతకుఁగర్తయంటేని – గర్మం బచిత్తు దత్కర్తయు జడుఁడు
నెట్టన్న నన్యాయ మేమేనిఁజేయ – నట్టివానిఁబఱప నధికారి గలఁడొ
[5]తనకుఁదాఁబఱపునో తత్కర్మఫలము – [6]తనకుఁదాఁబంధించుకొనునొతత్కర్త
కావునఁబఱప నొక్కఁడు గర్తగలడు – భావనఁదత్కర్మఫలములు గుడుపు
నిలను గర్మాధీశుఁడీశుండు గర్మ – ఫలదాత మా యుమాపతియె దైవంబు
కర్మంబు గర్తయేఁగ్రతువునఁబుణ్య – కర్మి యంచును దక్షుఁగడతేర్పవలదె?
పితృవధసేసిన యతికర్మఫలము – నతని బొందఁగనీక యఖిలంబు నెఱుఁగ
మేటికర్మము గర్తమృడుఁడు గాఁడేని – **కాటకోటని** కేల కైలాస మిచ్చె
నటు '**కృతం కర్మ శుభాశుభం**' బనెడి – చిటిపొటివాదము ల్సెల్ల వెయ్యెడను

1.ఁగనీశ్వరుని 2. ముట్టాడు 3. యెదైవమన్మాట 4. నానాటికి పుడును నష్టంబుఁ బొందు 5.6.తనుఁదాన



కోయని శ్రుతియు '**నేకో రుద్ర ఉచ్యఽతే**' యనుఁగాన మా దేవుండె కర్త
హరిముఖ్యులీశుఁబంచావరణములఁ – [1]బరి[2]చరులై కొల్చుపశువులు గాక
కర్తలే యొక్కొక్క కార్యకారణవి – వర్తన [3]మాత్రన వా రెట్టు లనినఁ
బనిసేయు [4]బంట్లెల్ల మును దమచేయు – పనికె కర్తలుగాక ఫలకర్త లెట్లు
కాన కర్తలకర్త మానీలగళుఁడు – దీనికి నిం కొండు దృష్టంబు లేల
పరమేశు చుట్టును ధర నూర నూరఁ – బరిచరులై హరిప్రముఖులు గొలువ
నప్రతిమాకారుఁడగులింగమూర్తి – కీ ప్రతిమాకారులే సమానంబు
నిర్మలనిత్యనిష్కర్మదేహునకు – దుర్మల దుష్ట దుష్కర్ములు సరియె
శుద్ధ ప్రసిద్ధానిరుద్ధ దేహున క – సిద్ధ బౌద్ధాశుద్ధ జీవులు సరియె
చావుఁబుట్టువులేని దేవదేవునకు – చావుఁబుట్టువుగల దేవత ల్సరియె
బ్రహ్మమాయాకారపశుపాశపతికి – బ్రహ్మేంద్రహరిముఖ్యపశువులు సరియె
శంకరునకు ధృతకంకాళునకును – శంకితు లగుచున్న కింకరు ల్సరియె( లెనయె
ప్రళయంబుఁబొందించు ప్రళయరుద్రునకుఁ – బ్రళయంబుఁబొందెడు పలువేల్పు
మునిగణార్చిత పాద వనజాతునకును – మునిశాపదగ్ధులౌ పినుఁగులుసరియె
పూజితుండగు లింగపుంగవునకును – పూజించికొలిచెడి పూజరు ల్సరియె
సిరిమహాదేవుఁడౌసిరిగిరిపతికి – సిరివాసుదేవాదిసురలు సమంబె
నలిమూఁడుగన్నులుగల త్రినేత్రునకు – నలరెండుగన్నులయతగులు సరియె
హాలాహలాగ్ని సంహారశౌర్యునకు – హాలాహలాగ్నిహతాంగులు సరియె
త్రిపురదైత్యాంత కోద్రిక్త వీర్యునకుఁ – ద్రిపురదైత్యోపద్రవపతితు ల్సరియె
అంధకాద్యసురదర్పాపహారునకు – నంధకాద్యసురభయభ్రాంతు లెనయె
హరికమలజకపాలాస్థి ధారునకు – హరికమలజసురాసుర తతి సరియె
యావిర్భవింపని యభవున కరయ – దేవకీపుత్రాది దేవత ల్సరియె
లింగమూర్తికి జగత్సంగతాత్మునకు – లింగమధ్యములోని లెంగులుసరియె
సర్వజ్ఞుతోడ నసర్వజ్ఞు లెనయె – సర్వేశుతోడ నసర్వేశు లెనయె
**షాడ్డలదేవు**తో **సోమేశు**తోడ – సడ్డలదైవము ల్సర్చింప సరియె
హరుఁడు సర్వేశ్వరుం డభవుండు శివుఁడు – పరముఁడు పశుపతి పరమేశ్వరుండు
శ్రీమహాదేవుఁడన్నామంబు లున్న – వే మహినిటువంటి యితర వేల్పులకు(?)

1. బరికరు 2. వారమైకొల్చిబ్రదుకుదుర్గాదె 3. ధారులైవర్తింతురెట్లు 4. బంట్లుదాఁబదపడి.

రమణఁ'**దద్విష్ణోః పరం పద**' మనఁగ – నమర విష్ణునకుఁబరమమైనపదము
శ్రుతి "**సదా పశ్యంతి సూరయో**" యనఁగ – గతకర్ము లీశుండ కాఁగనియుండఁ
గుమతులై కర్మశాస్త్రములవెంబడిని – బ్రమసియో యిలఁగుక్కపాలు ద్రాగుటనొ
మఱి నాము మేసియో మతిమాలినట్టి – యఱవపాఱులమాట లవనీశ వినకు
మపునర్భవత్వంబు నచ్యుతత్వంబు – నుపమింప విష్ణున కున్నదే యెందు
పూని మా భృగుశాపమున నచ్యుతుండు – తా నుదయింపఁడే దశజన్మములను
సామ మా '**విష్ణుః పితామహో**' త్తనఁబి – తామహునకు హరి దాఁబుట్టెఁడాదె
యజునిగుదంబున హరి పుట్టుటకును – నిజనామ మది **యధోక్షజుఁడ**య్యెఁగాదె
యదిగాక యదితి కింద్రానుజుఁడనఁగ – నుదయించెఁగాదె పయోజనాభుండు
ఆదట ద్వాపరమందు విష్ణుండు – **బాదరాయణు**ఁడనఁబ్రభవించెఁగాదె
యయ్యుగంబునను మున్నచ్యుతుం డుదయ – మయ్యెనుగాదె **కృష్ణాఖ్యుండు**నాఁగ
విష్ణుఁడొక్కొక్కెడ విలయంబుఁబొంద – విష్ణుత్వ మర్థించి విశ్వేశుఁగొలిచి
యొక్కొక్కఁడుదయించె నొగి విష్ణుఁడనఁగ – నెక్కడఁబట్టి యింకెన్ని జన్మములు
నతనిబాములు విను మవనిపాలుండ – శ్రుతిమూలముగఁజూడు ప్రతివాద[1]మనక
తగిలి **దూర్వాసుండు** దన్నినఁగాదె – నగధరువక్షంబునను మచ్చయయ్యె
హరిని **రుక్మిణి**ఁగూడ నట్లును గాక – కరమర్థితో బండిగట్టి తోలండె
యమృతాబ్ధిసేవన నయ్యుపమన్యుఁ – డుమియఁడే కుత్తుకనున్న కేశవుని
హరిని **జలంధరుం** డనునొక్కయసుర – పొరిమాల్చెఁగాదె నభోమార్గమునను
చలమరి యొక **జరాసంధుని**కోడి – యిల దుర్గమును బన్నఁడే కేశవుండు
నవ్విష్ణు నిభదానవాదిరాక్షసులు – ముప్వురు సలపట్టు టెవ్వరు వినరె?
యేచి **విష్ణుండు దధీచి**ఁజక్రమున – వైచుడు వీ పొగ్గి యాచక్రమపుడ
తునియలుగాఁగొట్టుచును నతం[2]డెగుదఁ – గనుకనిఁదలవీడఁగాఁబాఱెఁగాదె
మును మృగచండాలమను గార్దభంబు – వనజాక్షు ప్రాణంబు సనఁగాచెఁగాదె
హరుఁడు విసముద్రాగి యమృతంబుఁ బనుప – హరి మగఁటిమి [3]విడ్చియాఁటదిగాఁడె
బలిఁగిట్టి భువిఁగొన్నపాపంబుకతన – యిలగోలుపడి హరి జలధి సొరండె
యాలిఁగోల్పడి **రాముఁడ**ట బ్రహ్మహత్య – పొలయి ధర చుట్టు భ్రమరించెఁగాదె
పోటరి విష్ణుండు బోయచేఁగాల – నేటువ డీల్గఁడే యిల యెల్ల నెఱుఁగ

1. మేల 2. దెగువ, నెదురేఁగ 3. చెడి.



వేయేల [1]వ్రేవాడ వెన్న ప్రుచ్చిలుచుఁ – బోయి అంకాడఁడే పొలఁతులతోడ
నోలి **నందీశ్వరు** నూర్పులఁదగిలి – పోలేక వచ్చుచుఁబోవుచుండండె
హరి దాన దైవంబ నని జగం బెఱుఁగ – నురులింగమూర్తిచే నుబ్బణంగండె
మృదుఁ బెక్కుయుగములు మేఘరూపమునఁ – గొడుకు నర్థించి దాఁగొలువఁడే
మత్స్యావతారంబు మడియించి కాదె – మత్స్యకేతనవైరి మఱి తలఁకఁజుట్టె (శార్ఙ్గి
పరగఁదత్కూర్మకపాలంబు గాదె – హరుహారమధ్యంబునం దున్న యదియు
బ్రాఁతిగా నాదివరాహదంష్ట్రంబు – ఖ్యాత మీశ్వరుచేతఁగాదె యున్న యదియు
శరభరూపము దాల్చి పొరిమాల్చికాదె – నరసింహుతోలు శంకరుఁడు దాఁగట్టె
పొట్టి **త్రివిక్రము** నెట్టెమ్ముగాదె – పట్టె ఖట్వాంగము భాతి శంకరుఁడు
నగ్రజుఁడగు విష్ణు నక్కళేబరము – నుగ్రాక్షుమూఁపున నున్నదే కాదె
మా దేవదేవుని పాదపీఠమునఁ – గాదె లక్ష్మీశ్వరుక న్నున్నయదియు
మృడుఁడు విష్వక్సేనుఁబొడిచి యెత్తుడును – గడఁగి శూలంబునఁగాదె యున్నాఁడు
అత్తఱిఁగలికేతుఁడై కేశవుండు – నెత్తురు వఱపఁడే నిటలాక్షుమ్రోల
సంతతంబును శ్రుతిసన "**హరిగుంహా – రంతం**" బనుచు మ్రోయు రౌద్రభావమున
[2]హరిని హరించుట హరిహరుండయ్యె – హరుఁడు సేతోజాతహరుఁడఘహరుఁడు
శ్రుతులు "**యజ్ఞస్య శిరోభిన్న**" మనఁగఁ – గ్రతుపురుషుని జంపఁ గడుఁగోపమునను
వెనుకొని తునుమఁడే వీరభద్రుండు – చని కేశవునితల జన్నంబులోన
నవలేపమునఁ బొంది దివిజాధ్వరమునఁ – దివిరి విష్ణుఁడు దలఁదెగఁగొట్టువడఁడె
యతఁ డేల యెవ్వఁ డహంకరించినను – రతిపతిహరునిచే బ్రతుకఁగఁగలఁడె
వసిగొని హరియు దేవతలు నెత్తంగ – వెస నోపిరే యక్షవినిహితతృణము
మించి మున్ బ్రహ్మ గర్వించిన శివుఁడు – త్రుంచివైవఁడె వానిపంచమ శిరము
హరిణమై కూఁతురివరియింప నజుని – హరియింపఁడే మృగవ్యాథ రుద్రుండు
అతనిపుత్రుండు నహంకారియగుడు – క్షితి నుష్టమైయుండఁజేయఁడే హరుఁడు
వాసుదేవుండు దైవంబనియెత్తు – వ్యాసుని చేయి నిహత మయ్యెఁగాదె
యదిగాక గర్వించినట్టి **రావణుని** – నదుమఁడే శివుఁడు వాదాంగుష్ఠ మంద
మలహరుతో మాఱుమలసి కాముండు – నిలయెల్ల నెఱుఁగ నేఁటేఁటఁ గాలండె
కాలుని శ్వేతునికై చంపెఁగాదె – శూలంబునఁను బొడ్చి సురలెల్ల నదర

1. వ్రేపల్లె 2. హరిని హరింపఁడె హరిహరుం డనెడి.

దక్షుండు గర్వించి తలఁగోలుపడుట – సాక్షిగా దెట్లు మేషంబుశిరంబు
ఆది దా నఖిలలోకాధ్యక్షుఁడన్నఁ – గాదె భగాదిత్యు కన్నులు వెఱికె
దూషించి పలుక రుద్రుం డనుగణము – పూషుని పండ్లూడఁబొడిచెను గాదె
తానచూ యీ జగత్ప్రాణుఁడ నన్నఁ – బూని త్రుంపఁడె పవమానునికాళ్లు
ద్రోహిచే నాఁడాహుతుల్ గొని కుడిచి – బాహుజిహ్వలు గోలుపడియెఁబావకుఁడు
ననిమిషాధిపుచేయి యదితినాసికము – దునుమఁడే వీరభద్రుండు రౌద్రమున
నమృతాంశుమేను వాదాంగుష్ఠముననను – జమరఁడే యతఁడు యజ్ఞమున కేతేర
సయ్యన మును సరస్వతి ముక్కుఁగోసి – [1]వయ్యఁడే నాఁటియధ్వరములోపలను
వెండియుఁగ్రొవ్వినవేల్పుల నెల్ల – దండించుచును జగద్రక్షణార్థముగ
ముల్లోకములఁగూడ ముంచినగంగ – మల్లికాదలభాతి మౌళిఁదాల్పండె
త్రిపురంబు లతిదుర్నిరీక్ష్యమై తిరుగఁ – ద్రిపురారి వోదేర్చుతివుటఁగాల్పండె
నే లెల్ల మోవఁగఁజాలిన శేషు – వ్రేలిముద్రికగాఁగఁదాలిచెఁగాదె
సంగతి విషవహ్ని జంబూఫలంబు – మ్రింగినభావన మ్రింగఁడే హరుఁడు
నంధక కరిదైత్య వ్యాఘ్ర లాలాజ – లంధరాదుల నిర్దళనము సేయండె
యింతింతవనులకు నీశ్వరుం డేల – కంతుసంహరు నొక్కగణము సాలండె
యొకశివగణముచే సకలలోకములు – ప్రకటంబుగాఁజెడుఁబ్రభవించు మించు
నన **మహాదేవు** మహత్త్వంబునకును – నెన యున్నదే యింక నిన్నియునేల
నిత్యుండ నేన యనిత్యు లందఱును – సత్య మిట్లనుచు సజ్జనసాక్షికముగ
నిత్యస్వరూప వినిశ్చితదృష్ట – ప్రత్యయంబుగఁదాల్పఁబడియున్న యట్టి
హరివిరించుల కపాలాస్థిమాలికలు – కరి గాదె యీశుండు కర్త యౌటకును
నదిగాక **యుపమన్యు**ఁడను మునిచేతఁ – బదపడి శివదీక్షఁబడసి **విష్ణుండు**
[2]సొంపున నింద్రనీలంపులింగంబు – నింపార సజ్జయం దిడి కొల్చెఁగాదె
వెన్నుండు దా నిత్య వేయుఁదామరల – నున్నతిఁబూన్ప నం దొకటి లేకున్నఁ
గన్నుపువుచ్చి **శ్రీకంఠు**ఁబూజించి – కన్నును నాఁటి చక్రముఁ బడయండె
మత్స్యావతారుఁడై మఱి లంకలోన – మత్స్యకేశ్వరు నిల్పి మఱి కొల్చెఁగాదె
మున్ను దోరసముద్రమునఁగూర్మనాథుఁ – బన్నుగాఁగూర్ముండు భక్తిఁగొల్వండె

1. వెయ్యఁడే యధ్వరవేళఁదెల్లముగ 2. పెంపున



**శ్రీరాముఁడు**ను నట్ల సేతువు నిల్పి – **శ్రీరామనాథు** నర్చించుట వినమె
యాది **క్షీరారామ** మందు విష్ణుండు – గాదె **రామేశ్వరు**ఁగడు నర్థిఁగొలిచె
**ద్వారావతి**ని నిల్పి తాఁగొల్చెఁగాదె – కోరి గోవిందేశు **గోవిందు**ఁడర్థి
బ్రహ్మ **యలంపూర** భక్తితోనిల్పి – **బ్రహ్మేశ్వరుని**ఁగాదె పాయక కొల్చె
నింద్రుండు **పుష్పగిరీంద్రంబు**మీఁద – నింద్రేశు నిడికాదె యెప్పుడుఁగొలుచు
**వారణాసి**ని నిల్పి వ్యాసుఁడుగాదె – కోరి **వ్యాసేశ్వరు**ఁ గొల్చుసంతతము
ననయంబు **వారణాసి**ని మునీంద్రులును – దనుజామరాదులు దమతమపేళ్ల
నొక్కొక్క లింగంబు నక్కడ నిలిపి – యక్కజంబుగఁ గొల్చు టది [1]దెల్లగాదె
యభవుఁడక్షయుఁడు మహాదాని దక్క – నభిమతార్థము నిచ్చు [2]నధిపులున్నారె
యవ్విష్ణుఁడాబ్రహ్మ యజ్జినముఖ్యు – [3]లెవ్వరే నెవరికే నిచ్చిరే పదము
హరివిరించిప్రముఖామరదైత్య – నరగరుడోరగవరమునీంద్రులకు
నీశ్వరుఁడొసఁగినయీప్సితార్థముల – శాశ్వతలీల సజ్జనసాక్షికముగ
నిచ్చిన సకలలోకేశ్వరుమహిమ – గ్రచ్చరఁబడసినగణముల వినుము
చేతులు రెండు సంప్రీతిఁబూజింప – భాతిగాఁజేతులు **బాణున** కిచ్చెఁ
గన్నులు రెండు సమున్నతిఁబూన్పఁ – గన్నుల ప్రోవిడెఁ**గాళిదాసున**కు
నాసక్తి **శివనాగుమయ్య**కుఁగన్ను – లేసోమవారంబు నెడపక యీఁడె
భానునిచేఁబోని లోని కుష్ఠడఁచి – పూని [4]**మయూరు**ని మే నిచ్చెఁగాదె
హరిచేతఁబోని దుర్భరమైన కుష్ఠు – హరియింపఁడే దండి యర్థిఁగీర్తింప
భువిజనులెల్లను బొగడుచునుండఁ – దవనిధి దేదర[5]దాసయ్య కీఁడె
ధూపవేళను ఘంటతోఁగొనిపోఁడె – యేపారమెచ్చి యోహిళుఁదనపురికిఁ
**గరికాల** [6]**చోడు**కుఁ గనకవర్షంబు – నరులెల్ల నెఱుగంగఁగురియించెఁగాదె
మిగిలినబాసకు మెచ్చి ప్రాయంబు – మగుడఁగ నీఁడె **కుమ్మరగుండయ**కును
అక్కడఁబ్రమథులు నక్కజంబంద – నెక్కిన గద్దియ యీఁడె చేరమకు
నిమ్మవ్వకై యేడ్డినమ్ములు సూఱ – యిమ్ములఁబ్రమథలోకమ్మున విడఁడె
చెనసి బొమ్మయ్య చంపినమృగంబులను – ననయంబుఁగైలాసమునకుఁగొంపోఁడె
పూని యేడ్డినములపీనుఁగు బ్రదుకు – మానుగాఁగదిరె రెమ్మయ కిచ్చెఁగాదె
మలయరాజయ్య నిర్మల విమానమున – నలిగొన బొందితోనన కొనిపోఁడె

1. నిక్క 2. నథికు 3. లెవ్వరెవ్వరికిచ్చి రేమేమిపదవి 4. మయూరుకు 5. దాసి కియ్యండె 6. చోడన్కి

నిర్జితసంసారునిఁగుమారపాల – ఘూర్జరుఁదంత్రంబుఁగొనిపోయెఁగాదె
లలి నూరివారి **పిళ్లయనయనారు** – వెలయఁగఁదనలోనఁగలపికొనండె
వరగొండ పెరుమాణి నరులెల్ల నెఱుఁగఁ – గర మర్థిఁగొనిపోఁడె కైలాసమునకు
మ్రోలఁబాడఁగఁదాళములతోడ నంబిఁ – గైలాసమునకు శంకరుఁడు గొంపోఁడె
యెలమి షోడశగణముల నిరతముగ – వెలయఁబీఠంబుల నిలుపఁడే మఱియు
తేరసగణముల వీరసద్భక్తి – గారవించుచు మెచ్చి కరుణించెఁగాదె
పొంచి మృగార్థియై పోరి నిద్రవోని – చెంచున కొసఁగఁడే శివరాత్రిఫలము
చన్న సద్భక్తులచరిత లనంత – మెన్ననే లిపుడు నీ వెఱుఁగంగ శివుఁడు
వసుధఁబేర్కొను **మడివాలుమాచయ్య** – యదృశుఁడగు **కిన్నరయ్య** యాదిగను
నచ్చుగా భక్తుల కభిమతఫలము – లిచ్చుచునున్న వాఁడిట్లు గావునను
గంతుసంహరు కెన గలదనుచదువు – లింతయు శివుఁడను నేకాత్మమతము
విను"**యథాశివమయోవిష్ణు**" వన్మాట – లును ద్రిమూర్తులునొక్కటను దురుక్తులును
అష్టమూర్తులు రుద్రుఁడనుకుయుక్తులును – దుష్టమానవుల భక్తుల కెన సేసి
పలుకుటయు వినంగఁబాతకంబొందుఁ – గలదేని పనిసెప్పు పిలిపించి తనుఁడు
భూములు సూచుచు మోములు వాంచి – గామడ్చినట్టు లంగంబులు మఱచి
యుక్కఱి స్రుక్కి యయ్యూరుపు లుడిగి – నక్కిళ్లు వడి గ్రక్కుమిక్కన లేక
యున్నవారలఁజూచి యుత్తరం బడిగి – యన్నరేంద్రాధముఁడట్లు లజ్జింప
క్రొవ్వడంగిరి దార్కికులు గూసి కుక్క – దువ్వఁ దెచ్చికొనిన యవ్విధంబయ్యె
నీక్షితి **బాచయ్య** యితరమర్త్యుండె – సాక్షాత్త్రినేత్రుండు సత్యమిట్లనుచు
కొలువు దిగ్గనలేచి బిలిబిలి తార్కి – కులుఁదాను నేఁగె బిజ్జలుఁడు దత్క్షణమ
**బాచిరాజయ్య**యు **బసవయ్య**ముఖ్య – మైచను నిఖిలభక్తావళి యంత
చనుశీలసద్భక్తి సౌభాగ్యమహిమ – దనరార జనులెల్ల ఘనకీర్తి సేయ
రాచిన సద్భక్తిగోచరుం డగుచు – **బాచిరాజయ్య** యెప్పటియట్ల యుండె
**బాచిరాజయ్య** విభ్రాజితచరిత – మేచినవీరమాహేశ్వరసభలఁ
జదివిన విన్నను సంస్తుతించినను – సదమలసద్భక్తి సౌఖ్యసారంబు
సహజైకలింగనిష్ఠాపరత్వంబు – మహితశివాచార మహిమయుఁబొందు



నాతతసకలపురాతనచరిత – గీతానుభవసుఖకేళీవిలోల
విహితశాస్త్రపురాణవేదవేదాంత – మహితరహస్యార్థమార్గానుపాల
తను మనో ధన నివేదనభక్తివినయ – జనితానురాగాత్మసద్భక్తిజాల
విదితప్రసాదసవినయసౌఖ్యప్ర – ముదితాంతరంగసమున్నతలీల
హృన్మందిరాంతర్నిహితగురుధ్యాన – మన్మిత్ర సంగనామాత్య సుశీల
ఇది యసంఖ్యాతమాహేశ్వరదివ్య – పదపద్మసౌరభ భ్రమరాయమాణ
జంగమలింగప్రసాదోప భోగ – సంగతసుఖసుధాశరధి నిమగ్న
సుకృతాత్మ పాలుకురికిసోమనాథ – సుకవిప్రణీతమై శోభిల్లి తనరి
చరలింగ ఘనకరస్థల విశ్వనాథ – వరకృపాంచిత కవిత్వస్ఫూర్తిఁబేర్చి
చను బసవపురాణ మనుకథయందు – ననుపమంబుగను షష్ఠాశ్వాసమయ్యె.

# సప్తమాశ్వాసము

శ్రీ శ్రితకంధర శ్రీపాదయుగ స – మాశ్రిత సంగనామాత్య సత్కృత్య
మఱియును భక్తధీమణి లసత్కీర్తి – కఱకంఠభక్తాగ్రగణ్యుఁడుత్తముఁడు
నసలార శివనాగుమయ్య సంప్రీతి – బసవనిచేఁబ్రణిపత్తిఁగైకొనుచు
ననయంబు భక్తిసుఖామృతాపార – వనధి నిమగ్నుఁడై వర్తింపుచుండ
బుడిబుళ్లవోవుచు భూసురులెల్లఁ – బుడమీశుకొలువుకుఁబోయి యిట్లనిరి
వ్యక్తిగా విను పెద్దభక్తులు వెద్ద – భక్తులంచును మన **బసవయ్య** వారిఁ
గడుఁగడుఁగొనియాడుఁబడుఁగాళ్లమీఁద – కుడిచిడించిన యది గుడుచు వెండియును
వెఱవక సభ్యునివిధి మిమ్ముఁ గదియుఁ – దఱియంగఁజొచ్చు నంతర్ని వాసములు
వారును బురవీథి వచ్చుచోఁదమ్ముఁ – జీరికిఁగైకోరు [1]**సెంబలివారు**
కథలేల కళ్యాణకటక మంతయును – బ్రథితంబు మాలల పాలయ్యె నింక
నెక్కడివర్ణంబు లెక్కడినీతు – లెక్కడిధర్మంబు లి ట్లేల చెల్లు
రాజులఁబొరయుఁదద్రాష్ట్రంబుపాప – మోజమాలినవారి నొగిఁబర్పకున్న
వినఁజెప్పకున్నఁదజ్జననాథుపాప – మనఘ పురోహితులను నవశ్యమును
బొందుఁగావునఁజెప్ప భూమీశ వలసె – నెందుఁబాపం బింకఁబొందదు మమ్ము
ధ్రువము“**రాజా నుమతో ధర్మ**” యనుట – యవనీశ యెఱుఁగవే యనుడుఁగోపించి
వసుధేశ్వరుఁడు బసవనఁబిల్వఁబనుప – నసమా[2]ను నందలం బర్థి నెక్కించి
శివనాగుమయ్యకుఁజే యిచ్చికొనుచుఁ – దివిరి యేతేరఁదద్ద్విజులు వీక్షించి
యదిగో మహారాజ యంతటఁబోక – కదియవచ్చెడు [3]మాలఁగలప నిచ్చటికి
డెందంబునను భయం బందమి సూడు – మందలం బెక్కించి యతనిఁదెచ్చెడిని
ఇంక నేరి కితండు శంకించు ననినఁ – గింకతో నగరివాకిలి సొరకుండ
వెలుపలికొల్వున విభుఁడున్న యెడను – నులుకక బసవయ్య యున్నతంబుగను
**శివనాగుమయ్య**కు సింహాసనముగ – భువిఁదనపై [4]చీర వుచ్చి పెట్టుచును

1. సెంబలినారు 2. మాన 3. మాలుఁ 4. కప్పు



“బిలిచినపని యేమి పృథివీశ” యనినఁ – గలుషంబు గ్రమ్మ **బిజ్జలుఁడిట్లు**లనియె
“నాదిఁదలంప వర్ణాష్టాదశముల – భేదంబులవి నేఁడు వేర్కొన్నయవియె
కులసంకరము సేయఁగూడునే మాఁల[1] – గలపితి కళ్యాణకటక మంతయును
నీతలఁబుట్టెనే నిటలాక్షుభక్తి – నీతి[2]హీనుఁడ కుర్యునే వర్ష మింకఁ
బండునే యింక మీ రుండినభూమి – యొండేల మీకు మే మోడుదు” మనుడు
వసుధేశ్వరునకు నవార్యవీర్యుండు – బసవఁడు సద్భక్తిపండితుండనియె
“మనుజేశ **గొడ[3]గర మాచలదేవిఁ** – జెనసి యుత్తమవంశఁజేసెద మనుచు
స్వర్ణధేనువులోన సతి నుంచి మునుఁగ – నిర్ణిమిత్తమ పాలు నిండఁగఁబోసి
యా పోయెఁబూర్వాశ్రయం బని తార – యాపడఁతికి మ్రొక్కి యంతటఁబోక
[4]యంగద యట్టిగ్రామాంత్యజురాలి – యెంగిలిపాల్ద్రావి [5]రేవంబు లేక
నదియేల వేయును ననఁగథ లందు – గదుగదుకేమి యక్కనకధేనువును
వండఁదర్గినమాడ్కి ఖండముల్గాఁగఁ – జెండుచుఁదమలోనఁజే వ్రేసికొనుచు
బనత సోమాదుల బలగంబుపాలు – వెనుకచట్టలు సతుర్వేదులపాలు
కోలెమ్ము దా నుపాద్దేలయ్యపాలు – వాలమ్ము బ్రహ్మవిద్వాంసులపాలు
బరులు షడంగులపాలు మున్నుదుక – లురముసైతము ప్రభాకరభట్లపాలు
సమపొట్ట సన్నపుటెముకలుఁబ్రక్క – టెముకలు వ్యాకరణమువారిపాలు
తొలఁకుజల్లియుఁద్రివేదులవారిపాలు – బలుదెక్క సిఱుదెక్క వాళ్లమిక్కిళ్లు
పరదేశి విద్యార్థిపాలంచు నిట్లు – చెరలుచు గోహత్య సేసినయూర
[6]మాలల యీ త్రాటిమాలల పచ్చి– మాలలమాటలు వోలునే వినఁగ
వేదంబు లాదియో విధికల్పితంబు – లాదియో జాతుల కది యెట్టు లనినఁ
జనువేదచోదితజాతులు రెండు – వినుము ప్రవర్తకంబును నివర్తకము
భవకర్మసంస్కారి భువిఁబ్రవర్తకుఁడు – శివకర్మసంస్కారి భువి నివర్తకుఁడు
సన్నుతవేదార్థచరితంబు లుండ – మొన్నఁ బుట్టినకులమ్ములమాట లేల
[7]స్రష్టుక్తమగునట్టిజాతులు గావె – యష్టాదశంబులు నవియేల చెప్ప
మిక్కిలి పదునెనిమిదివర్ణములకు – నిక్క మారయ భక్తనిచయంబుకులము
భాగ్యహీనుండు దాఁబసిఁడిఁబట్టిన న – యోగ్యంపులోష్టమై యున్నట్లు శివుని

1. లు 2. హీనకురియు 3. వల 4. యంగన 5. రేహ్యంబు 6. మాలుల (లర) 7. స్రష్టోక్త.

ప్రతిబింబమూర్తియౌ భక్తుఁడు భవికి – మతిఁజూడఁమానవాకృతి నుండు ధరణిఁ
గావున శివభక్తగణములమహిమ – భావింపఁదలఁప నీ ప్రాప్తియే చెపుమ
కరివైరితోడఁగుక్కలు వోల్ప సరియె – కరితోడ గ్రామసూకరములు సరియె
జడధితో నిలఁజౌటిపడియలు సరియె – వడి గంగతో వెడవ్రంతలు సరియె
తపనుతో ఖద్యోతతతు లెల్ల సరియె – యుపమింపఁజంద్రుతో నుడుపంక్తి సరియె
మేరువుతోఁబెఱమెట్టలు సరియె – పారిజాతంబుతోఁబ్రబ్బిళ్లు సరియె
శివనాగుమయ్యతోఁజెనఁటి యీ ద్విజులు – నవనీశ సరియుఁగా రది యెట్టులనిన
భక్తుండు శ్రీపతిపండితుండీశు – భక్తుని కిలఁగోటిబ్రాహ్మణులైన
నెన యన్ననాలుక నేఁ గోసివైతు – ననుచు **ననంతపాలుని** సభాస్థలిని
నెక్కొనఁగాఁజంద్రనిప్పులు గాదె – చక్కన పొత్తిపచ్చడమున ముడిచె
తా నేమి చెప్ప భక్తానీక మిండ్ల – శ్వానంబులకు ద్విజు ల్సరిరామి వినవె

## కల్లిదేవయ్యగారి కథ

యల్లహో**వినహాళ** యనుపురంబునను – **కల్లి దేవయ్య** నాఁగా [1]మహాత్ముండు
శ్రీరుద్రు నపరావతారంబు గాని – ధారుణి మనుజావతారుండు గాఁడు
ఒకరాత్రి పరదేశి యున్న నయ్యూర – నొకవాముసంపుచు నుండు సంతతము
అప్పాటఁగల్లి దేవయ్యను గఱచి – యప్పాము దాఁజచ్చె నఖిలంబు నెఱుఁగ
కరుణాకరుఁడు గాన కల్లిదేవయ్య – యురగంబుఁబడసి యయ్యూరన యుండ
సహజసన్నుతశీల సంబంధయుక్తి – మహిమ దుల్కాడంగ మఱియొక్కనాఁడు
తమదాసి యర్ఘ్యపణ్యములకుఁబోవు – సమయంబునందొక్కసద్ద్విజుచేయి
తన్నుఁజోఁకుడు నప్డ తనతలకడువ – నన్నేలపై వ్రేసి యచ్చోన పాఁతి
యత్తఱి భసితాంగి యగుచు వేఱొక్క – క్రొత్తబిందియ మోచికొని పోవఁగాంచి
కొత్తిఁజూడుఁడు గండక్రొవ్వఁదనంబు – నుత్తమద్విజుఁడు దా నొఱసెఁదన్ననుచు
భాండ మచ్చోటనే పాఱంగ వైచి – యొండు భాండముఁగొని యోరవోయెడిని
[2]ఎచట బ్రాహ్మణులకు నితరులముట్ట – నుచితంబు గాదుగా కొరులకు ద్విజుల
ముట్టఁగ రా దనునిట్టి ధర్మములు – పుట్టునే యని కూడి భూసురు లపుడు
కలియుగరుద్రునిఁగల్లి దేవయ్యఁ – బిలిపించి కౌటిల్యకలితవాక్యములఁ
'దలపోయ నూరిలోపల నొక్కమాట – పలు కెన్నఁడును వినఁబడదు మీ వలన

1. మహత్తరుఁడు, మహోత్తముఁడు 2. ఎచటనుబ్రాహ్మల కితరుల



కల్లి[1]దేవయగారు ప్రల్లదు లనఁగ – నెల్లెడ వినము మీ రల్లసర్పమును
బడసిననాఁడొండెఁబొడగంటి మిపుడు – పొడగంటి మెన్నఁడుఁబొడగానరాదు
మంచివారని మిమ్ము మన్నింతు మేము – క్రించుబోయత మమ్ముఁగొంచెంబుసేసెఁ
[2]జంటివిప్రుఁడు గాఁడు సాక్షాద్వసిష్ఠు – [3]వంటియుత్కృష్టవిద్వాంసుఁడట్లయ్యు
వేదులవారి దామోదర[4]యజ్వ – గాదిలియగు త్రివిక్రమసోమయాజి
సమిధల కీగుళ్లసంది వోవంగఁ – బ్రమసెనో దాను నప్పాట వచ్చుచును
దనుఁజోఁకె వీరిచే యనుచు మీదాసి – తనతలకడువ యత్తఱి వ్రేసెఁ బగుల
వినుము శూద్రులుముట్టినను బ్రాహ్మణులకు – మును సచేలస్నానములు సేయవలయు
నని చెప్పఁగాక యీ యధమవంశజుల – కును ద్విజులను ముట్టఁజన దని కలదె
యేనీతి యేధర్మ మేపురాణోక్తి – యేనాఁటిభక్తి సహింపఁగఁదగునె
మగువ నచ్చోటన మాయించు టపుడు – దగవుగా దని కాక దండింపలేఁడె
భూమిఁబుట్టనిమార్గములు సేయఁదగునె – యే మెదురెదుర మి మ్మేమందుమింక'
ననవుడుఁగల్లి దేవయ్య యింకేల – ననుమాన మనుచు నిట్లనియె వారలకు
'నింటిదాసులకు నెట్లంటనౌ భక్తు – లింటికుక్కలకు మి మ్మంట [6]రా దనిన
బ్రాహ్మణులేమీరు? "**బ్రహ్మచరంతి – బ్రాహ్మణా**" యన మీకు బ్రాహ్మ్యమెక్కడిది
పొన లేటికిఁబరబ్రహ్మం బనంగ – దీనికి నర్థంబుఁదెలుపుఁడా చాలుఁ
బరమేశ్వరుండన్నఁబరమాత్ముఁడన్నఁ – బరికింపఁగాఁబరబ్రహ్మం [7]బటన్న
హరుఁడె కా కొరులకుఁబరశబ్ద మెద్ది – పరశబ్ద ముత్కర్ష పరము గావునను
నొరులకుఁగల్గునే యుత్కర్షపదము – హరియును బ్రహ్మయుఁబరమాత్ము లెట్టు
లరయంగ వేదశాస్త్రార్థంబులందు – హరిముఖ్యు లెల్ల జీవాత్ముల కాన
ధరణిఁబరబ్రహ్మ హరుఁడు బ్రహ్మంబు – చరియించువారు మా సద్భక్తవరులు
హరియును బ్రహ్మయు నమరవల్లభుఁడు – పరము నర్చనసేయుభక్తులు గారె
ధృతిని"**బ్రహ్మాధిపతి ర్బ్రహ్మణోఽధి – పతి**" యనియెడుఁగాదె శ్రుతిసమూహంబు
కావున బ్రహ్మమార్గం బెద్ది మిమ్ము – భావింప ముట్ట సంభాషింపఁదగునె
యేతెఱంగునఁబాసె నెఱుఁగరే మీరు – జాతిశూద్రత్వంబు వ్రేతవిముక్తి
రుద్రేతరక్రియల్ రూపింపఁ[8]గలవొ – రుద్రుండు దక్కంగ శ్రుతికర్త గలఁడొ
మృడునిభక్తులతోడ మీ రెల్ల సరియె – నుడువులు గలవేని నో రెత్తుఁ' డనిన

1. దేవ(వు)నివారు 2. జంది 3. నంది 4. యొజ్జ 5. గాదె 6. ఁగా 7. బునన్న 8. గలరో.

'నక్కటా యిదియేల యందర[1]మమ్ముఁ – గుక్కలకంటెను దక్కువగాఁగఁ
బలికెదు మీపిన్న పాపచెయ్దంబు – కొలఁదియే మొదలికి గుద్దలిగొంటి
ముదలింప ముదలింప ముల్లు(లుపు?) చ్చి పెద్ద – పద రడ్చినట్లయ్యె నది సెప్పనేల
చదివింతుగాక మీ శ్వానంబు నొక్క – పదఖండవర్గంబు వనన యెం దైన'
నని విప్రు లందఱు నాగ్రహింపంగ – విని **కల్లిదేవయ్య** విప్రులఁజూచి
యనియె 'రోఁకటి పాట లట్ల వేదములు – [2]పనుగొన మా శివభక్తులయిండ్ల
సారమేయములకు ధారుణి' ననుచు – నారంగఁ**గల్లిదేవయ్య** నవ్వుచును
దాఁబిల్చె వేదపితామహాఖ్యుండు – నాఁ బొల్చుశునకంబు నలిఁజిట్ట [3]మిడిచి
'యుచ్చుచ్చి రే శంకరోచ్ఛిష్టభోగి – యుచ్చుచ్చిరే ప్రణవోదాత్తయోగి
యుచ్చుచ్చి రేయాగమో త్కృష్టభోగి – యుచ్చుచ్చిరే మహాంహోదూరచరిత
యుచ్చుచ్చిరే వీరసచ్చరనిరత – యు(చ్చు)చ్చి రేయపునర్భవోన్నతస్థిరత'
యని యిటులెలుఁగించునమ్మాత్రలోనఁ – జనుదెంచిశునకంబు దనకు మ్రొక్కుడును
వరదయాంచితసుధావార్ధి నోలార్చి – యరుదొందఁ**గల్లిదేవయ్య** యిట్లనియె
'నేవేదమం దైన నెత్తి యందొక్క – తా వనుష్ఠింపుమా యీ విప్రులెదుర'
ననవుడు శునకచర్మావృతరుద్రుఁ – డనుషక్తిఁ బద్మాసనాసీనుఁడగుచుఁ
గఱకంఠు నాత్మాబ్జకర్ణికఁజేర్చి – గుఱి నాదిశక్తి నాకుంచనఁగూర్చి
యాసూర్యు మెట్టి సుధాసూతిఁగట్టి – నాసాగ్రమునదృష్టి నలి నాఁటుకొలిపి
యకలంక మృదుమధురకళానియుక్తి – సుకరనాదోక్తి విశుద్ధస్వరమునఁ
ద్ర్యక్షరబిందు నాద ప్రయుక్తాంచి – తాక్షర మోంకారమట్లుచ్చరించి
నంతలోననె తద్ధరామరానీక – మంతంతధరణి సాష్టాంగంబు లిడఁగ
దయనుదాత్తానుదాత్తస్వరిత ప్ర – చయములు సాంగమై సంధిల్లి తనరఁ
బదమును గ్రమమును [4]బాటయు జటయు –విదితంబుగా నాల్గు వేదంబు లందు
నొక్కొక్కఠావెత్తి యొగి ననుష్ఠింపఁ – గ్రక్కునఁదాలేచి **కల్లిదేవయ్య**
**"హోమానువేదపితామహా"** యనుచుఁ – దామాన్చెశునకమధ్యయనంబుసేఁత
వింటిరే చెవులార విప్రు లందఱును – గంటి రే భక్తుల ఘనమహత్త్వంబు
ననుచు నా **కల్లిదేవయ్య** వేదంబు – జను లెఱుంగఁగఁగుక్కఁజదివించె మఱియు
నఘవైరి **సిద్ధరామయ్య**గారింట – **సుఘెకాళి**కాఁడన నొక గుక్క గలదు

1. ఁదమ్ము 2. పనుగొను 3. లిడుచు 4. పాది, పాడి.



దీనికి గురు వది దానిమహత్త్వ – మేనైన నొకనాఁటి కెఱుఁగ వెండియును
గారవింపఁగ **మహా[1]కాళయ్య**గారి – సారమేయంబును **జంబూరి**లోన
వాదంబునం దిట్లు వేదంబు సదివెఁ – గాదె యీ మర్త్యలోకం బెల్ల నెఱుఁగఁ
గాన విప్రులు భక్తగణములయిండ్ల – శ్వానంబులకు నెట్లు సరి యనవచ్చు
**శివచిత్తు**ఁడన నొక్క శివభక్తిపరుఁడు – తవిలి విప్రులతోడి తర్కంబునందు
సకలవేద పురాణశాస్త్రపారీణు – లొకకోటివిప్రులు నొక్కభక్తునకు
సరియుఁగా రని వేదశాస్త్రంబులందు – విరచించి [2]చెప్పుడు ద్విజులంతఁబోక
చర్చలు సదువులు సమ్మతికలిమిఁ – గూర్చి యాడుట శబ్దకోవిదత్వంబు
కాన, యిన్నియు నేలకలదె ప్రత్యయము – దీని కింతయుఁజెప్పఁగా నేమి యనిన
విద్దెలాడుచుచున్న ద్విజులతో నొక్క – పెద్దభక్తునిచెప్పువెట్టి తూఁచుడును
నూరిభూసురు లెల్ల నొక్కటఁదూన్కి – రారైరి యాపాదరక్షకుఁదొల్లి
కాన విప్రులు భక్తగణములచెప్పు – తో నైన నెనగారు వాన లేమిటికి

## బిబ్బ బాచయ్యగారి కథ

**గొబ్బూరి**లోపల నిబ్బరంబుగను – **బిబ్బ బాచయ**గారి పృథుమహత్త్వంబు
వర్ణింప శివునకు వశముగా దనిన – వర్ణింప నెంతటివాఁడ నట్లయ్యు
[3]నీ మాజనము వారిచే మున్నువడ్డ – బాములు సెప్పెద భూమీశ వినుము
జంగమలింగప్రసాదంబు దనకు – నంగంబుఁబ్రాణంబునై చరింపుచును
నగ్రహారంబులో నం దొక్కపాల – నగ్రగణ్యుఁడు నాఁగ నాశ్రమధర్మ
మతలోకపథవివర్జితుఁడౌచు వేద – మతభక్తిపథము సుస్థితిగా భజించి
యామట రెండు మూఁడామటఁబదిటఁ – గామించి ఘనదేవకార్యంబు లైనఁ
గర మర్థి బాహుకంధరకర్ణవితతి – నురమున శిరమున నుపవీతముగ4ను
జెన్నొంద భక్తుల చెప్పులబిళ్ల – లున్నతి ధరియించి యొగి భస్మ మలఁది
బండియుఁబొణకయుఁబచ్చెనవెట్టి – బండి నెల్లెడ నందిపడగలు గట్టి
యెలమి దలిర్ప మువ్వలు నురుగజ్జి – యలు ఘంటలును నందియలు సామరములు
భాసురరుద్రాక్షబహువలయములు – బాసికంబులు స్వర్ణపట్టము ల్వ్యాన్చి
గోరాజమూర్తిఁగైకొన్న కుఱ్ఱలను – గారవంబున బండి గట్టి ముందటను
జాఁగు బళా యను శబ్దముల్ మ్రోయఁ – గాఁ గేళికలతోడఁగర మర్థి నేఁగి
శరణపదాంభోజ సంస్పర్శఫాల – సురుచిరభక్తిమై సొంపు నింపార

1. కాళవ్వ 2. చెపుడుదద్విజు 3. భూమీసురులు 4. న

స్ఫుటచరణాబ్జ సంఘట రేణుపటల – ఘటితోత్తమాంగుఁడై ఘనహర్ష మలర
లీలఁదత్పాదసలిల సుధావార్ధి – కేళీవిలోలైక మేళనం బొలయ
ఘనతర దివ్యలింగ ప్రసాద సద – య **నమోనమస్తే మహాలింగ** యనుచు
శ్రీగురుప్రతిబింబ సిద్ధలింగోప – భోగోపభోగానురాగుఁడై మఱియు
నొలికిన డించిన యున్న ప్రసాద – మలరుచు ముంచి గంపల బండిఁబోసి
యప్రతిలీల గణప్రసాదంబు – సుప్రసన్నాత్మ నుత్సుకత దుల్కాడ
నెప్పటివినుకులు నెప్పటిచెన్ను – నొప్పారఁదెచ్చి **గొబ్బూరి**లోపలను
సుప్రసిద్ధముగఁ దా రాప్రసాదంబు – ముప్పొద్దుఁగుడువంగ విప్రవర్గంబు
బుడిబుళ్లువోవుచున్నెడఁనొక్కభక్తుఁ – డదరఁబండువుసేయ నయ్యూరిలోనఁ
బరితోషమతి **బిబ్బబాచయ్య**గారు – కరమర్థిఁదొల్లిటిక్రమమున నేఁగి
జంగమశ్రీపాద జలజసౌరభ్య – సంగతరుచిరోత్తమాంగుఁడై పొంగి
యలరుచుఁజెందుచు వలసినవన్ను – వలఁబ్రసాదామృత వనధి నోలాడి
నలి దీటుకొనఁదద్గణప్రసాదంబు – నిలఁజిల్కకుండ గంపల ముంచి పోసి
ముందటిక్రియ బండిముందట వెనుక – నందంబుగా నిట యట నటింపంగ
గొ[1]డగులు గొడగులు గూడి క్రిక్కిఱియఁ – బడగలుఁబడగలు ముడివడి వాల
మంగళారవములు మధురమై చెలఁగ – సంగీతరీతులు సరసమై యులియఁ
బాయక చాఁగు బళాయనురవము – ఘే యని యటుగూడి మ్రోయుచునుండ
బొబ్బలు వొడువంగ నుబ్బి యార్వంగ – **బిబ్బబాచయ**గారు **గొబ్బూరు**సొరఁగ
వినఁబడె మున్నెల్ల వీరిదుర్జనత – కనుఁగొనఁబడియె నేఁడనుచు భూసురులు
నేతెంచి “హో నిలుఁడెందువచ్చెదరు – మీ తెఱం గిదియేమి మిగిలియున్నదియు
పెండ్లి [2]కేఁగుటొ యిట్లు బండ్లిదియేమి – దండ్లువచ్చెనొ మీఁదఁదల్లడంబేల
యంకాన కేఁగెద రార్పు బొబ్బలను – శంకరభక్తుండు నచ్చెనో యిట్లు
పోలంగఁగొంగనిఁబొడిచి వంగనిని – వ్రాలంగఁ దిగచితి రేల బింకంబు
సడగరంబులు వట్టిచాఁగుబళాలు – గొడుగులుఁబడగలు దడఁబడుటలును
జేరమవలె నొండె శివపురంబునకు – బోరన నిపుడేమి పోవుచున్నారొ
యక్కుమాలిన భంగి నగ్రహారంబు – చక్కన మీకెట్లు చనఁజేర వచ్చు

1. డు 2. కేఁగెదరేమి, కేఁగెదరిట్లు



నిలఁగులభ్రష్టులయిండ్ల యెంగిళ్లు – గులహీనులెంగిళ్లుఁగూడంగఁదేవి
బండినిండగఁబోసి పైఁజీరగప్పి – తండుఁజేకొని పెద్దగొండసేసెదరు
ప్రకటింప నింతేల పట్టినఁ జూప – నొకవిశేషంబైన నున్నదే యిందు
విద్దె లాడక యూరు వెడలుఁడీ యింత – వెద్దఱికముతోన పెక్కులే లనిన
చా! కాఱు లేమని చదువుచున్నారు! – మీ కొలఁదియె మమ్ము మీఱి పల్కంగఁ
బన్నగధరుభక్తిపరులకు మీకు – నెన్ని చాళులపెట్టు లెన్ని చూడంగఁ
దలఁప మీ నోరికిఁదగుకడిఁ గొనరు – వెలి కుఱుకవెగ్రుడ్లు కొలఁదిమీఱినను
మీ రేడ మే మేడ మీకును మాకుఁ – గారణంబేమి యీ యూరేల మాకు
జంగమలింగప్రసాదంబు బ్రమసి – యెంగి లెంగిలి యంచుఁద్రుంగి చూచెదరు
శరణప్రసాదదూషకు లతిఘోర – నరకాగ్నిఁ బడుదురు నా మున్ను వినరె
యటమీఁదిచే టింక నదియేల చెప్ప – నిట వచ్చు మరణంబు నెఱుఁగరు మీరు
ప్రణుత ప్రసాదప్రభావ ప్రశక్తి – గణుతించి చూడ దగ్గఱఁగ మీవశమె
భక్తులపాలికిఁబరమామృతంబు – భక్తిహీనుల కిది ప్రళయానలంబు
వలదు కార్చిచ్చులోపలి మిడ్తలట్లు – పొలిసిపోవనెకాక నిలువఁగఁగలరె
మీఱిపల్కుటయెల్ల మీకుండెఁగాక – పాఱులఁజంపుట పరమశౌర్యంబె
యనవుడు **బిబ్బ బాచయ్య**గారలను – గనుఁగొని యవ్విప్రజను లాగ్రహించి
యెంగిలికూడు భుజంగమో పులియొ – శృంగియో యబ్బూచిగొంగఁజేసెదరు
బట్టులపిన్న యప్పనగారిమంచ – చట్టనపెద్ది విశస్తులకూచి
దుష్టదామోదర ధూర్తభాస్కరుఁడ – శిష్టులబలభద్ర చిమ్మికేతప్ప
తొలఁగు మాఱటదోవతుల దర్భసంబె – లలఁబెట్టి యష్టికోలలు గొనిరండు
పట్టుఁడా యెడ్లను బలుపులు దెగఁగఁ – గొట్టుఁడా చని కూడముట్టుఁ డింకేల
చింపుఁడు మొగవాడ ద్రెంపుఁడు వడగ – లుంపుఁడు బండివోకుండఁజూతండు
అని సందడించునయ్యధమ[1] పొరులను – గని **బిబ్బ బాచయ్య**గారు గోపించి
యోడులా రేటికి నుత్తలపడఁగఁ – జూడ శక్యంబేనిఁజూతురుగాక
తొలతొలఁడనుచు విప్రుల నదల్చుచును – నలిఁబ్రసాదముమీఁదివలువఁబోనూకి
యంజలి ముంచెత్తునమ్మాత్రలోన – కెంజాయయో యెఱ్ఱసంజయో మెఱపొ
హా కాదు నిప్పులో యది మంట యనుచు – నాకులతను విప్రు లతిభీతిఁబొంద

1. పాఱులను.

నదె చూడుఁడని చల్లునమ్మాత్రలోన – పొదలి భుగుల్భుగుల్భుగులన నెగసి
నిటలతటాంబకోత్కట చటులాగ్ని – పటుదృష్టిఁబురము లొక్కటఁగాలునట్లు
నట యిట విప్రాలయంబులన్నియును – నటుగూడ దరికొని యాహుతుల్గొనఁగ
**శ్రీధరభట్టిల్లు** సిచ్చునఁగలసె – **మాధవప్పనయిల్లు** మంటపా లయ్యె
**గ్రుడ్డిగోవిందుని** గుడిసెయుఁగమరె – **దొడ్డభాస్కరునిల్లు** దొడిఁదొడిఁగాలె
**కొమ్మనఘటశాసి** కొంపయుఁ గమలె – **బమ్మనభట్టిల్లు** భగ్గన మండె
**వామనప్పనయిల్లు** వాసము ల్సిక్కె – **సోమయాజులయిల్లు** సురసురఁగమరె
**త్రేదులవారిల్లు** దెరువునఁగలసె – **నాదిత్యకూచియి** ల్లప్పుడ పొలిసె
**మచ్చతాడనయిల్లు** మంటిపాలయ్యె – **బచ్చలికేశవుపాకయు** మడిసె
**వాసుదేవునియిల్లు** వహ్నిసేకొనియె – **మాసకొమ్మనయిల్లు** మసిమసియయ్యె
వసిగొని **సన్న్యాసివామనమఠము** – వసదిమంటపమును బసుమానఁగలసెఁ
**గుశదర్భపిన్నయ్య**కొంప పైఁజిచ్చు – **నశనంబువారియి** ల్లది యందికొనియె
నీడాడ యననేల యిన్నియు మడిసెఁ – గూడఁగ శివదూషకుల యిండు లనుచుఁ
బ్రళయాగ్నిలోనార్చు ప్రమథులయట్టు – లలరి భక్తానీక మార్వఁగ ద్విజులు
మసలి యిండులతోన మడిసెడువారు – వెసనేఁగుదెంచుచు [1] వెండీల్గువారు
తలలం[2]టుకొని కాలఁదల్లడపడుచు – నిల గుళ్లలోపలి కేఁగెడువారు
గడ్డము లీసలు గమరంగ నచటి – గడ్డిగబావులు గని యుర్కువారు
చీరలు దరికొనఁజిడిముడిపడుచు – మారారిభక్తుల మఱువుగొన్వారు
మించఁగాలకమున్న మృడుభక్తులిండ్లఁ – బంచలఁ బెరదులఁబొంచుండువారు
తనువుల శిఖి దరికొని కాలఁగాలఁ – జని చని భక్తుల శరణనువారు
పఱుపకమును బిబ్బ బాచయ్యగారి – పిఱుఁదన నిల్చి యుబ్బఱి మ్రొక్కువారు
చిచ్చునవెడవెడ వెచ్చుచు సగము – సచ్చియు నిబ్బంగి సగము సావకయుఁ
**బప్పుకేశవభట్టు దొప్పనపెద్ది – తప్పకం టైతన బొప్పనత్రేది**
**సింగరా జాదెన చిప్పనకూచి – మంగన ఘుడిసాసి నంగన్నపిన్న**
**దబ్బరాదిత్యుండు సబ్బనయ్యయును – గబ్బుమైలారుండు సుబ్బనమంచి**
**యడ్డగాలైతన దొడ్డనకూచి – బొడ్డు రాఘవభట్టు గడ్డముపెద్ది**
**వీరాదిగాఁగ గొబ్బూరిగ్రామణులు** – మారారిభక్తుల మాకు దిక్కనుచుఁ

1. వేనీల్గు 2. దుకొనికాల్వ.



బశువుల మనుచు నబ్రహ్మణ్యమనుచు – దిశలకు నోళులు దెఱచి యేడ్చుచును
వెక్కుచు నంతంతఁజిక్కుచుఁగూడ – స్రుక్కుచు ధరఁజాఁగి మ్రొక్కుచుఁజేరి
దీనుల నపగతజ్ఞానుల దురభి – మానులఁబుణ్యవిహీనుల ఖలుల
భ్రష్టుల నవగుణాశ్లిష్టుల నధిక – దుష్టుల నిలఁగడుఁగష్టుల జడులఁ
గ్రోధుల నధికాపరాధుల నతివి – రోధుల జ్వలననిరోధుల మమ్ముఁ
గావరే దీవనఁబ్రోవరే తప్పు – [1]ద్రావరే చలిగాలఁద్రోవరే యింక
నూరు మున్ జనమేజయుఁడు [2]సేసె నగ్ర – హార మింతటనుండి మీ రుద్ధరించి
పొరిని బునర్ధారఁబోయరే [3]మాకుఁ – గరుణించి మీ [4]బ్రహ్మపురుల మే మనుచు
నా విప్రజనులు సాష్టాంగులై మ్రొక్కి – లేవకయున్న నాలించి లెండనుచు
నా ప్రసాదమునకు నంజలియొగ్గి – సుప్రసన్నాత్ముడై చూడఁగఁదడవ
గహనప్రసాదాగ్ని గ్రక్కున నాఱి – సహజ సంసిద్ధ ప్రసాదభావమునఁ
బ్రస్తుతింపఁగ **బిబ్బ బాచయ్య**గారి – హస్తంబులందుఁబ్రశస్తమై నిలిచె
నిప్పాటఁబాఁపల యిండు లన్నియును – నెప్పటిక్రియ నొప్పె నెఱుఁగ రే జనులు
యెన్నఁగ ధరణీశ యేండ్లుఁబూండ్లేల– మొన్నటివార్త యింకిన్నియు నేల
యసమాక్షుఁగొలువని యగ్రజుండైన – వసుధమాలలమాల వాఁడ కాకెట్లు
మాలఁడు శివుఁగొల్చి మాలఁడువెంపు – మాలఁడు రెంటికి మాలఁడీయుక్తి
మాలఁడే యీతని మాలఁ డన్ త్రాటి – మాలల భువిఁబచ్చి[5]మాలలు గాక
సెంబలియనియెనే చెన్నయ్యయింట – నంబకళముగ్రోలునప్పుడు శివుఁడు
మాదరచెన్నయ్య [6]మహిమయెఱింగి – మా దేవభక్తులు మాలలు నాఁగఁ
గూడునే బాఁపనకూళ[7]రువులకుఁ – గాడుగాఁడని నీచగతి విరోధింప.

## మాదర దూడయ్యగారి కథ

నవనీశ వినవెట్లు శివునిభక్తుండు – ధ్రువకీర్తి **మాదరదూడయ్య** నాఁగ
మఱియొప్పు నా యయ్య మహిమ యెట్లనిన – నెఱయఁగ మెయిచెడ్డకఱకుఁబాఱుండు
[8]పసివెన్క నడురేయి వెసఁబోయిపోయి – మసలకదూడయ్య మందిరంబఱుత
సారమజ్జన జలపూరితపంక – మూరులు దరియంగ నొగిఁజొచ్చి వెడలి
కూడఁగాళ్లు గడిగికొని ప్రభాతమునఁ – జూడఁబూర్వచ్ఛాయ శోభిల్లియున్న

1. గ్రోవరే 2. విడ్చె, విడిచి. 3. తమకు 4. ధర్మ 5. మా(లులు)లరు 6. మెర్గియెర్గి 7. అపు, పుర్వు 8. పసియేఁగవెనుకను

నా విప్రుఁడత్యద్భుతాక్రాంతుఁడగుచు – భావించి యప్పుడ పరు విడి యేఁగి
**మాదర దూడయ్య** మజ్జనోదకని – పాదితం బగుఁజొంపిఁబడి పొర్లిపొర్లి
యాడుచుఁదనువు దివ్యాంగమై యున్న – నాడనా **మాదర దూడయ్య**గారి
పాదాబ్జములమీఁదఁబడి కృపవడసి – భూదేవకులుఁడంతఁబోయె నింటికిని
జూడుఁడా **మాదర దూడయ్య** యిట్టు – లాడినచోటినీ ళ్లప్పయగారు
[1]పడిలేచి ఁజొంపిఁదాఁగడిగిన యంత – నడఁగెఁగుష్ఠవ్యాధి హరహరా తొల్లి
యాదిత్యుఁడును మనోహరుఁడనుగణము – పాదోదకములను బడసెఁ దా మేను
ననిచెప్ప వినబఁడు నాద్యోక్తులందుఁ – గనుఁగొంటిమిపుడు నిక్కంబుగా ననుచు
వినుతింపుచును నరుల్ విభ్రాంతిఁబొంద – విని వారివారికిఁజనుదెంచి యచటఁ
బొరల నేడ్నూర్వురు భూసురోత్తముల – కరయఁగుష్ఠవ్యాధులణఁగుట వినవె.

## బానస భీమయ్యగారి కథ

పృథివిలో **బానస భీమయ్య** నాఁగఁ – బ్రథితుండు మెయిసెడ్డ పాఱులకెల్ల
మేనులు కృప[2]సేయుటేనాఁట వినవె – భూనాథ! జనులెల్లఁబొగడఁగమఱియుఁ
జక్కన ముచ్చట్లు జరపఁగనేల – యిక్కర్మచండాలు రెంతటివారు

## శ్వపచయ్యగారి కథ

సామవేదులు నాఁగఁసద్బ్రాహ్మణుండు – శ్రీమతి నాకాశగామియై యరుగ
**శ్వపచయ్య** నాఁగ నీశ్వరభక్తుఁడొకఁడు – విపినాంతరమున సద్విధి నోగిరంబు
లొనరించుచును మీఁదఁ**జనుసామవేదిఁ** – గని పొందునో వీని కర్మంపుదృష్టు
లనుచు నోగిరముఁ జెప్పున మూయఁదడవ – కని **సామవేదులు** కలకల నగుచు
శ్వపచుండుఁదాను మాంసంబు వండెడిని – కపటుండు మా పొడగని మూసెఁజెప్పు
ఇట్టి దుర్జనుఁడగునే యని తలఁపఁ – జట్టనఁదన్మంత్రశక్తి యణంగి
యంతరిక్షంబున నాడు దోవతులు – నంత నబ్బువిఁబడ్డ నతఁడప్డు వచ్చి
**శ్వపచయ్య**గారి శ్రీచరణాబ్జములకు – నపరిమిత ప్రీతి నందంద మ్రొక్కి
శివదీక్ష వారిచే శిష్యుఁడై పడసి – సవిశేషమగు తత్ప్రసాదంబు మహిమఁ
జేసి కొంపోవఁడే శివలోకమునకు – నాసక్తి ముప్పదియా ఱూళ్ల వారిఁ
గాన పురాతనగణములనాఁడు – లేనిమార్గము పుట్టెనే నేఁడు భక్తి

1. పడియులేచిన ఁజొంపిగడిగికొన్నంత 2. సేయుటేనియు.



శ్వపచుఁడైననులింగసహితుఁడైయున్న – నుపమింపసద్బ్రాహ్మణోత్తమోత్తముఁడు
త్రిపురారిఁగొల్వని ద్విజముఖ్యుఁడైన – శ్వపచాధములకంటెఁజాలంగఁగీడు

## ఉద్భటుని కథ

[1]అదిగాక బల్లకియను పురంబునను – **నుదుబటుఁ**డన నొప్పు నొక్క భక్తుండు
**వరభోజరాజను** నరనాయకునకు – గురువయి శివదీక్షఁగరుణించి మఱియు
వేదశాస్త్రార్థ సంపాదితయుక్తి – నా దేశమున నన్యవాదంబు లణఁచి
క్షోణీశునకుఁబాడు **జొమ్మవ్వ**నాఁగఁ – [2]బ్రాణేశసద్భక్తి పరురాలుగాన
నతివయుఁదాను సమంచితభక్తి – గతినిరంతర సుఖస్థితిఁదేలుచుండ
మనుజు లత్యద్భుత మానసులగుచుఁ – బనువుచు నిట్టి సద్బ్రాహ్మణోత్తముఁడు
కులహీనులను దాను గూడియున్నాఁడు – తలఁపంగఁబెద్దలు దార యిబ్భువిని
ననుచు **నబ్భోజరాజున** కెఱిఁగింప – వినియుఁదొల్లిటియట్ల కొనియాడుచుండఁ
బరమేశ్వరుండు **నుద్భట్టయ్య**గారి – వరభక్తి మహిమ యివ్వసుమతిలోన
నరుదుగా మెఱయింతునని యమ్మహాత్ముఁ – గరమర్థితోఁదన్న కాఁగూర్చుకొనుడు
దహనక్రియలుసేయఁదత్సమీపమున – మహి నెదురేచూచు మట్టిభూతములు
ఎ[3]గిదియొక్కటి సాల కేణ్నూరు నచటి – పొగదాఁకి కైలాసమున కప్డు వోవ
నందొక్క భూత మాహారార్థమేఁగి – వందుచు మఱుపూఁట వచ్చి భూతములఁ
గానక యేడ్చుచుఁగటకటాయనుచు – మానక వాచర్వమహి యెల్ల నద్రువ
గూయిడ నిది యేమొకో యంచు జనని – కాయంబు భోజుండు గ్రక్కున వచ్చి
యెవ్వ రేడ్చినవార లేమికారణము – నెవ్విధంబునఁగాని యేడ్పుడుగ వన
"వినవయ్య పండ్రెండు వేలేండ్లనుండి – మనుజేశ **యుద్భటు** మరణంబుఁగోరి
యేడునూ[4]ఱీమట్టి నెలమి భూతములు – నేడకు నేఁగక యెదురు సూచుచును
నుండె నే నేఁగితి నుదరాగ్నిఁజేసి – యుండంగఁజాల కొక్కండ చిక్కితిని
పెనుపొందఁగాఁగూటిపేద దోడ్డప్పె – నని యాడుమాట నాయంద సంధిల్లె
నెలమి నొక్కటిసాలకేడ్నూఱుభూత – ములు**నుద్భటుని**ఁగాల్చు పొగ దాఁకఁదడ
కైలాసమున కేఁగ గతిచెడి తాన – భూలోకమునఁజిక్కి పొగిలెదఁదండ్రి
గ్రచ్చుఱ నీనంగఁగాచి నక్కలకు – నిచ్చినయ ట్లయ్యె నీడితకీర్తి.

1. అద్భుతంబుగబల్లకనుపట్టణమున నుద్భటుం 2. బాణిస 3. గసి, గిరి 4. నూర్భూతములీ మట్టినెలమి.

మఱియేలవేయును నెఱయఁబండించి – యఱప డిగ్గినయట్టు లయ్యెనుర్వీశ
మును వెల్లవేగియుఁదినికి చా బిడ్డఁ – గనిన చందంబయ్యె జనపాలతిలక!
తివిరినిండఁగముంచి [1]యవియఁగఁద్రోచు – నవివేకి నైతిఁబేరాసగాఁజేసి
యింతగాలంబుంట యిది వృథయయ్యెఁ – జింతింపకెట్లు ధరింతు భూనాథ
యింక నైనను గట్టెలిందువైపించు – బొంకు [2]గాదేఁ గెదఁ, బొగదాఁకఁదడవ
వినుము నేఁగైలాసమునకు నేఁగుటకు – జనులకు నెల్ల దృష్టముగ నీయున్న
వటము వేళులతోన వడిఁబెఱికికొని – యిటయందఱునుజూడనటయేఁగుదాన
ననవుడుఁబౌరులత్యద్భుతంబంద – జననాథుఁ డౌఁగాక యనుచు హర్షించి
గ్రక్కున మలయజకాష్ఠము ల్వేర్చి – యక్కజంబంద దివ్యాంబరావలులు
పేని ముప్పిరిగొల్పి పేరిన నేతి – లో నించి యాయగ్నిలో దరికొల్ప
భుగులుభుగుల్లనఁబొగ మఱ్ఱిమీఁది – కెగయులోనన దిగదిగఁ బఱతెంచి
భోజుఁడుఁదనమిత్రపుత్ర బాంధవులు – నాజనావళియును సమ్మఱ్ఱిఁవ్రాఁక
భూతంబుపైఁబొగ వొలయంగఁదడవ – ఖ్యాతిగా మఱ్ఱివృక్షముఁగూడఁబెఱికి
కొనుచు నక్కైలాసమున కేఁగె భోజ – జననాథజనయూథ సహితంబుగాఁగఁ
దెల్లమీ యుద్భటదేవుని మహిమ – ముల్లోకముల ధరావల్లభ వినవె

**కక్కయ్య కథ**

నిక్కంబు వెండియు నిఖిలేశ్వరుండ – ముక్కంటిగణము దాఁ**గక్కయ్య**నాఁగ
నీ ద్విజులకు వైరి యెఱుఁగవే యొక్క – విద్వాంసుఁడీనగరద్వారమందుఁ
బాటియైన పురాణభట్టును బోలెఁ – గాటెర్కులెల్ల నక్కజమందివినఁగఁ
బరగఁగ బ్రహ్మకపాలంబు వట్టి – హరుఁడు భిక్షించె మున్ననియెడిఁగాని
వఱలుశూలమున విష్వక్సేనుఁబొడిచి – మఱివిష్ణునడిచిన తెఱఁగు సెప్పండు
వెరవున బలిఁగట్టి వెండియుఁబెఱిగి – హరిమీఁదికెత్తెఁగా లనియెడిఁగాని
యట్టి త్రివిక్రము నెట్టెమ్ము విఱిచి – పట్టె నీశ్వరుఁడని ప్రతిభసెప్పండు
వ్యాసుండు చేయెత్తె ననియెడిఁగాని – వ్యాసుని చేయి నిహతమైన దనఁడు
హరుఁడు యజ్ఞములోన నలిగి కేశవుని – శిరము ద్రుంచినచోటు సెప్పెండు సదివి
నరసింహరూపమై హరి హిరణ్యాక్షు – హరియించె మున్ను దా ననియెడిఁగాని
శరభ రూపముదాల్చి నరసింహుఁ ద్రుంచి – హరుఁడు దిత్తొల్చిన[3]యది సదువండు

1.యవయగ 2. నాకే 3. యచటుసద్వండు.



మసలి “**సర్వం విష్ణుమయ**” మనుచోటు – నెసఁగఁజెప్పెఁడుగాని యసమలోచనుఁడు
నరుదగు సర్వసంహారంబుసేయ – హరియు సర్వము ద్రుంగెనని చదువండు
హరికర్త జగముల కనియెడిఁగాని – హరికిని భర్త యీశ్వరుఁడని యనఁడు
హరి విశ్వనామాంకుఁడనియెడిఁగాని – హరుఁడు విశ్వేశ్వరుఁడని చదువండు
హరి వరాశక్తి దా ననియెడిఁగాని – హరుఁడు వరాపరుఁడని చదువండు
హరి మహామాయ దాననియెడిఁగాని – హరుఁడు మహాదేవుఁడని చదువండు
హరిహరుఁడనెడు శబ్దార్థ మెర్గమిని – హరిహరుఁడన నొక్కఁడనియెడిఁగాని
హరిని హరించుట యదిగారణముగ – హరిహరుఁడును మారహరుఁడు ననండు
పక్షపాతి పురాణభట్టు యథార్థ – మీక్షింపఁడఱచెడు నితరేతరముల
శివనిందచేసెడి యవినీతుఁజంప – నవుఁబుస్తకము గాల్ప నవుఁబథం బిదియ
యనుచు మా కక్కయ్య యా శివద్రోహిఁ – బొనరుచు నలిగి[1] డొంకెనఁబడఁబొడిచి
తలదర్గి పొట్టలోపల [2]బెట్టికట్టి – యలరుచు నున్నెడ నక్షణంబునన
వ్రక్కలైచూడఁబౌరాణికుమేను – విక్కన విరియుచు విలవిల యనుచు
బ్రువ్వులప్రోఁకయై రూపఱియున్న – నివ్విప్రు లెఱుఁగరే యిన్నియునేల
డోహరకక్కయ్య మాహాత్మ్యమెఱిఁగి – యూహింప భక్తుల నొం డనఁజనునె

**భోగయ్యగారి కథ**

మఱియుఁ గెంబాగిలో మహిఁజెప్పనొప్పు – కఱకంఠభక్తుఁడకల్మషకీర్తి
**భోగయ్య**నాఁగ నెప్పుడుఁబరమాను – రాగుఁడై జంగమార్చన సేయఁజేయఁ
గఱకంఠుఁడాయయ్య మెఱయింపఁదలఁచి – పెఱవానిక్రియనొక్క వెయ్యశవంబు
మోచికొనుచు రుద్రముద్రాసమేతుఁ – డై చూప అద్భుతం బంద నేతేరఁ
బొడగని సర్వాంగములుఁ బొందమ్రొక్కి – మెడనున్న పెయ్యఁ దామెడఁబెట్టుకొనుచు
దొడుకొనివచ్చి యుత్సుకలీలతోడ – నడుగులుగడుగ నామృడమూర్తి యనియెఁ
జచ్చిన పెయ్యమాంసము నారగింప – నిచ్చ నేమముగాఁగ నిన్న నేఁబోయి
ధీయుత వినవయ్య **దేడరదాసిఁ** – బేయఁబాకము సేసిపెట్టవే యనిన
నడిగి వచ్చెద **దుగ్గళవ్వ**ఁదా ననుచు – నెడసేసె నాఁకొంటి నింక నీవైనఁ
బెట్టవే వండించి పెయ్య నా కనిన – నట్టిదకా కంచు నపుడు **భోగయ్య**

1. బొడ్చితిగిచి 2. కుట్టి.

క్షారామ్లలవణయుక్తముగ మాంసంబు – సారంబుగా వండి చయ్యన మఱియు
శాకము ల్గావించి సంధిల్లఁబెక్కు – వాకంబు లొడఁగూర్చి భద్రమూర్తికిని
ఆరగింపఁగఁబెట్టునంత నయ్యగ్ర – హారంబు భూసురు లందఱుఁగూడి
గుండులు బడియలు గొని పాఱిపాఱి – యొండొరుఁగడవంగనుద్వృత్తి నరిగి
నఱకుఁడుతలతల్పు లుఱుకుఁడు గుడిసెఁ – బెఱుకుఁడు **భోగయ్యఁ**బఱవుఁడు వెదకి
పట్టుఁడు దల వచ్చిబడియలఁబగులఁ – గొట్టుఁడు మాదిఁగకొయ్యఁబోనీక
నగ్రహారంబు గాదయ్యె నిట్లనుచు – నాగ్రహంబున విప్రులందఱుఁబలుక
హరమూర్తియును నంతనట్లదృశ్యముగ – వరకీర్తి **భోగిదేవయ్య** గోపించి
యంత్యజు లంత్యజు లని యఱచెదరు – అంత్యజులకుఁజొర నది యెట్లువచ్చు
నరుదుగ మీయట్టి యగ్రజన్ములకు – హరభక్తులిండులు సొరఁగరా దనిన
నిటలాక్షభక్తుల నిందించి మీకుఁ – బటురౌరవము లందఁబ్రాప్తియే చెపుఁడ
కూడదు శివదూషకుల మిమ్ముఁనంటఁ – [1]జూడఁగఁబ్రతిమాటలాడఁగావునను
ఖలులార! యిండ్లువృత్తులు నూరు మీరు – తలఁ[2]గట్టికొనుఁడు మాదాతలు మేముఁ
బోయెదమనుచు నభ్భోగయ్యవెడలి – యాయూరి మునిమంద కరుగ నయ్యెడను
శైవులయిండుల శైవలింగములు – దేవాలయములు ప్రతిష్ఠలింగములు
నమితస్వయంభు లింగాదిలింగములు – తమతమ సింహాసనములను విడిచి
తలుపులు వడనూకి తారు లింగములు – జలదారిగాఁదూఱి చనులింగములును
పూవుఱా వడనూకి పోవులింగములు – బావి నదృశ్యమై పఱచులింగములు
కలయ నంతంత గంతులువైచివైచి – యలరుచుఁజెలఁగుచు నరుగులింగములు
[3]నురవడి వట్రిల్ల నొండొంటిఁ గడవఁ – బరువడిఁదమకించి పాఱులింగములు
నెల్లవారును జూడ నిలమీఁద నొక్క – నల్లేటిపొడవున డొల్లు లింగములు
ఖేచరత్వమున నేఁగెడు లింగములను – భూచరత్వంబునఁబోవులింగములు
ననిలవేగంబున నరుగులింగములు – చనలేక మెల్లన చనులింగములును
నీ విధంబునను గెంబావిలింగములు – భావించి **భోగయ్య**పజ్జనె యరుగ
లింగపర్వత మేఁగులీలఁబొల్పార – లింగభక్తాలి గేలికలు సేయుచును
నాడుచుఁబాడుచు నరుగ నిక్కడను – బాడువాఱెను బురిభాగ్యంబు దొలఁగె
నవని గంపించె సస్యావలులెండె – భువివృక్షములు వ్రాలెఁబొడిచెఁజుక్కలును

1. జూడఁగాఁబ్రతిమాటలాడఁగారాదు 2. బొడ్చు, నడ్చు 3. ఉరువడి.



నప్పురి నిండంగ నంధకారంబు – గప్పె నెల్లెడ వంటకంబులు ప్రుచ్చె
బావులుఁజెఱువులుఁ బద్మాకరములు – వావిరి నూతులు వరువట్లు వట్టె
వనములు ఫలపుష్పవాటిక ల్గమరెఁ – గనుఁగొనఁ బశుపక్షిగణ మర్వఁదొణఁగె
ధరణిఁద్రొక్కినఠావు దరికొని కాల – దొరకొనియెను గాలి ధూళియు నెగసెఁ
తవిలి యిబ్భంగి నుత్పాతము ల్పుట్ట – భువిసర్వజనులు నబ్భూసురావలియు
భోగయ్య వోవఁగఁబురములింగములు – భోగయ్య వెనుకొనిపోయెఁబోవుటయు
నింతింతగార్యంబు లిలఁబుట్టె ననుచు – సంతాపచిత్తులై చయ్యన నేఁగి
శరణుసొచ్చితి మంచు జయజయయంచు – నరికట్టుకొనుచు సాష్టాంగంబు లిడుచుఁ
గావవే మముఁబాపకర్ముల భోగి – దేవయ్య దెస దిక్కు నీవ మా కనుచు
నవుదల ల్వంచుచు నయ్య మీధర్మ – కవిలెల మంచును గడుదైన్యపడుచు
సభయాత్ములై యున్న చండివిప్రులను – నభయంబులొసఁగి భోగయ్య తత్క్షణమ
మరలి కెంబావికి నరుదెంచె లింగ – పరికరుఁడగుచు నన్నరులు గీర్తింప
నాలింగములు భక్తి కటశాసనముగ – నోలి నన్యోన్యశివాలయంబులను
బెద్దపీఠంబులఁబిన్నలింగములు – బెద్దలింగంబులుఁబిన్న పీఠములఁ
భీమలింగంబులు రామపీఠముల – రామలింగంబులు భీమ పీఠములఁ
స్ఫటికలింగంబులు బాణపీఠముల – స్ఫటికపీఠంబుల బాణలింగములు
గనుఁగొన నిబ్భంగిఁగ్రక్కున నిలిచె – జనులకు నిదియె దృష్టప్రత్యయముగఁ
బొనరుచుఁ**గెంబావి భోగిదేవయ్య** – వెనువెంటఁజనివచ్చి వీటఁ బీఠముల
నిలిచిన లింగమూర్తులు సాక్షిగాదె – మలహరుభక్తులు కులజులౌటకును

## గుడ్డవ్వగారి కథ

నరనాథ **గుడ్డవ్వ** నాఁగ వెండియును – బరు లెల్లఁ దను బెద్దభక్తురా లనఁగఁ
బట్టినంతన తెగిపడియెడి కుష్ఠు – వట్టి రూపఱియున్న నట్టిచో నొక్క
నాఁడు నావిందిగె నాఁబురవీథిఁ – బోఁడిగా **గుడ్డవ్వ** వోవ భూసురులు
“నలుకలే కీ యగ్రహారంబులోని – కులిపి[1]జంగెత రాక నిలునిలు మనుడుఁ
బాపిష్ఠులగునట్టి పాఱులఁజూచి – శాపించుచును నింక సౌరాష్ట్ర మేఁగి
కాయంబువడయ కీ గ్రామంబు సొత్తు – నే యంచు నాత్మఁబ్రాణేశ్వరు నిలిపి
[2]ముదిత సౌరాష్ట్రాభిముఖియౌచుఁబోవఁ – బదయుగము విరిసి కదలరాకున్న

1. జంగత 2. మురిసి.

[1]మోcకతించుచువంగి మొగినేcగ నేcగ – మోcకాళ్లుcజేతులు మురియ నిల్వకయు
గ్రక్కునcద్రోవcబొరలిపోర్లి [2]పోవ – వ్రక్కలై మే నెల్ల విక్కనవిరియ
నంతలో నధికదయార్ద్రభావమునc – గంతుసంహరుcడు స్వాకారంబుcదాల్చి
యచ్చుగా **సౌరాష్ట్ర**మందుండి యెదురు – వచ్చి **సోమేశుండు** వనిత దేహంబు
దివ్యాంగముగcజేయcదెఱవ మ్రొక్కుడును – భవ్యుండు వెండియుcబటుదయామతిని
అడు గడ్గు నీ కీప్సితార్థ మిచ్చెదను – బడcతి మెచ్చితి నీదుభక్తికి ననిన
మన్మనోరమ్యనిర్మలభావగమ్య – సన్మతి మీ పదాబ్జప్రేక్షణమున
జన్మమునేcడు దా సఫలతనొందె – నున్మదవ్యాధి గుణోద్వృత్తి యణcగె
నసమాక్ష యింక నొండభిమతార్థముల – దొసcగేలcబెన్నిధి దొరకొనియుండc
జరగడుగcగcబోవు వెరవిండ్లుగలరె – వరద నీ విట్లు సుస్థిలీలcదనరి
యిక్కడ నుండు నాకింతియ చాలుc – దక్కినవరములచిక్కు లేనొల్ల
ననుడు నావిందిగె యను పురంబునను – దనరు **సోమేశు**cడత్యద్భుతలింగ
మూర్తిcజేకొనియుండె ముదిత**గుడ్డవ్వ** – కీర్తి లోకముల నంకింపంగcబడియె
నటమీcదనాయమ్మపటుభక్తి మహిమ – మట యీశ్వరునకైన నరిదిదానెన్న
వనిత మున్నపహసించిన ద్విజాధముల – తనువులు సెడియె గుష్ఠనిరూఢివలన
**గుడ్డవ్వ**యని ధరcగొనియాడుచుండ – **గుడ్డవ్వ**భక్తికి గుడ్డయై పఱగె
నటుగాన కులహీనులన నెట్లువచ్చు – నిటలాక్షుభక్తుల నిఖిలేశ్వరుండ
కని ప్రతిష్ఠాపూర్వకం బైన పిదపc – జెనసి లింగమకాక శిల యనcజనునె
యతిశయలింగదీక్షితుcడైనయట్టి – వ్రతి నంత్యజుండనిమతిcజూడనగునె
హరసన్నిహితుcబూర్వమరయుటయెల్ల – హరుశిలయన్న యట్లధికపాతకము
మేదినీవల్లభ మేరువు సోcకి – కాదె తచ్ఛాయన కాకి వ్రటిల్లు
భృంగసంస్పర్శcబతంగంబుదొంటి – యంగంబునకుcబాయుటది దెల్లగాదె
వారిధిcదటినీ ప్రవాహముల్ గలయc – బేరున్నదే వేఱె పెక్కు లేమిటికి
సిద్ధరసస్పర్శc జేసి యొcగాదె – శుద్ధసువర్ణంబు శుద్ధతామ్రంబు
గురుకరస్పర్శచేcగులమొక్కcడౌట – యరిదియేయట్ల యంత్యజుcడు నగ్రజుండు
ధర"నుమామాతాపితారుద్ర"యనcగ – సరినొక్కదల్లి ప్రజలకు వేఱెద్ది
యొప్పెదుమాణిక్య మొక మసికోక – నెప్పాటcబొదివిన నిలcగాంతి సెడునె

1. మోcకరించుకొ 2. పొరల్వోవ.



హరభక్తుcడధమజాత్యావృతుcడయ్యు – ధర నున్న నేమి యాతనిప్రాప్తి సెడునె
రాజీవ మరయcబంకేజంబు గాదె – పూజకు నది యెట్లు పూజ్యమై పరగెc
గాష్ఠోద్భవంబయ్యుcగాదె పవిత్ర – నిష్ఠితంబై పొల్చె నెరి ననలంబు
యెట్టిదుర్జాతిని బుట్టిననేమి – యెట్టును శివభక్తుcడిలcబవిత్రుండు
నీ యగ్రజన్ముల కెల్లను గురువు – బోయెతకును గాదె పుట్టె వ్యాసుండు
పూర్వద్విజాచార్యుcడుర్వి వసిష్ఠుc – దూర్వశియను లంజె కుదయించెcగాదె
మాతంగుcడనcగ బ్రహ్మర్షి యొకండు – మాతంగికిని గాదె మహిcబ్రభవించె
శునకగార్దభ మ్లేచ్ఛశుకదర్దురాది – జనితమునీంద్రాదిజాతము లెల్ల
శివభక్తిcగాదె విశిష్టమై పరగె – నవనీశ యెఱుcగవే యందఱ ననిన
విని **బిజ్జలుcడు** రోషవిహ్వలుcడగుచుc – గనుcగొని **బసవరాజు**నకు నిట్లనియెc
"బనిలేనిమాటలుcబాటలుcగథలు – విన విరుద్ధము లాడ వేసర వీవు
బత్తులcజిదిమినcబాలు గాఱెడినె – నెత్తురు గాఱెడినే యొడ్లcజిదుమ
యిట్టిమార్గములు మున్నెఱుcగ మే" మనిన – దట్టుcడు **బసవయ్య** దా నంత లేచి
"భర్గునిcగాదని పలుద్రోవ లేcగు – దుర్గుణు లగు శివద్రోహులతోడ
నడరcగ వేదభరాక్రాంతు లనcగc – బడిన బ్రాహ్మణ గార్దభంబులతోడ
మహితప్రణవదివ్యమంత్రోపదేశ – రహితులై చను వ్రతభ్రష్టులతోడc
జాల దధీచ్యాదిశాపాగ్ని శిఖలc – గాలిన కర్మచండాలురతోడc
బట్టిప్రాణముతోడcబశువు వధించు – కట్టిcడు లగు పశుకర్ములతోడ
[1]జన్నెనుదొరలినcజాగcగcబెట్టు – మన్నట్టి యధికపాపాత్ములతోడ
వీసానకై యెట్టి దోసాన కైనc – జేసాcచికొను కర్మజీవులతోడ
మానుగా సురపాటిగా నర్థి సోమ – పానంబు గావించు పాఱులతోడ
నిన్నియుcజెప్పంగ నేల తాcజంపి – జన్ని సంపె నను దుర్జాతులతోడc
బ్రతిసేసి యాడినcబాపంబు వచ్చుc – బ్రతినసూపమి భక్తిపంతంబుగాదు
**శివనాగుమయ**గారి శ్రీహస్తమంద – నివిడి చూపెదcబాలు నీ వన్నయట్లు
నీ మహీసురులలో నెన్నcగcబడ్డ – **సోమయాజుల**cదర్గి చూపుcడా నీళ్లు
అటుగాక తక్కినcగటకంబుచుట్టుc – గుటిలాత్ములను [2]దొడుగులcబఱపింపు
మనుచు బిజ్జలభూసురానుమతమునc – జని సదాసిద్ధ బసవచక్రవర్తి

1. జన్నని 2. దోడుగుల.

**శివనాగుమయ**గారి శ్రీపాదములకు – భువి సమస్తాంగము ల్వొందంగ మ్రొక్కి
సన్నుత లింగపసాయితశస్త్ర – సన్నద్ధుఁడై మదిఁజెన్ను దుల్కాడ
సరస మాడినయట్లు పొరి నాగుమయ్య – కరతలాంభోజంబు గరములఁబట్టి
యొత్తుదుఁబింజించి యుడువీథిఁదాఁకి – యత్తఱి క్షీరధారావలి వర్వె
శివభక్తి కామధేనువు బసవనికిఁ – దవిలి చన్నవిసి యిబ్బువిఁగాఱునట్లు
కరుణించి శంభుండు గనకవర్షంబు – కరికాల[1] చోడుకుఁగురియించె నాఁడు
యసలార నేఁడు దివ్యామృతవృష్టి – [2]బసవనికిఁగురిసె భక్తవత్సలుఁడు
దుర్మలత్రితయ విధూతమైనట్టి – నిర్మలదేహంబు నిజ మట్ల కాదె
రుధిరమాంసాది నిరూపితంబగునె – యధమదేహులకుఁగాకని నరు ల్వొగడ
దివ్యామృతాంగ దీధితి దేజరిల్లెఁ – బ్రవ్యక్తమై జగత్త్రయంబమర
నఖిలభక్తౌఘంబు నసదృశలింగ – సుఖసమేతాత్ములై చూడ బిజ్జలుఁడు
నందందనాగి **దేవయ్య**పాదార – విందంబులకుఁజాఁగి వినమితుఁడగుచు
సకలలోకంబులు జయవెట్టుచుండ – నకుటిలభక్తిమై నంతంత మ్రొక్కి
యజ్ఞానజీవుల మపగతమతుల – మజ్ఞుల మధికగర్వాపరాధులము
శరణన్నఁగాచు మీబిరుదు నేఁడింకఁ – బరమాత్మ మఱవంగఁబాడియే యనుచు
శరణువేఁడుచు నున్న చండివిప్రులను – గరుణఁజూచుచు వారిఁగాంచి నవ్వుచును
బసవఁడుద్యత్సముల్లసనంబెలర్ప – నసమగజంబు **నాగయ్య** నెక్కించి
తానును బిఱుఁదెక్కి తననివాసమున – కానందలీల నొప్పారంగ నరిగె
**శివనాగుమయ**గారి ప్రవిమలచరిత – మవిరళప్రీతి దుల్కాడంగ వినినఁ
జదివినవ్రాసిన సద్భక్తిమహిమ – లొదవు చతుర్వర్గపదములు సెందు

### కళ్యాణపురమునఁ గల భక్తులు

(రుద్రునిమాఱట రూపంబు లనఁగ – భద్రేభసంహరు ప్రతినిధు లనఁగ
కళ్యాణమున నిత్యకల్యాణభక్తి – లౌల్యనిరర్గళ లాలిత్యముగను
మడివాలు మాచయ్య, మాదిరాజయ్య – బడవరబ్రహ్మయ్య, బాచిరాజయ్య
కిన్నర బ్రహ్మయ్య, గేశిరాజయ్య – కన్నడ బ్రహ్మయ్య, గల్లిదేవయ్య
మోళిగ మారయ్య, ముసిఁడిచౌడయ్య – శూలద బ్రహ్మయ్య సుఱియ చౌడయ్య
కలికేత బ్రహ్మయ్య గక్కయ్యగారు – తెలుఁగేసు మసనయ్య దెలుఁగు జొమ్మయ్య
శాంతదేవుండును జమ్మయ్య బాస – వంతుకేసయ్య యేకాంత రామయ్య

1. చోడన్కి (డుకై) 2, బసవన్కిఁ గురియించె.



యుత్తమాంగదకేశి హొన్నయ్య గండ – గత్తెర నాచయ్య గాలాగ్నిరుద్రి
శృంగి బొప్పయగారు [1]సిగురుచందయ్య – డింగరి మల్లయ్య సంగమేశ్వరుఁడు
కదిరె రెమ్మయ మహాకాళయ్యగారు – పదుమరసును బురాణదమాయిభట్టు
నుదరదరామయ్య యోగి దేవయ్య – యుదయమరసుగారు హొన్నయ్యగారు
ధవళయ్యగారు బొంతాదేవిగారు – సవరద [2]చిక్కయ్య సారెనాయండు
శివముద్దుదేవుండు సిక్క దేవుండు – శివరాత్రిసంగయ్య యవిముగతయ్య
చండేశు చామయ్య ముండ బ్రహ్మయ్య – బండి [3]యరేవణ్ణ [4]యిండె సోమన్న
హాటకేశ్వరుని బ్రహ్మయ మహాబలుఁడు – కోటేశు చామయ్య గొగ్గయ్యగారు
దుమ్మద బ్రహ్మయ్య ధూర్జటికేశి – యెమ్మె సంగయ గపిలేశు విస్సయ్య
నొణిమేశు చిక్కయ నులుక చందయ్య – గణదాసి మాదన్న [5]గంటి మల్లయ్య
మురహాట కేతయ్య హరవి హొల్లయ్య – గిరిగీఁటు సింగయ్య గురజ కాళవ్వ
బానస భీమయ్య భాస్కరయ్యయును – గోనియ మల్లయ్య గొగ్గయ్యగారు
అల్లయ్య మధుపయ్య యనిమిషకేశి – హొల్లయ్య గోడల మల్లయ్యగారు
ఓలె బ్రహ్మయ కరహాళ మల్లయ్య – బాలబ్రహ్మయగారు పణిహారిబాచి
కవిలె బ్రహ్మయ బందికార మల్లయ్య – యవకర కేతయ్య శివనాగుమయ్య
నిజలింగ చిక్కయ్య నిర్లజ్జశాంతి – నిజభావుఁడును నిత్యనేమదమైలి
యంక బ్రహ్మయ గరహాళ బ్రహ్మయ్య – సుంకేశు బంకయ్య లెంక మంచయ్య
యేలేశు బ్రహ్మయ్య యీడె బ్రహ్మయ్య – మైలన బ్రహ్మయ్య మాయి దేవయ్య
చక్కెర బ్రహ్మయ్య శరణయ్యగారు – చిక్క బ్రహ్మయ్యయు సిరిగిరయ్యయును
వీరమారయ్యయు వీరలింగయ్య – వీరబ్రహ్మయ్యయు వీరభావయ్య
వీరనాగయ్యయు వీరకల్లయ్య – వీరభోగయ్యయు విమలదేవయ్య
[6]కక్కయ్య గల్లయ్య గాటకోటయ్య – చిక్కయ్య వీర్య శ్రీసూరసాని
కొండగుడ్కేతయ్య గుండయ్యగారు – చండేశుబ్రహ్మయ్య శంకరయ్యయును
అమృతదేవయ్యయు ననిమిషయ్యయును – విమలదేవుండును వీరాదిగాఁగ)
శివభక్తిసంపదల్ సిలివిలివోవ – సవిశేషభక్తి దృష్టప్రత్యయములఁ
జూపుచు సద్భక్తి సురుచిరమహిమ – నేపారు వీరమాహేశ్వరావలికి

1. శివకుమారుండు 2. చక్కయ్యగారు 3. యుదే 4. మిండ 5. కరియ 6. చిక్కబ్రహ్మయ్యయు శ్రీగిరయ్యయును– కక్కయ్య నల్లయ్య కాటకోటయ్య.

భక్తమహత్త్వంబు భక్తాభివృద్ధి – భక్తచరిత్ర ప్రభావవైభవము
కన్నవారలు సెప్ప విన్న వారలును – నున్నతశివభక్తి యుక్తిమైఁదగిలి
దేవలకులు మంత్రదీక్షాన్వితులును – శైవపాశుపతాదిశాసనధరులు
వారివారిక లింగవంతులై చూచి – వారివారిక లింగవంతులై కూడి
వీరమాహేశ్వరాచార నిరూఢి – భూరిప్రసాదోప భోగులై నడవ

**బోయలతగవు**

బోయ లందఱుఁగూడి భూమీశుకడకుఁ – బోయి "యుత్పాతముల్పుట్టె నీపురిని
శ్రీకంఠశివులు గౌరీనాథశివులు – లోకేశశివులు త్రిలోచనశివులు
నీశానశివులు మహేశ్వరశివులు – పాశమోచనశివు ల్పరమాత్మశివులు
శాశ్వతశివులు గణేశ్వరశివులు – విశ్వేశ్వరశివులును విమలాత్మశివులు
త్రిపురాంతకశివులు త్రినయనశివులు – ద్విపదైత్యహరిశివు ల్దేవేశశివులు
నురులింగశివులును నుగ్రాక్షశివులు – హరశివులును బరమానంద శివులు
ధర్మశివులును విద్యాధరశివులు – నిర్మలశివులును నిష్కలశివులు
మొదలుగాఁగల శైవముఖ్యు లందఱును – నిదియేమి మతములో యెఱుఁగంగ రాదు
బసవయ్యతోయంపు భక్తులఁజూచి – వసుధఁదారును లింగవంతుల మనుచుఁ
దొడఁగి ప్రసాదంబుఁగుడుచుచున్నారు – నడరఁగ మా కించు కైనను నిదరు
నియ్యారిలో **మల్లజియ్యయు బొల్ల – జియ్యయు** నిత్తురే చెల్లునే యిట్లు
విను మహారాజ మావృత్తి నిర్మాల్య – మొనరఁగ మాకు వచ్చినతొంటి విధము
పనులఁగావఁగఁబోయి బాలుఁడు దొల్లి – యిసుకలింగముసేసి యెలమిఁబైఁబిదుక
నేలరా మొదవుల పాలెల్ల నేల – పాలు సేసెద వంచుఁగాలఁదన్నుడును
గఁడగి తండ్రియనక గ్రక్కునఁగాళ్లు – గడికండలుగఁజేసి మృడుని మెప్పించి
మా దేవుచేతఁబ్రసాదంబు వడసి – యాదిఁ జండేశ్వరుఁడట్ల మాకిచ్చె
నంతటనుండి భోగింతు మిట్టులు ని – రంతరవంశ పరంపర మేము
నిప్పురి వీరమాహేశ్వరు లనఁగ – నిప్పు డేలా చెల్ల నిచ్చెద మనుచు
**బసవయ్య** యంత్రము ల్పన్నుటఁజేసి – పొసపరి మాతోడఁబోరుచున్నారు
చెల్లింపఁదగు నని చెప్పుగాదేని – వల్లభ నీ యింటి వాకిట నగ్ని
గుండముల్ ద్రవ్వించికొని కాల్దు" మనిన – నిండుఁగోపముతోడ నిఖిలేశ్వరుండు
బసవయ్యఁ దోడ్తేరఁ బనుచుడు బసవఁ – డసమానలీలమై నరుగుదెంచుడును
"గెడ గూడి బోయలఁగెడపుటిదేమి – వడిఁబ్రసాదము మీరు గుడుచుటిదేమి



యాదిమార్గమొ బల్మియో దీనిఁజెపుమ – కాదేని నాడికో కార్య మేమైన
యూరక కుడుచుట యుచితమే యనిన – ధారుణీశ్వరునితోఁదా నిట్టు లనియె
నిచ్చుట గలదు సందేశున కభవుఁ – డిచ్చిన తెఱఁగు మీ రెఱుఁగ రే వినుడు
బాణలింగములందుఁబటికంబులందు – బ్రాణలింగములందుఁబౌష్యరాగాది
లింగంబులందును లేదు ప్రసాద – మంగజహరునికి నాగమోక్తముగ
ధర మానవులు మహేశ్వరు ప్రసాదంబు – ధరియించినను గొన్నఁదారు సూచినను
నరయక దాఁటిన నరకాగ్నిశిఖల – నెరియుదురని శ్రుతు లెందును వినరె
శ్రీగురుకరుణానురాగ ప్రసాద – మాగమవిధ్యుక్త మగు ప్రసాదంబు
సుప్రసన్నానంద శుద్ధప్రసాద – మప్రతర్క్యాది లింగప్రసాదంబు
పరమపవిత్ర సంపత్ప్రసాదంబు – స్థిరభవరోగౌషధీ ప్రసాదంబు
సత్యప్రసాదంబు నిత్యప్రసాద – మత్యుత్తమోత్తమం బగు ప్రసాదంబు
గరళకంధరు కృపాకలితప్రసాద – మరుదగు సంగమేశ్వరు ప్రసాదంబు
మలదేహులకు మీకుఁదలమె భోగింప – మలహరుభక్తుల యిలుపుట్టువృత్తి
పూని లింగప్రసాదానూనసుఖము – మానవులకుఁబొందఁగా నెట్లువచ్చు
నేనుఁగుపన్నగునే గాడిదలకు – నేనాఁటఁగన్నులఁ గానరు గాక
యిచ్చుచోఁగెడిపితిమే ప్రసాదంబు – నిచ్చినకొన్న చోటెన్నఁడుగలదె
యిదియేల వెడగథ లిన్నియుఁబన్న – గుదగుదపడక నెమ్మదినుండుఁ"దనిన
"వారణాసి గయఁ గేదారంబునందు – సౌరాష్ట్రమునను దాక్షారామమునను
శ్రీగిరియందును సేతుపురోగ – మాగమస్థానంబులందెల్ల మాకుఁ
జెల్లఁగ మీరెట్లు చెల్లఁగనీరు – బల్లిదమైన మా ప్రాణంబులైన
విడుతుముగాక మామడిగూటివృత్తి – విడుతుమే యిదియేమి విపరీత[1] వృత్తి"
యనుచు బోయలులేచి కనుకనిఁబలుకఁ – గనుఁగొని బసవయ్య గన్నులనగుచు
వట్టియాకులు గాలి వడిఁదూలుఁగాక – మెట్టలు దూలునే యెట్టిగాడ్పునను
బెండ్లు దేలెడిఁగాక పేరేట నైన – గుండ్లు దేలునె మఱి తండ్లవియేల
బలువునఁగొన హరిబ్రహ్మాదులకును – గొలఁది గాదనిన మీ కొలఁదియె తొరల
[2]వలదు మీ రెంతటివారు గావునను – చల ముడ్గి తొలఁగుఁడు తెలివిడిఁగొనుఁడు
శైవశివాలయస్థానంబు దక్క – నే వీట నేనాఁట నిలఁదొల్లి నేఁడు.

1. మింక 2. వలవదుమీ రెంత.

నెన్నఁడే వీరమాహేశ్వరు లిండ్లఁ – గొన్నచోటులు దెల్పికొనుఁడ యిచ్చెదము
యారయ మును శైవు లైననునేమి – వీరమాహేశ్వరాచారు లైరేని
గనుకనిఁబ్రాణలింగప్రసాదంబుఁ – గొననిత్తురే మీకుఁగుటిలాత్ములార!
కొలాస లేల పైఁగొసరఁగుచంబు – గూలఁబడ్డ ట్లగుఁగూడనిమ్మనిన
[1]నేదియునేల మీ కిష్ట మేనియును – మా దేవునకును శ్రీ మన్మహేశునకు
బాలచంద్రప్రభా భాసురాంకునకుఁ – గాలకాలునకు  మా నీలకంఠునకు
సర్పకుండలునకు సంగమేశ్వరున – కర్పింతుఁగాలకూటాదులు నేఁడు
రండ ప్రసాదంబు గొండ యిచ్చెదము – పొండ యింతకుఁజాలకుండి”న ననుడు[2]
“నక్కటా బసవయ్య! యందఱమమ్ము – నొక్క వెట్టునఁజంప నొండుపాయమునఁ
జాలక యిదిమేలు మేలు వో శృంగి – కాలకూటంబు మ్రింగంగఁబంచెదవు
నలి దీటుకొనఁగఁ బ్రాణంబు గల్గినను – బలుసాకు దిని యైన బ్రదుకంగ వచ్చు
నద్దిరా తాఁజచ్చి యది గుడ్తు రెవరు – దొడ్డవో బసవయ్యతోడివాదంబు
వడిఁగొఱుకున కేఁగి బడిగంటఁజావఁ – బడిన మూషకములభంగి వత్రిల్లె
నేచి కొల్లకుఁబోయి యెదు[3]రెదుర్గాను – బైచీర గోల్పడ్డభావన దోఁచు
జాలిఁబడి కనకసాములు దమక – వేలిచికొన్న యావిధ మగుఁదమకుఁ
బగవారిబిడ్డల నగవులఁజంపు – పగిదిఁ జేసిన జోదు బసవనమంత్రి!
యీరసం బిదియేల యే మింతవెట్టి – వారము గామువో వలవ దిన్నియును
ధర భక్తు లెవ్వరే హరునకుఁదొల్లి – గరళ మర్పించుట గలదేని యిమ్ము
తవిలిచెప్పుము ప్రసాదంబని విషము – నెవరేని మునుగొన్న నేముఁగొనెదము
మేలిప్రసాదంబు మ్రింగ మీసాలు – కాలకూటంబు మాపాలె నేఁడింక
నెట్టిచ్చెదయ్య కీమాశుప్రసాద – మట్టవుఁబో విష మనియె యిచ్చెదవొ
నీవకో విషములు దేవుని కిచ్చి – చావకున్నను దత్ప్రసాదంబు మీర
చేకొండు వేయేల మీకును మాకుఁ – బ్రాకటంబుగ నింక బాస దా నిదియ
యనుడుబిజ్జలుఁడుభయానుమతమునఁ – జనుదెంచె దేవదేవుని గుడికడకు
బుడిబుళ్లనోవుచు బోయలు వచ్చి – రడరఁగఁదమకాకిపడగలు దూల

### బసవన్న విషమారగించుట

బసవఁడసంఖ్యాతభక్తులుఁదాను – నసమానలీలమై నరిగియచ్చటను

1.కాదేని శుద్ధలింగప్రసాదంబు, నేదియునేల 2. నాఁడు, ఊరకుండుండు మీర లుర్వీశునొద్ద– వీఁటిఁడిమాటలు విడఁబుచ్చి యనిన 3. రుగుదురుగ.



గాలకూటము శృంగి ఘనవత్సనాభి – హాలాహలంబును నాదిగాఁగలుగు
విషము లన్నియుఁగూర్చి వేగ నూఱించి – విషమతరంబగు విషసౌరభంబు
గాలి సోఁకినమాత్ర నోలి జంతువులు – వ్రాలి యచ్చటన జీవంబులు విడువఁ
బై నాకసంబునఁబాఱువిహగ వి – తానంబు దొప్పన ధరఁబడి చావ
రాగిల్ల నూఱినఁబ్రేగులు దెగెడిఁ – ద్రాగిన బ్రదుకంగఁదా నెట్లువచ్చు
ననుచు నబ్బోయలు కనుకనిఁ బఱవ – ఘనఘోరగరళంబు లెనయంగఁగలపి
పసిఁడికొప్పెరల నిం పెసఁగఁగ నినిచి – యసమసద్భక్త సభాభ్యంతరమునఁ
గొప్పెర ల్దీయించి కూడ నర్పించి  – యప్పుడు ధూపదీపాదు లొనర్చి
పంచమహావాద్యపటలంబు లులియ – సంచితకీర్తి **బసవచక్రవర్తి**
యా మడివాలు మాచయ్యయాదిగను – కామారిసద్భక్త గణలింగములకు
నతిభక్తి సాష్టాంగుఁడై ప్రణమిల్లి – చతురత సరససంస్తుతిపూర్వకముగ
ముద్రవుచ్చుడును విషోద్రేకవహ్ని – రుద్రుమూఁడవకంటి రౌద్రాగ్ని కరణి
భుగులుభుగుల్లనఁబొగలి కెంబొగలు – నెగయ విషార్చుల గగనంబుఁగప్పెఁ
బటువహ్నిగొని చెఱిపాఱె భానుండు – నిటయట పడియె నీరేడు లోకములు
భూలోకమెల్లఁగల్లోలంబు నొందె – వ్రాలి మూర్ఛిల్లె జీవంబు లన్నియును
నిల మంగలమునఁబ్రేలులు[1] సిట్లుగొన్న – పొలుపున ధరణిఁజుక్కలు డ్రెల్లిపడియెఁ
పొగగొన్నమాత్రన దిగులు సొచ్చుడును – విగతచేతనులైరి దిగధీశులెల్ల
నిండె ధూమంబు బ్రహ్మాండమంతయును – గొండలు గాటుకకొండలై తోఁచె
బడబానలంబున జడధులు గలఁగె – నడరెఁగల్పాంతాగ్ని యని బ్రహ్మవడఁకె
నీలవర్ణంబు దా నెక్కొన్ననాఁటి – హాలాహలం బని హరి దల్లడిల్లె
గుత్తుకవిష మెట్లొకో పోయె వెడలి – నత్తఱి నని రుద్రుఁడతిభయంబందె
నెగసె రుద్రునిఫాలనేత్రాగ్ని యనుచు – నొగి గణాడంబరోద్యోగంబు దనరె
నేలయు నింగియు నెక్కొన నిట్టి – హాలాహలాగ్నిమయంబగు నంత
మా యీశుభక్తుల మహిమ లిన్నియును – బోయలార వినుండు బుడిబుళ్లు మాని
కంటిమి కానము వింటిమి వినము – నుంటిమి లే మను నుక్తులు వలదు
అరయంగ నఖిలలోకాలోకములను – బరమేశుభక్తులు పరమపావనులు
నద్వితీయుండు పినాకియే కర్త – సద్విధి నేమె ప్రసాదయోగ్యులము
నిట్టిద కాదనునట్టి ద్రోహులకుఁ – గట్టితి [2]నెఱిగెల్తుఁగాలకూటాగ్ని

1.సిట్లినట్టి  2. నొర, నెడ.

శాపింతు నతికింతు సందుసందులకుఁ – ద్రోపింతు వాండ్ర నధోగతి ననుచు
దండియై బసవనదండనాయకుఁడు – చండేశసుతుఁడు శ్రీ సంగమేశునకు
సర్వాంకునకుఁదద్విషంబు సద్భక్తి – దర్పం బెలర్ప సమర్పణచేసి
పసిగమై నారగింపఁగ నార్చిపేర్చి – వెస ననివారితోద్వృత్తిఁజెలంగి
యరగలిగొనక కొప్పెరలకు నొరగి – పరమ మాహేశ్వరప్రకర ముప్పొంగి
జుష్టంబు "**బ హ్వాపి స్తోక మేవాపి – శిష్ట మన్నం విమిశ్రిత**" మనుఁగాన
పసిఁడిగలంతెలఁబసిఁడికోరలను – బసిఁడికర్పరములఁబసిఁడిముంతలను
వారక యిటుగూడ వడ్డించికొనుచు – మారారి కర్పించి మహనీయలీల
"చిందక క్రోలుము సిక్కయ్యదేవ – సందడిసేయకు సంగయ్యదేవ
తెచ్చెదఁజుమ్మయ్య త్రిపురారిదేవ – విచ్చేసి కూర్చుండు విమలాత్మదేవ
కాలకంఠయ్యకుఁజాలదు దెండు – చాలుఁబో నీకు **సిరాళ దేవయ్య**
వేగ మింతేలయ్య విరుపాక్షదేవ – యీ గరిఁటెఁడుఁజాలు **భోగయ్య** కింకఁ
జాలదో తెత్తునా శంకరాచార్య – ఫాలలోచన పట్టు వట్టు మీసారె
యెంతైన నాస్వాదమే పురాతయ్య – చింతింపలేదువో శివదేవుఁడింక
మిగిలిన నాక చూ జగదేవతండె – నగవులఁబోదువో గగనేశ్వరుండ
కొంకకు గొంకకు శంకరదేవ – యింకను దెత్తునా **లెంక మంచయ్య**
పాడియే వలదనఁబర్వతదేవ– కూడ వడ్డింపుఁడీ గురుదేవనికిని
శివశివ తనియండు సిన్న దేవుండు – ప్రవిమలదేవుండు బాస సెల్లించె
ముద్దులాడక పట్టు **మూర్తి దేవయ్య** – దొద్దయే యెంతైన ధూర్జటిదేవ
సంబరపడకయ్య సర్వజ్ఞదేవ – కెంబావిభోగయ్య గేలియే నీకు
నీకొలఁదెఱుఁగమే నిజభావదేవ – పట్టుము మహలింగదేవ
సంతసంబే నీకుఁజంద్ర శేఖరుఁడ – మంతనం బేల నిర్మలదేవ నీకు
[1]నుసులకు నుసులకు గుసుమేశ్వరుండ – కసిమసంగెదవేల కల్లి దేవయ్య
[2]సద్ద లిం తేలయ్య షొడ్డలదేవ – వడ్డింతుమే నీకు దొడ్డలింగయ్య
మీసలు దీర్చకు మిండసంగయ్య – బాసలువలుకకు బల్లాణదేవ
కడుపారఁగ్రోలుమా కళ్యాణదేవ – గుడికెఁడు దెత్తునా గొల్లవరాయ
చిక్కంగనీకుమా శ్రీగిరినాథ – మొక్కలం బిదియేల ముదునూరిదాసి

1. మసులకు మసులకు మాహే 2. స్రద్ధ



గ్రక్కునఁగ్రోలుమీ కఱకంఠదేవ – వెక్కసం బేలయ్య విమలాత్మదేవ
గొగ్గవ్వ మహదేవి గుడ్డలదేవి – దుగ్గళదేవి సద్యోజాతదేవి
యమ్మవ్వ సకళవ్వ యచలదేవమ్మ – నిమ్మవ్వ శాంతవ్వ బమ్మలదేవి
కాళవ్వ గేతవ్వ గామలదేవి – షోళశి బసవమ్మ సోమలదేవి
సంగవ్వ శివదేవి సాకలదేవి – లింగవ్వ రెబ్బవ్వ మంగళదేవి
ప్రమథవ్వ బాచవ్వ పదుమలదేవి – విమలవ్వ సెల్లవ్వ వీరభద్రవ్వ
చిక్కలరామవ్వ సిద్ధలదేవి – యక్కవ్వ సోదవ్వ యానందదేవి
హొల్లవ్వ గల్లవ్వ హొన్నలదేవి – **హల్లవ్వ మల్లవ్వ యనిమిషదేవి**
**కేతలదేవి పురాతవ్వ** మీర – లేతెంచి కూర్చుండుఁడీ బంతి ననుచు
సల్లీల వెండియుఁజతురతాన్యోన్య – సల్లాపసూక్తులు సరసమై తనర
నిట్టిసందడి యెన్నఁడెఱుఁగ మే మనుచు – దట్టుఁడు బసవన దా నెర్గననుచు
దమ్మయ్య కదు పొఱెఁదడవకు మనుచు – నిమ్మాటికిని మిక్కి లింకఁదే ననుచు
నోయన సడలింపు మొడ్డాణ మనుచు – నీయాన నా పొట్ట నిండెరా యనుచుఁ
గడుపు దిగ్గెడిని నీల్గకుము నీ వనుచుఁ – గడుపు వెర్గినఁదెత్తుగాకేమి యనుచు
నయ్యకుఁదలమున్కలయ్యెఁబొమ్మనుచు – నియ్యయ్య కింతట నేమయ్యెననుచు
నిది వెద్ద గాదువో యీ యయ్య కనుచు – వదలింపు గట్టినవలువ నీ వనుచుఁ
బోనిత్తునే [1]నుస్లిపోయిన ననుచు – మానుఁడా సరసము ల్మాతోడ ననుచు
నాయయ్యఁ జూడుఁడీ యాస్వాదమనుచు – నీ యందు నేమేనిఁబోయెనే యనుచు
నుత్తమాంగమున నో రున్నఁగాకనుచుఁ – జిత్తము నున్నట్లు చెప్పెఁబొమ్మనుచు
గప్పెర నిండినఁగాని పోననుచు – గుప్పునఁదెమ్ము వేర్మొని గ్రుక్కెఁడనుచుఁ
దలయూఁపులకు రాకు దండ్రి నీ వనుచు – వలెనటె మాతోడ వాగ్వాద మనుచుఁ
గడుపు దా మాయయ్య వడసెరా యనుచు – బడుగుమాటలవేల బంతిలో ననుచు
దప్పిపోవునె యూఁది త్రావిన ననుచుఁ – గొప్పెరకును గంతు గొందుఁగా కనుచుఁ
[2]క్రేళ్లువాఱక యారగింపు రమ్మనుచు – నల్లవో బలిసెరా నా యయ్య యనుచు
నేలతెచ్చెదు దేకు మిచ్చటి కనుచు – మేలుబంతికి [3]నీవ చాలుదే యనుచు
నోయయ్య తెత్తునా యొక్కింత యనుచు – నా యయ్య చాలురా నాకింక ననుచు
ద్రేన్పకపోదునే దేవ యే ననుచు – ద్రేన్పఁగ నైనను దెఱపి లే దనుచుఁ

1. నుసుల్ వో 2. కెల్లు 3. నిదిసాలునే.

బళ్లెరం బలుఁగులువాఱెరా యనుచుఁ – బెల్లు వడ్డించితి వ్రేలెద వనుచు
నొలుకఁబోయకు మఱి యోయయ్య యనుచు – నొలికినబసవనికుండుఁగాకనుచు
దెరలోని కొప్పెరల్ దెండు దెండనుచు – హరహర దాఁచెదమయ్య నీ కనుచుఁ
గొనితెచ్చి వడ్డింపఁగ్రోలుచు భక్త – జనులఁదోతెండంచు ననురాగలీల
శివున కర్పింపుచు శివశివ యనుచు – నవధానవంతులై యారగింపుచును
జుఱ్ఱుజుఱ్ఱనఁగొని సొగయుచు గఱ్ఱు – గఱ్ఱనఁద్రేన్చుచుఁగాళ్లు సాఁచుచును
నిక్కుచు నీల్గుచు నక్కిలింపుచును – జొక్కుచుఁజోలుచుఁజక్కిలింపుచును
నక్కిలిపడి ఱెప్పలల్ల మోడ్చుచును – గ్రుక్కిళ్లు మ్రింగుచుఁగుత్తుక బంటి
గ్రోలుచు [1]నలరుచుఁ గ్రాలుచు నాత్మ – సోలుచు సుఖవార్ధిఁదేలుచు వేడ్క
వ్రాలుచు మెఱయుచు వక్షంబులందు – నోలిఁబళ్లెరముది క్కొయ్యన మరలి
చూచుచు నించుకించుక వుచ్చికొనుచు – లేచుచుఁజెలఁగుచు లీలఁదలిర్ప
నాడుచుఁగప్పెర లఱచేత నొలయఁ – బాడుచు నుఱుకుచుఁబరువు వెట్టుచును
మురియుచుఁగునియుచు[2]ముఱకటింపుచును – యొరగాలనిలుచుచు సరసమాడుచును
నేతెంచి మ్రొక్కుచుఁ జేతులుసాఁచి – ప్రీతిఁబ్రసాదంబుఁబెట్టించికొనుచుఁ
గర మనురక్తిమైఁగౌఁగిలింపుచును – నరుదొంద బొత్తుల నారగింపుచును
నొండొరుముందట నున్న పళ్లెరము – లొండొరు లొడియుచు నుబ్బి యార్చుచును
విషమాక్షసద్భక్త వితతి యిబ్భంగి – విషమవిక్రమలీల విషకేలి సలుప
దండియై బసవనదండనాయకుఁడు – చండేశవరద ప్రసాదశేషంబు
గొట్టరువులవారిఁగుంచెలవారి – గొట్టుబోయల నాలవట్టాలవారి
పట్టపుదేవుల భ్రాతల హితులఁ – జుట్టాలఁబక్కాల సుతులఁబౌత్రులను
బండారులను నడబాళ్లఁబ్రెగ్గడల – దండనాయకులను దంత్రపాలకుల
దాసజనులను విశ్వాసుల భట్ల – దాసీజనముల విలాసినీజనులఁ
దతవితతాది వాద్యవిశారదులను – జతురగాయక నిజస్తవపాఠకులను
బండిత నర్తక పరిహాసకులను – మండితసత్కవి మండలి నెల్లఁ
బంతులు సాగఁగఁబంచి వారలకు – వింతవేడుక వుట్ట విషము వోయింపఁ
గాలకూటము వారిపాలికి నెయ్యి – పాలునై యుండఁగ బసవన్న మఱియుఁ
గాలాగ్ని రుద్రుని గణనాథు దాయ – కోలాహలంబును గుంజరోత్తంసు

1. నాత్మలోఁగొని సుఖవార్ధిఁ – దేలుచు వేడ్కలఁగ్రాలుచు మఱియు 2. ముఱుకటింపుచును



గంగాధరప్రియు సంగరవిజయు – లింగసన్నాహంబు మంగళకీర్తి
జవుదంతితిలకంబు జగదేకవీరు – భవదుఃఖభంజనుఁబంచాస్యబలుని
నంతకదర్పసంహారు దుర్విప్ర – దంతభగ్నంబు సదాశివమూర్తి
భద్రేభసుందరుఁబరవాదివీర – విద్రావణుని వీరభద్రావతారు
నప్రమత్తునిఁద్రిపురాంతకు జంగ – మ ప్రసాదము దెండు మావంతులార
యనుచుఁబేర్కొని యివి యాదిగాఁ గలుగు – వినుతేభవితతి నుద్వృత్తిఁ దెప్పించి
యప్రతిబలుఁదెండు హయరాజుఁదెండు – సుప్రసన్నునిఁ దెండు సుభగునిఁదెండు
ధర్మకీర్తినిఁదెండు దవరాజుఁదెండు – కర్మసంహరుఁదెండు నిర్మలుఁదెండు
వాయువేగునిఁదెండు వరదునిఁదెండు – దాయఱంపముఁదెండు దత్త్వజ్ఞుఁదెండు
సృష్టిపాలకుఁదెండు సిత్రాంగుఁదెండు – దుష్టమర్దనుఁదెండు దుర్దాంతుఁదెండు
చంద్రాతపముఁదెండు శాశ్వతుఁదెండు – ఇంద్రాయుధమ్ముఁదెం డీశానుఁదెండు
చేరమప్రియుఁదెండు శృంగారిఁదెండు – వారణాసినిఁదెండు వాహకులార
యనుచుఁబేర్కొని యివియాదిగాఁగలుగు – వినుతాశ్వవితతి నుద్వృత్తిఁదెప్పించి
కూడ నేనుఁగులకు గుఱ్ఱంబులకును – వేడుకఁబోయించె విషమెల్లసమయ
నడలుచుబోయలు గడగడ వడఁక – మృదుభక్తమండలి మెచ్చి కీర్తింపఁ
బ్రమథకారుణ్య విస్ఫారప్రసాద – విమల పుష్పాంచితవృష్టి వైఁగురియ
గగనస్థులై రుద్రగణములు సూడ – నొగి దివ్యదుందుభు లొక్కట మ్రోయ
బిజ్జలుఁడద్భుతోపేతుఁడై మ్రొక్క – యజ్ఞనౌఘంబు వాయక జయవెట్ట
భవలతాంచితదాత్ర పరమపవిత్ర – శివగణస్తోత్ర విశిష్టచారిత్ర
సదమలగాత్ర ప్రసాదైకపాత్ర – విదితసజ్జనమిత్ర విజ్ఞాననేత్ర
ప్రోద్గతసూత్ర మహోద్గురుపుత్ర – సద్గుణైకచ్ఛత్రజంగమక్షేత్ర
యతిదయామాత్ర దుఃఖాబ్ధివహిత్ర – ప్రతివాదిజైత్ర సద్భక్తికళత్ర
చన“**నరిర్మిత్రం విషం పథ్య**” మనఁగఁ – బనుపడు శ్రుత్యుక్తి బసవ! నీకయ్యె
బాపురే మా తండ్రి భక్తివర్ధనుండ – బాపురే మా యయ్య ఖ్యాపితశౌర్య
నల్లవో బసవయ్య నందీశమూర్తి – నల్లవో బసవ యనశ్వరకీర్తి
గరళంబు దొల్లి జగద్ధితార్థముగ – హరుఁడారగించుచో నట మ్రింగ వెఱచి
కాదె విషంబుంచెఁగంఠంబునందు – నా దేవు మాహాత్మ్య మది యెంత వెద్ద
కాలకూటముకంటెఁగడు నుగ్రవిషము – తా లెక్కసేయక దండనాయకుఁడు

అంచితభక్త హితార్థంబుగాఁగ – వంచనలే కారగించెఁగడ్వార
నమృతంబు ద్రావియు నమరసంఘంబు – సమసుప్తిఁబొందెదు జగ మెల్ల నెఱుఁగ
బసవయ్యఁజూడుఁడా విసముద్రావియును – నసమానలీల దివ్యాంగుఁడై నిలిచె
ననుచు లోకము లెల్ల నచ్చెరువంది – వినుతింప బోయలు విభ్రాంతిఁబొంది
సంతాపచిత్తులై సంస్తుతింపుచును – నంతంత సాష్టాంగులై ప్రణమిల్లి
"యభయమే **బసవయ్య**! యతికృపాంభోధి!!– యభయమే **బసవయ్య** ! యద్భుతచరిత!!
యిమ్మెయి సరివారమే **బసవయ్య** – తమ్ముఁబఱుప మీకుఁదలఁప శౌర్యంబె
పోల దుర్జనుతోడి పొందునకంటె – జాల మేలంద్రు సజ్జనవిరోధంబు
కావున, మము నెట్లుఁగాచి రక్షింపు – మావికలతఁద్రోచి దీవనఁబొందు
దేవ దెసయు దిక్కు నీవ మా" కనుచు – వేవిధంబుల నిట్లు విన్నవించుడును
జూచె దయాదృష్టిఁగాచె వీడ్పడఁగఁ – ద్రోచె వాదములెల్ల నేచెఁబ్రఖ్యాతి
మాపె బోయలపెంపుఁజూపెఁబ్రసాద – మోపి లే దనినూకెఁబాపె బోయలను
నిలిచెఁజలింపక తలఁచెఁబ్రస్తవము – గెలిచె సద్భక్తిమైఁబొలిచె బీరమునఁ
జేర్చె భక్తావళిఁగూర్చె నాద్యోక్తిఁ – దీర్చె సన్మార్గంబు నోర్చెఁదర్కమునఁ
బండించె నిశ్చలభక్తిలోకముల – నిండించె బసవయ్య నిర్మలకీర్తి

## జగదేవ దండనాయకుని కథ

వెండియు **జగదేవ దండనాయకుఁడు** – నిండారుసద్భక్తి నిధి కర్మయోగి
యభిమతలీలమై విభవంబుమెఱసి – శుభకార్య మాచరించుచు నొక్కనాఁడు
నేతెంచి వీరమాహేశ్వర తిలక – ప్రీతియెలర్ప విభూతిఁగైకొనుము
అసలార మాయింట నారగించినను – బసవనమంత్రి యేఁబ్రదుకుదు ననిన
నగుమొగం బలరార జగదేవమంత్రి – నొగిఁజూచి బసవయ్య యొండేమి చెప్ప
సర్వజ్ఞనెట్టణ శరణులరాక – కోర్వఁగ నెమ్మెయి నోపుదే యనిన
నవుఁగాక యనుచు రయంబున నేఁగి – వివిధపక్వాన్నాది వితతులు గూర్చి
సరసర బసవయ్య సనుదేరకమున్న – గరమభిషేకంబుఁగావింత మనుచుఁ
[1]జానపిప ట్లల్కి సద్భక్తియుక్తి – గానక బాఁపల కాళ్లు గడ్గుటయుఁ
బరిచారకునిచేత బసవయ్య యెఱిఁగి – యరుగుట సాలించి యాగ్రహింపంగ
జగదేవుఁడంతలోఁజనుదేరఁగాంచి – భుగభుగ కోపాగ్ని యెగయ ముందటను
తెరచీర వట్టించి చౌర నెట్లువచ్చు – నరుగుము భక్తజనాళిలో వెడలి

1. చానిపి, చానమి



కులదైవ మిలువేల్పు **మలహరుఁ**డుండఁ – బలుద్రోవలనుబోవఁబాడియే నీకుఁ
గఱకంఠు శుద్ధనిష్కలభక్తియుక్తి – జఱభుల కదియేల సమకూడుఁజెపుమ
ముల్లోకనాథుని ముట్టఁగొల్చియును – గల్లరిలోకుల [1]క్షణియింపఁదగునె
హరునకు మజ్జనంబార్చుచేతులను – [2]సరవి విప్రులకాళ్లు సరి గడ్గఁదగునె
శివపాదజలములు శిరమునఁదాల్చి – భవుల కాళుల నీళ్లు వై నల్కఁదగునె
శ్రీమహాదేవుఁబూజించుచేతులను – నామాలకుక్కల నర్చింపఁదగునె
పురహరార్చితునకు మున్నెత్తుకలు – ధరనెత్తఁగూడునే త్రాటిమాలలకు
సదమలలింగ ప్రసాదజీవికిని – విదిత మీశ్వరభక్తి విముఖులైనట్టి
కర్మచండాలురఁగలసి కుడ్చుటయుఁ – గర్మంబు గుడుచుటగాదె యెట్లనిన
నదియును దివ్యాగమార్థంబులందు – మదనారిసద్భక్త మందిరంబులను
మెలఁగుపుత్రకళత్ర మిత్రగోత్రాది – బలఁగంబు లింగాన్వితులు గాకయున్న
నొండేమి యిలఁగూడియున్న యంతటను – చండాలమిశ్రదోషంబు వాటిల్లు
"**దర్శనా దపి పాపదా**" యనుఁగాన – దర్శనాలాప సంస్పర్శన శయన
సంపర్కభోజనాసన దానములకు – నింపారునే భక్తుఁడితరులయెడను
బశుపతిసద్భక్తి పథ మేమిచెప్పఁ – బశువులసద్భక్తి పరులఁజేయండె

## ఏలేశ్వరు కేతయ్యగారి కథ

ఖ్యాత **మేలేశ్వరు కేతయ్య**నా న – జాతభక్తుండు దచ్చరిత మెట్లనిన
చిత్ర మత్యద్భుతశీలప్రయుక్తి – పుత్రమిత్రకళత్రగోత్రవర్గంబు
బానిస బంటు గోపాలుండు పశువు – శ్వానంబు మఱియు మార్జాల మాదిగను
గృహచారకుల నెల్ల మహనీయలీల – మహిఁబ్రాణలింగసన్నిహితులఁజేసి
తానును భవులను దలఁపఁ డల్లంత – నైనఁజూడఁడు మాటలాడఁడు వినఁడు
ముట్టఁడు వరసీమ మెట్టఁడెయ్యెడలఁ – బెట్టఁడు వారిచేఁబెట్టించికొనఁడు
తావిల్వఁడమ్మఁడెంతయు భాగ్యమునను – బోవఁడెరవుపోయి పొందిడికొనఁడు
తానయై పొరయఁడింతటి కేమి యనఁడు – మానుగా నావంతయేనిఁబోనీఁడు
భవి పరిత్యాగులై భువిఁబ్రవర్తింప – శివభక్తులకు నిది శిష్టత్వ మనఁగ
నిట్టు వర్తింప నేలేశుకేతయ్య – నెట్టణభక్తివినీతిని జనులు
నెడనెడ నొక్కొక్క యెగ్గొనరింపఁ – దొడిఁబడ కా యయ్య నడచుచునుండఁ

1.క్షమియింపఁ 2. నరకవిప్రుల.

బుడుకఁడు భవులంచుఁబోయి పొందీఁడు – నడుగఁడు భక్తుఁడ ననుచు నింకేల
వెదపద న్నెడకుండ విత్తులు సేన – వెదవెట్టుఁగాకేమి యిది సూతఁడనుచు
నలిగి విత్తులగాదియలఁజిచ్చువెట్టి – యలరుచు ద్రోహు లంతంత వీక్షింప
**నేలేశుకేతయ్య** యెఱిఁగి నవ్వుచును – గాలుఁగా కేమని గ్రక్కున నచటి
నీరు[1]పొణ్కలనిండ నించి తెప్పించి – యారకుండఁగఁజేన నంతటఁగలయ
విత్తించికొని కొండ్రవేలకు మిగుల – నత్తఱిఁ బండించె ననురాగలీల
మును **హీళ్లహాళ బ్రహ్మన** నాఁగ భువిని – వినఁ జెప్పఁజిత్రంబు విత్తు లల్కకయ
చేను వండించె నాఁజెప్పఁగఁబరగుఁ – దా నేఁడు వీరిచేఁగానఁగఁబడియె
మదనారిభక్తుల మహిమ దలంప – నిది సోద్యమే యంచు నిల బుధు ల్వొగడఁ
బనువుచు వెండియుఁబాపిష్ఠులైన – జను లంతఁబోక యసహ్యాభావమునఁ
బసు లేడ తా రేడ బగి తేడ జగతిఁ – బసరించి కుడిచెడి పగిది గా కనుచు
జంత్రంబువన్ని క్రచ్చుఱ్రముచ్చులకును – యంత్రించి పసులఁదారంతఁబట్టింపఁ
దలర కొక్కటియును దప్పకయుండఁ – [2]బొలమునపసులకు బొలమున వెడల
నటుగొనిపోవుచో యనుగుచునుండి – యిటప్రాణనాథుఁడుండుటఁజేసి పసులు
పండినపొలమునఁబదువయు మొలవ – నిండినకొలఁకుల నీర్గలచోట
మఱచియైనను బులు గఱవక నీరు – దఱియుచో మూతులు దడియంగనీక
యేడునాళ్లనుగూడ నిటు సనుచుండ – చూడ నక్కజ మైనఁజోరు లూహించి
యిది యేమి చోద్యమో యిట వట్టి తెచ్చి – నది యాదిగా మేయ వంటవునీళ్లు
నుండిన ఫలమేమి రెండుమూన్నాళు – లుండినఁజచ్చు నొక్కండును మనదు
వట్టి కర్మంబేల కట్టికొనంగ – నిట్టున్న భంగిఁబోనిం డని విడువ
గ్రక్కున మగిడి యుబ్బెక్కి యంతంత – నెక్కడ నిలువక యెగసి దాఁటుచును
తోఁకలు వీపులతోఁగీలుకొలిపి – వీఁక వచ్చినదారి విడువక పట్టి
యేడునాళ్లకు మును పేతెంచు తెరువు – నేడుజాలకుఁగూడనేఁగుడు నిచట
**నేలేశు కేతయ్య** యెడదవ్వులందు – కీలరుఁబొడగాంచి కినియుచు దొడ్డి
పలుగాఁడి నిడి వ్రతభ్రష్టుల దిక్కు – పలుకుట సూచుట వాతకంబనుచుఁ
జొరనీక నూకుడుఁజొప్పయుఁగసువు – పరులు వాపంబంచుఁబడిగొనివైవఁ
గొప్పదిక్కున నంత సూడక వ్రతము – తప్పమయ్యా యని తా[3]రర్చునట్లు

1. పాణంకల 2. బొలములో పసులనుఁ బొలములోవిడిచి 3. రార్చు



నెలుఁగెత్తి కూడి యంబేయని [1]యఱచుఁ – దల లెత్తివంచు నాల్కలు వెడలించు
తెట్టుపై మూతులువెట్టి యన్నగరి – చుట్టును వాచర్చు శోకంబు లడర
దొడ్డిలోపలఁదారు దొల్లి భజించు – దొడ్డలింగముఁదొంగితొంగి చూచుచును
దాఁటఁగ దలపోయు [2]దర్పంబుపేర్మి – దాఁటఁగ నోడుఁ గేతయ్య రమ్మనక
యాపసు లిభ్భంగి నలమటపడఁగ – లోపలఁగట్టిన క్రేపులి ట్లెఱిఁగి
తప్పునో తమతమతల్లులు నియమ – మప్పాటనని యర్వ కాలింపకున్న
లేఁగలఁబుడుకుచు లీలఁగేతయ్య – మూఁగియర్చుచు మేఁతముట్టకుండుటయు
శీలము ల్దప్పమి వోలఁగా నెఱిఁగి – యాలోకు లత్యద్భుతాక్రాంతులుగను
బలుగాళ్లు దెఱపింప నలరుచుఁబసులు – వలివేగమున వచ్చివచ్చి యొండొండ
[3]యూఁకర ల్గొట్టుచు నుత్తలపడుచు – వీఁకఁగన్నులు విచ్చివిచ్చి చూచుచును
దలలు లింగంబుతోఁదాఁకించికొనుచు – వలగొని వచ్చుచు వడి మూరుకొనుచు
నిట లింగవిముఖులై యేఁగుటఁగోలె – నట పూరికఱ్ఱయు నంటకుండుటకు
సత్యమీ లింగంబు సాక్ష్యమన్నట్లు – నిత్యలింగస్పర్శ నియమము ల్సలిపి
గ్రక్కున కేతయ్యగారి పాదముల – కొక్కింత వంగుచు మ్రొక్కి తత్క్షణమ
ముప్పిరిగొనిపాఱి చొప్పయుఁగసువు – నప్పుడు దమ కడుపార మేయుచును
నెడనెడ నుదకంబు లేఁగి త్రావుచును – వడి నాకుచును జాఁగఁబడుచు లేచుచును
బొదుగులు సేపంగఁబొదలి నెయ్యమున – మొదవు లంబే యని మునుకొని యఱవఁ
బసులఁగేతయ్య నేపట్టుట యెఱిఁగి – పసిగొని క్రేపులు వార కర్చుచును
విడువఁదల్లులడాసి కుడువఁగ నియతి – నడరంగనఱచెఁ దా రట్ల కావునను
**నేలేశు కేతయ్య** యింటియీ పసులు – పాలింపఁగా శివభక్తుల యనిన
నితరులఁగలయంగ నెవ్విధిఁగూడు – మతిఁదలఁపఁగ [4]గురుమార్గమే యిదియు

## సవరద నాచయ్య కథ

సవరదనాచయ్య యువిదకుఁదొల్లి – కవలవా రుదయింప గ్రక్కున మున్న
యుదయించు బాలున కొక్క లింగంబు – నుదయించు లోనన నొగి సమర్పించి
యున్న బాలునికి వేఱొక్క లింగంబు – మున్ను గల్పింపమి నన్నాతి దడసి
పతికిని వినిపింపఁబథిహీనుఁడయ్యె – సుతుఁబాఱవైపుఁడు చూడఁగరాదు
శరణోక్తి గురులింగ సన్నిహితంబు – నరయ నర్ధోదయంబైనష్ఠ వలయు

1. అఱువ 2. తప్పనుమతిని 3. యూఁకరుల్ 4. నిదిమార్గంబు మఱియు

నని నాచిదేవయ్య యఖిలంబు నెఱుఁగఁ – దనయు విసర్జించె ననుచు నాద్యోక్తి
మార్గంబులుండఁగుమార్గంబులూఁది – మార్గమే యీ త్రాటిమాలలఁగలయఁ
బశుపాశపతి యుండఁబశువులౌ [1]పంద – పశుజీవులకుఁబెట్టు పందలఁబట్టి
సోడంబుతో ముక్కు మోదుగాఁగోసి – కూడ నిట్టికఁబ్రామ కేడఁబోవచ్చు
ఖండేందు ధరుఁడిట్టికర్ముల యొద్ద – నుండునే మా భక్తు లొద్దనే కాక
రాచిన శుద్ధశివాచార మహిమ – నాచుఁడ యెఱుఁగంగ నీ కేలవచ్చు
దృష్టిహీనుండు దా దీప మే మెఱుఁగు – నష్టకర్ణునకును నాద మేమిటికి
జ్వరపీడితుఁడు వాలచవి యే మెఱుంగు – సరి గప్ప లెఱుఁగునే జడనిధిలోఁతు
వానరం బెఱుఁగునే వరరత్నమహిమ – శ్వానం బెఱుంగునే స్వర్గలోకంబు
రా నేర్చునే పుష్పరసమున కీఁగ – కాన నేర్చునె రవిఁగౌశికవితతి
యజ్ఞానజీవుల కతులితభక్తి – ప్రాజ్ఞత యిదియేల ప్రాపించుఁజెపుమ
ముంగిటిపెన్నిధి దంగేటిజున్ను – నంగిటనూరెడు నమృతంబనంగఁ
జను నేకలింగ నిష్ఠాభక్తియుక్తిఁ – జనకదుష్పథములఁజరియించు టెల్ల
రాజితాంచితరత్న రాజ ముండంగ – గాజుపెంచిక లేఱ గమియించినట్లు
తవరాజ మమరి ముందఱఁబ్రోఁకయుండ – తవుడు బొక్కుదునని తలఁచినయట్లు
దొడ్డిలోసురధేను [2]వొడ్డుగాఁగురియ – గొడ్డుఁ [3]బిదుకఁగుండఁగొనియేఁగినట్లు
నక్కజంబగుచు వజ్రాయుధంబుండ – మొక్కలసురియకు మోహించినట్లు
పొట్టపొర్వునఁగల్ప భూరుహంబుండ – వట్టివృక్షమునకు వడి నేఁగునట్లు
నొదవంగ వట్టేట నోడ యుండంగ – వద రూఁదినట్టు లీ వసుమతిలోన
మంగళంబగు భక్తిమార్గముండంగ – వెంగలులై కర్మవిధి యూఁది చెడుట
**“స్మృతి తేన సహ సంవ సే”** త్తని మ్రోయ – మతిహీనులకు నేల గతమగుబుద్ధి
నెఱి నెన్నిమాఱులు నీళ్లలోపలను – గొఱుపడంబుదికిన మఱి తెల్లనగునె
యేనాఁట బ్రద్దల నెంత గట్టినను – శ్వానంబుతోఁక దాఁజక్కన యగునె
మానక జలములలోన నేప్రొద్దు – నానిన శిల మెత్తగానేర్చు నెట్లు
నెడపక పాలు దానెన్నివోసినను – విడుచునే సర్పంబు విస మొకింతైనఁ
బొలుపుగాఁదేనియ వోసి నూఱినను – నిలఁదీయనై యుండునే వేఁపనార
పన్నుగానే లెంత వ్రామి కడిగిన – మన్నుఁదాఁబోవునే మఱియట్లుఁగాక
పసిఁడినాఁగటఁబెక్కుభంగుల దున్ని – వెస ముల్కవిత్తులు వెదవెట్టినట్లు

1. బంద 2. వొడ్డుక, వొడ్డుకొన్కు 3. జీఁటఁగ.



ఘనసారవృక్షముల్ ఖండించి వెల్గు – పెనుజెముళ్లకుఁ జుట్టుఁబెట్టినయట్లు
నగ్గిలోపల మూత్ర మఱిముఱిఁబోసి – దగ్గఱి వేల్వఁదొడంగినయట్టు
లచ్చుగా నర్ఘ్య[1]పణ్యమ్ములు దెచ్చి – యిచ్చఁగుక్కల కాళు లిలఁబూన్చినట్టు
లోడునఁబోసిన యుదకంబులట్లు – నీడమాలిన ధరణీరుహంబట్లు
రాజితలింగపరాఙ్ముఖానేక – పూజలు నిష్ఫలంబులు గావె తలఁపఁ
ద్ర్యక్షపరాఙ్ముఖక్రతు వాచరించి – దక్షుఁడెఱుంగవే తలఁగోలుపడియెఁ
**బరశురాముఁడు** దొల్లి బాఁపల కర్థి – ధర యిచ్చి యెఱుఁగవే తా నేమి గనియె
నిల యెల్ల నెఱుఁగ విప్రులనె పూజించి – బలి బంధనంబునఁబడఁడె తెల్లముగ
నడరంగ గౌతముఁ డగ్రజన్ములకుఁ – గుడవఁబెట్టియ కాదె గోహత్యఁజెందె
వేదజ్ఞులగు కోటివిప్రుల కన్న – మాదటఁబెట్టిన యట్టి ఫలంబు
త్ర్యక్షభక్తున కొక్క భిక్షంబు వెట్టు – నక్షయఫలమున కసమాన మనుట
వ్యక్తమైయుండఁ గుయుక్తుల నడవ – భక్తియుఁజెడు దానఫలము నిష్ఫలము’
నని పెక్కు భంగుల నానతిచ్చుడును – విని శోకజలసమన్వితనేత్రుఁడగుచు
జగదేవుఁ డాభక్త జననికాయంబు – మొగిఁబ్రస్తుతింపుచు మోడ్పుఁగే లమరఁ
“గర్మబద్ధుఁడనైతిఁ గష్టుఁడ ఖలుఁడ – దుర్మదోపేతుఁడ దుష్కృతాలయుఁడఁ
బ్రజ్ఞావిహీనుఁడఁ బరమపాతకుఁడ – నజ్ఞాని నధికసర్వాపరాధుండ
శంకమాలిన యనాచారుండ దీని – కింకఁబ్రాయశ్చిత్త మేమియు లేదు
పాన లేటికి విడ్తుఁబ్రాణంబు గెలస – మానతి యిండు ఆన” కని మ్రొక్కి నిలువఁ
గనుఁగొని బసవయ్య ఘనభక్త వితతి – యనుమతంబునఁగూడ నతని కిట్లనియె
“గొంకక విను మఱికొన్ని దినముల – కింక శివద్రోహ మిట పుట్టఁగలదు
మడియింపు ద్రోహిని మా కెక్కెఁగెలస – మదరఁ బ్రసన్నుఁడయ్యెడి శివుఁడప్డు
ఈ నిర్ణయమునకు నీశానగణ వి – తాన మెంతయు మెచ్చి తత్ప్రస్తవంబు
నిమ్ములఁగరుణించి యిచ్చిరి నీకు – నమ్ము మమ్మాటికి లెమ్ము లె” మ్మనుడు
[2]నంగద మోడ్పుఁగే లలికంబుఁజేర్చి – పొంగుచు వీరతాంబూలంబు గొనుడు
జగదేవశరణుని నగరికి బసవఁ – డగణిత భక్తసహాయుఁడై యరిగె
నసలార నుచితక్రియాదులఁదనిసి – **బసవన్న** యసమసద్భక్తులుఁదాను
ననయంబు భక్తి సుధామృతాపార – వనధి నిమగ్నుఁడై వర్తింపుచుండె

1. పాద్యమ్ములు 2. సంగతి నిటలానఁ గెంగేలుసేర్చి

## అల్లయ్య మధుపయ్యల కథ

మఱియంత **నల్లయ్య మధుపయ్య** యనఁగఁ – గఱకంఠుభక్తు లకర్మసంచయులు
లింగైకనిష్ఠావిలీనమానసులు – జంగమారాధనాసక్తచేతసులు
పరమశివాచార పరవర్మనిరతు – లురుతరకీర్తి నియుక్తులు నాఁగ
నసమానలీలఁ**గళ్యాణంబు**నందు – **బసవఁడు** దారు నప్పాట వర్తింప
నంత బిజ్జలుఁడు దాఁ గొంతకాలమున – కంతకు బ్రోలికి నరుగంగఁదలఁచి
బసవని మహిమయు భక్తి మహత్త్వ – మెసకంబు నెఱిఁగియు నెఱుఁగనియట్లు
పొదలిన యజ్ఞానబోధఁగాఁజేసి – మదియించి **యల్లయ్య మధుపయ్య**గారి
తప్పేమియునులేక చొప్పుగా దనక – రప్పించి కన్నులు వుప్పించె నంత
'కాలకాలునిభక్త గణముల మహిమ – లేల తా మున్నును నెఱుఁగునుగాదె
యక్కట చెడఁజూచె నవనీశుఁడింక – నిక్కటకంబున కెక్కడిబ్రదుకు
మృడుభక్తు లలిగినఁజెడఁడె తా" ననుచు – జడిగొని నరులెల్ల బుడిబుళ్లువోవ
బసవఁడు మొదలుగా నసమాక్షుభక్తు – లసమకోపోద్దీపితాంగులై పొంగి
మసలక **యల్లయ్య మధుపయ్య**గారి – కసలారఁగాఁగన్ను లప్పుడ పడసి
'యింక నుండఁగఁగూడ దీయూర' ననుచు – శంకరభక్తులు జగదేవమంత్రిఁ
'బనిచినతొల్లింటి బాసగైకొనుము – తునుము శివద్రోహి' ననుచు బిజ్జలుని
నొసలిరేఖలు గసిబిసిచేసి రాజ్య – మసమాక్షుకవిలియ నటు దుడిపించి
బల్లహుకటకంబు వదటిపా ల్సేసి – యెల్లవారును జూడ నీక్షణంబునను
'బాడగుఁ[1]గటకంబు వాడగుఁగూడఁ – బాడగు' ననుచు శాపంబు లిచ్చుచును
రాచిన **మడివాలు మాచయ్య**గారు – **నాచౌడరాయఁడేకాంతరామయ్య**
**కిన్నర బ్రహ్మయ్యయు గేశి రాజయ్య – కన్నడ బ్రహ్మయ్య గక్కయగారు**
**మాది రాజయ్యయు మసణయ్య**గారు – నాదిగా నప్పురి యఖిలభక్తులును
దండిజంగమకోటి దనతోడ నడవ – **బండారు బసవనదండనాయకుఁడు**
నెసఁగఁ గప్పడి **సంగమేశ్వరం**బునకు – వెస నేఁగె బిజ్జలు నెసకంబు దలఁగ
గటకటా కఱకంఠు గణములు వోవఁ – గటకంబుభాగ్యంబు గ్రక్కునఁదొలఁగె
భూకంపమయ్యెను భువి నర్ధరాత్రి – కాకు లఱచె వంటకంబులు వ్రచ్చె
ధరఁబడె నుల్క లత్తఱి ఱాల వాన – గురిసె భాస్కరచంద్రపరివేషమయ్యె
దివిదీటుకట్టె వేసవి మూఁగె మంచు – గవిసెను మధ్యాహ్న కాలంబు నందు

1. గళ్యాణపట్టణంబింకఁ.



కడు నుగ్రరూపుఁడై కాలుండు గానఁ – బడియెను బట్టణ ప్రాంతదేశమునఁ
బొరిఁబొరి గవిసెఁగావిరి యెల్లయెడల – ధరణీశ్వరుఁడు గాంచెఁదలలేని నీడ
రవి యుదయించు తత్ప్రస్తవంబునను – దివిఁబ్రతిసూర్యులు దీపించి రింక
నెంతగానున్నదో యిట మీఁదననుచు – సంతాపచిత్తులై జనులు భీతిల్ల
నిక్కడ **జగదేవు**ఁడింటి కేతేరఁ – జక్కన నాయయ్య జనని వీక్షించి
"శివగణద్రోహంబు సెవిఁబడ్డయపుడ – యవిచారమున వారి హరియింపవలయుఁ
జాలరేఁదారేని సమయంగవలయుఁ – గాలకాలుని భక్తగణమార్గ మిదియు
సమయింపఁజాలక చండియై తాను – సమయనిప్రాణవంచక కుటిలునకుఁ
గుపితున కజ్ఞున కపజీవితునకు – విపరీతచరితుండు విషమలోచనుఁడు
మెచ్చునే వానికి మిక్కిలిభక్తి – యిచ్చునే కూర్చునే యిన్నియునేల
క్రితము నీ ప్రాణ పరిత్యాగమునకు – మతిమెచ్చి యవసరోచిత మిచ్చి నిన్నుఁ
బంచి యేఁగిరి కాక భక్తు లాద్రోహిఁ – ద్రుంచుట కోడియే తొలఁగిరె చెపుమ
యందొక్కఁడలిగిన నవికలాజాండ – సందోహములు గాలి డిందకయున్నె
దక్షుఁడు క్రొవ్వి యదక్షుఁడై తొల్లి – దక్ష మఖక్షయదక్షుఁబల్కుటయు
వినఁగఁజాలక తాన తనకోపవహ్నిఁ – గనలుట వినవె యా గౌరి తత్క్షణమ
యదిగాక యుపమన్యుఁడభవునినింద – మది విన కపుడ భస్మంబయ్యెఁగాదె
కావున శివభక్త గణనింద వినియు – నీ వూరకుండుట నీతియే వానిఁ
జంపియే కుడువఁగఁజనుదెంచి తిపుడు – పంపుడుకళ్లు నీ కింపారు నెట్లు
చీ! కుక్క! చేఁజేత శివుప్రసాదంబు – చేకొని కుడువఁగ సిగ్గెట్టులేదు
వచ్చి కక్కుదుగాక [1]శ్వానంబునట్లు – నుచ్చుచ్చురే" యని యొగిఁజిట్టమిడిచి
వెడలి వాకిటిదెస మృడుప్రసాదంబు – కుడుకతోఁగొనివచ్చి పుడమిఁబోయుడును
'దగ వగు' ననుచును దాఁగుక్క భాతి – జగదేవుఁడిట్లు ప్రసాదంబు గుడువ
మల్లబ్రహ్మయ లన మహి వీరభక్తి – కెల్లయై వర్తిల్లు నెడ నర్ధరాత్రి
నీ వార్త విని జగదేవునికడకు – వేవేగఁజనుదెంచి వెండివొత్తునను
దారును నా ప్రసాదం బారగించి – యా రాత్రి కొల్వున కరిగి బిజ్జలుని
నల్లంతఁబొడగని యలుఁగులు వెఱికి – జల్లున నలిగి యా సభ దల్లడిల్ల
నొక్కట ముప్వురు నుద్వృత్తి నెగసి – చక్కడ్చి పొడ్చి జర్జరితంబు సేసి
యలుకమై గెడిగెడి యనుచు బిజ్జలుని – తలగోసి పొట్టలోపలఁబెట్టి కిట్టి

1. వుగాకచ్చగుక్కనుచు.

‘తా నసంఖ్యాతుల యానతి యదియు – నీ నరాధముఁబొలియించితి మేము
అధికులౌ భక్తులకహితంబుసేయు – నధములందఱును నివ్విధిఁబోదు’రనుచు
గాయముల్[1] బిగియుచుఁగతులుద్రొక్కుచును – ఱాయముల్గొనుచుదండలనటింపు
బొంగిబొబ్బిడుచుఁజెలంగి యార్చుచును – లింగభక్తులకెదుర్లేరు వొండనుచు
బిండుగాఁబౌరులు బిజ్జలునితల – గుండుగండా! యని ఘూర్ణిల్లుచుండ
మగిడి యా మల్లబ్రహ్మయగారుఁ దాను – నగరువెల్వడి తన నగరికి వచ్చి
తల్లికి నందంద ధరఁజాగిమ్రొక్కి – సల్లలితాంగి ప్రసాదంబు వడసి
‘పరమపాతకు నట్టి భక్తనిగ్రహునిఁ – బొరిగొన్నయంతన పోవ దాద్రోహి
నప్పుడేచంపక యరుదెంచినట్టి – తప్పున కింకొండు దండమున్నదియు’
ననుచు నజ్జగదేవుఁడంతలోపలను – తన శిరంబున కల్గికొని విమానములఁ
బుత్రమిత్రకళత్ర గోత్రాదులను వి – చిత్రంబుగా నప్డ శివలోకమునకుఁ
గొనిపోయెఁ గటకంబుజనులెల్లబెదరి – కనుకనిఁబఱవంగఁ గ్రందువుట్టుటయుఁ
గన్నభక్తులు వార్తవిన్నభక్తులును – నున్నభక్తులుఁబోయి రొక్కొక్కయెడకు
నంతరాజ్యార్థమై యనిచేసి యతని – సంతానమెల్ల నిస్సంతాన మయ్యె
వీఁకఁగొట్టములలో వెలిఁగె గుబ్బములు – తోఁకల నిప్పులు దొరుగ నక్షణమ
కరులును గరులును గన్నంత నెదిరి – పొరిఁబొరిఁదాఁకి జర్జరితమైపడియె
బ్రసి యమాత్యాది భటవర్గమెల్లఁ – దమలోనఁ జచ్చిరి సమరంబుసేసి
బసవని సత్యశాపమునఁగాఁజేసి – పసచెడి కటకంబు వాడయ్యె నంత
వినియె నంతయు నట చనియెఁ గూడలికిఁ – గనియె సద్గురువు సంగయదేవునచట
భక్తులుఁదానును బరమానురాగ – యుక్తి నబ్బసవయ్య యుండె సంప్రీతి
నంత నా గురువు సమంచితనాద – సంతతపూజాది సత్క్రియావలుల
ముంచి భజించి కీర్తించి మెప్పించి – మించి విన్నపమాచరించి ప్రార్థించి
“దేవ సద్గురుమూర్తి దివ్యలింగాంగ – దేవ నా సంగయ్యదేవ ప్రాణేశ
నీదుసద్భక్తప్రసాదంబుఁగుడిచి – యాదట బ్రదికి యింతైతిఁ గావునను
భవభవంబుల వారి పన్నఁగాఁదగుదు – భువివారి ఋణమునఁబోవుటగలదు
అంతియకాని నిన్నడిగినచోటు – నెంతైన నేమైన నిచ్చినచోటు
గలతప్పుసైరించి కాచినచోటు – గలదేని చెప్పుమా కానమీయందు
పుట్టినమొదలును బోఁకయుఁబొరయ – వట్టికొల్వున నిన్ను ముట్టఁగొల్చితిని
వెట్టిచేసిన నీకు వెయ్యేఁడులైన – నెట్టును మేలకా కెగ్గేమి తలఁప

1. బిగిచియుఁ గతికిఁ ద్రొక్కొనుచు.



నూర కిట్లనుచుట యుచితమే నీకు – నారంగఁ బ్రమథులయాన నీయాన
వృషభవాహన విన్నవించుట వినక – వృషభంబు నీకెట్లు విడువంగ వచ్చు
నొల్లనొండేమియు నోటంబుగాదు – వల్లభ[1] యడుగను వరమిఁక నిన్ను
బరమపరానంద పరవశీభూత – నిరవధితత్త్వవిస్ఫురణ పెంపునకు
గతిమనోవాక్కాయ కర్మచైతన్య – రతులు నీయంద [2]విశ్రాంతంబు నొంద
జేయుము నీయాజ్ఞఁజేసి యేతెంచి – చేయంగఁగల పనుల్సేసితి నింక”
ననుడు దయామతి నగ్గురుమూర్తి – తన తొంటి భావంబుదాల్చి యక్షణమ
సంగయదేవుఁడు సదనాంతరంబు – భంగిగా వెడలుడు బసవయ్యసూచి
సన్నుత తద్గురు చరణాబ్జయుగము – [3]నెన్నుదు రిఱియంగ నన్నుతిమ్రొక్కి
యానందబాష్ప సమంచితవార్ధి – తా నిట్టవొడువ గద్గదకంఠ మమర
ముత్పులకలు మేన మొగినిండ హర్ష – తత్పరుఁడైయున్నఁ దనయు లే నెత్తి
చక్కన తనదు ప్రసాదంబువెట్టి – యక్కున నందంద యప్పళింపుచును
గొడుకు లోపలఁజేర్చికొని గురుమూర్తి – గుడిసొచ్చె నిరువురఁబొడగానరాదు
పసగొని సకలభక్త సమూహిసూడ – బసవయ్య గురువుగర్భంబుసొచ్చుటకు
సంగయదేవుండు సద్గురుభాతి – భంగిగా నేతెంచి బసవయ్యనిట్టు
తనయందు సంధించికొనుటకు నంత – ఘనతరలీల జంగమకోటి యలర
నరుదగులింగ తూర్యంబులు మ్రోయ – ధరఁ బుష్పవృష్టిదాఁబరిగొని కురియఁ
గోయని భక్తనికాయమెల్లెడల – గేయని బలుమాఱుఁ గీర్తనసేయ
జయజయారవములు సందడింపంగఁ – గ్రియఁగొని వినుకులుఁగేళికల్దనర
**మాదిరాజయ్యయు మాచిదేవుండు** – నాదిగాఁ గలభక్తులనురాగలీల
గలవె యుత్పత్తిస్థితిలయప్రపంచ – ములు బసవయ్యకుఁ దలఁచిచూడంగ
గాలిలోపల సురగాలినాఁబుట్టి – గాలిలోనన వెండిఁగలసియట్లు
శరనిధిఁగడలునా జనియించి వెండి – శరనిధిలోనన సమసిన యట్లు
నుడువీథియందు విద్యుల్లతవుట్టి – యుడువీథియందుఁ దా నడఁగినయట్లు
జలములయందు వర్షాఫలంబమరి – జలములలోనన సమసినయట్లు
సద్గురుకారుణ్య సంగతిఁబుట్టి – సద్గురుకారుణ్య సంపదఁదనరి
సద్గురుగర్భవిశ్రాంతిమై నిపుడు – తద్గతుఁడై లింగ తత్త్వంబుఁ బొందె
నట్టిదకాదె గుర్వంఘ్రియుగంబు – ముట్టఁగఁ గొల్చినయట్టి భక్తాలి
హృదయాంబుజంబుల నీ బసవయ్య – కదలక పువ్వును గంపునుబోలె
నలి నున్నవాఁడుగా కిలవేఱుగలదె – మలహరుభక్తులఁగలకాల మెల్ల

1. నాకు నీ వరమడ్గఁదడవ 2. రతిమతుల్ నీయందశ్రమమునఁబొంద 3. చెన్నొందగదిసీసము.

భక్తహితార్థమై ప్రభవించెఁగాక – వ్యక్తిగా నతఁడీశ్వరాంశంబ కాఁడె
యని నుతింపుచుఁదొంటియట్ల సద్భక్తి – జనితసుఖామృత వనధిమధ్యమున
నోలలాడుచు నుండి రురుతరానంద – లీలమై నటు గొంతగాలమింపారఁ
బ్రస్తుతింపంగ సద్భక్తి విస్ఫురణఁ – బ్రస్తుతికెక్కిన బసవని చరితఁ
జెప్పితి భక్తులచే విన్నమాడ్కిఁ – దప్పకుండఁగను యథాశక్తిఁజేసి
యిమ్మహి నీశున కెఱుఁగంగరాని – యమ్మహాబసవని యద్భుత చరిత
వర్ణింప నెంతటివాఁడ నట్లయ్యు – వర్ణనచేసితి వారిన కాని
యేయెడ నన్యథా యెఱుఁగ నే ననెడి – యీ యొక్క బలిమి మహిష్ఠతకలిమి
నదియునుగాక మహాభక్తవరుల – సదమల దివ్యప్రశంసగాఁజేసి
భావించినాదు వాక్పానసార్థంబు – గావింప మేటి యీ కథ రచించితిని
బసవపురాణంబుఁబాటించి వినిన – నసలారుఁబో ప్రసాదానందసిద్ధి
బసవపురాణంబుఁబాటించి వినిన – వసియించు సద్భక్తి వాసనమహిమ
బసవపురాణంబుఁబాటించి వినిన – బసిగమైఁబ్రాపించు భక్తులకరుణ
బసవపురాణంబుఁబాటించి వినిన – బసరించు లింగానుభవనిత్యసుఖము
బసవపురాణంబుఁబాటించి వినిన – నెసకంబుతోఁగల్గు నీప్సితార్థములు
బసవపురాణంబు భక్తి వ్రాయించి – వసదిగాఁజదివెడు వారలకెల్ల
దురితము లాపదల్ ద్రోహంబులెల్ల – హరియించు నెంతయు హరుకృపఁజేసి
యీ పురాణం బెవ్వరేఁదమ యింట – నేపార నిడికొన్న నిహపరసిద్ధి
శరణోపకార బసవపురాణార్థ – విరచితత్రిభువన విఖ్యాత చరిత!
శరణోపకార బసవపురాణార్థ – వరభుక్తిముక్తి సంవర్ధనభరిత !
శరణోపకార బసవపురాణార్థ – సరససమంచిత సత్యవాగ్జాల!
**గొబ్బూరి మాదన్న** కూరిమిశిష్య! – **గొబ్బూరిసంగ** సద్గుణ సముత్తుంగ!
ఇది యసంఖ్యాత మాహేశ్వర దివ్య – పదపద్మసౌరభభ్రమరాయమాణ
జంగమలింగప్రసాదోప భోగ – సంగత సుఖ సుధాశరధి నిమగ్న
సుకృతాత్మ పాలుకురికి సోమనాథ – సుకవిప్రణీతమై శోభిల్లి తనరి
చరలింగఘనకరస్థల విశ్వనాథ – వరకృపాంచిత కవిత్వసూర్తిఁబేర్చి
చను బసవపురాణ మనుకథయందు – సనుపమంబుగ సప్తమాశ్వాసమయ్యె.

# అనుబంధము – I

## ముఖ్య సంజ్ఞాపదముల అకారాది సూచిక

## (బసవపురాణ పీఠికలోనివి)

మ

## ముఖ్య సంజ్ఞాపదముల అకారాది సూచిక (బసవపురాణము)

# అనుబంధము - II

*శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి సంపూర్ణగ్రంథావళి*
*125వ జయంతి ప్రచురణలు*

# బసవోదాహరణము

*కర్త*


**పాల్కురికి సోమనాథుడు**

*పరిష్కర్త*

**శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి**





*ప్రచురణ*

**శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి వ్యాయపీఠం**
**తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి**
**2013**

## తొలిపలుకు

పాల్కురికి సోమనాథకవీశ్వర ప్రణీతములయిన తెల్గుగ్రంథములలో నేcటి చరిత్రపరిశోధకులింతదాcక దీనిcదాcకలేదు. బసవపురాణ పీఠికలో నేను దీని యాద్యంతములc జూపితిని. సంబోధనముతో నెన్మిది యగు విభక్తులతో నెన్మిది పద్యములును, కళికలును, నుత్కళికలును నెల్ల విభక్తులతోc గడపటిపద్యమును గల స్తుతిప్రశంసాపరమయిన గ్రంథమున కుదాహరణ మని పేరు. సంస్కృతాంధ్రకావ్యలక్షణకారులు దీని లక్షణమును నిర్వచించిరి. తెలుcగునc గల యుదాహరణములలోనికెల్ల నిదియే ప్రాచీనమయినది. రావిపాటి త్రిపురాంతకుని త్రిపురాంతకోదాహరణము దీనికంటెc దర్వాతి దయినను, దీనికంటె హృద్యతరము. ఇందుcగడపటి పద్యమున సప్తమీ విభక్త్యంతపదము, బసవవాచకముగా లేదు. 'నీయందు' అని యా పద్యమునcజేర్పcగుదురదు. పద్యపాఠము సరిగాదేమో! చతుర్థీవిభక్తి రూపములిందుc బర్యాలోచింపcదగినవి. ప్రాcతకాలపుcదెల్గుకృతి గాన యభిమానమున దీనిని బ్రకటించితిని. సంస్కృతకర్ణాట భాషలలో నీ కవి రచియించిన లఘుకృతులను శ్రీ బండారు తమ్మయ్యగారు ప్రకటింపcదలంపుగొన్నట్లు నాకుc దెలిపిరి. అట్లు వారు ప్రకటించినచో సోమనాథుని కృతులెల్ల వెల్లడి యయినట్లగును.

## బసవోదాహరణము

**ప్రథమావిభక్తి :**

శ్రీగురులింగతత్పరుc డ
శేషజగన్నిధి శుద్ధతత్త్వసం
యోగ సుఖప్రపూర్తి వృష
భోత్తమమూర్తి యుదాత్తకీర్తి ది
వ్యాగమమార్గవర్తి బస
వయ్య కృపాంబుధి మాకు దివ్యసం
భోగములం బ్రసాదసుఖ
భోగములంగరుణించుcగావుతన్

**కళిక –**

వెండియుc ద్రిభువనవినుతిసమేతుcడు
మండిత సద్గుణ మహిమోపేతుcడు
సురుచిర శివసమసుఖసంధానుcడు
పరమపరాపరభరితజ్ఞానుcడు
విదితానందాన్వితమనస్కుcడు
సదమలవిపులవిశాలయశస్కుcడు
శ్రీవిలసితపదచిరతరభద్రుcడు
గావున సాక్షాత్కలియుగరుద్రుcడు

**ఉత్కళిక –**

భువనోపకారా భవమోదవీరా
భక్తిసంయోగా ముక్తిసంభోగా
సౌఖ్యాబ్ధిలోన ముఖ్యుcడై తాన
వెలయు శుభకరుcడు ఇలవిశ్వగురుcడు

**ద్వితీయా విభక్తి :**

చ. వసిగొని యెవ్వఁడేని బస
వా యను నీ సుకృతాక్షరత్రయం
బెసఁగఁగఁబఠించెనేని గిరి
జేశుని కాతనివక్త్ర గహ్వరం
బసదృశగేహమన్న యవి
యార్యులవాక్యములట్లు గావునన్
బసవనఁబుణ్యమూర్తిఁదలఁ
పంగదె చిత్తమ పాయకెప్పుడున్

**కళిక –**

వెండియును భక్తాభివృద్ధిఁబెంచినవాని
బంధమాయాచారపథముఁద్రుంచినవాని
సద్వైతవాక్యసంహారుఁడై చనువాని
విద్వత్తముంగెల్చి వీరుఁడైమనువాని
మీమాంసకులముక్కు మిగులఁ గోసినవాని
తామసధ్వాంతంబుతగులుఁ బాసినవాని
పెక్కుదైవంబులన్ పేరుమాపినవాని
నొక్కఁడే రుద్రుఁడని యుక్తిఁ జూపినవాని

**ఉత్కళిక –**

ప్రకృతివాదము దుడిచి వికృతివేషములుడిగి
సకలవాదులనోర్చి సుకృతమార్గము దీర్చి
భూమిభారముఁబాపఁగా మించుగతిఁజూప
నెమ్మిఁజాలినవాని మమ్ము నేలినవాని.

**తృతీయావిభక్తి :**

ఉ. జంగమపాత్రుచే సమయ
సమ్మతుచే భవరోగవైద్యుచే
మంగళమూర్తిచే బసవ
మర్దనుచే నసమానశౌర్యుచే
లింగకుమారుచే బసవ
లింగముచే బసవయ్యచేఁగృపా
సంగతుచేఁబ్రసాదసుఖ
సౌఖ్యమునొందెద భక్తిఁజెందెదన్

**కళిక –**

వెండియును వేదోక్తవిలసచ్చరిత్రుచే
దండిభవబంధనలతాచయ లవిత్రుచే
విధినిషేధాతీతవినుతైకగణ్యుచే
బుధజనప్రోద్గీత భువనాగ్రగణ్యుచే
ప్రవిమలశివాచారభవ్యప్రసారిచే
భవిజనపరిత్యాగి భక్తిబండారిచే
శివచిన్మయాపరిచ్ఛిన్న ప్రమోదిచే
పరమార్థతత్త్వానుభవసుఖాస్వాదిచే

**ఉత్కళిక –**

సన్నుతులగరిగట్టి మన్ననలతుదముట్టి
ప్రమథకవిలియకెక్కి విమలసంపదనిక్కి
శివలీలపెంపార భువి బసవఁడనుపేర
మెఱయు సువిధజ్ఞుచే నెఱయుతత్త్వజ్ఞుచే

**చతుర్థీవిభక్తి :**

చ. అతని ప్రసాదసౌఖ్యమున
కంగము కీర్తికిఁగర్ణముల్ గుణ
స్తుతులకు జిహ్వయుం జరణ
తోయజ సంగతికిన్ మనంబు స

మ్మతగుణ దివ్యమూర్తికి న
మస్కృతియున్ విధియించికూడ న
ట్లతులితపుణ్యుఁడైన బస
వయ్యకునై ప్రణమిల్లు చిత్తమా!

**కళిక –**

వెండియును నిర్మలపవిత్రగోత్రునకునై
పండిత స్తవనీయపాత్రగాత్రునకునై
దురితభంజనకళాధుర్య చరితునకునై
సరవి నిష్టవ్రతాశ్చర్యభరితునకునై
సవిశేషవిమలగుణజాలలోలునకునై
శివయోగసంధానశీలపాలునకునై
[1]...................................
...................................

**ఉత్కళిక –**

లింగచిహ్నాలు మోచి దొంగలుండఁగఁజూచి
కొంగులనుబొదిగొన్న వంగకాయలుమున్న
లింగములుగాఁదెల్పి జంగమేచ్చలు సల్పి
భవరోగహరునకై శివరూపధరునకై

**పంచమీ విభక్తి :**

చ. పొసపరి పోరుదూషకుల
పొంగణఁగించి వధించి మించి య
వ్విసము ప్రసాదియై యనుభ
వించి జగంబులనెల్ల మంచి పెం
పెసఁగఁగ దేజరిల్లెడు మ
హిష్ఠయశోనిధి గాన యెప్పుడున్



బసవనదండనాథువలనన్ భజి
యింతుఁ బ్రసాదసౌఖ్యముల్.

**కళిక –**

వెండియును జగదేకవీరసత్తమువలన
బండారుబసవ సత్పండితోత్తమువలన
వీరమాహేశ్వరాన్వీత వర్తనువలన
ఘోరసంసారసంక్షోభకర్తనువలన
సుకృతదుష్కృతశుభాశుభవిదూరగువలన
సకలనిష్కళతత్త్వసౌఖ్యపారగువలన
నాదవిద్యాసుధార్ణవ విహారుని వలన
ఆదిఋషభేంద్రాపరావతారునివలన

**ఉత్కళిక –**

సారజీవన్ముక్తి కారణంబగుభక్తి
చేకూరుసమ్మతమ్మేకలింగవ్రతము
త్రోవఁబొందని పసుపదైవజ్ఞులను మనుప
నోపుధీరునివలనఁ బాపహరునివలన

**షష్ఠీవిభక్తి :**

ఉ. దుస్తరకర్మభూసురులు
దూషకులై కులమెత్తి పల్కుచున్
నాస్తికలౌచుఁజూడ శివ
నాగయగారి గుఱించి వారి శ్రీ
హస్తతలంబునందు విమ
లామృతధారలు వెల్లిఁగుర్వ నా
ర్యస్తుతినించు నబ్బసవ
రాజున కే నతి భక్తిసేయుదున్

**కళిక –**

వెండియుండ కారసార విదితముదిత మేళనునకు
పండినిండిపొలుపు సలుపుభక్తియుక్తి పాలనునకు
భవ్యసేవ్యశరణ చరణపద్మసద్మఖేలనునకు
నవ్యదివ్య లలితగళితనాదభేదలోలనునకు
యమనియమ నిరంతరాంతరాంగ సాంగవర్తనునకు
నమితశమితవిషమవిషయహారిభూరికీర్తనునకు
నత్యనిత్యభోగయోగయంత్రతంత్రదూరగునకు
సత్యనిత్యశుద్ధబుద్ధసత్త్వతత్త్వపారగునకు.

**ఉత్కళిక –**

మహిఁబురాతనోక్త భక్తి
మహితతత్త్వయుక్తి శక్తి
యిమ్ముగొనఁగ లింగజంగ
మమ్ము ప్రాణలింగమునకు
సమ్మతముగ విభుని వెలసి
ప్రమథ లీల సొలసి యొలసి
యున్న గణవిరాజితునకుఁ
జెన్న బసవపూజితునకు

**సప్తమీ విభక్తి :**

చ. అసమగుణాఢ్యునందు శర
ణాగతవత్సలునందు జంగమ
వ్యసనమహిష్ఠునందు భవ
వారణకారణమందు భక్తమా
ననపరిపూర్ణునందు గణ
నాథునియందు దయాపయోధి మా



బసవనియందు మా బసవ
పాత్రునియందు వసింపు చిత్తమా!

**కళిక –**

వెండియు(ను) శివార్యు(శివవీర్యు)[1]నందుఁ జండమదనశౌర్యునందు
దురితభయవిదూరునందు సరసభక్తసారునందు
సుకరశరణసూత్రునందు సకలవిషయజైత్రునందు
భువనసత్ప్రబుద్ధునందు శివగణ ప్రసిద్ధునందు

**ఉత్కళిక –**

శరణజనుల వరువుఁబనుల
తగవు దనువు ధనముమనము
సమసి సంగతముగ లింగ
నిజమునందు విజయునందు.

**సంబోధన ప్రథమావిభక్తి :**

చ. ఎసఁగ లలాటవహ్నిఁ గుసు
మేషు దహించిన కాలరుద్ర! మున్
గసిమసిఁజేసి దక్షునిమ
ఖంబు హరించిన వీరభద్ర! యి
వ్వసుమతిఁబుట్టి భక్తజనవ
శ్యుఁడవైన కృపాసముద్ర! యో
బసవ! భవత్ప్రసాదసుఖ
భాజనుఁజేయవె నన్ను నర్మిలిన్

**కళిక –**

వెండియును సమస్తలోకవిదిత విమలభక్తి బీజ
దండితేంద్రియ ప్రచండతరళవిషమగుణసమాజ

1. 'శివవీర్యు' అని ఉదాహరణ వాఙ్మయచరిత్ర, పు–80

సంగమప్రసాదభోగసారసౌఖ్యశరధిమగ్న
లింగసంగతానుభావలీలశరధి నౌవిలగ్న
అతులసకలభువన పావనావతారపుణ్యమూర్తి
సతతవితతవిమలతత్త్వసారసౌఖ్యజనహతార్తి
భవభయప్రసారదూర భవ్యసులభ సుకృతి కాయ
దివ్యబృందవందితద్వితీయశంభునామధేయ

**ఉత్కళిక –**

పరమగురుమతానుకూల భరితసుగుణగతివిలోల
లింగపూజనావిధేయ జంగమార్చకానపాయ
శ్రీవృషేంద్రదివ్యమూర్తి శైవసమయచక్రవర్తి
భక్తిసత్క్రియాధురీణ భక్తిముక్తిదప్రవీణ

**సార్వవిభక్తికము :**

ఉ. నీవు దయాపయోనిధివి,
నిన్ను నుతించినఁ గల్గుభక్తి, నీ
చే వరవీరశైవరతి చేకుఱు,
నీ కయియిత్తుఁ గబ్బముల్
నీ వలనం గృతార్థత జ
నించును నీకు నమస్కరింతు నా
భావమునందు నుండి ననుఁ
బాయకుమీ బసవయ్య, వేఁడెదన్